మహర్షి వేదవ్యాస ప్రణీత

# శ్రీమద్భాగవతము

(సప్తమ, అష్టమ స్కంధములు)
ఐదవ సంపుటము

స్వామి తత్త్వవిదానంద సరస్వతి






తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

మహర్షి వేదవ్యాస ప్రణీత

# శ్రీమద్భాగవతము

(సప్తమ, అష్టమ స్కంధములు)

ఐదవ సంపుటము

**స్వామి తత్త్వవిదానంద సరస్వతి**

(బ్రహ్మవిద్యాకుటీర్, పాతఅల్వాల్, సికింద్రాబాదు)

గారిచే రచింపబడిన ''తత్త్వప్రకాశిక'' అనే

తెలుగు టీకతో కూడినది




ప్రచురణ

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

2007

**SRIMADBHAGAVATAMU**

with Telugu Commentary

**Skandha VII - VIII**

by
**SWAMI TATTVAVIDANANDA SARASWATI**

T.T.D. Religious Publications Series No :735



First Edition 2007

Copies : 2000

*Published by*
**SRI K.V. RAMANACHARY, I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati — 517 507.

*Printed at:*
Tirumala Tirupati Devasthanams Press
Tirupati - 517 507

# ముందు మాట

భారతీయ వాఙ్మయంలో పురాణాలు అత్యంత విశిష్టమైనవి. అవి లోకానికి మిత్రులవలె హితాన్ని ఉపదేశిస్తాయి. కాబట్టి, ''మిత్ర సమ్మితములు''గా ప్రఖ్యాతి వహించాయి. పురాణాలు ప్రాచీనమైనవైనా ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా ప్రకాశిస్తూ వుంటాయి. అవి మన పురాతన విజ్ఞాన సర్వస్వాలు (Encyclopaedias)అటువంటి పదునెనిమిది పురాణాల్లో అగ్రగణ్యమైనది శ్రీమద్భాగవతము.

'**భాగవత**'మంటే భగవంతుని గూర్చి వివరించే గ్రంథమని భావం. ఇలాగే '**భగవత్**' శబ్దంతో సంబంధించిన నామధేయం కలమరొక ప్రసిద్ధ గ్రంథం '**భగవద్గీత**'. భగవంతుడు చెప్పింది భగవద్గీత; ఆ భగవంతుని గూర్చి చెప్పేది బాగవతము. ఇది ఈ రెంటికి గల అవినాభావ సంబంధం.

వేర్వేరు పురాణాలను, ఇతిహాసాలను రచియించిన వేదవ్యాసుడు బదరికావనంలో సరస్వతీనదీ తీరాన గల తన ఆశ్రమంలో ఒకప్పుడు చింతిస్తూ కూర్చొని ఉండినాడు. ఆ సమయంలో అక్కడకు విచ్చేసిన నారదమహర్షి, విషయం తెలిసికొని, వ్యాసునితో ఇలా అన్నాడు 'మునీంద్రా! నీవు ఇంతవరకు ఎన్నో గ్రంధాలను రచించినప్పటికీ, భగవానుడైన శ్రీమహావిష్ణువు యొక్క గుణగణాలను, మహిమలను, అవతారలీలలను వెల్లడించే కథలతో గూడిన సమగ్ర గ్రంథాన్ని ప్రత్యేకంగా రచింపలేదు. కావున, అలాంటి ఉత్కృష్ట గ్రంధాన్ని రచిస్తే నీకు పరిపూర్ణమైన మనశ్శాంతి ఏర్పడుతుంది'-అని, ఆ విధంగా నారదుని ఆదేశాన్ని పాటించి, వేదవ్యాస మహాముని రచించిన ఉదాత్తగ్రంథమే శ్రీమద్భాగవత మహాపురాణం!

మంత్రాలన్నింటిలోనూ ఉత్తమమైన మంత్రం'**గాయత్రి**' అటువంటి గాయత్రీమంత్రాన్ని ఆధారంచేసికొని ఈ గ్రంథం విస్తరిల్లినట్లు ఇందలి అవతారికలో పేర్కొనబడి ఉంది. ఈ గ్రంథానికి '**భక్తిశాస్త్ర**' **మని**, '**సాత్వత సంహిత**' **అని**, '**మోక్షగ్రంథ**'**ముని**, 'హయగ్రీవ బ్రహ్మవిద్య' అని- అనేక నామాంతరాలు పూర్వంనుండీ వాడుకలో ఉన్నాయి. ఇవన్నీ ఈ భాగవత గ్రంథానికి గల ప్రశస్తిని చక్కగా చాటుతూ వున్నాయి.

వేదవ్యాసుడు తొలుదొల్త భాగవత పురాణాన్ని కుమారుడైన శుకునికీ, శిష్యుడైన రోమ హర్షణునికీ ఉపదేశించాడు. రోమహర్షణుని కుమారుడైన ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలో వెయ్యేండ్ల సత్రయాగాన్ని నిర్వహిస్తూవున్న

శౌనకాది మహామునుల వద్దకు వెళ్లి, భాగవత పురాణాన్ని ప్రవచనం చేశాడు. ఆ విధంగా ఉగ్రశ్రవసుడనే సూతుడు అలనాడు నైమిశారణ్యంలో ఆరంభించిన భాగవత కథా ప్రవచనం నేటికీ దేశంలో ఎక్కడో ఒకచోట అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే వస్తున్నది.

ఈ సుప్రసిద్ధ గ్రంథానికి "**తత్త్వప్రకాశిక**" - అనే తెలుగు టీక సమకూర్చబడి ఉండటం ప్రస్తుత ప్రచురణలోని ముఖ్య విశేషం! ప్రతిపదార్థ, తాత్పర్యాలతో కూడిన ఈ తెలుగు టీక సరళమైన భాషలో, సులభశైలిలో, సామాన్య పాఠకులను సైతం ఆకట్టుకొనే రీతిలో సముచితంగా కొనసాగింది. సార్థక నామమయిన ఈ టీకను రచించిన సహృదయులు, సుగృహీత నామధేయులు, బ్రహ్మవిద్యానిధులు, బహుగ్రంథకర్తలు పూజ్యశ్రీ **తత్త్వవిదానంద సరస్వతీ స్వామివారికి** కృతజ్ఞతాపూర్వక అభివందనాలు.

చివరగా నొక్కమాట: పద్మపురాణంలో శ్రీమద్భాగవతం సాక్షాత్తు భగవంతుని స్వరూపంగా నిరూపింపబడింది. తదనుగుణంగా భాగవతంలోని మొదటి, రెండు స్కంధాలు భగవంతుని పాదాలు; మూడు నాలుగు స్కంధాలు ఊరువులు; ఐదవ స్కంధం నాభి ప్రదేశం; ఆరవ స్కంధం హృదయం; ఏడు, ఎనిమిది స్కంధాలు బాహువులు; తొమ్మిదవ స్కంధం కంఠం; పదవ స్కంధం ముఖం; పదకొండవది లలాటం; పంద్రెండవ స్కంధం శిఖ.

పద్మపురాణంలోని పై వరసను బట్టి, షష్ఠస్కంధం హృదయం,సప్తమ, అష్టమ స్కంధాలు బాహువులు ఆవిష్కరింపబడినట్లుగా భావించాలి! అందులో ఇవి ఏడవ, ఎనిమిదవ స్కంధాలు. ఇలాగే, తరువాతి స్కంధాలను కూడ త్వరలో ప్రచురించే ప్రయత్నాలు చురుకుగా కొనసాగుతున్నాయి. అలమేల్మంగా శ్రీనివాసుల అనుగ్రహ విశేషంతో ఆయా సంపుటాలూ అచిరకాలంలోనే వెలుగుచూడగలవని ఆశిస్తున్నాము.

ఆస్తిక మహాశయులెల్లరకు ఈ ధార్మిక ప్రచురణ ఆనందదాయి కాగలదని ఆకాంక్షిస్తున్నాము.

*"భాగవత పురాణ ఫల రసాస్వాదన*
*పదవిఁ గనుఁడు! రసికభావవిదులు!"*

**కార్యనిర్వహణాధికారి,**
**తి.తి.దేవస్థానములు, తిరుపతి.**

మా అమ్మ
మమ్ములనాశీర్వదించుటకు అవతరించిన దేవత
ఆ దేవునిలో లీనమైన పుణ్యమూర్తి

శ్రీమతి రాణి సీతమ్మ

పవిత్ర స్మృతికి
భక్తిపూర్వకముగా అంకితము.

# విషయ సూచిక

## సప్తమ స్కంధము



## అష్టమ స్కంధము

* * * * *

శ్రీగణేశాయ నమః

ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రీ మహర్షి వేదవ్యాస ప్రణీతం

# శ్రీమద్భాగవత మహాపురాణమ్

## తత్త్వ ప్రకాశికా సంయుతమ్

## సప్తమః స్కంధః

## అథ ప్రథమోఽధ్యాయః

### ప్రహ్లాదుని చరితమునకు ఉపక్రమము

రాజోవాచ ।

సమః ప్రియస్సుహృద్బ్రహ్మన్ భూతానాం భగవాన్ స్వయమ్ ।

ఇంద్రస్యార్థే కథం దైత్యానవధీద్విషమో యథా ॥ 1

బ్రహ్మన్ - ఓ శుక మహర్షీ!, సమః - నావాడు పైవాడు అనే తేడా లేనివాడు, ప్రియః - ప్రేమస్వరూపుడు, భూతానామ్ - ప్రాణులకు, సుహృత్ - హితమును చేయువాడు అగు, భగవాన్ - భగవానుడు, స్వయమ్ - స్వయముగా, విషమః యథా - సముడు కానివాడు వలె, ఇంద్రస్య - ఇంద్రుని, అర్థే - ప్రయోజనము కొరకు, దైత్యాన్ - రాక్షసుల ను, కథమ్ - ఎట్లు, అవధీత్ - సంహరించెను?

పరీక్షిన్మహారాజు ఇట్లు ప్రశ్నించెను -- ఓ శుక మహర్షీ! సకలప్రాణులకు హితమును చేసే భగవానుడు ప్రేమస్వరూపుడు. ఆయనకు నావాడు పైవాడు అనే తేడా లేదు గదా! అట్టి భగవానుడు భేదబుద్ధి గల వాని వలె ఇంద్రుని ప్రయోజనము కొరకు రాక్షసులను సంహరించుట ఎట్లు పొసగును?

న హ్యస్యార్థస్సురగణైస్సాక్షాన్నిశ్శ్రేయసాత్మనః ।
నైవాసురేభ్యో విద్వేషో నోద్వేగశ్చాగుణస్య హి ॥ 2

హి - ఎందుకంటే, సాక్షాత్ - సాక్షాత్తుగా, నిశ్శ్రేయస-ఆత్మనః - పరమానందమే స్వరూపముగా గలిగినట్టియు, అగుణస్య - నిర్గుణుడగు, అస్య - ఈ భగవానునకు, సురగణైః - దేవతాగణములతో, అర్థః - ప్రయోజనము, న హి - నిశ్చయముగా లేదు, అసురేభ్యః - రాక్షసుల వలన, ఉద్వేగః - భయము, విద్వేషః - ద్వేషము, న ఏవ - లేనే లేదు.

ఎందుకంటే -- పరమానందస్వరూపుడు, నిర్గుణుడు అగు భగవానునకు దేవతాగణముల సహకారముతో పొందదగిన ప్రయోజనము గాని, రాక్షసుల వలని భయము గాని, వారి యెడల ద్వేషభావము గాని లేనే లేవు గదా!

ఇతి నస్సుమహాభాగ నారాయణగుణాన్ ప్రతి ।
సంశయస్సుమహాన్ జాతస్తద్భవాంశ్ఛేత్తుమర్హతి ॥ 3

సుమహాభాగ - సౌభాగ్యసంపన్నుడా!, నః - మాకు, ఇతి - ఈ విధముగా, నారాయణగుణాన్ ప్రతి - నారాయణుని గుణములనుద్దేశించి, సుమహాన్ - చాల పెద్ద, సంశయః - సందేహము, జాతః - కలిగినది, తత్ - దానిని, భవాన్ - నీవు, ఛేత్తుమ్ - ఛేదించుటకు, అర్హతి - తగుదువు.

భగవద్భక్తి అనే గొప్ప భాగ్యము గల ఓ మహర్షీ! మాకు నారాయణుని గుణములను గురించి ఈ విధముగా పెద్ద సందేహము కలిగినది. దానిని తొలగించుటకు నీవే అర్హుడవు.

శ్రీశుక ఉవాచ ।

సాధు పృష్టం మహారాజ హరేశ్చరితమద్భుతమ్।
యద్భాగవతమాహాత్మ్యం భగవద్భక్తివర్ధనమ్ ।। 4

మహారాజ - ఓ మహారాజా!, హరేః - శ్రీహరియొక్క, అద్భుతమ్ - ఆశ్చర్యమును గొల్పే, చరితమ్ - వృత్తాంతమును గురించి, సాధు - చక్కగా, పృష్టమ్ - ప్రశ్నించబడినది, యత్ - ఏలయనగా (దేనియందైతే), భాగవతమాహాత్మ్యమ్ - భగవద్భక్తుల మహిమ, భగవద్-భక్తివర్ధనమ్ - భగవానునియందలి భక్తిని వర్ధిల్ల జేయునది.

ఓ పరీక్షిన్మహారాజా! నీవు శ్రీహరియొక్క ఆశ్చర్యమును గొల్పే గాథను గురించి చక్కగా ప్రశ్నించితివి. శ్రీహరి గాథలో భగవద్భక్తిని వర్ధిల్ల జేసే భగవద్భక్తుల మహిమ వర్ణించబడును.

గీయతే పరమం పుణ్యమృషిభిర్నారదాదిభిః ।
నత్వా కృష్ణాయ మునయే కథయిష్యే హరేః కథామ్ ।। 5

పరమం పుణ్యమ్ - పరమపవిత్రమగు భగవానుని గాథ, నారద-ఆదిభిః - నారదుడు మొదలుగా గల, ఋషిభిః - మహర్షులచే, గీయతే - గానము చేయబడును, కృష్ణాయ మునయే - వేదవ్యాస మహర్షి కొరకు, నత్వా - నమస్కరించి, హరేః - శ్రీహరియొక్క, కథామ్ - గాథను, కథయిష్యే - చెప్పగలను.

పరమపవిత్రమగు శ్రీహరి గాథను నారదుడు మొదలగు మహర్షులు గానము చేయుచుందురు. నేను వేదవ్యాస మహర్షికి నమస్కరించి అట్టి గాథను చెప్పెదను.

నిర్గుణోఽపి హ్యజోఽవ్యక్తో భగవాన్ ప్రకృతేః పరః ।
స్వమాయాగుణమావిశ్య బాధ్యబాధకతాం గతః ।। 6

అజః - పుట్టుక లేనివాడు, అవ్యక్తః - దేహేంద్రియాదులు లేనివాడు, ప్రకృతేః - మాయాశక్తికంటె, పరః - అతీతుడు అగు, భగవాన్ - భగవానుడు, నిర్గుణః అపి - నిర్గుణుడే అయిననూ, స్వమాయాగుణమ్ - తన

మాయాశక్తియొక్క గుణములను, ఆశ్రిత్య - ఆశ్రయించి, బాధ్యబాధక తామ్ - బాధించబడుట బాధించుట అనే భావము (స్థితి) ను, గతః - పొందినవాడు.

మాయాశక్తికి అతీతుడైన భగవానుడు నిర్గుణుడు. పుట్టుక లేని ఆయనకు దేహేంద్రియాదులు లేవు. అయిననూ, ఆయన తన మాయాశక్తి యొక్క గుణములకు అధిష్ఠానమై యుండుటచే, దేవతలు రాక్షసులు పర స్పరము బాధించుకుంటూ ఉంటే అదంతా ఆయనకు సంక్రమించినది.

సత్త్వం రజస్తమ ఇతి ప్రకృతేర్నాత్మనో గుణాః ।
న తేషాం యుగపద్రాజన్ హ్రాస ఉల్లాస ఏవ వా ॥ 7

సత్త్వమ్ - సత్త్వము, రజః - రజస్సు, తమః - తమస్సు, ఇతి - అనెడి, ప్రకృతేః - మాయాశక్తియొక్క, గుణాః - గుణములు, ఆత్మనః - ఆత్మవి, న - కాదు, రాజన్ - ఓ మహారాజా!, తేషామ్ - వాటికి, యుగపత్ - ఒకే సారి, హ్రాసః - క్షయము గాని, ఉల్లాసః ఏవ వా - వృద్ధి గాని, న - కలుగదు.

ఓ మహారాజా! సత్త్వము, రజస్సు, తమస్సు అనేవి మాయాశక్తి గుణములే గాని, ఆత్మవి కావు. అవి అన్నీ ఏకకాలములో క్షయమును గాని, వృద్ధిని గాని పొందవు.

జయకాలే తు సత్త్వస్య దేవర్షీన్ రజసోఽసురాన్ ।
తమసో యక్షరక్షాంసి తత్కాలానుగుణోఽభజత్ ॥ 8

సత్త్వస్య - సత్త్వగుణముయొక్క, జయకాలే తు - వర్ధిల్లే కాలము నందైతే, దేవర్షీన్ - దేవతలను మహర్షులను, రజసః - రజోగుణము యొక్క (వృద్ధికాలమునందు), అసురాన్ - అసురులను, తమసః - తమో గుణముయొక్క, యక్షరక్షాంసి - యక్షులను రాక్షసులను, తత్-కాల-అను గుణః - ఆ కాలమునకు తగినవాడై, అభజత్ - సేవించెను.

భగవానుడు ఆయా కాలములకు తగ్గట్లుగా, సత్త్వగుణము వర్ధిల్లే కాలమునందు దేవతలను మహర్షులను, రజోగుణము వర్ధిల్లే కాలము

నందు భోగపరాయణులగు అసురులను, తమోగుణము వర్ధిల్లే కాలము నందు యక్షులను రాక్షసులను అనుగ్రహించును.

జ్యోతిరాదిరివాభాతి సంఘాతాన్న వివిచ్యతే ।
విదంత్యాత్మానమాత్మస్థం మథిత్వా కవయోఽంతతః ॥ 9

జ్యోతిః-ఆదిః ఇవ - అగ్ని మొదలగునది వలె, ఆభాతి - అనేకరూపములుగా ప్రకాశించుచున్నాడు, సంఘాతాత్ - దేహేంద్రియమనస్సముదాయమునుండి, న వివిచ్యతే - వివేకముతో తెలియబడుట లేదు, కవయః - జ్ఞానులు, మథిత్వా - మథించి, అంతతః - నిషేధముగా, ఆత్మస్థమ్ - బుద్ధియందున్న భగవానుని, ఆత్మానమ్ - ఆత్మరూపునిగా, విదంతి - పొందుచున్నారు.

నిప్పు, నీరు మొదలైన పంచభూతములు వలె భగవానుడు అనేక రూపములలో ప్రకాశించుచున్నాడు. కాని, దేహేంద్రియమనస్సంఘాతములయందు ఆత్మరూపముగానుండే ఆయనను మానవులు దేహాదుల కంటె విలక్షణముగా తెలియకున్నారు. కట్టెలోని నిప్పు మథించినచో ప్రకటమగును. అదే విధముగా, జ్ఞానులు ఆత్మవిచారమును చేసి అనాత్మను నిషేధిస్తూ, భగవానుని బుద్ధియందలి ఆత్మచైతన్యరూపముగా తెలుసుకొని, ఆయనలో ఐక్యమగుచున్నారు.

యదా సిసృక్షుః పుర ఆత్మనః పరో
రజస్సృజత్యేష పృథక్ స్వమాయయా ।
సత్త్వం విచిత్రాసు రిరంసురీశ్వరః
శయిష్యమాణస్తమ ఈరయత్యసౌ ॥ 10

యదా - ఏ కాలమునందైతే, ఏషః - ఈ, పరః - పరమేశ్వరుడు, ఆత్మనః - తనకు, పురః - నగరములను, సిసృక్షుః - సృష్టించ గోరువాడో అప్పుడు, స్వమాయయా - తన మాయాశక్తిచే, రజః - రజోగుణమును, విచిత్రాసు - రకరకములైన ఆ పురములయందు, రిరంసుః - రమించ గోరువాడై, సత్త్వమ్ - సత్త్వగుణమును, పృథక్ - వేరుగా , సృజతి - సృష్టించుచున్నాడు, అసౌ - ఈ, ఈశ్వరః - పరమేశ్వరుడు, శయిష్య

మానః - నిద్రించబోవువాడై, తమః - తమోగుణమును, ఈరయతి - ప్రేరే పించుచున్నాడు.

ఈ పరమేశ్వరుడు తనకు రకరకముల పురములవంటి దేహము లను సృష్టించగోరి, సత్త్వరజస్తమోగుణముల సామ్యమైన తన మాయాశక్తి చే రజోగుణమును వేరుగా సృష్టించును. ఆయనయే ఆ పురములయందు రమించగోరువాడై సత్త్వగుణమునకు ఆధిక్యమును కల్పించును. ఆయ నయే నిద్రించబోవువాడై తమోగుణమును ప్రేరేపించును.

కాలం చరంతం సృజతీశ ఆశ్రయం
ప్రధానపుంభ్యాం నరదేవ సత్యకృత్ ।
య ఏష రాజన్నపి కాల ఈశితా
సత్త్వం సురానీకమివైధయత్యతః ।
తత్ప్రత్యనీకానసురాన్ సురప్రియో
రజస్తమస్కాన్ ప్రమిణోత్యురుశ్రవాః ॥ 11

నరదేవ - ఓ మహారాజా!, ప్రధానపుంభ్యామ్ - ప్రకృతి పురు షులు నిమిత్తములుగా, సత్యకృత్ - నామరూపకర్మాత్మకమగు జగత్తును సృష్టించే, ఈశః - పరమేశ్వరుడు, ఆశ్రయమ్ - వాటికి ఆశ్రయమైనట్టియు, చరంతమ్ - ప్రవహిస్తూ ఉండే, కాలమ్ - కాలమును, సృజతి - సృష్టించు ను, రాజన్ - ఓ మహారాజా!, యః - ఏ, ఏషః - ఈ, కాలః - కాలము. సత్త్వమ్ - సత్త్వగుణమును, ఏధయతి - వర్ధిల్లజేయునో, అతః - ఇందు- లన, ఈశః అపి - కాల నియామకుడగు ఈశ్వరుడు కూడ, సుర-అనీక- - దేవతల సమూహమును, ఏధయతి ఇవ - వర్ధిల్ల జేయుచున్నా- యన్నట్లు ఉండును, సురప్రియః - దేవతలు ప్రియులైనవాడు, ఉరుశ్రవాః - గొప్ప కీర్తి గల ఆ శ్రీహరి, తత్-ప్రత్యనీకాన్ - వారికి శత్రువులైనట్టియు, రజః-తమస్కాన్ - రజస్తమోగుణములు ప్రధానముగా గల, అసురాన్ - అసురులను, ప్రమిణోతి - సంహరించును.

ఓ మహారాజా! ప్రకృతి-పురుషులు (తన స్వభావమైన మాయాశ క్తి, తన స్వరూపమైన చైతన్యము) నిమిత్తము కాగా నామరూపకర్మాత్మక

మగు జగత్తును సృష్టించే పరమేశ్వరుడు వాటికి ఆశ్రయమై నిరంతరము ప్రవహించే కాలమును సృష్టించును. ఆ కాలము జగత్తునందు సత్త్వగుణ మును వర్ధిల్ల జేయగా, కాలనియామకుడగు ఈశ్వరుడు కూడ సత్త్వగుణ ణమును వర్ధిల్ల జేయుచున్నాడా యన్నట్లు ఉండును. ఓ రాజా! దేవతల యందు ప్రీతి గల శ్రీహరి కీర్తి చాల గొప్పది. ఆయన ఆ స్థితికాలములో రజస్తమోగుణములు ప్రధానముగా గలవారై దేవతలపై శత్రుత్వమును నెరపే అసురులను సంహరించును. (ఈశ్వరుడు వాస్తవములో సముడే).

అత్రైవోదాహృతః పూర్వమితిహాసస్సురర్షిణా ।
ప్రీత్యా మహాక్రతౌ రాజన్ పృచ్ఛతేఽజాతశత్రవే ॥ 12

రాజన్ - ఓ మహారాజా!, అత్ర ఏవ - ఈ విషయమునందే, సుర-ఋషిణా - దేవర్షియగు నారదునిచే, పూర్వమ్ - పూర్వము, మహాక్రతౌ - గొప్ప యజ్ఞమునందు, పృచ్ఛతే - ప్రశ్నించిన, అజాతశత్రవే - ధర్మరాజు కొరకు, ప్రీత్యా - ప్రేమతో, ఇతిహాసః - గాథ, ఉదాహృతః - వివరించబడి నది.

ఓ రాజా! ఈ అంశములో ఒక గాథ గలదు. పూర్వము అజాతశ త్రువు (శత్రువులు లేనివాడు) అగు ధర్మరాజు రాజసూయమనే గొప్ప యజ్ఞములో ప్రశ్నించగా, దీనిని దేవర్షియగు నారదుడు ప్రేమతో చెప్పెను.

దృష్ట్వా మహాద్భుతం రాజా రాజసూయే మహాక్రతౌ ।
వాసుదేవే భగవతి సాయుజ్యం చేదిభూభుజః ॥ 13

తత్రాసీనం సురఋషిం రాజా పాండుసుతః క్రతౌ ।
పప్రచ్ఛ విస్మితమనా మునీనాం శృణ్వతామిదమ్ ॥ 14

పాండుసుతః - పాండుపుత్రుడగు, రాజా - ధర్మరాజు, మహాక్రతౌ గొప్ప యజ్ఞమైన, రాజసూయే - రాజసూయమునందు, చేదిభూభుజః - చేదిదేశపు రాజగు శిశుపాలునియొక్క, వాసుదేవే భగవతి - వాసుదేవ భగవానునియందు, మహా-అద్భుతమ్ - గొప్ప ఆశ్చర్యకరమైన, సాయు జ్యమ్ - ఐక్యమగుటను, దృష్ట్వా - చూచి, విస్మితమనాః - ఆశ్చర్యపడిన

మనస్సు గల, రాజా - ధర్మరాజు, తత్ర - ఆ, క్రతౌ - యజ్ఞమునందు, ఆసీనమ్ - కూర్చుండియున్న, సురఋషిమ్ - దేవర్షియగు నారదుని, మునీనామ్ - మహర్షులు, శృణ్వతామ్ - వినుచుండగా, ఇదమ్ - ఈ మాటను, పప్రచ్ఛ - ప్రశ్నించెను.

రాజసూయ మహాయజ్ఞమునందు చేదిదేశపు రాజగు శిశుపాలుడు వాసుదేవ భగవానునియందు ఐక్యమయ్యెను. ఆ గొప్ప అద్భుతమును చూచి, పాండుపుత్రుడగు ధర్మరాజుయొక్క మనస్సు ఆశ్చర్యముతో నిండిపోయెను. ఆ సమయములో యజ్ఞశాలలో దేవర్షియగు నారదుడు కూర్చుండియుండెను. ఇతరమహర్షులు వినుచుండగా ఆ మహారాజు ఆయనను ఇట్లు ప్రశ్నించెను.

యుధిష్ఠిర ఉవాచ ।
అహో అత్యద్భుతం హ్యేతద్దుర్లభైకాంతినామపి ।
వాసుదేవే పరే తత్త్వే ప్రాప్తిశ్చైద్యస్య విద్విషః ।। 15

అహో - ఆహా!, ఏతత్ - ఇది, అతి-అద్భుతం హి - గొప్ప ఆశ్చర్యము సుమా!, విద్విషః - అధికముగా ద్వేషించిన, చైద్యస్య - చేదిదేశపు రాజగు శిశుపాలునకు, పరే తత్త్వే - పరబ్రహ్మయగు, వాసుదేవే - వాసుదేవునియందు, ప్రాప్తిః - ఐక్యమగుట, ఏకాంతినాం అపి - ఏకాంతభక్తులకు కూడ, దుర్లభా - పొంద శక్యము కానిది.

ధర్మరాజు ఇట్లు పలికెను --- ఆహా! ఇది అత్యద్భుతము సుమా! చేదిదేశపు రాజగు శిశుపాలుడు అధికముగా ద్వేషించి కూడ వాసుదేవ పరబ్రహ్మయందు ఐక్యమైనాడు. ఇది ఏకాంతభక్తులకు కూడ పొంద శక్యము కానిది.

ఏతద్వేదితుమిచ్ఛామస్సర్వ ఏవ వయం మునే ।
భగవన్నిందయా వేనో ద్విజైస్తమసి పాతితః ।। 16

మునే - ఓ మహర్షీ!, వయమ్ - మేము, సర్వే ఏవ - అందరము కూడ, ఏతత్ - దీనిని, వేదితుమ్ - తెలియుటకు, ఇచ్ఛామః - కోరుచున్నా

ము, వేనః - వేనుడు, భగవత్-నిందయా - భగవానుని నిందించుటచే, ద్విజైః - వేదవేత్తలచే, తమసి - నరకమునందు, పాతితః - పారవేయబడినవాడు.

ఓ మహర్షీ! మేమందరము ఈ విషయమును తెలియగోరుచున్నాము. భగవంతుని నిందించిన వేనుని వేదవేత్తలు నరకములో పారద్రోసిరి.

దమఘోషసుతః పాప ఆరభ్య కలభాషణాత్ ।
సంప్రత్యమర్షీ గోవిందే దంతవక్త్రశ్చ దుర్మతిః ।। 17

పాపః - పాపి, దమఘోషసుతః - దమఘోషుని పుత్రుడు అగు శిశుపాలుడు, కలభాషణాత్ - ముద్దు పలుకులనాటినుండి, ఆరభ్య - మొదలుపెట్టి, సంప్రతి - ఈనాడు, గోవిందే - శ్రీకృష్ణునియందు, అమర్షీ - కోపము గలవాడు, దుర్మతిః - దుర్బుద్ధియగు, దంతవక్త్రః చ - దంతవక్త్రుడు కూడా.

దమఘోషుని పుత్రుడు, పాపి అగు శిశుపాలుడు ముద్దు పలుకుల నాటినుండి ఈ నాటి వరకు గోవిందునిపై కోపమును కలిగియే యున్నాడు. దుర్బుద్ధియగు దంతవక్త్రుడు కూడ అంతే.

శపతోరసకృద్విష్ణుం యద్బ్రహ్మ పరమవ్యయమ్ ।
శ్విత్రో న జాతో జిహ్వాయాం నాంధం వివిశతుస్తమః ।। 18

యత్ - ఏ, అవ్యయమ్ - అవినాశియగు, పరం బ్రహ్మ - పరబ్రహ్మ గలదో ఆ, విష్ణుమ్ - విష్ణువును, అసకృత్ - మాటిమాటికీ, శపతోః - తిట్టుచున్న వారిద్దరికి, జిహ్వాయామ్ - నాలుకపై, శ్విత్రః - తెల్ల మచ్చ, న జాతః - కలుగ లేదు, అంధమ్ - అంధకారమయమైన, తమః - నరకమును, న వివిశతుః - ప్రవేశించలేదు.

అవినాశియగు పరబ్రహ్మయే శ్రీమహావిష్ణువు. ఆయనయే శ్రీకృష్ణుడు. ఆయనను మాటిమాటికీ తిట్టుచున్న వీరిద్దరు అంధకారమయమగు నరకములో పడుట మాట అటుంచి, వారికి నాలుకపై తెల్లని మచ్చ కూడ పడలేదు.

కథం తస్మిన్ భగవతి దురవగ్రాహధామని ।
పశ్యతాం సర్వలోకానాం లయమీయతురంజసా ॥ 19

దురవగ్రాహధామని - పొంద శక్యము కాని స్వరూపము గల, తస్మిన్ - ఆ, భగవతి - భగవానునియందు, సర్వలోకానామ్ - సకలప్రజలు, పశ్యతామ్ - చూచుచుండగా, అంజసా - సాక్షాత్తుగా, లయమ్ - ఐక్యమును, కథమ్ - ఎట్లు, ఈయతుః - పొందిరి?

భగవానుని స్వరూపమును పొందుట చాల కష్టము. జనులందరు చూచుచుండగా వీరిద్దరు సాక్షాత్తుగా ఆ భగవానునియందు ఐక్యమగుట ఎట్లు సంభవమయ్యెను?

ఏతద్భ్రామ్యతి మే బుద్ధిర్దీపార్చిరివ వాయునా ।
బ్రూహ్యేతదద్భుతతమం భగవాంస్తత్ర కారణమ్ ॥ 20

ఏతత్ - దీనిని గురించి, మే - నాయొక్క, బుద్ధిః - బుద్ధి, వాయునా - గాలిచే, దీప-అర్చిః ఇవ - దీప జ్వాల వలె, భ్రామ్యతి - భ్రమను పొందుచున్నది, ఏతత్ - ఇది, అద్భుతతమమ్ - మిక్కిలి అద్భుతము, భగవాన్ - పూజనీయుడవగు నీవు, తత్ర - దానియందలి, కారణమ్ - కారణమును, బ్రూహి - చెప్పుము.

ఇది మిక్కిలి అద్భుతము. దీని విషయములో నా బుద్ధి, గాలిలోని దీపజ్వాల కదలాడినట్లు, భ్రమను పొందుచున్నది. పూజనీయుడవగు నీవు అట్లు జరుగుటకు గల కారణమును చెప్పుము.

శ్రీశుక ఉవాచ ।
రాజ్ఞస్తద్వచ ఆకర్ణ్య నారదో భగవానృషిః ।
తుష్టః ప్రాహ తమాభాష్య శృణ్వత్యాస్తత్సదః కథాః ॥ 21

భగవాన్ - పూజనీయుడగు, నారదః ఋషిః - నారద మహర్షి, రాజ్ఞః - ధర్మరాజుయొక్క, తత్ - ఆ, వచః - మాటను, ఆకర్ణ్య - విని, తుష్టః - సంతోషించినవాడై, తమ్ - ఆయనను, ఆభాష్య - సంబోధించి,

తత్-సదః - ఆయన సభ, శృణ్వత్యాః - వినుచుండగా, కథాః - గాథలను, ప్రాహ - చెప్పెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను - పూజనీయుడగు నారద మహర్షి ధర్మరాజుయొక్క ఆ మాటను విని సంతోషించెను. ఆయన ధర్మరాజును సంబోధించి, సభాసదులందరు వినుచుండగా, గాథలను చెప్పెను.

నారద ఉవాచ ।
నిందనస్తవసత్కారన్యక్కారార్థం కలేవరమ్ ।
ప్రధానపరయో రాజన్నవివేకేన కల్పితమ్ ॥ 22

రాజన్ - ఓ మహారాజా!, ప్రధానపరయోః - ప్రకృతి పరమాత్మల, అవివేకేన - తేడా తెలియకుండుటచే, నిందనస్తవసత్కారన్యక్కార-అర్థమ్ - నింద స్తుతి సత్కారము తిరస్కారముల కొరకై, కలేవరమ్ - శరీరము, కల్పితమ్ - కల్పించబడినది.

ఓ మహారాజా! ప్రకృతికి, పరమాత్మకు మధ్యలో ఉండే తేడా తెలియని కారణముగా ఈ దేహము కల్పితమై, నిందాస్తుతులకు, సత్కారతిరస్కారములకు యోగ్యమై యున్నది.

హింసా తదభిమానేన దండపారుష్యయోర్యథా ।
వైషమ్యమిహ భూతానాం మమాహమితి పార్థివ ॥ 23

యన్నిబద్ధోఽభిమానోఽయం తద్వధాత్ప్రాణినాం వధః ।
తథా న యస్య కైవల్యాదభిమానోఽఖిలాత్మనః ।
పరస్య దమకర్తుర్హి హింసా కేనాస్య కల్ప్యతే ॥ 24

పార్థివ - ఓ మహారాజా!, యథా - ఏ విధముగానైతే, తద్-అభిమానేన - ఆ దేహమునందలి అభిమానముచే, ఇహ - ఈ లోకమునందు, భూతానామ్ - ప్రాణులకు, మమ - నాది, అహమ్ - నేను, ఇతి - అనే, వైషమ్యమ్ - భ్రాంతి కలుగుచున్నదో, దండపారుష్యయోః - కొట్టుట పరుషముగా మాటలాడుటలు కలుగుచుండగా, హింసా - పీడయో, అయమ్ - ఈ, అభిమానః - అభిమానము, యత్-నిబద్ధః - దేనియందు కట్టివేయబడి

యున్నదో, తద్-వధాత్ - దాని వధ వలన, ప్రాణినామ్ - ప్రాణులయొక్క, వధః - వధయో, తథా - ఆ విధముగా, అఖిల-ఆత్మనః - సర్వమునకు ఆత్మయైనట్టియు, దమకర్తుః - శిక్షను వేసే, యస్య - ఏ, అస్య - ఈ, పరస్య - పరమేశ్వరునకు, కైవల్యాత్ - రెండవది లేకుండుట వలన, అభిమానః - అభిమానము, న - లేదు, కేన - ఎవనిచే, హింసా - హింస, కల్ప్యతే హి - కల్పించబడును?

ఓ మహారాజా! ఈ లోకములో మానవులు భ్రాంతిచే దేహమునందు నేను-నాది అనే అభిమానము గలవారై, కొట్టుకొనుట మరియు పరుషముగా తిట్టుకొనుటల వలన కలిగే పీడకు గురియగుచుందురు. మానవులు దేహమే ఆత్మ అనే దృఢమగు అభిమానము గలవారై, దేహముయొక్క వినాశము తమ మరణమేనని స్వీకరించెదరు. కాని సకల ప్రాణులను వారి కర్మలకనురూపముగా శిక్షించే పరమాత్మ అద్వితీయుడు, సర్వాత్మస్వరూపుడు. ఆయనయందు ఇట్టి అభిమానమునకు తావు లేదు. ఆయన విషయములో హింసయొక్క కల్పననైననూ ఎవడు చేయగలడు?

తస్మాద్వైరానుబంధేన నిర్వైరేణ భయేన వా ।
స్నేహాత్కామేన వా యుంజ్యాత్కథంచిన్నేక్షతే పృథక్ ।।25

తస్మాత్ - అందువలన, వైర-అనుబంధేన - వైరమును బూనుటచే గాని, నిర్వైరేణ - వైరమునెరుంగని భక్తిచే గాని, భయేన వా - భయముతో గాని, స్నేహాత్ - మైత్రి వలన, కామేన వా - కామనచే గాని, యుంజ్యాత్ - మనస్సును నిలుపవలెను, కథంచిత్ - ఏ విధముగనైననూ, పృథక్ - వేరుగా, న ఈక్షతే - చూచుట లేదు.

కావున, వైరమును బూని గాని, వైరమునెరుంగని భక్తితో గాని, భయముతో గాని, మైత్రితో గాని, కామనచే గాని భగవానునియందు మనస్సును గట్టిగా నిలుపవలెను. ఈ ఉపాయములలోని భేదమును భగవానుడు సరకు చేయడు.

యథా వైరానుబంధేన మర్త్యస్తన్మయతామియాత్ ।
న తథా భక్తియోగేన ఇతి మే నిశ్చితా మతిః ।। 26

మర్త్యః - మానవుడు, వైర-అనుబంధేన - గట్టిగా వైరమును బూనుటచే, యథా - ఏ విధముగా, తత్-మయతామ్ - ఆ భగవానుని సాయుజ్యమును (తన్మయత్వమును), ఇయాత్ - పొందునో, తథా - ఆ విధముగా, భక్తియోగేన - భక్తియోగముచే, న - పొందదు, ఇతి - అని, మే - నాయొక్క, నిశ్చితా - నిశ్చితమైన, మతిః - అభిప్రాయము.

మానవుడు గట్టిగా వైరమును బూని తన్మయుడై భగవానునితో సాయుజ్యమును పొందిన విధముగా భక్తియోగముతోనైననూ పొందలేడని నా నిశ్చితమైన అభిప్రాయము.

కీటః పేశస్కృతా రుద్ధః కుడ్యాయాం తమనుస్మరన్ ।
సంరంభభయయోగేన విందతే తత్స్వరూపతామ్ ॥ 27

పేశస్కృతా - తుమ్మెదచే, కుడ్యాయామ్ - గోడచిల్లునందు, రుద్ధః - అడ్డుకొనబడిన, కీటః - పురుగు, సంరంభభయయోగేన - ద్వేషము భయముల కారణముగా, తమ్ - దానిని, స్మరన్ - స్మరించుచున్నదై, తత్-సరూపతామ్ - దానితో సమానమైన రూపమును, విందతే - పొందును.

తుమ్మెద గ్రుడ్డునుండి వచ్చిన పురుగు (లార్వా) ను గోడచిల్లులో బంధించును. అది ద్వేషము-భయములతో తుమ్మెదనే స్మరిస్తూ, తుమ్మెద రూపమునే పొందును.

ఏవం కృష్ణే భగవతి మాయామనుజ ఈశ్వరే ।
వైరేణ పూతపాప్మానస్తమాపురనుచింతయా ॥ 28

ఏవమ్ - ఈ విధముగా, మాయామనుజే - మాయచే మానవుడైనట్టియు, ఈశ్వరే - పరమేశ్వరుడగు, కృష్ణే భగవతి - శ్రీకృష్ణ భగవానుని యందు, వైరేణ - వైరముతో, అనుచింతయా - ధ్యానముచే, పూతపాప్మానః - తొలగించబడిన పాపములు గలవారై, తమ్ - ఆయనను, ఆపుః - పొందిరి.

శ్రీకృష్ణ భగవానుడు మాయచే మానవరూపమును దాల్చిన పరమేశ్వరుడు. కొందరు ఆయనను ఆ పురుగు వలె వైరముతో ధ్యానించి, దానిచే పాపములు తొలగి ఆయనను పొందిరి.

కామాద్ద్వేషాద్భయాత్ స్నేహాద్యథా భక్త్యేశ్వరే మనః ।
ఆవేశ్య తదఘం హిత్వా బహవస్తద్గతిం గతాః ॥ 29

భక్త్యా యథా - భక్తితో వలె, కామాత్ - కామన వలన, ద్వేషాత్ - ద్వేషము వలన, భయాత్ - భయము వలన, స్నేహాత్ - మైత్రి వలన, మనః - మనస్సును, ఈశ్వరే - ఈశ్వరునియందు, ఆవేశ్య - గట్టిగా నిలబెట్టి, బహవః - చాలమంది, తద్-అఘమ్ - ఆ పాపమును, హిత్వా - విడిచిపెట్టి, తద్-గతిమ్ - ఆయన సాయుజ్యమును, గతాః - పొందిరి.

భక్తులు భక్తితో భగవానుని పొందినట్లుగానే, చాల మంది కామనతో గాని, ద్వేషముతో గాని, భయముతో గాని, మైత్రితో గాని మనస్సును భగవానునియందు గట్టిగా నిలిపి, ఆయా దోషములను వదిలించుకొని, భగవానుని సాయుజ్యమును పొందిరి.

గోప్యః కామాద్భయాత్కంసో ద్వేషాచ్చైద్యాదయో నృపాః ।
సంబంధాద్వృష్ణయస్స్నేహాద్యూయం భక్త్యా వయం విభో ॥30

విభో - ఓ మహారాజా!, గోప్యః - గోపికలు, కామాత్ - కామన వలన, కంసః - కంసుడు, భయాత్ - భయము వలన, చైద్య-ఆదయః - చేదిదేశపు రాజగు శిశుపాలుడు మొదలగు, నృపాః - రాజులు, ద్వేషాత్ - ద్వేషము వలన, వృష్ణయః - యాదవులు, సంబంధాత్ - బంధుత్వము వలన, యూయమ్ - మీరు, స్నేహాత్ - మైత్రి వలన, వయమ్ - మేము, భక్త్యా - భక్తితో.

ఓ మహారాజా! గోపికలు కామనచే, కంసుడు భయముచే, చేదిదేశ ప్రభువగు శిశుపాలుడు మొదలగు రాజులు ద్వేషముచే, యాదవులు బంధుత్వముచే, మీరు మైత్రిచే, మేము భక్తిచే మనస్సును ఈశ్వరుని యందు నిలిపితిమి.

కతమోఽపి న వేనస్స్యాత్పంచానాం పురుషం ప్రతి ।
తస్మాత్కేనాప్యుపాయేన మనః కృష్ణే నివేశయేత్ ॥ 31

పురుషం ప్రతి - పూర్ణుడగు పరమేశ్వరుని ఉద్దేశించి, పంచానామ్ - అయిదుగురిలో, వేనః - వేనుడు, కతమః అపి - ఏ రకము వాడైననూ, న స్యాత్ - కాడు, తస్మాత్ - అందువలన, కేన - ఏ, ఉపాయేన అపి - ఉపాయముచేనైననూ, మనః - మనస్సును, కృష్ణే - శ్రీకృష్ణునియందు, నివేశయేత్ - గట్టిగా నిలబెట్టవలెను.

పరమేశ్వరుని యెడల చేసే (పైన చెప్పినవాటిలో కామనను మిన హాయించి) అయిదు రకముల భావనలలో దేనినైననూ వేనుడు చేయలేదు (కావుననే, నరకమును పొందెను). కావున, సాధకుడు ఏ ఉపాయముచేనై ననూ మనస్సును శ్రీకృష్ణునియందు గట్టిగా నిలుపవలెను.

మాతృష్వసేయో వశ్చైద్యో దంతవక్త్రశ్చ పాండవ ।
పార్షదప్రవరౌ విష్ణోర్విప్రశాపాత్పదాచ్చ్యుతౌ ॥ 32

పాండవ - పాండువంశీయుడవగు ఓ రాజా!, వః - మీ, మాతృష్వసేయః - పినతల్లి కొడుకు, చైద్యః - చేదిదేశ ప్రభువు అగు శిశుపాలుడు, దంతవక్త్రః చ - దంతవక్త్రుడు కూడ, విష్ణోః - విష్ణువుయొక్క, పార్షదప్రవరౌ - అనుచరులలో శ్రేష్ఠులు, విప్రశాపాత్ - బ్రహ్మవేత్తల శాపము వలన, పదాత్ - పదవినుండి, చ్యుతౌ - జారినవారు.

పాండువంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! చేదిదేశప్రభుడగు శిశుపాలుడు మీ పినతల్లి కొడుకు. ఆతడు, దంతవక్త్రుడు విష్ణువుయొక్క అనుచరులలో ప్రముఖులు. బ్రహ్మవేత్తలగు సనకాదుల శాపముచే వారు తమ పదవినుండి జారిపోయిరి.

యుధిష్ఠిర ఉవాచ ।
కీదృశః కస్య వా శాపో హరిదాసాభిమర్శనః ।
అశ్రద్ధేయ ఇవాభాతి హరేరేకాంతినాం భవః ॥ 33

కస్య - ఎవని, కీదృశః - ఎటువంటి, హరిదాస-అభిమర్శనః - శ్రీహరి భక్తులను తిరస్కరించే, శాపః వా - శాపము?, హరేః - శ్రీహరి యొక్క, ఏకాంతినామ్ - ఏకాంతభక్తులకు, భవః - సంసారము, అశ్రద్ధేయః ఇవ - నమ్మదగ్గది కాదా యన్నట్లు, ఆభాతి - భాసించుచున్నది.

ధర్మరాజు ఇట్లు పలికెను --- శ్రీహరియొక్క భక్తులను తిరస్కరించే ఆ శాపమెట్టిది? ఎవరి శాపము? శ్రీహరియొక్క ఏకాంతభక్తులకు కూడ సంసారము కలుగుట నమ్మ శక్యము కాకుండా నున్నది.

దేహేంద్రియాసుహీనానాం వైకుంఠపురవాసినామ్ ।
దేహసంబంధసంబద్ధమేతదాఖ్యాతుమర్హసి ॥ 34

దేహ-ఇంద్రియ-అసుహీనానామ్ - శరీరము ఇంద్రియములు ప్రాణములు లేని, వైకుంఠపురవాసినామ్ - వైకుంఠపురములో నివసించే వారలకు, దేహసంబంధసంబద్ధమ్ - దేహముతోడి సంబంధమునకు చెందిన, ఏతత్ - ఈ వృత్తాంతమును, ఆఖ్యాతుమ్ - చెప్పుటకు, అర్హసి - తగుదువు.

వైకుంఠపురములో నివసించువారలకు ప్రాకృతములైన దేహములు, ఇంద్రియములు, ప్రాణములు ఉండవు. అట్టివారికి దేహముతోడి సంబంధము (జన్మనెత్తుట) ఎట్లు కలిగినదో, ఆ ఈ వృత్తాంతమును నీవు చెప్ప తగుదువు.

నారద ఉవాచ ।
ఏకదా బ్రహ్మణః పుత్రా విష్ణోర్లోకం యదృచ్ఛయా ।
సనందనాదయో జగ్ముశ్చరంతో భువనత్రయమ్ ॥ 35

ఏకదా - ఒకనాడు, బ్రహ్మణః - బ్రహ్మగారి, పుత్రాః - పుత్రులైన, సనందన-ఆదయః - సనందనుడు మొదలైనవారు, భువనత్రయమ్ - ముల్లోకములను, చరంతః - సంచరించుచున్నవారై, యదృచ్ఛయా - అనుకోకుండా, విష్ణోః - విష్ణువుయొక్క, లోకమ్ - లోకమును గురించి, జగ్ముః - వెళ్లిరి.

నారదుడిట్లు పలికెను --- బ్రహ్మగారి పుత్రులగు సనందనుడు మొదలగువారలు ముల్లోకములను సంచరిస్తూ అనుకోకుండా (ఈశ్వరేచ్ఛ చే) ఒకనాడు విష్ణులోకమునకు వెళ్లిరి.

పంచషడ్ఢాయనార్భాభాః పూర్వేషామపి పూర్వజాః ।
దిగ్వాససశ్శిశూన్ మత్వా ద్వాఃస్థౌ తాన్ ప్రత్యషేధతామ్।।36

పంచషట్-హాయన-అర్భ-ఆభాః - అయిదారు సంవత్సరముల వయస్సు కలిగిన పిల్లలను పోలినట్టియు, పూర్వేషాం అపి - అందరికంటె ముందటివారైన మరీచి మొదలగు ప్రజాపతులకు కూడ, పూర్వజాః - ముందు జన్మించినట్టియు, దిగ్వాససః - దిగంబరులైన, తాన్ - వారిని, శిశూన్ - పిల్లలుగా, మత్వా - తలచి, ద్వాఃస్థౌ - ఇద్దరు ద్వారపాలకులు, ప్రత్యషేధతామ్ - అడ్డుకొనిరి.

అయిదారు సంవత్సరముల వయస్సు గల పిల్లలవలె కన్పట్టే దిగంబరులైన ఆ సనందనాదులు అందరికంటె ముందటివారైన మరీచి మొదలగు ప్రజాపతులకు కూడ ముందు జన్మించినవారు. వారు పిల్లలేనని తలపోసి, ఇద్దరు వైకుంఠ ద్వారపాలకులు వారిని అడ్డుకొనిరి.

అశపన్ కుపితా ఏవం యువాం వాసం న చార్హథః ।
రజస్తమోభ్యాం రహితే పాదమూలే మధుద్విషః ।
పాపిష్ఠామాసురీం యోనిం బాలిశౌ యాతమాశ్వతః ।। 37

ఏవమ్ - ఈ విధమగు ఆటంకముచే, కుపితా - కోపించిన వారు, అశపన్ - శపించిరి, యువామ్ - మీరిద్దరు, రజః-తమోభ్యామ్ - రజస్తమో గుణములచే, రహితామ్ - విరహితమైన, మధుద్విషః - మధువైరియగు శ్రీహరియొక్క, పాదమూలే - చరణముల వద్ద, వాసమ్ - నివాసమును, న చ అర్హథః - తగరు, బాలిశౌ - ఓ మూర్ఖులారా!, ఆశు - వెంటనే, అతః - ఇక్కడనుండి, పాపిష్ఠామ్ - అతిశయించిన పాపము గల, ఆసురీమ్ - అసురులకు చెందిన, యోనిమ్ - జన్మను, యాతమ్ - పొందుడు.

ఈ విధమగు ఆటంకముచే కోపించిన ఆ సనకాదులు ఇట్లు శపించిరి -- మధువైరియగు శ్రీహరి చరణముల వద్ద రజస్తమోగుణములకు తావు లేదు. కావున, మీరిచట నివసించుటకు తగరు. ఓ మూర్ఖులారా! మీరు వెంటనే ఇక్కడనుండి జారిపోయి, పాపభూయిష్ఠమగు అసురజన్మను పొందుడు.

ఏవం శప్తౌ స్వభవనాత్పతంతౌ తైః కృపాలుభిః ।
ప్రోక్తౌ పునర్జన్మభిర్వాం త్రిభిర్లోకాయ కల్పతామ్ ।। 38

ఏవమ్ - ఈ విధముగా, శప్తౌ - శపించబడినవారు, స్వభవనాత్ - తమ భవనమునుండి, పతంతౌ - పడిపోవుచున్న వారిద్దరు, కృపాలుభిః - దయామయులైన, తైః - వారిచే, పునః - మరల, ప్రోక్తౌ - పలుకబడిరి, వామ్ - మీకిద్దరికి, త్రిభిః - మూడు, జన్మభిః - జన్మలచే, లోకాయ - వైకుంఠలోకము కొరకు, కల్పతామ్ - (శాపము) సమాప్తమగు గాక!

ఈ విధముగా శపించబడి వారిద్దరు తమ భవనమునుండి పడిపోవుచుండగా, సనకాదులు వారితో మరల ఇట్లనిరి -- మూడు జన్మల తరువాత శాపము సమాప్తమై మీరు వైకుంఠలోకమును పొందగలరు.

జజ్ఞాతే తౌ దితేః పుత్రౌ దైత్యదానవవందితౌ ।
హిరణ్యకశిపుర్జ్యేష్ఠో హిరణ్యాక్షోఽనుజస్తతః ।। 39

తౌ - వారిద్దరు, దైత్యదానవవందితౌ - దితి దను వంశములకు చెందిన రాక్షసులచే నమస్కరించబడే, దితేః - దితియొక్క, పుత్రౌ - పుత్రులై, జజ్ఞాతే - జన్మించిరి, హిరణ్యకశిపుః - హిరణ్యకశిపుడు, జ్యేష్ఠః - పెద్దవాడు, తతః - వాని, అనుజః - తమ్ముడు, హిరణ్యాక్షః - హిరణ్యాక్షుడు.

వారిద్దరు దితి పుత్రులై జన్మించి, దితిదానవవంశములకు చెందిన రాక్షసుల మన్ననలను పొందిరి. వారిలో పెద్దవాడు హిరణ్యకశిపుడు; హిరణ్యాక్షుడు వాని తమ్ముడు.

హతో హిరణ్యకశిపుర్హరిణా సింహరూపిణా ।
హిరణ్యాక్షో ధరోద్ధారే బిభ్రతా సౌకరం వపుః ।। 40

సింహరూపిణా - సింహము రూపమును దాల్చిన, హరిణా - శ్రీహరిచే, హిరణ్యకశిపుః - హిరణ్యకశిపుడు, సౌకరమ్ - వరాహమునకు చెందిన, వపుః - దేహమును, బిభ్రతా - దాల్చిన, హరిణా - శ్రీహరిచే, ధరా-ఉద్ధారే - భూమిని పైకి తీసుకువచ్చుచుండగా, హిరణ్యాక్షః - హిరణ్యాక్షుడు, హతః - సంహరించబడినాడు.

శ్రీహరి నరసింహరూపమును దాల్చి హిరణ్యకశిపుని, వరాహరూపమును దాల్చి భూమిని పైకి తీసుకువస్తూ హిరణ్యాక్షుని సంహరించెను.

హిరణ్యకశిపుః పుత్రం ప్రహ్లాదం కేశవప్రియమ్ ।
జిఘాంసురకరోన్నానా యాతనా మృత్యుహేతవే ॥ 41

హిరణ్యకశిపుః - హిరణ్యకశిపుడు, కేశవప్రియమ్ - శ్రీహరి భక్తుడు (శ్రీహరికి ప్రియుడు) అయినట్టియు, పుత్రమ్ - తన పుత్రుడగు, ప్రహ్లాదమ్ - ప్రహ్లాదుని, జిఘాంసుః - చంపగోరువాడై, మృత్యుహేతవే - మరణమును కలిగించుట కొరకై, నానా - అనేకవిధములగు, యాతనాః - తీవ్రమగు పీడలను, అకరోత్ - చేసెను.

హిరణ్యకశిపుని పుత్రుడగు ప్రహ్లాదుడు శ్రీహరి భక్తుడు, శ్రీహరికి ప్రియమైనవాడు. ఆతనిని హిరణ్యకశిపుడు చంపగోరెను. ప్రహ్లాదుని చంపుటకై హిరణ్యకశిపుడాతనిని అనేకములైన తీవ్రవేదనలకు గురి చేసెను.

సర్వభూతాత్మభూతం తం ప్రశాంతం సమదర్శనమ్ ।
భగవత్తేజసా స్పృష్టం నాశక్నోద్ధంతుముద్యమైః ॥ 42

సర్వభూత-ఆత్మభూతమ్ - సకలప్రాణులకు ఆత్మరూపుడైనట్టియు, ప్రశాంతమ్ - ద్వేషాదులు లేనట్టియు, సమదర్శనమ్ - అన్నింటియందు వ్యాపించియున్న పరబ్రహ్మను దర్శించునట్టియు, భగవత్-తేజసా - భగవానుని తేజస్సుచే, స్పృష్టమ్ - వ్యాపించబడియున్న, తమ్ - ఆ ప్రహ్లాదుని, ఉద్యమైః - శస్త్రాఘాతములు మొదలగువాటిచే, హంతుమ్ - సంహరించుటకు, న అశక్నోత్ - సమర్థుడు కాలేదు.

ప్రహ్లాదుడు సర్వవ్యాపకమైన పరబ్రహ్మను దర్శించే జ్ఞాని యగుటచే, ఆతని మనస్సులో రాగద్వేషములకు తావు లేదు. సర్వప్రాణులకు ఆత్మరూపుడైయున్న ఆతనిని భగవానుని తేజస్సు వ్యాపించి యుండెను. కావుననే, శస్త్రాఘాతములు మొదలగు ప్రయత్నములను చేసిననూ, హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని సంహరించలేక పోయెను.

తతస్తౌ రాక్షసౌ జాతౌ కేశిన్యాం విశ్రవస్సుతౌ ।
రావణః కుంభకర్ణశ్చ సర్వలోకోపతాపనౌ ।। 43

తతః - తరువాత, తౌ - వారిద్దరు, కేశిన్యామ్ - కేశినియందు, విశ్రవః-సుతౌ - విశ్రవసుని పుత్రులైనట్టియు, సర్వలోకప-ఉపతాపనౌ - సకలప్రాణులకు పీడను కలిగించే, రావణః - రావణుడు, కుంభకర్ణః చ - కుంభకర్ణుడు అనే, రాక్షసౌ - రాక్షసులుగా, జాతౌ - జన్మించిరి.

తరువాత వారిద్దరు విశ్రవసునకు కేశినియందు రావణకుంభకర్ణులనే రాక్షసులై జన్మించి, సకలప్రాణులకు పీడను కలిగించిరి.

తత్రాపి రాఘవో భూత్వా న్యహనచ్ఛాపముక్తయే ।
రామవీర్యం శ్రోష్యసి త్వం మార్కండేయముఖాత్ప్రభో ।।44

ప్రభో - ఓ మహారాజా!, తత్ర అపి - వారి ఆ రాక్షసజన్మయందు కూడ, రాఘవః - శ్రీరాముడుగా, భూత్వా - అవతరించి, శాపముక్తయే - శాపమునుండి విముక్తి కొరకు, న్యహనత్ - సంహరించెను, త్వమ్ - నీవు, రామవీర్యమ్ - శ్రీరాముని పరాక్రమమును గురించి, మార్కండేయముఖాత్ - మార్కండేయమహర్షియొక్క నోటినుండి, శ్రోష్యసి - వినగలవు.

ఓ మహారాజా! వారిద్దరి ఆ జన్మయందు కూడ శ్రీహరి శ్రీరాముడై అవతరించి వారిని సంహరించి శాపవిముక్తిని కలిగించెను. నీకు శ్రీరాముని పరాక్రమమును గురించి మార్కండేయ మహర్షి చెప్పగలడు.

తావేవ క్షత్రియౌ జాతౌ మాతృష్వస్రాత్మజౌ తవ ।
అధునా శాపనిర్ముక్తౌ కృష్ణచక్రహతాంహసౌ ।। 45

తౌ ఏవ - వారిద్దరే, తవ - నీకు, మాతృష్వసృ-ఆత్మజౌ - పిన తల్లి కుమారులు, క్షత్రియౌ - క్షత్రియులుగా, జాతౌ - జన్మించిరి, అధునా - ఇప్పుడు, కృష్ణచక్రహత-అంహసౌ - శ్రీకృష్ణుని చక్రముచే నశింపజేయ బడిన పాపములు గలవారై, శాపనిర్ముక్తౌ - శాపవిముక్తిని పొందిరి.

వారిద్దరే ఇప్పుడు క్షత్రియకులములో నీ పినతల్లి కుమారులై జన్మించిరి. శ్రీకృష్ణుని చక్రముచే వారి పాపములు నశించగా, వారిప్పుడు శాపవిముక్తిని పొందిరి.

వైరానుబంధతీవ్రేణ ధ్యానేనాచ్యుతసాత్మతామ్ ।
నీతౌ పునర్హరేః పార్శ్వం జగ్మతుర్విష్ణుపార్షదౌ ।। 46

వైర-అనుబంధతీవ్రేణ - గట్టిగా వైరమును పూనుటచే తీవ్రమైన, ధ్యానేన - ధ్యానముచే, అచ్యుతసాత్మతామ్ - శ్రీహరియందు తన్మయత్వ మును, నీతౌ - పొందించబడిన వారిద్దరు, పునః - మరల, విష్ణుపార్షదౌ - శ్రీహరి అనుచరులై, హరేః - శ్రీహరియొక్క, పార్శ్వమ్ - సమీపస్థానము ను, జగ్మతుః - చేరుకొనిరి.

వారిద్దరు శ్రీహరియందు గట్టిగా వైరమును బూని ఆయననే ధ్యానిస్తూ ఆయనలో తన్మయులైనారు. ఆ ధ్యానఫలముగా వారు మరల శ్రీహరికి అనుచరులై ఆయన సన్నిధిని చేరుకొనిరి.

యుధిష్ఠిర ఉవాచ ।
విద్వేషో దయితే పుత్రే కథమాసీన్మహాత్మని ।
బ్రూహి మే భగవన్ యేన ప్రహ్రాదస్యాచ్యుతాత్మతా ।। 47

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే
ప్రహ్లాదచరితోపక్రమే ప్రథమోఽధ్యాయః ।।

భగవన్ - పూజనీయుడవగు ఓ మహర్షీ!, మహాత్మని - మహాత్ము డైనట్టియు, దయితే - ప్రియుడైన, పుత్రే - పుత్రునియందు, విద్వేషః - అధికమగు ద్వేషము, కథమ్ - ఎట్లు, ఆసీత్ - కలిగెను?, మే - నా కొరకు,

బ్రూహి - చెప్పుము, యేన - దేనిచే, ప్రహ్రాదస్య - ప్రహ్లాదునకు, అచ్యుత -ఆత్మతా - శ్రీహరియందు తన్మయత్వమో.

పూజనీయుడవగు ఓ మహర్షీ! తనకు ప్రియమైన పుత్రుడు మరియు మహాత్ముడు అగు ప్రహ్లాదునియందు హిరణ్యకశిపునకు అధిక మగు విద్వేషము కలుగుటకు కారణమేమి? ప్రహ్లాదుడు ఏ ఉపాయముచే శ్రీహరియందు తన్మయుడు కాగలిగెను? నాకీ విషయమును చెప్పుము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
ప్రహ్లాదచరితమునకు ఉపక్రమించే మొదటి
అధ్యాయము ముగిసినది (1).

*****

# అథ ద్వితీయోఽధ్యాయః

## ప్రహ్లాదుని చరితము - దితిని హిరణ్యకశిపుడు ఓదార్చుట

నారద ఉవాచ ।
భ్రాతర్యేవం వినిహతే హరిణా క్రోడమూర్తినా।
హిరణ్యకశిపూ రాజన్ పర్యతప్యద్రుషా శుచా ।। 1

రాజన్ - ఓ మహారాజా!, ఏవమ్ - ఈ విధముగా, క్రోడమూర్తినా - వరాహరూపమును దాల్చిన, హరిణా - శ్రీహరిచే, భ్రాతరి - తమ్ముడు, వినిహతే - సంహరించబడగా, హిరణ్యకశిపుః - హిరణ్యకశిపుడు, రుషా - కోపముతో, శుచా - దుఃఖముతో, పరి-అతప్యత్ - అధికమగు తాపమును పొందెను.

ఓ మహారాజా! ఈ విధముగా శ్రీహరి వరాహరూపమును దాల్చి తన సోదరుడగు హిరణ్యాక్షుని సంహరించగా, ఆ హిరణ్యకశిపుడు కోపముతో మరియు దుఃఖముతో అధికమగు తాపమును పొందెను.

ఆహ చేదం రుషా ఘూర్ణస్సందష్టదశనచ్ఛదః ।
కోపోజ్జ్వలద్భ్యాం చక్షుర్భ్యాం నిరీక్షన్ ధూమ్రమంబరమ్ ।।2

రుషా - కోపముతో, ఘూర్ణః - వణకుచున్నవాడై, సందష్టదశనచ్ఛదః - కొరుకబడిన పెదవి గలవాడై, కోప-ఉత్-జ్వలద్భ్యామ్ - కోపముతో మండి పడుచున్న, చక్షుర్భ్యామ్ - కన్నులతో, ధూమ్రమ్ - పొగ నిండిన, అంబరమ్ - ఆకాశమును, నిరీక్షన్ - చూచువాడై, ఇదం చ - ఈ మాటను, ఆహ - పలికెను.

హిరణ్యకశిపుని శరీరము కోపముతో వణుకుచుండెను. అతడు పెదవిని కొరుకుచుండగా కోపముతో కన్నులు మండి పడుచుండెను. పొగతో నిండిన ఆకాశముకేసి చూస్తూ, అతడిట్లు పలికెను.

కరాలదంష్ట్రోగ్రదృష్ట్యా దుష్ప్రేక్ష్యభ్రుకుటీముఖః ।
శూలముద్యమ్య సదసి దానవానిదమబ్రవీత్ ॥ 3

కరాలదంష్ట్రా-ఉగ్రదృష్ట్యా - భయంకరమగు కోరలతో క్రూరమైన చూపుతో, దుష్ప్రేక్ష్యభ్రుకుటీముఖః - చూడ శక్యము కాని కనుబొమల ముడి గల ముఖము గలవాడై, సదసి - సభయందు, శూలమ్ - శూలమును, ఉద్యమ్య - పైకి యెత్తి, దానవాన్ - రాక్షసులనుద్దేశించి, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

హిరణ్యకశిపుని కోరలు భయమును గొల్పుచుండెను. అతని చూపు క్రూరముగా నుండెను. కనుబొమలు ముడివడిన అతని ముఖము చూడ శక్యము కాకుండ నుండెను. అతడు సభలో శూలమును పైకెత్తి రాక్షసులనుద్దేశించి ఇట్లు పలికెను.

భో భో దానవదైతేయా ద్విమూర్ధంస్త్ర్యక్ష శంబర ।
శతబాహో హయగ్రీవ నముచే పాక ఇల్వల ॥ 4

విప్రచిత్తే మమ వచః పులోమన్ శకునాదయః ।
శృణుతానంతరం సర్వే క్రియతామాశు మా చిరమ్ ॥ 5

భోః భోః దానవదైతేయాః - దను దితి వంశములకు చెందిన ఓ రాక్షసులారా!, ద్విమూర్ధన్ - ద్విమూర్ధా!, త్ర్యక్ష - త్ర్యక్షా!, శంబర - శంబరా!, శతబాహో - శతబాహూ!, హయగ్రీవ - హయగ్రీవా!, నముచే - నముచీ!, పాక - ఓ పాకాసురా!, ఇల్వల - ఇల్వలా!, విప్రచిత్తే - విప్రచిత్తీ!, పులోమన్ - పులోమా!, శకునాదయః - శకుని మొదలైన రాక్షసులారా!, సర్వే - అందరు, మమ - నా, వచః - మాటను, శృణుత - వినుడు, అనంతరమ్ - తరువాత, ఆశు - వెంటనే, క్రియతామ్ - చేయబడుగాక!, మా చిరమ్ - విలంబము వద్దు.

దను-దితి వంశములకు చెందిన ఓ రాక్షసులారా! ఓ ద్విమూర్ధా (రెండు తలలవాడు)! త్ర్యక్షా (మూడు కన్నులవాడు)! ఓ శంబరా! ఓ శత బాహూ (వంద చేతులవాడు)! హయగ్రీవా (గుర్రపు తలవాడు)! నముచీ! ఓ పాకాసురా! ఇల్వలా! విప్రచిత్తీ! పులోమా! శకునీ! ఇతర రాక్షసులారా! మీరందరు నా మాటను వినుడు. వెంటనే నేను చెప్పినట్లు చేయుడు. విలం బమును చేయకుడు.

సపత్నైర్ఘాతితః క్షుద్రైర్భ్రాతా మే దయితస్సుహృత్ ।
పార్ష్ణిగ్రాహేణ హరిణా సమేనాప్యుపధావనైః ।। 6

దయితః - మిక్కిలి ప్రియుడు, సుహృత్ - హితకారి అగు, మే - నా, భ్రాతా - సోదరుడు, క్షుద్రైః - అల్పులైన, సపత్నైః - శత్రువులచే, ఉపధావనైః - సేవల ద్వారా, పార్ష్ణిగ్రాహేణ - సహాయకుడైన, హరిణా - శ్రీహరిచే, సమేన అపి - సముడే అయినప్పటికీ, ఘాతితః - సంహరింప జేయబడినాడు.

నా సోదరుడు నాకు మిక్కిలి ప్రియుడు, హితకారి. అల్పులగు నా శత్రువులు (దేవతలు) సేవలతో శ్రీహరిని సంతోషపెట్టి సర్వులయందు సమభావము గల ఆయనను తమ వైపుకు త్రిప్పుకొని, ఆయనచే నా సోద రుని సంహరింప జేసినారు.

తస్య త్యక్తస్వభావస్య ఘృణేర్మాయావనౌకసః ।
భజంతం భజమానస్య బాలస్యేవాస్థిరాత్మనః ।। 7

మచ్ఛూలభిన్నగ్రీవస్య భూరిణా రుధిరేణ వై ।
రుధిరప్రియం తర్పయిష్యే భ్రాతరం మే గతవ్యథః ।। 8

త్యక్తస్వభావస్య - విడిచిపెట్టబడిన స్వభావము గలిగినట్టియు, ఘృణేః - తేజశ్శాలియైనట్టియు, మాయావన-ఓకసః - మాయచే అడవిజంతువు రూపు కలిగినట్టియు, భజంతమ్ - సేవించువానిని, భజమా నస్య - సేవించునట్టియు, బాలస్య ఇవ - చిన్నపిల్లవానికి వలె, అస్థిర-ఆ త్మనః - చంచలమగు మనస్సు కలిగినట్టియు, మత్-శూలభిన్నగ్రీవస్య -

నా శూలముచే తెగగొట్టబడిన మెడగల, తస్య - ఆ శ్రీహరియొక్క, భూరిణా - అధికమగు, రుధిరేణ - రక్తముతో, వై - నిశ్చయముగా, రుధిర ప్రియమ్ - రక్తము ప్రియమైన, మే - నా, భ్రాతరమ్ - సోదరుని, గతవ్యథః - తొలగిన పీడగల నేను, తర్పయిష్యే - తృప్తి పరచెదను.

తేజశ్శాలియగు ఆ శ్రీహరి తన సమస్వభావమును విడిచిపెట్టి మాయను పన్ని అడవి మృగము (వరాహము) రూపు దాల్చినాడు. తనను భజించువారల వెంటబడే (అనుగ్రహించే) ఆతని మనస్సు బాలుని మనస్సు వలె చంచలమైనది. నేను నిశ్చయముగా నా శూలముతో వాని మెడను తెగగొట్టి ఆ అధికమగు రక్తముతో నా సోదరునకు తర్పణమిచ్చి, నా మనోవ్యథను దూరము చేసుకొనెదను. నా సోదరునకు రక్తమునందు ప్రీతి మెండు.

తస్మిన్ కూటేఽహితే నష్టే కృత్తమూలే వనస్పతౌ ।
విటపా ఇవ శుష్యంతి విష్ణుప్రాణా దివౌకసః ॥ 9

కూటే - మోసగాడు, అహితే - అపకారి అగు, తస్మిన్ - ఆ శ్రీహరి, నష్టే - నశించగా, వనస్పతౌ - చెట్టు, కృత్తమూలే - తెగగొట్టబడిన మొదలు గలది కాగా, విటపాః ఇవ - కొమ్మలు వలె, విష్ణుప్రాణాః - విష్ణువే ప్రాణమైన, దివౌకసః - స్వర్గవాసులగు దేవతలు, శుష్యంతి - శుష్కించెదరు.

చెట్టు మొదలు నరికినచో, కొమ్మలు ఎండిపోవును. అదే విధముగా మోసగాడు మరియు అపకారి అగు ఆ శ్రీహరి నశించగానే, ఆయనయే జీవనమై స్వర్గములో నివసించే దేవతలు శుష్కించి పోయెదరు.

తావద్యాత భువం యూయం బ్రహ్మక్షత్రసమేధితామ్ ।
సూదయధ్వం తపోయజ్ఞస్వాధ్యాయవ్రతదానినః ॥ 10

తావత్ - అంతలో, యూయమ్ - మీరు, బ్రహ్మక్షత్రసమేధితామ్ - వేదవేత్తలచే మరియు క్షత్రియులచే వర్ధిల్ల జేయబడిన, భువమ్ - భూలోకమును గురించి, యాత - వెళ్లుడు, తపః-యజ్ఞస్వాధ్యాయవ్రతదానినః -

తపస్సు యజ్ఞము వేదాధ్యయనము వ్రతము దానము గలవారలను, సూద యధ్వమ్ - సంహరించుడు.

అంతలో (నేను శ్రీహరిని తుదముట్టించే లోపులో) మీరు వేదవేత్త లచే మరియు క్షత్రియులచే వర్ధిల్ల జేయబడిన భూలోకమునకు వెళ్లుడు. అచట తపస్సు, యజ్ఞము, వేదాధ్యయనము, వ్రతములు మరియు దాన ములను చేయువారిని సంహరించుడు.

విష్ణుర్ద్విజక్రియామూలో యజ్ఞో ధర్మమయః పుమాన్ ।
దేవర్షిపితృభూతానాం ధర్మస్య చ పరాయణమ్ ॥ 11

విష్ణుః - విష్ణువు, ద్విజక్రియామూలః - వేదవేత్తల కర్మలే మూల ముగా గలవాడు, యజ్ఞః - యజ్ఞస్వరూపుడు, ధర్మమయః - ధర్మమే రూ పముగా గల, పుమాన్ - పురుషుడు, దేవ-ఋషిపితృభూతానామ్ - దేవ తలు మహర్షులు పితృదేవతలు మరియు ప్రాణులకు, ధర్మస్య చ - ధర్మ మునకు కూడ, పర-అయనమ్ - సర్వోత్కృష్టమగు ఆశ్రయము.

వేదవేత్తలు చేసే వైదికకర్మలే యజ్ఞస్వరూపుడగు విష్ణువునకు మూలము. ధర్మరూపుడగు ఆ పురుషోత్తముడు దేవతలకు, పితృదేవతల కు, మహర్షులకు, సకలప్రాణులకు మరియు ధర్మమునకు కూడ సర్వోత్తమ మైన ఆశ్రయమై ఉన్నాడు.

యత్ర యత్ర ద్విజా గావో వేదా వర్ణాశ్రమాః క్రియాః ।
తం తం జనపదం యాత సందీపయత వృశ్చత ॥ 12

యత్ర యత్ర - ఎక్కడెక్కడైతే, ద్విజాః - వేదవేత్తలు, గావః - గోవులు, వేదాః - వేదములు, వర్ణ-ఆశ్రమాః - వర్ణములు ఆశ్రమములు, క్రియాః - వైదికకర్మలు గలవో, తం తమ్ - ఆయా, జనపదమ్ - దేశమును గురించి, యాత - వెళ్లుడు, సందీపయత - బాగా తగుల బెట్టుడు, వృశ్చత - చెట్లను నరుకుడు.

ఏయే దేశములయందైతే వేదవేత్తలు వర్ణాశ్రమధర్మములను పాటిస్తూ కర్మలను చేయుచుందురో, గోవులు ఉండునో, ఆయా దేశములకు వెళ్లి, వాటిని పూర్తిగా తగులబెట్టుడు. చెట్లను నరుకుడు.

ఇతి తే భర్తృనిర్దేశమాదాయ శిరసాఽఽదృతాః ।
తథా ప్రజానాం కదనం విదధుః కదనప్రియాః ॥ 13

కదనప్రియాః - పీడించుట ప్రియమైన, తే - వారు, ఇతి - ఈ విధముగా, భర్తృనిర్దేశమ్ - ప్రభువుయొక్క ఆదేశమును, ఆదృతాః - ఆదరము గలవారై, శిరసా - శిరస్సుతో, ఆదాయ - స్వీకరించి, తథా - అదే విధముగా, ప్రజానామ్ - ప్రజలకు, కదనమ్ - పీడను, విదధుః - కలిగించిరి.

వారికి ఇతరులను పీడించుట సరదా. వారు ఈ తమ ప్రభువు ఆదేశమును సాదరముగా శిరస్సు వంచి స్వీకరించి, ఆ విధముగనే ప్రజలకు పీడను కలిగించిరి.

పురగ్రామవ్రజోద్యానక్షేత్రారామాశ్రమాకరాన్ ।
ఖేటఖర్వటఘోషాంశ్చ దదహుః పత్తనాని చ ॥ 14

పురగ్రామవ్రజ-ఉద్యానక్షేత్ర-ఆరామ-ఆశ్రమ-ఆకరాన్ - నగరములు గ్రామములు గొల్లపల్లెలు ఉద్యానములు పంటపొలములు సత్రములు ఆశ్రమములు గనులను, ఖేటఖర్వటఘోషాన్ చ - రైతుల పల్లెలు కొండపల్లెలు అడవిపల్లెలను, పత్తనాని చ - పట్టణములను కూడ, దదహుః - తగులబెట్టిరి.

నగరములు, గ్రామములు, గొల్లపల్లెలు, ఉద్యానములు, పంటపొలములు, సత్రములు, ఆశ్రమములు, గనులు, రైతుల పల్లెలు, కొండపల్లెలు, అడవిపల్లెలు మరియు పట్టణములను వారు తగులబెట్టిరి.

కేచిత్ఖనిత్రైర్బిభిదుస్సేతుప్రాకారగోపురాన్ ।
ఆజీవ్యాంశ్చిచ్ఛిదుర్వృక్షాన్ కేచిత్పరశుపాణయః ।
ప్రాదహన్ శరణాన్యన్యే ప్రజానాం జ్వలితోల్ముకైః ॥ 15

కేచిత్ - కొందరు, ఖనిత్రైః - గునపములతో, సేతుప్రాకారగోపు రాన్ - వంతెనలను ప్రహరీలను గోపురములను, బిభిదుః - పగుల గొట్టిరి, పరశుపాణయః - గొడ్డళ్లు చేతులయందు గల, కేచిత్ - కొందరు, ఆజీ వ్యాన్ - జీవికను కల్పించే, వృక్షాన్ - చెట్లను, చిచ్ఛిదుః - నరికిరి, అన్యే - ఇతరులు, ప్రజానామ్ - ప్రజల, శరణాని - ఇళ్లను, జ్వలిత-ఉల్ముకైః - మండించబడిన కొరవిలతో, ప్రాదహన్ - పూర్తిగా తగులబెట్టిరి.

కొందరు గొడ్డళ్లతో వంతెనలను, ప్రహరీలను, గోపురములను కూలగొట్టిరి. ఇంకొందరు జనులకు జీవికలను కల్పించే కొబ్బరి మొదలగు చెట్లను నరికిరి. మరికొందరు మండే కొరవిలతో జనుల ఇళ్లను పూర్తిగా తగుల బెట్టిరి.

ఏవం విప్రకృతే లోకే దైత్యేంద్రానుచరైర్ముహుః ।
దివం దేవాః పరిత్యజ్య భువి చేరురలక్షితాః ॥ 16

ఏవమ్ - ఈ విధముగా, దైత్య-ఇంద్ర-అనుచరైః - రాక్షసరాజగు హిరణ్యకశిపుని అనుచరులచే, లోకే - లోకము, ముహుః - పలుమార్లు, విప్రకృతే - ఉపద్రవము చేయబడగా, దేవాః - దేవతలు, దివమ్ - స్వర్గ మును, పరిత్యజ్య - విడిచిపెట్టి, భువి - భూలోకమునందు, అలక్షితాః - కనబడనివారై, చేరుః - తిరుగాడిరి.

ఈ విధముగా రాక్షసరాజగు హిరణ్యకశిపుని అనుచరులు లోకము నకు పలుమార్లు ఉపద్రవమును కలిగించిరి. దేవతలు స్వర్గమును విడిచిపె ట్టి, భూలోకమునందు కానరాకుండా తిరుగాడిరి.

హిరణ్యకశిపుర్భ్రాతుస్సంపరేతస్య దుఃఖితః ।
కృత్వా కటోదకాదీని భ్రాతృపుత్రానసాంత్వయత్ ॥ 17

శకునిం శంబరం ధృష్టం భూతసంతాపనం వృకమ్ ।
కాలనాభం మహానాభం హరిశ్మశ్రుమథోత్కచమ్ ॥ 18

దుఃఖితః - దుఃఖమును పొందియున్న, హిరణ్యకశిపుః - హిరణ్య కశిపుడు, సంపరేతస్య - మరణించిన, భ్రాతుః - సోదరునకు, కట-ఉదక-

ఆదీని - ప్రేతమునకు తర్పణములనిచ్చుట మొదలగు కర్మలను, కృత్వా - చేసి, భ్రాతృపుత్రాన్ - సోదరుని పుత్రులను, శకునిమ్ - శకునిని, శంబరమ్ - శంబరుని, ధృష్టమ్ - ధృష్టుని, భూతసంతాపనమ్ - భూతసంతాపనుని, వృకమ్ - వృకుని, కాలనాభమ్ - కాలనాభుని, మహానాభమ్ - మహానాభుని, హరిశ్మశ్రుమ్ - హరిశ్మశ్రుని, అథ - మరియు, ఉత్కచమ్ - ఉత్కచుని, అసాంత్వయత్ - ఓదార్చెను.

సోదరుని మరణమునకు దుఃఖమును పొందియున్న హిరణ్యకశిపుడు ప్రేతకార్యములను చేసి, సోదరుని పుత్రులగు శకుని, శంబరుడు, ధృష్టుడు, భూతసంతాపనుడు, వృకుడు, కాలనాభుడు, మహానాభుడు, హరిశ్మశ్రువు, ఉత్కచుడు అనువారలను ఓదార్చెను.

తన్మాతరం రుషాభానుం దితిం చ జననీం గిరా ।
శ్లక్ష్ణయా దేశకాలజ్ఞ ఇదమాహ జనేశ్వరః ॥ 19

దేశకాలజ్ఞః - దేశకాలములనెరింగిన, జన-ఈశ్వరః - హిరణ్యకశిపు మహారాజు, తత్-మాతరమ్ - వారి తల్లియగు, రుషాభానుమ్ - రుషాభానువును, జననీమ్ - తల్లియగు, దితిం చ - దితిని కూడ, శ్లక్ష్ణయా - మధురమగు, గిరా - వాక్కుతో, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను.

హిరణ్యకశిపు మహారాజు దేశకాలములనెరింగిన వాడు. వారి తల్లియగు రుషాభానువును, తన తల్లియగు దితిని ఉద్దేశించి, అతడు మధురమగు స్వరముతో నిట్లు పలికెను.

సంపదలయందలి లోభమునకు హిరణ్యాక్షుడు, ఆ సంపదలచే పొందబడే భోగములయందలి తృష్ణకు హిరణ్యకశిపుడు, భేదబుద్ధికి దితి, క్రోధమునకు రుషాభానువు, బ్రహ్మానందమగున్నదైన ఆత్మజ్ఞానికి ప్రహ్లాదుడు, సకలప్రాణుల ఏకత్వమునకు నృసింహుడు ప్రతీకలు.

హిరణ్యకశిపురువాచ ।
అంబాంబ హే వధూః పుత్రా వీరం మార్హథ శోచితుమ్ ।
రిపోరభిముఖే శ్లాఘ్యశ్శూరాణాం వధ ఈప్సితః ॥ 20

అంబ అంబ - అమ్మా అమ్మా!, హే వధూః - ఓ సోదరపత్నీ!, పుత్రాః - పుత్రులారా!, వీరమ్ - వీరుడగు హిరణ్యాక్షుని గురించి, శోచితుమ్ - శోకించుటకు, మా అర్హథ - తగరు, శూరాణామ్ - శూరులకు, రిపోః - శత్రువునకు, అభిముఖే - ఎదురుగా, వధః - వధ, శ్లాఘ్యః - కొనియాడ దగినది, ఈప్సితః - అభీష్టము.

అమ్మా! అమ్మా! ఓ సోదరపత్నీ! ఓ పుత్రులారా! వీరుడగు హిరణ్యాక్షుని గురించి మీరు శోకించుట తగదు. శూరులు శత్రువునెదుర్కొంటూ మరణించుట కొనయాడదగినది. అట్టి మరణమును శూరులు కోరెదరు.

భూతానామిహ సంవాసః ప్రపాయామివ సువ్రతే ।
దైవేనైకత్ర నీతానామున్నీతానాం స్వకర్మభిః ॥ 21

సువ్రతే - గొప్ప నిష్ఠ గలదానా!, దైవేన - దైవముచే, ఏకత్ర - ఒకచోటికి, నీతానామ్ - తీసుకురాబడినట్టియు, స్వకర్మభిః - తమ కర్మలచే, ఉన్నీతానామ్ - విడగొట్టబడే, భూతానామ్ - ప్రాణులకు, ఇహ - ఈ లోకమునందు, సంవాసః - కలిసి నివసించుట, ప్రపాయాం ఇవ - చలిపందిరి వద్దవలె.

గొప్ప నిష్ఠ గల ఓ తల్లీ! ప్రాణులు ప్రారబ్ధవశముచే ఒకచోట కలుసుకొని, మరల విడిపోవుచుందురు. ఈ లోకములో వ్యక్తులు కలిసి జీవించుట చలిపందిరి వద్ద వ్యక్తులు కొద్ది సేపు కలియుట వంటిది మాత్రమే.

నిత్య ఆత్మాఽవ్యయశ్శుద్ధస్సర్వగస్సర్వవిత్పరః ।
ధత్తేఽసావాత్మనో లింగం మాయయా విసృజన్ గుణాన్ ॥22

ఆత్మా - ఆత్మ, నిత్యః - నిత్యము, అవ్యయః - వినాశము లేనిది, శుద్ధః - శుద్ధమైనది, సర్వగః - సర్వమును వ్యాపించి యుండునది, సర్వవిత్ - సర్వము తెలిసినది, పరః - ప్రకృతికి అతీతమైనది, అసౌ - ఈ ఆత్మ, ఆత్మనః - తన, మాయయా - మాయాశక్తిచే, గుణాన్ - గుణకార్యములను, విసృజన్ - విరివిగా సృష్టించుచున్నదై, లింగమ్ - సూక్ష్మదేహమును, ధత్తే - ధరించుచుండును.

ఆత్మ కాలమునకు అతీతమైనది, వినాశము లేనిది, పాపపుణ్యములు లేనిది, సర్వవ్యాపకము, సర్వజ్ఞము, మరియు ప్రకృతికి అతీతమైనది. అట్టి యాత్మ తన మాయాశక్తిచే సత్త్వరజస్తమోగుణముల కార్యములగు దేహములను విరివిగా సృష్టించి, సూక్ష్మశరీరమును ధరించుచుండును.

యథాంభసా ప్రచలతా తరవోఽపి చలా ఇవ ।
చక్షుషా భ్రామ్యమాణేన దృశ్యతే చలతీవ భూః ।। 23

ఏవం గుణైర్భ్రామ్యమాణే మనస్యవికలః పుమాన్ ।
యాతి తత్సామ్యతాం భద్రే హ్యలింగో లింగవానివ ।। 24

భద్రే - ఓ కల్యాణీ!, యథా - ఏ విధముగానైతే, ప్రచలతా - బాగా కదలాడుచున్న, అంభసా - నీటిచే, తరవః అపి - చెట్లు కూడ, చలాః ఇవ - కదలుచున్నట్లు ఉండునో, భ్రామ్యమాణేన - తిరుగుచున్న, చక్షుషా - కంటితో, భూః - భూమి, చలతీ ఇవ - కదలుచున్నది వలె, దృశ్యతే - కన్పట్టునో, ఏవమ్ - ఇదే విధముగా, మనసి - మనస్సు, గుణైః - సత్త్వరజస్తమోగుణములు కారణముగా, భ్రామ్యమాణే - తిరుగుచుండగా, అవికలః - వికారములు లేని, పుమాన్ - పురుషుడు, తత్-సామ్యతామ్ - ఆ మనస్సుతో సమానమగు స్థితిని, యాతి - పొందుచున్నాడు, అలింగః హి - దేహము లేనివాడే అయిననూ, లింగవాన్ ఇవ - దేహము కలవాడు వలె.

ఓ కల్యాణీ! నీరు బాగా కదులుతూ ఉంటే, దానిలో ప్రతిఫలించిన చెట్లు కూడ కదులుచున్నట్లు కానవచ్చును. కన్నులు తిరిగినప్పుడు భూమి కూడ తిరుగుచున్నట్లు కనబడును. అదే విధముగా, గుణకార్యములగు విషయముల కారణముగా మనస్సు విచలితము కాగా, వికారములు లేనిదే అయిననూ ఆత్మ మనస్సుతో సమానముగా వికారములు కలది వలె భాసించును. వాస్తవములో ఆత్మకు దేహాదులతో సంసర్గము లేకున్ననూ, ఉన్నట్లే భాసించును.

ఏష ఆత్మవిపర్యాసో హ్యలింగే లింగభావనా ।
ఏష ప్రియాప్రియైర్యోగో వియోగః కర్మ సంసృతిః ।। 25

సంభవశ్చ వినాశశ్చ శోకశ్చ వివిధస్స్మృతః ।
అవివేకశ్చ చింతా చ వివేకాస్మృతిరేవ చ ॥ 26

అలింగే - దేహాదులతో సంసర్గము లేని ఆత్మయందు, లింగభావనా - దేహాదులతో నేను-నాది అనే ధారణ, ఏషః హి - ఇదియే, ఆత్మవిపర్యాసః - ఆత్మ తన స్వరూపమునకు విరుద్ధముగా భాసించుట, ప్రియ-అప్రియైః - ప్రియము అప్రియములతోడి, ఏషః - ఈ, యోగః - సంసర్గము, వియోగః - వియోగము, కర్మ - కర్మ, సంసృతిః - సంసారము, సంభవః చ - పుట్టుక, వినాశః చ - మరణము, వివిధః - పలువిధములగు, శోకః చ - శోకము, అవివేకః చ - తేడా తెలియకుండుట, చింతా చ - చింత, వివేక-అస్మృతిః ఏవ చ - వివేకము స్మరణమునకు రాకుండుట, స్మృతః - చెప్పబడినది.

ఆత్మకు దేహాదులతో వాస్తవమగు సంసర్గము లేకున్ననూ, అజ్ఞానముచే ఉన్నట్లు భాసించును. ఇట్టి అధ్యాస వలననే ఆత్మ తన స్వరూపము కంటె భిన్నముగా, ప్రియ-అప్రియములగు పదార్థములతో సంయోగ-వియోగములు గలదిగా, కర్మలను చేసేదిగా, కర్మఫలమగు సంసారమును అనుభవించేదిగా, పుట్టుక-మరణములు గలదిగా, పలువిధముల శోకమున నుభవించునదిగా, శోకము అవివేకములు కలదిగా, వివేకముయొక్క స్మరణము లేనిదిగా అగుచున్నది అని మహాత్ములు చెప్పెదరు.

అత్రాప్యుదాహరంతీమమితిహాసం పురాతనమ్ ।
యమస్య ప్రేతబంధూనాం సంవాదం తం నిబోధత ॥ 27

అత్ర - ఈ విషయమునందు, ఇమమ్ - ఈ, పురాతనమ్ - ప్రాచీనమగు, ఇతిహాసం అపి - వృత్తాంతమును కూడ, ఉదాహరంతి - ఉటంకించెదరు, యమస్య - యమునకు, ప్రేతబంధూనామ్ - మరణించినవాని బంధువులకు, తమ్ - ఆ, సంవాదమ్ - సంభాషణమును, నిబోధత - తెలుసుకొనుడు.

ఈ విషయములో ఒక ప్రాచీనమైన వృత్తాంతమును కూడ పెద్దలు ఉటంకించెదరు. ఒక మరణించిన వ్యక్తియొక్క బంధువులకు యమునితో జరిగిన ఆ సంభాషణమును గురించి మీరు తెలుసుకొనుడు.

ఉశీనరేష్వభూద్రాజా సుయజ్ఞ ఇతి విశ్రుతః ।
సపత్నైర్నిహతో యుద్ధే జ్ఞాతయస్తముపాసత ॥ 28

విశీర్ణరత్నకవచం విభ్రష్టాభరణస్రజమ్ ।
శరనిర్భిన్నహృదయం శయానమసృగావిలమ్ ॥ 29

ప్రకీర్ణకేశం ధ్వస్తాక్షం రభసా దష్టదచ్ఛదమ్ ।
రజఃకుంఠముఖాంభోజం ఛిన్నాయుధభుజం మృధే ॥ 30

ఉశీనరేషు - ఉశీనర దేశమునందు, సుయజ్ఞః - సుయజ్ఞుడు, ఇతి - అని, విశ్రుతః - ప్రసిద్ధి గాంచిన, రాజా - రాజు, అభూత్ - ఉండెను, యుద్ధే - యుద్ధమునందు, సపత్నైః - శత్రువులచే, నిహతః - సంహరించబడినాడు, జ్ఞాతయః - జ్ఞాతులు, విశీర్ణరత్నకవచమ్ - ముక్కలైన రత్నములు పొదిగిన కవచము కలిగినట్టియు, విభ్రష్ట-ఆభరణస్రజమ్ - చెల్లాచెదరైన ఆభరణములు మాలలు కలిగినట్టియు, శరనిర్భిన్నహృదయమ్ - బాణములచే కోసివేయబడిన గుండెకాయ కలిగినట్టియు, మృధే - యుద్ధభూమియందు, శయానమ్ - పడి ఉన్నట్టియు, అసృక్-ఆవిలమ్ - రక్తముచే వ్యాకులమైనట్టియు, ప్రకీర్ణకేశమ్ - చెల్లాచెదరైన జుట్టు కలిగినట్టియు, ధ్వస్త-అక్షమ్ - ధ్వస్తమైన కన్నులు కలిగినట్టియు, రభసా - కోపముతో, దష్టదచ్ఛదమ్ - కొరుకబడిన పెదవి కలిగినట్టియు, రజఃకుంఠముఖ-అంభోజమ్ - దుమ్ము కొట్టుకొనియున్న పద్మమువంటి ముఖము కలిగినట్టియు, ఛిన్న-ఆయుధభుజమ్ - ముక్కలైన ఆయుధములు భుజములు కలిగిన, తం ఉప - వాని చుట్టూ, ఆసత - కూర్చుండిరి.

ఉశీనర దేశములో సుయజ్ఞుడు అని ప్రసిద్ధి గాంచిన రాజు ఉండెను. ఆయనను యుద్ధములో శత్రువులు సంహరించిరి. రత్నకవచము ముక్కలు కాగా, ఆభరణములు మాలలు చెల్లాచెదరు కాగా, బాణములు గుండెకాయను కోసివేయగా ఆయన యుద్ధభూమిలో పడియుండెను.

ఆయన శరీరమంతా రక్తము వ్యాకులముగా నుండెను. జుట్టు చెల్లాచెదరై, కన్నులు ధ్వస్తమై యుండెను. ఆయన పెదవి కోపముతో కొరుకబడి యుండెను. పద్మమును పోలిన ఆయన ముఖము దుమ్ముతో నిండియుం డెను. ముక్కలైన ఆయుధములు, చేతులు గల ఆయన దేహము చుట్టూ జ్ఞాతులు కూర్చుని యుండిరి.

ఉశీనరేంద్రం విధినా తథా కృతం
పతిం మహిష్యః ప్రసమీక్ష్య దుఃఖితాః ।
హతాస్స్మ నాథేతి కరైరురో భృశం
ఘ్నంత్యో ముహుస్తత్పదయోరుపాపతన్ ॥ 31

విధినా - దైవముచే, తథా - ఆ విధముగా, కృతమ్ - చేయబడిన ట్టియు, ఉశీనర-ఇంద్రమ్ - ఉశీనర దేశపు రాజైన, పతిమ్ - తమ భర్తను, ప్రసమీక్ష్య - దగ్గరగా చూచి, దుఃఖితాః - దుఃఖమును పొందిన, మహిష్యః - భార్యలు, నాథ - ఓ నాథా!, హతాః స్మ - చంపబడితిమి, ఇతి - అని, కరైః - చేతులతో, ఉరః - వక్షఃస్థలమును, ముహుః - పలుమార్లు, భృశమ్ - గట్టిగా, ఘ్నంత్యః - కొట్టుకొనువారై, తత్-పదయోః - ఆయన పాదము ల, ఉప - సమీపమునందు, ఆ అపతన్ - అంతటా పడిరి.

దైవము ఉశీనర దేశపు రాజైన తమ భర్తకు కలిగించిన ఆ స్థితిని దగ్గరగా చూచిన ఆయన భార్యలు దుఃఖిస్తూ -- ఓ నాథా! చంపబడితిమి -- అంటూ, చేతులతో పలుమార్లు గట్టిగా గుండెలపై బాదుకుంటూ, ఆయన పాదముల చుట్టూ నేలపై పడిరి.

రుదత్య ఉచ్చైర్దయితాంఘ్రిపంకజం
సించంత్య అస్రైః కుచకుంకుమారుణైః ।
విస్రస్తకేశాభరణాశ్శుచం నృణాం
సృజంత్య ఆక్రందనయా విలేపిరే ॥ 32

ఉచ్చైః - బిగ్గరగా, రుదత్యః - ఏడ్చుచున్నవారై, దయిత-అంఘ్రి పంకజమ్ - ప్రియుని పద్మమువంటి పాదమును, కుచకుంకుమ-అరుణైః -

స్తనములయందలి కుంకుమతో ఎఱ్ఱనైన, అస్రైః - కన్నీళ్లతో, సించంత్యః - తడుపుచున్నవారై, విస్రస్తకేశ-ఆభరణాః - చెల్లాచెదరైన జుట్టు ఆభరణ ములు గలవారై, నృణామ్ - జనులకు, ఆక్రందనయా - బిగ్గరగా రోదించు టచే, శుచమ్ - దుఃఖమును, సృజంత్యః - కలిగించుచున్నవారై, విలేపిరే - విలపించిరి.

వారు తమ ప్రియుని పాదపద్మములను స్తనములపైని కుంకు మతో ఎఱ్ఱనైన కన్నీటితో తడుపుతూ బిగ్గరగా రోదించిరి. చెల్లాచెదరైన జుట్టు, ఆభరణములు కలిగి బిగ్గరగా విలపిస్తున్న ఆ భార్యలను చూచిన జనులకు కూడ దుఃఖము కలుగుచుండెను.

అహో విధాత్రాऽకరుణేన నః ప్రభో
భవాన్ ప్రణీతో దృగగోచరాం దశామ్ ।
ఉశీనరాణామసి వృత్తిదః పురా
కృతోऽధునా యేన శుచాం వివర్ధనః ॥ 33

అహో - అయ్యో!, ప్రభో - ఓ ప్రభూ!, అకరుణేన - దయ లేని, విధాత్రా - విధాతచే, భవాన్ - నీవు, నః - మాకు, దృగ్-అగోచరామ్ - కళ్లకు కానరాని, దశామ్ - స్థితిని, ప్రణీతః - పొందించబడితివి, యేన - ఏ విధాతచే, పురా - పూర్వము, ఉశీనరాణామ్ - ఉశీనర దేశమునకు, వృత్తిదః - జీవికను కల్పించినవాడవుగా, కృతః - చేయబడితివో, అధునా - ఇప్పుడు, శుచామ్ - దుఃఖములకు, వివర్ధనః - వృద్ధిని చేయువాడవు, అసి - అగుచున్నావు.

అయ్యో! ప్రభూ! విధాత దయ లేనివాడు. పూర్వములో నిన్ను ఉసీనర దేశవాసులకు రక్షకునిగా చేసిన ఆ విధాతయే ఇప్పుడు నిన్ను మా కంటికి కానరాని స్థితిని పొందించినాడు. అట్టి నీవు మాకు అధికమగు దుఃఖ మును మిగిల్చి దూరమైనావు.

త్వయా కృతజ్ఞేన వయం మహీపతే
కథం వినా స్యామ సుహృత్తమేన తే ।

తత్రానుయానం తవ వీర పాదయోః
శుశ్రూషతీనాం దిశ యత్ర యాస్యసి ॥ 34

మహీపతే - నేలను కౌగిలించుకున్న ఓ రాజా!, కృతజ్ఞేన - కృతజ్ఞుడవైనట్టియు, సుహృత్-తమేన - మిక్కిలి హితకారివగు, త్వయా వినా - నీవు లేకుండా, తే - నీ, వయమ్ - మేము, కథమ్ - ఏ విధముగా, స్యామ - జీవించెదము?, వీర - ఓ వీరుడా!, తవ - నీ, పాదయోః - రెండు పాదములకు, శుశ్రూషతీనామ్ - సేవను చేసే మాకు, తత్ర - అచటకు, అనుయానమ్ - వెంట వచ్చుటను, దిశ - ఆదేశించుము, యత్ర - ఎచ్చటకైతే, యాస్యసి - వెళ్లబోవుచున్నావో.

నేలను కౌగిలించుకొనియున్న ఓ మహారాజా! కృతజ్ఞుడవు, గొప్ప హితకారివి అగు నీవు లేకుండా నీ వారలమగు మేము ఎట్లు జీవించగలము? ఓ వీరా! మేము నీ రెండు కాళ్లను సేవించే వారము. నీవు వెళ్లే చోటకు మేము కూడ నీ వెంట వచ్చుటకు అనుమతినిమ్ము.

ఏవం విలపతీనాం వై పరిగృహ్య మృతం పతిమ్ ।
అనిచ్ఛతీనాం నిర్హారమర్కోऽస్తం సన్న్యవర్తత ॥ 35

ఏవమ్ - ఈ విధముగా, మృతమ్ - మరణించిన, పతిమ్ - భర్తను, పరిగృహ్య వై - గట్టిగా కౌగిలించుకొని, నిర్హారమ్ - శవమును మోసుకొనిపోవుటను, అనిచ్ఛతీనామ్ - ఇష్టపడని ఆ రాణులు, విలపతీనామ్ - దుఃఖించుచుండగా, అర్కః - సూర్యుడు, అస్తం సన్న్యవర్తత - అస్తమించెను.

ఆ రాణులీ విధముగా భర్త శవమును గట్టిగా కౌగిలించుకొని దుఃఖించుచుండిరి. శవమును తీసుకువెళ్లుటకు వారు అంగీకరించలేదు. ఇంతలో సూర్యుడు అస్తమించెను.

తత్ర హ ప్రేతబంధూనామాశ్రుత్య పరిదేవితమ్ ।
ఆహ తాన్ బాలకో భూత్వా యమస్స్వయముపాగతః ॥36

ప్రేతబంధూనామ్ - మరణించిన రాజుయొక్క బంధువుల, పరిదేవితమ్ - రోదనమును, ఆశ్రుత్య - విని, తత్ర - అచటకు, స్వయమ్ - స్వయముగా, యమః - యముడు, బాలకః - చిన్న పిల్లవాడు, భూత్వా - అయి, ఉపాగతః - వచ్చినవాడై, తాన్ - వారిని ఉద్దేశించి, ఆహ హ - పలికెనట.

మరణించిన రాజుయొక్క బంధువుల రోదనమును విని, యముడు స్వయముగా పిల్లవాని రూపములో అచటకు వచ్చి, వారితో ఇట్లు పలికెనట.

యమ ఉవాచ ।

అహో అమీషాం వయసాధికానాం
విపశ్యతాం లోకవిధిం విమోహః ।
యత్రాగతస్తత్ర గతం మనుష్యం
స్వయం సధర్మా అపి శోచంత్యపార్థమ్ ॥ 37

అహో - ఆశ్చర్యము!, వయసా - వయస్సుచే, అధికానామ్ - పెద్దవారైనట్టియు, లోకవిధిమ్ - జనుల విధానమును, విపశ్యతామ్ - విశేషముగా చూస్తూ ఉండే, అమీషామ్ - వీరలకు, విమోహః - అధికమగు వ్యామోహము, స్వయమ్ - తాము, సధర్మాః అపి - మృత్యువు అనే లక్షణము సమానముగా గలవారే అయిననూ, తత్ర - అచటకు, గతమ్ - వెళ్లిన, మనుష్యమ్ - మనిషిని గురించి, అపార్థమ్ - వ్యర్థముగా, శోచంతి - దుఃఖించుచున్నారు, యత్ర - ఎచటనుండైతే, ఆగతః - వచ్చినాడో.

యముడిట్లు పలికెను -- ఆశ్చర్యము! వీరు వయస్సులో పెద్దవారు, లోకములోని జన్మమరణములను విశేషముగా చూచినవారు. అయిననూ, వీరలకు వ్యామోహము మెండు. తాము స్వయముగా మరణించేవారే. ఒక మనిషి ఎక్కడ (ఈశ్వరుడు) నుండి వచ్చెనో అక్కడికే వెళ్లిపోయినప్పుడు, వీరా మనిషిని గురించి వ్యర్థముగా దుఃఖించుచున్నారు.

**అహో వయం ధన్యతమా యదత్ర**
**త్య క్తాః పితృభ్యాం న విచింతయామః ।**
**అభక్ష్యమాణా అబలా వృకాదిభిః**
**స రక్షితా రక్షతి యో హి గర్భే ॥ 38**

అహో - ఆహా!, వయమ్ - మేము, ధన్యతమాః - మిక్కిలి ధన్యులము, యత్ - ఎందువలననగా, పితృభ్యామ్ - తల్లిదండ్రులచే, త్య క్తాః - విడిచిపెట్ట బడినవారము, అబలాః - బలహీనులము, వృక-ఆదిభిః - తోడేలు మొదలగువాటిచే, అభక్ష్యమాణాః - భక్షించబడని వారము, న విచింతయామః - చింతిల్లుట లేదు, హి - ఏలయనగా, సః - వాడు, రక్షితా - రక్షించగలడు, యః - ఎవడైతే, గర్భే - గర్భమునందు, రక్షతి - రక్షించుచున్నాడో.

ఆహా! మేము మిక్కిలి ధన్యులము. ఎందుకంటే, తల్లిదండ్రులు వదిలిపెట్టిన దుర్బలులమే అయినా, మమ్ములను తోడేళ్లు మొదలగునవి తినివేయలేదు. మాకు చింతయే లేదు. ఎందుకంటే, గర్భములో ఉండగా రక్షించిన దేవుడే రక్షించగలడు.

**య ఇచ్ఛయేశస్సృజతీదమవ్యయో**
**య ఏవ రక్షత్యవలుంపతే చ యః ।**
**తస్యాబలాః క్రీడనమాహురీశితుః**
**చరాచరం నిగ్రహసంగ్రహే ప్రభుః ॥ 39**

అబలాః - ఓ అబలలారా!, అవ్యయః - వినాశము లేని, యః - ఏ. ఈశః - ఈశ్వరుడు, ఇచ్ఛయా - ఇచ్ఛచే, ఇదమ్ - ఈ జగత్తును, సృజతి - సృష్టించుచున్నాడో, యః ఏవ - ఏ ఈశ్వరుడే, రక్షతి - రక్షించుచున్నాడో, చ - మరియు, యః - ఏ ఈశ్వరుడు, అవలుంపతే - సంహరించుచున్నాడో, తస్య - ఆ, ఈశితుః - సర్వేశ్వరునకు, చర-అచరమ్ - కదిలే కదలని ప్రాణులతో కూడిన జగత్తును, క్రీడనమ్ - ఆట వస్తువుగా, ఆహుః - చెప్పెదరు, నిగ్రహసంగ్రహే - సంహరించుటయందు పాలించుటయందు, ప్రభుః - సమర్థుడు.

ఓ అబలలారా! అవినాశియగు ఈశ్వరుడే స్వేచ్ఛగా ఈ జగత్తును సృష్టించి రక్షించి ఉపసంహరించుచున్నాడు. ఆ సర్వేశ్వరునకు ఈ స్థావర జంగమాత్మకమగు జగత్తు ఆటవస్తువు అని మహాత్ములు చెప్పెదరు. ఆయన పాలించుటయందు, సంహరించుటయందు కూడ సమర్థుడు.

**పథిచ్యుతం తిష్ఠతి దిష్టరక్షితం గృహే స్థితం తద్విహతం వినశ్యతి,**
**జీవత్యనాథోఽపి తదీక్షితో వనే గృహేఽపి గుప్తోఽస్య హతో న జీవతి.**

పథి - దారియందు, చ్యుతమ్ - జారిపోయినది, దిష్టరక్షితమ్ - దైవముచే రక్షించబడినదై, తిష్ఠతి - చక్కగా ఉండును, గృహే - ఇంటి యందు, స్థితమ్ - ఉన్నది, తద్-విహతమ్ - ఆ ఈశ్వరునిచే ఉపేక్షించబ డినదై, వినశ్యతి - నశించుచున్నది, వనే - అడవియందు, అనాథః అపి - అనాథుడు కూడ, తద్-ఈక్షితః - ఆ ఈశ్వరునిచే రక్షించబడినవాడై, జీవతి - జీవించుచున్నాడు, అస్య - ఈ ఈశ్వరునకు, హతః - ఉపేక్షించబడినవా డు, గృహే - ఇంటియందు, గుప్తః అపి - రక్షించబడినవాడే అయిననూ, న జీవతి - జీవించుట లేదు.

దారిలో పడి ఉన్న వస్తువైనా ఈశ్వరునిచే రక్షించబడినదై చక్కగా ఉండును. ఇంటిలో భద్రము చేసిన వస్తువైననూ ఈశ్వరునిచే ఉపేక్షించబ డినచో నశించిపోవును. అడవిలో అనాథుడైన వ్యక్తి కూడ ఈశ్వరుని అను గ్రహముచే జీవించును. ఈశ్వరునిచే ఉపేక్షించబడిన వ్యక్తి ఇంటిలో రక్షణ ఉన్ననూ మరణించును.

**భూతాని తైస్తైర్నిజయోనికర్మభిర్భవంతి కాలే న భవంతి సర్వశః ।**
**న తత్ర హాత్మా ప్రకృతావపి స్థితస్తస్యా గుణైరన్యతమో నిబధ్యతే ॥**

సర్వశః - అన్ని, భూతాని - ప్రాణులు, తైః తైః - ఆయా, నిజయో నికర్మభిః - తమ జన్మలకు కారణమైన కర్మలచే, కాలే - ఒక కాలమునం దు, భవంతి - జన్మించును, న భవంతి - నశించును, తత్ర హ - అట్టి, ప్రకృతౌ - ప్రకృతికార్యమగు దేహమునందు, స్థితః అపి - ప్రకటమగుచున్న నూ, అన్యతమః - మిక్కిలి విలక్షణమగు, ఆత్మా - ఆత్మ, తస్యాః - ఆ ప్రకృతియొక్క, గుణైః - గుణములచే, న నిబధ్యతే - బంధించబడుటలేదు.

ప్రాణులన్నీ తమ తమ కర్మలకు అనురూపమగు దేహములతో ఒక కాలములో జన్మించి మరియొక కాలములో నశించును. ప్రకృతికార్యమగు అట్టి దేహమునందు ప్రకటమగుచున్ననూ, ఆత్మ మిక్కిలి విలక్షణమై నదగుటచే ప్రకృతిగుణములచే బంధించబడుట లేదు.

ఇదం శరీరం పురుషస్య మోహజం
యథా పృథగ్భౌతికమీయతే గృహమ్ ।
యథౌదకైః పార్థివతైజసైర్జనః
కాలేన జాతో వికృతో వినశ్యతి ।। 42

పురుషస్య - వ్యక్తికి, మోహజమ్ - వ్యామోహము వలన పుట్టిన, ఇదమ్ - ఈ, శరీరమ్ - శరీరము, గృహం యథా - ఇల్లు వలె, భౌతికమ్ - పంచభూతములతో నిర్మితమైనది, పృథక్ - వేరుగా, ఈయతే - తెలియబడుచున్నది, ఔదకైః - నీటి అంశములతో, పార్థివతైజసైః - పృథివి అగ్ని అంశములతో, జాతః యథా - పుట్టినది వలె, జనః - వ్యక్తి, కాలేన - కాలముచే, జాతః - పుట్టినవాడై, వికృతః - మార్పులు గలవాడై, వినశ్యతి - మరణించును.

వ్యక్తికి దేహమే తాను అనే వ్యామోహము వలన ఈ జన్మ కలిగినది. పంచభూతములతో తయారైన ఇంటిలో నివసించినా వ్యక్తి ఇంటికంటె వేరుగా ఉన్నాడు. అదే విధముగా వ్యక్తి తన స్వరూపములో దేహముకంటె విలక్షణుడై యున్నాడు. నీటి అంశములతో పుట్టే బుడగ మొదలగు పదార్థములు, అటులనే పృథివి అగ్ని అంశలతో పుట్టే పదార్థములు ఒక కాలములో పుట్టి మార్పులు చెంది మరియొక కాలములో నశించును. అదే విధముగా వ్యక్తి కూడ ఒక కాలములో పాంచభౌతికమగు దేహముతో జన్మించును. ఆ దేహములో మార్పులు రాగా ఆ వ్యక్తి మరియొక కాలములో మరణించును.

యథాఽనలో దారుషు భిన్న ఈయతే
యథాఽనిలో దేహగతః పృథక్ స్థితః ।

యథా నభస్సర్వగతం న సజ్జతే
తథా పుమాన్ సర్వగుణాశ్రయః పరః ॥ 43

యథా - ఏ విధముగానైతే, దారుషు - కట్టెలయందలి, అనలః - నిప్పు, భిన్నః - విలక్షణముగా, ఈయతే - తెలియబడుచున్నదో, యథా - ఏ విధముగానైతే, దేహగతః - దేహమును వ్యాపించియున్న, అనిలః - వాయువు, పృథక్ - విలక్షణమై, స్థితః - ఉన్నదో, యథా - ఏ విధముగానైతే, సర్వగతమ్ - సర్వవ్యాపకమగు, నభః - ఆకాశము, న సజ్జతే - సంగమును పొందదో, తథా - అదే విధముగా, పుమాన్ - పురుషుడు, సర్వగుణ-ఆశ్రయః - అన్ని గుణ (కార్య) ములకు ఆశ్రయుడై, పరః - అతీతుడు.

కట్టెలలో వ్యాపించియుండే నిప్పు కట్టెలకంటె విలక్షణముగనుండునని మనకు తెలియుచుండును. దేహమును వ్యాపించియుండే వాయువు దేహముకంటె విలక్షణముగనే యున్నది. సర్వవ్యాపకమైననూ ఆకాశమునకు దేనితోనైననూ సంగము లేదు. అదే విధముగా, పూర్ణ-ఆత్మ సత్త్వరజస్తమోగుణములకు, గుణకార్యములగు దేహాదులకు ఆశ్రయమే అయిననూ, వాటన్నింటికీ అతీతమే.

సుయజ్ఞో నన్వయం శేతే మూఢా యమనుశోచథ ।
యశ్శ్రోతా యోఽనువక్తేహ స న దృశ్యేత కర్హిచిత్ ॥ 44

మూఢాః - ఓ మూఢులారా!, అయమ్ - ఈ, సుయజ్ఞః నను - సుయజ్ఞుడైతే, శేతే - పడి యున్నాడు, యమ్ - ఎవనిగురించైతే, అనుశోచథ - మీరు దుఃఖించుచున్నారో, యః - ఎవడైతే, శ్రోతా - వినువాడో, యః - ఎవడైతే, అనువక్తా - సమాధానమును చెప్పువాడో, సః - ఆ జీవుడు, ఇహ - ఈ లోకమునందు, కర్హిచిత్ - ఏ కాలమునందైననూ, న దృశ్యేత - కానరాడు.

ఓ మూఢులారా! మీరు ఎవనికొరకైతే దుఃఖిస్తున్నారో, ఆ ఈ సుయజ్ఞుడు (దేహము) ఇక్కడనే పడియున్నాడు. ఇతరుల మాటలను విని వాటికి సమాధానమును చెప్పే జీవుడు (సూక్ష్మశరీరి) ఈ లోకములో ఏ కాలమునందైననూ కంటికి కానరాడు.

న శ్రోతా నానువక్తాయం ముఖ్యోఽప్యత్ర మహానసుః ।
యస్త్విహేంద్రియవానాత్మా స చాన్యః ప్రాణదేహయోః ॥45

అత్ర - ఈ దేహమునందు, మహాన్ - గొప్పదియగు, అసుః - ప్రాణము, ముఖ్యః అపి - ప్రముఖమైనదియే అయిననూ, అయమ్ - ఇది, శ్రోతా - వినేది, న - కాదు, అనువక్తా - సమాధానమును చెప్పేది, న - కాదు, తు - దీనికి భిన్నముగా, ఇహ - ఈ దేహమునందు, ఇంద్రియవాన్ - ఇంద్రియములు గల, యః - ఏ, ఆత్మా - ఆత్మ గలదో, సః చ - ఆ ఆత్మ, ప్రాణదేహయోః - ప్రాణము దేహములకు, అన్యః - విలక్షణమైనది.

ఈ దేహములో సకలచేష్టలకు ఆశ్రయమైన ప్రాణము గొప్పది, ప్రముఖమైనది (ముఖనాసికలయందు సంచరించేది). కాని, ఇతరుల మాటలను విని సమాధానము చెప్పేది ఈ ప్రాణము కాదు. ఈ దేహములోని ఇంద్రియముల ద్వారా సర్వమును సాక్షియై దర్శించే ఆత్మ దేహముకంటె, ప్రాణము కంటె విలక్షణమైనది.

భూతేంద్రియమనోలింగాన్ దేహానుచ్చావచాన్ విభుః ।
భజత్యుత్సృజతి హ్యన్యస్తచ్చాపి స్వేన తేజసా ॥ 46

భూత-ఇంద్రియమనః-లింగాన్ - పంచభూతములు ఇంద్రియములు మనస్సులచే నిర్ధారించబడే, ఉచ్చావచాన్ - గొప్ప తక్కువవియగు, దేహాన్ - దేహములను, విభుః - సర్వవ్యాపకము, అన్యః - విలక్షణము అగు ఆత్మ, భజతి - స్వీకరించుచున్నది, ఉత్సృజతి హి - విడిచిపెట్టుచున్నది కూడ, తత్ చ అపి - అట్టి ఆవరణమును కూడ, స్వేన - తన, తేజసా - వివేకబలముచే, ఉత్సృజతి - విడిచిపెట్టును.

పంచభూతముల కలయికయగు దేహముయొక్క ఉనికిని నిర్ధారించేది జ్ఞానేంద్రియములు, మనస్సు మాత్రమే. ఇట్టి దేహములలో కొన్ని గొప్పవి కాగా, మరికొన్ని నికృష్టములైనవి. సర్వవ్యాపకమగు ఆత్మ ఆయా దేహములను ఉపాధిగా స్వీకరించుచున్ననూ, దేహముకంటె విలక్షణముగనే యుండును. కావుననే వివేకముయొక్క బలముచే, జీవభావమును పొందియున్న ఆత్మ దేహాదులతోడి సంసర్గమును కూడ విడిచిపెట్టును.

యావల్లింగాన్వితో హ్యాత్మా తావత్ కర్మ నిబంధనమ్ ।
తతో విపర్యయః క్లేశో మాయాయోగోఽనువర్తతే ।। 47

ఆత్మా - ఆత్మ, యావత్ - ఎంతవరకైతే, లింగ-అన్వితః - లింగ దేహముతో కూడియుండునో, తావత్ హి - అంతవరకు మాత్రమే, కర్మ - కర్మ, నిబంధనమ్ - బంధహేతువు, తతః - దానివలన, విపర్యయః - ఆత్మ స్వరూపముకంటె భిన్నముగా గోచరించుట, క్లేశః - క్లేశము, మాయా యోగః - అవిద్యతోడి సంయోగము, అనువర్తతే - కొనసాగుచుండును.

ఎంతవరకైతే ఆత్మకు లింగశరీరము (మనస్సు ఇత్యాది) తో తాదాత్మ్యము ఉండునో, అంతవరకు మాత్రమే కర్మబంధము, దాని వలన ఆత్మ యందు దేహము మొదలగు అనాత్మల ధర్మముల అధ్యారోపము, దుఃఖము, అవిద్యతోడి సంయోగము కొనసాగుచునే యుండును.

వితథాభినివేశోఽయం యద్గుణేష్వర్థదృగ్వచః ।
యథా మనోరథస్స్వప్నస్సర్వమైంద్రియకం మృషా ।। 48

అయమ్ - ఇది, వితథ-అభినివేశః - మిథ్య అయిన (వ్యర్థమైన) పట్టుదల, యత్ - ఏదనగా, గుణేషు - గుణకార్యములయందు, అర్థదృక్ - వాస్తవమనే దృష్టి, వచః - వచనము, మనోరథః - మనోరథము, స్వప్నః యథా - కల వంటిది, ఐంద్రియకమ్ - ఇంద్రియములనుండి పుట్టే, సర్వమ్ - అంతా, మృషా - మిథ్య.

సత్త్వరజస్తమోగుణకార్యములగు సుఖదుఃఖాదులు సత్యమనే దృష్టి మరియు వచనము కూడ మిథ్య, వ్యర్థము అయిన పట్టుదల మాత్రమే. మనోరథములోని కల్పితవస్తువులు వలె, స్వప్నములోని ప్రపంచము వలె, ఇంద్రియముల వలన కలిగే జ్ఞానము (ఇంద్రియములచే గ్రహించబడే జగత్తు) అంతా మిథ్యయే.

అథ నిత్యమనిత్యం వా నేహ శోచంతి తద్విదః ।
నాన్యథా శక్యతే కర్తుం స్వభావశ్శోచతామితి ।। 49

అథ - కావున, ఇహ - ఈ లోకమునందు, నిత్యమ్ - నిత్యమగు ఆత్మను గురించి గాని, అనిత్యం వా - అనిత్యమగు దేహమును గురించి గాని, తద్-విదః - ఆ నిత్యానిత్యములనెరింగిన వారలు, న శోచంతి - దుఃఖించరు, శోచతామ్ - శోకించువారలకు కూడ, స్వభావః - స్వభావము, అన్యథా కర్తుమ్ - మరియొక విధముగా మార్చుటకు, న శక్యతే - సంభవము కాదు, ఇతి - అని.

కావున, ఈ లోకములో నిత్యానిత్యవస్తువివేకము గల వారలు నిత్యమగు ఆత్మను గురించి గాని, అనిత్యమగు దేహాదులను గురించి గాని శోకించరు. వాటిగురించి శోకించు వారలైననూ శోకించుటయే గాని, దేహాదుల స్వభావమగు అనిత్యత్వమును మార్చి నిత్యముగా చేయలేరు. కావున, శోకించుట వ్యర్థమని వివేకము గలవారికి తెలియును.

లుబ్ధకో విపినే కశ్చిత్పక్షిణాం నిర్మితోఽంతకః ।
వితత్య జాలం విదధే తత్ర తత్ర ప్రలోభయన్ ॥ 50

పక్షిణామ్ - పక్షులకు, అంతకః - మారకుడై, నిర్మితః - సృష్టించబడిన, లుబ్ధకః - వేటగాడు, కశ్చిత్ - ఒకడు, విపినే - అడవియందు, తత్ర తత్ర - అక్కడక్కడ, ప్రలోభయన్ - ఆశ పెట్టుచున్నవాడై, జాలమ్ - వలను, వితత్య - పన్ని, విదధే - విశేషముగా పట్టి యుంచెను.

వేటగాడొకడు అడవిలో అక్కడక్కడ పక్షులను ప్రలోభపెట్టే నూకలను చల్లి, వాటిపై వలను పన్ని, ఆ వలను గట్టిగా పట్టి యుంచెను. వేటగాళ్లను భగవంతుడు పక్షులను సంహరించుటకే సృష్టించినాడు కాబోలు!

కులింగమిథునం తత్ర విచరత్సమదృశ్యత ।
తయోః కులింగీ సహసా లుబ్ధకేన ప్రలోభితా ॥ 51

తత్ర - అచట, కులింగమిథునమ్ - వడ్రంగి పిట్టల జంట, విచరత్ - తిరుగాడుచున్నదై, సమదృశ్యత - కానవచ్చెను, తయోః - ఆ రెండింటిలో, కులింగీ - ఆడు పిట్ట, సహసా - వెంటనే, లుబ్ధకేన - వేటగానిచే, ప్రలోభితా - ప్రలోభపెట్ట బడినది.

ఆ అడవిలో ఒకచోట వడ్రంగి పిట్టల జంట తిరుగాడుతూ కనిపించెను. వాటిలోని ఆడు పిట్ట వేటగాడు చూపిన ఆశకు వెంటనే ప్రలోభమును పొందెను.

సాఽసజ్జత శిచస్తంత్ర్యాం మహిషీ కాలయంత్రితా ।
కులింగస్తాం తథాఽఽపన్నాం నిరీక్ష్య భృశదుఃఖితః ।
స్నేహాదకల్పః కృపణః కృపణాం పర్యదేవయత్ ॥ 52

శిచః - వలయొక్క, తంత్ర్యామ్ - త్రాటియందు, కాలయంత్రితా - మృత్యువుచే ప్రేరితమైన, సా - ఆ, మహిషీ - ఆడు పిట్ట, అసజ్జత - చిక్కుకొనెను, తథా - ఆ విధముగా, ఆపన్నామ్ - ఆపదలోనున్నట్టియు, కృపణామ్ - దీనమైన, తామ్ - ఆ పిట్టను, నిరీక్ష్య - చూచి, భృశదుఃఖితః - అధికమగు దుఃఖమును పొందినది, అకల్పః - ఏమీ చేయలేనిది, కృపణః - దీనమైనది అగు, కులింగః - మగ పిట్ట, స్నేహాత్ - ప్రేమ వలన, పర్యదేవయత్ - పరితపించెను.

ఆ ఆడు పిట్ట మృత్యువుచే ప్రేరేపించబడి వల త్రాటియందు చిక్కుకొనెను. ఆ విధముగా ఆపదలో పడి దీనమైయున్న ఆ వడ్రంగి పిట్టను చూచి మగ పిట్ట చాల దుఃఖమును పొందెను. తాను ఏమీ చేయలేక దీనముగానున్న ఆ మగ పిట్ట ప్రేమ వలన పరితపించెను.

అహో అకరుణో దేవః స్త్రియాఽఽకరుణయా విభుః ।
కృపణం మాఽనుశోచంత్యా దీనయా కిం కరిష్యతి ॥ 53

అహో - అయ్యో!, అకరుణః - దయ లేనివాడు, విభుః - సర్వవ్యాపకుడు అగు, దేవః - దేవుడు, ఆకరుణయా - మిక్కిలి దయ చూపదగినట్టియు, కృపణమ్ - దీనుడనగు, మా - నన్ను గురించి, అనుశోచంత్యా - శోకించుచున్నట్టియు, దీనయా - దీనురాలైన, స్త్రియా - ఆడు పక్షితో, కిమ్ - ఏమి, కరిష్యతి - చేయ బోవుచున్నాడు?

అయ్యో! దేవుడు సర్వవ్యాపకుడే అయినా దయ లేనివాడు. దీను డనగు నా గురించి దీనముగా దుఃఖిస్తూ ఉన్న ఈ నా ప్రియురాలు మిక్కిలి దయ చూపదగిన పక్షి. అట్టి ఈ పక్షిని దేవుడు ఏమి చేయబోవుచున్నాడో?

కామం నయతు మాం దేవః కిమర్ధేనాత్మనో హి మే ।
దీనేన జీవతా దుఃఖమనేన విధురాయుషా ॥ 54

దేవః - దేవుడు, మామ్ - నన్ను, కామమ్ - యథేచ్ఛగా, నయతు - తీసుకొనిపోవు గాక, హి - ఏలయనగా, ఆత్మనః - నాయొక్క, అర్ధేన - సగము అయినట్టియు, దీనేన - దీనమైనట్టియు, దుఃఖమ్ - దుఃఖ ముగా, జీవతా - జీవించే, అనేన - ఈ దేహముతో, విధుర-ఆయుషా - భార్య లేని జీవితముతో, మే - నాకు, కిమ్ - ఏమి ప్రయోజనము?

దేవుడు తన ఇచ్ఛవచ్చిన విధముగా నన్ను కూడ తీసుకొనిపోవు గాక! నా భార్య లేకుంటే నాలో సగము లేనట్లే. భార్య లేకుండా దుఃఖ ముగా జీవించే దీనమైన ఈ దేహముతో గాని, భార్య తోడు లేని ఆయుర్దా యముతో కాని నాకు పని యేమున్నది?

కథం త్వజాతపక్షాంస్తాన్ మాతృహీనాన్ బిభర్మ్యహమ్ ।
మందభాగ్యాః ప్రతీక్షంతే నీడే మే మాతరం ప్రజాః ॥ 55

అజాతపక్షాన్ - మొలవని రెక్కలు గలిగినట్టియు, మాతృహీనాన్ - తల్లి లేని, తాన్ - ఆ పిల్లలను, అహమ్ - నేను, కథమ్ - ఏ విధముగా, బిభర్మి - పోషించెదను? మే - నా, మందభాగ్యాః - దురదృష్టవంతులగు, ప్రజాః - పిల్లలు, నీడే - గూటియందు, మాతరమ్ - తల్లి గురించి, ప్రతీ క్షంతే - వేచి చూచుచున్నారు.

నా పిల్లలకింకనూ రెక్కలైననూ మొలవకుండానే తల్లికి దూరమై నారు. వారిని నేను ఎట్లు పోషించవలెను? నా పిల్లలు దురదృష్టవంతులు. వాళ్లు గూటిలో తల్లి కొరకు ఎదురు చూచుచుందురు.

ఏవం కులింగం విలపంతమారాత్
ప్రియావియోగాతురమశ్రుకంఠమ్ ।

స ఏవ తం శాకునికశ్శరేణ
వివ్యాధ కాలప్రహితో విలీనః ।। 56

ఏవమ్ - ఈ విధముగా, విలపంతమ్ - దుఃఖించుచున్నట్టియు, ప్రియావియోగ-ఆతురమ్ - ప్రియురాలి వియోగముచే పీడను పొందిన ట్టియు, అశ్రుకంఠమ్ - కన్నీటిచే బొంగురుపోయిన కంఠము కలిగిన, తమ్ - ఆ, కులింగమ్ - వడ్రంగి పిట్టను, కాలప్రహితః - మృత్యువుచే పంపబడి నవాడు, విలీనః - దాగియున్నవాడు అగు, సః - ఆ, శాకునికః ఏవ - పిట్టల వేటగాడే, ఆరాత్ - దగ్గరలో, శరేణ - బాణముతో, వివ్యాధ - కొట్టెను.

ఈ విధముగా ప్రియురాలి వియోగముచే పీడించబడిన ఆ వడ్రంగి పిట్ట కన్నీటితో బొంగురవోయిన కంఠముతో విలపించుచుండెను. ఇంతలో మృత్యుదేవతచే పంపించబడిన అదే వేటగాడు దగ్గరలోనే దాగియుండి ఆ పిట్టను కూడ బాణముతో కొట్టెను.

ఏవం యూయమపశ్యంత్య ఆత్మాపాయమబుద్ధయః ।
నైనం ప్రాప్స్యథ శోచంత్యః పతిం వర్షశతైరపి ।। 57

అబుద్ధయః - ఓ మూఢలారా!, ఏవమ్ - ఇదే విధముగా, ఆత్మా పాయమ్ - తమ మృత్యువును, అపశ్యంత్యః - తెలుసుకోని, యూయమ్ - మీరు, పతిమ్ - భర్తను గురించి, శోచంత్యః - దుఃఖించుచున్నవారై, ఏనమ్ - వీనిని, వర్షశతైః అపి - వందల సంవత్సరములచేనైననూ, న ప్రాప్స్యథ - పొందబోరు.

ఓ మూఢస్త్రీలారా! మీరు కూడ అదే విధముగా భర్తను గురించి దుఃఖిస్తున్నారే గాని, మీకు కూడ మృత్యువు వేచి ఉన్నదని తెలుసుకొనలే కున్నారు. మీరిట్లు వందల సంవత్సరములు దుఃఖించినా, ఈతడు మీకు లభించడు.

హిరణ్యకశిపురువాచ ।
బాల ఏవం ప్రవదతి సర్వే విస్మితచేతసః ।
జ్ఞాతయో మేనిరే సర్వమనిత్యమయథోత్థితమ్ ।। 58

బాలే - పిల్లవాడు, ఏవమ్ - ఈ విధముగా, ప్రవదతి - గొప్పగా చెప్పగా, విస్మితచేతసః - ఆశ్చర్యమును పొందిన మనస్సులు గల, జ్ఞాతయః - బంధువులు, సర్వే - అందరు, సర్వమ్ - సర్వమును, అనిత్యమ్ - అనిత్యముగా, అయథా-ఉత్థితమ్ - వాస్తవముగా లేకున్ననూ కన బడేదిగను, మేనిరే - తెలుసుకొనిరి.

హిరణ్యకశిపుడు ఇట్లు పలికెను --- చిన్న పిల్లవాడు ఇట్లు గొప్పగా చెప్పుచుండగా, బంధువులందరు తమ మనస్సులో ఆశ్చర్యమును పొందిరి. ఈ సర్వము అనిత్యము; వాస్తవముగా లేకున్ననూ, ఉన్నట్లు కనబడును -- అని వారు తెలుసుకొనిరి.

యమ ఏతదుపాఖ్యాయ తత్రైవాంతరధీయత ।
జ్ఞాతయోఽపి సుయజ్ఞస్య చక్రుర్యత్సాంపరాయికమ్ ॥ 59

యమః - యముడు, ఏతత్ - ఈ విధముగా, ఉపాఖ్యాయ - ఉపాఖ్యానమును చెప్పి, తత్ర ఏవ - అక్కడనే, అంతరధీయత - అంతర్ధానమయ్యెను, జ్ఞాతయః అపి - బంధువులు కూడ, సుయజ్ఞస్య - సుయజ్ఞునకు, సాంపరాయికమ్ - పరలోకమునకు చెందిన క్రియాకలాపము, యత్ - ఏది గలదో దానిని, చక్రుః - చేసిరి.

యముడీ విధముగా ఈ ఉపాఖ్యానమును చెప్పి అక్కడనే అంతర్ధానమాయెను. సుయజ్ఞుని బంధువులు ఆయన పరలోకప్రాప్తికి కావలసిన కర్మలను చేసిరి.

తతశ్శోచత మా యూయం పరం చాత్మానమేవ చ ।
క ఆత్మా కః పరో వాఽత్ర స్వీయః పారక్య ఏవ వా ।
స్వపరాభినివేశేన వినాఽజ్ఞానేన దేహినామ్ ॥ 60

తతః - కావున, యూయమ్ - మీరు, పరమ్ - ఇతరుని గురించి, ఆత్మానం ఏవ చ - తన గురించి కూడ, మా శోచత - దుఃఖించకుడు, దేహినామ్ - ప్రాణులలో, స్వపర-అభినివేశేన - తాను పరాయి అనే దురాగ్రహము అనే, అజ్ఞానేన వినా - అజ్ఞానము లేకుండా, ఆత్మా - తాను, కః

- ఎవడు?, పరః - పరాయి వాడు, కః వా - ఎవడు?, స్వీయః - తనది గాని, పారక్యః ఏవ వా - ఇతరులది గాని.

కాబట్టి, మీరు మీ గురించి గాని, ఇతరుల గురించి గాని శోకించకుడు. తాను, పరాయి అనే దురభిమానము జనులలో ఉండును. అదియే అజ్ఞానము. అదే లేకున్నచో, తాను ఎవరు? పరాయి ఎవరు? తన సొత్తు ఎయ్యది? ఇతరుల సొత్తు ఎయ్యది?

నారద ఉవాచ ।
ఇతి దైత్యపతేర్వాక్యం దితిరాకర్ణ్య సస్నుషా ।
పుత్రశోకం క్షణాత్త్యక్త్వా తత్త్వే చిత్తమధారయత్ ।। 61

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే
దితిశోకాపనయనం నామ ద్వితీయోఽధ్యాయః ।।

ఇతి - ఈ విధముగా, దైత్యపతేః - రాక్షసరాజగు హిరణ్యకశిపుని, వాక్యమ్ - వాక్యమును, ఆకర్ణ్య - విని, సస్నుషా - కోడలితో కూడియున్న, దితిః - దితి, క్షణాత్ - క్షణములో, పుత్రశోకమ్ - పుత్రుని గురించి శోకమును, త్యక్త్వా - విడిచిపెట్టి, తత్త్వే - ఆత్మతత్త్వమునందు, చిత్తమ్ - మనస్సును, అధారయత్ - నిలిపెను.

ఈ విధముగా రాక్షసరాజగు హిరణ్యకశిపుని వాక్యమును విని దితి కోడలుతో సహా పుత్రుని గురించి శోకించుటను క్షణములో విడిచిపెట్టెను. ఆమె ఆత్మతత్త్వముపై తన మనస్సును నిలిపెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
ప్రహ్లాదచరితమునందు దితిని హిరణ్యకశిపుడు ఓదార్చుట
అనే రెండవ అధ్యాయము ముగిసినది (2).

*****

# అథ తృతీయోఽధ్యాయః

## ప్రహ్లాదుని చరితము - హిరణ్యకశిపుడు వరములను కోరుట

నారద ఉవాచ ।
హిరణ్యకశిపూ రాజన్నజేయమజరామరమ్ ।
ఆత్మానమప్రతిద్వంద్వమేకరాజం వ్యధిత్సత ।। 1

రాజన్ - ఓ మహారాజా!, హిరణ్యకశిపుః - హిరణ్యకశిపుడు, ఆత్మానమ్ - తనను, అజేయమ్ - జయింప శక్యము కానట్టియు, అజర-అమరమ్ - వృద్ధాప్యము మరణము లేనట్టియు, అప్రతిద్వంద్వమ్ - ప్రతిపక్షి లేని, ఏకరాజమ్ - ఏకైక చక్రవర్తినిగా, వ్యధిత్సత - చేయగోరెను.

ఓ మహారాజా! హిరణ్యకశిపుడు తాను ఇతరులు జయించ శక్యము కాని ఏకైక చక్రవర్తి కాగోరెను. తనకు వృద్ధాప్యము గాని మరణము గాని ఉండరాదనియు, తనకు ఎదురుగా నిలిచే ప్రతిపక్షి ఉండకూడదనియు ఆతని ఆకాంక్ష.

స తేపే మందరద్రోణ్యాం తపః పరమదారుణమ్ ।
ఊర్ధ్వబాహుర్నభోదృష్టిః పాదాంగుష్ఠాశ్రితావనిః ।। 2

మందరద్రోణ్యామ్ - మందర పర్వతముయొక్క లోయయందు, ఊర్ధ్వబాహుః - పైకి చేతులు గలవాడు, నభః-దృష్టిః - ఆకాశమునందు చూపు గలవాడు, పాద-అంగుష్ఠ-ఆశ్రిత-అవనిః - కాలి బొటనవ్రేలిచే ఆశ్రయించబడిన నేల గలవాడు అగు, సః - ఆతడు, పరమదారుణమ్ - మిక్కిలి కఠినమగు, తపః - తపస్సును, తేపే - చేసెను.

ఆతడు మందరపర్వతలోయయందు కాలి బొటనవ్రేలిని మాత్రమే నేలపై ఆన్చి నిలబడి, చేతులు పైకెత్తి ఆకాశము వైపు చూస్తూ, మిక్కిలి కఠినమగు తపస్సును చేసెను.

జటాదీధితిభీ రేజే సంవర్తార్క ఇవాంశుభిః ।
తస్మింస్తపస్తప్యమానే దేవాః స్థానాని భేజిరే ॥ 3

జటాదీధితిభిః - జటల కాంతులచే, అంశుభిః - కిరణములచే, సంవర్త-అర్కః ఇవ - ప్రళయకాల సూర్యుడు వలె, రేజే - ప్రకాశించెను, తస్మిన్ - ఆతడు, తపః - తపస్సును, తప్యమానే - చేయుచుండగా, దేవాః - దేవతలు, స్థానాని - స్థానములను, భేజిరే - పొందిరి.

ఆతని జటల కాంతులు ప్రళయకాల సూర్యుని కిరణములను పోలి ప్రకాశించెను. ఆతడు తపస్సును చేయుచుండగా, దేవతలు తిరిగి తమ తమ స్థానము (పదవు) లను పొందిరి.

తస్య మూర్ధ్నస్సముద్భూతస్సధూమోఽగ్నిస్తపోమయః ।
తిర్యగూర్ధ్వమధో లోకానతపద్విష్వగీరితః ॥ 4

తస్య - వాని, మూర్ధ్నః - తలనుండి, సముద్భూతః - పుట్టినది, సధూమః - పొగతో కూడియున్నది, తపోమయః - తపస్సుచే వర్ధిల్ల జేయ బడినది అగు, అగ్నిః - అగ్ని, విష్వక్ - అంతటా, ఈరితః - వ్యాపించినదై, తిర్యక్ - అడ్డముగా, ఊర్ధ్వమ్ - పైన, అధః - క్రింద, లోకాన్ - లోకముల ను, అతపత్ - తపింప జేసెను.

వాని తలనుండి తపస్సుచే వర్ధిల్ల జేయబడిన అగ్ని పొగతో బాటుగా బయల్వెడలెను. అది అంతటా భూలోకమును మాత్రమే గాక ఊర్ధ్వలోకములను, పాతాళమును కూడ వ్యాపించి తపింప జేసెను.

చుక్షుభుర్నద్యుదన్వంతస్సద్వీపాద్రిశ్చచాల భూః ।
నిపేతుస్సగ్రహాస్తారా జజ్వలుశ్చ దిశో దశ ॥ 5

నదీ-ఉదన్వంతః - నదులు సముద్రములు, చుక్షుభుః - కలచి వేయ బడినవి, సద్వీప-అద్రిః - ద్వీపములతో పర్వతములతో కూడియు న్న, భూః - భూమి, చచాల - కంపించెను, సగ్రహాః - గ్రహములతో కూడి యున్న, తారాః - తారలు, నిపేతుః - నేల గూలినవి, దశ - పది, దిశః చ - దిక్కులు కూడ, జజ్వలుః - మండినవి.

నదులు, సముద్రములు కలచివేయ బడినవి. ద్వీపములతో మరియు పర్వతములతో సహా భూమి కంపించెను. గ్రహములు, తారలు నేల గూలినవి. పది దిక్కులు కూడ మండజొచ్చెను.

తేన తప్తా దివం త్యక్త్వా బ్రహ్మలోకం యయుస్సురాః ।
ధాత్రే విజ్ఞాపయామాసుర్దేవదేవ జగత్పతే ॥ 6

దైత్యేంద్రతపసా తప్తా దివి స్థాతుం న శక్నుమః ।
తస్య చోపశమం భూమన్ విధేహి యది మన్యసే ।
లోకా న యావన్నంక్ష్యంతి బలిహారాస్తవాభిభూః ॥ 7

తేన - దానిచే, తప్తాః - తపింప జేయబడిన, సురాః - దేవతలు, దివమ్ - స్వర్గమును, త్యక్త్వా - విడిచిపెట్టి, బ్రహ్మలోకమ్ - బ్రహ్మలోక మును గురించి, యయుః - వెళ్లిరి, ధాత్రే - బ్రహ్మగారి కొరకు, విజ్ఞాపయా మాసుః - విన్నవించు కొనిరి, దేవదేవ - ఓ దేవదేవా!, జగత్-పతే - జగ న్నాథా!, దైత్య-ఇంద్రతపసా - రాక్షసప్రభుడగు హిరణ్యకశిపుని తపస్సుచే, తప్తాః - తపింప జేయబడినవారము, దివి - స్వర్గమునందు, స్థాతుమ్ - నిలుచుటకు, న శక్నుమః - సమర్థులము కాము, భూమన్ - ఓ అనం తుడా!, అభిభూః - సర్వేశ్వరా!, మన్యసే యది - నీవు తలచుకునే పక్ష ములో, తస్య - ఆ తాపమునకు, ఉపశమమ్ - శాంతిని, విధేహి - చేయు ము, తవ - నీకు, బలిహారాః - పూజలనందించే, లోకాః - జనులు, యావత్ న నంక్ష్యంతి - ఎంతలో నశించిపోకుందురో.

ఆ అగ్నిచే తపింప జేయబడిన దేవతలు స్వర్గమును విడిచిపెట్టి బ్రహ్మలోకమునకు వెళ్లి, బ్రహ్మగారితో ఇట్లు విన్నవించు కొనిరి -- ఓ దేవ దేవా! జగన్నాథా! రాక్షసరాజగు హిరణ్యకశిపుని తపస్సుచే తపింప జేయ

బడిన మేము స్వర్గములో నిలువ లేకున్నాము. ఓ అనంతా! సర్వేశ్వరా! నీకు పూజలనందించే జనులు నశించే లోపులోనే, నీవు తలచుకున్నచో, ఆ అగ్నిని శాంతింప జేయుము.

తస్యాయం కిల సంకల్పశ్చరతో దుశ్చరం తపః ।
శ్రూయతాం కిం న విదితస్తవాథాపి నివేదితః ॥ 8

దుశ్చరమ్ - చేయ శక్యము కాని, తపః - తపస్సును, చరతః - చేయుచున్న, తస్య - వానియొక్క, సంకల్పః - సంకల్పము, అయం కిల - ఇది సుమా!, శ్రూయతామ్ - వినబడు గాక!, తవ - నీకు, న విదితః కిమ్ - తెలియదా యేమి?, అథాపి - అయినప్పటికీ, నివేదితః - విన్నవించ బడినది.

చేయ శక్యము కాని తపస్సును చేయుటలో వానికి ఒక సంకల్పము గలదు. అది మీకు తెలియకుండునా యేమి? అయినా, మేము విన్నవించెదము. వినుడు.

సృష్ట్వా చరాచరమిదం తపోయోగసమాధినా ।
అధ్యాస్తే సర్వధిష్ణ్యేభ్యః పరమేష్ఠీ నిజాసనమ్ ॥ 9

చర-అచరమ్ - స్థావరజంగమాత్మకమగు, ఇదమ్ - ఈ జగత్తును, తపః-యోగసమాధినా - తపస్సు అనే ఉపాయమునందలి నిష్ఠచే, సృష్ట్వా - సృష్టించి, పరమేష్ఠీ - బ్రహ్మగారు, సర్వధిష్ణ్యేభ్యః - ధామములన్నింటికంటె శ్రేష్ఠమైన, నిజ-ఆసనమ్ - తన స్థానమును, అధ్యాస్తే - అధిష్ఠించి యున్నాడు.

బ్రహ్మగారు తపోయోగమును నిష్ఠగా అనుష్ఠించి స్థావర జంగమాత్మకమగు ఈ జగత్తును సృష్టించి, ధామములన్నింటిలో శ్రేష్ఠమగు తన సత్యలోకమును అధిష్ఠించి యున్నాడు.

తదహం వర్ధమానేన తపోయోగసమాధినా ।
కాలాత్మనోశ్చ నిత్యత్వాత్సాధయిష్యే తథాత్మనః ॥ 10

అహమ్ - నేను, తథా - అదే విధముగా, వర్ధమానేన - వర్ధిల్లుచున్న, తపః-యోగసమాధినా - తపోయోగమునందలి నిష్ఠచే, కాల-ఆత్మనోః - కాలము ఆత్మలు, నిత్యత్వాత్ - నిత్యములగుట వలన, తత్ - ఆ స్థానమును, ఆత్మనః - నాకు, సాధయిష్యే - సాధించుకొనెదను.

నేను కూడ అదే విధముగా వర్ధిల్లే తపోయోగమునందలి నిష్ఠచే నాకు ఆ ప్రజాపతి స్థానమును సంపాదించుకొనెదను. ఎందుకంటే, దేహము నశించినా, ఆత్మ నశించదు. కాలము కూడ నిరంతరముగా ముందుకు పోతూనే ఉంటుంది. కావున, ఎంత కాలము పట్టినా, ఎన్ని జన్మలు వచ్చినా, ఆ స్థానమును సంపాదించెదను.

అన్యథేదం విధాస్యేఽహమయథాపూర్వమోజసా ।
కిమన్యైః కాలనిర్ధూతైః కల్పాంతే వైష్ణవాదిభిః ॥ 11

అహమ్ - నేను, ఓజసా - శక్తితో, ఇదమ్ - ఈ జగత్తును, అయథాపూర్వమ్ - ఇదివరలో లేని విధముగా, అన్యథా - మరియొక విధముగా, విధాస్యే - చేయగలను, కల్ప-అంతే - కల్పముయొక్క అంతమునందు, కాలనిర్ధూతైః - కాలముచే వినష్టమయ్యే, వైష్ణవ-ఆదిభిః - విష్ణులోకము మొదలగు, అన్యైః - ఇతరములైన ధామములచే, కిమ్ - ఏమి ప్రయోజనము?

నేను నా తపశ్శక్తితో ఈ జగత్తును మరియొక విధముగా ఇదివరలో ఎన్నడూ లేని విధముగా వ్యవస్థ చేసెదను (అనగా పాపము చేసినవారికి స్వర్గము, పుణ్యము చేయువారలకు నరకము కలుగునట్లు చేయుట ఇత్యాది). విష్ణులోకము, ధ్రువలోకము మొదలగు ధామములు కూడ కల్పము అంతమయ్యేసరికి కాలగర్భములో కలిసిపోయేవే. అట్టి ధామములతో నాకు పని యేమి?

ఇతి శుశ్రుమ నిర్బంధం తపః పరమమాస్థితః ।
విధత్స్వానంతరం యుక్తం స్వయం త్రిభువనేశ్వర ॥ 12

ఇతి - ఈ విధమైన, నిర్బంధమ్ - హఠమును గురించి, శుశ్రుమ - విని యున్నాము, పరమమ్ - సర్వాధికమైన, తపః - తపస్సును, ఆస్థితః - అనుష్ఠించినవాడు, త్రిభువన-ఈశ్వర - ముల్లోకములకు ప్రభువగు ఓ బ్రహ్మ!, అనంతరమ్ - తరువాతి, యుక్తమ్ - యోగ్యమగు కార్యమును, స్వయమ్ - స్వయముగా, విధత్స్వ - చేయుము.

ఆతడు ఈ విధమైన హఠమును కలిగియున్నాడని మేము విని యుంటిమి. ఆతడు సర్వాధికమైన తపస్సును చేసినాడు. ఓ బ్రహ్మ! నీవు ముల్లోకములకు ప్రభుడవు. ఈ విషయములో తరువాత చేయదగిన యోగ్యమగు కార్యమును నీవే స్వయముగా చేయుము.

తవాసనం ద్విజగవాం పారమేష్ఠ్యం జగత్పతే ।
భవాయ శ్రేయసే భూత్యై క్షేమాయ విజయాయ చ ।। 13

**జగత్-పతే** - ఓ జగన్నాథా!, తవ - నీ, పారమేష్ఠ్యమ్ - సర్వశ్రేష్ఠ మగు, ఆసనమ్ - స్థానము, ద్విజగవామ్ - వేదవేత్తలకు గోవులకు, భవాయ - వృద్ధి కొరకు, శ్రేయసే - కల్యాణము కొరకు, భూత్యై - సంపత్తి కొరకు, క్షేమాయ - క్షేమము కొరకు, చ - మరియు, విజయాయ - విజ యము కొరకు.

ఓ జగన్నాథా! సర్వశ్రేష్ఠమగు నీ సత్యలోక ధామము వేదవేత్తలకు మరియు గోవులకు వృద్ధిని, కల్యాణమును, సంపత్తిని, క్షేమమును, విజయ మును సమకూర్చుటకై ఉన్నది.

ఇతి విజ్ఞాపితో దేవైర్భగవానాత్మభూర్నృప ।
పరీతో భృగుదక్షాద్యైర్యయౌ దైత్యేశ్వరాశ్రమమ్ ।। 14

నృప - ఓ మహారాజా!, దేవైః - దేవతలచే, ఇతి - ఈ విధముగా, విజ్ఞాపితః - విన్నవించబడిన, ఆత్మభూః - స్వయంభువుడగు, భగవాన్ - బ్రహ్మ భగవానుడు, భృగుదక్ష-ఆద్యైః - భృగువు దక్షుడు మొదలగువారి చే, పరీతః - చుట్టువారబడినవాడై, దైత్య-ఈశ్వర-ఆశ్రమమ్ - రాక్షసరా జగు హిరణ్యకశిపుని ఆశ్రమమును గురించి, యయౌ - వెళ్లెను.

ఓ మహారాజా! దేవతలీ విధముగా విన్నవించగా, స్వయంభువు డగు బ్రహ్మభగవానుడు, భృగువు దక్షుడు మరీచి మొదలగు ప్రజాప తులతో గూడి, రాక్షసరాజగు హిరణ్యకశిపుని ఆశ్రమమునకు వెళ్లెను.

న దదర్శ ప్రతిచ్ఛన్నం వల్మీకతృణకీచకైః ।
పిపీలికాభిరాచీర్ణమేదస్త్వఙ్మాంసశోణితమ్ ।। 15

వల్మీకతృణకీచకైః - పుట్టలు గడ్డి వెదురు డొంకలచే, ప్రతిచ్ఛ న్నమ్ - కప్పివేయబడినట్టియు, పిపీలికాభిః - చీమలచే, ఆచీర్ణమేదః-త్వక్ -మాంసశోణితమ్ - అంతటా తినివేయబడిన క్రొవ్వు చర్మము మాంసము రక్తము కలిగిన హిరణ్యకశిపుని, న దదర్శ - కానలేదు.

హిరణ్యకశిపుని పుట్టలు, గడ్డి, వెదురు డొంకలు కప్పి వేసినవి. ఆతని దేహములోని క్రొవ్వు, చర్మము, మాంసము, రక్తములను చీమలు అంతటా తినివేసినవి. ఆతడు బ్రహ్మగారికి కనబడనే లేదు.

తపంతం తపసా లోకాన్ యథాఽభ్రాపిహితం రవిమ్ ।
విలక్ష్య విస్మితః ప్రాహ ప్రహసన్ హంసవాహనః ।। 16

అభ్ర-అపిహితమ్ - మేఘములచే కప్పివేయబడిన, రవిం యథా - సూర్యుని వలె, తపసా - తపస్సుచే, లోకాన్ - లోకములను, తపంతమ్ - తపింప జేయుచున్న హిరణ్యకశిపుని, విలక్ష్య - చూచి, విస్మితః - ఆశ్చ ర్యపోయిన, హంసవాహనః - హంస వాహనముగా గల బ్రహ్మగారు, ప్రహ సన్ - నవ్వుచున్నవాడై, ప్రాహ - పలికెను.

మేఘములచే కప్పివేయబడిన సూర్యుడు వలె తన తపస్సుచే లోకములను తపింప జేయుచున్న హిరణ్యకశిపుని చూచి, హంసవాహను డగు బ్రహ్మగారు ఆశ్చర్యపోయి నవ్వుతూ ఇట్లు పలికెను.

బ్రహ్మోవాచ ।
ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రం తే తపస్సిద్ధోఽసి కాశ్యప ।
వరదోఽహమనుప్రాప్తో వ్రియతామీప్సితో వరః ।। 17

కాశ్యప - కశ్యపుని పుత్రుడవగు ఓ హిరణ్యకశిపూ!, ఉత్-తిష్ఠ - లెమ్ము, ఉత్తిష్ఠ - లెమ్ము, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!, తపః-సిద్ధః - తపస్సునందు సిద్ధిని పొందినవాడవు, అసి - అగుదువు, వరదః - వరములనిచ్చే, అహమ్ - నేను, అనుప్రాప్తః - వచ్చియున్నవాడను, ఈప్సితః - అభీష్టమైన, వరః - వరము, వ్రియతామ్ - కోరబడు గాక!

ఓ కశ్యప నందనా! లెమ్ము, లెమ్ము. నీకు మంగళమగు గాక! నీ తపస్సు సిద్ధించినది. వరములనిచ్చే నేను విచ్చేసినాను. నీకు ఇష్టమైన వరమును కోరుకొనుము.

అద్రాక్షమహమేతత్తే హృత్సారం మహదద్భుతమ్ ।
దంశభక్షితదేహస్య ప్రాణా హ్యస్థిషు శేరతే ॥ 18

అహమ్ - నేను, ఏతత్ - ఈ, తే - నీయొక్క, మహత్ - గొప్ప, అద్భుతమ్ - ఆశ్చర్యమును గొల్పే, హృత్-సారమ్ - హృదయమునందలి బలమును, అద్రాక్షమ్ - చూచితిని, హి - ఏలయనగా, దంశభక్షితదేహస్య - అడవి ఈగలు మొదలగువాటిచే భక్షించబడిన దేహము గల నీ, ప్రాణాః - ప్రాణములు, అస్థిషు - ఎముకలయందు, శేరతే - నిలిచియున్నవి.

గొప్ప ఆశ్చర్యమును గొల్పే నీ హృదయమునందలి బలమును నేను చూచితిని. ఎందుకంటే, అడవి ఈగలు మొదలగునవి దేహమును తినివేసినవి. అయిననూ, నీ ప్రాణములు ఎముకలయందు నిలిచియున్నవి.

నైతత్పూర్వర్షయశ్చక్రుర్న కరిష్యంతి చాపరే ।
నిరంబుర్ధారయేత్ప్రాణాన్ కో వై దివ్యసమాశ్శతమ్ ॥ 19

పూర్వ-ఋషయః - పూర్వమునందలి మహర్షులు, ఏతత్ - ఇట్టి తపస్సును, న చక్రుః - చేయలేదు, అపరే చ - ఇతరులగు మహర్షులు కూడ, న కరిష్యంతి - భవిష్యత్తులో చేయలేరు, కః వై - ఎవ్వాడు, శతమ్ - వంద, దివ్యసమాః - దివ్యసంవత్సరములను, నిరంబుః - నీరు త్రాగనివాడై, ప్రాణాన్ - ప్రాణములను, ధారయేత్ - నిలిపియుంచ గల్గును?

పూర్వమునందలి మహర్షులు ఇట్టి తపస్సును చేయలేదు, భవిష్య త్తులో ఇతరులు చేయబోరు. వంద దివ్యసంవత్సరముల కాలము నీటినైనను త్రాగకుండా ప్రాణములను ఎవరు నిలిపి యుంచగలరు?

వ్యవసాయేన తేఽనేన దుష్కరేణ మనస్వినామ్ ।
తపోనిష్ఠేన భవతా జితోఽహం దితినందన ॥ 20

దితనందన - ఓ దితిపుత్రా!, మనస్వినామ్ - ధైర్యశాలురకు, దుష్కరేణ - చేయ శక్యము కాని, తే - నీయొక్క, అనేన - ఈ, వ్యవసాయేన - సాధనచే, తపః-నిష్ఠేన - తపస్సునందు నిష్ఠ గల, భవతా - నీచే, అహమ్ - నేను, జితః - జయించ బడితిని.

దితిపుత్రుడవగు ఓ హిరణ్యకశిపూ! ధైర్యశాలురగు మహర్షులు సైతము చేయ శక్యము కాని గొప్ప తపస్సును నీవు చేసితివి. నీ తపోనిష్ఠచే నేను నీకు వశుడనైతిని.

తతస్త ఆశిషస్సర్వా దదామ్యసురపుంగవ ।
మర్త్యస్య తే అమర్త్యస్య దర్శనం నాఫలం మమ ॥ 21

అసురపుంగవ - ఓ రాక్షసశ్రేష్ఠా!, తతః - అందువలన, తే - నీ కొరకు, సర్వాః - సకలములైన, ఆశిషః - కామనలను, దదామి - ఇచ్చెదను, మర్త్యస్య - మరణించే స్వభావము గల, తే - నీకు, అమర్త్యస్య - మరణించని, మమ - నాయొక్క, దర్శనమ్ - దర్శనము, అఫలమ్ - ఫలము లేనిది, న - కాదు.

ఓ రాక్షసశ్రేష్ఠా! కావున, నేను నీ కోరికలనన్నింటినీ తీర్చెదను. మరణించే స్వభావము గల మానవుడవు నీవు. మరణము లేని దేవుడను నేను. నీకు నా దర్శనమైనది. అట్టి నీకు నా దర్శనము వృథా కాబోదు.

నారద ఉవాచ ।
ఇత్యుక్త్వాఽఽదిభవో దేవో భక్షితాంగం పిపీలికైః ।
కమండలుజలేనౌక్షద్దివ్యేనామోఘరాధసా ॥ 22

ఆదిభవః - సృష్ట్యాదియందు ప్రకటమైన, దేవః - బ్రహ్మదేవుడు, ఇతి - అని, ఉక్త్వా - పలికి, పిపీలికైః - చీమలచే, భక్షిత-అంగమ్ - తినివే యబడిన అవయవములు గల హిరణ్యకశిపుని, దివ్యేన - దివ్యమైనట్టి యు, అమోఘరాధసా - అమోఘమగు ప్రభావము గల, కమండలుజలేన - కమండలమునందలి నీటితో, ఔక్షత్ - చల్లెను.

నారదుడిట్లు పలికెను --- సృష్ట్యాదియందు ప్రకటమైన ఆ బ్రహ్మ దేవుడు ఈ విధముగా పలికెను. హిరణ్యకశిపుని దేహమును చీమలు తిని వేసెను. అపుడాయన తన కమండలమునందలి దివ్యజలమును ఆతనిపై చల్లెను. ఆ నీటియొక్క ప్రభావము అమోఘమైనది.

స తత్కీచకవల్మీకాత్ సహఓజోబలాన్వితః ।
సర్వావయవసంపన్నో వజ్రసంహననో యువా ।
ఉత్థితస్తప్తహేమాభో విభావసురివైధసః ॥ 23

తత్ - దానివలన, సహః-ఓజః-బల-అన్వితః - మనశ్శక్తి ఇంద్రి యశక్తి దేహశక్తులతో కూడియున్నవాడు, సర్వ-అవయవసంపన్నః - అన్ని అవయవములతో ఒప్పారువాడు, వజ్రసంహననః - వజ్రమువలె గట్టిదైన శరీరము గలవాడు, యువా - యువకుడు, తప్తహేమ-ఆభః - పుటము పెట్టిన బంగారముయొక్క ప్రకాశము గలవాడు అగు, సః - ఆతడు, కీచకవ ల్మీకాత్ - వెదురు డొంకలచే కప్పివేయబడిన చీమల పుట్టనుండి, ఏధసః - కట్టెనుండి, విభావసుః ఇవ - అగ్ని వలె, ఉత్థితః - లేచినాడు.

ఆయన నీటిని చల్లుట వలన హిరణ్యకశిపుడు వెదురుడొంకలతో కప్పివేయబడియున్న చీమల పుట్టనుండి, కట్టెనుండి అగ్ని వలె, లేచి నిలబ డెను. అన్ని అవయవములతో ఒప్పారే ఆతని దేహము వజ్రము వలె దృఢ ముగ నుండెను. ఆతనియందు మనశ్శక్తి, ఇంద్రియశక్తి, దేహశక్తి నిండుగా నుండెను. ఆతడు పుటము పెట్టిన బంగారము వలె ప్రకాశించెను.

స నిరీక్ష్యాంబరే దేవం హంసవాహమవస్థితమ్ ।
ననామ శిరసా భూమౌ తద్దర్శనమహోత్సవః ॥ 24

తద్-దర్శనమహా-ఉత్సవః - ఆ బ్రహ్మగారిని దర్శించుటచే గొప్ప ఉత్సాహము గల, సః - ఆ హిరణ్యకశిపుడు, అంబరే - ఆకాశము నందు, అవస్థితమ్ - ఉన్నట్టియు, హంసవాహమ్ - హంస వాహనముగా గల, దేవమ్ - బ్రహ్మదేవుని, నిరీక్ష్య - చూచి, భూమౌ - నేలపై, శిరసా - శిరస్సుతో, ననామ - నమస్కరించెను.

ఆ హిరణ్యకశిపుడు ఆకాశములో హంసవాహనముపైనున్న బ్రహ్మదేవుని చూచి గొప్ప ఉత్సాహమును పొందెను. అపుడాతడు నేలపై తలను ఆన్చి నమస్కరించెను.

ఉత్థాయ ప్రాంజలిః ప్రహ్వ ఈక్షమాణో దృశా విభుమ్ ।
హర్షాశ్రుపులకోద్భేదో గిరా గద్గదయాఽగృణాత్ ॥ 25

ప్రాంజలిః - చేతులు జోడించినవాడు, ప్రహ్వః - వినయముతో వంగినవాడు, దృశా - చూపుతో, విభుమ్ - బ్రహ్మదేవుని, ఈక్షమాణః - చూచుచున్నవాడు, హర్ష-అశ్రుపులక-ఉద్భేదః - గొప్ప హర్షముచే కన్నీరు గగుర్పాటు గలవాడు అగు హిరణ్యకశిపుడు, ఉత్థాయ - పైకి లేచి, గద్గదయా - బొంగురువోయిన, గిరా - వాక్కుతో, అగృణాత్ - స్తుతించెను.

బ్రహ్మదేవుని చూస్తూ ఉంటే హిరణ్యకశిపునకు గొప్ప హర్షముచే కన్నీరు స్రవించెను, ఒళ్లంతా గగుర్పాటు కలిగెను. ఆతడు పైకి లేచి చేతులు జోడించి, వినయముతో తలను వంచి బ్రహ్మగారికేసి చూస్తూ ఇట్లు స్తుతించెను.

హిరణ్యకశిపురువాచ ।
కల్పాంతే కాలసృష్టేన యోఽంధేన తమసాఽఽవృతమ్ ।
అభివ్యనగ్ జగదిదం స్వయంజ్యోతిస్స్వరోచిషా ॥ 26

ఆత్మనా త్రివృతా చేదం సృజత్యవతి లుంపతి ।
రజస్సత్త్వతమోధామ్నే పరాయ మహతే నమః ॥ 27

కల్ప-అంతే - కల్పముయొక్క అంతమునందు, కాలసృష్టేన - కాలముచే సృష్టించబడిన, అంధేన - దట్టని, తమసా - తమస్సుచే, ఆవృ

**తమ్** - ఆవరించబడియున్న, ఇదమ్ - ఈ, జగత్ - జగత్తును, స్వయం **జ్యోతిః** - స్వయంప్రకాశ స్వరూపుడగు, యః - ఏ పరమాత్మ, స్వరోచిషా - తన చైతన్యప్రకాశముచే, అభివ్యనగ్ - అభివ్యక్తము చేసెనో, త్రివృతా - సత్త్వరజస్తమోగుణాత్మకమగు (పృథివి, జలము, తేజస్సుల రూపమగు), ఆత్మనా - తనచేతనే, ఇదమ్ - ఈ జగత్తును, సృజతి - సృష్టించుచున్నాడో, అవతి - రక్షించుచున్నాడో, లుంపతి చ - ఉపసంహారమును కూడ చేయుచున్నాడో, రజః-సత్త్వ-తమః-ధామ్నే - రజస్సత్త్వతమోగుణములకు ఆశ్రయమైనట్టియు, మహతే - సర్వవ్యాపకుడగు, పరాయ - పరమేశ్వరుని కొరకు, నమః - నమస్కారము.

కల్పము అంతమైనప్పుడు కాలముయొక్క ప్రభావముచే ఈ జగత్తు దట్టని తమోగుణముచే కప్పివేయబడి యుండెను. స్వయంప్రకాశ స్వరూపుడగు పరమేశ్వరుడు అట్టి జగత్తును తన చైతన్యప్రకాశముతో ప్రకటము చేసెను. ఆయన తన మాయాశక్తియొక్క సత్త్వరజస్తమోగుణముల ద్వారా తానే పృథివి-నీరు-తేజస్సుల రూపముగా ప్రకటమై, వాటి ద్వారా ఈ జగత్తును సృష్టించి, రక్షించి, ఉపసంహారము చేయుచున్నాడు. సర్వ వ్యాపకుడగు అట్టి పరమేశ్వరుని కొరకు నమస్కారము.

నమ ఆద్యాయ బీజాయ జ్ఞానవిజ్ఞానమూర్తయే ।
ప్రాణేంద్రియమనోబుద్ధివికారైర్వ్యక్తిమీయుషే ।। 28

ఆద్యాయ - మొట్టమొదటి, బీజాయ - కారణమైనట్టియు, జ్ఞానవిజ్ఞానమూర్తయే - శుద్ధచైతన్యము దానియందు ప్రకటమయ్యే విశిష్టజ్ఞానములే స్వరూపముగా గలిగినట్టియు, ప్రాణ-ఇంద్రియమనః-బుద్ధివికారైః - ప్రాణము ఇంద్రియములు మనస్సు బుద్ధి అనే రూపముగా, వ్యక్తిమ్ - కార్యరూపమును, ఈయుషే - పొందియున్న పరమేశ్వరుని కొరకు, నమః - నమస్కారము.

జగత్తునకు మూలకారణము పరమేశ్వరుడే. శుద్ధచైతన్యస్వరూపుడగు ఆయనయే ప్రాణుల అంతఃకరణములయందు వివిధములగు విశేష జ్ఞానముల రూపముగా ప్రకటమగుచున్నాడు. ప్రాణము, ఇంద్రియములు,

మనస్సు, బుద్ధి అనే కార్యముల రూపముగా ఆయనరూపే ప్రకటమై యున్నాడు. అట్టి పరమేశ్వరుని కొరకు నమస్కారము.

త్వమీశిషే జగతస్తస్థుషశ్చ ప్రాణేన ముఖ్యేన పతిః ప్రజానామ్ ।
చిత్తస్య చిత్తేర్మనఇంద్రియాణాం పతిర్మహాన్ భూతగుణాశయేశః॥

జగతః - కదిలే ప్రాణికి, తస్థుషః చ - కదలని ప్రాణికి కూడ, ముఖ్యేన - సర్వాతిశాయియగు, ప్రాణేన - జగచ్ఛక్తి (సూత్రాత్మ) రూపముగా, త్వమ్ - నీవు, ఈశిషే - నియంతవు అగుచున్నావు, ప్రజానామ్ - ప్రజలకు, పతిః - ప్రభుడవు, చిత్తస్య - చిత్తము (స్మరణము) నకు, చిత్తేః - బుద్ధికి, మనః-ఇంద్రియాణామ్ - మనస్సునకు ఇంద్రియములకు, పతిః - ప్రభుడవు, మహాన్ - సర్వాతిశాయివి, భూతగుణ-ఆశయ-ఈశః - పంచ భూతములకు వాటి గుణములైన శబ్దము మొదలగు విషయములకు వాటి సంస్కారములకు నియామకుడవు.

సర్వజగద్వ్యాపకమగు మహాశక్తి (ముఖ్యప్రాణము, లేక సూత్రాత్మ) రూపముగా నీవు స్థావరజంగమములగు ప్రాణులకు అంతర్యామివై యున్నావు. ప్రాణులకు ప్రభుడవు నీవే. ప్రాణులలోని స్మృతి, బుద్ధి, మనస్సు, ఇంద్రియములకు ప్రభుడవు నీవే. సర్వోత్కృష్టుడవగు నీవే పంచభూతములను, వాటి గుణములైన శబ్దాదులను, వాటి సంస్కారములను కూడ నియమించెదవు.

త్వం సప్తతంతూన్ వితనోషి తన్వా
త్రయ్యా చాతుర్హోత్రకవిద్యయా చ ।
త్వమేక ఆత్మాఽఽత్మవతామనాదిః
అనంతపారః కవిరంతరాత్మా ॥ 30

త్వమ్ - నీవు, చాతుర్హోత్రకవిద్యయా - నల్గురు ఋత్విక్కులచే చేయబడే యజ్ఞమును ప్రతిపాదించే విద్యయైన, త్రయ్యా - వేదమనే, తన్వా - దేహముతో, సప్తతంతూన్ - అగ్నిష్టోమము మొదలగు ఏడు యజ్ఞములను, వితనోషి - విస్తరింప జేయుచున్నావు, ఆత్మవతామ్ - ప్రాణులకు, ఏకః - ఒకే ఒక, అంతరాత్మా - అంతర్యామియగు, ఆత్మా -

ఆత్మ, త్వమ్ - నీవే, అనాదిః - కారణము లేనివాడవు, అనంతపారః - కాలమునందు గాని దేశమునందు గాని సీమలు లేనివాడవు, కవిః - సర్వజ్ఞుడవు.

హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ అనే నల్గురు ఋత్విక్కులచే నిర్వర్తించబడే యజ్ఞములను వేదము ప్రతిపాదించును. నీవు అట్టి వేదమే శరీరము కాగా -- అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థము, షోడశి, వాజపేయము, ఆప్తోర్యామము, అతిరాత్రములనే ఏడు యజ్ఞములను విస్తరింప జేయుచున్నావు. సర్వజ్ఞుడవు, అంతర్యామివి అగు నీవే సకలప్రాణుల అద్వయ-ఆత్మవు. సర్వకారణుడవగు నీకు దేశ-కాలపరిచ్ఛేదములు లేవు.

త్వమేవ కాలోऽనిమిషో జనానాం
ఆయుర్లవాద్యవయవైః క్షిణోషి ।
కూటస్థ ఆత్మా పరమేష్ఠ్యజో మహాన్
త్వం జీవలోకస్య చ జీవ ఆత్మా ॥ 31

త్వం ఏవ - నీవే, అనిమిషః - రెప్పపాటు లేని, కాలః - కాలము, జనానామ్ - ప్రాణులయొక్క, ఆయుః - ఆయుర్దాయమును, లవ-ఆది-అవయవైః - లవము క్షణము మొదలగు కాలఖండములచే, క్షిణోషి - క్షయింప జేయుచున్నావు, కూటస్థః - నిర్వికారమగు, ఆత్మా - ఆత్మవు, పరమేష్ఠీ - పరమేశ్వరుడవు, అజః - పుట్టుక లేనివాడవు, మహాన్ - సీమలు లేనివాడవు, చ - మరియు, త్వమ్ - నీవు, జీవలోకస్య - ప్రాణివర్గముయొక్క, జీవః - ప్రాణశక్తివి, ఆత్మా - ఆత్మవు.

నీవే రెప్పపాటునెరుగని కాలము రూపములో ప్రాణుల ఆయుర్దాయమును లవము, క్షణము మొదలైన కాలఖండముల ద్వారా క్షీణింప జేయుచున్నావు. పుట్టుక లేని పరమేశ్వరుడవగు నీవే సకలప్రాణులలో జీవశక్తి రూపముగా, ఆత్మచైతన్యరూపముగా ప్రకటమగుచున్నావు. నీకు పరిచ్ఛేదములు లేవు.

త్వత్తః పరం నాపరమప్యనేజదేజచ్చ కించిద్వ్యతిరిక్తమస్తి ।
విద్యాః కలాస్తే తనవశ్చ సర్వా హిరణ్యగర్భోఽసి బృహత్త్రిపృష్ఠః॥

పరమ్ - కారణము గాని, అపరం అపి - కార్యము గాని, ఏజత్ - కదిలేది గాని, అనేజత్ చ - కదలనిది గాని, త్వత్తః - నీకంటె, వ్యతిరిక్తమ్ - భిన్నమైనది, కించిత్ - ఏదైననూ, న అస్తి - లేదు, సర్వాః - అన్ని, విద్యాః - విద్యలు, కలాః - కళలు, తే - నీ, తనవః చ - శరీరములే, హిరణ్యగర్భః - హిరణ్యగర్భుడవు, అసి - అగుచున్నావు, త్రిపృష్ఠః - సత్త్వరజస్తమోగుణములకు మూడింటికి అతీతమగు, బృహత్ - పరబ్రహ్మవు.

కారణము గాని, కార్యము గాని, కదిలేది గాని, కదలనిది గాని నీకంటె భిన్నముగా ఏదీ లేదు. సకలవిద్యలు, కళలు నీ రూపములే. సర్వజగత్తునకు మూలమునందలి మహాశక్తి నీ స్వరూపమే. సత్త్వరజస్తమోగుణాత్మకమగు మాయకు అతీతమైన పరబ్రహ్మవు నీవే.

వ్యక్తం విభో స్థూలమిదం శరీరం
యేనేంద్రియప్రాణమనోగుణాంస్త్వమ్ ।
భుంక్షే స్థితో ధామని పారమేష్ఠ్య
అవ్యక్త ఆత్మా పురుషః పురాణః ॥ 33

విభో - ఓ ప్రభూ!, వ్యక్తమ్ - ప్రకటమైన, ఇదమ్ - ఈ జగత్తు, స్థూలమ్ - స్థూలమగు, శరీరమ్ - శరీరము, యేన - దేనిచే, పారమేష్ఠ్యే - సర్వోత్కృష్టమగు, ధామని - సత్యలోకమునందు, స్థితః - ఉండే, త్వమ్ - నీవు, ఇంద్రియప్రాణమనః-గుణాన్ - ఇంద్రియములు ప్రాణము అంతఃకరణముల విషయములను, భుంక్షే - భోగించుచున్నావో, అవ్యక్తః - ఇంద్రియగోచరము కాని, పురుషః - పూర్ణమగు, పురాణః - కాలాతీతమైన, ఆత్మా - ఆత్మవు.

సర్వవ్యాపకుడవగు ఓ ప్రభూ! నీనుండి ప్రకటమైన ఈ జగత్తు నీ స్థూలశరీరమే. నీవు సర్వాతిశాయియగు సత్యధామమునందుంటూనే, ఈ బ్రహ్మాండశరీరముతో ఇంద్రియములు, ప్రాణము, మనస్సుల విషయము

లను భోగించుచున్నావు. ఇంద్రియగోచరము కానిది, పూర్ణము, ప్రాణిదేహములయందు ఉపలభ్యమయ్యేది, కాలాతీతము అగు ఆత్మతత్త్వము నీవే.

అనంతావ్యక్తరూపేణ యేనేదమఖిలం తతమ్ ।
చిదచిచ్ఛక్తియుక్తాయ తస్మై భగవతే నమః ।। 34

అనంత - ఓ అనంతుడా!, యేన - ఎవనిచే, అవ్యక్తరూపేణ - ఇంద్రియగోచరము కాని రూపముచే, ఇదమ్ - ఈ జగత్తు, అఖిలమ్ - అంతా, తతమ్ - వ్యాప్తమై యున్నదో, చిద్-అచిత్-శక్తియుక్తాయ - చైతన్యశక్తియగు జ్ఞానముతో మరియు జడమగు మాయాశక్తితో కూడియున్న, తస్మై - అట్టి, భగవతే - భగవానుని కొరకు, నమః - నమస్కారము.

ఓ అనంతా! ఇంద్రియగోచరము కాని నీ రూపమే (చైతన్యము) ఈ జగత్తునంతనూ వ్యాపించి యున్నది. చైతన్యశక్తియగు జ్ఞానమునకు, జడశక్తియగు మాయకు నీవే అధిష్ఠానము. భగవానుడవగు అట్టి నీ కొరకు నమస్కారము.

యది దాస్యస్యభిమతాన్ వరాన్మే వరదోత్తమ ।
భూతేభ్యస్త్వద్విసృష్టేభ్యో మృత్యుర్మా భూన్మమ ప్రభో ।।35

వరద-ఉత్తమ - వరములనిచ్చువారిలో శ్రేష్ఠుడా!, ప్రభో - ఓ ప్రభూ!, మే - నా కొరకు, అభిమతాన్ - అభీష్టములైన, వరాన్ - వరములను, యది దాస్యసి - ఇవ్వబోవుచున్నచో, త్వద్-విసృష్టేభ్యః - నీచే సృష్టించబడిన, భూతేభ్యః - ప్రాణుల వలన, మమ - నాకు, మృత్యుః - మరణము, మా భూత్ - కలుగకుండు గాక!

ఓ ప్రభూ! నీవు వరములనిచ్చువారిలో ఉత్తముడవు. నాకు ఇష్టమైన వరములను నీవు ఈయబోయే పక్షములో -- నీచే సృష్టించబడిన ప్రాణుల వలన నాకు మరణము కలుగకుండు గాక!

నాంతర్బహిర్దివా నక్తమన్యస్మాదపి చాయుధైః ।
న భూమౌ నాంబరే మృత్యుర్న నరైర్న మృగైరపి ।। 36

వ్యసుభిర్వాఽసుమద్భిర్వా సురాసురమహోరగైః ।
అప్రతిద్వంద్వతాం యుద్ధే ఐకపత్యం చ దేహినామ్ ॥ 37

అంతః - లోపల, బహిః - బయట, దివా - పగలు, నక్తమ్ - రాత్రి, అన్యస్మాత్ అపి - నీచే సృష్టించబడిన ప్రాణికంటె భిన్నమైన ప్రాణి వలన కూడ, ఆయుధైః చ - ఆయుధములచే, మృత్యుః - మరణము, న - కలుగ రాదు, భూమౌ - నేలపై, న - కలుగరాదు, అంబరే - ఆకాశమునందు, న - కలుగరాదు, నరైః - మానవులచే, న - కలుగరాదు, మృగైః అపి - మృగ ములచే కూడ, న - కలుగరాదు, వ్యసుభిః వా - ప్రాణము లేనివాటిచే గాని, అసుమద్భిః వా - ప్రాణము గలవాటిచే గాని, సుర-అసురమహా-ఉ రగైః - దేవతలు రాక్షసులు గొప్ప నాగులచే గాని, యుద్ధే - యుద్ధమునం దు, అప్రతిద్వంద్వతామ్ - ఎదిరించి నిలబడే ప్రతిపక్షి లేకుండుటను, చ - మరియు, దేహినామ్ - ప్రాణులకు, ఐకపత్యమ్ - ఏకచ్ఛత్రాధిపతి అగుట ను.

లోపల గాని, బయట గాని, పగలు గాని, రాత్రి గాని, నేలపై గాని, ఆకాశమునందు గాని, మానవులచే గాని, మృగములచే గాని, నీచే సృష్టిం చబడని ప్రాణిచే ఆయుధములతో గాని, ప్రాణము లేనివాటిచే గాని, ప్రాణము ఉన్నవాటిచే గాని, దేవతలచే గాని, రాక్షసులచే గాని, గొప్ప నాగులచే గాని, నాకు మరణము కలుగరాదు. యుద్ధములో నా యెదుట నిలిచి పోరాడగలిగే ప్రతిపక్షి ఉండరాదు. ప్రాణులన్నింటికీ నేను ఏకచ్ఛత్రా ధిపతిని కావలెను.

సర్వేషాం లోకపాలానాం మహిమానం యథాఽఽత్మనః ।
తపోయోగప్రభావాణాం యన్న రిష్యతి కర్హిచిత్ ॥ 38

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే ప్రహ్లాదచరితే
హిరణ్యకశిపోర్వరయాచనం నామ తృతీయోఽధ్యాయః ॥

సర్వేషామ్ - అందరు, లోకపాలానామ్ - లోకపాలకులకు, యథా - ఏ విధముగానైతే, ఆత్మనః - నీయొక్క, మహిమానం - మహిమను, తపః-యోగప్రభావాణామ్ - తపోయోగముయొక్క ప్రభావము గలవారల,

యత్ - ఏ మహిమ, కర్హిచిత్ - ఏ కాలమునందైననూ, న రిష్యతి - నశించదో.

లోకపాలకులందరిలో నీ మహిమయే గలదు. అటువంటి మహిమను నాకు కూడ ఇమ్ము. తపోయోగముయొక్క ప్రభావము గల సిద్ధపురుషులయందలి అక్షయమగు ఐశ్వర్యమును కూడ నాకు ఇమ్ము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
ప్రహ్లాదచరితమునందు హిరణ్యకశిపుడు వరములను కోరుట
అనే మూడవ అధ్యాయము ముగిసినది (3).

*****

# అథ చతుర్థోऽధ్యాయః

## ప్రహ్లాదుని చరితము - ప్రహ్లాదుని గుణములను వర్ణించుట

నారద ఉవాచ ।
ఏవం వృతశ్శతధృతిర్హిరణ్యకశిపోరథ ।
ప్రాదాత్తత్తపసా ప్రీతో వరాంస్తస్య సుదుర్లభాన్।। 1

అథ - తరువాత, ఏవమ్ - ఈ విధముగా, వృతః - వరములు కోరబడినవాడై, తత్-తపసా - వాని తపస్సుచే, ప్రీతః - ప్రీతిని పొందిన, శతధృతిః - బ్రహ్మగారు, తస్య - ఆ, హిరణ్యకశిపోః - హిరణ్యకశిపునకు, సుదుర్లభాన్ - మిక్కిలి పొంద శక్యము కాని, వరాన్ - వరములను, ప్రాదాత్ - ఇచ్చెను

తరువాత హిరణ్యకశిపుని తపస్సుచే ప్రీతిని పొందిన బ్రహ్మగారు ఆతడీ విధముగా కోరగా, మిక్కిలి దుర్లభములైన ఆ వరములను ఆతనికి ఇచ్చెను

బ్రహ్మోవాచ ।
తాతేమే దుర్లభాః పుంసాం యాన్ వృణీషే వరాన్ మమ ।
తథాపి వితరామ్యంగ వరాన్ యదపి దుర్లభాన్ ।। 2

తాత - కుమారా!, ఇమే - ఈ వరములు, పుంసామ్ - మానవులకు, దుర్లభాః - పొంద శక్యము కానివి, యాన్ - ఏ, వరాన్ - వరములను, మమ - నానుండి, వృణీషే - కోరుచున్నావో, అంగ ఓయీ!, తదాపి - అయినప్పటికీ, దుర్లభాన్ యదపి - పొంద శక్యము కానివే అయినప్పటికీ, వరాన్ - వరములను, వితరామి - ఇచ్చుచున్నాను

వత్సా! నీవు నానుండి కోరిన వరములు మానవులకు పొంద శక్యము కానివి. ఓయీ! అయినప్పటికీ, నీకా వరములనిచ్చుచున్నాను.

**తతో జగామ భగవానమోఘానుగ్రహో విభుః ।**
**పూజితోఽసురవర్యేణ స్తూయమానః ప్రజేశ్వరైః ॥ 3**

తతః - తరువాత, అమోఘ-అనుగ్రహః - అమోఘమైన అనుగ్రహము గలవాడు, విభుః - సర్వసమర్థుడు అగు, భగవాన్ - బ్రహ్మదేవుడు, అసురవర్యేణ - రాక్షసశ్రేష్ఠుడగు హిరణ్యకశిపునిచే, పూజితః - పూజించబడినవాడై, ప్రజా-ఈశ్వరైః - ప్రజాపతులచే, స్తూయమానః - కొనియాడబడుచున్నవాడై, జగామ - వెళ్లెను.

తరువాత, బ్రహ్మదేవుడు రాక్షసశ్రేష్ఠుడగు హిరణ్యకశిపుని పూజల నందుకొని, ప్రజాపతులు స్తుతించుచుండగా వెళ్లెను. సర్వసమర్థుడగు ఆయన అనుగ్రహము అమోఘమైనది.

ఏవం లబ్ధవరో దైత్యో బిభ్రద్ధేమమయం వపుః ।
భగవత్యకరోద్ద్వేషం భ్రాతుర్వధమనుస్మరన్ ॥ 4

ఏవమ్ - ఈ విధముగా, లబ్ధవరః - పొందబడిన వరములు గల, దైత్యః - ఆ రాక్షసుడు, హేమమయమ్ - బంగారము వలె మెరిసిపోయే, వపుః - శరీరమును, బిభ్రత్ - కలిగియున్నవాడై, భ్రాతుః - సోదరుని, వధమ్ - వధను, అనుస్మరన్ - గుర్తు చేసుకొనుచున్నవాడై, భగవతి - శ్రీహరి భగవానునియందు, ద్వేషమ్ - ద్వేషమును, అకరోత్ - చేసెను.

ఈ విధముగా వరములను పొందిన ఆ రాక్షసుని శరీరము బంగారము వలె మెరిసిపోయెను. అతడు తన సోదరుని వధను గుర్తు చేసుకొని, శ్రీహరి భగవానునియందు ద్వేషమును కలిగియుండెను.

స విజిత్య దిశస్సర్వా లోకాంశ్చ త్రీన్ మహాసురః ।
దేవాసురమనుష్యేంద్రాన్ గంధర్వగరుడోరగాన్ ॥ 5

సిద్ధచారణవిద్యాధ్రాన్ఋషీన్ పితృపతీన్ మనూన్ ।
యక్షరక్షఃపిశాచేశాన్ ప్రేతభూతపతీనథ ॥ 6

సర్వసత్త్వపతీన్ జిత్వా వశమానీయ విశ్వజిత్ ।
జహార లోకపాలానాం స్థానాని సహ తేజసా ॥ 7

విశ్వజిత్ - జగత్తును జయించిన, సః - ఆ, మహా-అసురః - గొప్ప రాక్షసుడు, దిశః - దిక్కులను, సర్వాః - అన్నింటినీ, త్రీన్ - మూడు, లోకాన్ చ - లోకములను కూడ, దేవ-అసురమనుష్య-ఇంద్రాన్ - దేవతలు రాక్షసులు మరియు మానవుల నాయకులను, గంధర్వగరుడ-ఉరగాన్ - గంధర్వులను గరుడులను నాగులను, సిద్ధచారణవిద్యాధ్రాన్ - సిద్ధులను చారణులను విద్యాధరులను, ఋషీన్ - మహర్షులను, పితృపతీన్ - పితృదేవతల నాయకులను, మనూన్ - మనువులను, యక్షరక్షఃపిశాచ-ఈశాన్ - యక్షులు రాక్షసులు పిశాచముల నాయకులను, ప్రేతభూతపతీన్ - ప్రేతములు భూతముల నాయకులను, అథ - మరియు, సర్వసత్త్వపతీన్ - సకలప్రాణుల అధిపతులను, జిత్వా - జయించి, వశమ్ - వశమును, ఆనీయ - చేసుకొని, లోకపాలానామ్ - లోకపాలకుల, స్థానాని - స్థానములను, తేజసా సహ - శక్తితో బాటుగా, జహార - లాగుకొనెను.

జగత్తును జయించిన ఆ గొప్ప రాక్షసుడు సకలదిక్కులను, మూడు లోకములను, దేవతలు రాక్షసులు మానవుల నాయకులను, గంధర్వులను, గరుడులను, నాగులను, సిద్ధులను, చారణులను, విద్యాధరులను, మహర్షులను, పితృదేవతల నాయకులను, మనువులను, యక్షులు రాక్షసులు పిశాచముల నాయకులను, ప్రేతములు భూతముల నాయకులను, మరియు సకలప్రాణుల అధిపతులను జయించి తన అధీనములో నుంచుకొని, లోకపాలకుల స్థానములను వారి శక్తులతో బాటుగా లాగుకొనెను.

దేవోద్యానశ్రియా జుష్టమధ్యాస్తే స్మ త్రివిష్టపమ్ ।
మహేంద్రభవనం సాక్షాన్నిర్మితం విశ్వకర్మణా ।
త్రైలోక్యలక్ష్మ్యాయతనమధ్యువాసాఖిలర్ధిమత్ ॥ 8

దేవ-ఉద్యానశ్రియా - దేవతల ఉద్యానముయొక్క శోభతో, జుష్టమ్ - కూడియున్న, త్రివిష్టపమ్ - స్వర్గమును, అధ్యాస్తే స్మ - అధిష్ఠించెను, సాక్షాత్ - సాక్షాత్తుగా, విశ్వకర్మణా - విశ్వకర్మచే, నిర్మితమ్ - నిర్మించబడినట్టియు, త్రైలోక్యలక్ష్మీ-ఆయతనమ్ - ముల్లోకముల సంపదకు నిధానమైనట్టియు, అఖిల-ఋద్ధిమత్ - సకలములైన సంపదలను కలిగియున్న, మహేంద్రభవనమ్ - మహేంద్రుని భవనమును, అధ్యువాస - నివసించెను.

దేవతల ఉద్యానముతో శోభిల్లే స్వర్గమునకు హిరణ్యకశిపుడు అధిపతి ఆయెను. సాక్షాత్తుగా విశ్వకర్మ నిర్మించిన మహేంద్రభవనములో ఆతడు నివసించెను. ముల్లోకములకు చెందిన సకలసంపదలు ఆ భవనములో ఉన్నవి.

యత్ర విద్రుమసోపానా మహామారకతా భువః ।
యత్ర స్ఫాటికకుడ్యాని వైదూర్యస్తంభపంక్తయః ॥ 9

యత్ర - ఎక్కడనైతే, విద్రుమసోపానాః - పగడముల మెట్లు, మహామారకతాః - గొప్ప పచ్చలు పొదిగిన, భువః - నేలలో, యత్ర - ఎచ్చటనైతే, స్ఫాటికకుడ్యాని - స్ఫటికములు పొదిగిన గోడలో, వైదూర్యస్తంభపంక్తయః - వైదూర్యములనే రత్నముల స్తంభముల వరుసలు గలవో.

ఆ భవనమునందలి మెట్లు పగడములతోను, నేలలు గొప్ప పచ్చలతోను, గోడలు స్ఫటికములతోను, స్తంభముల వరుసలు వైదూర్యరత్నములతోను పొదగబడెను.

యత్ర చిత్రవితానాని పద్మరాగాసనాని చ ।
పయఃఫేననిభాశ్శయ్యా ముక్తాదామపరిచ్ఛదాః ॥ 10

యత్ర - ఎక్కడనైతే, చిత్రవితానాని - రంగురంగుల మేలుకట్టులో, పద్మరాగ-ఆసనాని చ - పద్మరాగ మాణిక్యముల ఆసనములో, పయఃఫేననిభాః - పాల నురుగును పోలియుండే, శయ్యాః - శయ్యలు, ముక్తాదామపరిచ్ఛదాః - ముత్యాల హారములే కప్పే వస్త్రములుగా గలవియో.

అక్కడ రంగురంగుల మేలుకట్టులు, పద్మరాగమణుల ఆసనము లు ఉండెను. పాల నురుగును పోలియుండే శయ్యలపై ముత్యాల హార ములే పైన కప్పే వస్త్రములాయెను.

కూజద్భిర్నూపురైర్దేవ్యశ్శబ్దయంత్య ఇతస్తతః ।
రత్నస్థలీషు పశ్యంతి సుదతీస్సుందరం ముఖమ్ ॥ 11

సుదతీః - అందమైన పలువరుసలు గల, దేవ్యః - దేవతాస్త్రీలు, కూజద్భిః - ధ్వనించుచున్న, నూపురైః - కాలియందెలచే, ఇతః తతః - ఇటునటు, శబ్దయంత్యః - శబ్దమును చేయుచున్నవారై, సుందరమ్ - అందమగు, ముఖమ్ - ముఖమును, రత్నస్థలీషు - రత్నముల నేలలయం దు, పశ్యంతి - చూచుకొనెదరు.

అందమైన పలువరుసలు గల దేవతాస్త్రీలు ఇటునటు నడచుచుం డగా వారి కాలియందెలు మధురమగు ధ్వనులను చేయుచుండును. వారు రత్నముల నేలలయందు తమ అందమగు ముఖమును చూచుకొనెదరు.

తస్మిన్ మహేంద్రభవనే మహాబలో
మహామనా నిర్జితలోక ఏకరాట్ ।
రేమేఽభివంద్యాంఘ్రియుగస్సురాదిభిః
ప్రతాపితైరూర్జితచండశాసనః ॥ 12

మహాబలః - గొప్ప బలశాలి, మహామనాః - గొప్ప స్వాభిమా నము గలవాడు, నిర్జితలోకః - జయించబడిన లోకములు గలవాడు, ఏక రాట్ - ఏకచ్ఛత్రాధిపతి, ప్రతాపితైః - తీవ్రమగు తాపమునకు గురి చేయబ డిన, సుర-ఆదిభిః - దేవతలు గంధర్వులు మొదలగువారిచే, అభివంద్య -అంఘ్రియుగః - నమస్కరించబడే రెండు కాళ్లు గలవాడు, ఊర్జితచండ శాసనః - మిక్కిలి తీవ్రమగు శాసనము గలవాడు అగు హిరణ్యకశిపుడు, తస్మిన్ - ఆ, మహేంద్రభవనే - మహేంద్రుని భవనమునందు, రేమే - రమించెను.

గొప్ప బలశాలియగు హిరణ్యకశిపుడు చాల స్వాభిమానము గల వాడు. ఆతడు ముల్లోకములను జయించి ఏకచ్ఛత్రాధిపతియై పాలించెను. ఆతని మిక్కిలి కఠినమగు శాసనముచే అధికమగు తాపమును పొందిన దేవతలు, గంధర్వులు మొదలగువారు ఆతని రెండు కాళ్లకు నమస్కరించుచుందురు. ఆ విధముగా ఆతడా మహేంద్రుని భవనములో రమించెను.

తమంగ మత్తం మధునోరుగంధినా
　వివృత్తతామ్రాక్షమశేషధిష్ణ్యపాః ।
ఉపాసతోపాయనపాణిభిర్వినా
　త్రిభిస్తపోయోగబలౌజసాం పదమ్॥ 13

అంగ - ఓ రాజా!, ఉరుగంధినా - తీవ్రమగు గంధము గల, మధునా - మద్యముచే, మత్తమ్ - మదించి ఉన్నట్టియు, వివృత్తతామ్ర-అక్షమ్ - గిరగిర త్రిప్పబడే కన్నులు కలిగినట్టియు, తపః-యోగబల-ఓజసామ్ - తపోయోగము శరీరబలము మనోబలములకు, పదమ్ - నిధానమైన, తమ్ - ఆ హిరణ్యకశిపుని, త్రిభిః వినా - ముగ్గురు మినహాయించి, అశేషధిష్ణ్యపాః - సకలలోకపాలకులు, ఉపాయనపాణిభిః - బహుమానములతో గూడియున్న చేతులతో, ఉపాసత - సేవించిరి.

ఓ రాజా! ఆ హిరణ్యకశిపుడు తీవ్రమగు గంధము గల మద్యమును సేవించి మత్తెక్కి కన్నులను గిరగిర త్రిప్పుచుండగా, త్రిమూర్తులను మినహాయించి లోకపాలకులందరు చేతులలో బహుమానములను పట్టుకొని ఆతనిని సేవించిరి. ఆతడు తపోయోగమునకు, శరీర మనోబలములకు నిధానముగా ఉండెను.

జగుర్మహేంద్రాసనమోజసాఽఽస్థితం
　విశ్వావసుస్తుంబురురస్మదాదయః ।
గంధర్వసిద్ధా ఋషయోఽస్తువన్ముహుః
　విద్యాధరా అప్సరసశ్చ పాండవ ॥ 14

పాండవ - ఓ ధర్మరాజా!, ఓజసా - శక్తిచే, మహేంద్ర-ఆసనమ్ - మహేంద్రుని సింహాసనమును, ఆస్థితమ్ - అధిష్ఠించిన హిరణ్యకశిపుని, విశ్వావసుః - విశ్వావసువు, తుంబురుః - తుంబురుడు, అస్మదాదయః - నావంటివారలు, జగుః - గానము చేసిరి, గంధర్వసిద్ధాః - గంధర్వులు సిద్ధులు, ఋషయః - మహర్షులు, విద్యాధరాః - విద్యాధరులు, అప్సరసః చ - అప్సరసలు కూడ, ముహుః - పలుమార్లు, అస్తువన్ - స్తుతించిరి.

ఓ ధర్మరాజా! స్వశక్తిచే మహేంద్రుని సింహాసనమునధిష్ఠించిన హిరణ్యకశిపుని మహిమను విశ్వావసువు, తుంబురుడు, నావంటి వారలు గానము చేసిరి. గంధర్వులు, సిద్ధులు, మహర్షులు, విద్యాధరులు, అప్సరసలు కూడ ఆతనిని పలుమారు స్తుతించిరి.

స ఏవ వర్ణాశ్రమిభిః క్రతుభిర్భూరిదక్షిణైః ।
ఇజ్యమానో హవిర్భాగానగ్రహీత్స్వేన తేజసా ॥ 15

వర్ణ-ఆశ్రమిభిః - వర్ణములు ఆశ్రమములవారిచే, భూరిదక్షిణైః - అధికమగు దక్షిణలు గల, క్రతుభిః - క్రతువులచే, సః ఏవ - ఆ హిరణ్యకశిపుడే, ఇజ్యమానః - ఆరాధించబడుచున్నవాడై, స్వేన - తన, తేజసా - తేజస్సుచే, హవిర్భాగాన్ - హవిర్భాగములను, అగ్రహీత్ - స్వీకరించెను.

వర్ణములు, ఆశ్రమముల జనులు అధికమగు దక్షిణలు గల క్రతువులచే ఆ హిరణ్యకశిపునే ఆరాధించగా, ఆతడు తన శక్తిచే హవిర్భాగములను స్వీకరించెను.

అకృష్టపచ్యా తస్యాసీత్సప్తద్వీపవతీ మహీ ।
తథా కామదుఘా ద్యౌస్తు నానాశ్చర్యపదం నభః ॥ 16

తస్య - వానికి, సప్తద్వీపవతీ - ఏడు ద్వీపములు గల, మహీ - భూమి, అకృష్టపచ్యా - దున్నకుండానే పండునది, తథా - అదే విధముగా, ద్యౌః తు - ద్యులోకమైతే, కామదుఘా - కోరికలనీడేర్చునది, నభః - అంతరిక్షము, నానా-ఆశ్చర్యపదమ్ - అనేకములైన ఆశ్చర్యములకు నిలయము.

ఆతని పాలనలో భూమి దున్నకుండానే పంటలు పండెను. స్వర్గము కోరికలనన్నింటినీ ఈడేర్చెను. అంతరిక్షము అనేకములైన అద్భు తవస్తువులకు నిలయమాయెను.

రత్నాకరాశ్చ రత్నౌఘాంస్తత్పత్న్యశ్చోహురూర్మిభిః ।
క్షారసీధుఘృతక్షౌద్రదధిక్షీరామృతోదకాః ॥ 17

క్షారసీధుఘృతక్షౌద్రదధిక్షీర-అమృత-ఉదకాః - ఉప్పునీరు ఆస వము నేయి తేనె పెరుగు పాలు తియ్యని నీరు గల, రత్న-ఆకరాః చ - రత్నములకు నిలయములైన సముద్రములు, తత్-పత్న్యః చ - వాటి భార్యలగు నదులు కూడ, ఊర్మిభిః - తరంగములతో, రత్న-ఓఘాన్ - రత్నముల గుట్టలను, ఊహుః - మోసుకు వచ్చినవి.

ఉప్పునీరు, ఆసవము, నేయి, తేనె, పెరుగు, పాలు, తియ్యని నీరు గల సముద్రములు, వాటిలోకి ప్రవహించే నదులు కూడ తమ తరంగ ములతో రత్నములను గుట్టలను మోసుకు వచ్చినవి.

శైలా ద్రోణీభిరాక్రీడం సర్వర్తుషు గుణాన్ ద్రుమాః ।
దధార లోకపాలానామేక ఏవ పృథగ్గుణాన్ ॥ 18

శైలాః - పర్వతములు, ద్రోణీభిః - లోయలచే, ఆక్రీడమ్ - ఆటల మైదానమును, ద్రుమాః - చెట్లు, సర్వ-ఋతుషు - అన్ని ఋతువులయం దు, గుణాన్ - పూలు పళ్లు మొదలగువాటిని, ఏకః ఏవ - ఒక్కడే, లోకపా లానామ్ - లోకపాలకుల, పృథక్ - వేర్వేరు, గుణాన్ - గుణములను, దధార - ధరించెను.

పర్వతములు తమ లోయలతో వానికి ఆటల మైదానములను సమకూర్చినవి. చెట్లు అన్ని ఋతువులయందు పూలు, పళ్లు మొదలగువా టిని సమర్పించినవి. ఆతడొక్కడే వేర్వేరు లోకపాలకుల గుణములనన్నిం టినీ తనయందు కలిగి యుండెను.

స ఇత్థం నిర్జితకకుబేకరాడ్ విషయాన్ ప్రియాన్ ।
యథోపజోషం భుంజానో నాతృప్యదజితేంద్రియః ॥ 19

నిర్జితకకుబ్ - జయించబడిన దిక్కులు కలిగినవాడు, ఏకరాట్ - ఏకచ్ఛత్రాధిపతి, అజిత-ఇంద్రియః - జయించబడని ఇంద్రియములు గల వాడు అగు, సః - ఆతడు, ఇత్థమ్ - ఈ విధముగా, ప్రియాన్ - అభీష్టము లగు, విషయాన్ - ఇంద్రియభోగములను, యథా-ఉపజోషమ్ - తన ప్రీతికి తగ్గట్లుగా, భుంజానః - అనుభవించుచున్నవాడై, న అతృప్యత్ - తృప్తిని చెందలేదు.

ఆతడు దిక్కులను జయించి ఏకచ్ఛత్రాధిపతి అయినాడే గాని, తన ఇంద్రియములను జయించలేదు. ఆతడీ విధముగా తనకు అభీష్టము లైన ఇంద్రియభోగములను తన ఇచ్ఛవచ్చినట్లుగా అనుభవించెను. అయి ననూ, ఆతనికి తృప్తి కలుగలేదు.

ఏవమైశ్వర్యమత్తస్య దృప్తస్యోచ్ఛాస్త్రవర్తినః ।
కాలో మహాన్ వ్యతీయాయ బ్రహ్మశాపముపేయుషః ।। 20

ఏవమ్ - ఈ విధముగా, ఐశ్వర్యమత్తస్య - ఐశ్వర్యముచే మదించి ఉన్నట్టియు, దృప్తస్య - గర్వితుడైనట్టియు, ఉత్-శాస్త్రవర్తినః - శాస్త్రము నుల్లంఘించి ప్రవర్తించునట్టియు, బ్రహ్మశాపమ్ - బ్రహ్మర్షులగు సనకా దుల శాపమును, ఉపేయుషః - పొందియున్న హిరణ్యకశిపునకు, మహాన్ - చాల, కాలః - కాలము, వ్యతీయాయ - గడిచిపోయెను.

బ్రహ్మర్షులగు సనకాదుల శాపమును పొందిన హిరణ్యకశిపుడు ఈ విధముగా ఐశ్వర్యముచే మదించి గర్వించి శాస్త్రమర్యాదను ఉల్లం ఘించి ప్రవర్తించుచుండగా, చాల కాలము గడిచి పోయెను.

తస్యోగ్రదండసంవిగ్నాస్సర్వే లోకాస్సపాలకాః ।
అన్యత్రాలబ్ధశరణాశ్శరణం యయురచ్యుతమ్ ।। 21

తస్య - వానియొక్క, ఉగ్రదండసంవిగ్నాః - కఠోరమగు శిక్షలచే చాల భయపడినవారు, సపాలకాః - పాలకులతో కూడియున్నవారు అగు, లోకాః - జనులు, సర్వే - అందరు, అన్యత్ర - మరియొకనివద్ద, అలబ్ధశ

రణాః - పొందబడని రక్షణ గలవారై, అచ్యుతమ్ - శ్రీహరిని, శరణమ్ - శరణును, యయుః - పొందిరి.

వాని కఠోరమగు శాసనముచే లోకపాలకులతో సహా సకలజనులు చాల భయపడిరి. వారికి మరియొకని వద్ద శరణు లభించలేదు. అపుడు వారు శ్రీహరిని శరణు వేడిరి.

తస్యై నమోఽస్తు కాష్ఠాయై యత్రాత్మా హరిరీశ్వరః ।
యద్గత్వా న నివర్తంతే శాంతాస్సన్న్యాసినోఽమలాః ॥ 22

తస్యై - ఆ, కాష్ఠాయై - పరమధామము కొరకు, నమః - నమస్కారము, అస్తు - అగుగాక!, యత్ర - ఎచ్చటనైతే, ఆత్మా - ఆత్మ, ఈశ్వరః - ఈశ్వరుడు అగు, హరిః - శ్రీహరియో, శాంతాః - శాంతస్వభావము గలవారు, అమలాః - పవిత్రులు అగు, సన్న్యాసినః - సర్వసంగపరిత్యాగులు, యత్ - దేనిని, గత్వా - చేరుకొని, న నివర్తంతే - తిరిగి రారో.

సకలప్రాణులకు ఆత్మరూపుడు, సర్వేశ్వరుడు అగు శ్రీహరి నివసించే పరమధామమునకు నమస్కారమగు గాక! శాంతస్వభావులు, పవిత్రులు, సర్వసంగపరిత్యాగులు అగు మహాత్ములు ఆ ధామమును పొంది మరలి రారు (మరల జన్మించరు).

ఇతి తే సంయతాత్మానస్సమాహితధియోఽమలాః ।
ఉపతస్థుర్హృషీకేశం వినిద్రా వాయుభోజనాః ॥ 23

సంయత-ఆత్మానః - నిగ్రహించబడిన మనస్సులు గలవారు, సమాహితధియః - ఏకాగ్రము చేయబడిన మనస్సులు గలవారు, అమలాః - నిర్మలులు, వినిద్రాః - నిద్ర లేనివారు, వాయుభోజనాః - వాయువును మాత్రమే భక్షించువారు అగు, తే - వారలు, ఇతి - ఈ విధముగా, హృషీకేశమ్ - ఇంద్రియాధిపతియగు శ్రీహరిని, ఉపతస్థుః - స్తుతించిరి.

వారలు నిర్మలమగు తమ మనస్సులను నిగ్రహించి ఏకాగ్రము చేసి నిద్రను వీడి వాయువును మాత్రమే భక్షిస్తూ శ్రీహరిని ఈ (పై) విధముగా స్తుతించిరి.

తేషామావిరభూద్వాణీ అరూపా మేఘనిస్స్వనా ।
సన్నాదయంతీ కకుభస్సాధూనామభయంకరీ ॥ 24

అరూపా - రూపము లేనిది, మేఘనిస్స్వనా - మేఘగర్జనను పోలియున్నది, కకుభః - దిక్కులను, సన్నాదయంతీ - ప్రతిధ్వనింప జేయుచున్నది, సాధూనామ్ - సత్పురుషులకు, అభయంకరీ - భయ మును పోగొట్టునది అగు, వాణీ - వాక్కు, తేషామ్ - వారికి, ఆవిః-అభూత్ - ఆవిర్భవించెను.

మేఘగర్జనను పోలి దిక్కులలో ప్రతిధ్వనించిన ఆకాశవాణి వారికి వినవచ్చెను. ఆ వాణి సత్పురుషుల భయమును పోగొట్టునది.

మా భైష్ట విబుధశ్రేష్ఠాస్సర్వేషాం భద్రమస్తు వః ।
మద్దర్శనం హి భూతానాం సర్వశ్రేయోపపత్తయే ॥ 25

విబుధశ్రేష్ఠాః - ఓ గొప్ప దేవతలారా!, మా భైష్ట - భయపడకుడు, వః - మీకు, సర్వేషామ్ - అందరికి, భద్రమ్ - మంగళము, అస్తు - అగు గాక!, హి - ఏలయనగా, భూతానామ్ - ప్రాణులకు, మద్-దర్శనమ్ - నా దర్శనము, సర్వశ్రేయః-ఉపపత్తయే - సకలకల్యాణములను పొందుట కొరకు.

ఓ గొప్ప దేవతలారా! భయపడకుడు. మీకందరికి మంగళమగు గాక! ఏలయనగా, నా దర్శనము వలన (వాక్కును వినుట వలన) ప్రాణు లకు సకలకల్యాణములు లభించును.

జ్ఞాతమేతస్య దౌరాత్మ్యం దైతేయాపసదస్య చ ।
తస్య శాంతిం కరిష్యామి కాలం తావత్ప్రతీక్షత ॥ 26

దైతేయ-అపసదస్య - దితిపుత్రులలో అధముడగు, ఏతస్య - వీని, దౌరాత్మ్యమ్ - దుర్బుద్ధి, జ్ఞాతం చ - తెలిసినదియే, తస్య - దానికి, శాంతిమ్ - శాంతిని, కరిష్యామి - చేయగలను, తావత్ - అంతవరకు, కాలమ్ - కాలమును, ప్రతీక్షత - ఎదురు చూడుడు.

దితిపుత్రులలో అధముడగు ఈ హిరణ్యకశిపుని దౌర్జన్యము నాకు తెలిసినదియే. నేను అది చల్లారునట్లు చేసెదను. మీరు కొంత కాలము వేచి చూడుడు.

యదా దేవేషు వేదేషు గోషు విప్రేషు సాధుషు ।
ధర్మే మయి చ విద్వేషస్స వా ఆశు వినశ్యతి ।। 27

యదా - ఏ కాలమునందైతే ఎవనికైతే, దేవేషు - దేవతలయందు, వేదేషు - వేదములయందు, గోషు - గోవులయందు, విప్రేషు - వేదవేత్తలయందు, సాధుషు - సత్పురుషులయందు, ధర్మే - ధర్మమునందు, చ - మరియు, మయి - నాయందు, విద్వేషః - అధికమగు ద్వేషమో, సః - అట్టివాడు, వై - నిశ్చయముగా, ఆశు - శీఘ్రమే, వినశ్యతి - వినాశమును పొందును.

ఎవడైతే ఏ కాలమునందైతే దేవతలు, వేదములు, గోవులు, వేదవేత్తలు, సత్పురుషులు, మరియు ధర్మము అనువాటియందు, నాయందు కూడ అధికమగు ద్వేషమును పొందునో, అట్టి వ్యక్తి నిశ్చయముగా నశించును.

నిర్వైరాయ ప్రశాంతాయ స్వసుతాయ మహాత్మనే ।
ప్రహ్లాదాయ యదా ద్రుహ్యేద్ధనిష్యేఽపి వరోర్జితమ్ ।। 28

నిర్వైరాయ - వైరము లేనట్టియు, ప్రశాంతాయ - మిక్కిలి శాంతస్వభావుడైనట్టియు, మహాత్మనే - మహాత్ముడైనట్టియు, స్వసుతాయ - తన కుమారుడగు, ప్రహ్లాదాయ - ప్రహ్లాదుని కొరకు, యదా - ఏ కాలమునందైతే, ద్రుహ్యేత్ - ద్రోహమును చేయునో, వర-ఊర్జితం అపి - వరములచే బలము గలవాడే అయిననూ హిరణ్యకశిపుని, హనిష్యే - సంహరించెదను.

హిరణ్యకశిపుని పుత్రుడగు ప్రహ్లాదుడు వైరభావము లేని మహాత్ముడు. మిక్కిలి శాంతస్వభావుడగు ఆతనికి హిరణ్యకశిపుడు ఎప్పుడైతే

ద్రోహమును చేయునో, అప్పుడు వరముల బలము ఉన్నవాడే అయిననూ, వానిని నేను సంహరించెదను.

నారద ఉవాచ ।
ఇత్యుక్తా లోకగురుణా తం ప్రణమ్య దివౌకసః ।
న్యవర్తంత గతోద్వేగా మేనిరే చాసురం హతమ్ ॥ 29

లోకగురుణా - జగత్తునకు తండ్రియగు శ్రీహరిచే, ఇతి - ఈ విధముగా, ఉక్తాః - చెప్పబడిన, దివ-ఓకసః - స్వర్గలోకవాసులగు దేవతలు, తమ్ - ఆయనను, ప్రణమ్య - నమస్కరించి, గత-ఉద్వేగాః - తొలగిన భయము గలవారై, న్యవర్తంత - వెనుదిరిగిరి, అసురం చ - రాక్షసుని, హతమ్ - మరణించినవానినిగా, మేనిరే - తలపోసిరి.

నారదుడిట్లు పలికెను --- జగత్తునకు తండ్రియగు శ్రీహరి ఇట్లు పలుకగా, స్వర్గలోకవాసులగు దేవతల భయము తొలగిపోయెను. వారాయనకు నమస్కరించి, హిరణ్యకశిపుడు మరణించినట్లేనని భావిస్తూ వెనుకకు మరలిరి.

తస్య దైత్యపతేః పుత్రాశ్చత్వారః పరమాద్భుతాః ।
ప్రహ్లాదోఽభూన్మహాంస్తేషాం గుణైర్మహదుపాసకః ॥ 30

దైత్యపతేః - రాక్షసరాజగు, తస్య - ఆ హిరణ్యకశిపునకు, పరమ-అద్భుతాః - గొప్ప అచ్చెరువును గొలిపే, చత్వారః - నలుగురు, పుత్రాః - పుత్రులు, తేషామ్ - వారిలో, మహద్-ఉపాసకః - మహాత్ములను సేవించే, ప్రహ్లాదః - ప్రహ్లాదుడు, గుణైః - గుణములచే, మహాన్ - గొప్పవాడు, అభూత్ - ఆయెను.

రాక్షసరాజగు ఆ హిరణ్యకశిపునకు గొప్ప అచ్చెరువును గొలిపే నలుగురు పుత్రులు ఉండిరి. మహాత్ములను సేవించే ప్రహ్లాదుడు గుణములచే వారిలో గొప్పవాడుగా నుండెను.

బ్రహ్మణ్యశ్శీలసంపన్నస్సత్యసంధో జితేంద్రియః ।
ఆత్మవత్సర్వభూతానామేకః ప్రియసుహృత్తమః ॥ 31

బ్రహ్మణ్యః - వేదవేత్తల యెడల భక్తి గలవాడు, శీలసంపన్నః - నిండా సచ్ఛీలము గలవాడు, సత్యసంధః - సత్యమునకు కట్టుబడినవాడు, జిత-ఇంద్రియః - జయించబడిన ఇంద్రియములు గలవాడు, సర్వభూతానామ్ - సకలప్రాణులకు, ఆత్మవత్ - ఆత్మవలె, ఏకః - ఒకే ఒక, ప్రియసుహృత్తమః - ప్రీతిపాత్రుడు మరియు హితకారి.

నిండా సచ్ఛీలము గల ప్రహ్లాదునకు వేదవేత్తల యెడల భక్తి మెండు. ఇంద్రియములను జయించిన ఆతడు సత్యమునకు కట్టుబడి యుండెడివాడు. సకలప్రాణులకు ఆతడు ఆత్మవలె గొప్ప ప్రియమును, హితమును చేసెడివాడు. అట్టి హితకారి మరియొకడు లేడు.

దాసవత్సంనతార్యాంఘ్రిః పితృవద్దీనవత్సలః ।
భ్రాతృవత్సదృశే స్నిగ్ధో గురుష్వీశ్వరభావనః ।
విద్యార్థరూపజన్మాఢ్యో మానస్తంభవివర్జితః ॥ 32

దాసవత్ - దాసుడు వలె, సంనత-ఆర్య-అంఘ్రిః - నమస్కరించబడిన మహాత్ముల పాదములు గలవాడు, పితృవత్ - తండ్రి వలె, దీనవత్సలః - దీనులయందు ప్రేమ గలవాడు, సదృశే - సాటివానియందు, భ్రాతృవత్ - సోదరుని వలె, స్నిగ్ధః - స్నేహము గలవాడు, గురుషు - గురువులయందు, ఈశ్వరభావనః - ఈశ్వరుడు అనే భావన గలవాడు, విద్యా-అర్థరూపజన్మ-ఆఢ్యః - చదువు సంపద అందము వంశములచే సంపన్నుడు, మానస్తంభవివర్జితః - అభిమానము దంభము లేనివాడు.

ఆతడు మహాత్ముల పాదములకు దాసుడు వలె నమస్కరించెడివాడు. దీనులను తండ్రి వలె ప్రేమించెడివాడు. సాటివారియందు సోదరుడు వలె స్నేహమును చూపెడివాడు. గురువుల యెడల ఈశ్వరభావనను చేసెడివాడు. ఆతనియందు చదువు, సంపద, అందము నిండా ఉండెను. పైగా ఆతడు గొప్ప వంశములో పుట్టెను. అయిననూ, ఆతనియందు అభిమానము గాని, గర్వము గాని లేవు.

నోద్విగ్నచిత్తో వ్యసనేషు నిస్పృహః
శ్రుతేషు దృష్టేషు గుణేష్వవస్తుదృక్ ।

దాంతేంద్రియప్రాణశరీరధీస్సదా
ప్రశాంతకామో రహితాసురోఽసురః ॥ 33

వ్యసనేషు - కష్టములయందు, ఉద్విగ్నచిత్తః - భయముతో నిండిన చిత్తము గలవాడు, న - కాదు, నిస్స్పృహః - కోరికలు లేనివాడు, శ్రుతేషు - వినబడిన, దృష్టేషు - చూడబడిన, గుణేషు - గుణకార్యము లగు విషయభోగములయందు, అవస్తుదృక్ - అసత్యత్వమును చూచువాడు, సదా - అన్ని కాలములయందు, దాంత-ఇంద్రియప్రాణశరీరధీః - నిగ్రహించబడిన ఇంద్రియములు ప్రాణము దేహము బుద్ధి గలవాడు, ప్రశాంత కామః - చల్లారిన కామనలు గలవాడు, రహిత-ఆసురః - అసుర లక్షణ ములు లేని, అసురః - అసురుడు.

ప్రహ్లాదుడు కష్టములయందు కూడ హృదయములో భయమును, కలవరపాటును పొందెడివాడు కాదు. కోరికలు లేని ఆయన, చూచిన మరియు విన్న భోగములు (ఇహపరములయందలి భోగములు) మిథ్యయని తెలుసుకొనెడివాడు. సర్వకాలములలో ఇంద్రియములు, ప్రాణము, దేహము, బుద్ధి వశములోనుండే ఆ ప్రహ్లాదుని హృదయములో కామనలన్నియు శాంతించుటచే, ఆతడు అసుర లక్షణము (భోగపరాయణ త్వము) లేని అసురుడుగా నుండెడివాడు.

యస్మిన్ మహద్గుణా రాజన్ గృహ్యంతే కవిభిర్ముహుః ।
న తేఽధునాపిధీయంతే యథా భగవతీశ్వరే ॥ 34

రాజన్ - ఓ మహారాజా!, ఈశ్వరే - సర్వేశ్వరుడగు, భగవతి యథా - భగవానునియందు వలె, యస్మిన్ - ఎవనియందలి, మహద్-గుణాః - గొప్పవారి గుణములు, కవిభిః - కవులచే, ముహుః - పలుమార్లు, గృహ్యంతే - స్వీకరించబడుచున్నవో, అధునా - ఇప్పటికి కూడ, తే - అవి, న అపిధీయంతే - అంతర్ధానమగుట లేదు.

ఓ మహారాజా! సర్వేశ్వరుడగు భగవానునియందు వలె ఆ ప్రహ్లాదునియందు మహాత్ముల గుణములు చాల గలవు. కవులు ఆ గుణములను

పలుమార్లు వర్ణించుచున్నారు. మహాత్ములు వాటిని తాము కూడ అలవర చుకున్నారు. ఆ గుణములు ఈ నాటికి కూడ అంతర్ధానము కాలేదు.

యం సాధుగాథాసదసి రిపవోఽపి సురా నృప ।
ప్రతిమానం ప్రకుర్వంతి కిముతాన్యే భవాదృశాః ॥ 35

నృప - ఓ మహారాజా!, సాధుగాథాసదసి - సత్పురుషుల గాథల సభయందు, రిపవః - శత్రువులైన, సురాః అపి - దేవతలు కూడ, యమ్ - ఏ ప్రహ్లాదుని, ప్రతిమానమ్ - దృష్టాంతముగా, ప్రకుర్వంతి - చేసెదరో, భవాదృశాః - నీవంటి వారలు, అన్యే - ఇతరులు, కిం ఉత - చెప్పునదే మున్నది?

ఓ మహారాజా! సత్పురుషుల గాథలను చెప్పే సభయందు శత్రు వులగు దేవతలు కూడ ప్రహ్లాదుని దృష్టాంతముగా ఉటంకించెదరు. అట్టిచో, నీవంటి అజాతశత్రువులు ఆయనను సమ్మానించెదరని వేరుగా చెప్పవల యునా?

గుణైరలమసంఖ్యేయైర్మాహాత్మ్యం తస్య సూచ్యతే ।
వాసుదేవే భగవతి యస్య నైసర్గికీ రతిః ॥ 36

అసంఖ్యేయైః - లెక్కించ శక్యము కాని, గుణైః - గుణములచే, అలమ్ - చాలును, తస్య - ఆ ప్రహ్లాదుని, మాహాత్మ్యమ్ - మహిమ, సూచ్యతే - సూచించబడుచున్నది, యస్య - ఏ ప్రహ్లాదునకైతే, వాసుదేవే భగవతి - వాసుదేవ భగవానునియందు, నైసర్గికీ - సహజసిద్ధమైన, రతిః - ప్రేమయో.

ప్రహ్లాదునియందు లెక్కించ శక్యము కానన్ని గుణములు గలవు. వాటిని అట్లుండనిండు. ఆతని మహిమను సూచించుటకు ఒక్క విషయ మును చెప్పిన చాలును. ఆతనికి వాసుదేవ భగవానునియందు సహజసిద్ధ మగు ప్రేమ ఉండెను.

న్యస్తక్రీడనకో బాలో జడవత్తన్మనస్తయా ।
కృష్ణగ్రహగృహీతాత్మా న వేద జగదీదృశమ్ ॥ 37

న్యస్తక్రీడనకః - విడిచిపెట్టబడిన ఆట వస్తువులు గల, బాలః - బాలకుడు, తత్-మనస్తయా - ఆ భగవానునియందు లగ్నమైన మనస్సు గలవాడగుటచే, జడవత్ - జడుడు వలె, కృష్ణగ్రహగృహీత-ఆత్మా - శ్రీకృష్ణుడు అనే ఆకర్షకునిచే పట్టుకొనబడిన బుద్ధి గలవాడు, జగత్ - జగత్తును, ఈదృశమ్ - ఈ విధముగా, న వేద - తెలియడు.

ప్రహ్లాదుడు బాల్యమునందే ఆటవస్తువులను విడిచిపెట్టి ఆ శ్రీకృష్ణునియందు మనస్సును లగ్నము చేసెడివాడు. ఆతడు ఇతరులకు జడుని వలె కన్పట్టెడివాడు. ఆయన బుద్ధిని శ్రీకృష్ణుడు అనే ఆకర్షణ గట్టిగా పట్టుకొనుటచే, ఆయనకు ఈ జగత్తు విభిన్ననామరూపములుగా గాక, శ్రీకృష్ణమయముగా కన్పట్టెడిది.

**ఆసీనః పర్యటన్నశ్నన్ శయానః ప్రపిబన్ బ్రువన్ ।**
**నానుసంధత్త ఏతాని గోవిందపరిరంభితః ।। 38**

ఆసీనః - కూర్చున్నవాడు, పర్యటన్ - ఇటునటు తిరుగుచున్నవాడు, అశ్నన్ - తినుచున్నవాడు, శయానః - పరున్నవాడు, ప్రపిబన్ - త్రాగుచున్నవాడు, బ్రువన్ - మాటలాడుచున్నవాడు, గోవిందపరిరంభితః - గోవిందునితో ఐక్యమైనవాడు, ఏతాని - వీటిని, న అనుసంధత్తే - తెలియడు.

ఆతడు కూర్చున్ననూ, ఇటునటు తిరుగుచున్ననూ, తినుచున్ననూ, పరున్ననూ, నీటిని త్రాగుచున్ననూ, మాటలాడుచున్ననూ, గోవిందునియందు పూర్తిగా లగ్నమైన మనస్సు గలవాడగుటచే, ఆయా సంగతులను పట్టించుకొనెడివాడు కాదు.

**క్వచిద్రుదతి వైకుంఠచింతాశబలచేతనః ।**
**క్వచిద్ధసతి తచ్చింతాహ్లాద ఉద్గాయతి క్వచిత్ ।। 39**

వైకుంఠచింతాశబలచేతనః - శ్రీహరియొక్క ధ్యానముచే వ్యాకులమైన మనస్సు గలవాడై, క్వచిత్ - ఒకప్పుడు, రుదతి - కన్నీటిని స్రవించును, తత్-చింతా-ఆహ్లాదః - ఆ శ్రీహరియొక్క ధ్యానముచే ఆనందము

గలవాడై, క్వచిత్ - ఒకప్పుడు, హసతి - నవ్వును, క్వచిత్ - ఒకప్పుడు, ఉద్-గాయతి - బిగ్గరగా కీర్తించును.

ప్రహ్లాదుడు ఒకప్పుడు శ్రీహరియొక్క ధ్యానముచే (శ్రీహరి నాకు దక్కలేదు అనే భావనతో) వ్యాకులమైన మనస్సుతో ఏడ్చెడివాడు. ఒకప్పుడు ఆయననూ ధ్యానిస్తూ ఆనందముతో నవ్వెడివాడు. మరియొకప్పుడు బిగ్గరగా కీర్తించెడివాడు.

నదతి క్వచిదుత్కంఠో విలజ్జో నృత్యతి క్వచిత్ ।
క్వచిత్తద్భావనాయుక్తస్తన్మయోఽనుచకార హ ॥ 40

క్వచిత్ - ఒకప్పుడు, ఉత్కంఠః - ఎలుగెత్తినవాడై, నదతి - నాదము చేయును, క్వచిత్ - ఒకప్పుడు, విలజ్జః - బిడియము పడనివాడై, నృత్యతి - నాట్యము చేయును, క్వచిత్ - ఒకప్పుడు, తద్-భావనాయుక్తః - ఆ భగవానుని భావనతో కూడినవాడై, తత్-మయః - ఆయనతో ఐక్యమైనవాడై, అనుచకార హ - అనుకరించెడి వాడట.

ప్రహ్లాదుడు ఒకప్పుడు (భావనలో భగవానుని దర్శనమైనప్పుడు) నాదము చేసెడివాడు. మరియొకప్పుడు బిడియము పడకుండా నాట్యము చేసెడివాడు. ఒకప్పుడు ఆ భగవానుని భావనతో నిండి ఆయనతో ఐక్యమై ఆయన లీలలను అనుకరించెడి వాడు.

క్వచిదుత్పులకస్తూష్ణీమాస్తే సంస్పర్శనిర్వృతః ।
అస్పందప్రణయానందసలిలామీలితేక్షణః ॥ 41

క్వచిత్ - ఒకప్పుడు, సంస్పర్శనిర్వృతః - భగవానుని స్పర్శచే ఆనందము గలవాడై, ఉత్-పులకః - గగుర్పాటు గలవాడై, అస్పందప్రణయ-ఆనందసలిల-ఆమీలిత-ఈక్షణః - విచలితము కాని ప్రేమ వలని ఆనందముయొక్క కన్నీటిచే సగము మూయబడిన కన్నులు గలవాడై, తూష్ణీం ఆస్తే - మిన్నకుండెడివాడు.

ప్రహ్లాదుడు ఒకప్పుడు భావనలో భగవానుని స్పర్శను పొంది ఆ ఆనందముచే గగుర్పాటును పొంది మిన్నకుండెడివాడు. భగవానునియం

దలి ఆయన భక్తి విచలితము కానిది. దానిచే ఆయనకు ఆనందము కలిగి, ఆ ఆనందముచే కన్నీరు స్రవించి, చూపు సగము మూసుకుపోయెడిది.

స ఉత్తమశ్లోకపదారవిందయోః
నిషేవయాఽకించనసంగలబ్ధయా ।
తన్వన్ పరాం నిర్వృతిమాత్మనో ముహుః
దుస్సంగదీనాన్యమనశ్శమం వ్యధాత్ ॥ 42

సః - ఆ ప్రహ్లాదుడు, అకించనసంగలబ్ధయా - సర్వసంగపరిత్యాగులతోడి సంగము వలన పొందబడే, ఉత్తమశ్లోకపద-అరవిందయోః - పుణ్యకీర్తియగు శ్రీహరియొక్క పాదపద్మముల, నిషేవయా - నిష్ఠతో కూడిన సేవచే, ఆత్మనః - తనకు, పరామ్ - సర్వాతిశాయి యగు, నిర్వృతిమ్ - ఆనందమును, తన్వన్ - విస్తరింప జేయుచున్నవాడై, దుస్సంగదీన-అన్యమనః - దుష్టులతోడి సంగముచే దీనులైయున్న ఇతరుల మనస్సును, ముహుః - పలుమార్లు, శమమ్ - శాంతముగా, వ్యధాత్ - చేసెను.

సర్వసంగపరిత్యాగులతోడి సంగము వలన పుణ్యకీర్తియగు శ్రీహరి పాదపద్మములను నిష్ఠతో సేవించే భాగ్యము లభించును. ఆ ప్రహ్లాదుడు అట్టి సేవచే తనకు తాను సర్వాతిశాయియగు ఆనందమును విస్తరింప జేసుకొనుటయే గాక, దుష్టులతోడి సంగముచే దీనులైయున్న ఇతరుల మనస్సునకు కూడ పలుమార్లు శాంతిని కలిగించెను.

తస్మిన్ మహాభాగవతే మహాభాగే మహాత్మని ।
హిరణ్యకశిపూ రాజన్నకరోదఘమాత్మజే ॥ 43

రాజన్ - ఓ మహారాజా!, మహాభాగవతే - గొప్ప భగవద్భక్తుడు, మహాభాగే - గొప్ప భాగ్యవంతుడు, మహాత్మని - మహాత్ముడు అగు, తస్మిన్ - ఆ, ఆత్మజే - పుత్రుడగు ప్రహ్లాదునియందు, హిరణ్యకశిపుః - హిరణ్యకశిపుడు, అఘమ్ - ద్రోహమును, అకరోత్ - చేసెను.

ఓ మహారాజా! మహాభాగ్యశాలియగు ఆ ప్రహ్లాదుడు గొప్ప భగవద్భక్తుడైన మహాత్ముడు. హిరణ్యకశిపుడు అట్టి తన పుత్రునకు ద్రోహమును చేసెను.

యుధిష్ఠిర ఉవాచ ।
దేవర్ష ఏతదిచ్ఛామో వేదితుం తవ సువ్రత ।
యదాత్మజాయ శుద్ధాయ పితాऽదాత్సాధవే హ్యఘమ్ ।।44

దేవర్షే - ఓ దేవర్షీ!, సువ్రత - గొప్ప వ్రతము గలవాడా!, తవ - నీనుండి, ఏతత్ - దీనిని, వేదితుమ్ - తెలియుటకు, ఇచ్ఛామః - కోరుచున్నాము, యత్ - ఏదనగా, శుద్ధాయ - నిర్మలుడైనట్టియు, సాధవే - సత్పురుషుడైన, ఆత్మజాయ - పుత్రుని కొరకు, పితా - తండ్రి, అఘమ్ - ద్రోహమును, అదాత్ హి - ఇచ్చెనో గదా?

ఓ దేవర్షీ! నీ భగవద్భక్తి అనే వ్రతము చాల గొప్పది. నీనుండి నేను ఒక విషయమును తెలియ గోరుచున్నాను. ప్రహ్లాదుడు నిర్మలస్వభావుడు, సత్పురుషుడు. ఆతనికి తండ్రి ద్రోహము చేయుటకు కారణమేమి?

పుత్రాన్ విప్రతికూలాన్ స్వాన్ పితరః పుత్రవత్సలాః ।
ఉపాలభంతే శిక్షార్థం నైవాఘమపరో యథా ।। 45

పితరః - తండ్రులు, పుత్రవత్సలాః - పుత్రులయందు ప్రేమగలవారు, విప్రతికూలాన్ - వ్యతిరేకులైన, స్వాన్ - తమ, పుత్రాన్ - పుత్రులను, శిక్షా-అర్థమ్ - శిక్షణనిచ్చుట కొరకై, ఉపాలభంతే - కోపపడెదరు, అపరః యథా - శత్రువు వలె, అఘమ్ - ద్రోహమును, న ఏవ - చేయనే చేయరు.

తండ్రులకు కొడుకులపై ప్రేమ మెండు. తమకు వ్యతిరేకముగా ప్రవర్తించే కొడుకులనైననూ తండ్రులు కేవలము శిక్షణనిచ్చుట కొరకు మాత్రమే కోపపడెదరు. అంతేగాని, తండ్రి శత్రువు వలె కొడుకునకు ద్రోహమును చేయనే చేయడు.

కిముతానువశాన్ సాధూంస్తాదృశాన్ గురుదేవతాన్ ।
ఏతత్కౌతూహలం బ్రహ్మన్నస్మాకం విధమ ప్రభో ।
పితుః పుత్రాయ యద్ద్వేషో మరణాయ ప్రయోజితః ।। 46

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే ప్రహ్లాదచరితే
ప్రహ్లాదగుణానువర్ణనం నామ చతుర్థోऽధ్యాయః ।।

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, ప్రభో - ఓ ప్రభూ!, అనువశాన్ - అనుకూలురైనట్టియు, సాధూన్ - సత్పురుషులైనట్టియు, గురుదేవతాన్ - పెద్దలను దైవముగా భావించే, తాదృశాన్ - అట్టి పుత్రులను గురించి, కిం ఉత - చెప్పునదేమున్నది?, ఏతత్ - ఈ, కౌతూహలమ్ - సందేహమును, విధమ - పోగొట్టుము, యత్ - ఏదనగా, పుత్రాయ - పుత్రుని కొరకు, పితుః - తండ్రియొక్క, ద్వేషః - ద్వేషము, మరణాయ - మరణము కొరకు, ప్రయోజితః - కారణమైనది.

ఓ మహర్షీ! తండ్రికి అనుకూలంగా ఉంటూ పెద్దలను దైవముగా భావించే సత్పురుషులైన పుత్రులకు తండ్రులు ద్రోహము చేయరని వేరుగా చెప్పవలయునా? ఓ ప్రభూ! కాని, తండ్రియగు హిరణ్యకశిపుడు పుత్రునిపై చూపిన ద్వేషము ఆతని మరణమునకే నిమిత్తమైనది. ఈ విధ్దూరమునకు కారణమును తెలుసుకోవాలనే కుతూహలము, దీనిపై సందేహము నాకు గలవు. దానిని నీవు పోగొట్టుము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
ప్రహ్లాదచరితమునందు ప్రహ్లాదుని గుణములను వర్ణించే
నాల్గవ అధ్యాయము ముగిసినది (4).

*****

# అథ పంచమోఽధ్యాయః

## ప్రహ్లాదుని చరితము - తొమ్మిది విధముల

నారద ఉవాచ ।
పౌరోహిత్యాయ భగవాన్ వృతః కావ్యః కిలాసురైః ।
శండామర్కౌ సుతౌ తస్య దైత్యరాజగృహాంతికే॥ 1

అసురైః - రాక్షసులచే, పౌరోహిత్యాయ - పౌరోహిత్యము కొరకు, భగవాన్ - పూజనీయుడగు, కావ్యః - శుక్రుడు, వృతః కిల - వరించబడెను, తస్య - ఆయనయొక్క, సుతౌ - పుత్రులైన, శండ-అమర్కౌ - శండుడు అమర్కుడు, దైత్యరాజగృహ-అంతికే - రాక్షసరాజగు హిరణ్యకశిపుని ఇంటికి సమీపమునందు.

రాక్షసులు పూజనీయుడగు శుక్రుని పురోహితునిగా ఎన్నుకొనిరి. ఆయనకు శండుడు, అమర్కుడు అనే ఇద్దరు పుత్రులు గలరు. వారు రాక్షసరాజగు హిరణ్యకశిపుని ఇంటికి సమీపములో నివసించిరి.

తౌ రాజ్ఞా ప్రాపితం బాలం ప్రహ్లాదం నయకోవిదమ్ ।
పాఠయామాసతుః పాఠ్యానన్యాంశ్చాసురబాలకాన్ ॥ 2

రాజ్ఞా - రాజుచే, ప్రాపితమ్ - పంపబడినట్టియు, నయకోవిదమ్ - తత్త్వవిచారమునందు పండితుడైనట్టియు, బాలమ్ - పిల్లవాడైన, ప్రహ్లాదమ్ - ప్రహ్లాదుని, అన్యాన్ - ఇతరులగు, అసురబాలకాన్ చ - రాక్షసుల పిల్లలను కూడ, తౌ - వారిద్దరు, పాఠ్యాన్ - పాఠములను, పాఠయామాసతుః - చదివించిరి.

హిరణ్యకశిపు మహారాజు ప్రహ్లాదుని వారి వద్దకు పంపెను. ప్రహ్లాదుడు పిల్లవాడే అయినా, తత్త్వవిచారమునందు పండితుడే. వారు ప్రహ్లాదుని, ఇతరరాక్షసబాలకులను కూడ పాఠములను చదివించిరి.

యత్తత్ర గురుణా ప్రోక్తం శుశ్రువేఽనుపపాఠ చ ।
న సాధు మనసా మేనే స్వపరాసద్గ్రహాశ్రయమ్ ॥ 3

తత్ర - అచట, గురుణా - గురువుచే, స్వపర-అసద్-గ్రహ-ఆశ్రయమ్ - తనవాడు పరాయివాడు అనే తప్పుడు ఆగ్రహమే ఆధారముగా గలది, యత్ - ఏదైతే, ప్రోక్తమ్ - బోధించబడినదో దానిని, శుశ్రువే - వినెను, చ - మరియు, అను - తరువాత, పపాఠ - పఠించెను, మనసా - మనస్సుచే, సాధు - మంచిది అని, న మేనే - తలపోయలేదు.

ఆ గురుకులమునందు గురువు బోధించిన పాఠమును ప్రహ్లాదుడు విని తరువాత చదివెను. కాని, ఆ బోధకు తనవాడు, పరాయివాడు అనే తప్పుడు పట్టుదలయే ఆధారముగా నుండుటచే, అతని మనస్సునకు ఆ బోధ మంచిది అనిపించలేదు.

ఏకదాఽసురరాట్ పుత్రమంకమారోప్య పాండవ ।
పప్రచ్ఛ కథ్యతాం వత్స మన్యతే సాధు యద్భవాన్ ॥ 4

పాండవ - ఓ ధర్మరాజా!, ఏకదా - ఒకనాడు, అసురరాట్ - రాక్షసరాజగు హిరణ్యకశిపుడు, పుత్రమ్ - పుత్రుడగు ప్రహ్లాదుని, అంకమ్ - తొడను, ఆరోప్య - ఎక్కించుకొని, పప్రచ్ఛ - అడిగెను, వత్స - కుమారా!, కథ్యతామ్ - చెప్పబడుగాక!, యత్ - దేనిని, భవాన్ - నీవు, సాధు - మంచిది అని, మన్యతే - తలంచెదవో.

ఓ ధర్మరాజా! ఒకనాడు రాక్షసరాజగు హిరణ్యకశిపుడు పుత్రుడగు ప్రహ్లాదుని తన ఒడిలో కూర్చుండబెట్టుకొని, ఇట్లు ప్రశ్నించెను -- కుమారా! నీవు చదివినవాటిలో నీకు మంచిదని తోచినదానిని చెప్పుము.

ప్రహ్లాద ఉవాచ ।
తత్సాధు మన్యేఽసురవర్య దేహినాం

సదా సముద్విగ్నధియామసద్గ్రహాత్ ।
హిత్వాఽఽత్మపాతం గృహమంధకూపం
వనం గతో యద్ధరిమాశ్రయేత ।। 5

అసురవర్య - ఓ రాక్షసశ్రేష్ఠా!, అసద్-గ్రహాత్ - మిథ్యయందలి ఆగ్రహము వలన, సదా - ఎల్లవేళలా, సముద్విగ్నధియామ్ - మిక్కిలి ఖేదమును పొందే బుద్ధిగల, దేహినామ్ - మానవులకు, తత్ - అది, సాధు - మంచిది అని, మన్యే - తలంచెదను, యత్ - ఏదనగా, ఆత్మపాతమ్ - తనకు పతనమును కలిగించునట్టియు, అంధకూపమ్ - చీకటి నుయ్యివంటి, గృహమ్ - గృహమును, హిత్వా - విడిచిపెట్టి, వనమ్ - అడవిని, గతః - పొందినవాడై, హరిమ్ - శ్రీహరిని, ఆశ్రయేత - శరణు పొందునో.

ప్రహ్లాదుడిట్లు పలికెను --- ఓ రాక్షసశ్రేష్ఠా! మానవులు మిథ్య యగు విషయభోగములయందు ఆగ్రహము గలవారగుటచే, వారి అంతఃకరణము తీవ్రమగు ఖేదమును పొందుచుండును. విషయభోగములకు నిలయమగు గృహము చీకటి నుయ్యి వంటిది. అది మానవుని పతనమునకు హేతువు. అట్టి గృహము (విషయభోగములు) ను జనులు విడిచిపెట్టి, అడవి (సత్సంగము) ని చేరి, శ్రీహరిని శరణు పొందవలెను. ఇదియే వారికి క్షేమమును కలిగించునని నా అభిప్రాయము.

నారద ఉవాచ ।
శ్రుత్వా పుత్రగిరో దైత్యః పరపక్షసమాహితాః ।
జహాస బుద్ధిర్బాలానాం భిద్యతే పరబుద్ధిభిః ।। 6

పరపక్షసమాహితాః - శత్రువగు విష్ణువునందు నిష్ఠ గల, పుత్రగిరః - పుత్రుని మాటలను, శ్రుత్వా - విని, దైత్యః - రాక్షసుడు, జహాస - నవ్వెను, బాలానామ్ - పిల్లల, బుద్ధిః - బుద్ధి, పరబుద్ధిభిః - శత్రువునందు బుద్ధి గలవారిచే, భిద్యతే - విపరీతము చేయబడును.

తనకు శత్రువగు శ్రీహరియందు నిష్ఠ గల వచనములను తన పుత్రుడగు ప్రహ్లాదుడు పలుకగా విని, ఆ రాక్షసుడు నవ్వి ఇట్లు తలచెను -- శత్రువునందు నిష్ఠ గలవారలు పిల్లల బుద్ధిని చెడగొట్టుచున్నారు.

సమ్యగ్విధార్యతాం బాలో గురుగేహే ద్విజాతిభిః ।
విష్ణుపక్షైః ప్రతిచ్ఛన్నైర్న భిద్యేతాస్య ధీర్యథా ।। 7

బాలః - పిల్లవాడు, గురుగేహే - గురువుగారి ఇంటియందు, ద్విజాతిభిః - వేదవేత్తలచే, సమ్యక్ - చక్కగా, విధార్యతామ్ - రక్షించబడు గాక!, యథా - ఏ విధముగానైతే, ప్రతిచ్ఛన్నైః - కపటవేషధారులగు, విష్ణుపక్షైః - విష్ణువు పక్షము వారిచే, అస్య - వీని, ధీః - బుద్ధి, న భిద్యేత - చెడగొట్టబడకుండునో.

గురువుగారింట్లో పిల్లవాడగు ప్రహ్లాదుని వేదవేత్తలగు గురువులు చక్కగా -- కపటవేషధారులగు విష్ణుపక్షీయులు వాని బుద్ధిని చెడగొట్టని విధముగా -- రక్షించవలెను (అని ఆతడు ఆదేశించెను).

గృహమానీతమాహూయ ప్రహ్లాదం దైత్యయాజకాః ।
ప్రశస్య శ్లక్ష్ణయా వాచా సమపృచ్ఛంత సామభిః ।। 8

గృహమ్ - ఇంటిని గురించి, ఆనీతమ్ - తీసుకురాబడిన, ప్రహ్లాదమ్ - ప్రహ్లాదుని, దైత్యయాజకాః - రాక్షస పురోహితులు, ఆహూయ - పిలిచి, శ్లక్ష్ణయా - మధురమగు, వాచా - వాక్కుతో, ప్రశస్య - కొనియాడి, సామభిః - మంచిమాటలతో, సమపృచ్ఛంత - ప్రశ్నించిరి.

తమ ఇంటికి కొనిరాబడిన ఆ ప్రహ్లాదుని రాక్షస పురోహితులు దగ్గరకు పిలిచి, మధురమగు స్వరముతో మంచి మాటలతో ఇట్లు ప్రశ్నించిరి.

వత్స ప్రహ్లాద భద్రం తే సత్యం కథయ మా మృషా ।
బాలానతి కుతస్తుభ్యమేష బుద్ధివిపర్యయః ।। 9

వత్స - కుమారా!, ప్రహ్లాద - ప్రహ్లాదా!, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!, సత్యమ్ - సత్యమును, కథయ - చెప్పుము, మృషా - అసత్యమును, మా - చెప్పవద్దు, బాలాన్ - పిల్లలను, అతి - అతిక్రమించి, తుభ్యమ్ - నీ కొరకు, ఏషః - ఈ, బుద్ధివిపర్యయః - చెడు బుద్ధి, కుతః - ఎక్కడిది?

ఓ వత్సా! ప్రహ్లాదా! నీకు మంగళమగు గాక! నీవు సత్యమునే చెప్పవలెను. అసత్యమును చెప్పవద్దు. పిల్లలెవ్వరికైననూ లేని ఈ చెడు బుద్ధి నీకు ఎక్కడనుండి వచ్చినది?

బుద్ధిభేదః పరకృత ఉతాహో తే స్వతోఽభవత్ ।
భణ్యతాం శ్రోతుకామానాం గురూణాం కులనందన ।। 10

బుద్ధిభేదః - చెడు బుద్ధి, పరకృతః - శత్రువులచే చేయబడినదా?, ఉత - అట్లు గాక, అహో - ఆశ్చర్యము!, తే - నీకు, స్వతః - స్వయముగనే, అభవత్ - కలిగెనా?, కులనందన - కులమువారిని సంతోషపెట్టువాడా!, శ్రోతుకామానామ్ - వినగోరే, గురూణామ్ - గురువులకు, భణ్యతామ్ - చెప్పబడుగాక!

నీకు ఈ చెడు బుద్ధిని శత్రువులెవరైనా కలిగించిరా? లేక, నీ అంతట నీకే కలిగినదా? ఆశ్చర్యము! మీ వంశీయుల ఆనందము నీ అధీనములో నున్నది. గురువులమగు మేము వినగోరుచున్నాము. చెప్పుము.

ప్రహ్లాద ఉవాచ ।
స్వః పరశ్చేత్యసద్గ్రాహః పుంసాం యన్మాయయా కృతః ।
విమోహితధియాం దృష్టస్తస్మై భగవతే నమః ।। 11

యత్-మాయయా - ఎవని మాయచే, కృతః - చేయబడిన, స్వః - తనవాడు, పరః - పరాయి వాడు, ఇతి - అనే, అసద్-గ్రాహః - మిథ్యాయైన ఆగ్రహము, విమోహితధియామ్ - వ్యామోహమును పొందిన బుద్ధి గల, పుంసామ్ - మానవులకు, దృష్టః - కానవచ్చునో, తస్మై - అట్టి, భగవతే - భగవానుని కొరకు, నమః - నమస్కారము.

ప్రహ్లాదుడిట్లు పలికెను --- భగవానుని మాయచే వ్యామోహమును పొందిన బుద్ధి గల మానవులలో తనవాడు - పరాయివాడు అనే ఆగ్రహము కానవచ్చును. ఈ భేదము వాస్తవము కాదు. అట్టి మాయాధీశుడగు భగవానునకు నమస్కారము.

స యదాఽనువ్రతః పుంసాం పశుబుద్ధిర్విభిద్యతే ।
అన్య ఏష తథాఽన్యోఽహమితి భేదగతాఽసతీ ॥ 12

సః - ఆ భగవానుడు, యదా - ఏ కాలమునందు, అనువ్రతః - అనుకూలుడో అప్పుడు, ఏషః - ఈతడు, అన్యః - వేరు, తథా - మరియు, అహమ్ - నేను, అన్యః - వేరు, ఇతి - అనే, భేదగతా - భేదమును పొందిన, అసతీ - దుష్టమగు, పుంసామ్ - మానవుల, పశుబుద్ధిః - అవివేక బుద్ధి, విభిద్యతే - తొలగిపోవును.

నేను వేరు, ఈతడు వేరు అనే భేదబుద్ధికి మూలము అవివేకము. ఈ అజ్ఞానము మానవులలో ఉన్నది. కాని, ఆ భగవానుని అనుగ్రహము కలిగినప్పుడు దుష్టమగు ఈ భేదబుద్ధి తొలగిపోవును.

స ఏష ఆత్మా స్వపరేత్యబుద్ధిభిః
దురత్యయానుక్రమణో నిరూప్యతే।
ముహ్యంతి యద్వర్త్మని వేదవాదినో
బ్రహ్మాదయో హ్యేష భినత్తి మే మతిమ్ ॥ 13

ఆత్మా - ఆత్మస్వరూపుడు, అబుద్ధిభిః - అవివేకులచే, దురత్యయ-అనుక్రమణః - ఘటిల్ల శక్యము కాని భజనము గలవాడు అగు, సః - ఆ, ఏషః - ఈ భగవానుడు, స్వపర-ఇతి - తనవాడు పరాయివాడు అని, నిరూప్యతే - వర్ణించబడుచున్నాడు, యద్-వర్త్మని - ఎవ్వాని మార్గమునందు, బ్రహ్మ-ఆదయః - బ్రహ్మగారు మొదలైన, వేదవాదినః హి - వేదవేత్తలు కూడ, ముహ్యంతి - వ్యామోహపడుచున్నారో, మే - నా, మతిమ్ - బుద్ధిని, భినత్తి - వేరు చేయుచున్నాడు (పాడు చేయుచున్నాడు).

అట్టి ఈ భగవానుడు ఆత్మస్వరూపుడై యున్నాడు. తనవాడు, పరాయి వాడు అనే భేదబుద్ధి గల అవివేకులకు ఆయనను భజించుట చాల కఠినము. అజ్ఞానులు అద్వితీయమగు ఆత్మను తనవాడు - పరాయి వాడు అని వర్ణిస్తూ ఉంటారు. ఆ భగవానుని యథార్థస్వరూపము విషయములో బ్రహ్మగారు మొదలైన వేదవేత్తలు కూడ వ్యామోహపడుచున్నారు. నా బుద్ధిని చెడగొట్టినది (మీ బుద్ధికంటె విలక్షణముగా చేసినది) ఆయనయే.

యథా భ్రామ్యత్యయో బ్రహ్మన్ స్వయమాకర్షసన్నిధౌ ।
తథా మే భిద్యతే చేతశ్చక్రపాణేర్యదృచ్ఛయా ।। 14

బ్రహ్మన్ - గురువుగారూ!, యథా - ఏ విధముగానైతే, అయః - ఇనుము, అకర్షసన్నిధౌ - అయస్కాంతముయొక్క సన్నిధియందు, స్వయమ్ - తనంత తాను, భ్రామ్యతి - కదులునో, తథా - అదే విధముగా, మే - నాయొక్క, చేతః - మనస్సు, చక్రపాణేః - చక్రము చేతియందు గల శ్రీహరియొక్క (సన్నిధియందు), యదృచ్ఛయా - తనంత తానుగా (ఈశ్వరేచ్ఛచే), భిద్యతే - కరిగిపోవును (విలక్షణముగా నున్నది).

గురువు గారూ! ఇనుము అయస్కాంతముయొక్క సన్నిధిలో తనంత తాను కదులును. అదే విధముగా నా మనస్సు చక్రపాణియగు శ్రీహరి సన్నిధిలో తనంత తానే (ఈశ్వరేచ్ఛచే) కరిగిపోవును (మీ బుద్ధుల కంటె విలక్షణముగా నున్నది). లేదా, మీ మాటల్లో చెప్పాలంటే, తనంత తానే చెడిపోయినది.

నారద ఉవాచ ।
ఏతావద్బ్రాహ్మణాయోక్త్వా విరరామ మహామతిః ।
తం నిర్భర్త్స్యాథ కుపితస్స దీనో రాజసేవకః ।। 15

మహామతిః - గొప్ప వివేకియగు ప్రహ్లాదుడు, ఏతావత్ - ఇంత మాత్రము, బ్రాహ్మణాయ - వేదవేత్తయగు గురువు కొరకు, ఉక్త్వా - పలికి, విరరామ - విరమించెను, అథ - తరువాత, దీనః - దీనుడు, రాజసేవకః - రాజునకు బంటు అగు, సః - ఆ పురోహితుడు, తమ్ - ఆ ప్రహ్లాదుని, నిర్భర్త్స్య - అదలించి, కుపితః - కోపమును పొందినవాడు.

గొప్ప వివేకియగు ప్రహ్లాదుడు పురోహితునితో ఇంత మాత్రమే పలికి విరమించెను. ఆ పురోహితుడు రాజునకు బంటు, దీనుడు. అపుడాయన కోపముతో ఆ ప్రహ్లాదుని అదిలించెను.

ఆనీయతామరే వేత్రమస్మాకమయశస్కరః ।
కులాంగారస్య దుర్బుద్ధేశ్చతుర్థోఽస్యోదితో దమః ।। 16

అరే - ఓరీ!, వేత్రమ్ - బెత్తము, ఆనీయతామ్ - తీసుకు రాబడు గాక!, అస్మాకమ్ - మాకు, అయశః-కరః - చెడ్డ పేరును తెచ్చువాడు, కుల-అంగారస్య - వంశమునకు చిచ్చువంటి, దుర్బుద్ధేః - దుష్టబుద్ధి యగు, అస్య - వీనికి, చతుర్థః - నాల్గవ, దమః - దండము, ఉదితః - చెప్పబడినది.

ఓరీ! బెత్తము తీసుకు రా! వంశమునకు చిచ్చువంటి ఈ దుర్బుద్ధి యగు ప్రహ్లాదుడు మాకు చెడ్డ పేరును తెచ్చినాడు. సామదానభేదదండ ములనే నాలుగు ఉపాయములలో వీనికి నాల్గవదియగు దండమే తగునని శాస్త్రము చెప్పుచున్నది.

దైతేయచందనవనే జాతోఽయం కంటకద్రుమః ।
యన్మూలోన్మూలపరశోర్విష్ణోర్నాలాయితోఽర్భకః ।। 17

దైతేయచందనవనే - రాక్షసులు అనే గంధపు చెట్ల అడవియందు, అయమ్ - ఈ, కంటకద్రుమః - ముళ్ల చెట్టు, జాతః - పుట్టినది, యత్-మూల-ఉన్మూలపరశోః - దేని మొదలును తెగగొట్టే గొడ్డలియగు, విష్ణోః - విష్ణువునకు, అర్భకః - పిల్లవాడు, నాలాయితః - చేతిపిడివలె ఆచరించినాడో.

రాక్షసులనే గంధపు చెట్ల అడవిలో ఈ పిల్లవాడు ముళ్ల చెట్టై పుట్టినాడు. విష్ణువు ఆ చెట్లను మొదళ్లనుండి నరికే గొడ్డలి కాగా, ఈ బుడతడు ఆ గొడ్డలికి చేతిపిడి యైనాడు.

ఇతి తం వివిధోపాయైర్భీషయంస్తర్జనాదిభిః ।
ప్రహ్లాదం గ్రాహయామాస త్రివర్గస్యోపపాదనమ్ ।। 18

ఇతి - ఈ విధముగా, తమ్ - ఆ, ప్రహ్లాదమ్ - ప్రహ్లాదుని, తర్జన-ఆదిభిః - చూపుడు వ్రేలితో అదలించుట మొదలైన, వివిధ-ఉపాయైః - అనేకములగు ఉపాయములతో, భీషయన్ - భయపెట్టుచున్నవాడై, త్రివర్గస్య - ధర్మార్థకామములనే మూడు పురుషార్థములకు, ఉపపాదనమ్ - ప్రతిపాదించే శాస్త్రమును, గ్రాహయామాస - పఠింప జేసెను.

ఆ పురోహితుడు ఈ విధముగా ప్రహ్లాదుని చూపుడు వ్రేలితో అదలించుట, కొట్టుట మొదలైన వివిధములగు ఉపాయములతో భయపెట్టెను. ఆయన ధర్మార్థకామములనే మూడు పురుషార్థములను మాత్రమే ప్రతిపాదించే శాస్త్రమును అతనిచే వల్లింప జేసెను.

తత ఏనం గురుర్ జ్ఞాత్వా జ్ఞాతజ్ఞేయచతుష్టయమ్ ।
దైత్యేంద్రం దర్శయామాస మాతృమృష్టమలంకృతమ్ ।।19

తతః - తరువాత, గురుః - గురువు, ఏనమ్ - ఈ ప్రహ్లాదుని, జ్ఞాతజ్ఞేయచతుష్టయమ్ - తెలియబడిన తెలియదగిన నాలుగు ఉపాయములు గలవానినిగా, జ్ఞాత్వా - గుర్తించి, మాతృమృష్టమ్ - తల్లిచే అభ్యంగనము చేయించబడి, అలంకృతమ్ - అలంకరించబడిన ప్రహ్లాదుని, దైత్య-ఇంద్రమ్ - రాక్షసరాజును, దర్శయామాస - చూపించెను.

రాజకుమారుడు తెలియదగిన సామదానభేదదండములనే నాలుగు ఉపాయములను ప్రహ్లాదుడు తెలుసుకొనెను. ప్రహ్లాదుని తల్లి ఆతనిచే అభ్యంగనస్నానము చేయించి భూషణములనలంకరింప జేసెను. తరువాత ఆ పురోహితుడు ప్రహ్లాదుని హిరణ్యకశిపునకు చూపించెను.

పాదయోః పతితం బాలం ప్రతినంద్యాశిషాऽసురః ।
పరిష్వజ్య చిరం దోర్భ్యాం పరమామాప నిర్వృతిమ్ ।। 20

పాదయోః - కాళ్లవద్ద, పతితమ్ - పడిన, బాలమ్ - పిల్లవానిని, ఆశిషా - ఆశీర్వచనముతో, ప్రతినంద్య - అభినందించి, అసురః - ఆ రాక్షసుడు, చిరమ్ - చాలసేపు, దోర్భ్యామ్ - రెండు చేతులతో, పరిష్వజ్య - కౌగిలించుకొని, పరమామ్ - గొప్ప, నిర్వృతిమ్ - ఆనందమును, ఆప - పొందెను.

హిరణ్యకశిపుడు తన పాదములకు నమస్కరించిన ప్రహ్లాదుని ఆశీర్వచనముతో అభినందించెను. ఆయన ఆ బాలుని రెండు చేతులతో చాల సేపు కౌగిలించుకొని గొప్ప ఆనందమును పొందెను.

ఆరోప్యాంకమవఘ్రాయ మూర్ధన్యశ్రుకలాంబుభిః ।
ఆసించన్ వికసద్వక్త్రమిదమాహ యుధిష్ఠిర ।। 21

యుధిష్ఠిర - ఓ ధర్మరాజా!, అంకమ్ - తొడను, ఆరోప్య - ఎక్కించుకొని, మూర్ధని - నుదుటిపై, అవఘ్రాయ - ముద్దాడి, అశ్రుకలా-అంబుభిః - కన్నీటి బిందువులతో, ఆసించన్ - తడుపుచున్నవాడై, వికసద్-వక్త్రమ్ - వికసించిన ముఖము గల ప్రహ్లాదుని ఉద్దేశించి, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను.

ఓ ధర్మరాజా! ఆతడు వికసించిన ముఖము గల ప్రహ్లాదుని తన ఒడిలో కూర్చుండ బెట్టుకొని నుదుటిపై ముద్దాడి కన్నీటి బిందువులతో ఆతనిని తడుపుతూ ఇట్లు పలికెను.

హిరణ్యకశిపురువాచ ।
ప్రహ్రాదానూచ్యతాం తాత స్వధీతం కించిదుత్తమమ్ ।
కాలేనైతావతాఽఽయుష్మన్ యదశిక్షద్గురోర్భవాన్ ।। 22

తాత - కుమారా!, ఆయుష్మన్ - చిరంజీవీ!, ప్రహ్రాద - ఓ ప్రహ్లాదా!, ఏతావతా - ఇంతటి, కాలేన - కాలముచే, సు-అధీతమ్ - చక్కగా అధ్యయనము చేయబడిన, ఉత్తమమ్ - ఉత్తమమైన, కించిత్ - ఏదో ఒకటి, అనూచ్యతామ్ - వల్లించినట్లుగా చెప్పబడుగాక!, భవాన్ - నీవు, యత్ - దేనినైతే, గురోః - గురువునుండి, అశిక్షత్ - నేర్చితివో.

హిరణ్యకశిపుడిట్లు పలికెను --- ఓ కుమారా! ప్రహ్లాదా! చిరంజీవీ! ఇంత కాలము నీవు గురువు వద్ద చక్కగా అధ్యయనము చేసి వల్లించిన పాఠములలో ఏదో ఒక ఉత్తమమైన పాఠమును అప్పజెప్పుము.

ప్రహ్రాద ఉవాచ ।
శ్రవణం కీర్తనం విష్ణోస్స్మరణం పాదసేవనమ్ ।
అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ।। 23

ఇతి పుంసార్పితా విష్ణౌ భక్తిశ్చేన్నవలక్షణా ।
క్రియతే భగవత్యద్ధా తన్మన్యేఽధీతముత్తమమ్ ॥ 24

విష్ణోః - విష్ణువుయొక్క, శ్రవణమ్ - వినుట, కీర్తనమ్ - కీర్తించుట, స్మరణమ్ - స్మరించుట, పాదసేవనమ్ - పాదములను సేవించుట, అర్చనమ్ - పూజించుట, వందనమ్ - నమస్కరించుట, దాస్యమ్ - దాసభావము, సఖ్యమ్ - మైత్రి, ఆత్మనివేదనమ్ - తనను తాను సమర్పించుకొనుట, ఇతి - అనే, నవలక్షణా - తొమ్మిది లక్షణములు గల, భక్తిః - భక్తి, విష్ణౌ భగవతి - విష్ణు భగవానునియందు, అర్పితా - అర్పించబడినదై, పుంసా - మానవునిచే, అద్ధా - సాక్షాత్తుగా, క్రియతే చేత్ - చేయబడే పక్షములో, తత్ - అది, ఉత్తమమ్ - ఉత్తమమైన, అధీతమ్ - చదువు అని, మన్యే - తలచెదను.

ప్రహ్లాదుడిట్లు పలికెను --- శ్రీహరియొక్క లీలలను వినుట, కీర్తించుట, స్మరించుట, శ్రీహరి పాదములను సేవించుట, పూజించుట, నమస్కరించుట, శ్రీహరి యెడల దాసభావము, మైత్రి, శ్రీహరికి తనను తాను సమర్పించుకొనుట అని భక్తి తొమ్మిది విధములుగా నున్నది. సాధకుడు ఇట్టి భక్తిని సాక్షాత్తుగా శ్రీహరియందు సమర్పణ భావముతో చేసినచో, అదియే ఉత్తమమైన అధ్యయనమని నా అభిప్రాయము.

నిశమ్యైతత్సుతవచో హిరణ్యకశిపుస్తదా ।
గురుపుత్రమువాచేదం రుషా ప్రస్ఫురితాధరః ॥ 25

ఏతత్ - ఈ, సుతవచః - పుత్రుని మాటను, నిశమ్య - విని, తదా - అప్పుడు, హిరణ్యకశిపుః - హిరణ్యకశిపుడు, రుషా - కోపముతో, ప్రస్ఫురిత-అధరః - బాగా వణకుచున్న క్రింది పెదవి గలవాడై, గురుపుత్రమ్ - గురువుయొక్క పుత్రుని ఉద్దేశించి, ఇదమ్ - ఈ మాటను, ఉవాచ - పలికెను.

అప్పుడు పుత్రుని ఈ మాటను విన్న హిరణ్యకశిపుని క్రింది పెదవి కోపముతో బాగా వణకజొచ్చెను. ఆతడు గురువుయొక్క పుత్రుని ఉద్దేశించి, ఇట్లు పలికెను.

బ్రహ్మబంధో కిమేతత్తే విపక్షం శ్రయతాఽసతా ।
అసారం గ్రాహితో బాలో మామనాదృత్య దుర్మతే ॥ 26

బ్రహ్మబంధో - ఓ బ్రాహ్మణాధమా!, దుర్మతే - దుర్బుద్ధీ!, ఏతత్ - ఇది, కిమ్ - ఏమిటి?, విపక్షమ్ - శత్రుపక్షమును, శ్రయతా - ఆశ్రయించిన, అసతా - దుష్టుడవగు, తే - నీచే, మామ్ - నన్ను, అనాదృత్య - కాదని, బాలః - పిల్లవాడు, అసారమ్ - నిస్సారమును, గ్రాహితః - చదివింపజేసినాడు.

ఓ బ్రాహ్మణాధమా! ఏమిటి ఇది? నీవు దుర్బుద్ధివి. నీవు నా శత్రువుల పక్షములో చేరిన దుష్టుడవు. నా మాటను కాదని పిల్లవానికి సారములేని చదువును నేర్పితివి.

సంతి హ్యసాధవో లోకే దుర్మైత్రాశ్ఛద్మవేషిణః ।
తేషాముదేత్యఘం కాలే రోగః పాతకినామివ ॥ 27

లోకే - లోకమునందు, దుర్-మైత్రాః - మోసపూరితమైన మైత్రిగలవారు, ఛద్మవేషిణః - కపటవేషము గలవారు అగు, అసాధవః - దుష్టులు, సంతి హి - నిశ్చయముగా ఉన్నారు, కాలే - సమయమునందు, తేషామ్ - వారియొక్క, అఘమ్ - పాపము, పాతకినామ్ - పాపులకు, రోగః ఇవ - రోగము వలె, ఉదేతి - ప్రకటమగును.

లోకములో కపటవేషముతో మోసపూరితమైన మైత్రిని నెరపే దుష్టులకు లోటు లేదు. పాపుల పాపము సమయము వచ్చినప్పుడు రోగము రూపములో బయట పడును. అదే విధముగా, ఇట్టి దుష్టుల పాపము కూడ బయట పడును.

గురుపుత్ర ఉవాచ ।
న మత్ప్రణీతం న పరప్రణీతం
సుతో వదత్యేష తవేంద్రశత్రో ।
నైసర్గికీయం మతిరస్య రాజన్
నియచ్ఛ మన్యుం కదదాస్స్మ మా నః ॥ 28

ఇంద్రశత్రో - ఇంద్రుని శత్రువైన ఓ హిరణ్యకశిపూ!, ఏషః - ఈ, తవ - నీ, సుతః - పుత్రుడు, మత్-ప్రణీతమ్ - నాచే ప్రేరితమైనదానిని, న వదతి - చెప్పుట లేదు, పరప్రణీతమ్ - ఇతరునిచే ప్రేరితమైనదానిని, న - చెప్పుట లేదు, రాజన్ - ఓ రాజా!, అస్య - వీనికి, ఇయమ్ - ఈ, మతిః - బుద్ధి, నైసర్గికీ - సహజసిద్ధము, మన్యుమ్ - కోపమును, నియచ్ఛ - నియంత్రించుము, నః - మాకు, కత్ - దోషమును, మా స్మ అదాః - అంట గట్టవద్దు.

గురుపుత్రుడు ఇట్లు పలికెను --- ఓ రాజా! నీవు ఇంద్రుని శత్రుడవు. నీ ఈ పుత్రుడు చెప్పేది నేను గాని, ఇతరులు గాని, ప్రేరేపించినది కాదు. ఈ బుద్ధి వీనికి సహజముగానే కలిగినది. నీవు కోపమును నియంత్రించుము. మాపై తప్పును రుద్దవద్దు.

నారద ఉవాచ ।
గురుణైవం ప్రతిప్రోక్తో భూయ ఆహాఽసురస్సుతమ్ ।
న చేద్గురుముఖీయం తే కుతోఽభద్రాఽసతీ మతిః ।। 29

గురుణా - గురువుచే, ఏవమ్ - ఈ విధముగా, ప్రతిప్రోక్తః - బదులు చెప్పబడిన, అసురః - రాక్షసుడు, సుతమ్ - పుత్రుని ఉద్దేశించి, భూయః - మరల, ఆహ - పలికెను, తే - నీ, ఇయమ్ - ఈ, అభద్రా - అమంగళకరము, అసతీ - దుష్టము అగు, మతిః - బుద్ధి, గురుముఖీ - గురువు ఆధారముగా గలది, న చేత్ - కానిచో, కుతః - ఎక్కడిది?

నారద మహర్షి ఇట్లు పలికెను --- గురుపుత్రుడు ఈ విధముగా బదులీయగా, హిరణ్యకశిపుడు మరల పుత్రునితో నిట్లనెను -- అమంగళకరము, దుష్టము అగు ఈ నీ బుద్ధి గురువు నేర్పినది కానిచో, నీకు ఎట్లు అబ్బినది?

ప్రహ్లాద ఉవాచ ।
మతిర్న కృష్ణే పరతస్స్వతో వా మిథోఽభిపద్యేత గృహవ్రతానామ్।
అదాంతగోభిర్విశతాం తమిస్రం పునః పునశ్చర్వితచర్వణానామ్।।

గృహవ్రతానామ్ - ఇల్లే వ్రతముగా కలిగినట్టియు, అదాంతగోభిః - వశములో లేని ఇంద్రియములతో, తమిస్రమ్ - అంధకారముతో నిండిన సంసారమును, విశతామ్ - ప్రవేశించునట్టియు, పునః పునః - మరల మరల, చర్వితచర్వణానామ్ - నమిలినదానినే నములు వారలకు, కృష్ణే - శ్రీకృష్ణునియందు, మతిః - బుద్ధి, స్వతః - తనంత తానుగా గాని, పరతః వా - ఇతరుల ద్వారా గాని, మిథః - ఒకరికొకరు గాని, న అభిపద్యేత - లగ్నము కాదు.

ప్రహ్లాదుడిట్లు పలికెను --- ఇల్లే వ్రతముగా కలిగి ఇంద్రియములు వశములో లేనివారై అంధకారముతో నిండిన సంసారములో మరల మరల ప్రవేశిస్తూ చేసిన కర్మలనే చేస్తూ అనుభవించిన భోగములనే అనుభవిస్తూ ఉండే లౌకికులకు బుద్ధి, తనంత తానుగా గాని, ఇతరుల ద్వారా గాని, పరస్పరము సత్సంగము వలన గాని, శ్రీకృష్ణునియందు లగ్నము కాబోదు.

న తే విదుస్స్వార్థగతిం హి విష్ణుం
దురాశయా యే బహిరర్థమానినః ।
అంధా యథాంధైరుపనీయమానా
వాచీశతంత్యాముురుదామ్ని బద్ధాః ॥ 31

దురాశయాః - కలుషితమైన అంతఃకరణము గలవారు, బహిః-అర్థమానినః - బాహ్యప్రపంచమునందు మాత్రమే పురుషార్థము గలవారిని ఆదర్శముగా స్వీకరించువారు, యే - ఎవరు గలరో, తే - వారు, అంధైః - గ్రుడ్డివారిచే, ఉపనీయమానాః - నడిపించబడే, అంధాః యథా - గ్రుడ్డివారు వలె, ఈశతంత్యామ్ - ఈశ్వరుని పెద్దత్రాడైనట్టియు, ఉరుదామ్ని - అనేకములగు చిన్నత్రాళ్ళుగల, వాచి - వేదవాక్కునందు, బద్ధాః - కట్టబడినవారై, స్వ-అర్థగతిమ్ - ఆత్మరూపుడగు శ్రీహరియే పురుషార్థముగా గలవారలు పొందే, విష్ణుమ్ - శ్రీహరిని, న హి విదుః - తెలియజాలరు.

భోగవాసనలతో కలుషితమైన అంతఃకరణము గల జనులు బాహ్యప్రపంచమునందు మాత్రమే పురుషార్థము గలదని భావించి జీవించే లౌకికులను ఆదర్శముగా స్వీకరించెదరు. వీరిని గ్రుడ్డివానిచే నడిపించబడే

గ్రుడ్డివారితో పోల్చవచ్చును. ఇట్టివారిని కామ్యకర్మలను బోధించే వేద భాగము పెద్దత్రాడై కామనలను నెరవేర్చే ఆయా కర్మలే చిన్న చిన్న త్రాళ్లు కాగా బంధించి యుంచును. ఆ వేదభాగమును వెలయించినది కూడ ఆ శ్రీహరియే. ఇట్టివారు ఆ శ్రీహరిని తెలియలేరు. ఎవరైతే ఆత్మరూపుడగు శ్రీహరిని పరమపురుషార్థముగా గుర్తించెదరో, వారు శ్రీహరిని పొందెదరు.

నైషాం మతిస్తావదురుక్రమాంఘ్రిం
స్పృశత్యనర్థాపగమో యదర్థః ।
మహీయసాం పాదరజోఽభిషేకం
నిష్కించనానాం న వృణీత యావత్ ॥ 32

ఏషామ్ - వీరియొక్క, మతిః - బుద్ధి, తావత్ - అంతవరకు, ఉరుక్రమ-అంఘ్రిమ్ - పెద్ద అడుగులు వేసిన శ్రీహరియొక్క పాదమును, న స్పృశతి - స్పృశించదు, యావత్ - ఎంతవరకైతే, నిష్కించనానామ్ - ఏమీ లేనట్టియు, మహీయసామ్ - మహాత్ములైనవారి, పాదరజః-అభిషేకమ్ - పాదముల ధూళియొక్క అభిషేకమును, న వృణీత - వరించడో, యద్-అర్థః - దేని ప్రయోజనము, అనర్థ-అపగమః - అనర్థముల దూరమగుటయో.

ఏమీ లేనివారే అయిననూ మహాత్ములైనవారి పాదముల ధూళితో అభిషేకమును సాధకులు కోరుకొనవలెను. ఎందుకంటే, అట్టి అభిషేకము జరిగినప్పుడు మాత్రమే సాధకుల బుద్ధి, వామనావతారములో పెద్ద అడుగులు వేసిన శ్రీహరియొక్క పాదమును స్మరించును. అంతవరకు వారి బుద్ధికి శ్రీహరి పాదముల స్మరణము కలుగదు. అనర్థములు దూరమగుటయే అట్టి స్మరణమునకు ప్రయోజనము.

ఇత్యుక్త్వోపరతం పుత్రం హిరణ్యకశిపూ రుషా ।
అంధీకృతాత్మా స్వోత్సంగాన్నిరస్యత మహీతలే ॥ 33

ఇతి - ఈ విధముగా, ఉక్త్వా - పలికి, ఉపరతమ్ - విరమించిన, పుత్రమ్ - పుత్రుని, రుషా - కోపముతో, అంధీకృత-ఆత్మా - గ్రుడ్డిదిగా

చేయబడిన బుద్ధి గల, హిరణ్యకశిపుః - హిరణ్యకశిపుడు, స్వ-ఉత్సంగాత్ - తన ఒడినుండి, మహీతలే - నేలపై, నిరస్యత - పారద్రోసెను.

ఇట్లు పలికి విరమించిన పుత్రుని హిరణ్యకశిపుడు కోపముతో తన ఒడినుండి నేలపైకి పారద్రోసెను. అతని బుద్ధి కోపముచే గ్రుడ్డిది ఆయెను (వివేకమును కోల్పోయెను).

ఆహామర్షరుషావిష్టః కషాయీభూతలోచనః ।
వధ్యతామాశ్వయం వధ్యో నిస్సారయత నైర్‌ృతాః ।। 34

అమర్షరుషావిష్టః - అసహనముచే కోపముచే ఆవేశించబడినవాడు, కషాయీభూతలోచనః - ఎర్రగా తయారైన కన్నులు గలవాడు, ఆహ - పలికెను, నైర్‌ృతాః - రాక్షసులారా!, వధ్యః - వధించదగిన, అయమ్ - వీడు, ఆశు - శీఘ్రముగా, వధ్యతామ్ - వధించబడు గాక!, నిస్సారయత - తీసుకుపొండు.

హిరణ్యకశిపుని అసహనము, కోపము ఆవేశించెను. అతని కన్నులు ఎర్రగా ఆయెను. అతడు ఇట్లు పలికెను -- ఓ రాక్షసులారా! వీడు వధించ దగినవాడు. వీనిని వెంటనే ఇచటనుండి తీసుకుపోయి వధించుడు.

అయం మే భ్రాతృహా సోఽయం హిత్వా స్వాన్ సుహృదోఽధమః ।
పితృవ్యహంతుర్యః పాదౌ విష్ణోర్దాసవదర్చతి ।। 35

అయమ్ - ఈ, అధమః - అధముడు, మే - నాయొక్క, భ్రాతృహా - సోదరుని చంపినవాడు, సః - అట్టి, అయమ్ - ఈతడు, స్వాన్ - తనవారైన, సుహృదః - హితకారులను, హిత్వా - విడిచిపెట్టి, పితృవ్యహంతుః - తండ్రి సోదరుని చంపిన, విష్ణోః - విష్ణువుయొక్క, పాదౌ - పాదములను, దాసవత్ - దాసుడు వలె, అర్చతి - పూజించుచున్నాడు.

ఈ అధముడే నా సోదరుని చంపినాడు. ఎందుకంటే, ఈతడు తనకు హితకారులగు తనవారిని విడిచిపెట్టి, తండ్రి సోదరుని చంపిన విష్ణువు పాదములను దాసుడు వలె పూజించుచున్నాడు.

విష్ణోర్వా సాధ్వసౌ కిం ను కరిష్యత్యసమంజసః ।
సౌహృదం దుస్త్యజం పిత్రోరహాద్యః పంచహాయనః ॥ 36

అసౌ - ఈ, అసమంజసః - దుష్టుడు, విష్ణోః వా - విష్ణువుకైన నూ, కిం ను - ఏమి, సాధు - ఉపకారమును, కరిష్యతి - చేయగలడు?, పంచహాయనః - అయిదేళ్ల, యః - ఎవడైతే, దుస్త్యజమ్ - విడువ శక్యము కాని, పిత్రోః - తల్లిదండ్రుల, సౌహృదమ్ - ప్రేమను, అహాత్ - విడిచిపెట్టె నో.

తల్లిదండ్రుల ప్రేమను విడిచిపెట్టుట చాల కష్టము. కాని, ఈ దుష్టుడు అయిదేళ్ల వయస్సులోనే దానిని విడిచిపెట్టెను. వీడు విష్ణువునకై ననూ చేసే ఉపకారమేమి ఉండును?

పరోఽప్యపత్యం హితకృద్యథౌషధం
స్వదేహజోఽప్యామయవత్సుతోఽహితః ।
ఛింద్యాత్తదంగం యదుతాత్మనోఽహితం
శేషం సుఖం జీవతి యద్వివర్జనాత్ ॥ 37

ఔషధం యథా - మందు వలె, హితకృత్ - హితమును చేసే, పరః అపి - పైవాడే అయిననూ, అపత్యమ్ - సంతానమే, అహితః - అప కారమును చేసే, సుతః - కొడుకు, స్వదేహజః అపి - తన దేహమునుండి పుట్టినవాడే అయిననూ, ఆమయవత్ - రోగమువంటివాడు, అహితమ్ - పీడను కలిగించే, యత్ - ఏ, అంగమ్ - అవయవము గలదో, తత్ - దానిని, ఆత్మనః ఉత - తనదే అయిననూ, ఛింద్యాత్ - ఛేదించవలెను, యద్-వివర్జనాత్ - దేనిని విడిచిపెట్టుట వలన, శేషమ్ - మిగిలిన దేహ ము, సుఖమ్ - సుఖముగా, జీవతి - జీవించునో.

మందు వలె మంచి చేసే వ్యక్తి పైవాడే అయినా కన్నవానితో సమానము. తన దేహమునుండి పుట్టే కొడుకే అయినా అపకారమును చేసేవాడైనచో, రోగము వంటివాడే. రోగగ్రస్తమై దేహమునకు అపకారము చేసే అవయవము తనదే అయిననూ, దానిని కోసివేయవలెను. ఎందుకం

టే, దానిని శస్త్రచికిత్స చేసి తీసివేసినచో, మిగిలిన దేహము సుఖముగా జీవించును.

సర్వైరుపాయైర్హంతవ్యస్సంభోజశయనాసనైః ।
సుహృల్లింగధరశ్శత్రుర్మునేర్దుష్టమివేంద్రియమ్ ॥ 38

సుహృత్-లింగధరః - హితకారి వేషమును ధరించిన, శత్రుః - శత్రువు, సంభోజశయన-ఆసనైః - చక్కని భోజనము శయ్య ఆసనములు అనే, సర్వైః - సకలములైన, ఉపాయైః - ఉపాయములచే, మునేః - మహర్షికి, దుష్టమ్ - దుష్టమైన, ఇంద్రియం ఇవ - ఇంద్రియము వలె, హంతవ్యః - సంహరించ దగినవాడు.

తపశ్శాలి తన వశములో లేని ఇంద్రియమును సర్వోపాయము లచే వశము చేసుకొనును. అదే విధముగా, హితకారి రూపములోనున్న శత్రువును సర్వోపాయములచే నివృత్తి చేసుకొనవలెను. భోజనము, నిద్ర, విశ్రాంతిగా కూర్చుండుట మొదలగు సందర్భములలో అట్టి శత్రువును విష ప్రయోగము మొదలగు ఉపాయములచే హతమార్చవలెను.

నైరృతాస్తే సమాదిష్టా భర్త్రా వై శూలపాణయః ।
తిగ్మదంష్ట్రకరాలాస్యాస్తామ్రశ్మశ్రుశిరోరుహాః ॥ 39

శూలపాణయః - శూలము చేతియందు గలవారు, తిగ్మదంష్ట్రక రాల-ఆస్యాః - వాడి కోరలతో భయమును గొల్పు ముఖములు గలవారు, తామ్రశ్మశ్రుశిరోరుహాః - రాగి రంగు గెడ్డము మీసములు జుట్టు గల, తే - ఆ, నైరృతాః - రాక్షసులు, భర్త్రా - ప్రభువగు హిరణ్యకశిపునిచే, వై - నిశ్చ యముగా, సమాదిష్టాః - ఆదేశించ బడినవారు.

శూలధారులగు రాక్షసులకు హిరణ్యకశిపు మహారాజు ఖచ్చిత మైన ఆదేశములను జారీ చేసెను. రాగిరంగు గెడ్డములు మీసములు జుట్టు గల వారి ముఖములు వాడి కోరలతో భయమును గొల్పుచుండెను.

నదంతో భైరవాన్నాదాంశ్ఛింధి భింధీతి వాదినః ।
ఆసీనం చాహనన్ శూలైః ప్రహ్రాదం సర్వమర్మసు ॥ 40

భైరవాన్ - భయంకరములగు, నాదాన్ - నాదములను, నదంతః - చేయుచున్నవారు, ఛింధి - కోసివేయుము, భింధి - పగులగొట్టుము, ఇతి - అని, వాదినః - పలుకుచున్నవారు, ఆసీనమ్ - కూర్చుండియున్న, ప్రహ్రాదమ్ - ప్రహ్లాదుని, శూలైః - శూలములతో, సర్వమర్మసు - అన్ని మర్మస్థానములయందు, అహనన్ - పొడిచిరి.

వారు భయంకరములగు నాదములను చేస్తూ, కోసివేయుము పగులగొట్టుము అని పలుకుచుండిరి. ప్రహ్లాదుని కూర్చుండబెట్టి వారు మర్మస్థానములన్నిటియందు శూలములతో పొడిచిరి.

పరే బ్రహ్మణ్యనిర్దేశ్యే భగవత్యఖిలాత్మని ।
యుక్తాత్మన్యఫలా ఆసన్నపుణ్యస్యేవ సత్క్రియాః ॥ 41

పరే బ్రహ్మణి - పరబ్రహ్మస్వరూపుడైనట్టియు, అనిర్దేశ్యే - శబ్దములకు అందనట్టియు, అఖిల-ఆత్మని - సకలప్రాణుల ఆత్మరూపుడైన, భగవతి - శ్రీహరి భగవానునియందు, యుక్త-ఆత్మని - లగ్నము చేయబడిన మనస్సు గల ప్రహ్లాదునియందు, అపుణ్యస్య - పుణ్యము లేనివాని, సత్-క్రియాః ఇవ - మంచి పనులు వలె, అఫలాః - నిష్ఫలములు, ఆసన్ - ఆయెను.

పరబ్రహ్మస్వరూపుడగు శ్రీహరిని శబ్దములు నిర్దేశించలేవు. ఆయన ప్రాణులలో ఆత్మరూపముగా నున్నాడు. ఆయనపై ప్రహ్లాదుడు మనస్సును లగ్నము చేసియుండెను. ఆతనిపై వారు వేసిన ప్రహారములు, భాగ్యహీనుని గొప్ప ఉద్యమములు వలె, నిష్ఫలములాయెను.

ప్రయాసేఽపహతే తస్మిన్ దైత్యేంద్రః పరిశంకితః ।
చకార తద్వధోపాయాన్నిర్బంధేన యుధిష్ఠిర ॥ 42

యుధిష్ఠిర - ఓ ధర్మరాజా!, తస్మిన్ - ఆ, ప్రయాసే - పరిశ్రమ, అపహతే - వ్యర్థము కాగా, దైత్య-ఇంద్రః - రాక్షసరాజు, పరిశంకితః - చాల సందేహము గలవాడై, నిర్బంధేన - హఠముతో, తద్-వధ-ఉపాయాన్ - ఆ ప్రహ్లాదుని వధించే ఉపాయములను, చకార - చేసెను.

ఓ ధర్మరాజా! ఆ పరిశ్రమ వ్యర్థము కాగా, రాక్షసరాజగు హిరణ్యకశిపునకు చాల సందేహము కలిగెను. అతడు హఠముతో ఆ ప్రహ్లాదుని చంపుటకై అనేకములగు ఉపాయములను చేసెను.

దిగ్గజైర్దందశూకైశ్చ అభిచారావపాతనైః ।
మాయాభిస్సన్నిరోధైశ్చ గరదానైరభోజనైః ॥ 43

హిమవాయ్వగ్నిసలిలైః పర్వతాక్రమణైరపి ।
న శశాక యదా హంతుమపాపమసురస్సుతమ్ ।
చింతాం దీర్ఘతమాం ప్రాప్తస్తత్కర్తుం నాభ్యపద్యత ॥ 44

దిగ్గజైః - దిగ్గజములచే, దందశూకైః చ - పాములచే, అభిచార-అవపాతనైః - చేతబడులచే పైనుండి క్రిందకు పారవేయుటలచే, మాయాభిః - మాయలచే, సన్నిరోధైః చ - బంధించుటలచే, గరదానైః - విషమును పెట్టుటలచే, అభోజనైః - ఆహారమును ఈయకుండుటలచే, హిమవాయు-అగ్నిసలిలైః - మంచు గాలి నిప్పు నీళ్లతో, పర్వత-ఆక్రమణైః - బండరాళ్లను మీద పడవేయుటలచే, యదా - ఏ కాలమునందైతే, అసురః - ఆ రాక్షసుడు, అపాపమ్ - పాపమునెరుగని, సుతమ్ - పుత్రుని, హంతుమ్ - చంపుటకు, న శశాక - సమర్థుడు కాలేదో, దీర్ఘతమామ్ - నిరంతరమైన, చింతామ్ - బెంగను, ప్రాప్తః - పొందినవాడు, తత్ - ప్రహ్లాదుని చంపుటను, కర్తుమ్ - చేయుటకు, న అభ్యపద్యత - పొందలేదు.

ఆ రాక్షసుడు పాపమునెరుగని ప్రహ్లాదుని దిగ్గజములచే తొక్కించెను; విషసర్పములచే కరిపించెను; చేతబడులను చేయించెను; కొండకొమ్మలనుండి పారద్రోయించెను; మాయలను పన్ని చంపుటకు ప్రయత్నించెను; గుహలు మొదలగుచోట్ల బంధించెను; పలురకముల విషమును పెట్టించెను; పస్తులుండునట్లు చేసెను; మంచులో విడిచిపెట్టెను; గాలి తుఫానులలో పారవైచెను; నిప్పులలోనికి త్రోయించెను; నీళ్లలో ముంచి చంపే ప్రయత్నమును చేసెను; బండరాళ్లను మీద పారవేయించెను. అయినను, అతడు ప్రహ్లాదుని చంపించలేకపోయెను. అతనికి నిరంతరమగు

బెంగ అధికమయ్యెను. ప్రహ్లాదుని చంపుటకు అతనికి మరియొక ఉపాయ మేదీ తోచలేదు.

ఏష మే బహ్వసాధూక్తో వధోపాయాశ్చ నిర్మితాః ।
తైస్తైర్ద్రోహైరసద్ధర్మైర్ముక్తస్స్వేనైవ తేజసా ॥ 45

మే - నాచే, ఏషః - ఈతడు, అసాధు - పరుషముగా, బహు - అనేకము, ఉక్తః - పలుకబడినాడు, తైః తైః - ఆయా, ద్రోహైః - ద్రోహము లచే, అసద్-ధర్మైః - అపకారములచే, వధ-ఉపాయాః చ - వధించే ఉపా యములు కూడ, నిర్మితాః - చేయబడినవి, స్వేన - తన, తేజసా ఏవ - తేజస్సుచే మాత్రమే, ముక్తః - విడిపించ బడినవాడు.

నేను వీనితో అనేకములగు పరుషవాక్యములను పలికితిని. అంతే కాదు. శూలములతో పొడుచుట మొదలగు ద్రోహములను, చేతబడులు మొదలగు అపకారములను చేసి చంపించుటకు ఉపాయములను పన్నితి ని. కాని ఈతడు తన తేజస్సు చేతనే వాటినుండి విముక్తుడైనాడు.

వర్తమానోఽవిదూరే వై బాలోఽప్యజడధీరయమ్ ।
న విస్మరతి మేఽనార్యం శునశ్శేప ఇవ ప్రభుః ॥ 46

అవిదూరే - దగ్గరలోనే, వర్తమానః - ఉన్నవాడు, బాలః అపి - పిల్లవాడే అయిననూ, అయమ్ - ఈతడు, అజడధీః - మందబుద్ధి కాడు, ప్రభుః - సమర్థుడు, శునశ్శేపః ఇవ - శునశ్శేపుడు వలె, మే - నాయొక్క, అనార్యమ్ - అపకారమును, న విస్మరతి - మరచిపోడు.

ఈతడు నాకు దగ్గరలోనే ఉంటున్నాడు. పిల్లవాడే అయినా మంద బుద్ధి కాడు. ఈతడు సమర్థుడు. శునశ్శేపుడు తండ్రి చేసిన అన్యాయ మును మరచిపోకుండా తండ్రి శత్రువగు విశ్వామిత్రునితో జట్టు గట్టెను. అదే విధముగా ఈతడు కూడ నేను చేసిన అపకారమును మరువడు.

అప్రమేయానుభావోఽయమకుతశ్చిద్భయోఽమరః ।
నూనమేతద్విరోధేన మృత్యుర్మే భవితా వా న వా ॥ 47

అయమ్ - ఈతడు, అప్రమేయ-అనుభావః - ఊహకు అందని మహిమ గలవాడు, అకుతశ్చిద్-భయః - దేనివలనైననూ భయము లేనివాడు, అమరః - మరణము లేనివాడు, ఏతద్-విరోధేన - వీనితోడి వైరముచే, మే - నాకు, నూనమ్ - నిశ్చయముగా, మృత్యుః - మరణము, భవితా - కలుగునా యేమి?, న వా - అట్లు గాదేమో?

వీని మహిమ ఊహకు అందదు. వీనికి దేనివలనైననూ భయము లేదు. వీనికి మృత్యువు లేదు. వీనితోడి విరోధముచే నిశ్చయముగా నాకు మరణము కలుగునేమో? బహుశః అట్లు కాకపోవచ్చును.

ఇతి తం చింతయా కించిన్మ్లానశ్రియమధోముఖమ్ ।
శండామర్కావౌశనసౌ వివిక్త ఇతి హోచతుః ।। 48

ఇతి - ఈ విధముగా, చింతయా - బెంగచే, కించిత్-మ్లానశ్రియమ్ - కొంచెము వాడిపోయిన శోభ గలిగినట్టియు, అధోముఖమ్ - తల దించుకొనియున్న, తమ్ - ఆ హిరణ్యకశిపుని ఉద్దేశించి, వివిక్తే - ఏకాంతమునందు, ఔశనసౌ - శుక్రాచార్యుని పుత్రులగు, శండామర్కౌ - శండుడు అమర్కుడు, ఇతి - ఈ విధముగా, ఊచతుః హ - పలికిరట.

ఈ విధమైన బెంగచే హిరణ్యకశిపుని ముఖము వాడిపోయెను. ఆతడు తల దించుకొనియుండగా ఏకాంతములో శుక్రాచార్యుని పుత్రులగు శండ-అమర్కులు ఇట్లు పలికిరి.

జితం త్వయైకేన జగత్త్రయం భ్రువోః
విజృంభణత్రస్తసమస్తధిష్ణ్యపమ్ ।
న తస్య చింత్యం తవ నాథ చక్ష్మహే
న వై శిశూనాం గుణదోషయోః పదమ్ ।। 49

నాథ - ఓ ప్రభూ!, భ్రువోః - కనుబొమలయొక్క, విజృంభణత్రస్త సమస్తధిష్ణ్యపమ్ - విరుపులచే భయపడిన సకలలోకపాలకులు కలిగిన, జగత్-త్రయమ్ - ముల్లోకములు, త్వయా - నీచే, ఏకేన - ఒక్కనిచే, జితమ్ - జయించబడినది, తస్య - అట్టి, తవ - నీకు, చింత్యమ్ - చింతిం

చదగినదానిని, న చక్ష్మహే - కానరాకున్నాము, శిశూనామ్ - పిల్లల (ప్రవర్తన), గుణదోషయోః - గుణదోషముల, పదమ్ - విషయము, న - కాదు, వై - నిశ్చయము.

ఓ ప్రభూ! నీవు కనుబొమలను విరిచినచో లోకపాలకులందరు గడగడలాడెదరు. ముల్లోకములను నీవు ఒక్కడివే జయించితివి. నీవు బెంగపెట్టుకోదగిన విషయమేమియు మాకు కానరాదు. పిల్లల ప్రవర్తన గుణదోషముల నిర్ణయములో విషయము కారాదు. ఇది నిశ్చయము.

ఇమం తు పాశైర్వరుణస్య బద్ధ్వా
నిధేహి భీతో న పలాయతే యథా ।
బుద్ధిశ్చ పుంసో వయసాఽఽర్యసేవయా
యావద్గురుర్భార్గవ ఆగమిష్యతి ॥ 50

ఇమం తు - వీనినైతే, వరుణస్య - వరుణుని, పాశైః - పాశములతో, బద్ధ్వా - బంధించి, నిధేహి - ఉంచుము, యథా - ఏ విధముగానైతే, భీతః - భయపడినవాడై, న పలాయతే - పారిపోకుండునో, యావత్ - ఎంతలోనైతే, గురుః - గురువగు, భార్గవః - శుక్రాచార్యుడు, ఆగమిష్యతి - రాగలడో, పుంసః - వ్యక్తికి, వయసా - వయస్సుతో, ఆర్యసేవయా - పెద్దల సేవతో, బుద్ధిః చ - బుద్ధి కూడ కలుగును.

వీనిని వరుణుని పాశములతో కట్టియుంచుడు. అట్లు చేసినచో, ఈతడు భయపడి పారిపోవుట సంభవము కాకుండును. ఇంతలో గురువు శుక్రాచార్యుడు రాగలడు. ఇంతేగాక, వ్యక్తి బుద్ధి వయస్సుతో బాటు, పెద్దలను సేవించుచున్నచో వికసించును.

తథేతి గురుపుత్రోక్తమనుజ్ఞాయేదమబ్రవీత్ ।
ధర్మా హ్యస్యోపదేష్టవ్యా రాజ్ఞాం యే గృహమేధినామ్ ॥51

తథా - అటులనే, ఇతి - అని, గురుపుత్ర-ఉక్తమ్ - గురుపుత్రులు చెప్పిన మాటను, అనుజ్ఞాయ - అంగీకరించి, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను, అస్య - వీనికి, ధర్మాః - ధర్మములు, ఉపదేష్టవ్యాః హి -

ఉపదేశించబడవలెను సుమా!, యే - ఏవైతే, రాజ్ఞామ్ - రాజులకు, గృహ మేధినామ్ - గృహస్థులకు (చెందునో).

హిరణ్యకశిపుడు సరే అని ఆ గురుపుత్రుల సలహాను స్వీకరించి వారితోనిట్లనెను -- రాజులు, గృహస్థులు పాటించే ధర్మములను వీనికి ఉప దేశించుడు.

ధర్మమర్థం చ కామం చ నితరాం చానుపూర్వశః ।
ప్రహ్లాదాయోచతూ రాజన్ ప్రశ్రితావనతాయ చ ।। 52

రాజన్ - ఓ ధర్మరాజా!, ప్రశ్రిత-అవనతాయ - వినయవిధేయ తలు గల, ప్రహ్లాదాయ - ప్రహ్లాదుని కొరకు, ధర్మమ్ - ధర్మమును, అర్థం చ - అర్థమును, కామం చ - కామమును, నితరామ్ - నిరంతరముగా, అనుపూర్వశః - క్రమముగా, ఊచతుః - చెప్పిరి.

ఓ ధర్మరాజా! వారిద్దరు వినయవిధేయతలు గల ప్రహ్లాదునకు క్రమముగా ధర్మార్థకామములనే పురుషార్థములను నిరంతరముగా బోధిం చిరి.

యథా త్రివర్గం గురుభిరాత్మనే ఉపశిక్షితమ్ ।
న సాధు మేనే తచ్ఛిక్షాం ద్వంద్వారామోపవర్ణితామ్ ।। 53

గురుభిః - గురువులచే, ఆత్మనే - తన కొరకు, త్రివర్గమ్ - ధర్మా ర్థకామముల సముదాయము, యథా - యథాతథముగా, ఉపశిక్షితమ్ - బోధించబడినది, ద్వంద్వ-ఆరామ-ఉపవర్ణితామ్ - ద్వంద్వములతో భోగ ములయందు రమించేవారి కొరకు ప్రతిపాదించబడే, తత్-శిక్షామ్ - ఆ ఉపదేశమును, సాధు - మంచిదిగా, న మేనే - తలచలేదు.

గురువులు ప్రహ్లాదునకు ధర్మార్థకామములను బోధించిరి. ఇట్టి బోధలు సుఖదుఃఖముల ద్వంద్వములననుభవిస్తూ ఇంద్రియభోగముల యందు రమించే జనుల కొరకు వర్ణించబడినవి. అవి శ్రేయస్కరములని ప్రహ్లాదునకు అనిపించలేదు.

యదాఽఽచార్యః పరావృత్తో గృహమేధీయకర్మసు ।
వయస్యైర్బాలకైస్తత్ర సోపహూతః కృతక్షణైః ॥ 54

యదా - ఎప్పుడైతే, ఆచార్యః - గురువు, గృహమేధీయకర్మసు - గృహస్థులకు చెందిన పనులయందు, పరావృత్తః - మరియొకచోటకు వెళ్లినవాడో, తత్ర - ఆ సమయమునందు, వయస్యైః - సమవయస్కులైనట్టియు, కృతక్షణైః - చేయబడిన ఉత్సవము గల, బాలకైః - పిల్లలచే, సః - ఆ ప్రహ్లాదుడు, ఉపహూతః - పిలువబడినవాడు.

ఒకనాడు ఆచార్యుడు ఇంటిపనుల విషయములో బయటకు వెళ్లెను. అది ప్రహ్లాదుడు సమవయస్కులైన పిల్లలకు ఉత్సవమాయెను. వారు ఆ ప్రహ్లాదుని కూడ పిలిచిరి.

అథ తాన్ శ్లక్ష్ణయా వాచా ప్రత్యాహూయ మహాబుధః ।
ఉవాచ విద్వాంస్తన్నిష్ఠాం కృపయా ప్రహసన్నివ ॥ 55

అథ - తరువాత, మహాబుధః - గొప్ప జ్ఞాని, తత్-నిష్ఠామ్ - వారి నిష్ఠను, విద్వాన్ - తెలుసుకున్నవాడు అగు ప్రహ్లాదుడు, తాన్ - వారిని, శ్లక్ష్ణయా - మధురమగు, వాచా - వాక్కుతో, ప్రతి-ఆహూయ - దగ్గరకు పిలిచి, ప్రహసన్ ఇవ - చిరునవ్వు నవ్వుచున్నాడా యన్నట్లు, కృపయా - దయతో, ఉవాచ - పలికెను.

ప్రహ్లాదుడు గొప్ప జ్ఞాని. తనపై తన సహాధ్యాయులకు ఉన్న నిష్ఠ ఆయనకు తెలిసినదియే. ఆయన వారిని మధురమగు వాక్కుతో తన దగ్గరకు పిలిచి, చిరునవ్వు నవ్వుతూ దయతో వారితో నిట్లనెను.

తే తు తద్గౌరవాత్సర్వే త్యక్తక్రీడాపరిచ్ఛదాః ।
బాలా నదూషితధియో ద్వంద్వారామేరితేహితైః ॥ 56

పర్యుపాసత రాజేంద్ర తన్న్యస్తహృదయేక్షణాః ।
తానాహ కరుణో మైత్రో మహాభాగవతోఽసురః ॥ 57

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే ప్రహ్లాదచరితే నవధాభక్తివర్ణనం నామ పంచమోऽధ్యాయః ||**

రాజేంద్ర - ఓ మహారాజా!, తద్-గౌరవాత్ - ఆతనియందలి ఆదరము వలన, త్యక్తక్రీడాపరిచ్ఛదాః - విడిచిపెట్టబడిన ఆటవస్తువులు గలవారు, ద్వంద్వ-ఆరామ-ఈరిత-ఈహితైః - ద్వంద్వములతో భోగములయందు రమించేవారి మాటలచే మరియు చేష్టలచే, నదూషితధియః - కలుషితము కాని బుద్ధులు గలవారు అగు, తే - ఆ, సర్వే - అందరు, బాలాః తు - పిల్లలైతే, తత్-న్యస్తహృదయ-ఈక్షణాః - ఆతనియందు ఉంచబడిన హృదయము చూపులు గలవారై, పరి-ఉపాసత - చుట్టూ కూర్చుండిరి, కరుణః - దయామయుడు, మైత్రః - స్నేహశీలి, మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడు, అసురః - అసురుల వంశములో పుట్టిన ప్రహ్లాదుడు, తాన్ - వారిని ఉద్దేశించి, ఆహ - పలికెను.

ఓ మహారాజా! సుఖదుఃఖములనే ద్వంద్వములననుభవిస్తూ భోగములలో తేలియాడే వారి మాటలు, చేష్టలు ఇంకనూ ఆ పిల్లల బుద్ధులను కలుషితము చేయలేదు. వారికి ప్రహ్లాదునిపై గౌరవము మెండు. కావుననే, వారందరు ఆటవస్తువులను విడిచిపెట్టి, ప్రహ్లాదుని చుట్టూ కూర్చుండిరి. ఆతడు అసురవంశములో పుట్టినా, దయామయుడు, స్నేహశీలి, గొప్ప భగవద్భక్తుడు. వారు ఆతనినే చూస్తూ ఆతనిపై మనస్సు నిలిపిరి. ఆతడు వారితో నిట్లనెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
ప్రహ్లాదచరితమునందు తొమ్మిది విధముల భక్తిని వర్ణించే ఐదవ
అధ్యాయము ముగిసినది (5).

*****

# అథ షష్ఠోऽధ్యాయః

## ప్రహ్లాద చరితము - ప్రహ్లాదుని ఉపదేశము

ప్రహ్లాద ఉవాచ ।
కౌమార ఆచరేత్ప్రాజ్ఞో ధర్మాన్ భాగవతానిహ ।
దుర్లభం మానుషం జన్మ తదప్యధ్రువమర్థదమ్ ।। 1

ప్రాజ్ఞః - వివేకి, ఇహ - ఈ జన్మయందు, కౌమారే - బాల్యమునందు, భాగవతాన్ - భగవంతుని లభింపజేసే, ధర్మాన్ - ధర్మములను, ఆచరేత్ - అనుష్ఠించవలెను, అర్థదమ్ - పురుషార్థములనిచ్చే, మానుషం జన్మ - మనుష్య జన్మ, దుర్లభమ్ - పొందుటకు కఠినమైనది, అధ్రువం అపి - అనిత్యము కూడా.

జీవునకు పురుషార్థము లభించేది మానవజన్మలో మాత్రమే. మానవజన్మను పొందుట చాల కఠినము. పైగా ఈ జన్మ అనిత్యము. కావున, వివేకి ఈ జన్మలోనే బాల్యమునందే భగవంతుని లభింపజేసే ధర్మములను అనుష్ఠించవలెను.

యథా హి పురుషస్యేహ విష్ణోః పాదోపసర్పణమ్ ।
యదేష సర్వభూతానాం ప్రియ ఆత్మేశ్వరస్సుహృత్ ।। 2

హి - ఎందుకంటే, ఇహ - ఈ జన్మయందు, పురుషస్య - మానవునకు, విష్ణోః - విష్ణువుయొక్క, పాద-ఉపసర్పణమ్ - పాదములను ఆశ్రయించుట, యథా - యోగ్యమైనది, యత్ - ఏలయనగా, ఏషః - ఈ శ్రీహరి, సర్వభూతానామ్ - సకలప్రాణులకు, ప్రియః - ప్రేమకు ఆలంబనమైన, ఆత్మా - ఆత్మ, ఈశ్వరః - అంతర్యామి, సుహృత్ - హితకారి.

ఎందుకంటే, ఈ మానవజన్మలో మానవుడు చేయదగిన యోగ్యమైన పని విష్ణువు పాదములను ఆశ్రయించుటయే. ఏలయనగా, శ్రీహరి సకలప్రాణులలో అంతర్యామియై, ప్రీతినిధానమగు ఆత్మయై హితమును చేయుచున్నాడు.

సుఖమైంద్రియకం దైత్యా దేహయోగేన దేహినామ్ ।
సర్వత్ర లభ్యతే దైవాద్యథా దుఃఖమయత్నతః ॥ 3

దైత్యాః - దితి వంశీయులారా!, దేహినామ్ - ప్రాణులకు, దేహయోగేన - దేహముతోడి సంబంధముచే, ఐంద్రియకమ్ - ఇంద్రియముల వలన లభించే, సుఖమ్ - సుఖము, దుఃఖం యథా - దుఃఖము వలె, అయత్నతః - ప్రయత్నము లేకుండగనే, దైవాత్ - దైవము నిమిత్తముగా, సర్వత్ర - అన్ని స్థానములయందు కాలములయందు జన్మలయందు, లభ్యతే - పొందబడును.

దితివంశీయులారా! ప్రాణులకు అన్ని దేశకాలములలో అన్ని రకముల జన్మలయందు దేహముతోడి సంయోగము (జన్మ) కలుగగానే ఇంద్రియముల వలన లభించే సుఖము, దుఃఖము వలెనే, ప్రారబ్ధకర్మాధీనముగా ప్రయత్నము లేకుండగానే లభించుచుండును.

తత్ప్రయాసో న కర్తవ్యో యత ఆయుర్వ్యయః పరమ్ ।
న తథా విందతే క్షేమం ముకుందచరణాంబుజమ్ ॥ 4

తత్-ప్రయాసః - అట్టి ఇంద్రియసుఖము కొరకై ప్రయాస, న కర్తవ్యః - చేయదగినది కాదు, యతః - దేనివలనైతే, పరమ్ - కేవలము, ఆయుః-వ్యయః - ఆయుర్దాయము ఖర్చు అగుటయే, తథా - ఆ విధముగా, క్షేమమ్ - క్షేమమగు, ముకుందచరణ-అంబుజమ్ - మోక్షప్రదాతయగు శ్రీహరియొక్క పాదపద్మమును, న విందతే - పొందుట లేదు.

అట్టి (తనంత తానుగా లభించే) ఇంద్రియసుఖము కొరకు ప్రయత్నము చేయనక్కరలేదు. ఎందుకంటే, అట్టి ప్రయత్నమును చేయుట కేవలము ఆయుర్దాయమును వృథా చేసుకొనుటయే యగును. ఇంద్రియభోగ

ములవెంట బడే వ్యక్తి ఆత్యంతికమగు క్షేమము (మోక్షము) నిచ్చే మోక్ష ప్రదాతయగు శ్రీహరి పాదపద్మమును పొందజాలడు.

**తతో యతేత కుశలః క్షేమాయ భయమాశ్రితః ।**
**శరీరం పౌరుషం యావన్న విపద్యేత పుష్కలమ్ ॥ 5**

**తతః** - అందువలన, భయమ్ - భయహేతువగు సంసారమును, **ఆశ్రితః** - పొందియున్న, కుశలః - నేర్పరి, పుష్కలమ్ - నిండైన, పౌరుషమ్ - మనుష్యరూపము, యావత్ - ఎంతలో, న విపద్యేత - వినష్టము కాదో, క్షేమాయ - క్షేమము కొరకై, యతేత - ప్రయత్నించవలెను.

కావున, భయహేతువగు సంసారమును పొందియున్న నేర్పరియగు మానవుడు ఈ నిండైన మానవదేహము రోగముల పాలై వినష్టమయ్యే లోపులోనే ఆత్యంతికక్షేమమైన మోక్షము కొరకై యత్నించవలెను.

పుంసో వర్షశతం హ్యాయుస్తదర్ధం చాజితాత్మనః ।
నిష్ఫలం యదసౌ రాత్ర్యాం శేతేఽంధం ప్రాపితస్తమః ॥ 6

పుంసః - మానవునకు, వర్షశతమ్ - వంద సంవత్సరములు, ఆయుః హి - ఆయుర్దాయము గదా!, అజిత-ఆత్మనః - జయించబడని మనస్సు గలవానికి, తద్-అర్ధమ్ - దానిలో సగము, నిష్ఫలమ్ - వ్యర్థము, యత్ - ఏలయనగా, అసౌ - ఈతడు, రాత్ర్యామ్ - రాత్రియందు, అంధమ్ - చీకటిదైన, తమః - తమస్సును, ప్రాపితః - పొందించబడినవాడై, శేతే - నిద్రించును.

మానవుని ఆయుర్దాయము వంద సంవత్సరములు. మనోజయము లేనివానికి దానిలో సగము వ్యర్థమే యగును. ఎందుకంటే, మనిషి రాత్రియందు ఏమీ తెలియని తమోగుణప్రధానమైన నిద్రలో గడుపును.

ముగ్ధస్య బాల్యే కౌమారే క్రీడతో యాతి వింశతిః ।
జరయా గ్రస్తదేహస్య యాత్యకల్పస్య వింశతిః ॥ 7

బాల్యే - బాల్యమునందు, ముగ్ధస్య - మూర్ఖుడుగా ఉండునట్టి యు, కౌమారే - కుమారావస్థయందు, క్రీడతః - ఆటలాడుకొనే మానవున కు, వింశతిః -. ఇరవై, యాతి - గడచును, జరయా - వృద్ధాప్యముచే, గ్రస్త దేహస్య - పట్టుకొనబడిన దేహము గలిగినట్టియు, అకల్పస్య - అసమర్థు డైన వానికి, వింశతిః - ఇరవై, యాతి - గడచును.

మానవుడు బాల్యములో మూర్ఖుడై యుండును. కుమారావస్థలో ఆటలాడుచుండును. ఈ విధముగా ఇరవై ఏళ్లు గడచిపోవును. వృద్ధాప్య ములో దేహము వడలిపోయి ఏ పనినైననూ చేయలేని స్థితిలో ఇంకో ఇరవై ఏళ్లు గడచిపోవును.

దురాపూరేణ కామేన మోహేన చ బలీయసా ।
శేషం గృహేషు సక్తస్య ప్రమత్తస్యాపయాతి హి ।। 8

గృహేషు - ఇంటియందు, సక్తస్య - తగుల్కొన్నట్టియు, దురాపూ రేణ - కష్టపడి పూర్తి చేయబడే, కామేన - కోరికతో, చ - మరియు, బలీ యసా - మిక్కిలి బలమైన, మోహేన - వ్యామోహముతో, ప్రమత్తస్య - ఆదమరచియున్న వానికి, శేషమ్ - మిగిలినది, అపయాతి హి - గడచి పోవును గదా!

మానవుడు ఇంటికి సంబంధించిన విషయములలో ఆసక్తిని పెంచుకొని, తీర్చ శక్యము కాని కోరికలతో మరియు బలీయమైన వ్యామో హముతో ఆదమరచి యుండగా, మిగిలిన ఆయుర్దాయము గడచిపోవును.

కో గృహేషు పుమాన్ సక్తమాత్మానమజితేంద్రియః ।
స్నేహపాశైర్దృఢైర్బద్ధముత్సహేత విమోచితుమ్ ।। 9

గృహేషు - ఇంటియందు, సక్తమ్ - ఆసక్తి కలిగినట్టియు, దృఢైః - గట్టి, స్నేహపాశైః - రాగము అనే త్రాళ్లతో, బద్ధమ్ - కట్టివేయబడిన, ఆత్మానమ్ - తనను, అజిత-ఇంద్రియః - జయించబడని ఇంద్రియములు గల, కః - ఏ, పుమాన్ - మానవుడు, విమోచితుమ్ - విడిపించుకొనుటకు, ఉత్సహేత - సమర్థుడగును?

ఎవడైతే ఇంటికి సంబంధించిన విషయములలో ఆసక్తిని పెంచుకొని, రాగపాశములచే గట్టిగా బంధించబడి ఉండునో, అట్టి వ్యక్తి ఎవ్వాడు ఇంద్రియములను వశము చేసుకోకుండా తనను బంధవిముక్తునిగా చేసుకొన గల్గును? (చేసుకొనలేడు).

కో న్వర్థతృష్ణాం విసృజేత్ప్రాణేభ్యోఽపి య ఈప్సితః ।
యం క్రీణాత్యసుభిః ప్రేష్ఠైస్తస్కరస్సేవకో వణిక్ ॥ 10

కః ను - ఎవ్వాడు, అర్థతృష్ణామ్ - ధనమునందలి పేరాసను, విసృజేత్ - విడిచిపెట్టును?, యః - ఏ ధనము, ప్రాణేభ్యః అపి - ప్రాణములకంటె కూడ, ఈప్సితః - కోరబడినదో, యమ్ - ఏ ధనమును, తస్కరః - చోరుడు, సేవకః - సేవకుడు, వణిక్ - వ్యాపారి, ప్రేష్ఠైః - మిక్కిలి ప్రియములగు, అసుభిః - ప్రాణములతో, క్రీణాతి - కొనునో.

ధనమునందలి పేరాసను ఎవడు విడిచిపెట్టును? జనులకు ధనము ప్రాణములకంటె కూడ ప్రియమైనది. చోరుడు ధనము కొరకై ప్రాణములను పణము పెట్టును. సేవకుడు ధనము కొరకై తన శక్తిని ఇతరులకు ధారపోయును. వ్యాపారి ధనము కొరకై తన జీవితమును వెచ్చించును.

కథం ప్రియాయా అనుకంపితాయాః
సంగం రహస్యం రుచిరాంశ్చ మంత్రాన్ ।
సుహృత్సు చ స్నేహసితశ్శిశూనాం
కలాక్షరాణామనురక్తచిత్తః ॥ 11

పుత్రాన్ స్మరంస్తా దుహితౄర్హృదయ్యా
భ్రాతౄన్ స్వసౄర్వా పితరౌ చ దీనౌ ।
గృహాన్ మనోజ్ఞోరుపరిచ్ఛదాంశ్చ
వృత్తీశ్చ కుల్యాః పశుభృత్యవర్గాన్ ॥ 12

త్యజేత కోశస్కృదివేహమానః
కర్మాణి లోభాదవితృప్తకామః ।

ఔపస్థ్యజైహ్వ్యం బహు మన్యమానః
కథం విరజ్యేత దురంతమోహః ॥ 13

సుహృత్సు - మిత్రులయందు, స్నేహసితః - రాగముచే బంధించబడినవాడు, కల-అక్షరాణామ్ - ముద్దు పలుకుల, శిశూనామ్ - పిల్లలకు, అనురక్తచిత్తః - అనురాగముతో కూడిన చిత్తము గలవాడు, పుత్రాన్ - పుత్రులను, స్మరన్ - స్మరించువాడు, కోశస్కృత్ ఇవ - పట్టుపురుగువలె, కర్మాణి - కర్మలను, ఈహమానః - చేయుచున్నవాడు, లోభాత్ - లోభము వలన, అవితృప్తకామః - తృప్తిని చెందని కోరికలు గలవాడు, ఔపస్థ్యజైహ్వ్యమ్ - సంభోగము మరియు ఆహారముల సుఖమును, బహుమన్యమానః - అధికముగా ఆదరించువాడు, దురంతమోహః - అంతము లేని వ్యామోహము గలవాడు, అనుకంపితాయాః - ప్రేమ గల, ప్రియాయాః - ప్రియురాలియొక్క, రహస్యమ్ - ఏకాంతమునందలి, సంగమ్ - కలయికను, రుచిరాన్ - మధురములైన, మంత్రాన్ - గుసగుసలను, తాః - ఆ, హృదయ్యాః - హృదయమునకు ఆనందమునిచ్చే, దుహితౄః - కుమార్తెలను, భ్రాతౄన్ - సోదరులను, స్వసౄః వా - అక్కచెల్లెళ్లను గాని, దీనౌ - దీనులైన, పితరౌ చ - తల్లిదండ్రులను కూడ, మనోజ్ఞ-ఉరుపరిచ్ఛదాన్ - మనస్సునకు ఉల్లాసమును కలిగించే అనేకములైన భోగసాధనములు గల, గృహాన్ - ఇంటిని, కుల్యాః - కులమునకు చెందిన, వృత్తీః తు - వృత్తులనైతే, పశుభృత్యవర్గాన్ - పశువులు మరియు సేవకుల సమూహములను, కథమ్ - ఏ విధముగా, త్యజేత - విడిచిపెట్టును?, కథమ్ - ఏ విధముగా, విరజ్యేత - విరక్తిని చెందును?

మానవుడు స్నేహితులయందలి రాగముచే బద్ధుడై యుండును. వాని చిత్తములో ముద్దు పలుకుల పిల్లలయందు అనురాగము నిండియుండును. అతడు తన పుత్రులను గుర్తు చేసుకుంటూ కర్మలను చేసి పట్టుపురుగు వలె తన కర్మలచే తానే బంధించబడును. లోభము గల అతనికి కోరికలు తీరుచున్ననూ తృప్తి కలుగదు. అతనికి సంభోగము, ఆహారములు ఇచ్చే సుఖమునందు ఆదరము మెండు. అంతము లేని వ్యామోహము గల ఇట్టి వ్యక్తి ప్రేమపాత్రురాలగు ప్రియురాలితోడి ఏకాంత సమావేశమును,

ఆమెతోడి తియ్యని గుసగుసలను, హృదయమునకు ఆనందమునిచ్చే వివాహితలైన కూతుళ్లను, సోదరులను, అక్కచెల్లెళ్లను, దీనులైన తల్లిదం డ్రులనైననూ, మనస్సునకు ఉల్లాసమునిచ్చే భోగసాధనములతో నిండి యున్న ఇంటిని గాని, కులవృత్తులను గాని, పశుసంపదను గాని, దాసదాసీ జనమును గాని ఎట్లు విడిచిపెట్టును? అట్టి వ్యక్తికి వైరాగ్యమెట్లు కలు గును? (కలుగదు).

కుటుంబపోషాయ వియన్ నిజాయుః
న బుధ్యతేఽర్థం విహతం ప్రమత్తః ।
సర్వత్ర తాపత్రయదుఃఖితాత్మా
నిర్విద్యతే న స్వకుటుంబరామః ॥ 14

ప్రమత్తః - ఆదమరచియున్నవాడు, సర్వత్ర - అన్ని దేశకాలముల యందు, తాపత్రయదుఃఖిత-ఆత్మా - మూడు తాపములచే దుఃఖమును పొందియున్న మనస్సు గలవాడు, స్వకుటుంబరామః - తన కుటుంబము నందు ఆసక్తి గలవాడు, కుటుంబపోషాయ - కుటుంబమును పోషించుట కొరకై, వియన్ - ఖర్చు అగుచున్న, నిజ-ఆయుః - తన ఆయుర్దాయము ను, విహతమ్ - భగ్నమైన, అర్థమ్ - పురుషార్థమును, న బుధ్యతే - తెలి యకున్నాడు, న నిర్విద్యతే - విరక్తిని పొందకున్నాడు.

భోగములలో ఆదమరచియున్న వ్యక్తి మనస్సు దేశకాలముల న్నింటియందు ఆధ్యాత్మిక-ఆధిభౌతిక-ఆధిదైవికములనే మూడు విధముల తాపములతో దుఃఖమును పొందుచుండును. తన కుటుంబమునందు ఆసక్తి గల ఆ వ్యక్తి కుటుంబమును పోషించుటకై తన ఆయుర్దాయము ఖర్చు అయిపోవుచున్న సంగతిని గాని, తన పురుషార్థము (మోక్షము) భగ్నమైన దని గాని తెలియకున్నాడు. ఇట్టి వ్యక్తికి వైరాగ్యము కలుగదు.

విత్తేషు నిత్యాభినివిష్టచేతా విద్వాంశ్చ దోషం పరవిత్తహర్తుః ।
ప్రేత్యేహ చాథాప్యజితేంద్రియస్తదశాంతకామో హరతే కుటుంబీ ॥

విత్తేషు - సంపదలయందు, నిత్య-అభినివిష్టచేతాః - అన్ని కాల ములలో ఆగ్రహముతో కూడిన మనస్సు గలవాడు, అజిత-ఇంద్రియః -

జయించబడని ఇంద్రియములు గలవాడు, అశాంతకామః - చల్లారని కోరికలు గలవాడు, కుటుంబీ - కుటుంబము గలవాడు, పరవిత్తహర్తుః - ఇతరుల సొత్తును అపహరించినవానికి, ఇహ - ఈ లోకమునందు, ప్రేత్య చ - మరణించిన తరువాత కూడ, దోషమ్ - దోషమును, విద్వాన్ - తెలిసినవాడు, అథాపి - అయినప్పటికీ, తత్ - దానిని, హరతే - అపహరించును.

కుటుంబమునందు ఆసక్తి గల వ్యక్తికి ఇంద్రియములపై అజమాయిషీ లేదు గనుక, వాని కోరికలు చల్లారవు. ఆతనికి అన్ని కాలములలో సంపదలను పొందాలనే పట్టుదల మెండు. ఇతరుల సొత్తును అపహరించే వ్యక్తి ఇహపరములలో దుఃఖభాజనుడగునని ఆతనికి తెలియును. అయిననూ, ఆతడు పరధనమును అపహరించును.

విద్వానపీత్థం దనుజాః కుటుంబం పుష్ణన్స్వలోకాయ న కల్పతే వై
యస్స్వీయపారక్యవిభిన్నభావస్తమః ప్రపద్యేత యథా విమూఢః॥

దనుజాః - ఓ దనువంశీయులారా!, యః - ఎవడైతే, స్వీయపారక్యవిభిన్నభావః - నాది పరాయిది అనే భేదభావము గలవాడో, విద్వాన్ అపి - శాస్త్రజ్ఞుడే అయిననూ, ఇత్థమ్ - ఈ విధముగా, కుటుంబమ్ - కుటుంబమును, పుష్ణన్ - పోషించుచున్నవాడై, విమూఢః యథా - అజ్ఞాని వలె, స్వలోకాయ - ఆత్మవిచారము కొరకు, న కల్పతే - సమర్థుడు కాడు, తమః - అజ్ఞానకార్యమగు సంసారమునే, ప్రపద్యేత - పొందును, వై - నిశ్చయము.

ఓ దనువంశీయులారా! నాది పరాయిది అనే భేదభావన గలవాడై పైన చెప్పిన విధముగా తీవ్రమగు ఆసక్తితో కుటుంబమును పోషించే వ్యక్తి శాస్త్రజ్ఞుడే అయినా, ఆత్మవిచారమునకు నిశ్చయముగా సమర్థుడు కాడు. అట్టివాడు అజ్ఞానకృతమగు సంసారమునే పొందును.

యతో న కశ్చిత్క్వ చ కుత్రచిద్వా
దీనస్స్వమాత్మానమలం సమర్థః ।
విమోచితుం కామదృశాం విహార-
క్రీడామృగో యన్నిగడో విసర్గః ॥ 17

యతః - ఎందుకంటే, అలమ్ - మిక్కిలి, దీనః - దీనుడు, కామ దృశామ్ - కామము చూపులయందు గల యువతులకు, విహారక్రీడా మృగః - విహారమునందు కోతివంటివాడు, కశ్చిత్ - ఎవ్వడైననూ, క్వ చ - ఎక్కడనైననూ, కుత్రచిత్ వా - ఏ కాలమునందైననూ, స్వమ్ - తన, ఆత్మానమ్ - మనస్సును, విమోచితుమ్ - విముక్తము చేసుకొనుటకు, న సమర్థః - సమర్థుడు కాడు, యత్ - ఏ యువతులయందు, విసర్గః - సంతానము, నిగడః - సంకెలయో.

ఎందుకంటే, చూపులలో కామమును ఒలికించే యువతుల విహార మునకు కోతివంటి ఆటవస్తువు అయి మిక్కిలి దీనుడైయున్న ఎవ్వడైననూ ఏ కాలమునందైననూ ఏ దేశమునందైననూ తనను తాను విముక్తుని చేసు కొనుటకు సమర్థుడు కాజాలడు. వానికి అట్టి యువతులయందు కలిగే సంతానము వానికి సంకెల యగును.

తతో విదూరాత్పరిహృత్య దైత్యా
దైత్యేషు సంగం విషయాత్మకేషు ।
ఉపేత నారాయణమాదిదేవం
విముక్తసంగైరిషితోఽపవర్గః ॥ 18

దైత్యాః - దితివంశీయులారా!, తతః - అందువలన, విషయ-ఆత్మకేషు - ఇంద్రియభోగములపై ఆసక్తి గల, దైత్యేషు - రాక్షసులయందు, సంగమ్ - సంగమును, విదూరాత్ - చాల దూరముగా, పరిహృత్య - త్రోసివేసి, ఆదిదేవమ్ - జగత్కారణుడు ప్రకాశస్వరూపుడు అగు, నారాయణమ్ - నారాయణుని, ఉపేత - శరణు పొందుడు, విముక్తసంగైః - విడిచి పెట్టబడిన ఆసక్తి గలవారిచే, అపవర్గః - మోక్షము, ఇషితః - కోరబడునది.

ఓ దితివంశీయులారా! కావున, మీరు ఇంద్రియభోగములయందు ఆసక్తిని చూపే రాక్షసులతోడి స్నేహమును చాల దూరముగా విడిచిపెట్టు డు. జగత్కారణుడు, ప్రకాశస్వరూపుడు అగు నారాయణుని శరణు పొందు డు. ఆసక్తిని విడిచిన మహాత్ములు కోరే మోక్షము అట్టి శరణాగతియే.

న హ్యచ్యుతం ప్రీణయతో బహ్వాయాసోఽసురాత్మజాః ।
ఆత్మత్వాత్సర్వభూతానాం సిద్ధత్వాదిహ సర్వతః ॥ 19

అసుర-ఆత్మజాః - అసురుల పుత్రులారా!, సర్వభూతానామ్ - సకలప్రాణులకు, ఆత్మత్వాత్ - ఆత్మయగుట వలన, ఇహ - ఈ లోకము నందు, సర్వతః - అంతటా, సిద్ధత్వాత్ - సిద్ధించియుండుట వలన, అచ్యుతమ్ - శ్రీహరిని, ప్రీణయతః - ప్రీతిని కలిగించువానికి, బహు-ఆయాసః - అధికమగు శ్రమ, న హి - లేదు సుమా!

ఓ రాక్షస నందనులారా! శ్రీహరి సకలప్రాణులలోపల ఆత్మరూపుడై బయట సర్వమునందు వ్యాపించి యున్నాడు. కావున, శ్రీహరికి ప్రీతిని కలిగించుటలో అధికమైన శ్రమ లేదు సుమా!

పరావరేషు భూతేషు బ్రహ్మాంతస్థావరాదిషు ।
భౌతికేషు వికారేషు భూతేష్వథ మహత్సు చ ॥ 20

గుణేషు గుణసామ్యే చ గుణవ్యతికరే తథా ।
ఏక ఏవ పరో హ్యాత్మా భగవానీశ్వరోఽవ్యయః ॥ 21

బ్రహ్మ-అంతస్థావర-ఆదిషు - చెట్టుచేమలతో మొదలిడి బ్రహ్మగారు వరకు గల, పర-అవరేషు - పెద్ద చిన్న, భూతేషు - ప్రాణులయందు, భౌతికేషు - పంచభూతములనుండి తయారైన, వికారేషు - పదార్థములయందు, అథ - మరియు, భూతేషు - పంచభూతములయందు, మహత్సు చ - సూక్ష్మభూతములయందు కూడ, గుణేషు - సత్త్వరజస్తమోగుణములయందు, గుణసామ్యే చ - గుణముల సామ్యావస్థయగు ప్రకృతియందు, తథా - అదే విధముగా, గుణవ్యతికరే - గుణములలోని వైషమ్యము వలన ప్రకటమైన మహత్తత్త్వమునందు, ఏకః ఏవ - అద్వితీయుడు, పరః - ఈ సర్వమునకు అతీతమైనవాడు, ఆత్మా - ఆత్మస్వరూపుడు, భగవాన్ - భగవానుడు, ఈశ్వరః - సర్వాంతర్యామి, అవ్యయః - వినాశము లేనివాడు.

చెట్టుచేమలతో మొదలిడి బ్రహ్మగారు వరకు ఉండే పెద్ద చిన్న ప్రాణులయందు, పంచభూతములనుండి నిర్మితమైన పదార్థములయందు, పంచభూతములయందు, సూక్ష్మతన్మాత్రలయందు, సత్త్వరజస్తమోగుణ ములయందు, వాటియందు వైషమ్యము వచ్చి ప్రకటమైన మహత్తత్త్వము నందు, వాటి సామ్యావస్థయగు ప్రకృతియందు కూడ ఒకే ఒక భగవానుడు ఉన్నాడు. సర్వాంతర్యామి, అవినాశి, అద్వితీయుడు అగు ఆ భగవానుడు ఈ సర్వమునకు అతీతుడై యున్నాడు.

ప్రత్యగాత్మస్వరూపేణ దృశ్యరూపేణ చ స్వయమ్ ।
వ్యాప్యవ్యాపకనిర్దేశ్యో హ్యనిర్దేశ్యోఽవికల్పితః ॥ 22

అనిర్దేశ్యః - నిర్వచింప శక్యము కాని పరమాత్మ, అవికల్పితః - నానాత్వము లేనివాడు అగు పరబ్రహ్మ, స్వయమ్ - స్వయముగా, ప్రత్యగ్ -ఆత్మస్వరూపేణ - వ్యక్తియొక్క అంతరతమ స్వరూపమైన ఆత్మరూప ముగా, దృశ్యరూపేణ చ - కంటికి కనబడే జగత్తు రూపముగా, వ్యాప్యవ్యా పకనిర్దేశ్యః - సత్తాస్ఫూర్తులచే వ్యాపించబడే దృశ్యముగా సత్తాస్ఫూర్తిస్వ రూపుడగు ద్రష్టగా వ్యవహరించబడువాడు.

పరమేశ్వరునియందు వివిధత్వము లేదు. అయిననూ, ఆయ నయే స్వయముగా వ్యక్తియొక్క అంతరతమమగు ఆత్మ (దృక్-చైతన్య ము) గా, దృశ్యమైన జగత్తుగా ప్రకటమైనాడు. ఆయనను నిర్దేశించుట సంభవము కాదు. అయిననూ, సత్తాస్ఫూర్తులచే వ్యాపించబడియుండే దృశ్యజగత్తుగా, సత్తాస్ఫూర్తిస్వరూపుడగు ద్రష్టగా నిర్దేశించబడుచున్నాడు.

కేవలానుభవానందస్వరూపః పరమేశ్వరః ।
మాయయాంతర్హితైశ్వర్య ఈయతే గుణసర్గయా ॥ 23

కేవల-అనుభవ-ఆనందస్వరూపః - కేవలము అనుభవము (జ్ఞాన ము) ఆనందము స్వరూపముగా గల, పరమ-ఈశ్వరః - సర్వేశ్వరుడు, గుణసర్గయా - త్రిగుణాత్మకమగు సృష్టిగా ప్రకటమయ్యే, మాయయా - మాయచే, అంతర్హిత-ఐశ్వర్యః - కప్పివేయబడిన ఐశ్వర్యము గలవాడు, ఈయతే - పొందబడుచున్నాడు.

పరమేశ్వరుడు చైతన్యఘన-ఆనందఘన స్వరూపుడు. త్రిగుణాత్మకమగు జగత్తు రూపముగా ప్రకటమైన మాయాశక్తి ఆ సర్వేశ్వరుని ఈశ్వర భావమును కప్పివేయుచున్నది. నామరూపాత్మకమగు జగత్తును నిషేధించినచో, ఈశ్వరుని సాక్షాత్కారము ఆత్మరూపముగా కలుగును.

తస్మాత్సర్వేషు భూతేషు దయాం కురుత సౌహృదమ్ ।
ఆసురం భావమున్ముచ్య యయా తుష్యత్యధోక్షజః ॥ 24

తస్మాత్ - అందువలన, ఆసురం భావమ్ - భోగపరాయణులు ఆలోచించే పద్ధతిని, ఉన్ముచ్య - విడిచిపెట్టి, సర్వేషు - సకలములైన, భూతేషు - ప్రాణులయందు, దయామ్ - దయను, సౌహృదమ్ - ప్రేమతో హితమును, కురుత - చేయుడు, యయా - దేనిచే, అధోక్షజః - ప్రత్యక్షాది ప్రమాణములకు అతీతుడైన శ్రీహరి, తుష్యతి - ప్రసన్నుడగునో.

కావున, భోగపరాయణులు ఆలోచించే పద్ధతిని మీరు విడనాడి, సకలప్రాణులయందు దయను చూపుతూ, ప్రేమతో ప్రాణులకు హితమును ఆచరించుడు. అట్లు చేయుట వలన, ప్రత్యక్షాది ప్రమాణములకు అతీతుడైన శ్రీహరి ప్రసన్నుడగును.

తుష్టే చ తత్ర కిమలభ్యమనంత ఆద్యే
కిం తైర్గుణవ్యతికరాదిహ యే స్వసిద్ధాః ।
ధర్మాదయః కిమగుణేన చ కాంక్షితేన
సారంజుషాం చరణయోరుపగాయతాం నః ॥ 25

అనంతే - కాలమునకు అతీతుడైనట్టియు, ఆద్యే - సర్వజగత్కారణుడగు, తత్ర - ఆ శ్రీహరి, తుష్టే చ - ప్రసన్నుడు కాగా, అలభ్యమ్ - పొంద శక్యము కానిది, కిమ్ - ఏది గలదు?, చరణయోః - రెండు పాదముల, సారంజుషామ్ - సారమును సేవించునట్టియు, ఉపగాయతామ్ - కీర్తించే, నః - మాకు, గుణవ్యతికరాత్ - సత్త్వరజస్తమోగుణములయందు పరిణామము వలన, ఇహ - ఈ లోకమునందు, స్వసిద్ధాః - తమంత తాముగా సిద్ధించే, యే - ఏ, ధర్మ-ఆదయః - ధర్మము మొదలగునవి గలవో, తైః - వాటితో, కిమ్ - ఏమి ప్రయోజనము?, కాంక్షితేన - అభీష్టమై

న, అగుణేన చ - గుణములకు అతీతమైన మోక్షముచేనైననూ, కిమ్ - ఏమి ప్రయోజనము?

కాలాతీతుడు, సర్వజగత్కారణుడు అగు శ్రీహరి ప్రసన్నుడైనచో పొంద శక్యము కానిది ఏది ఉండును? మేము శ్రీహరి రెండు పాదముల సారమును సేవిస్తూ ఆయన కీర్తిని గానము చేసెదము. ఈ జగత్తులో సత్త్వ రజస్తమోగుణముల పరిణామము వలన తమంత తాముగా లభించే ధర్మార్థకామములతో గాని, అందరు కోరే గుణాతీతమైన మోక్షముతో గాని, మనకు పని యేమున్నది?

ధర్మార్థకామ ఇతి యోఽభిహితస్త్రివర్గ
ఈక్షా త్రయీ నయదమౌ వివిధా చ వార్తా ।
మన్యే తదేతదఖిలం నిగమస్య సత్యం
స్వాత్మార్పణం స్వసుహృదః పరమస్య పుంసః ॥ 26

ధర్మ-అర్థకామః - ధర్మము అర్థము కామము, ఇతి - అని, యః - ఏ, త్రివర్గః - మూడు పురుషార్థముల సముదాయము, అభిహితః - చెప్పబడినదో అది, ఈక్షా - ఆత్మవిద్య, త్రయీ - కర్మవిద్య, నయదమౌ - తర్కశాస్త్రము దండనీతి, చ - మరియు, వివిధా - అనేకవిధములైన, వార్తా - వృత్తివిద్య, తత్ - ఆ, ఏతత్ - ఈ, సర్వమ్ - సర్వము, నిగమస్య - వేదమునకు చెందినది, స్వసుహృదః - తనయందు హితకారియగు అంతర్యామి రూపములోనున్న, పరమస్య పుంసః - పురుషోత్తమునకు, స్వ-ఆత్మార్పణమ్ - ఆత్మనివేదనము, సత్యమ్ - సత్యము అని, మన్యే - తలచెదను.

ధర్మార్థకామములు అనే మూడు పురుషార్థములు, ఆత్మవిద్య, కర్మవిద్య, తర్కశాస్త్రము, దండనీతి, అనేకవిధములైన వృత్తివిద్యలు అనే ఈ సర్వము మూడు గుణములకు లోబడి వేదముచే ప్రతిపాదించబడుచున్నది. కాని, వ్యక్తి తనలో అంతర్యామియై హితకారియగు పురుషోత్తమునకు తన సర్వస్వమును సమర్పించుటయే సత్యము (సార్థకము) అని నా అభిప్రాయము.

జ్ఞానం తదేతదమలం దురవాపమాహ
నారాయణో నరసఖః కిల నారదాయ ।
ఏకాంతినాం భగవతస్తదకించనానాం
పాదారవిందరజసాఽఽప్లుతదేహినాం స్యాత్ ॥ 27

నరసఖః - నరుని మిత్రుడగు, నారాయణః - నారాయణుడు, తత్ - అట్టి, ఏతత్ - ఈ, అమలమ్ - నిర్మలమైన, దురవాపమ్ - పొంద శక్యము కాని, జ్ఞానమ్ - జ్ఞానమును, నారదాయ - నారదుని కొరకు, ఆహ కిల - చెప్పెనట, తత్ - అది, భగవతః - భగవానుని, ఏకాంతినామ్ - అనన్యభక్తులైనట్టియు, అకించనానామ్ - సర్వసంగపరిత్యాగుల, పాద-అరవిందరజసా - పాదపద్మముల ధూళిచే, ఆప్లుతదేహినామ్ - వ్యాప్తమైన దేహము గల వారలకు, స్యాత్ - కలుగును.

నరుడు తోడుగానున్న నారాయణుడీ నిర్మలమగు జ్ఞానమును నారదునకు ఉపదేశించెనట. దీనిని పొందుట చాల కష్టము. భగవంతుని ఏకాంతభక్తులై, సర్వసంగపరిత్యాగుల పాదపద్మముల ధూళిచే వ్యాప్తమైన దేహము గలవారలకు మాత్రమే అది లభించును.

శ్రుతమేతన్మయా పూర్వం జ్ఞానం విజ్ఞానసంయుతమ్ ।
ధర్మం భాగవతం శుద్ధం నారదాద్దేవదర్శనాత్ ॥ 28

విజ్ఞానసంయుతమ్ - అనుభవముతో కూడిన, ఏతత్ - ఈ, జ్ఞానమ్ - జ్ఞానము, భాగవతమ్ - భగవద్భక్తులచే అనుష్ఠించబడే, ధర్మమ్ - ధర్మము, మయా - నాచే, పూర్వమ్ - పూర్వము, దేవదర్శనాత్ - భగవానుని దర్శించిన, నారదాత్ - నారదుని వలన, శ్రుతమ్ - వినబడినది.

అనుభవముతో కూడిన నిర్మలమైన ఈ జ్ఞానమును, భగవద్భక్తులనుష్ఠించే ధర్మమును, నేను పూర్వము నారదుని వలన వినియుంటిని. నారదుడు భగవానుని దర్శించినవాడు.

దైత్యపుత్రా ఊచుః ।
ప్రహ్లాద త్వం వయం చాపి నర్తేఽన్యం విద్మహే గురుమ్ ।
ఏతాభ్యాం గురుపుత్రాభ్యాం బాలానామపి హీశ్వరౌ ।। 29

ప్రహ్లాద - ఓ ప్రహ్లాదా!, త్వమ్ - నీవు, వయం చ అపి - మేము కూడ, ఏతాభ్యామ్ - ఈ, గురుపుత్రాభ్యాం ఋతే - గురుపుత్రులను మిన హాయించి, అన్యమ్ - మరియొక, గురుమ్ - గురువును, న విద్మహే - ఎరుగము, అపి - మరియు, బాలానామ్ - పిల్లలకు, ఈశ్వరౌ - శాసకులు.

రాక్షసుల పిల్లలు ఇట్లు పలికిరి --- ఓ ప్రహ్లాదా! నీవు గాని, మేము గాని, గురుపుత్రులగు వీరిద్దరిని మినహాయించి మరియొక గురువును యెరుగము. పిల్లలమగు మనలను శాసించువారు వీరిద్దరే.

బాలస్యాంతఃపురస్థస్య మహత్సంగో దురన్వయః ।
ఛింధి నస్సంశయం సౌమ్య స్యాచ్చేద్విశ్రంభకారణమ్ ।। 30

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే ప్రహ్లాదచరితే
ప్రహ్లాదేన బాలానాముపదేశవర్ణనం నామ షష్ఠోఽధ్యాయః ।।

అంతఃపురస్థస్య - అంతఃపురమునందున్న, బాలస్య - పిల్లవానికి, మహత్-సంగః - మహాత్మునితోడి సమావేశము, దురన్వయః - దుర్ఘటము, సౌమ్య - ఓయీ ప్రియదర్శనా!, విశ్రంభకారణమ్ - విశ్వాసమునకు హేతువు, చేత్ - ఉన్నచో, నః - మాయొక్క, సంశయమ్ - సందేహమును, ఛింధి - ఛేదించుము.

ఓ ప్రియదర్శనా! అంతఃపురమునందు పెరిగిన నీకు మహాత్ముడగు నారదునితో సమావేశము దుర్ఘటము. ఈ విషయములో నిన్ను విశ్వసించుటకు తగిన కారణమున్నచో, మా ఈ సందేహమును నివృత్తి చేయుము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
ప్రహ్లాదచరితమునందు ఆరవ అధ్యాయము ముగిసినది (6).

*****

# అథ సప్తమోऽధ్యాయః

## ప్రహ్లాద చరితము - ప్రహ్లాదుని జన్మవృత్తాంతము

నారద ఉవాచ ।
ఏవం దైత్యసుతైః పృష్టో మహాభాగవతోऽసురః ।
ఉవాచ స్మయమానస్తాన్ స్మరన్ మదనుభాషితమ్ ॥ 1

మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడు, అసురః - అసురుల వంశములో జన్మించినవాడు అగు ప్రహ్లాదుడు, దైత్యసుతైః - రాక్షసుల పుత్రులచే, ఏవమ్ - ఈ విధముగా, పృష్టః - ప్రశ్నించ బడినవాడై, స్మయమానః - మెల్లగా నవ్వుచున్నవాడై, మద్-అనుభాషితమ్ - నా ఉపదేశమును, స్మరన్ - స్మరించుచున్నవాడై, తాన్ - వారిని ఉద్దేశించి, ఉవాచ - పలికెను.

నారద మహర్షి ఇట్లు పలికెను --- ప్రహ్లాదుడు రాక్షసుల వంశములో జన్మించిననూ, గొప్ప భగవద్భక్తుడు. ఆ రాక్షసపుత్రులీ విధముగా ప్రశ్నించగా ఆయన నా ఉపదేశమును స్మరిస్తూ, చిరునవ్వుతో వారిని ఉద్దేశించి ఇట్లు పలికెను.

ప్రహ్లాద ఉవాచ ।
పితరి ప్రస్థితేऽస్మాకం తపసే మందరాచలమ్ ।
యుద్ధోద్యమం పరం చక్రుర్విబుధా దానవాన్ ప్రతి ॥ 2

అస్మాకమ్ - మా, పితరి - తండ్రి, తపసే - తపస్సు కొరకు, మందర-అచలమ్ - మందర పర్వతమును గురించి, ప్రస్థితే - పయనము కాగా, విబుధాః - దేవతలు, దానవాన్ ప్రతి - రాక్షసులనుద్దేశించి, పరమ్ -

గొప్ప, యుద్ధ-ఉద్యమమ్ - యుద్ధము కొరకు ఉద్యమమును, చక్రుః - చేసిరి.

ప్రహ్లాదుడిట్లు పలికెను --- మా తండ్రి తపస్సు కొరకై మందర పర్వతమునకు వెళ్లినప్పుడు, దేవతలు రాక్షసులకు వ్యతిరేకముగా యుద్ధ ము కొరకై పెద్ద ఉద్యమమును చేసిరి.

పిపీలికైరహిరివ దిష్ట్యా లోకోపతాపనః ।
పాపేన పాపోఽభక్షీతివాదినో వాసవాదయః ।। 3

పిపీలికైః - చీమలచే, అహిః ఇవ - పాము వలె, లోక-ఉపతాపనః - జనులను హింస పెట్టే, పాపః - పాపియగు హిరణ్యకశిపుడు, దిష్ట్యా - దైవవశముచే, పాపేన - పాపముచే, అభక్షి - భక్షించబడినాడు, వాసవ-ఆ దయః - ఇంద్రుడు మొదలగువారు, ఇతివాదినః - ఇట్లు పలుకువారు.

ఇంద్రుడు మొదలగువారు ఇట్లు పలికిరి -- హిరణ్యకశిపుడు జను లను హింస పెట్టెను. చీమలు పామును భక్షించినట్లుగా, దైవవశముచే ఆ పాపిని వాని పాపమే భక్షించినది.

తేషామతిబలోద్యోగం నిశమ్యాసురయూథపాః ।
వధ్యమానాస్సురైర్భీతా దుద్రువుస్సర్వతోదిశమ్ ।। 4

కలత్రపుత్రమిత్రాప్తాన్ గృహాన్ పశుపరిచ్ఛదాన్ ।
నావేక్షమాణాస్త్వరితాస్సర్వే ప్రాణపరీప్సవః ।। 5

తేషామ్ - వారియొక్క, అతిబల-ఉద్యోగమ్ - మిక్కిలి బలమైన యుద్ధప్రయత్నమును, నిశమ్య - చూచి, అసురయూథపాః - రాక్షస సేనా నాయకులు, సర్వే - అందరు, సురైః - దేవతలచే, వధ్యమానాః - చంపబడుచున్నవారై, భీతాః - భయపడినవారై, కలత్రపుత్రమిత్ర-ఆప్తాన్ - భార్య పిల్లలు మిత్రులు ఆప్తులను, గృహాన్ - ఇళ్లను, పశుపరిచ్ఛదాన్ - పశువులను భోగసాధనములను, న-అవేక్షమాణాః - సరకు చేయనివారై, త్వరితాః - వేగము గలవారై, ప్రాణపరీప్సవః - ప్రాణములను కాపాడుకొన

గోరువారై, సర్వతః-దిశమ్ - అన్ని దిక్కులను ఉద్దేశించి, దుద్రువుః - పరుగులెత్తిరి.

వారి మహాబలపూర్వకమగు యుద్ధప్రయత్నమును చూచిన రాక్షస సేనానాయకులు అందరు భయపడిరి. దేవతలు వారిని సంహరించ మొదలిడిరి. భార్య, పిల్లలు, మిత్రులు, ఆప్తులు, ఇళ్లు, పశువులు, భోగసాధనములు అనువాటిని పట్టించుకోకుండా, వారు కేవలము ప్రాణములను మాత్రమే రక్షించుకొనగోరి, వేగముగా అన్ని దిక్కులకు పరుగులెత్తిరి.

వ్యలుంపన్ రాజశిబిరమమరా జయకాంక్షిణః ।
ఇంద్రస్తు రాజమహిషీం మాతరం మమ చాగ్రహీత్ ।। 6

జయకాంక్షిణః - విజయమును గోరే, అమరాః - దేవతలు, రాజశిబిరమ్ - రాజగృహమును, వ్యలుంపన్ - నాశము చేసిరి, ఇంద్రః తు - ఇంద్రుడైతే, రాజమహిషీమ్ - మహారాణియగు, మమ - నా, మాతరమ్ - తల్లిని, అగ్రహీత్ - చెరబట్టెను.

విజయమును కోరే దేవతలు రాజనివాసమును తగులబెట్టిరి. ఇంద్రుడైతే మా తల్లియగు మహారాణిని చెరబట్టెను.

నీయమానాం భయోద్విగ్నాం రుదతీం కురరీమివ ।
యదృచ్ఛయాఽఽగతస్తత్ర దేవర్షిర్దదృశే పథి ।। 7

నీయమానామ్ - తీసుకుపోబడుచున్నట్టియు, భయ-ఉద్విగ్నామ్ - భయముతో కలవరపాటు చెందినట్టియు, కురరీం ఇవ - కురరి వలె, రుదతీమ్ - రోదించుచున్న ఆమెను, తత్ర - అచటకు. యదృచ్ఛయా - అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే), ఆగతః - వచ్చిన, దేవ-ఋషిః - దేవర్షియగు నారదుడు, పథి - మార్గమునందు, దదృశే - చూచెను.

భయముతో కలవరపాటు చెందియున్న ఆ మహారాణిని ఇంద్రుడు తీసుకొని పోవుచుండగా, ఆమె కురరి (లకుముకి పిట్ట) వలె రోదించుచుండెను. ఆ సమయములో దేవర్షియగు నారదుడు అనుకకుండా ఈశ్వరేచ్ఛచే అచటకు వచ్చి, దారిలో ఆమెను చూచెను.

ప్రాహ మైనాం సురపతే నేతుమర్హస్యనాగసమ్ ।
ముంచ ముంచ మహాభాగ సతీం పరపరిగ్రహమ్ ॥ 8

ప్రాహ - పలికెను, సురపతే - ఓ దేవనాయకా!, అనాగసమ్ - నిర్దోషియైనట్టియు, సతీమ్ - పతివ్రతయైనట్టియు, పరపరిగ్రహమ్ - పర భార్యయైన, ఏనామ్ - ఈమెను, నేతుమ్ - తీసుకుపోవుటకు, మా అర్హసి - తగవు, మహాభాగ - ఓ మహానుభావా!, ముంచ - విడిచిపెట్టుము, ముంచ - విడిచిపెట్టుము.

నారదుడు దేవనాయకుడగు ఇంద్రునితో ఇట్లు పలికెను -- ఓ మహానుభావా! పతివ్రతయగు ఈమె నిర్దోషి. పరభార్యయగు ఈమెను నీవు తీసుకొనిపోవుట తగదు. ఈమెను విడిచిపెట్టుము, విడిచిపెట్టుము.

ఇంద్ర ఉవాచ ।
ఆస్తేఽస్యా జఠరే వీర్యమవిషహ్యం సురద్విషః ।
ఆస్యతాం యావత్ప్రసవం మోక్ష్యేఽర్థపదవీం గతః ॥ 9

అస్యాః - ఈమెయొక్క, జఠరే - గర్భమునందు, సురద్విషః - దేవద్వేషియగు హిరణ్యకశిపుని, అవిషహ్యామ్ - సహించ శక్యము కాని, వీర్యమ్ - వీర్యము, ఆస్తే - ఉన్నది, ప్రసవం యావత్ - ప్రసవము వరకు, ఆస్యతామ్ - ఉండు గాక!, అర్థపదవీమ్ - ప్రయోజనముయొక్క మార్గము ను, గతః - పొందినవాడనై, మోక్ష్యే - విడిచిపెట్టగలను.

ఇంద్రుడిట్లు పలికెను --- ఈమె గర్భములో దేవవిద్వేషియగు హిరణ్యకశిపుని వీర్యము ఉన్నది. భవిష్యత్తులో ఆ శిశువు పెరిగి పెద్దయైన చో, వాని ప్రతాపమును దేవతలు సహించలేరు. కావున, ప్రసవము అయ్యే వరకు ఈమె నా వద్దనే ఉండుగాక! నా ప్రయోజనము (శత్రుశేషము ఉండ కుండా చేయుట) సిద్ధించిన తరువాత, ఈమెను నేను విడిచి పెట్టెదను.

నారద ఉవాచ ।
అయం నిష్కిల్బిషస్సాక్షాన్మహాభాగవతో మహాన్ ।
త్వయా న ప్రాప్స్యతే సంస్థామనంతానుచరో బలీ ॥ 10

**అయమ్** - ఈ శిశువు, నిష్కల్బిషః - దోషము లేనివాడు, సాక్షాత్ - సాక్షాత్తుగా, మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడు, మహాన్ - గొప్పవాడు, అనంత-అనుచరః - శ్రీహరి సేవకుడు, బలీ - బలవంతుడు, త్వయా - నీచే, సంస్థామ్ - మరణమును, న ప్రాప్స్యతే - పొందబోడు.

నారదుడిట్లు పలికెను --- ఈ శిశువులో దోషము ఉండదు. ఈతడు సాక్షాత్తుగా గొప్ప భగవద్భక్తుడు, గొప్పవాడు, శ్రీహరి సేవకుడు కాగలడు. అట్టి ఈ బలశాలి కాబోయే పిల్లవానిని నీవు చంపలేవు.

ఇత్యుక్తస్తాం విహాయేంద్రో దేవర్షేర్మానయన్ వచః ।
అనంతప్రియభక్త్యైనాం పరిక్రమ్య దివం యయౌ ।। 11

ఇతి - ఈ విధముగా, ఉక్తః - పలుకబడిన, ఇంద్రః - ఇంద్రుడు, దేవ-ఋషేః - దేవర్షియగు నారదుని, వచః - మాటను, మానయన్ - మన్నించువాడై, తామ్ - ఆమెను, విహాయ - విడిచిపెట్టి, అనంతప్రియ భక్త్యా - అనంతునకు ప్రియుడనగు నా భక్తిచే, ఏనామ్ - ఈమెను, పరి క్రమ్య - ప్రదక్షిణము చేసి, దివమ్ - స్వర్గమును గురించి, యయౌ - వెళ్లెను.

దేవర్షియగు నారదుడు ఇట్లు చెప్పగా, ఇంద్రుడు ఆయన మాటను మన్నించి, మా తల్లిని విడిచిపెట్టెను. అనంతునకు ప్రియుడనైన నేను గర్భమునందుండుటచే, ఇంద్రుడు మా తల్లికి ప్రదక్షిణము చేసి, స్వర్గమునకు వెళ్లెను.

తతో నో మాతరమృషిస్సమానీయ నిజాశ్రమమ్ ।
ఆశ్వాస్యేహోష్యతాం వత్సే యావత్తే భర్తురాగమః ।। 12

**తతః** - తరువాత, ఋషిః - నారద మహర్షి, నః - మా, మాతరమ్ - తల్లిని, నిజ-ఆశ్రమమ్ - తన ఆశ్రమమును గురించి, సమానీయ - తీసుకువచ్చి, ఆశ్వాస్య - ఓదార్చి, వత్సే - అమ్మాయీ!, తే - నీ, భర్తుః - భర్త యొక్క, ఆగమః యావత్ - రాక వరకు, ఇహ - ఇచట, ఉష్యతామ్ - నివసించబడు గాక!

తరువాత నారద మహర్షి మా తల్లిగారిని తన ఆశ్రమమునకు తీసుకు వచ్చి ఆమెను ఓదార్చి ఇట్లు పలికెను -- అమ్మాయీ! నీ భర్త వచ్చేవరకు నీవు ఇచట నివసించుము.

తథేత్యవాత్సీద్దేవర్షేరంతి సాప్యకుతోభయా ।
యావద్దైత్యపతిర్ఘోరాత్తపసో న న్యవర్తత ॥ 13

తథా - సరే, ఇతి - అని, సా అపి - ఆమె కూడ, అకుతోభయా - దేనినుండియైననూ భయము లేనిదియై, దేవ-ఋషేః - దేవర్షియగు నారదునియొక్క, అంతి - సమీపమునందు, అవాత్సీత్ - నివసించెను, యావత్ - ఎంతవరకైతే, దైత్యపతిః - రాక్షసరాజగు హిరణ్యకశిపుడు, ఘోరాత్ - కఠినమైన, తపసః - తపస్సునుండి, న న్యవర్తత - తిరిగి రాలేదో.

ఆమె సరే అని పలికి, రాక్షసరాజగు హిరణ్యకశిపుడు కఠినమైన తపస్సును మాని తిరిగి వచ్చేవరకు, దేవర్షి నారదుని వద్ద నివసించెను. ఆమెకు అచట దేనినుండియైననూ భయము లేదు.

ఋషిం పర్యచరత్తత్ర భక్త్యా పరమయా సతీ ।
అంతర్వత్నీ స్వగర్భస్య క్షేమాయేచ్ఛాప్రసూతయే ॥ 14

సతీ - పతివ్రత, అంతర్వత్నీ - గర్భిణి అగు ఆమె, స్వగర్భస్య - తన గర్భముయొక్క, క్షేమాయ - క్షేమము కొరకు, ఇచ్ఛాప్రసూతయే - కోరిన సమయములో ప్రసవము అగుట కొరకై, తత్ర - అచట, పరమయా - గొప్ప, భక్త్యా - భక్తితో, ఋషిమ్ - నారద మహర్షిని, పరి-అచరత్ - సేవించెను.

పతివ్రత, గర్భిణి అగు మా తల్లి అచట ఉంటూ, తన గర్భములోని శిశువుయొక్క క్షేమము కొరకు మరియు తాను కోరినప్పుడు ప్రసవము అగుట కొరకు, నారద మహర్షిని గొప్ప భక్తితో సేవించెను.

ఋషిః కారుణికస్తస్యాః ప్రాదాదుభయమీశ్వరః ।
ధర్మస్య తత్త్వం జ్ఞానం చ మామప్యుద్దిశ్య నిర్మలమ్ ॥ 15

**కారుణికః** - దయామయుడు, **ఈశ్వరః** - సమర్థుడు అగు, **ఋషిః** - నారద మహర్షి, **మాం అపి** - నన్ను కూడ, **ఉద్దిశ్య** - ఉద్దేశించి, **తస్యాః** - ఆమెకు, **నిర్మలమ్** - నిర్మలమైన, **ధర్మస్య** - ధర్మముయొక్క, **తత్త్వమ్** - స్వరూపము, **జ్ఞానం చ** - జ్ఞానము అనే, **ఉభయమ్** - రెండింటినీ, **ప్రాదాత్** - ఇచ్చెను.

నారద మహర్షి దయాళువు, సమర్థుడు. ఆయన తన మనస్సులో నన్ను కూడ పెట్టుకొని, ఆమెకు నిర్మలమైన ధర్మస్వరూపము మరియు జ్ఞానము అనే రెండింటినీ అనుగ్రహించెను.

తత్తు కాలస్య దీర్ఘత్వాత్ స్త్రీత్వాన్మాతుస్తిరోదధే ।
ఋషిణానుగృహీతం మాం నాధునాప్యజహాత్ స్మృతిః ॥16

**తత్** - ఆ ఉపదేశము, **కాలస్య** - కాలము, **దీర్ఘత్వాత్** - దీర్ఘము అగుట వలన, **స్త్రీత్వాత్** - స్త్రీ యగుట వలన, **మాతుః** - తల్లికి, **తిరోదధే** - మరపునకు వచ్చెను, **ఋషిణా** - మహర్షిచే, **అనుగృహీతమ్** - అనుగ్రహించబడిన, **మాం తు** - నన్నైతే, **అధునా అపి** - ఇప్పటికి కూడా, **స్మృతిః** - స్మృతి, **న అజహాత్** - విడువలేదు.

చాల కాలము అగుట వలన, స్త్రీకి ఉండే ఇబ్బందుల వలన, ఆ ఉపదేశమును మా తల్లి మరచెను. కాని, నేను నారదుని అనుగ్రహమును పొందినవాడనగుటచే, ఆ స్మృతి ఇప్పటికి కూడా నన్ను విడిచిపెట్టలేదు.

భవతామపి భూయాన్మే యది శ్రద్దధతే వచః ।
వైశారదీ ధీశ్శ్రద్ధాతః స్త్రీబాలానాం చ మే యథా ॥ 17

**మే** - నా, **వచః** - మాటను గురించి, **యది శ్రద్దధతే** - మీరు శ్రద్ధ పెట్టే పక్షములో, **భవతాం అపి** - మీకు కూడ, **భూయాత్** - కలుగు గాక!, **వైశారదీ** - దేహాభిమానమును పోగొట్టే, **ధీః** - బుద్ధి, **మే యథా** - నాకు వలెనే, **స్త్రీబాలానాం చ** - స్త్రీలకు పిల్లలకు కూడ, **శ్రద్ధాతః** - శ్రద్ధ వలన.

నా మాటపై మీకు శ్రద్ధ ఉన్నచో, మీకు కూడ ఆ జ్ఞానము కలుగు గాక! శ్రద్ధ వలన దేహాభిమానమును పోగొట్టే వివేకబుద్ధి నాకు కలిగినట్లు గానే స్త్రీలకు, పిల్లలకు కూడ కలుగును.

జన్మాద్యాష్షడిమే భావా దృష్టా దేహస్య నాత్మనః ।
ఫలానామివ వృక్షస్య కాలేనేశ్వరమూర్తినా ॥ 18

ఈశ్వరమూర్తినా - ఈశ్వరుని రూపమైన, కాలేన - కాలముచే, దేహస్య - దేహమునకు, వృక్షస్య - చెట్టుయొక్క, ఫలానాం ఇవ - పళ్లకు వలె, ఇమే - ఈ, జన్మ-ఆద్యాః - పుట్టుక మొదలైన, షట్ - ఆరు, భావాః - వికారములు, దృష్టాః - కనబడును, ఆత్మనః - ఆత్మకు, న - కాదు.

ఈశ్వరుని రూపమే అయిన కాలముయొక్క ప్రభావముచే దేహ మునందు పళ్లయందు వలె పుట్టుక, ఉండుట, పెరుగుట, పరిణతి జెందు ట, క్షీణించుట, నశించుట అనే ఆరు వికారములు మనకు అనుభవములో నున్న విషయములే. పండు వికారములు చెట్టుకు లేనట్లే, దేహముయొక్క వికారములు ఆత్మకు సంక్రమించవు.

ఆత్మా నిత్యోఽవ్యయశ్శుద్ధ ఏకః క్షేత్రజ్ఞ ఆశ్రయః ।
అవిక్రియస్స్వదృగ్ హేతుర్వ్యాపకోఽసంగ్యనావృతః ॥ 19

ఆత్మా - ఆత్మ, నిత్యః - కాలమునకు అతీతమైనది, అవ్యయః - క్షీణించనిది, శుద్ధః - రాగద్వేషములు లేనిది, ఏకః - రెండవది లేనిది, క్షేత్రజ్ఞః - క్షేత్రమును తెలుసుకొనేది, ఆశ్రయః - ఆధారము, అవిక్రియః - వికారములు లేనిది, స్వదృక్ - స్వయంప్రకాశము, హేతుః - సర్వకార ణము, వ్యాపకః - వ్యాపించి యుండునది, అసంగీ - సంగము లేనిది, అనావృతః - ఆవరణము లేనిది.

కాలమునకు అతీతమైన ఆత్మయందు క్షీణించుట అనేది ఉండదు. ఆత్మకంటె భిన్నముగా రెండవది లేనందు వలన, ఆత్మయందు రాగద్వేష ములకు తావు లేదు. దేహేంద్రియమనస్సంఘాతము అనే క్షేత్రము విష యములో ఆత్మ నిత్యసాక్షియై ఉండును. సర్వజగత్తునకు ఆధారమైన

ఆత్మయందు వికారములేవియు ఉండవు. స్వయంప్రకాశమగు ఆత్మయే సర్వజగత్కారణము. ఆత్మ సర్వవ్యాపకమే అయిననూ, దానికి దేనితోనైననూ సంగము లేదు. ఆత్మ ఆవరణములు లేని పూర్ణతత్త్వము.

ఏతైర్ద్వాదశభిర్విద్వానాత్మనో లక్షణైః పరైః ।
అహం మమేత్యసద్భావం దేహాదౌ మోహజం త్యజేత్ ।।20

ఏతైః - ఈ, పరైః - శ్రేష్ఠములైన, ద్వాదశభిః - పన్నెండు, ఆత్మనః - ఆత్మయొక్క, లక్షణైః - లక్షణముల ద్వారా, విద్వాన్ - వివేకి, దేహ-ఆదౌ - దేహము ఇంద్రియములు మొదలగువాటియందు, అహమ్ - నేను, మమ - నాది, ఇతి - అనే, మోహజమ్ - వ్యామోహము వలన పుట్టే, అసద్-భావమ్ - మిథ్యాభిమానమును, త్యజేత్ - విడిచిపెట్టవలెను.

వివేకి ఆత్మయొక్క స్వరూపమును సూచించే ఈ పన్నెండు శ్రేష్ఠ లక్షణములను అనుసంధానము చేయవలెను. దేహము ఇంద్రియముల యందలి వ్యామోహము వలన మనకు వాటియందు నేను, నాది అనే మిథ్యాభిమానము ఉండును. దానిని వివేకి పరిత్యజించవలెను.

స్వర్ణం యథా గ్రావసు హేమకారః
క్షేత్రేషు యోగైస్తదభిజ్ఞ ఆప్నుయాత్ ।
క్షేత్రేషు దేహేషు తథాఽఽత్మయోగైః
అధ్యాత్మవిద్బ్రహ్మగతిం లభేత ।। 21

యథా - ఏ విధముగానైతే, హేమకారః - బంగారమును తయారు చేయువాడు, క్షేత్రేషు - బంగారము దొరికే స్థలములయందలి, గ్రావసు - రాళ్లయందు, యోగైః - ఉపాయములచే, తద్-అభిజ్ఞః - ఆ ఉపాయములు తెలిసినవాడై, స్వర్ణమ్ - బంగారమును, ఆప్నుయాత్ - సంపాదించునో, తథా - అదే విధముగా, అధ్యాత్మవిత్ - ఆత్మానాత్మవివేకము గల సాధకుడు, క్షేత్రేషు - క్షేత్రములైన, దేహేషు - దేహములయందు, ఆత్మయోగైః - ఆత్మజ్ఞానమునకు సహకరించే ఉపాయములతో, బ్రహ్మగతిమ్ - బ్రహ్మసాక్షాత్కారమును, లభేత - పొందవలెను.

బంగారమును తయారుచేసే వ్యక్తి బంగారము దొరికే గనుల యందలి రాళ్లలోని బంగారమును అనేకములైన ఉపాయములతో వెలికితీయును. ఆ ఉపాయములన్నియు అతనికి ఎరుకయే. అదే విధముగా, ఆత్మానాత్మవివేకము గల సాధకుడు ఆత్మజ్ఞానమునకు సహకరించే ధ్యానము మొదలైన ఉపాయములననుష్ఠించి, చైతన్య క్షేత్రములనదగిన దేహములయందే బ్రహ్మను ఆత్మరూపముగా సాక్షాత్కరించుకొనవలెను.

అష్టౌ ప్రకృతయః ప్రోక్తాస్త్రయ ఏవ హి తద్గుణాః ।
వికారాష్షోడశాచార్యైః పుమానేకస్సమన్వయాత్ ॥ 22

అష్టౌ - ఎనిమిది, ప్రకృతయః - ప్రకృతులు, ఆచార్యైః - సాంఖ్యాచార్యులచే, ప్రోక్తాః - చెప్పబడినవి, తద్-గుణాః - ఆ ప్రకృతియొక్క గుణములు, త్రయః ఏవ హి - నిశ్చయముగా మూడు, వికారాః - వికారములు, షోడశ - పదహారు, సమన్వయాత్ - అనువృత్తమగుట వలన, పుమాన్ - పురుషుడు, ఏకః - ఒక్కడే.

సాంఖ్యాచార్యుల పరిగణనమిట్లున్నది -- ప్రకృతులు (జగత్తునకు మూలమనందున్న తత్త్వములు) మూలప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము, పృథివి నీరు అగ్ని వాయువు ఆకాశము అనే అయిదు సూక్ష్మభూతములు వెరసి ఎనిమిది. మూలప్రకృతి సత్త్వరజస్తమస్సులు అనే మూడు గుణములు గలది. అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియములు, అంతఃకరణము, అయిదు స్థూలభూతములు వెరసి పదహారు వికారములు (మూలతత్త్వములనుండి ప్రకటమైన కార్యములు). దృశ్యమగు ఈ సర్వమునందు వ్యాపించియున్న చైతన్యస్వరూపుడగు పురుషుడు ఒక్కడే.

దేహస్తు సర్వసంఘాతో జగత్తస్థురితి ద్విధా ।
అత్రైవ మృగ్యః పురుషో నేతి నేతీత్యతత్త్యజన్ ॥ 23

అన్వయవ్యతిరేకేణ వివేకేనోశతాఽఽత్మనా ।
సర్గస్థానసమామ్నాయైర్విమృశద్భిరసత్వరైః ॥ 24

సర్వసంఘాతః - ప్రకృతివికృతుల సమాహారమైన, దేహః తు - శరీరమైతే, జగత్ - కదిలేది, తస్థుః - కదలనిది, ఇతి - అని, ద్విధా - రెండు రకములుగా నున్నది, న ఇతి - ఇది కాదు, న ఇతి - ఇది కాదు, ఇతి - ఈ విధముగా, అతత్ - పురుషుడు కానిదానిని, త్యజన్ - నిరాకరిం చువాడై, అత్ర ఏవ - ఈ దేహమునందు మాత్రమే, పురుషః - పూర్ణచైత న్యస్వరూపుడగు పరమాత్మ, విమృశద్భిః - ఆత్మవిచారమును చేసే, అస త్వరైః - అలజడి లేని మనస్సు గల సాధకులచే, అన్వయవ్యతిరేకేణ - అన్వయవ్యతిరేకములచే ఉదయించే, వివేకేన - వివేకము ద్వారా, ఉశతా - పరిశుద్ధమైన, ఆత్మనా - మనస్సుతో, సర్గస్థానసమామ్నాయైః - సృష్టిస్థి తుల వేదవాక్యములచే, మృగ్యః - అన్వేషించ దగినది.

ప్రకృతి-వికృతుల సమాహారమైన ఈ దేహము కదిలేది, కదలనిది అని రెండు విధములుగా నున్నది. పురుషుడు కాని దేహము, మనస్సు మొదలగువాటిని, ఇది కాదు, ఇది కాదు అంటూ నిరాకరించి పరమాత్మను ఈ దేహమునందు మాత్రమే అన్వేషించవలెను. కారణము కార్యప్రపంచ మునంతనూ వ్యాపించియున్ననూ (అన్వయము), కారణము కార్యము కంటె విలక్షణమైనది (వ్యతిరేకము) అనే వివేకమును ఆత్మవిచారమును చేసే సాధకులు ప్రసన్నమైన మనస్సుతో అభ్యసించవలెను. ఈ జగత్తు దేనినుండి ఉదయించి దేనియందు నిలిచి దేనియందు విలీనమగునో అట్టి పరబ్రహ్మ సకలప్రాణులలో ఆత్మరూపముగానున్నది అని చక్కగా బోధించే శ్రుతివాక్యములను సాధకులు పరిశుద్ధమగు అంతఃకరణముతో వివేచించవ లెను. ఈ విచారములో తొందరపాటు పనికి రాదు.

బుద్ధేర్జాగరణం స్వప్నస్సుషుప్తిరితి వృత్తయః ।
తా యేనైవానుభూయంతే సోఽధ్యక్షః పురుషః పరః ॥ 25

జాగరణమ్ - తెలివిగానుండుట, స్వప్నః - కలలను గనుట, సుషుప్తిః - గాఢనిద్ర, ఇతి - అనేవి, బుద్ధేః - బుద్ధియొక్క, వృత్తయః - వ్యాపారములు, తాః - అవి, యేన ఏవ - దేనిద్వారా మాత్రమే, అనుభూ యంతే - అనుభవమునకు వచ్చుచున్నవో, సః - అట్టి, అధ్యక్షః - సాక్షి, పరః - సర్వాతీతుడగు, పురుషః - పరమాత్మ.

తెలివిగా నుండుట, కలలను గనుట, నిద్ర అనే మూడు అవస్థలు ఏ చైతన్యము ద్వారా అనుభవమునకు వచ్చుచున్నవో, అట్టి సాక్షిచైతన్యమే దేహేంద్రియాదులకంటె అతీతమైన పరమాత్మ.

ఏభిస్త్రివర్ణైః పర్యస్తైర్బుద్ధిభేదైః క్రియోద్భవైః ।
స్వరూపమాత్మనో బుధ్యేద్గంధైర్వాయుమివాన్వయాత్ ॥26

త్రివర్ణైః - సత్త్వరజస్తమోగుణరూపములైనట్టియు, క్రియా-ఉద్భవైః - కర్మల వలన కలిగే, ఏభిః - ఈ, బుద్ధిభేదైః - బుద్ధియొక్క అవస్థలు, పర్యస్తైః - నిరాకరించబడినవి కాగా, అన్వయాత్ - అనుగతమైయుండుట నిమిత్తముగా, గంధైః - గంధముల ద్వారా, వాయుం ఇవ - వాయువును వలె, ఆత్మనః - ఆత్మయొక్క, స్వరూపమ్ - స్వరూపమును, బుధ్యేత్ - తెలుసుకొనవలెను.

సత్త్వగుణప్రాధాన్యముచే జాగ్రదవస్థ, రజోగుణముచే స్వప్నావస్థ, తమస్సుచే నిద్ర కర్మఫలరూపముగా బుద్ధియందు కలుగుచుండును. ఆ బుద్ధియందు ఆత్మ సాక్షిచైతన్యరూపముగా అనుగతమై యున్నది. బుద్ధితోడి తాదాత్మ్యముచే ఈ అవస్థలు ఆత్మకేనా యని అనిపించును. అట్టి తాదాత్మ్యమును నిరాకరించి, గంధమును బట్టి దానికి ఆశ్రయమగు వాయువును తెలుసుకున్నట్లుగా, బుద్ధిలోని అవస్థలను ప్రకాశింపజేసే సాక్షి చైతన్యస్వరూపముగా పరమాత్మను తెలుసుకొనవలెను.

ఏతద్ద్వారో హి సంసారో గుణకర్మనిబంధనః ।
అజ్ఞానమూలోఽపార్థోఽపి పుంసస్స్వప్న ఇవేష్యతే ॥ 27

పుంసః - వ్యక్తికి, గుణకర్మనిబంధనః - త్రిగుణములు కర్మలచే స్థిరము చేయబడునది, అజ్ఞానమూలః - అజ్ఞానమే మూలముగా గలది అగు, సంసారః - సంసారము, ఏతద్-ద్వారః హి - ఈ బుద్ధియే ద్వారముగా గలది, స్వప్నః ఇవ - కల వలె, అప-అర్థః అపి - తొలగిన వాస్తవికత గలదియే అయిననూ, ఇష్యతే - కనబడుచున్నది.

ఆత్మానాత్మవివేకము లేకుండా ఈ బుద్ధితోడి తాదాత్మ్యము వలననే ఆత్మకు ఈ జననమరణప్రవాహరూపమగు సంసారము ప్రాప్తమై త్రిగుణములచే మరియు కర్మలచే స్థిరము చేయబడుచున్నది. ఈ సంసారము కనబడుటయే గాని, వాస్తవము కాదు; ఇది కలవలె మిథ్య.

తస్మాద్భవద్భిః కర్తవ్యం కర్మణాం త్రిగుణాత్మనామ్ ।
బీజనిర్హరణం యోగః ప్రవాహోపరమో ధియః ॥ 28

తస్మాత్ - అందువలన, త్రిగుణ-ఆత్మనామ్ - మూడు గుణముల పరిణామరూపములైన, కర్మణామ్ - కర్మలయొక్క, బీజనిర్హరణమ్ - బీజమైన అజ్ఞానముయొక్క వినాశము, భవద్భిః - మీచే, కర్తవ్యమ్ - చేయబడదగినది, ధియః - బుద్ధియొక్క, ప్రవాహ-ఉపరమః - ప్రవాహము చల్లారుటయే, యోగః - యోగము.

కావున, సాధకులు మూడు గుణముల పరిణామరూపములైన కర్మల బీజము ఆత్మానాత్మవివేకము లేకపోవుటయేనని గుర్తించి, అజ్ఞానమనే ఆ బీజమును నశింపజేయుటకు యత్నించవలెను. అదియే యోగము. బుద్ధియొక్క ప్రవాహము ఉపశమించుటయే యోగము.

తత్రోపాయసహస్రాణామయం భగవతోదితః ।
యదీశ్వరే భగవతి యథా యైరంజసా రతిః ॥ 29

తత్ర - ఆ విషయమునందు, ఉపాయసహస్రాణామ్ - వేలాది ఉపాయములలో, అయమ్ - ఇది, భగవతా - భగవానునిచే, ఉదితః - చెప్పబడినది, యత్ - దేనివలనైతే, యైః - ఏ సాధనములచే, ఈశ్వరే - జగన్నాథుడగు, భగవతి - భగవానునియందు, యథా - ఏ విధముగానైతే, అంజసా - తేలికగా, రతిః - ప్రీతియో.

అజ్ఞానమనే బీజమును నశింపజేసే విషయములో వేలాది ఉపాయములు గలవు. కాని, భగవానుడు ఒక్క ఉపాయమును చెప్పినాడు. దేనితో వివిధధర్మముల ననుష్ఠించుచుండగా, జగన్నాథుడగు భగవానుని యందు ప్రేమ ఉదయించునో, అది (భక్తి) యే ఆ ఉపాయము.

గురుశుశ్రూషయా భక్త్యా సర్వలబ్ధార్పణేన చ ।
సంగేన సాధుభక్తానామీశ్వరారాధనేన చ ॥ 30

శ్రద్ధయా తత్కథాయాం చ కీర్తనైర్గుణకర్మణామ్ ।
తత్పాదాంబురుహధ్యానాత్తల్లింగేక్షార్హణాదిభిః ॥ 31

భక్త్యా - భక్తితో, గురుశుశ్రూషయా - గురువును సేవించుటచే, సర్వలబ్ధ-అర్పణేన చ - సర్వమును లభించినదానిని అర్పించుటచే, సాధుభక్తానామ్ - సత్పురుషులైన భక్తులయొక్క, సంగేన - సంగముచే, ఈశ్వర-ఆరాధనేన చ - ఈశ్వరుని ఆరాధించుటచే, తత్-కథాయామ్ - ఆ భగవానుని గాథయందు, శ్రద్ధయా - శ్రద్ధచే, గుణకర్మణామ్ - గుణములు లీలలయొక్క, కీర్తనైః - కీర్తించుటలచే, తత్-పాద-అంబురుహధ్యానాత్ - ఆ భగవానుని పాదపద్మములను ధ్యానించుట వలన, తత్-లింగ-ఈక్షా-అర్హణ-ఆదిభిః - ఆ భగవానుని మూర్తులయొక్క దర్శనము పూజించుట మొదలగువాటిచే (ప్రేమ ఉదయించును).

భక్తితో గురువును సేవించుట, తనకు లభించిన సర్వమును భగవానునకు సమర్పించుట, సత్పురుషులైన భక్తులతో సత్సంగము, ఈశ్వరుని ఆరాధించుట, ఈశ్వరుని గాథలయందు శ్రద్ధను కలిగియుండుట, ఈశ్వరుని గుణములను లీలలను కీర్తించుట, ఆ భగవానుని పాదపద్మములను ధ్యానించుట, ఆ భగవానుని మూర్తులను దర్శించి పూజించుట మొదలగు సాధనలచే భగవానునియందు ప్రేమ ఉదయించును.

హరిస్సర్వేషు భూతేషు భగవానాస్త ఈశ్వరః ।
ఇతి భూతాని మనసా కామైస్తైస్సాధు మానయేత్ ॥ 32

ఈశ్వరః - ఈశ్వరుడైన, హరిః - శ్రీహరి, సర్వేషు - సకలములైన, భూతేషు - ప్రాణులయందు, ఆస్తే - ఉన్నాడు, ఇతి - అని, భూతాని - ప్రాణులను, మనసా - మనస్సుతో, తైః - ఆ, కామైః - అభీష్టములగు వస్తువులతో, సాధు - చక్కగా, మానయేత్ - ఆదరించవలెను.

సర్వేశ్వరుడైన శ్రీహరి సకలప్రాణులలో ఉన్నాడు అనే భావనతో ఆ ప్రాణులకు అభీష్టములగు వస్తువులను సాదరముగా సమర్పించవలెను.

ఏవం నిర్జితషడ్వర్గైః క్రియతే భక్తిరీశ్వరే ।
వాసుదేవే భగవతి యయా సంలభతే రతిమ్ ॥ 33

నిర్జితషడ్వర్గైః - జయించబడిన ఆర్గురు శత్రువుల సముదాయము గలవారిచే, ఏవమ్ - ఈ విధముగా, ఈశ్వరే - జగన్నాథుడైన, వాసుదేవే భగవతి - వాసుదేవ భగవానునియందు, భక్తిః - భక్తి, క్రియతే - చేయబడును, యయా - దేనిచే, రతిమ్ - ప్రేమను, సంలభతే - చక్కగా పొందునో.

సాధకులు కామక్రోధలోభమోహమదమాత్సర్యములనే ఆర్గురు అంతశ్శత్రువులను జయించి జగన్నాథుడగు వాసుదేవ భగవానునియందు ఈ విధముగా భక్తిని చేసినచో, భగవానునియందు ప్రేమ ఉదయించును.

నిశమ్య కర్మాణి గుణానతుల్యాన్
వీర్యాణి లీలాతనుభిః కృతాని ।
యదాతిహర్షోత్పులకాశ్రుగద్గదం
ప్రోత్కంఠ ఉద్గాయతి రౌతి నృత్యతి ॥ 34

యదా గ్రహగ్రస్త ఇవ క్వచిద్ధస-
త్యాక్రందతే ధ్యాయతి వందతే జనమ్ ।
ముహుశ్శ్వసన్ వక్తి హరే జగత్పతే
నారాయణేత్యాత్మమతిర్గతత్రపః ॥ 35

తదా పుమాన్ముక్తసమస్తబంధనస్తద్భావభావానుకృతాశయాకృతిః,
నిర్దగ్ధబీజానుశయో మహీయసా భక్తిప్రయోగేణ సమేత్యధోక్షజమ్।

అతుల్యాన్ - సాటిలేని, గుణాన్ - గుణములను, లీలాతనుభిః - లీలకొరకై స్వీకరించబడిన అవతారములచే, కృతాని - చేయబడిన, కర్మాణి - కర్మలను, వీర్యాణి - పరాక్రమములను, నిశమ్య - విని, యదా - ఎప్పుడైతే, అతిహర్ష-ఉత్-పులక-అశ్రుగద్గదమ్ - గొప్ప హర్షముచే గగు

ర్పాటు కన్నీరు డగ్గుత్తిక కలుగునట్లుగా, ప్ర-ఉత్-కంఠః - ఎలుగెత్తిన కంఠధ్వని గలవాడై, ఉద్-గాయతి - బిగ్గరగా పాడునో, రౌతి - శబ్దమును చేయునో, నృత్యతి - నాట్యమును చేయునో, యదా - ఎప్పుడైతే, క్వచిత్ - ఒకప్పుడు, గ్రహగ్రస్తః ఇవ - దెయ్యము పట్టినవాడు వలె, హసతి - నవ్వునో, ఆక్రందతే - ఏడ్చునో, ధ్యాయతి - ధ్యానించునో, జనమ్ - జనుని, వందతే - నమస్కరించునో, ఆత్మమతిః - ఆత్మరూపుడగు ఈశ్వరుని యందు లగ్నమైన మనస్సు గలవాడై, గతత్రపః - తొలగిన బిడియము గలవాడై, ముహుః - పలుమార్లు, శ్వసన్ - నిట్టూర్పులను విడుచుచున్న వాడై, హరే - ఓ హరీ!, జగత్-పతే - ఓ జగన్నాథా!, నారాయణ - ఓ నారాయణా!, ఇతి - అని, వక్తి - పలుకునో, తదా - అప్పుడు, పుమాన్ - వ్యక్తి, ముక్తసమస్తబంధనః - విడిచిపెట్టబడిన సకలబంధములు గలవాడై, తద్-భావభావ-అనుకృత-ఆశయ-ఆకృతిః - ఆ భగవానుని లీలయొక్క భావనచే అనురూపముగా చేయబడిన అంతఃకరణము దేహము గలవాడై, మహీయసా - గొప్ప, భక్తిప్రయోగేణ - భక్తిని చేయుటచే, నిర్దగ్ధబీజ-అనుశయః - పూర్తిగా తగులపెట్టబడిన అజ్ఞానబీజము వాసనలు గలవాడై, అధోక్షజమ్ - ప్రమాణములకు అందని శ్రీహరిని, సమేతి - చక్కగా పొందును.

భగవానుని సాటిలేని గుణములను, భగవానుడు లీల కొరకై అవతారములనెత్తి చేసిన కర్మలను చూపిన పరాక్రమములను విని భక్తునకు గొప్ప హర్షముచే గగుర్పాటు కలిగి కన్నీరు ప్రవహించి కంఠము డగ్గుత్తికను పొందును. ఆతడు ఎలుగెత్తిన కంఠముతో బిగ్గరగా పాడి శబ్దమును చేసి నాట్యమాడును. భక్తుడు దెయ్యము పట్టినవాడు వలె నవ్వుతూ ఏడుస్తూ ఈశ్వరుని ధ్యానిస్తూ జనులకు నమస్కరించును. ఆతడు ఆత్మరూపుడగు ఈశ్వరునియందు లగ్నమైన మనస్సు గలవాడై బిడియమును విడనాడి, పదే పదే నిట్టూర్పులను విడుస్తూ, ఓ హరీ! జగన్నాథా! నారాయణా! అని పిలుచును. భక్తుడు ఇట్టి స్థితిని చేరుకున్నచో, ఆతని సకలబంధములు తొలగిపోవును. ఆతని అంతఃకరణము, దేహము కూడ భగవానుని లీలయొక్క భావనకు అనురూపముగా తయారగును. ఈ విధమైన గొప్ప భక్తిని చేయుటచే ఆతని అజ్ఞానబీజము, వాసనలు పూర్తిగా దగ్ధమగును. అట్టివాడు ప్రత్యక్షాది ప్రమాణములకు అందని శ్రీహరిలో శాశ్వతముగా ఐక్యమగును.

అధోక్షజాలంభమిహాశుభాత్మనః
శరీరిణస్సంసృతిచక్రశాతనమ్ ।
తద్బ్రహ్మ నిర్వాణసుఖం విదుర్బుధాః
తతో భజధ్వం హృదయే హృదీశ్వరమ్ ॥ 37

ఇహ - ఈ లోకమునందు, అశుభ-ఆత్మనః - అమంగళకరమగు మనస్సు గల, శరీరిణః - మానవునకు, అధోక్షజ-ఆలంభమ్ - శ్రీహరి యొక్క స్పర్శ (ప్రాప్తి), సంసృతిచక్రశాతనమ్ - సంసారచక్రమును నివారణ చేయునది, తత్ - దానిని, బ్రహ్మ - పరబ్రహ్మగా, నిర్వాణసుఖమ్ - మోక్షసుఖముగా, బుధాః - మహాత్ములు, విదుః - తెలియుచున్నారు, తతః - అందువలన, హృదయే - హృదయమునందు, హృద్-ఈశ్వరమ్ - హృదయాధిపతియగు పరమాత్మను, భజధ్వమ్ - సేవించుడు.

ఈ లోకములో అమంగళకరమగు మనోవాసనలు గల మానవునకు సంసారచక్రమును నివారణ చేసేది ప్రత్యక్షాది ప్రమాణములకు అందని శ్రీహరిని పొందుటయే. ఆ శ్రీహరినే పరబ్రహ్మ అనియు, మోక్షానందమనియు మహాత్ములు వర్ణించెదరు. మీరు మీ హృదయములో హృదయేశ్వరుడగు ఆ పరమాత్మను ఆరాధించుడు.

కోఽతిప్రయాసోఽసురబాలకా హరేః
ఉపాసనే స్వే హృది ఛిద్రవత్సతః।
స్వస్యాత్మనస్సఖ్యురశేషదేహినాం
సామాన్యతః కిం విషయోపపాదనైః ॥ 38

అసురబాలకాః - అసురబాలకులారా!, స్వే - తన, హృది - హృదయమునందు, ఛిద్రవత్ - ఆకాశమువలె, సతః - ఉన్నట్టియు, స్వస్య - తనకు, ఆత్మనః - స్వరూపమైనట్టియు, అశేషదేహినామ్ - సకలప్రాణులకు, సామాన్యతః - సమానరూపముగా, సఖ్యుః - హితకారియగు, హరేః - శ్రీహరియొక్క, ఉపాసనే - ఉపాసించుటయందు, అతిప్రయాసః - పెద్ద ప్రయాస, కః - ఏమి గలదు?, విషయ-ఉపపాదనైః - భోగముల ఆర్జనల చే, కిమ్ - ఏమి ప్రయోజనము?

ఓ అసురబాలకులారా! శ్రీహరి సకలప్రాణుల హృదయములో ఆకాశమువలె ఉండి సమానరూపముగా హితమును చేయుచున్నాడు. ఆ విధముగా తనకు ఆత్మరూపుడే అయి ఉన్న శ్రీహరిని ఉపాసించుటలో పెద్ద ప్రయాస ఏమి గలదు? భోగములను ఆర్జించుటలో ప్రయోజనమేమి గలదు?

రాయః కలత్రం పశవస్సుతాదయో
గృహా మహీ కుంజరకోశభూతయః ।
సర్వేఽర్థకామాః క్షణభంగురాయుషః
కుర్వంతి మర్త్యస్య కియత్ప్రియం చలాః ॥ 39

చలాః - అస్థిరములైన, రాయః - ధనములు, కలత్రమ్ - భార్య, పశవః - పశువులు, సుత-ఆదయః - పుత్రుడు మొదలగువారు, గృహాః - ఇల్లు, మహీ - భూమి, కుంజరకోశభూతయః - ఏనుగులు ధనాగారము భోగసాధనములు, అర్థకామాః - అర్థకామములు, సర్వే - అన్నీ, క్షణభంగుర-ఆయుషః - క్షణములో నశించే ఆయుష్షు గలవి, మర్త్యస్య - మానవునకు, కియత్ - ఎంతటి, ప్రియమ్ - ప్రియమును, కుర్వంతి - చేయును?

ధనములు అస్థిరములు. భార్య, సంతానము, ఇల్లు, పశుసంపద, భూమి, ఏనుగులు, ధనాగారము, భోగసాధనములు మొదలైన అర్థకామములన్నింటియొక్క ఆయుష్షు క్షణకాలములో నశించేది మాత్రమే. ఇవి మానవునకు చేసే ప్రియము ఎంతటిది? (అల్పము).

ఏవం హి లోకాః క్రతుభిః కృతా అమీ
క్షయిష్ణవస్సాతిశయా న నిర్మలాః ।
తస్మాదదృష్టశ్రుతదూషణం పరం
భక్త్యైకయేశం భజతాత్మలబ్ధయే ॥ 40

ఏవమ్ - ఇదే విధముగా, క్రతుభిః - యజ్ఞములచే, కృతాః - సంపాదించబడే, అమీ - ఈ, లోకాః హి - లోకములు కూడ, క్షయిష్ణవః - నశించే స్వభావము గలవి, స-అతిశయాః - ఒకదానిని మించి మరియొకటి

ఉండునవి, న నిర్మలాః - దోషము లేనివి కావు, తస్మాత్ - అందువలన, ఆత్మలబ్ధయే - ఆత్మలాభము కొరకు, అదృష్టశ్రుతదూషణమ్ - కనబడని వినబడని దోషము కలిగిన, పరం ఈశమ్ - పరమేశ్వరుని, ఏకయా - అనన్యమైన, భక్త్యా - భక్తితో, భజత - భజించుడు.

ఇదే విధముగా యజ్ఞములను చేసి సంపాదించే ఈ స్వర్గాది లోకములు కూడ నశించే స్వభావము గలవియే. వాటిలో దోషములు లేవని చెప్పుటకు వీలులేదు. పైగా, వాటిలో ఒకదానిని మించి మరియొకటి ఉండుటచే అవి సాపేక్షములు. కావున, మీరు ఆత్మలాభము కొరకై అనన్యమగు భక్తితో ఆ పరమేశ్వరుని ఆరాధించుడు. ఆయనయందు దోషము కనబడదు; వేదములలో వినబడదు.

యదధ్యర్థ్యేహ కర్మాణి విద్వన్మాన్యసకృన్నరః ।
కరోత్యతో విపర్యాసమమోఘం విందతే ఫలమ్ ॥ 41

విద్వత్-మానీ - తాను అన్నీ తెలిసినవాడననే అభిమానము గల, నరః - మానవుడు, ఇహ - ఈ లోకమునందు, యత్ - దేనిని, అధ్యర్థ్య - సంకల్పించి, అసకృత్ - పదే పదే, కర్మాణి - కర్మలను, కరోతి - చేయుచున్నాడో, అతః - దీనికంటె, విపర్యాసమ్ - తల్లక్రిందులైన, ఫలమ్ - ఫలమును, అమోఘమ్ - అవశ్యముగా, విందతే - పొందుచున్నాడు.

ఈ లోకములో మానవుడు తనకే అన్నీ తెలుసునని భావిస్తూ సుఖమును కోరి పదే పదే కర్మలను చేయుచుండును. కాని వానికి అవశ్యముగా విపరీత ఫలము, అనగా దుఃఖము, లభించుచున్నది.

సుఖాయ దుఃఖమోక్షాయ సంకల్ప ఇహ కర్మిణః ।
సదాఽఽప్నోతీహయా దుఃఖమనీహాయాస్సుఖావృతః ॥ 42

ఇహ - ఈ లోకమునందు, కర్మిణః - కర్మలను చేసే వ్యక్తి-, సుఖాయ - సుఖము కొరకు, దుఃఖమోక్షాయ - దుఃఖమునుండి విముక్తి కొరకు, సంకల్పః - సంకల్పము, అనీహాయాః - కామన లేనందువలన. సుఖ-ఆవృతః - సుఖముచే వ్యాపించబడియున్న వ్యక్తి, ఈహయా -

కామనచే, సదా - సర్వకాలములయందు, దుఃఖమ్ - దుఃఖమును, ఆప్నోతి - పొంధుచున్నాడు.

ఈ లోకములో మానవుడు సుఖమును, దుఃఖమునుండి విముక్తిని కోరి కర్మలను చేయుచుండును. కాని, అన్ని సందర్భములలో మానవుడు దుఃఖమునే పొందుచున్నాడు. వాస్తవములో కామనను ఆపై ఆ కామన కొరకై కర్మను చేయుటకు ముందే మానవుడు నిండా సుఖమును కలిగియున్నాడు.

కామాన్ కామయతే కామ్యైర్యదర్థమిహ పూరుషః ।
స వై దేహస్తు పారక్యో భంగురో యాత్యుపైతి చ ॥ 43

ఇహ - ఈ లోకమునందు, పూరుషః - మానవుడు, యద్-అర్థమ్ - ఏ దేహము కొరకై, కామ్యైః - కామ్యకర్మలచే, కామాన్ - భోగసాధనములను, కామయతే - కోరుచున్నాడో, సః - ఆ, దేహః తు - దేహమైతే, వై - నిశ్చయముగా, పారక్యః - క్రిమికీటకాదులకు ఆహారమయ్యేది, భంగురః - నశించేది, యాతి - పోవును, ఉపైతి చ - మరల వచ్చును కూడ.

ఈ లోకములో మానవుడు దేహము కొరకై భోగసాధనములను కోరి కామ్యకర్మలను చేయుచుండును. కాని, ఆ దేహమైతే నిశ్చయముగా నశించి క్రిమికీటకాదులకు ఆహారము అగును. ఆ దేహము జీవుని విడిచిపెట్టి, మరల జీవునకు సంప్రాప్తమగును.

కిము వ్యవహితాపత్యదారాగారధనాదయః ।
రాజ్యం కోశగజామాత్యభృత్యాప్తా మమతాస్పదాః ॥ 44

వ్యవహిత-అపత్యదార-ఆగారధన-ఆదయః - దేహమునకు బయటనుండే సంతానము భార్య ఇల్లు ధనము మొదలైనవి, మమతా-ఆస్పదాః - నాది అనే అభిమానమునకు విషయములైనవి, రాజ్యమ్ - రాజ్యము, కోశగజ-అమాత్యభృత్య-ఆప్తాః - ధనాగారము ఏనుగులు అమాత్యులు సేవకులు ఆప్తులు, కిము - చెప్పునదేమున్నది?

దేహముయొక్క గతి ఇట్లుండగా, దేహమునకు బయట ఉండి, ఇది నాది అనే అభిమానములో విషయములయ్యే సంతానము, భార్య, ఇల్లు, ధనము, రాజ్యము, కోశాగారము, ఏనుగులు, అమాత్యులు, సేవకులు, ఆప్తులైన బంధువులు కూడ దూరమయ్యేవే అని వేరుగ చెప్పవలెనా?

కిమేతైరాత్మనస్తుచ్ఛైస్సహ దేహేన నశ్వరైః ।
అనర్థైరర్థసంకాశైర్నిత్యానందమహోదధేః ।। 45

నిత్య-ఆనందమహా-ఉదధేః - నిత్యమైన ఆనందమునకు మహాసముద్రమైన, ఆత్మనః - ఆత్మకు, తుచ్ఛైః - మిక్కిలి అల్పములైనట్టియు, దేహేన సహ - దేహముతో బాటుగా, నశ్వరైః - నశించునట్టియు, అర్థసంకాశైః - పురుషార్థములవలె భాసించే, ఏతైః - ఈ, అనర్థైః - అనర్థములతో, కిమ్ - పని యేమి?

తుచ్ఛములగు ఈ ఇంద్రియభోగములు శరీరముతో బాటే నశించును. ఇవి పురుషునకు అభీష్టములుగా భాసించిననూ, వాస్తవములో ఆపదలను కొని తెచ్చును. సర్వకాలములలో ఆనందమునకు మహాసముద్రమైయున్న ఆత్మకు వీటితో పని యేమున్నది?

నిరూప్యతామిహ స్వార్థః కియాన్ దేహభృతోఽసురాః ।
నిషేకాదిష్వవస్థాసు క్లిశ్యమానస్య కర్మభిః ।। 46

అసురాః - అసుర బాలకులారా!, ఇహ - ఈ లోకమునందు, నిషేక-ఆదిషు - గర్భాధానముతో మొదలైన, అవస్థాసు - అవస్థలయందు, కర్మభిః - కర్మలచే, క్లిశ్యమానస్య - క్లేశమును పొందుచున్న, దేహభృతః - దేహధారికి, స్వ-అర్థః - తనకు కలిగే ప్రయోజనము, కియాన్ - ఎంతటిది?, నిరూప్యతామ్ - ఆలోచించబడుగాక!

ఓ అసుర బాలకులారా! మీరే ఆలోచించండి. తల్లి కడుపున పడుటతో మొదలుపెట్టి వేర్వేరు అవస్థలలో ప్రారబ్ధకర్మానుసారముగా కష్టములను పడుచున్న దేహధారికి ఈ లోకములో లభించే వాస్తవమైన ప్రయోజనము (ఫలము) ఎంతటిది?

కర్మాణ్యారభతే దేహీ దేహేనాత్మానువర్తినా ।
కర్మభిస్తనుతే దేహముభయం త్వవివేకతః ॥ 47

దేహీ - దేహధారియగు జీవుడు, ఆత్మానువర్తినా - తనకు వశమై యుండే, దేహేన - దేహముతో, కర్మాణి - కర్మలను, ఆరభతే - ఆరంభించును, కర్మభిః - కర్మలచే, దేహమ్ - దేహమును, తనుతే - పొందును, ఉభయం తు - రెండింటినీ కూడ, అవివేకతః - వివేకము లేకపోవుట వలననే.

దేహధారియగు జీవుడు తనకు వశమై యుండే దేహముతో కర్మలను చేయును. ఆ కర్మలచే ఆ జీవుడు మరియొక దేహమును పొందును. ఈ విధముగా జీవుడు తన స్వరూపమునకు దేహాదులకు ఉండే తేడాను గుర్తించకపోవుటచే దేహము-కర్మలు అనే రెండింటినీ విస్తరింప జేసుకొనును.

తస్మాదర్థాశ్చ కామాశ్చ ధర్మాశ్చ యదపాశ్రయాః ।
భజతానీహయాఽఽత్మానమనీహం హరిమీశ్వరమ్ ॥ 48

తస్మాత్ - అందువలన, అర్థాః చ - సంపదలు, కామాః చ - కామనలు, ధర్మాః చ - ధర్మములు కూడ, యద్-అపాశ్రయాః - ఎవనిని ఆశ్రయించి ఉన్నవో, ఆత్మానమ్ - ఆత్మస్వరూపుడైనట్టియు, అనీహమ్ - కామనలు లేనట్టియు, ఈశ్వరమ్ - జగన్నాథుడైన, హరిమ్ - శ్రీహరిని, అనీహయా - నిష్కామముగా, భజత - సేవించుడు.

కావున, మీరు జగన్నాథుడై ఆత్మస్వరూపుడుగా ఉన్న శ్రీహరిని నిష్కామముగా భజించుడు. ఆయన కామనలు లేని పూర్ణుడు. ధర్మార్థకామములు ఆయననే ఆశ్రయించి ఉన్నవి.

సర్వేషామపి భూతానాం హరిరాత్మేశ్వరః ప్రియః ।
భూతైర్మహద్భిస్స్వకృతైః కృతానాం జీవసంజ్ఞితః ॥ 49

స్వకృతైః - తనచే సృష్టించబడిన, మహద్భిః భూతైః - మహాభూతములచే, కృతానామ్ - నిర్మితమైన, సర్వేషామ్ - సకలములైన,

**భూతానాం అపి - దేహములకు కూడ, హరిః - శ్రీహరి, జీవసంజ్ఞితః - జీవుడని పిలువబడే, ప్రియః - ప్రియమైన, ఆత్మా - ఆత్మ, ఈశ్వరః - అంతర్యామి.**

తనచే సృష్టించబడిన పృథివి మొదలైన మహాభూతములతో నిర్మితమైన సకల దేహములకు జీవుడని పిలువబడే ప్రియమైన ఆత్మ శ్రీహరియే. ఆయనయే ఆ జీవులలో అంతర్యామియై ఉన్నాడు.

దేవోఽసురో మనుష్యో వా యక్షో గంధర్వ ఏవ చ ।
భజన్ముకుందచరణం స్వస్తిమాన్ స్యాద్యథా వయమ్ ॥ **50**

దేవః - దేవత గాని, అసురః - అసురుడు గాని, మనుష్యః వా - మానవుడు గాని, యక్షః - యక్షుడు గాని, గంధర్వః ఏవ చ - గంధర్వుడే గాని, ముకుందచరణమ్ - మోక్షప్రదాతయగు శ్రీహరియొక్క పాదమును, భజన్ - భజించువాడు, వయం యథా - మన వలెనే, స్వస్తిమాన్ - మంగళములు గలవాడు, స్యాత్ - అగును.

దేవత గాని, అసురుడు గాని, మానవుడు గాని, యక్షుడు గాని, గంధర్వుడు గాని ఎవరైననూ మోక్షప్రదాతయగు శ్రీహరియొక్క పాదమును సేవించువాడు, మనవలెనే మంగళములను పొందును.

నాలం ద్విజత్వం దేవత్వమృషిత్వం వాసురాత్మజాః ।
ప్రీణనాయ ముకుందస్య న వృత్తం న బహుజ్ఞతా ॥ **51**

న దానం న తపో నేజ్యా న శౌచం న వ్రతాని చ ।
ప్రీయతేఽమలయా భక్త్యా హరిరన్యద్విడంబనమ్ ॥ **52**

అసుర-ఆత్మజాః - అసుర బాలకులారా!, ద్విజత్వమ్ - ఉపనయన సంస్కారమును పొందుట గాని, దేవత్వమ్ - దేవతయై ఉండుట గాని, ఋషిత్వం వా - మహర్షి యగుట గాని, ముకుందస్య - మోక్షప్రదాతయగు శ్రీహరియొక్క, ప్రీణనాయ - ప్రసన్నుని చేయుటకై, న అలమ్ - సమర్థము కాదు, వృత్తమ్ - నడవడి, న - సమర్థము కాదు, బహుజ్ఞతా - చాల తెలిసియుండుట, న - చాలదు, దానమ్ - దానము, న - చాలదు,

తపః - తపస్సు, న - చాలదు, ఇజ్యా - యజ్ఞము, న - చాలదు, శౌచమ్ - శౌచము, న - చాలదు, వ్రతాని చ - వ్రతములు కూడ, న - చాలవు, హరిః - శ్రీహరి, అమలయా - నిర్మలమైన, భక్త్యా - భక్తిచే, ప్రీయతే - ప్రసన్నుడగును, అన్యత్ - ఇతరము, విడంబనమ్ - నటన మాత్రమే.

ఓ అసుర బాలకులారా! మోక్షప్రదాతయగు శ్రీహరిని ప్రసన్నము చేసుకొనుటకు ఉపనయన సంస్కారము గాని, దేవతయై ఉండుట గాని, మహర్షి యగుట గాని, మంచి నడవడి గాని, అధికమగు విజ్ఞానమును కలిగి యుండుట గాని, దానము గాని, తపస్సు గాని, యజ్ఞము గాని, బాహ్యము నందు ఆంతరమునందు శౌచమును కలిగియుండుట గాని, వ్రతములు గాని సమర్థములు గావు. శ్రీహరి నిర్మలమైన (కామన అనే మాలిన్యము లేని) భక్తిచే ప్రసన్నుడగును. ఇతరము సర్వము అనుకరణము మాత్రమే.

తతో హరౌ భగవతి భక్తిం కురుత దానవాః ।
ఆత్మౌపమ్యేన సర్వత్ర సర్వభూతాత్మనీశ్వరే ॥ 53

దానవాః - అసురులారా!, తతః - అందువలన, సర్వత్ర - సర్వప్రాణులయందు, ఆత్మౌపమ్యేన - తనతో సమానముగా నుండుటచే, సర్వభూత-ఆత్మని - సకలప్రాణులకు ఆత్మస్వరూపుడైన, ఈశ్వరే - జగన్నాథుడగు, హరౌ భగవతి - శ్రీహరి భగవానునియందు, భక్తిమ్ - భక్తిని, కురుత - చేయుడు.

ఓ అసురులారా! కావున, సకలప్రాణులను తనతో సమానముగా ప్రేమించుట ద్వారా, సకలప్రాణులలో ఆత్మరూపుడై జగన్నాథుడైయున్న శ్రీహరి భగవానునియందు భక్తిని చేయుడు.

దైతేయా యక్షరక్షాంసి స్త్రియశ్శూద్రా వ్రజౌకసః ।
ఖగా మృగాః పాపజీవాస్సంతి హ్యచ్యుతతాం గతాః ॥ 54

అచ్యుతతామ్ - శ్రీహరితో ఐక్యమును, గతాః - పొందినవారు, దైతేయాః - దితి వంశీయులు, యక్షరక్షాంసి - యక్షులు రాక్షసులు, స్త్రియః - స్త్రీలు, శూద్రాః - శూద్రులు, వ్రజ-ఓకసః - గొల్లపల్లెలలో నివ

సించువారు, ఖగాః - పక్షులు, మృగాః - పశువులు, పాపజీవాః - పాపజీవులు, సంతి హి - ఉన్నారు సుమా!

శ్రీహరితో ఐక్యమును పొందినవారు దితివంశీయులు, యక్షులు, రాక్షసులు, స్త్రీలు, శూద్రులు, గొల్లపల్లెలలో నివసించువారు, పక్షులు, పశువులు, పాపజీవులు కూడ గలరు సుమా! (భక్తి మహిమ అట్టిది).

ఏతావానేవ లోకేఽస్మిన్ పుంసస్స్వార్థః పరస్స్మృతః ।
ఏకాంతభక్తిర్గోవిందే యత్సర్వత్ర తదీక్షణమ్ ॥ 55

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే ప్రహ్లాదచరితే
ప్రహ్లాదకృతోపదేశో నామ సప్తమోఽధ్యాయః ॥

అస్మిన్ - ఈ, లోకే - లోకమునందు, పుంసః - మానవునకు, పరః - సర్వోత్తమమైన, స్వ-అర్థః - పరమార్థము, ఏతావాన్ ఏవ - ఇంత మాత్రమేనని, స్మృతః - చెప్పబడినది, యత్ - ఏదనగా, గోవిందే - గోవిందునియందు, ఏకాంతభక్తిః - అనన్యమగు భక్తి, సర్వత్ర - సర్వమునందు, తద్-ఈక్షణమ్ - ఆ గోవిందుని చూచుట.

ఈ లోకములో మానవుడు పొందగలిగే సర్వోత్తమమైన పురుషార్థము గోవిందునియందు ఏకాంతభక్తిని చేయుటయేనని మహర్షులచే చెప్పబడినది. సర్వకాలములలో సర్వదేశములలో సర్వమునందు శ్రీహరిని దర్శించుటయే ఆ భక్తియొక్క స్వరూపము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
ప్రహ్లాదచరితమునందు ప్రహ్లాదుని ఉపదేశమును వర్ణించే
ఏడవ అధ్యాయము ముగిసినది (7) .

*****

# అథ అష్టమోఽధ్యాయః

## ప్రహ్లాద చరితము - నరసింహావతారము

నారద ఉవాచ ।
అథ దైత్యసుతాస్సర్వే శ్రుత్వా తదనువర్ణితమ్ ।
జగృహుర్నిరవద్యత్వాన్నైవ గుర్వనుశిక్షితమ్ ॥ 1

అథ - తరువాత, దైత్యసుతాః - అసుర బాలకులు, సర్వే - అందరు, తద్-అనువర్ణితమ్ - ఆ ప్రహ్లాదునిచే వర్ణించబడినదానిని, శ్రుత్వా - విని, నిరవద్యత్వాత్ - నిర్దోషమగుట వలన, జగృహుః - స్వీకరించిరి, గురు-అనుశిక్షితమ్ - గురువుల బోధను, న ఏవ - స్వీకరించనే లేదు.

తరువాత అసుర బాలకులందరు ఆ ప్రహ్లాదునిచే వర్ణించబడిన భక్తియోగము నిర్దోషమగుట వలన దానినే స్వీకరించిరే గాని, గురువుల బోధను సుతరాము నేర్చుకొనలేదు.

అథాచార్యసుతస్తేషాం బుద్ధిమేకాంతసంస్థితామ్ ।
ఆలక్ష్య భీతస్త్వరితో రాజ్ఞ ఆవేదయద్యథా ॥ 2

అథ - తరువాత, తేషామ్ - వారియొక్క, బుద్ధిమ్ - బుద్ధిని, ఏకాంతసంస్థితామ్ - ఒక్క భగవానునియందు మాత్రమే స్థిరముగానున్నదిగా, ఆలక్ష్య - గమనించి, భీతః - భయపడిన, ఆచార్యసుతః - గురుపుత్రుడు, త్వరితః - వేగము గలవాడై, రాజ్ఞే - రాజు కొరకు, యథా - ఉన్నది ఉన్నట్లుగా, ఆవేదయత్ - విన్నవించెను.

తరువాత, ఆ పిల్లల బుద్ధి ఒక్క భగవానునియందు మాత్రమే స్థిరమై యుండుటను గమనించి గురుపుత్రుడు భయపడెను. ఆయన వెంటనే విషయమును ఉన్నది ఉన్నట్లుగా మహారాజునకు విన్నవించెను.

శ్రుత్వా తదప్రియం దైత్యో దుస్సహం తనయానయమ్ ।
కోపావేశచలద్గాత్రః పుత్రం హంతుం మనో దధే ॥ 3

అప్రియమ్ - ప్రియము కానట్టియు, దుస్సహమ్ - సహించ శక్యము కాని, తత్ - ఆ, తనయ-అనయమ్ - పుత్రుని అవిధేయతను గురించి, శ్రుత్వా - విని, దైత్యః - రాక్షసుడు, కోప-ఆవేశచలద్-గాత్రః - కోపము ఆవేశించుటచే వణకుచున్న దేహము గలవాడై, పుత్రమ్ - పుత్రుని, హంతుమ్ - సంహరించుటకు, మనః - మనస్సును, దధే - దృఢము చేసెను.

తన పుత్రుడు ఆ విధముగా దుఃఖమును కలిగించే అవిధేయతను కలిగియుండుటను ఆ రాక్షసుడు సహించలేకపోయెను. కోపముయొక్క ఆవేశములో ఆయన శరీరము వణకుచుండెను. ఆతడు తన పుత్రుని సంహరించుటకే నిశ్చయించుకొనెను.

క్షిప్త్వా పరుషయా వాచా ప్రహ్లాదమతదర్హణమ్ ।
ఆహేక్షమాణః పాపేన తిరశ్చీనేన చక్షుషా ॥ 4

ప్రశ్రయావనతం దాంతం బద్ధాంజలిమవస్థితమ్ ।
సర్పః పదాహత ఇవ శ్వసన్ ప్రకృతిదారుణః ॥ 5

అతద్-అర్హణమ్ - దానికి తగనట్టియు, ప్రశ్రయ-అవనతమ్ - వినయముచే నమ్రుడైనట్టియు, దాంతమ్ - నిగ్రహము కలిగినట్టియు, బద్ధాంజలిమ్ - కట్టబడిన దోసిలి కలిగినట్టియు, అవస్థితమ్ - క్రింద నిలబడియున్న, ప్రహ్లాదమ్ - ప్రహ్లాదుని, తిరశ్చీనేన - వక్రమైన, పాపేన చక్షుషా - పాపపు చూపుతో, ఈక్షమాణః - చూచుచున్నవాడు, ప్రకృతిదారుణః - స్వభావముచే క్రూరుడు అగు హిరణ్యకశిపుడు, పదా - కాలితో, హతః - త్రొక్కబడిన, సర్పః ఇవ - పాము వలె, శ్వసన్ - బుసలు కొట్టుచున్నవాడై, పరుషయా - పరుషమైన, వాచా - వాక్కుతో, క్షిప్త్వా - తిట్టి, ఆహ - పలికెను.

స్వభావముచేతనే క్రూరుడైన హిరణ్యకశిపుడు వినయముతో నమ్రుడై తన యెదుట క్రింద చేతులు జోడించి నిలబడియున్న ప్రహ్లాదుని పరుషమైన వాక్కుతో తిట్టెను. మనోనిగ్రహము గల ప్రహ్లాదుడు ఆ తిట్లకు అర్హుడు కాడు. వక్రమైన పాపపు చూపుతో ప్రహ్లాదుని చూస్తూ, హిరణ్యకశి పుడు కాలితో త్రొక్కిన పామువలె బుసలు కొట్టుచున్నవాడై, ఇట్లు పలికెను.

హే దుర్వినీత మందాత్మన్ కులభేదకరాధమ ।
స్తబ్ధం మచ్ఛాసనోద్ధూతం నేష్యే త్వాఽద్య యమక్షయమ్ ।।6

హే దుర్వినీత - ఓరీ వినయము లేని దుష్టుడా!, మంద-ఆత్మన్ - మందబుద్ధీ!, కులభేదకర - కులమును ముక్కలు చేయువాడా!, అధమ - నీచుడా!, స్తబ్ధమ్ - పొగరుమోతువైనట్టియు, మత్-శాసన-ఉద్ధూతమ్ - నా ఆజ్ఞను ఉల్లంఘించే, త్వా - నిన్ను, అద్య - ఈనాడు, యమక్షయమ్ - యమగృహమును గురించి, నేష్యే - పంపించగలను.

ఓరీ మందబుద్ధీ! నీవు వినయము లేని దుష్టుడవు, నీచుడవు. పొగ రుమోతువగు నీవు వంశమును ముక్కలు చేసెదవు. నా శాసనమును ఉల్లంఘించే నిన్ను ఈనాడే యమపురికి పంపించెదను.

క్రుద్ధస్య యస్య కంపంతే త్రయో లోకాస్సహేశ్వరాః ।
తస్య మేఽభీతవన్మూఢ శాసనం కింబలోఽత్యగాః ।। 7

మూఢ - ఓ మూర్ఖుడా!, యస్య - ఎవడైతే, క్రుద్ధస్య - కోపమును పొందగా, సహ-ఈశ్వరాః - లోకపాలకులతో కూడియున్న, త్రయః - మూడు, లోకాః - లోకములు, కంపంతే - వణకునో, తస్య - అట్టి, మే - నాయొక్క, శాసనమ్ - ఆజ్ఞను, కింబలః - ఏమి బలము గలవాడవై, అభీత వత్ - భయము లేనివాడు వలె, అత్యగాః - అతిక్రమించితివి?

ఓరీ మూర్ఖుడా! నేను కోపిస్తే లోకపాలకులతో సహా ముల్లోక ములు వణకిపోవును. అట్టి నా శాసనమును నిర్భయుని వలె ఏ బలముతో ఉల్లంఘించితివి?

ప్రహ్లాద ఉవాచ ।
న కేవలం మే భవతశ్చ రాజన్ స వై బలం బలినాం చాపరేషామ్,
పరేఽవరేఽమీ స్థిరజంగమా యే బ్రహ్మాదయో యేన వశం ప్రణీతాః.

రాజన్ - ఓ రాజా!, కేవలమ్ - కేవలము, మే - నాకు, న - కాదు, భవతః చ - నీకు కూడ, చ - మరియు, అపరేషామ్ - ఇతరులైన, బలినామ్ - బలవంతులకు, సః - ఆ శ్రీహరి, వై - నిశ్చయముగా, బలమ్ - బలము, బ్రహ్మ-ఆదయః - బ్రహ్మగారు మొదలైన, పరే - గొప్పవైన, అపరే - తక్కువవి అయిన, స్థిరజంగమాః - కదలనివి కదిలేవి అగు, యే - ఏ ప్రాణులు గలవో, అమీ - ఇవి, యేన - ఎవనిచేనైతే, వశమ్ - వశము, ప్రణీతాః - పొందించబడినవో.

ఓ రాజా! కేవలము నాకు మాత్రమే గాక, నీకు మరియు బల వంతులగు ఇతరులకు కూడ బలము నిశ్చయముగా ఆ శ్రీహరియే. బ్రహ్మ గారితో మొదలిడి చిన్న-పెద్ద, కదిలేవి-కదలనివి అగు ప్రాణులు అన్నీ ఆయన వశములో మాత్రమే ఉన్నవి.

స ఈశ్వరః కాల ఉరుక్రమోఽసావోజస్సహస్సత్త్వబలేంద్రియాత్మా।
స ఏవ విశ్వం పరమస్స్వశక్తిభిస్సృజత్యవత్యత్తి గుణత్రయేశః ॥9

అసౌ - ఈ, సః - అట్టి, ఈశ్వరః - ఈశ్వరుడు, కాలః - కాలస్వ రూపుడు, ఉరుక్రమః - గొప్ప పరాక్రమము గలవాడు (రెండు అడుగులలో ముల్లోకములను కొలిచినవాడు), ఓజః-సహః-సత్త్వబల-ఇంద్రియ-ఆత్మా - జ్ఞానేంద్రియశక్తి మనశ్శక్తి ధైర్యము దేహశక్తి మరియు కర్మేంద్రియము లకు అధిష్ఠానమైనవాడు, గుణత్రయ-ఈశః - మూడు గుణములకు అధీశ్వ రుడు, పరమః - గుణాతీతుడు అగు, సః ఏవ - ఆ ఈశ్వరుడే, స్వశక్తిభిః - తన శక్తులతో, సృజతి - సృష్టించుచున్నాడు, అవతి - రక్షించుచున్నాడు, అత్తి - ఉపసంహరించుచున్నాడు.

అట్టి ఈ ఈశ్వరుడే కాలరూపుడై ఉన్నాడు. ఆయన గొప్ప పరాక్ర మముతో రెండు అడుగులలో ముల్లోకములను కొలిచినాడు. ప్రాణులలోని ఇంద్రియశక్తి, మనశ్శక్తి, ధైర్యము, దేహశక్తి మరియు ఇంద్రియశక్తులకు

అధిష్ఠానమైన ఆత్మ ఆ ఈశ్వరుడే. ఆయనే సత్త్వరజస్తమోగుణాత్మకమగు మాయాశక్తితో జగత్తును సృష్టించి, రక్షించి, ఉపసంహరించుచున్నాడు.

జహ్యాసురం భావమిమం త్వమాత్మనః
సమం మనో ధత్స్వ న సంతి విద్విషః ।
ఋతేఽజితాదాత్మన ఉత్పథస్థితాత్
తద్ధి హ్యనంతస్య మహత్సమర్హణమ్ ॥ 10

త్వమ్ - నీవు, ఆత్మనః - నీయొక్క, ఇమమ్ - ఈ, ఆసురమ్ - అసురులకు చెందిన, భావమ్ - భావమును, జహి - విడిచిపెట్టుము, మనః - మనస్సును, సమమ్ - సమానముగా, ధత్స్వ - చేయుము, అజితాత్ - వశము చేసుకొనబడనట్టియు, ఉత్పథస్థితాత్ - తప్పు దారిలో ఉన్న, ఆత్మనః ఋతే - మనస్సును మినహాయించి, విద్విషః - శత్రువులు, న సంతి - లేరు, తత్ హి - అది మాత్రమే, అనంతస్య - అనంతునకు, మహత్ - గొప్ప, సమర్హణమ్ - చక్కని ఆరాధన.

నీవు నీ ఈ ఆసురభావము (ద్వేషపూర్ణమగు స్వభావము) ను విడిచిపెట్టుము. మనస్సును రాగద్వేషములకు అతీతముగా సమముగా నుంచుము. అదియే మనము అనంతునకు చేసే చక్కని గొప్ప ఆరాధన. మనస్సును వశమునందుంచుకొననిచో అది తప్పు దారిలో నడచును. అట్టి మనస్సును మినహాయిస్తే, మనకు శత్రువులు వేరెవ్వరూ లేరు.

దస్యూన్ పురా షణ్న విజిత్య లుంపతో
మన్యంత ఏకే స్వజితా దిశో దశ ।
జితాత్మనో జ్ఞస్య సమస్య దేహినాం
సాధోస్స్వమోహప్రభవాః కుతః పరే ॥ 11

ఏకే - కొందరు, లుంపతః - అపహరించే, షట్ - ఆర్గురు, దస్యూన్ - బందిపోట్లను, పురా - ముందుగా, న విజిత్య - జయించకుండగా, దశ - పది, దిశః - దిక్కులను, స్వజితాః - తమచే జయించబడినవాటినిగా, మన్యంతే - తలపోయుదురు, జిత-ఆత్మనః - జయించబడిన

మనస్సు కలిగినట్టియు, దేహినామ్ - ప్రాణులకు, సమస్య - సముదై నట్టియు, జ్ఞస్య - జ్ఞానియగు, సాధోః - సత్పురుషునకు, స్వమోహప్రభవాః - తన వ్యామోహముచే కలిగే, పరే - శత్రువులు, కుతః - ఎచ్చటనుండి వచ్చెదరు?

కొందరు ముందుగా తమ సర్వస్వమును హరించే బందిపోట్లు ఆర్గురుని (కామక్రోధలోభమోహమదమాత్సర్యములనే అంతశ్శత్రువులు, లేదా అయిదు జ్ఞానేంద్రియములు మరియు మనస్సు) జయించకుండా, తాము పది దిక్కులను జయించితిమని తలపోయుచుందురు. మనస్సును జయించి సకలప్రాణులయెడల సమచిత్తము గల జ్ఞానియగు సత్పురుషునకు శత్రువులు ఎచటనుండి వచ్చెదరు? (శత్రువులు ఉండరు). వ్యక్తికి శత్రువులు కేవలము తన వ్యామోహము (నాది, పరాయిది అనే భేదబుద్ధి) చే మాత్రమే కలిగెదరు.

హిరణ్యకశిపురువాచ ।
వ్యక్తం త్వం మర్తుకామోఽసి యోఽతిమాత్రం వికత్థసే ।
ముమూర్షూణాం హి మందాత్మన్నను స్యుర్విప్లవా గిరః ।।12

మంద-ఆత్మన్ - ఓరీ మందబుద్ధీ!, త్వమ్ - నీవు, వ్యక్తమ్ - నిశ్చయముగా, మర్తుకామః - మరణించే కోరిక గలవాడవు, అసి - అగుదువు, యః - ఏ నీవు, అతిమాత్రమ్ - అత్యధికముగా, వికత్థసే - వదరుచున్నావో, హి - ఏలయనగా, ముమూర్షూణామ్ - మరణించే కోరిక గలవారలకు, విప్లవాః - అనర్థహేతువులగు, గిరః - పలుకులు, స్యుః - వచ్చును, నను - నిశ్చయము.

హిరణ్యకశిపుడిట్లు పలికెను --- ఓరీ మందబుద్ధీ! నీవు అత్యధికముగా వదరుచున్నావు. అంటే, నీవు చావాలని నిశ్చయించుకున్నావని స్పష్టమగుచున్నది. ఎందుకంటే, చావగోరువారి నోటివెంట మాత్రమే ఇట్టి అనర్థదాయకములగు పలుకులు బయల్వెడలును. ఇది నిశ్చయము.

యస్త్వయా మందభాగ్యోక్తో మదన్యో జగదీశ్వరః ।
క్వాసౌ యది స సర్వత్ర కస్మాత్ స్తంభే న దృశ్యతే ।। 13

మందభాగ్య - ఓరీ అల్పభాగ్యుడా!, మద్-అన్యః - నాకంటె మరియొకడు, యః - ఏ, జగదీశ్వరః - జగన్నాథుడు, త్వయా - నీచే, ఉక్తః - చెప్పబడినాడో, అసౌ - ఈతడు, క్వ - ఎక్కడ?, సః - ఆతడు, సర్వత్ర యది - అంతటా ఉన్నచో, స్తంభే - స్తంభమునందు, కస్మాత్ - ఎందువలన, న దృశ్యతే - కనబడుట లేదు?

ఓరీ అల్పభాగ్యుడా! నాకంటె వేరే మరియొక జగన్నాథుడు గలడని నీవు చెప్పుచున్నావు. ఈతడు ఎక్కడ ఉన్నాడు? ఈతడు సర్వవ్యాపియైనచో, ఈ స్తంభమునందు ఏల కానరాడు?

సోఽహం వికత్థమానస్య శిరః కాయాద్ధరామి తే ।
గోపాయేత హరిస్త్వాద్య యస్తే శరణమీప్సితమ్ ॥ 14

సః - అట్టి, అహమ్ - నేను, వికత్థమానస్య - వదరుచున్న, తే - నీయొక్క, శిరః - తలను, కాయాత్ - మొండెమునుండి, హరామి - తొలగించెదను, అద్య - ఈనాడు, త్వా - నిన్ను, హరిః - శ్రీహరి, గోపాయేత - రక్షించుగాక!, యః - ఎవడైతే, తే - నీ కొరకు, ఈప్సితమ్ - అభీష్టమైన, శరణమ్ - రక్షకుడో.

జగదీశ్వరుడనగు నేను వదరుబోతువగు నీ తలను మొండెమునుండి వేరు చేసెదను. నీవు అధికముగా ప్రేమించే నీ రక్షకుడగు ఆ శ్రీహరియే నిన్ను ఇప్పుడు రక్షించుగాక!

ఏవం దురుక్తైర్ముహురర్దయన్ రుషా
సుతం మహాభాగవతం మహాసురః ।
ఖడ్గం ప్రగృహ్యోత్పతితో వరాసనాత్
స్తంభం తతాడాతిబలస్స్వముష్టినా ॥ 15

**అతిబలః** - మహాబలశాలియగు, **మహా-అసురః** - ఆ మహారాక్షసుడు, **ఏవమ్** - ఈ విధముగా, **మహాభాగవతమ్** - గొప్ప భగవద్భక్తుడగు, **సుతమ్** - పుత్రుని, **రుషా** - కోపముతో, **దురుక్తైః** - పరుషవచనములతో, **ముహుః** - పలుమార్లు, **అర్దయన్** - పీడించుచున్నవాడై, **వర-ఆసనాత్** -

శ్రేష్ఠమగు ఆసనమునుండి, ఉత్పతితః - పైకి ఉరికినవాడై, ఖడ్గమ్ - కత్తిని, ప్రగృహ్య - పట్టుకొని, స్వముష్టినా - తన పిడికిలితో, స్తంభమ్ - స్తంభమును, తతాడ - కొట్టెను.

మహాబలశాలియగు ఆ మహారాక్షసుడు పరుషవచనములతో పలుమార్లు గొప్ప భగవద్భక్తుడగు తన పుత్రుని ఈ విధముగా పీడించెను. ఆతడు కత్తి పట్టుకొని సింహాసనమునుండి వేగముగా పైకి లేచి తన పిడికిలితో స్తంభమును కొట్టెను.

తదైవ తస్మిన్ నినదోఽతిభీషణో
బభూవ యేనాండకటాహమస్ఫుటత్ ।
యం వై స్వధిష్ణ్యోపగతం త్వజాదయః
శ్రుత్వా స్వధామాప్యయమంగ మేనిరే ॥ 16

అంగ - ఓయీ రాజా!, తదా ఏవ - అదే సమయమునందు, తస్మిన్ - దానియందు, అతిభీషణః - మిక్కిలి భయంకరమగు, నినదః - ధ్వని, బభూవ - కలిగెను, యేన - దేనిచే, అండకటాహమ్ - గంగాళము వంటి బ్రహ్మాండము, అస్ఫుటత్ - పగిలెనో, స్వధిష్ణ్య-ఉపగతం వై - నిశ్చయముగా తమ ధామమును చేరుకున్న, యం తు - ఏ శబ్దమునైతే, శ్రుత్వా - విని, అజ-ఆదయః - స్వయంభువుడగు బ్రహ్మగారు మొదలగువారు, స్వధామ-అప్యయమ్ - తమ ధామములకు ప్రళయమును, మేనిరే - తలపోసిరో.

ఓ ధర్మరాజా! అదే సమయములో ఆ స్తంభమునందు మిక్కిలి భయంకరమగు ధ్వని పుట్టెను. గంగాళమువంటి బ్రహ్మాండము ఆ ధ్వనిచే పగిలినదా యనిపించెను. ఆ ధ్వని ఊర్ధ్వలోకముల వరకు చేరుకొనెను. దానిని విన్న స్వయంభువుడగు బ్రహ్మగారు మొదలగు వారు తమ తమ ధామములకు ప్రళయము వచ్చినదని తలపోసిరి.

స విక్రమన్ పుత్రవధేప్సురోజసా
నిశమ్య నిర్హ్రాదమపూర్వమద్భుతమ్ ।

అంతస్సభాయాం న దదర్శ తత్పదం
వితత్రసుర్యేన సురారియూథపాః ॥ 17

అపూర్వమ్ - అపూర్వమైన, అద్భుతమ్ - ఆశ్చర్యమును గొల్పే, నిర్హ్రాదమ్ - ధ్వనిని, నిశమ్య - విని, ఓజసా - బలముతో, పుత్రవధఈప్సుః - పుత్రుని వధించే కోరిక గల, సః - ఆ హిరణ్యకశిపుడు, విక్రమన్ - పరాక్రమించువాడై, అంతః-సభాయామ్ - సభ మధ్యయందు, తత్-పదమ్ - ఆ ధ్వనికి ఆధారమును, న దదర్శ - కనలేదు, యేన - దేనిచేనైతే, సుర-అరియూథపాః - రాక్షస సేనానాయకులు, వితత్రసుః - అధికముగా భయపడిరో.

అపూర్వము, అద్భుతము అగు ఆ ధ్వనిని విని రాక్షస సేనానాయకులు అధికముగా భయపడిరి. పరాక్రమించి బలముతో తన పుత్రుని చంపగోరిన హిరణ్యకశిపుడు ఆ ధ్వనిని విని, సభ మధ్యలో ఆ ధ్వని పుట్టిన ఆధారమును కనుగొనలేకపోయెను.

సత్యం విధాతుం నిజభృత్యభాషితం
వ్యాప్తిం చ భూతేష్వఖిలేషు చాత్మనః ।
అదృశ్యతాత్యద్భుతరూపముద్వహన్
స్తంభే సభాయాం న మృగం న మానుషమ్ ॥ 18

నిజభృత్యభాషితమ్ - తన భక్తుని మాటను, అఖిలేషు - సకలములైన, భూతేషు - పదార్థములయందు, ఆత్మనః - తన, వ్యాప్తిం చ - వ్యాపకత్వమును కూడ, సత్యమ్ - సత్యముగా, విధాతుమ్ - చేయుటకై, న మృగమ్ - మృగము కానిది, న మానుషమ్ - మనిషి కానిది, అతి-అద్భుతరూపమ్ - మిక్కిలి అద్భుతము అగు రూపమును, ఉద్వహన్ - దాల్చినవాడై, సభాయామ్ - సభయందు, స్తంభే - స్తంభమునందు, అదృశ్యత - కానబడెను.

శ్రీహరి సకల పదార్థములయందు తాను వ్యాపించియున్నానని నిరూపించి తన భక్తుని (సనకాదులు, ప్రహ్లాదుడు మరియు బ్రహ్మగారు) మాటను నిలబెట్టుటకై ఆ సభలోని స్తంభములో మిక్కిలి అద్భుతమగు

రూపమును దాల్చి ప్రకటమయ్యెను. ఆ రూపము నిండా మృగము (సిం
హము) కాదు, మనిషి కాదు.

స సత్త్వమేనం పరితోఽపి పశ్యన్
స్తంభస్య మధ్యాదను నిర్జిహానమ్ ।
నాయం మృగో నాపి నరో విచిత్ర-
మహో కిమేతన్నృమృగేంద్రరూపమ్ ॥ 19

సః - అతడు, పరితః - చుట్టూ, స్తంభస్య - స్తంభముయొక్క, మధ్యాత్ - మధ్యనుండి, అనునిర్జిహానమ్ - బయటకు వచ్చుచున్న, ఏనమ్ - ఈ, సత్త్వమ్ అపి - ప్రాణిని కూడ, విపశ్యన్ - విశేషముగా చూచుచున్నవాడు, అయమ్ - ఇది, మృగః - మృగము, న - కాదు, నరః అపి - మానవుడు కూడ, న - కాదు, విచిత్రమ్ - విచిత్రము, అహో - ఆశ్చర్యము!, నృమృగ-ఇంద్రరూపమ్ - మనిషి సింహముల రూపము గల, ఏతత్ - ఇది, కిమ్ - ఏమి?

అతడు చుట్టూ పరికించి చూస్తూ, స్తంభము మధ్యనుండి బయటకు వచ్చుచున్న ఒక విచిత్రప్రాణిని చూచి, ఇట్లు తలపోసెను -- ఆశ్చర్యము! ఇది మృగము కాదు, మనిషి కూడ కాదు. మనిషి సింహముల రూపము గల ఇది యెట్టి ప్రాణి?

మీమాంసమానస్య సముత్థితోఽగ్రతో
నృసింహరూపస్తదలం భయానకమ్ ।
ప్రతప్తచామీకరచండలోచనం
స్ఫురత్సటాకేసరజృంభితాననమ్ ॥ 20

కరాలదంష్ట్రం కరవాలచంచల-
క్షురాంతజిహ్వం భ్రుకుటీముఖోల్బణమ్ ।
స్తబ్ధోర్ధ్వకర్ణం గిరికందరాద్భుత-
వ్యాత్తాస్యనాసం హనుభేదభీషణమ్ ॥ 21

దివిస్పృశత్కాయమదీర్ఘపీవర-
గ్రీవోరువక్షఃస్థలమల్పమధ్యమమ్ ।
చంద్రాంశుగౌరైశ్ఛురితం తనూరుహై-
ర్విష్వగ్భుజానీకశతం నఖాయుధమ్ ।। 22

దురాసదం సర్వనిజేతరాయుధ-
ప్రవేకవిద్రావితదైత్యదానవమ్ ।

అలమ్ - మిక్కిలి, భయానకమ్ - భయమును గొల్పునట్టియు, ప్రతప్తచామీకరచండలోచనమ్ - పుటము పెట్టిన బంగారము వలె మెరిసిపోయే తీవ్రమైన కన్నులు కలిగినట్టియు, స్ఫురత్-సటాకేసరజృంభిత-ఆననమ్ - ప్రకాశించే జూలుతో మెడలోని జుట్టుతో ఆటోపముగానున్న ముఖము కలిగినట్టియు, కరాలదంష్ట్రమ్ - భయమును గొల్పే కోరలు కలిగినట్టియు, కరవాలచంచలక్షురాంతజిహ్వామ్ - కత్తివలె కదలాడే చురకత్తి పదునువంటి నాలుక కలిగినట్టియు, భ్రుకుటీముఖ-ఉల్బణమ్ - ముడివడిన కనుబొమలు గల ముఖముతో భయమును గొల్పునట్టియు, స్తబ్ధ-ఊర్ధ్వకర్ణమ్ - నిక్కబొడుచుకున్న ఎత్తైన చెవులు కలిగినట్టియు, గిరికందర-అద్భుతవ్యాత్త-ఆస్యనాసమ్ - కొండ గుహ వలె అద్భుతముగా తెరుచుకున్న నోరు ముక్కుపుటములు కలిగినట్టియు, హనుభేదభీషణమ్ - దవడల విచ్చుకొనుటచే భయమును గొల్పునట్టియు, దివిస్పృశత్-కాయమ్ - స్వర్గమునందు స్పృశించుచున్న దేహము కలిగినట్టియు, అదీర్ఘపీవరగ్రీవా-ఉరువక్షఃస్థలమ్ - పొడవు కాని బలిసిన మెడ పెద్ద వక్షఃస్థలము కలిగినట్టియు, అల్పమధ్యమమ్ - సన్నని నడుము కలిగినట్టియు, చంద్ర-అంశుగౌరైః - చంద్రకిరణముల వలె తెల్లని, తనూరుహైః - రోమములచే, ఛురితమ్ - వ్యాపించబడి యున్నట్టియు, విష్వగ్-భుజ-అనీకశతమ్ - అంతా వ్యాపించిన వందలాది భుజముల సమూహములు కలిగినట్టియు, నఖ-ఆయుధమ్ - గోళ్లే ఆయుధములుగా కలిగినట్టియు, దురాసదమ్ - సమీపించ శక్యము కావట్టియు, సర్వనిజ-ఇతర-ఆయుధప్రవేకవిద్రావితదైత్యదానవమ్ - సకలమైన తన ఇతరమగు ఉత్తమమైన ఆయుధములచే తరిమిగొట్టబడిన దితి-దనువంశీయుల రాక్షసులు గల, తత్ - ఆ రూపమును,

మీమాంసమానస్య - విచారించుచున్న ఆ హిరణ్యకశిపుని, అగ్రతః - ఎదుట, నృసింహరూపః - నరసింహరూపుడైన శ్రీహరి, సముత్థితః - పైకి లేచెను.

ఆ మిక్కిలి భయంకరమగు ప్రాణిని గురించి ఆశ్చర్యముతో విచారించుచున్న హిరణ్యకశిపుని యెదుట శ్రీహరి నరసింహరూపముతో ప్రకటమయ్యెను. ఆ నృసింహుని కళ్లు పుటము పెట్టిన బంగారము వలె తీవ్రముగా ప్రకాశించుచుండెను. కోరలతో భయమును గొల్పుతూ ఆటోపముగానున్న దాని నోరు జూలుతో, మెడపై జుట్టుతో ప్రకాశించుచుండెను. చురకత్తి పదును గల దాని నాలుక కత్తివలె కదలాడుచుండెను. కనుబొమలు ముడివడియున్న దాని ముఖము క్రూరముగా నుండెను. ఎత్తైన దాని చెవులు నిక్కబొడుచుకొని యుండెను. తెరుచుకొనియున్న దాని నోరు, ముక్కు పుటములు కొండ గుహలవలె ఆశ్చర్యమును గొల్పుచుండెను. విచ్చుకొనియున్న దాని దవడలు భయమును కలిగించుచుండెను. స్వర్గమును స్పృశించే దాని శరీరము మిక్కిలి పొడవు కాని బలిసిన మెడను, విశాలమైన వక్షఃస్థలమును, సన్నని నడుమును కలిగియుండెను. చంద్రకిరణములవలె తెల్లని రోమములు దాని దేహమంతటా వ్యాపించియుండెను. వందలాది భుజముల సముదాయములు అంతటా వ్యాపించుచుండెను. గోళ్లే ఆయుధములుగా గల ఆ నరసింహుని సమీపించుట శక్యము కాకుండెను. తనదైన చక్రము మాత్రమే గాక, ఇతరములగు సకలములైన ఉత్తమమగు ఆయుధములతో ఆ నరసింహుడు దితి-దనువంశీయులగు రాక్షసులను తరిమి కొట్టెను.

ప్రాయేణ మేఽయం హరిణోరుమాయినా
వధస్స్మృతోఽనేన సముద్యతేన కిమ్ ॥ 23

ఏవం బ్రువంస్త్వభ్యపతద్గదాయుధో
నదన్ నృసింహం ప్రతి దైత్యకుంజరః ।
అలక్షితోఽగ్నౌ పతితః పతంగమో
యథా నృసింహౌజసి సోఽసురస్తదా ॥ 24

ప్రాయేణ - బహుశః, ఉరుమాయినా - పెద్ద మాయావియగు, హరిణా - శ్రీహరిచే, మే - నాకు, అయమ్ - ఈ, వధః - వధ, స్మృతః - ఆలోచన చేయబడినది, సముద్యతేన - పెద్ద ఉద్యమమును చేసిన, అనేన - వీనిచే, కిమ్ - ఏమి యగును?, ఏవమ్ - ఈ విధముగా, బ్రువన్ - పలుకుచున్నవాడై, గదా-ఆయుధః - గదయే ఆయుధముగా గల, దైత్యకుంజరః తు - ఆ మహారాక్షసుడైతే, నదన్ - సింహనాదమును చేయుచున్నవాడై, నృసింహం ప్రతి - నరసింహస్వామిని ఉద్దేశించి, అభ్యపతత్ - మీదకు ఉరికెను, తదా - అప్పుడు, సః - ఆ, అసురః - రాక్షసుడు, అగ్నౌ - అగ్నియందు, పతితః - పడిన, పతంగమః యథా - మిడత వలె, నృసింహ-ఓజసి - నరసింహుని తేజస్సుయందు, అలక్షితః - కనబడనివాడు.

బహుశః మహామాయావియగు శ్రీహరి నన్నీ విధముగా వధించే ఉపాయమును పన్నియుండును. ఈతని ఈ పెద్ద ఉద్యమముచే ఒరిగేది ఏమి గలదు? దితివంశీయులలో శ్రేష్ఠుడగు ఆ రాక్షసుడీ విధముగా పలికి, గదయే ఆయుధము కాగా, సింహనాదమును చేస్తూ, నరసింహ స్వామి పైకి ఉరికెను. నిప్పులలో దూకిన మిడత వలె ఆ రాక్షసుడు నరసింహుని తేజస్సులో కనబడకుండ పోయెను.

న తద్విచిత్రం ఖలు సత్త్వధామని
స్వతేజసా యో ను పురాఽపిబత్తమః ।
తతోఽభిపద్యాభ్యహనన్మహాసురో
రుషా నృసింహం గదయోరువేగయా ॥ 25

సత్త్వధామని - సత్త్వమునకు నిధానమగు శ్రీహరియందు, తత్ - అది, విచిత్రమ్ - విచిత్రము, న - కాదు, యః - ఏ శ్రీహరియైతే, పురా - పూర్వము, స్వతేజసా - తన తేజస్సుచే, తమః - చీకటిని, అపిబత్ ను - త్రాగివేసెనో, తతః - అప్పుడు, మహా-అసురః - ఆ మహారాక్షసుడు, రుషా - కోపముతో, నృసింహమ్ - నరసింహుని, అభిపద్య - ఎదురుగా వచ్చి, ఉరువేగయా - పెద్ద వేగము గల, గదయా - గదతో, అభ్యహనత్ - కొట్టెను.

సత్త్వగుణమునకు నిధానమగు శ్రీహరి విషయములో, హిరణ్యకశిపుడు ఆ విధముగా కనబడకపోవుట, విచిత్రము కాదు. ఎందుకంటే, ఆయన సృష్టి ఆరంభములో తన తేజస్సుచే ప్రళయకాలమునందలి తమస్సు (చీకటి) ను త్రాగివేసెను. ఇంతలో, ఆ మహారాక్షసుడు కోపముతో ఆ నరసింహునకు ఎదురుగా వచ్చి, అధికమగు వేగము గల గదతో కొట్టెను.

తం విక్రమంతం సగదం గదాధరో
మహోరగం తార్క్ష్యసుతో యథాఽగ్రహీత్ ।
స తస్య హస్తోత్కలితస్తదాఽసురో
విక్రీడతో యద్వదహిర్గరుత్మతః ॥ 26

సగదమ్ - గదతో కూడియున్నట్టియు, విక్రమంతమ్ - పరాక్రమించుచున్న, తమ్ - ఆ హిరణ్యకశిపుని, గదాధరః - నరసింహమూర్తి, మహా-ఉరగమ్ - పెద్ద పామును, తార్క్ష్యసుతః యథా - గరుత్మంతుడు వలె, అగ్రహీత్ - పట్టుకొనెను, తదా - అప్పుడు, విక్రీడతః - క్రీడించుచున్న, గరుత్మతః - గరుత్మంతునినుండి, అహిః యద్వత్ - పాము వలె, సః - ఆ, అసురః - రాక్షసుడు, తస్య - ఆ నరసింహుని, హస్త-ఉత్కలితః - చేతి నుండి విడిపించుకున్నవాడు.

నరసింహరూపుడగు ఆ గదాధరుడైన శ్రీహరి గదతో కూడి పరాక్రమించుచున్న ఆ హిరణ్యకశిపుని, తార్క్ష్యపుత్రుడగు గరుత్మంతుడు పెద్ద పామును వలె పట్టుకొనెను. ఆటలాడుచున్న గరుత్మంతుని పట్టునుండి పాము విడిపించుకున్నట్లుగా, అపుడా రాక్షసుడు ఆయన చేతినుండి విడిపించుకొనెను.

అసాధ్వమన్యంత హృతౌకసోఽమరా
ఘనచ్ఛదా భారత సర్వధిష్ణ్యపాః ।
తం మన్యమానో నిజవీర్యశంకితం
యద్ధస్తముక్తో నృహరిం మహాసురః ।

పునస్తమాసజ్జత ఖడ్గచర్మణీ
ప్రగృహ్య వేగేన జితశ్రమో మృధే ॥ 27

భారత - ఓ ధర్మరాజా!, హృత-ఓకసః - అపహరించబడిన స్థానములు గలవారు, ఘనచ్ఛదాః - మేఘములలో నక్కినవారు, సర్వధిష్ణ్యపాః - సకలలోకపాలకులు అగు, అమరాః - దేవతలు, అసాధు - మంచిది కానిదిగా, అమన్యంత - తలపోసిరి, మృధే - యుద్ధమునందు, జితశ్రమః - జయించబడిన అలసట గల, మహా-అసురః - ఆ మహారాక్షసుడు, తమ్ - ఆ, నృహరిమ్ - నరసింహుని, నిజవీర్యశంకితమ్ - తన పరాక్రమముచే భయపడినవానినిగా, మన్యమానః - తలంచువాడు, యత్ - ఎందువలననగా, హస్తముక్తః - చేతినుండి విడుదల యైనవాడో, ఖడ్గచర్మణీ - కత్తిని డాలును, ప్రగృహ్య - గట్టిగా పట్టుకొని, పునః - మరల, వేగేన - వేగముతో, తమ్ - ఆ నరసింహుని, ఆసజ్జత - మీదకు దుమికెను.

ఓ ధర్మరాజా! హిరణ్యకశిపునిచే తమ తమ స్థానములనుండి వెళ్లగొట్టబడిన లోకపాలకులగు దేవతలు మేఘములలో నక్కి చూచుచుండిరి. హిరణ్యకశిపుడు నరసింహుని చేతినుండి తప్పించుకొనుట వారికి నచ్చలేదు. యుద్ధములో అలసటను జయించిన ఆ మహారాక్షసుడు, తాను నరసింహుని చేతినుండి విడిపించుకొనుటచే, తన పరాక్రమమునకు ఆయన భయపడెనని తలపోసెను. ఆతడు కత్తిని, డాలును గట్టిగా పట్టుకొని మరల వేగముతో ఆయన మీదకు ఉరికెను.

తం శ్యేనవేగం శతచంద్రవర్త్మభిః
చరంతమచ్ఛిద్రముపర్యధో హరిః ।
కృత్వాట్టహాసం ఖరముత్స్వనోల్బణం
నిమీలితాక్షం జగృహే మహాజవః ॥ 28

మహాజవః - గొప్ప వేగము గల, హరిః - శ్రీహరి, శ్యేనవేగమ్ - గ్రద్దయొక్క వేగమువంటి వేగము గలిగినట్టియు, శతచంద్రవర్త్మభిః - కత్తి డాలుల మార్గములచే, అచ్ఛిద్రమ్ - అవకాశము లేనివిధముగా, ఉపరి - పైన, అధః - క్రింద, చరంతమ్ - సంచరించుచున్న, తమ్ - ఆ రాక్షసుని,

ఖరమ్ - తీవ్రమైనట్టియు, ఉత్-స్వన-ఉల్బణమ్ - పెద్ద ధ్వనిచే భయమును గొల్పె, అట్టహాసమ్ - అట్టహాసమును, కృత్వా - చేసి, నిమీలిత-అక్షమ్ - మూయబడిన కన్నులు గలవానిని, జగృహే - పట్టుకొనెను.

ఆ రాక్షసుడు గ్రద్దయొక్క వేగమువంటి వేగము గలవాడై కత్తిని, డాలును క్రింద పైన అవకాశము లేని విధముగా త్రిప్పుతూ సంచరించుచుండెను. అపుడు నరసింహరూపియగు శ్రీహరి తీవ్రమైన పెద్ద అట్టహాసమును చేసెను. పెద్ద ధ్వనిచే భయమును గొల్పె ఆ అట్టహాసముచే వాని కన్నులు మూసుకుపోయెను. అపుడు మహావేగము గల నరసింహుడు వానిని పట్టుకొనెను.

విష్వక్ స్ఫురంతం గ్రహణాతురం హరిః
వ్యాలో యథాऽऽఖుం కులిశాక్షతత్వచమ్ ।
ద్వార్యూర ఆపాత్య దదార లీలయా
నఖైర్యథాహిం గరుడో మహావిషమ్ ॥ 29

విష్వక్ - అన్ని వైపులనుండియు, స్ఫురంతమ్ - తప్పించుకొనుచున్నట్టియు, గ్రహణ-ఆతురమ్ - పట్టుకొనుటచే వివశుడైనట్టియు, కులిశ-అక్షతత్వచమ్ - వజ్రముచే గాయము కాని చర్మము కలిగిన హిరణ్యకశిపుని, హరిః - శ్రీహరి, వ్యాలః - పాము, ఆఖుం యథా - ఎలుకను వలె, ద్వారి - ద్వారమునందు, ఊరే - తొడపై, ఆపాత్య - పడవేసుకొని, నఖైః - గోళ్లతో, గరుడః - గరుడుడు, మహావిషమ్ - గొప్ప విషము గల, అహిం యథా - పామును వలె, లీలయా - అవలీలగా, దదార - చీల్చివేసెను.

ఇంద్రుని వజ్రపు దెబ్బలచే గాయపడని చర్మము గల హిరణ్యకశిపుడు నరసింహుని చేతిలో చిక్కి వివశుడై, అన్ని వైపులనుండియు తప్పించుకొనుటకు ప్రయత్నించుచుండగా, ఆయన వానిని పాము ఎలుకను వలె పట్టి ద్వారముపై తొడయందు పడవేసుకొనెను. ఆయన వానిని, గరుడుడు మహావిషము గల సర్పమును వలె, గోళ్లతో అవలీలగా చీల్చివేసెను.

సంరంభదుష్ప్రేక్ష్యకరాలలోచనో
వ్యాత్తాననాంతం విలిహన్ స్వజిహ్వయా ।
అసృగ్లవాక్తారుణకేసరాననో
యథాంత్రమాలీ ద్విపహత్యయా హరిః ॥ 30

సంరంభదుష్ప్రేక్ష్యకరాలలోచనః - కోపముచే చూడ శక్యము కాని భయంకరమగు కన్నులు కలిగినవాడు, వ్యాత్త-ఆనన-అంతమ్ - తెరువబడిన నోటియొక్క కొనను, స్వజిహ్వయా - తన నాలుకతో, విలిహన్ - ఆస్వాదించుచున్నవాడు, అసృగ్-లవ-ఆక్త-అరుణకేసర-ఆననః - రక్తపు బిందువులచే తడుపబడి ఎఱ్ఱనైన జూలు ముఖము కలవాడు అగు నరసింహుడు, ద్విపహత్యయా - ఏనుగుయొక్క వధచే, అంత్రమాలీ - ప్రేవుల మాల గల, హరిః యథా - సింహము వలె.

కోపించిన నరసింహుని భయంకరమగు కన్నులు చూడ శక్యము కాకుండెను. ఆయన నోటిని తెరిచి తన నాలుకతో నోటి కొనలను ఆస్వాదించుచుండెను. రక్తపు బిందువులతో ఆయన ముఖము, జూలు తడిసి యుండెను. ఏనుగును చంపి దాని ప్రేవులను మెడలో మాలగా దాల్చిన సింహము వలె ఆయన భాసించెను.

నఖాంకురోత్పాటితహృత్సరోరుహం
విసృజ్య తస్యానుచరానుదాయుధాన్ ।
అహన్ సమంతాన్నఖశస్త్రపార్ష్ణిభిః
దోర్దండయూథోఽనుపథాన్ సహస్రశః ॥ 31

దోః-దండయూథః - దండముల వంటి భుజముల సమూహములు కలిగిన నరసింహుడు, నఖ-అంకుర-ఉత్పాటితహృత్-సరోరుహమ్ - గోళ్ల కొనలతో పెరికివేయబడిన పద్మమువంటి హృదయము గల రాక్షసుని, విసృజ్య - విడిచిపెట్టి, ఉద్-ఆయుధాన్ - పైకెత్తబడిన ఆయుధములు గలిగిన, తస్య - వాని, అనుచరాన్ - అనుచరులను, అనుపథాన్ - వాని పక్షీయులను, సహస్రశః - వేలాదిగా, నఖశస్త్రపార్ష్ణిభిః - గోళ్లు అనే

ఆయుధములతో కాలి మడమలతో, సమంతాత్ - అన్ని వైపులా, అహన్ - సంహరించెను.

దండములవంటి భుజముల సమూహములు గల నరసింహుడు గోళ్ల కొనలతో వాని పద్మమును బోలిన గుండెకాయను పెరికివేసి, వానిని ప్రక్కన పారవైచెను. వాని అనుచరులు, ఇతరులగు వాని పక్షమువారు ఆయుధములనెత్తి ఆయన మీదకు వచ్చిరి. ఆయన వారిని అన్ని వైపులా వేల సంఖ్యలో గోళ్లు అనే ఆయుధములతో మరియు కాలి మడమలతో సంహరించెను.

సటావధూతా జలదాః పరాపతన్
గ్రహాశ్చ తద్దృష్టివిముష్టరోచిషః ।
అంభోధయశ్శ్వాసహతా విచుక్షుభుః
నిర్హ్రాదభీతా దిగిభా విచుక్రుశుః ।। 32

సటా-అవధూతాః - జూలుచే విసిరికొట్టబడిన, జలదాః - మేఘములు, పరా-అపతన్ - చెల్లాచెదరైనవి, గ్రహాః చ - గ్రహములు కూడ, తద్-దృష్టివిముష్టరోచిషః - ఆయన కన్నులచే అపహరించబడిన ప్రకాశము గలవి, శ్వాసహతాః - శ్వాసచే కొట్టబడిన, అంభోధయః - సముద్రములు, విచుక్షుభుః - కలిచివేయబడినవి, నిర్హ్రాదభీతాః - సింహనాదముచే భయపడిన, దిగ్-ఇభాః - దిగ్గజములు, విచుక్రుశుః - ఆక్రోశించినవి.

ఆయన జూలు విసురులకు మేఘములు చెల్లాచెదరైనవి. ఆయన కన్నుల కాంతి ముందు గ్రహములు కూడ వెలవెల బోయినవి. ఆయన శ్వాసవేగమునకు సముద్రములు కలిచివేయబడినవి. దిగ్గజములు ఆయన సింహనాదమునకు భయపడి ఆక్రోశించినవి.

ద్యౌస్తత్సటోత్క్షిప్తవిమానసంకులా
ప్రోత్సర్పత క్ష్మా చ పదాతిపీడితా ।
శైలాస్సముత్పేతురముష్య రంహసా
తత్తేజసా ఖం కకుభో న రేజిరే ।। 33

తత్-సటా-ఉత్క్షిప్తవిమానసంకులా - ఆయన జూలుచే విసిరివే యబడిన విమానములచే రద్దీగానున్న, ద్యౌః - ద్యులోకము, ప్ర-ఉత్స ర్పత - అధికముగా చలించెను, క్ష్మా చ - భూమి కూడ, పదా - కాలిచే, అతిపీడితా - అధికముగా పీడను పొందెను, అముష్య - ఈయనయొక్క, రంహసా - వేగముచే, శైలాః - పర్వతములు, సముత్పేతుః - బాగా పైకి ఎగిరినవి, తత్-తేజసా - ఆయనయొక్క తేజస్సుచే, ఖమ్ - ఆకాశము, కకుభః - దిక్కులు, న రేజిరే - ప్రకాశించలేదు.

ఆయన జూలుచే విసిరికొట్టబడిన విమానములతో రద్దీగానున్న ద్యులోకము అధికముగా అల్లల్లాడెను. ఆయన కాలిచే త్రొక్కబడిన భూమి ఆ బరువునకు చాల పీడను పొందెను. ఆయన వేగమునకు పర్వతములు ఎగురజొచ్చెను. ఆయన తేజస్సు ముందు ఆకాశము, దిక్కులు వెలవెలబో యెను.

తతస్సభాయాముపవిష్టముత్తమే
నృపాసనే సంభృతతేజసం విభుమ్ ।
అలక్షితద్వైరథమత్యమర్షణం
ప్రచండవక్త్రం న బభాజ కశ్చన ॥ 34

తతః - తరువాత, సభాయామ్ - సభయందు, ఉత్తమే - మిక్కిలి ఎత్తైన, నృప-ఆసనే - రాజసింహాసనమునందు, ఉపవిష్టమ్ - కూర్చున్నట్టి యు, సంభృతతేజసమ్ - నిండు కాంతి కలిగినట్టియు, అలక్షితద్వైరథమ్ - కానరాని ప్రతిపక్షి కలిగినట్టియు, అతి-అమర్షణమ్ - మిక్కిలి భయమును గొల్పునట్టియు, ప్రచండవక్త్రమ్ - ఉగ్రమైన ముఖము గల, విభుమ్ - నర సింహవిభుని, కశ్చన - ఎవ్వరైననూ, న బభాజ - సేవించలేదు.

తరువాత నరసింహునకు ఎదురుగా నిలబడే ప్రతిపక్షి కానరాలేదు. నిండు కాంతి గల ఆయన సభలో మిక్కిలి ఎత్తైన రాజసింహాసనముపై కూర్చుండెను. ఉగ్రమైన ముఖముతో మిక్కిలి భయమును గొల్పే ఆ విభుని వద్దకు సేవించుటకై ఎవ్వరైననూ వెళ్లలేదు.

నిశమ్య లోకత్రయమస్తకజ్వరం
తమాదిదైత్యం హరిణా హతం మృధే ।
ప్రహర్షవేగోత్కలితాననా ముహుః
ప్రసూనవర్షైర్వవృషుస్సురస్త్రియః ॥ 35

లోకత్రయమస్తకజ్వరమ్ - ముల్లోకములకు తలపోటు అయినట్టి యు, హరిణా - నరహరిచే, మృధే - యుద్ధమునందు, హతమ్ - సంహరించబడిన, తమ్ - ఆ, ఆదిదైత్యమ్ - దితి పెద్ద కొడుకును, నిశమ్య - చూచి, ప్రహర్షవేగ-ఉత్కలిత-ఆననాః - గొప్ప హర్షముయొక్క వేగముచే వికసించిన ముఖములు గల, సురస్త్రియః - దేవతాస్త్రీలు, ముహుః - పలుమార్లు, ప్రసూనవర్షైః - పూలవానలచే, వవృషుః - వర్షించిరి.

ముల్లోకములకు తలపోటుగా తయారైన ఆ దితి పెద్దకొడుకును యుద్ధములో నరసింహుడు సంహరించగా చూచిన దేవతాస్త్రీలు గొప్ప హర్షముతో వికసించిన ముఖములు గలవారై, పలుమార్లు పూలవానలను కురిపించిరి.

తదా విమానావలిభిర్నభస్తలం
దిదృక్షతాం సంకులమాస నాకినామ్ ।
సురానకా దుందుభయోఽథ జఘ్నిరే
గంధర్వముఖ్యా ననృతుర్జగుః స్త్రియః ॥ 36

తదా - అప్పుడు, దిదృక్షతామ్ - చూడగోరే, నాకినామ్ - దేవతలయొక్క, విమాన-ఆవలిభిః - విమానముల పంక్తులచే, నభః-తలమ్ - ఆకాశతలము, సంకులమ్ - రద్దీ గలదియై, ఆస - ఆయెను, అథ - తరువాత, సుర-ఆనకాః - దేవతల నగారాలు, దుందుభయః - దుందుభులు, జఘ్నిరే - మ్రోగినవి, గంధర్వముఖ్యాః - ప్రముఖులగు గంధర్వులు, ననృతుః - నాట్యమాడిరి, స్త్రియః - స్త్రీలు, జగుః - పాడిరి.

అప్పుడు ఆ దృశ్యమును చూడగోరి వచ్చిన దేవతల విమానములతో ఆకాశమంతా రద్దీగా అయెను. తరువాత దేవతల నగారాలు, దుందుభులు మ్రోగినవి. గంధర్వప్రముఖులు నాట్యమాడగా దేవతాస్త్రీలు పాడిరి.

తత్రోపవ్రజ్య విబుధా బ్రహ్మేంద్రగిరిశాదయః ।
ఋషయః పితరస్సిద్ధా విద్యాధరమహోరగాః ॥ 37

మనవః ప్రజానాం పతయో గంధర్వాప్సరచారణాః ।
యక్షాః కింపురుషాస్తాత వేతాలాస్సిద్ధకిన్నరాః ॥ 38

తే విష్ణుపార్షదాస్సర్వే సునందకుముదాదయః ।
మూర్ధ్ని బద్ధాంజలిపుటా ఆసీనం తీవ్రతేజసమ్ ।
ఈడిరే నరశార్దూలం నాతిదూరచరాః పృథక్ ॥ 39

తాత - వత్సా!, తత్ర - అచటకు, ఉపవ్రజ్య - దగ్గరగా వచ్చి, బ్రహ్మ-ఇంద్రగిరిశ-ఆదయః - బ్రహ్మగారు ఇంద్రుడు రుద్రుడు మొదలైన, విబుధాః - దేవతలు, ఋషయః - మహర్షులు, పితరః - పితృదేవతలు, సిద్ధాః - సిద్ధులు, విద్యాధరమహా-ఉరగాః - విద్యాధరులు గొప్ప నాగులు, మనవః - మనువులు, ప్రజానాం పతయః - ప్రజాపతులు, గంధర్వ-అప్సరచారణాః - గంధర్వులు అప్సరసలు చారణులు, యక్షాః - యక్షులు, కింపురుషాః - కింపురుషులు, వేతాలాః - వేతాళురు, సిద్ధకిన్నరాః - సిద్ధులైన కిన్నరులు, సునందకుముద-ఆదయః - సునందుడు కుముదుడు మొదలైన, తే - ప్రసిద్ధులైన, విష్ణుపార్షదాః - విష్ణువుయొక్క అనుచరులు, సర్వే - అందరు, మూర్ధ్ని - శిరస్సుపై, బద్ధ-అంజలిపుటాః - కట్టబడిన దోసిళ్ల పుటములు గలవారై, నాతిదూరచరాః - చాల దూరము కాకుండా సంచరించువారై, ఆసీనమ్ - కూర్చున్నట్టియు, తీవ్రతేజసమ్ - సహించ శక్యము కాని తేజస్సు గల, నరశార్దూలమ్ - నరసింహుని, పృథక్ - వేరుగా, ఈడిరే - స్తుతించిరి.

వత్సా! బ్రహ్మగారు ఇంద్రుడు రుద్రుడు మొదలైన దేవతలు, మహర్షులు, పితృదేవతలు, సిద్ధులు, విద్యాధరులు, గొప్ప నాగులు, మను

వులు, ప్రజాపతులు, గంధర్వులు, అప్సరసలు, చారణులు, యక్షులు, కింపురుషులు, వేతాళురు, సిద్ధులైన కిన్నరులు, సునందుడు కుముదుడు మొదలైన ప్రసిద్ధులైన విష్ణుకింకరులు అందరు అచటకు వచ్చిరి. వారు సహించ శక్యము కాని తేజస్సుతో కూర్చునియున్న నరసింహునకు మరీ దూరము కాకుండా కొంచెము దగ్గరగా తలపై చేతులను జోడించి నిలబడి విడివిడిగా ఆయనను స్తుతించిరి.

బ్రహ్మోవాచ ।
నతోఽస్మ్యనంతాయ దురంతశక్తయే
విచిత్రవీర్యాయ పవిత్రకర్మణే ।
విశ్వస్య సర్గస్థితిసంయమాన్ గుణైః
స్వలీలయా సందధతేఽవ్యయాత్మనే ॥ 40

అనంతాయ - దేశకాలవస్తుపరిచ్ఛేదములు లేనట్టియు, దురంతశక్తయే - అనంతములగు శక్తులు కలిగినట్టియు, విచిత్రవీర్యాయ - ఆశ్చర్యమును గొల్పే ప్రభావములు కలిగినట్టియు, పవిత్రకర్మణే - పావనములగు లీలలు కలిగినట్టియు, గుణైః - సత్త్వరజస్తమోగుణములతో, విశ్వస్య - జగత్తుయొక్క, సర్గస్థితిసంయమాన్ - సృష్టిస్థితిలయములను, స్వలీలయా - తన లీలచే, సందధతే - చక్కగా చేయుచున్నట్టియు, అవ్యయ-ఆత్మనే - వినాశము లేని స్వరూపము గల శ్రీహరి కొరకు, నతః - నమస్కరించినవాడను, అస్మి - అగుచున్నాను.

బ్రహ్మగారు ఇట్లు పలికెను --- దేశకాలవస్తుపరిచ్ఛేదములు లేని శ్రీహరి శక్తులు అనంతములు. పావనము చేసే లీలలు గల ఆయన ప్రభావములు ఆశ్చర్యమును గొల్పును. ఆయన తన లీలచే సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతి ద్వారా జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను చక్కగా చేయుచున్నాడు. వినాశము లేని స్వరూపము గల ఆ శ్రీహరి కొరకు నమస్కరించుచున్నాను.

శ్రీరుద్ర ఉవాచ ।
కోపకాలో యుగాంతస్తే హతోఽయమసురోఽల్పకః ।
తత్సుతం పాహ్యుపసృతం భక్తం తే భక్తవత్సల ।। 41

తే - నీయొక్క, కోపకాలః - కోపమునకు సమయము, యుగ -అంతః - కల్పాంతమే, అల్పకః - అల్పుడగు, అయమ్ - ఈ, అసురః - రాక్షసుడు, హతః - సంహరించబడినవాడు, భక్తవత్సల - భక్తులయందు ప్రేమ గలవాడా!, తత్-సుతమ్ - వాని పుత్రుడైనట్టియు, తే - నీ, భక్తమ్ - భక్తుడైనట్టియు, ఉపసృతమ్ - శరణుపొందిన వీనిని, పాహి - రక్షించుము.

శ్రీరుద్రుడిట్లు పలికెను --- నీకు కోపము వచ్చిన కాలము ప్రళయకాలమే. అల్పుడగు ఈ అసురుడు సంహరించబడినాడు. వాని పుత్రుడగు ఈ ప్రహ్లాదుడు నీ భక్తుడు, నిన్ను శరణు పొందినాడు. భక్తులయందు ప్రేమ గల ఓ శ్రీహరీ! వీనిని రక్షించుము.

ఇంద్ర ఉవాచ ।
ప్రత్యానీతాః పరమ భవతా త్రాయతా నస్స్వభాగా
దైత్యాక్రాంతం హృదయకమలం త్వద్గృహం ప్రత్యబోధి ।
కాలగ్రస్తం కియదిదమహో నాథ శుశ్రూషతాం తే
ముక్తిస్తేషాం న హి బహుమతా నారసింహాపరైః కిమ్ ।।42

పరమ - ఓ పరమేశ్వరా!, నః - మమ్ములను, త్రాయతా - రక్షించుచున్న, భవతా - నీచే, స్వభాగాః - మా యజ్ఞభాగములు, ప్రతి-ఆనీతాః - తిరిగి తీసుకురాబడినవి, దైత్య-ఆక్రాంతమ్ - రాక్షసునిచే ఆక్రమించబడిన, త్వద్-గృహమ్ - నీ ఇల్లైన, హృదయకమలమ్ - పద్మమువంటి హృదయము, ప్రతి-అబోధి - వికసింప జేయబడినది, అహో - ఆశ్చర్యము!, నాథ - ఓ నాథా!, కాలగ్రస్తమ్ - కాలముచే కబళించివేయబడిన, ఇదమ్ - ఈ జగత్తు, కియత్ - ఎంతటిది?, నారసింహ - ఓ నరసింహా!, తే - నీకు, శుశ్రూషతామ్ - సేవను చేయువారలకు, ముక్తిః - మోక్షము, బహు - అధికముగా, న హి మతా - సమ్మతము కాదు గదా!, తేషామ్ - వారలకు, అపరైః - ఇతరములచే, కిమ్ - ఏమి ప్రయోజనము?

ఇంద్రుడు ఇట్లు పలికెను --- ఓ పరమేశ్వరా! మమ్ములను రక్షించే నీవు మా యజ్ఞభాగములను తిరిగి మాకు అప్పగించితివి. మా హృదయములో నీవే ఉన్నావు. కాని, ఇంతవరకు నిరంతరమగు ఆ రాక్షసుని తలపుచే మా హృదయపద్మము ముడుచుకుపోయినది. దానిని మరల నీవు వికసింప జేసినావు. ఆశ్చర్యము! ఓ నాథా! నరసింహా! కాలముచే కబళించివేయబడే ఈ జగత్తు ఎంతటిది? నిన్ను సేవించువారలకు మోక్షమునందు కూడ పెద్ద ఆదరము ఉండదు. ఇక మిగిలినవాటిపై ఆదరముండదని వేరుగా చెప్పవలయునా?

ఋషయ ఊచుః ।

త్వం నస్తపః పరమమాత్థ యదాత్మతేజో
యేనేదమాదిపురుషాత్మగతం ససర్జ ।
తద్విప్రలుప్తమమునాద్య శరణ్య పాల
రక్షాగృహీతవపుషా పునరన్వమంస్థాః ॥ 43

ఆదిపురుష - ఓ ఆదిపురుషా!, శరణ్య - శరణు పొందదగినవాడా!, పాల - ఓ పాలకుడా!, త్వమ్ - నీవు, నః - మాకు, పరమమ్ - సర్వోత్కృష్టమైన, తపః - తపస్సును, ఆత్థ - ఉపదేశించితివి, యత్ - ఎయ్యది, ఆత్మతేజః - నీ తేజస్సుయో, యేన - దేనిచే, ఆత్మగతమ్ - నీయందు లీనమైన, ఇదమ్ - ఈ జగత్తును, ససర్జ - సృష్టించితివో, తత్ - ఆ తపస్సు, అద్య - ఈనాడు, అమునా - వీనిచే, విప్రలుప్తమ్ - లోపింపజేయబడినది, రక్షాగృహీతవపుషా - రక్షించుట కొరకై స్వీకరించబడిన రూపముతో, పునః - మరల, అను-అమంస్థాః - అనుజ్ఞనిచ్చితివి.

మహర్షులిట్లు పలికిరి --- శరణు పొందదగిన ఓ రక్షకుడా! పూర్ణచైతన్యస్వరూపుడవగు నీవే జగత్కారణము. నీవు మాకు సర్వోత్కృష్టమైన తపస్సును ఉపదేశించితివి. ధ్యానరూపమగు ఆ తపస్సు నీ తేజస్సే. దాని ప్రభావముచేతనే నీవు నీయందు విలీనమైయున్న ఈ జగత్తును ప్రకటము చేసితివి. అట్టి తపస్సు ఈనాడు వీని కారణముగా లుప్తమై పోయినది. నీవు

మరల మమ్ములను రక్షించుటకై ఈ రూపమును స్వీకరించి, మరల తపస్సు చేయుటకు అనుమతినిచ్చితివి.

పితర ఊచుః ।

శ్రాద్ధాని నోఽధిబుభుజే ప్రసభం తనూజైః
దత్తాని తీర్థసమయేఽప్యపిబత్తిలాంబు ।
తస్యోదరాన్నఖవిదీర్ణవపాద్య ఆర్ఛత్
తస్మై నమో నృహరయేఽఖిలధర్మగోప్త్రే ।। 44

నః - మాకు, తనూజైః - పుత్రులచే, దత్తాని - ఈయబడిన, శ్రాద్ధాని - శ్రాద్ధములను, ప్రసభమ్ - బలాత్కారముగా, అధిబుభుజే - అధిపతియై భుజించెను, తీర్థసమయే - స్నానసమయమునందు, తిల-అంబు అపి - తిలోదకమును కూడ, అపిబత్ - త్రాగెను, నఖవిదీర్ణవపాత్ - గోళ్లచే చీల్చివేయబడిన వప కలిగిన, తస్య - వానియొక్క, ఉదరాత్ - పొట్టనుండి, యః - ఎవడైతే, ఆర్ఛత్ - తీసుకువచ్చెనో, తస్మై - అట్టి, అఖిలధర్మగోప్త్రే - సకలధర్మములను రక్షించే, నృహరయే - నరసింహుని కొరకు, నమః - నమస్కారము.

పితృదేవతలు ఇట్లు పలికిరి --- మాకు మా సంతానము శ్రాద్ధము సందర్భించే పిండాదులను ఆ రాక్షసుడే బలాత్కారముగా అధిపతియై భుజించెడివాడు. పైగా వారు స్నానసమయములో సమర్పించిన నువ్వుల తోడి నీటిని కూడ ఆతడే త్రాగెడివాడు. సకలధర్మములను రక్షించే నరసింహుడు వాని పొట్టలోని వప (పలుచని చర్మము) ను గోళ్లతో చీల్చి ఆ పిండాదులను మా కొరకు తీసుకువచ్చినాడు. అట్టి నరసింహునకు నమస్కారము.

సిద్ధా ఊచుః ।

యో నో గతిం యోగసిద్ధామసాధుః
అహార్షీద్యోగతపోబలేన ।

నానాదర్పం తం నఖైర్విర్దదార
తస్మై తుభ్యం ప్రణతాస్మో నృసింహ ॥ 45

అసాధుః - దుష్టుడగు, యః - ఎవడైతే, యోగసిద్ధామ్ - యోగ సాధనచే సిద్ధించిన, గతిమ్ - సిద్ధిని, యోగతపః-బలేన - యోగసాధన తపస్సుల శక్తిచే, అహార్షీత్ - అపహరించెనో, నానాదర్పమ్ - అనేకవిషయ ములపై గర్వించియున్న, తమ్ - ఆ హిరణ్యకశిపుని, నఖైః - గోళ్లతో, నిర్ద దార - ముక్కముక్కలుగా చీల్చివేసితివి, నృసింహ - ఓ నరసింహా!, తస్మై - అట్టి, తుభ్యమ్ - నీ కొరకు, ప్రణతాః - నమస్కరించినవారము, స్మః - అగుచున్నాము.

సిద్ధులు ఇట్లు పలికిరి --- మేము యోగసాధనచే కొన్ని సిద్ధులను పొందియుంటిమి. దుష్టుడగు ఆ హిరణ్యకశిపుడు యోగసాధనను తప స్సును చేసి శక్తిని సంపాదించి, దానితో మా సిద్ధులను ఊడలాగెను. అనేక విధములుగా గర్వించియున్న ఆ రాక్షసుని నీవు గోళ్లతో ముక్కముక్కలుగా చీల్చితివి. ఓ నరసింహా! అట్టి నిన్ను మేము నమస్కరించుచున్నాము.

విద్యాధరా ఊచుః ।
విద్యాం పృథగ్ధారణయానురాద్ధాం
న్యషేధదజ్ఞో బలవీర్యదృప్తః ।
స యేన సంఖ్యే పశువద్ధతస్తం
మాయానృసింహం ప్రణతాస్మ నిత్యమ్ ॥ 46

బలవీర్యదృప్తః - బలపరాక్రమములచే గర్వించిన, అజ్ఞః - అజ్ఞాని యగు, సః - ఆ హిరణ్యకశిపుడు, పృథగ్-ధారణయా - పలువిధములైన మనస్సుయొక్క ధారణచే, అనురాద్ధామ్ - సంపాదించబడిన, విద్యామ్ - విద్యను, న్యషేధత్ - ప్రతిషేధించెను, యేన - ఎవనిచే, సంఖ్యే - యుద్ధ మునందు, పశువత్ - పశువు వలె, హతః - సంహరించబడినాడో, మాయానృసింహమ్ - మాయాశక్తిచే నరసింహరూపమును దాల్చిన, తమ్ - ఆ శ్రీహరిని, నిత్యమ్ - నిత్యము, ప్రణతాః స్మ - నమస్కరించెదము.

విద్యాధరులు ఇట్లు పలికిరి --- మేము పలువిధములుగా మనస్సును నియంత్రించి అంతర్ధానశక్తి మొదలగు విద్యలను సంపాదించితిమి. అజ్ఞానియగు హిరణ్యకశిపుడు బలపరాక్రమములచే గర్వించి మా విద్యను ప్రతిషేధించెను. మాయాశక్తిచే నరసింహరూపమును దాల్చి శ్రీహరి వానిని యుద్ధములో పశువును వలె సంహరించెను. మేము నిత్యము ఆ శ్రీహరికి నమస్కరించుచున్నాము.

నాగా ఊచుః ।

యేన పాపేన రత్నాని స్త్రీరత్నాని హృతాని నః ।

తద్వక్షఃపాటనేనాసాం దత్తానంద నమోఽస్తు తే ।। 47

యేన - ఏ, పాపేన - పాపిచే, నః - మాయొక్క, రత్నాని - రత్నములు, స్త్రీరత్నాని - గొప్ప యువతులు, హృతాని - అపహరించబడిరో, తద్-వక్షఃపాటనేన - వాని రొమ్మును పగులగొట్టుటచే, ఆసామ్ - ఈ యువతులకు, దత్త-ఆనంద - ఈయబడిన ఆనందము గలవాడా!, తే - నీ కొరకు, నమః - నమస్కారము, అస్తు - అగుగాక!

నాగులు ఇట్లు పలికిరి --- ఓ నరసింహా! ఈ పాపి మా పడగల యందలి రత్నములను మాత్రమే గాక, మా గొప్ప యువతులను కూడ అపహరించినాడు. నీవు వాని రొమ్మును పగులగొట్టి ఈ యువతులకు ఆనందమును కలుగజేసితివి. నీకు నమస్కారమగుగాక!

మనవ ఊచుః ।

మనవో వయం తవ నిదేశకారిణో

దితిజేన దేవ పరిభూతసేతవః ।

భవతా ఖలస్స ఉపసంహృతః ప్రభో

కరవామ తే కిమనుశాధి కింకరాన్ ।। 48

దేవ - ఓ దేవా!, వయమ్ - మేము, తవ - నీ, నిదేశకారిణః - ఆజ్ఞను పాలించే, మనవః - మనువులము, దితిజేన - దితిపుత్రుడగు హిరణ్యకశిపునిచే, పరిభూతసేతవః - పరాభవించబడిన మర్యాదలు గలవార

ము, ప్రభో - ఓ ప్రభూ!, భవతా - నీచే, సః - ఆ, ఖలః - దుష్టుడు, ఉప సంహృతః - సంహరించబడినవాడు, తే - నీకు, కిమ్ - దేనిని, కరవామ - చేసెదము గాక!, కింకరాన్ - సేవకులను, అనుశాధి - శాసించుము.

మనువులు ఇట్లు పలికిరి --- ఓ దేవా! మేము నీ ఆదేశమును పాలించే మనువులము. దితిపుత్రుడగు ఈ హిరణ్యకశిపుడు మేము ఏర్పర చిన ధర్మమర్యాదలను పూర్తిగా ఉల్లంఘించినాడు. ఓ ప్రభూ! ఆ దుష్టుని నీవు సంహరించితివి. మేము నీకు ఏమి చేయదగును? సేవకులమగు మమ్మలను శాసించుము.

ప్రజాపతయ ఊచుః ।
ప్రజేశా వయం తే పరేశాభిసృష్టా
న యేన ప్రజా వై సృజామో నిషిద్ధాః ।
స ఏష త్వయా భిన్నవక్షా ను శేతే
జగన్మంగలం సత్త్వమూర్తేఽవతారః ॥ 49

పర-ఈశ - ఓ పరమేశ్వరా!, వయమ్ - మేము, తే - నీచే, అభి సృష్టాః - సృష్టికొరకు సృష్టించబడిన, ప్రజా-ఈశాః - ప్రజాపతులము, యేన - ఎవనిచే, వై - నిశ్చయముగా, నిషిద్ధాః - ప్రతిషేధించబడినవార మై, ప్రజాః - ప్రాణులను, న సృజామః - సృష్టించుట లేదో, సః - అట్టి, ఏషః - ఈతడు, త్వయా - నీచే, ను - నిశ్చయముగా, భిన్నవక్షాః - పగు లగొట్టబడిన వక్షఃస్థలము గలవాడై, శేతే - పడియున్నాడు, సత్త్వమూర్తే - సత్త్వగుణప్రధానమగు రూపము గలవాడా!, అవతారః - అవతారము, జగ త్-మంగలమ్ - జగత్తునకు మంగళకరము.

ప్రజాపతులు ఇట్లు పలికిరి --- ఓ పరమేశ్వరా! ప్రజాపతులమగు మమ్మలను నీవు సృష్టించితివి. కాని, మమ్మలను సృష్టి చేయకుండగా ఈ రాక్షసుడు నిషేధించుటచే మేము ప్రాణులను సృష్టించుటలేదు. అట్టి వీనిని నీవు నిశ్చయముగా వక్షఃస్థలమును పగులగొట్టి సంహరించితివి. నీ రూపము సత్త్వగుణప్రధానమైనది. నీ అవతారము జగత్తునకు మంగళ మును చేకూర్చును.

గంధర్వా ఊచుః ।
వయం విభో తే నటనాట్యగాయకా
యేనాత్మసాద్వీర్యబలౌజసా కృతాః ।
స ఏష నీతో భవతా దశామిమాం
కిముత్పథస్థః కుశలాయ కల్పతే ॥ 50

విభో - ఓ ప్రభూ!, వయమ్ - మేము, తే - నీకు, నటనాట్యగాయకాః - నటులము మరియు నాట్యమును గానము చేయువారము, యేన - ఎవనిచే, వీర్యబల-ఓజసా - వీరలక్షణము బలము పరాక్రమములచే, ఆత్మసాత్ - తనకు అధీనముగా, కృతాః - చేయబడినవారమో, సః - అట్టి, ఏషః - ఈతడు, భవతా - నీచే, ఇమామ్ - ఈ, దశామ్ - స్థితిని, నీతః - పొందించబడినాడు, ఉత్పథస్థః - తప్పు మార్గమునందున్నవాడు, కుశలాయ - క్షేమము కొరకు, కల్పతే కిమ్ - అర్హుడు అగునా యేమి?

గంధర్వులు ఇట్లు పలికిరి --- ఓ ప్రభూ! మేము నీ యెదుట నాట్యమును గానమును చేసే నటులము. కాని, ఈ హిరణ్యకశిపుడు తన వీరలక్షణముతో మరియు బలపరాక్రమములతో మమ్ములను తన అధీనములో నుంచుకొనినాడు. అట్టివానికి నీవీ దశను కలిగించితివి. తప్పుదారియందు నడచువాడు క్షేమమునకు అర్హుడగునా? (కాడు)

చారణా ఊచుః ।
హరే తవాంఘ్రిపంకజం భవాపవర్గమాశ్రితాః ।
యదేష సాధుహృచ్ఛయస్త్వయాऽసురస్సమాపితః ॥ 51

హరే - ఓ శ్రీహరీ!, భవ-అపవర్గమ్ - సంసారమునుండి విముక్తిని కలిగించే, తవ - నీ, అంఘ్రిపంకజమ్ - పాదపద్మమును, ఆశ్రితాః - ఆశ్రయించినవారము, యత్ - ఏలయనగా, సాధుహృత్-శయః - సత్పురుషుల హృదయములో నిలిచియుండే, ఏషః - ఈ, అసురః - రాక్షసుడు, త్వయా - నీచే, సమాపితః - సంహరించబడినవాడు.

చారణులు ఇట్లు పలికిరి --- ఓ శ్రీహరీ! మేము సంసారము నుండి విముక్తిని కలిగించే నీ పాదపద్మమును ఆశ్రయించితిమి. ఎందుకంటే, సత్పురుషుల హృదయములో భయమును కలిగించే ఈ రాక్షసుని నీవు సంహరించినావు.

యక్షా ఊచుః ।
వయమనుచరముఖ్యాః కర్మభిస్తే మనోజ్ఞైః
త ఇహ దితిసుతేన ప్రాపితా వాహకత్వమ్ ।
స తు జనపరితాపం తత్కృతం జానతా తే
నరహర ఉపనీతః పంచతాం పంచవింశ ।। 52

నరహర - ఓ నరసింహా!, పంచవింశ - ఇరవై అయిదవవాడా!, మనః-జ్ఞైః - మనోహరములైన, కర్మభిః - కర్మలచే, వయమ్ - మేము, తే - నీ, అనుచరముఖ్యాః - అనుచరులలో ప్రధానులము, తే - అట్టి మేము, ఇహ - ఈ కాలమునందు, దితిసుతేన - దితిపుత్రుడగు హిరణ్యకశిపునిచే, వాహకత్వమ్ - బరువులు మోసే వృత్తిని, ప్రాపితాః - పొందించబడితిమి, తత్-కృతమ్ - వానిచే చేయబడిన, జనపరితాపమ్ - జనుల పీడను, జానతా - తెలిసియున్న, తే - నీచే, సః తు - ఆతడైతే, పంచతామ్ - మరణమును, ఉపనీతః - పొందించ బడినవాడు.

యక్షులు ఇట్లు పలికిరి --- ఓ నరసింహా! మూలప్రకృతి, మహత్తత్త్వము (సమష్టి బుద్ధిశక్తి), సమష్టి అహంకారము, శబ్దస్పర్శరూపరసగంధములనే అయిదు తన్మాత్రలు, వాక్పాణిపాదపాయూపస్థములనే అయిదు కర్మేంద్రియములు, శ్రోత్రత్వక్నేత్రజిహ్వాఘ్రాణములనే అయిదు జ్ఞానేంద్రియములు, సమష్టి-అంతఃకరణము, పృథివ్యప్తేజోవాయ్వాకాశములనే అయిదు మహాభూతములు, వెరసి ఈ ఇరవై నాలుగు తత్త్వములకు సత్తా (ఉనికి)-స్ఫూర్తి (ప్రకాశము) లను అనుగ్రహించే చైతన్యస్వరూపుడవు నీవే. మేము మనోహరములైన కర్మలననుష్ఠించి నీ అనుచరులలో ప్రముఖులమైనాము. అట్టి మమ్ములను ఈ కాలములో దితిపుత్రుడగు హిరణ్యకశిపుడు పల్లకీ మొదలగు బరువులను మోసే పనికి కుదిర్చినాడు. ఆతడు

జనులకు కలిగించిన పీడ నీకు తెలిసినదియే. కావుననే, నీవాతనిని సంహ రించితివి.

కింపురుషా ఊచుః ।
వయం కింపురుషాస్త్వం తు మహాపురుష ఈశ్వరః ।
అయం కుపురుషో నష్టో ధిక్కృతస్సాధుభిర్యదా ।। 53

వయమ్ - మేము, కింపురుషాః - అల్పజీవులము, త్వం తు - నీవైతే, మహాపురుషః - పురుషోత్తముడవు, ఈశ్వరః - ఈశ్వరుడవు, యదా - ఏ కాలమునందైతే, సాధుభిః - సత్పురుషులచే, ధిక్-కృతః - నిందించబడినవాడో అప్పుడే, అయమ్ - ఈ, కుపురుషః - దుష్టవ్యక్తి, నష్టః - నశించినవాడు.

కింపురుషులు ఇట్లు పలికిరి --- మేము అల్పజీవులమగు కింపు రుషులము. నీవైతే పురుషోత్తముడవగు ఈశ్వరుడవు. ఏ కాలమునందైతే సత్పురుషులు ఈ దుష్టవ్యక్తిని నిందించినారో, అప్పుడే వీని ఆయువు మూడినది.

వైతాలికా ఊచుః ।
సభాసు సత్రేషు తవామలం యశో
గీత్వా సపర్యాం మహతీం లభామహే ।
యస్తాం వ్యనైషీద్భృశమేష దుర్జనో
దిష్ట్యా హతస్తే భగవన్ యథాఽఽమయః ।। 54

భగవన్ - ఓ భగవానుడా!, సభాసు - సభలయందు, సత్రేషు - యజ్ఞములయందు, తవ - నీయొక్క, అమలమ్ - స్వచ్ఛమైన, యశః - కీర్తిని, గీత్వా - గానము చేసి, మహతీమ్ - గొప్ప, సపర్యామ్ - పూజను, లభామహే - పొందుచున్నాము, యః - ఎవడైతే, తామ్ - ఆ పూజను, వ్యనైషీత్ - అడ్డుకొనెనో, భృశమ్ - మిక్కిలి, దుర్జనః - దుష్టుడు, ఆమయః యథా - రోగము వంటివాడు అగు, ఏషః - ఈతడు, దిష్ట్యా - దైవమగు, తే - నీచే, హతః - సంహరించబడినవాడు.

వైతాళికులు (తాళముతో పాటలను పాడువారు) ఇట్లు పలికిరి --- ఓ భగవానుడా! మేము సభలలో మరియు యజ్ఞములలో నీ స్వచ్ఛమగు కీర్తిని గానము చేసి గొప్ప మానమర్యాదలనందుకొనుచుంటిమి. రోగము వలె పీడను కలిగించే పరమదుష్టుడగు ఈ రాక్షసుడు ఆ మానమర్యాదలకు అడ్డు పడినాడు. దైవమగు నీవు వీనిని సంహరించితివి.

కిన్నరా ఊచుః ।
వయమీశ కిన్నరగణాస్తవానుగా
దితిజేన విష్టిమమునాను కారితాః ।
భవతా హరే స వృజినోఽవసాదితో
నరసింహ నాథ విభవాయ నో భవ ॥ 55

ఈశ - ఓ ఈశ్వరా!, తవ - నీ, అనుగాః - అనుచరులమగు, వయమ్ - మేము, కిన్నరగణాః - కిన్నరగణముల వారము, దితిజేన - దితి పుత్రుడగు, అమునా - వీనిచే, విష్టిమ్ - వెట్టి చాకిరీని, కారితాః - చేయించబడితిమి, హరే - ఓ శ్రీహరీ!, సః - ఆ, వృజినః - పాపి, భవతా - నీచే, అవసాదితః - మట్టు పెట్టబడినవాడు, నరసింహ - ఓ నరసింహా!, నాథ - ప్రభూ!, నః - మాయొక్క, విభవాయ - సమృద్ధి కొరకు, భవ - అగుము.

కిన్నరులు ఇట్లు పలికిరి --- ఓ ఈశ్వరా! కిన్నరగణముల వారమగు మేము నీ అనుచరులము. దితిపుత్రుడగు ఈ హిరణ్యకశిపుడు మాచే వెట్టి చాకిరీ చేయించినాడు. ఓ శ్రీహరీ! ఆ పాపిని నీవు మట్టు బెట్టితివి. ఓ నరసింహ ప్రభూ! మాకు సమృద్ధిని కలిగించుము.

విష్ణుపార్షదా ఊచుః ।
అద్యైతద్ధరినరరూపమద్భుతం తే
దృష్టం నశ్శరణద సర్వలోకశర్మ ।
సోఽయం తే విధికర ఈశ విప్రశప్తః
తస్యేదం నిధనమనుగ్రహాయ విద్మః ॥ 56

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే ప్రహ్లాదచరితే
నృసింహావతారవర్ణనం నామ అష్టమోఽధ్యాయః ॥

శరణద - శరణునిచ్చువాడా!, అద్య - ఈ నాడు, అద్భుతమ్ - ఆశ్చర్యమును గొల్పునట్టియు, సర్వలోకశర్మ - సకలలోకములకు సుఖమును కలిగించే, తే - నీయొక్క, ఏతత్ - ఈ, హరినరరూపమ్ - నరసింహరూపము, నః - మాకు, దృష్టమ్ - కనబడినది, ఈశ - ఓ ఈశ్వరుడా!, సః - అట్టి, అయమ్ - ఈతడు, తే - నీ, విధికరః - ఆదేశమును పాటించువాడే, విప్రశప్తః - బ్రహ్మవేత్తలచే శపించబడినవాడు, తస్య - వానియొక్క, ఇదమ్ - ఈ, నిధనమ్ - మరణము, అనుగ్రహాయ - అనుగ్రహము కొరకే నని, విద్మః - తెలియుచున్నాము.

విష్ణువుయొక్క అనుచరులు ఇట్లు పలికిరి --- శరణొసగే ఓ ఈశ్వరా! ఈనాడు మాకు నీ ఈ అద్భుతమగు నరసింహరూపము కనబడినది. ఈ రూపము సకలలోకములకు సుఖకరము. ఈ రాక్షసుడు నీ కింకరుడే. సనకాదుల శాపముచే రాక్షసుడైనాడు. ఆతని ఈ మృత్యువు ఆతనికి అనుగ్రహమేనని మాకు తెలియును.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
ప్రహ్లాదచరితమునందు నరసింహావతారమును వర్ణించే
ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (8)

*****

# అథ నవమోఽధ్యాయః

## ప్రహ్లాద చరితము - ప్రహ్లాదుడు నృసింహుని స్తుతించుట

నారద ఉవాచ ।
ఏవం సురాదయస్సర్వే బ్రహ్మరుద్రపురస్సరాః ।
నోపైతుమశకన్మన్యుసంరంభం సుదురాసదమ్ ॥ 1

ఏవమ్ - ఈ విధముగా, బ్రహ్మరుద్రపురస్సరాః - బ్రహ్మ రుద్రుడు మొదలుగా గల, సర్వే - అందరు, సుర-ఆదయః - దేవతలు మొదలగువారు, మన్యుసంరంభమ్ - కోపముయొక్క ఆవేశము కలిగినట్టి యు, సుదురాసదమ్ - మిక్కిలి సమీపించ శక్యము కాని నరసింహుని, ఉపైతుమ్ - దగ్గరకు వెళ్లుటకు, న అశకన్ - సమర్థులు కాలేదు.

నారదుడిట్లు పలికెను --- ఈ విధముగా కోపావేశముతో నిండి యున్న నరసింహుని సమీపించుట సుతరాము శక్యము కాకుండెను. బ్రహ్మగారు, రుద్రుడు, దేవతలు మరియు ఇతరులు ఆయన వద్దకు వెళ్లలేకపోయిరి.

సాక్షాచ్ఛ్రీః ప్రేషితా దేవైర్దృష్ట్వా తన్మహదద్భుతమ్ ।
అదృష్టాశ్రుతపూర్వత్వాత్ సా నోపేయాయ శంకితా ॥ 2

సాక్షాత్ - సాక్షాత్తుగా, శ్రీః - లక్ష్మీదేవి, దేవైః - దేవతలచే, ప్రేషితా - పంపబడినదై, మహత్ - పెద్ద, అద్భుతమ్ - అద్భుతమైన, తత్ - ఆ రూపమును, దృష్ట్వా - చూచి, అదృష్ట-అశ్రుతపూర్వత్వాత్ - పూర్వము చూచినది విన్నది కాకపోవుట వలన, శంకితా - సందేహము గలదియై, న ఉపేయాయ - సమీపమునకు వెళ్లలేదు.

దేవతలు సాక్షాత్తుగా లక్ష్మీదేవిని ఆయన వద్దకు పంపిరి. ఆ పెద్ద అద్భుతమైన రూపమును చూడగానే, ఆమెకు శంక కలిగెను. ఎందుకంటే, అట్టి రూపమును ఆమె ఇదివరలో చూడలేదు, వినలేదు. ఆమె ఆయన దగ్గ రకు వెళ్లలేదు.

ప్రహ్లాదం ప్రేషయామాస బ్రహ్మావస్థితమంతికే ।
తాత ప్రశమయోపేహి స్వపిత్రే కుపితం ప్రభుమ్ ॥ 3

బ్రహ్మ - బ్రహ్మగారు, అంతికే - సమీపమునందు, అవస్థితమ్ - నిలిచియున్న, ప్రహ్లాదమ్ - ప్రహ్లాదుని, ప్రేషయామాస - పంపించెను, తాత - వత్సా!, స్వపిత్రే - నీ తండ్రి కొరకు, కుపితమ్ - కోపించిన, ప్రభుమ్ - నరసింహ ప్రభుని, ప్రశమయ - కోపమును చల్లార్చుము, ఉపేహి - దగ్గరకు వెళ్లుము.

తన సమీపమునందు నిలిచియున్న ప్రహ్లాదుని బ్రహ్మగారు నర సింహుని వద్దకు పంపించెను -- వత్సా! నీవు నీ తండ్రిపై కోపించియున్న నరసింహుని వద్దకు వెళ్లి, ఆయన కోపమును చల్లార్చుము.

తథేతి శనకై రాజన్ మహాభాగవతోఽర్భకః ।
ఉపేత్య భువి కాయేన ననామ విధృతాంజలిః ॥ 4

రాజన్ - ఓ రాజా!, మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడగు, అర్భకః - ఆ పిల్లవాడు, తథా - సరే, ఇతి - అని, విధృత-అంజలిః - కట్టబ డిన దోసిలి గలవాడై, శనకైః - మెల్లగా, ఉపేత్య - దగ్గరకు వెళ్లి, కాయేన - శరీరముతో, భువి - నేలపై, ననామ - నమస్కరించెను.

ఓ ధర్మరాజా! గొప్ప భగవద్భక్తుడగు ఆ పిల్లవాడు సరే అని పలి కి, చేతులు జోడించి మెల్లగా దగ్గరకు వెళ్లి, సాష్టాంగ నమస్కారమును చేసెను.

స్వపాదమూలే పతితం తమర్భకం
విలోక్య దేవః కృపయా పరిప్లుతః ।

ఉత్థాప్య తచ్ఛీర్ష్ణ్యదధాత్కరాంబుజం
కాలాహివిత్రస్తధియాం కృతాభయమ్ ॥ 5

స్వపాదమూలే - తన పాదముల మొదట, పతితమ్ - పడిన, తమ్ - ఆ, అర్భకమ్ - పిల్లవానిని, విలోక్య - చూచి, కృపయా - దయతో, పరిప్లుతః - పూర్తిగా నిండిన, దేవః - నరసింహ దేవుడు, ఉత్థాప్య - పైకి లేవదీసి, తత్-శీర్ష్ణి - వాని తలపై, కాల-అహివిత్రస్తధియామ్ - కాలము అనే సర్పము వలన భయపడిన అంతఃకరణము గలవారలకు, కృత-అభయమ్ - చేయబడిన అభయము గల, కర-అంబుజమ్ - పద్మమువంటి చేతిని, అదధాత్ - ఉంచెను.

తన పాదముల మొదట పడిన ఆ పిల్లవానిని చూచి నరసింహుని హృదయము దయతో నిండిపోయెను. ఆ దేవుడాతనిని పైకి లేవదీసి వాని తలపై పద్మమువంటి తన చేతిని ఉంచెను. ఆ చేతితో అభయమునిచ్చి ఆయన భక్తుల అంతఃకరణములో కాలము వలని ఉండే భయమును పోగొట్టును.

స తత్కరస్పర్శధుతాఖిలాశుభః
సపద్యభివ్యక్తపరాత్మదర్శనః ।
తత్పాదపద్మం హృది నిర్వృతో దధౌ
హృష్యత్తనుః క్లిన్నహృదశ్రులోచనః ॥ 6

తత్-కరస్పర్శధుత-అఖిల-అశుభః - ఆయన చేతితో స్పృశించుటచే కడిగివేయబడిన సకలదోషములు గలవాడు, సపది - వెంటనే, అభివ్యక్తపర-ఆత్మదర్శనః - ప్రకటమైన పరమాత్మ సాక్షాత్కారము గలవాడు, నిర్వృతః - ఆనందభరితుడు, హృష్యత్-తనుః - గగుర్పాటుతో కూడిన దేహము గలవాడు, క్లిన్నహృత్ - ఆర్ద్రమైన హృదయము గలవాడు, అశ్రులోచనః - నీరు నిండిన కన్నులు గలవాడు అగు, సః - ఆ ప్రహ్లాదుడు, తత్-పాదపద్మమ్ - ఆయన పద్మమువంటి పాదమును, హృది - హృదయమునందు, దధౌ - నిలిపెను.

ఆయన చేతితో స్పృశించుట తోడనే ప్రహ్లాదుని అశుభవాసనల న్నియు కడిగివేయబడి, ఆతనికి వెంటనే పరమాత్మ సాక్షాత్కారము (బ్ర హ్మజ్ఞానము) కలిగెను. మహానందమును పొందిన ఆతని శరీరము గగు ర్పాటును పొందెను. ప్రేమతో ఆర్ద్రమైన హృదయము గల ఆతని కన్నుల లో ఆనందబాష్పములు నిండెను. ఆతడు ఆయన పాదపద్మమును హృద యములో ఏకాగ్రముగా ధ్యానించెను.

అస్తౌషీద్ధరిమేకాగ్రమనసా సుసమాహితః ।
ప్రేమగద్గదయా వాచా తన్న్యస్తహృదయేక్షణః ।। 7

సుసమాహితః - మిక్కిలి సమాహితమైన అంతఃకరణము గలవా డు, తత్-న్యస్తహృదయ-ఈక్షణః - ఆయనపై నిలుపబడిన హృదయము కన్నులు గలవాడు అగు ప్రహ్లాదుడు, ఏకాగ్రమనసా - ఏకాగ్రమగు మన స్సుతో, ప్రేమగద్గదయా - ప్రేమతో గద్గదమైన, వాచా - వాక్కుతో, హరిమ్ - శ్రీహరిని, అస్తౌషీత్ - స్తుతించెను.

మిక్కిలి సమాహితమైన అంతఃకరణము గల ప్రహ్లాదుడు తన హృదయమును నరసింహునిపై నిలిపి కన్నులతో ఆయనను మాత్రమే చూచుచుండెను. ఆయన ఏకాగ్రమైన మనస్సుతో మరియు ప్రేమతో గద్గద మైన వాక్కుతో శ్రీహరిని స్తుతించెను.

ప్రహ్లాద ఉవాచ ।
బ్రహ్మాదయస్సురగణా మునయోఽథ సిద్ధాః
సత్త్వైకతానమతయో వచసాం ప్రవాహైః ।
నారాధితుం పురుగుణైరధునాపి పిప్రుః
కిం తోష్టుమర్హతి స మే హరిరుగ్రజాతేః ।। 8

బ్రహ్మ-ఆదయః - బ్రహ్మగారు మొదలైన, సురగణాః - దేవతాగ ణములు, మునయః - మునులు, అథ - మరియు, సిద్ధాః - సిద్ధులు, సత్త్వ-ఏకతానమతయః - సత్త్వగుణమునందు స్థిరముగా నిలిచే అంతఃకర ణములు గలవారు, పురుగుణైః - గొప్ప లక్షణములు గల, వచసామ్ -

వాక్కులయొక్క, ప్రవాహైః - ప్రవాహములతో, ఆరాధితుమ్ - ఆరాధించు టకు, అధునా అపి - ఇప్పటికి కూడ, న పిప్రుః - పూర్ణులు కాలేదు, సః - అట్టి, హరిః - శ్రీహరి, ఉగ్రజాతేః - క్రూరమైన జన్మ గల, మే - నాకు, తోష్టుమ్ - ప్రీతిని పొందుటకు, కిం అర్హతి - అర్హుడగునా?

బ్రహ్మగారు మొదలగు దేవతాగణములు, మహర్షులు మరియు సిద్ధపురుషులు కేవలము సత్త్వగుణప్రధానమైన అంతఃకరణము గలవారే. కాని, వారు ఈనాటి వరకు అధికమగు గుణములు గల తమ ప్రవాహరూప మగు వాక్కులతో శ్రీహరిని ఆరాధించుట (స్తుతించుట) కు పూర్ణముగా సమర్థులు కాలేకపోయిరి. క్రూరమగు రాక్షసజాతిలో జన్మించిన నాకు ఆయనను ప్రసన్నుని చేసుకొనే యోగ్యత గలదా?

మన్యే ధనాభిజనరూపతపశ్శ్రుతౌజ-
స్తేజఃప్రభావబలపౌరుషబుద్ధియోగాః ।
నారాధనాయ హి భవంతి పరస్య పుంసో
భక్త్యా తుతోష భగవాన్ గజయూథపాయ ॥ 9

ధన-అభిజనరూపతపః-శ్రుత-ఓజః-తేజఃప్రభావబలపౌరుషబు ద్ధియోగాః - సంపద మంచి వంశములో జన్మ అందము తపస్సు పాండి త్యము ఇంద్రియపాటవము వర్చస్సు సామర్థ్యము శరీరబలము ఉద్యమ శక్తి బుద్ధిశక్తి యోగసాధనలు, పరస్య పుంసః - పురుషోత్తముని, ఆరాధ నాయ - ఆరాధన కొరకు, న హి భవంతి - సమర్థములు కానే కావని, మన్యే - తలచుచున్నాను, భగవాన్ - భగవానుడు, భక్త్యా - భక్తిచే, గజ యూథపాయ - గజేంద్రుని కొరకు, తుతోష - ప్రసన్నుడాయెను.

సంపద, మంచి వంశములో జన్మించుట, అందము, తపస్సు, పాండిత్యము, ఇంద్రియపాటవము, వర్చస్సు, సామర్థ్యము, శరీరబలము, ఉద్యమశక్తి, బుద్ధిశక్తి మరియు యోగసాధనలు అనేవి పురుషోత్తముని ప్రస న్నుని చేసుకొనుటకు సమర్థములు కానే కావని నా అభిప్రాయము. ఎందు కంటే, భగవానుడు భక్తిచే గజేంద్రుని యెడల కూడ ప్రసన్నుడైనాడు.

విప్రాద్ద్విషడ్గుణయుతాదరవిందనాభ-
పాదారవిందవిముఖాచ్ఛ్వపచం వరిష్ఠమ్ ।
మన్యే తదర్పితమనోవచనేహితార్థ-
ప్రాణం పునాతి స కులం న తు భూరిమానః ॥ 10

ద్విషడ్-గుణయుతాత్ - పన్నెండు గుణములతో కూడియున్నట్టియు, అరవిందనాభపాద-అరవిందవిముఖాత్ - పద్మనాభుని పాదపద్మములనుండి విముఖుడైన, విప్రాత్ - వేదవేత్తకంటె, తద్-అర్పితమనః-వచన-ఈహిత-అర్థప్రాణమ్ - ఆయనయందు అర్పించబడిన మనస్సు వాక్కు చేష్ట సంపద జీవనము గల, శ్వపచమ్ - కసాయివానిని, వరిష్ఠమ్ - శ్రేష్ఠునిగా, మన్యే - తలంచెదను, సః - అట్టివాడు, కులమ్ - కులమును, పునాతి - పావనము చేయును, భూరిమానః తు - పెద్ద గర్వము గలవాడైతే, న - కాదు.

పన్నెండు గుణములు (జ్ఞానము, సత్యము, ఇంద్రియనిగ్రహము, పాండిత్యము, మాత్సర్యము లేకుండుట, వినయము, సుఖదుఃఖముల యెడల సహనము, ఇతరులలో దోషములను వెదుకకుండుట, యజ్ఞము, దానము, మనోధైర్యము, మనోనిగ్రహము అనేవి -- లేదా, పై శ్లోకములో చెప్పినవి) ఉన్ననూ, పద్మనాభుని పాదపద్మములపై భక్తిలేని వ్యక్తి వేదవేత్తయే అయిననూ --- ఆయనకే మనస్సును, వాక్కును, చేష్టను, సంపదను, జీవనమును కూడ అర్పించివేసిన కసాయివాడు ఆ వేదవేత్తకంటె శ్రేష్ఠుడు. అట్టి భక్తుడు తాను పుట్టిన కులమును పావనము చేయగా, పెద్ద గర్వము గల ఇతరుడు (వేదవేత్త) అట్టి పావనుడు కాబోడు.

నైవాత్మనః ప్రభురయం నిజలాభపూర్ణో
మానం జనాదవిదుషః కరుణో వృణీతే ।
యద్యజ్జనో భగవతే విదధీత మానం
తచ్చాత్మనే ప్రతిముఖస్య యథా ముఖశ్రీః ॥ 11

నిజలాభపూర్ణః - తన ఆనందస్వరూపమునందు నిలిచియుండుట చేతనే పరిపూర్ణుడైనవాడు, కరుణః - దయాళువు అగు, అయమ్ - ఈ,

ప్రభుః - భగవానుడు, అవిదుషః - అజ్ఞానియగు, జనాత్ - జనునినుండి, మానమ్ - పూజను, ఆత్మనః - తనకు, న ఏవ వృణీతే - స్వీకరించుటనే లేదు, జనః - మానవుడు, భగవతే - భగవానుని కొరకు, యత్ యత్ - ఏయే, మానమ్ - పూజను, విదధీత - చేయునో, తత్ చ - అయ్యది, ముఖశ్రీః - ముఖముయొక్క శోభ, ప్రతిముఖస్య యథా - ముఖము యొక్క ప్రతిబింబమునకు వలె, ఆత్మనే - తన కొరకే.

తన ఆనందస్వరూపమునందు నిలిచియుండుట చేతనే భగవానుడు పరిపూర్ణుడు. ఆయనకు జనులు చేసే పూజాదికముతో తనకొరకై పొందదగినది ఏదీ లేదు. కాని, ఆయన దయామయుడగుటచే జనుల పూజాదికమును స్వీకరించుచున్నాడు. మానవుడు భగవానునకు ఏయే పూజాదికమును సమర్పిస్తాడో, దానిని తన కొరకే సమర్పించుకొనుచున్నాడు. ఇది యెల్లాగంటే, ముఖమునకు చేసుకున్న అలంకారము ఫలించేది అద్దములోని ప్రతిబింబమునందు మాత్రమే గదా!

తస్మాదహం విగతవిక్లబ ఈశ్వరస్య
సర్వాత్మనా మహి గృణామి యథామనీషమ్ ।
నీచోఽజయా గుణవిసర్గమనుప్రవిష్టః
పూయేత యేన హి పుమాననువర్ణితేన ।। 12

తస్మాత్ - అందువలన, నీచః - అల్పుడనగు, అహమ్ - నేను, విగతవిక్లబః - తొలగిన కలవరము గలవాడనై, సర్వ-ఆత్మనా - పూర్ణప్రయత్నముచే, ఈశ్వరస్య - ఈశ్వరుని, మహి - మహిమను, యథామనీషమ్ - నా బుద్ధికి తగ్గట్లుగా, గృణామి - చెప్పెదను, హి - ఏలయనగా, యేన - ఏది, అనువర్ణితేన - వర్ణించబడుటచే, అజయా - అనాదియగు అవిద్యచే, గుణవిసర్గమ్ - సత్త్వరజస్తమోగుణముల కార్యమగు దేహమును (సంసారమును), అనుప్రవిష్టః - ప్రవేశించియున్న, పుమాన్ - పురుషుడు, పూయేత - పవిత్రుడగునో.

కావున, నేను అల్పుడననే కలవరమును విడిచిపెట్టి పూర్ణప్రయత్నముతో ఈశ్వరుని మహిమను నా బుద్ధిశక్తికి తగ్గట్లుగా వర్ణించి చెప్పెద

ను. ఎందుకంటే, భగవానుని మహిమను వర్ణించుటచే, అనాదియగు అవిద్యచే సత్త్వరజస్తమోగుణముల కార్యమగు ఈ దేహమునందు నేను-నాది అనే అభిమానముతో తగుల్కొని సంసారములో పడియున్న పురుషుడు పవిత్రుడగును.

సర్వే హ్యమీ విధికరాస్తవ సత్త్వధామ్నో
బ్రహ్మాదయో వయమివేశ న చోద్విజంతః ।
క్షేమాయ భూతయ ఉతాత్మసుఖాయ చాస్య
విక్రీడితం భగవతో రుచిరావతారైః ॥ 13

ఈశ - ఓ ఈశ్వరా!, ఉద్విజంతః - భయపడే, అమీ - ఈ, బ్రహ్మ -ఆదయః - బ్రహ్మగారు మొదలైన, సర్వే - అందరు, సత్త్వధామ్నః - సత్త్వగుణనిధానమగు, తవ - నీకు, విధికరాః - కింకరులు, వయం ఇవ - మావంటివారు, న చ - కానే కాదు, భగవతః - భగవానుడవగు నీయొక్క, రుచిర-అవతారైః - సుందరమగు అవతారములతో, విక్రీడితమ్ - వివిధమగు క్రీడ, అస్య - ఈ జగత్తుయొక్క, క్షేమాయ - క్షేమము కొరకు, భూతయే - సమృద్ధి కొరకు, ఉత చ - మరియు, ఆత్మసుఖాయ - ఆత్మానందము కొరకు.

ఓ ఈశ్వరా! నీవు సత్త్వగుణమునకు నిధానమవు (కోపము రజోగుణ లక్షణమని అభిప్రాయము). భయపడుచున్న బ్రహ్మగారు మొదలైన వీరందరు నీ కింకరులే. వీరు మా రాక్షసులవంటి వారు కారు (అనగా, కోపము అవశ్యకము కాదు). భగవానుడవగు నీవు మనోహరములైన అవతారముల ద్వారా వివిధములైన లీలలను ప్రకటించెదవు. వాటి వలన ఈ జగత్తులోని ప్రాణులకు క్షేమము, సమృద్ధులు మాత్రమే గాక, ఆత్మానందము కూడ సంపన్నమగును.

తద్యచ్ఛ మన్యుమసురశ్చ హతస్త్వయాద్య
మోదేత సాధురపి వృశ్చికసర్పహత్యా ।
లోకాశ్చ నిర్వృతిమితాః ప్రతియంతి సర్వే
రూపం నృసింహ విభయాయ జనాస్స్మరంతి ॥ 14

**తత్** - అందువలన, మన్యుమ్ - కోపమును, యచ్ఛ - నియం త్రించుము, త్వయా - నీచే, అద్య - ఈనాడు, అసురః - రాక్షసుడు, హతః చ - సంహరించబడినాడు కూడా, వృశ్చికసర్పహత్యా - తేలును పామును చంపుటచే, సాధుః అపి - సత్పురుషుడు కూడ, మోదేత - సంతోషించు ను, నిర్వృతిమ్ - సుఖమును, ఇతాః - పొందిన, సర్వే - అన్ని, లోకాః చ - లోకములు కూడ, ప్రతియంతి - ప్రతీక్షించుచున్నవి, నృసింహ - ఓ నర సింహా!, జనాః - జనులు, విభయాయ - భయము పోవుట కొరకు, రూపమ్ - రూపమును, స్మరంతి - స్మరించెదరు.

ఓ నరసింహా! కావున, నీవు కోపమును నియంత్రించుము. నీవీ నాడు రాక్షసుని సంహరించితివి. తేలు, విషసర్పములను చంపినప్పుడు అహింసాపరాయణులైన సత్పురుషులు కూడ సంతోషిస్తారు. రాక్షసవధచే సుఖించిన సకలప్రాణులు నీవు ప్రసన్నుడవగుటకై వేచియున్నవి. జనులు భయమును పోగొట్టుకొనుటకై నీ ఈ రూపమును స్మరించెదరు.

నాహం బిభేమ్యజిత తేఽతిభయానకాస్య-
జిహ్వార్క నేత్రభ్రుకుటీరభసోగ్రదంష్ట్రాత్ ।
ఆంత్రస్రజః క్షతజకేసరశంకుకర్ణాత్
నిర్హ్రాదభీతదిగిభాదరిభిన్నఖాగ్రాత్ ।। 15

**అజిత** - పరాజయము నెరుగనివాడా!, అతిభయానక-ఆస్యజిహ్వా -అర్క నేత్రభ్రుకుటీరభస-ఉగ్రదంష్ట్రాత్ - మిక్కిలి భయమును గొల్పె నోరు నాలుక సూర్యునివంటి కళ్లు ముడివడిన కనుబొమలు కోపముతో క్రూరము గానున్న కోరలు కలిగినట్టియు, ఆంత్రస్రజః - ప్రేవులే మాలలుగా కలిగినట్టి యు, క్షతజకేసరశంకుకర్ణాత్ - రక్తపు జూలు బల్లెపు అగ్రములవంటి చెవులు కలిగినట్టియు, నిర్హ్రాదభీతదిగ్-ఇభాత్ - సింహనాదముచే భయప డిన దిగ్గజములు కలిగినట్టియు, అరిభిత్-నఖ-అగ్రాత్ - శత్రువును చీల్చివే సిన గోళ్ల కొనలు గల, తే - నీ వలన, అహమ్ - నేను, న బిభేమి - భయ పడను.

ఓ అపరాజితా! నోరు, నాలుక, సూర్యగోళములవంటి కన్నులు, కోపముతో ముడివడిన కనుబొమలు, క్రూరమైన కోరలు గల నీ ముఖము చాల భయమును గొల్పును. నీకు ప్రేవులే మాలలైనవి. రక్తముతో తడిసిన జూలు, బల్లెపు కొనలవంటి చెవులు గల నీవు చేసే సింహనాదమునకు దిగ్గజములు భయపడును. కాని, శత్రువును గోళ్ల కొనలతో చీల్చివేసిన నీ ఈ రూపమునకు నేను భయపడుట లేదు.

త్రస్తోఽస్మ్యహం కృపణవత్సల దుస్సహోగ్ర-
సంసారచక్రకదనాద్గ్రసతాం ప్రణీతః ।
బద్ధస్స్వకర్మభిరుశత్తమ తేఽంఘ్రిమూలం
ప్రీతోఽపవర్గశరణం హ్వయసే కదా ను ॥ 16

కృపణవత్సల - దీనులపై అధికమగు ప్రేమ గలవాడా!, స్వకర్మభిః - నా కర్మలచే, బద్ధః - బంధించబడినవాడనై, గ్రసతామ్ - హింసకుల మధ్యలో, ప్రణీతః - ఉంచబడిన, అహమ్ - నేను, దుస్సహ-ఉగ్రసంసారచక్రకదనాత్ - సహించ శక్యము కాని భయంకరమైన సంసారమునందలి భ్రమణముయొక్క దుఃఖము వలన, త్రస్తః - భయపడినవాడను, అస్మి - అగుచున్నాను, ఉశత్-తమ - దయాళువులలో శ్రేష్ఠుడా!, ప్రీతః - ప్రసన్నుడవైన నీవు, అపవర్గశరణమ్ - సంసారదుఃఖమును పోగొట్టి ఆశ్రయమయ్యే, తే - నీ, అంఘ్రిమూలమ్ - పాదముల మూలమును గురించి, కదా ను - ఎప్పుడు, హ్వయసే - ఆహ్వానించెదవు?

ఓ దేవా! నీకు దీనులపై ప్రేమ మెండు. నేను నా కర్మలచే బంధించబడి హింసను చేసే రాక్షసుల మధ్యలో ఉంచబడినాను (జన్మించినాను). అట్టి నేను సంసారములో భ్రమించుటలోని దుస్సహమైన దుఃఖము వలన మాత్రమే భయపడెదను. నీవు దయామయులలో ఉత్తముడవు. నీవు ప్రసన్నుడవై సంసారదుఃఖమును పోగొట్టి ఆశ్రయమయ్యే నీ పాదమూలము వద్దకు నన్ను ఎప్పుడు ఆహ్వానించెదవు?

యస్మాత్ప్రియాప్రియవియోగసయోగజన్మ-
శోకాగ్నినా సకలయోనిషు దహ్యమానః ।

దుఃఖౌషధం తదపి దుఃఖమతద్ధియాహం
భూమన్ భ్రమామి వద మే తవ దాస్యయోగమ్ ॥ 17

భూమన్ - ఓ అనంతుడా!, యస్మాత్ - ఎందువలనైతే, ప్రియ-అప్రియవియోగసయోగజన్మశోక-అగ్నినా - ఇష్టమైనవాటితోడి వియోగము ఇష్టము కానివాటితోడి సంయోగములనుండి పుట్టే శోకము అనే అగ్నిచే, సకలయోనిషు - అన్ని జన్మలయందు, దహ్యమానః - దహించబడుచున్న, అహమ్ - నేను, అతద్-ధియా - ఆత్మ కానిదానియందు ఆత్మభావముతో, భ్రమామి - తిరుగాడుచున్నానో, దుఃఖ-ఔషధమ్ - దుఃఖమునకు మందు అయిన, తత్ అపి - అది కూడ, దుఃఖమ్ - దుఃఖమో (అందువలన), తవ - నీయొక్క, దాస్యయోగమ్ - సేవ అనే మోక్షోపాయమును, వద - ఉపదేశించుము.

ఓ అనంతా! నేను అనేకజన్మలలో ఇష్టమైనదానిని కోల్పోయి, ఇష్టము కాని దానిని పొంది, నిప్పువంటి శోకముచే కాల్చివేయబడియున్నాను. పైగా, దుఃఖమును నివారించే ఉపాయము కూడ దుఃఖరూపమే అయి ఉన్నది. అనాత్మయందు ఆత్మతాదాత్మ్యము గలవాడనై సంసారములో తిరుగాడుచున్నాను. కావున, నాకు నీ సేవ అనే మోక్షోపాయమును ఉపదేశించుము.

సోఽహం ప్రియస్య సుహృదః పరదేవతాయా
లీలాకథాస్తవ నృసింహ విరించగీతాః ।
అంజస్తితర్మ్యనుగృణన్ గుణవిప్రముక్తో
దుర్గాణి తే పదయుగాలయహంససంగః ॥ 18

నృసింహ - ఓ నరసింహా!, తే - నీయొక్క, పదయుగ-ఆలయహంససంగః - పాదముల జంటయే నివాసస్థానముగా గల జ్ఞానులతోడి సంగము గల, సః - అట్టి, అహమ్ - నేను, ప్రియస్య - ప్రియుడవైనట్టియు, సుహృదః - హితకరుడవైనట్టియు, పరదేవతాయాః - పరమేశ్వరుడవగు, తవ - నీయొక్క, విరించగీతాః - బ్రహ్మగారిచే గానము చేయబడిన, లీలాకథాః - లీలల గాథలను, అనుగృణన్ - వర్ణించుచున్నవాడనై, గుణవి

ప్రముక్తః - గుణములనుండి విముక్తుడనై, దుర్గాణి - పెద్ద కష్టములను, అంజః - తేలికగా, తితర్మి - తరించెదను.

ఓ నరసింహా! ఆ విధముగా నిన్ను సేవించే నేను నీ పాదముల జంటనే నిరంతరముగా స్మరించే జ్ఞానులతోడి సంగమును నెరపుతూ, పరమేశ్వరుడవగు నీ లీలల గాథలను వర్ణించుచుందును. ప్రియుడవు (ఆత్మ రూపుడవు), హితకారివి అగు నీ గాథలను బ్రహ్మగారు కూడ గానము చేయుచుందును. ఆ విధముగా నేను సత్త్వరజస్తమోగుణములనుండి విముక్తుడనై పెద్ద కష్టములనైననూ సునాయాసముగా తరించెదను.

బాలస్య నేహ శరణం పితరౌ నృసింహ
నార్తస్య చాగదముదన్వతి మజ్జతో నౌః ।
తప్తస్య తత్ప్రతివిధిర్య ఇహాంజసేష్టః
తావద్విభో తనుభృతాం త్వదుపేక్షితానామ్ ॥ 19

నృసింహ - ఓ నరసింహా!, ఇహ - ఈ లోకమునందు, బాలస్య - పిల్లవానికి, శరణమ్ - రక్షకుడు, పితరౌ - తల్లిదండ్రులు, న - కారు, ఆర్తస్య - రోగికి, అగదం చ - మందు కూడ, న - కాదు, ఉదన్వతి - సముద్రమునందు, మజ్జతః - మునిగిపోవుచున్నవానికి, నౌః - నావ, న - కాదు, విభో - ఓ ప్రభూ!, తప్తస్య - తాపమును పొందువానికి, తత్-ప్రతివిధిః - దానికి ప్రతీకారము, యః - ఏదైతే, ఇహ - ఈ లోకములో, అంజసా - సాక్షాత్తుగా, ఇష్టః - అభిమతమో అది, త్వద్-ఉపేక్షితానామ్ - నీచే ఉపేక్ష చేయబడిన, తనుభృతామ్ - ప్రాణులకు, తావత్ - తాత్కాలికము.

ఓ నరసింహ ప్రభూ! ఈ లోకములో నీచే ఉపేక్షించబడిన ప్రాణులకు సర్వసమ్మతమైన దుఃఖనివారణోపాయము కూడ తాత్కాలికమే యగును గాని, ఆ దుఃఖమునకు శాశ్వతమగు పరిష్కారము కాబోదు. ఉదాహరణకు, పిల్లవానిని తల్లిదండ్రులు గాని, రోగము వచ్చినవానిని మందు గాని, సముద్రములో మునిగిపోవుచున్నవానిని నౌక గాని ఖచ్చితముగా రక్షించుననే విశ్వాసము లేదు.

యస్మిన్ యతో యర్హి యేన చ యస్య యస్మాద్
యస్మై యథా యదుత యస్త్వపరః పరో వా ।
భావః కరోతి వికరోతి పృథక్ స్వభావః
సంచోదితస్తదఖిలం భవతస్స్వరూపమ్ ॥ 20

పృథక్-స్వభావః - వేర్వేరు స్వభావము గల, యః తు - ఎవడైతే, అపరః - తరువాతి కాలము వాడు (తక్కువవాడు) గాని, పరః వా - ప్రాచీనుడు (ఉత్కృష్టుడు) కాని, భావః - కర్త, యస్మిన్ - దేనియందు, యతః - దేనివలన, యర్హి - ఏ కాలమునందు, యేన చ - దేనిచే (ఎవనిచే), సంచోదితః - ప్రేరితుడై, యస్య - ఎవనియొక్క, యస్మాత్ - ఏ కారణముగా, యస్మై - ఎవని కొరకు, యత్ - దేనిని, యథా ఉత - ఏ ప్రకారముగా కూడ, కరోతి - చేయునో, వికరోతి - విక్రియను కలిగించునో, తత్ - ఆ, అఖిలమ్ - సర్వము, భవతః - నీయొక్క, స్వరూపమ్ - స్వరూపము.

మానవులు వేర్వేరు స్వభావములను కలిగియుందురు. వారిలో కొందరు ఆధునికులు కాగా, మరికొందరు ప్రాచీనులు; కొందరు గొప్పవారు కాగా, మరికొందరు తక్కువ స్థాయికి చెందినవారు కావచ్చును. ఇట్టి కర్తలు ఏయే ప్రదేశములయందు ఏయే సాధనములతో, ఏయే వ్యక్తులచే లేక పరిస్థితులచే ప్రేరితులై, ఏ కాలమునందు ఏ కారణముగా దేని కొరకు దేనికి సంబంధించిన దేనిని ఏ ప్రకారముగా ఉత్పన్నము చేయుదురో, లేక పదార్థములలో విక్రియను కలిగించెదరో, ఆ సర్వము నీ స్వరూపమే.

మాయా మనస్సృజతి కర్మమయం బలీయః
కాలేన చోదితగుణానుమతేన పుంసః ।
ఛందోమయం యదజయాఽర్పితషోడశారం
సంసారచక్రమజ కోఽతితరేత్త్వదన్యః ॥ 21

అజ - పుట్టుక లేనివాడా!, పుంసః - పురుషునియొక్క, అనుమతేన - అనుమతిచే, కాలేన - కాలముచే, చోదితగుణా - ప్రేరితమైన గుణములు గల, మాయా - మాయాశక్తి, కర్మమయమ్ - కర్మవాసనలతో నిండియున్నది, బలీయః - బలమైనది, ఛందోమయమ్ - వేదవిహితమగు

కర్మలే (కామనలే) ప్రధానముగా గలది, **అజయా** - అనాదియగు అవిద్య చే, **అర్పితషోడశ-అరమ్** - కల్పించబడిన పదునారు ఆకులు గల, **సంసారచక్రమ్** - సంసారమనే చక్రము అగు, **యత్** - ఏ, **మనః** - మనస్సు (మనఃప్రధానమగు లింగశరీరము) ను, **సృజతి** - సృష్టించునో (దానిని), **త్వద్-అన్యః** - నీతోడి భేదబుద్ధి గలవాడు, **కః** - ఎవడు, **అతితరేత్** - అతిక్రమించును?

అనాదియగు అవిద్య పదునారు (పది ఇంద్రియములు, పంచ ప్రాణములు, మనస్సు) ఆకుల సంసారము అనే చక్రమును కల్పించినది. మనస్సే ప్రధానముగా గల లింగశరీరమే ఇయ్యది. పురుషోత్తముని అనుమతిచే కాలప్రేరితమైన మాయాశక్తియందు సత్త్వరజస్తమోగుణములలో కలిగిన క్షోభచే కర్మవాసనారూపమగు ఈ లింగశరీరము సృష్టించబడినది. వేదోక్తమగు కామ్యకర్మలే ప్రధానముగా గల ఇట్టి కామనాపూర్ణమగు మనస్సును జయించుట చాల కష్టము. దానితో తాదాత్మ్యమును పొంది తనను పరమాత్మవగు నీకంటె భిన్నముగా తలపోయువాడు ఎవ్వాడు ఆ సంసార చక్రరూపమగు లింగశరీరమును అతిక్రమించగల్గును? (అతిక్రమించలేడు).

స త్వం హి నిత్యవిజితాత్మగుణస్స్వధామ్నా
కాలో వశీకృతవిసృజ్యవిసర్గశక్తిః ।
చక్రే విసృష్టమజయేశ్వర షోడశారే
నిష్పీడ్యమానముపకర్ష విభో ప్రపన్నమ్ ॥ 22

**ఈశ్వర** - ఓ ఈశ్వరా!, **విభో** - ఓ ప్రభూ!, **సః** - అట్టి, **త్వమ్** - నీవు, **స్వధామ్నా** - తన చిచ్ఛక్తిచే, **నిత్యవిజిత-ఆత్మగుణః** - సర్వకాలములలో జయించబడిన బుద్ధియొక్క గుణములు కలిగినవాడవు, **కాలః** - కాలస్వరూపుడవు, **వశీకృతవిసృజ్యవిసర్గశక్తిః హి** - వశము చేసుకొనబడిన కార్యముల మరియు కారణముల శక్తులు కలిగినవాడవు గదా!, **అజయా** - అనాదియగు అవిద్యచే, **షోడశ-అరే** - పదునారు ఆకులు గల, **చక్రే** - సంసారచక్రమునందు, **విసృష్టమ్** - పడవేయబడినట్టియు, **నిష్పీడ్యమానమ్** - పిప్పి చేయబడుచున్నట్టియు, **ప్రపన్నమ్** - శరణు పొందిన నన్ను, **ఉపకర్ష** - దగ్గరకు తీసుకొనుము.

ఓ ప్రభూ! సర్వేశ్వరుడవగు అట్టి నీవు చిచ్ఛక్తి స్వరూపుడవు. కావుననే, నీవు సర్వకాలములలో బుద్ధియందు ప్రకటమగుచున్ననూ, దాని గుణములైన సుఖదుఃఖమోహములు నిన్ను స్పృశించలేవు. కాలస్వరూపుడవగు నీవు జగత్తులోని సాధ్యసాధనముల (కార్యకారణముల) నన్నింటినీ నీ వశములో నుంచుకున్నావు. అనాదియగు అవిద్యచే కల్పించబడిన పదునారు ఆకులు గల ఈ సంసారచక్రములో పడి నేను నలిగిపోవుచున్నాను. నిన్ను శరణు పొందిన నన్ను నీ దగ్గరకు తీసుకొనుము.

దృష్టా మయా దివి విభోఽఖిలధిష్ణ్యపానా-
మాయుశ్శ్రియో విభవ ఇచ్ఛతి యాన్ జనోఽయమ్ ।
యేఽస్మత్పితుః కుపితహాసవిజృంభితభ్రూ-
విస్ఫూర్జితేన లులితాస్స తు తే నిరస్తః ।। 23

విభో - ఓ ప్రభూ!, దివి - స్వర్గమునందు, అఖిలధిష్ణ్యపానామ్ - సకలలోకపాలకులయొక్క, ఆయుః - ఆయుర్దాయము, శ్రియః - సంపదలు, విభవః - అధికారము, మయా - నాచే, దృష్టాః - చూడబడినవి, యాన్ - వేటిని, అయమ్ - ఈ, జనః - మానవుడు, ఇచ్ఛతి - కోరుచున్నాడో, యే - ఏవైతే, అస్మత్-పితుః - మా తండ్రియొక్క, కుపితహాసవిజృంభితభ్రూవిస్ఫూర్జితేన - కోపముతోడి నవ్వునందు వికృతము చేయబడిన కనుబొమల విరుపుచే, లులితాః - ధ్వస్తమైనవో, సః తు - ఆయన కూడ, తే - నీచే, నిరస్తః - సంహరించబడినవాడు.

ఓ ప్రభూ! స్వర్గములో లోకపాలకుల వద్ద ఉండే ఆయుర్దాయము, సంపదలు, అధికారములను నేను ఎరుగుదును. మానవుడు కోరేవి ఇవియే. మా తండ్రి కోపముతో అట్టహాసము చేసి కనుబొమలను విరిచి చూచినంత మాత్రాన లోకపాలకుల ఈ సంపదలన్నియు ధ్వస్తమైనవి. ఆ మా తండ్రిని కూడ నీవు సంహరించితివి.

తస్మాదమూస్తనుభృతామహమాశిషో జ్ఞ
ఆయుశ్శ్రియం విభవమైంద్రియమా విరించాత్ ।

నేచ్ఛామి తే విలులితానురువిక్రమేణ
కాలాత్మనోపనయ మాం నిజభృత్యపార్శ్వమ్ ।। 24

తస్మాత్ - అందువలన, తనుభృతామ్ - దేహధారులగు జీవుల యొక్క, అమూః - ఈ, ఆశిషః - భోగము (కామన) లను, ఆయుః - ఆయుర్దాయమును, శ్రియమ్ - సంపదను, విభవమ్ - అధికారమును, ఆ విరించాత్ - బ్రహ్మగారి వరకు ఉండే, ఐంద్రియమ్ - ఇంద్రియభోగమును, ఉరువిక్రమేణ - గొప్ప పరాక్రమము గలిగినట్టియు, కాల-ఆత్మనా - కాల స్వరూపుడవగు, తే - నీచే, విలులితాన్ - ధ్వస్తము చేయబడే సిద్ధులను, జ్ఞః - వివేకినగు, అహమ్ - నేను, న ఇచ్ఛామి - కోరుట లేదు, నిజభృత్య పార్శ్వమ్ - నీ సేవకుల సమీపమును, మామ్ - నన్ను, ఉపనయ - పొందించుము.

కావున, దేహధారులగు జీవులు కోరే ఈ భోగములను, ఆయుర్దా యమును, సంపదను, అధికారమును, బ్రహ్మగారితో సహా అంతవరకు ఉండే ఇంద్రియభోగములను మరియు సిద్ధులను, నిత్యానిత్యవస్తువివేకము గల నేను కోరుట లేదు. కాలస్వరూపుడవగు నీవు ఈ సర్వమును ధ్వస్తము చేసెదవు. నన్ను నీ సేవకుల సమీపమునకు గొనిపొమ్ము.

కుత్రాశిషశ్శ్రుతిసుఖా మృగతృష్ణిరూపాః
క్వేదం కలేవరమశేషరుజాం విరోహః ।
నిర్విద్యతే న తు జనో యదపీతి విద్వాన్
కామానలం మధులవైశ్శమయన్ దురాపైః ।। 25

శ్రుతిసుఖాః - వినుటకు ఇంపుగానుండునవి, మృగతృష్ణిరూపాః - ఎండమావులవంటివి అగు, ఆశిషః - భోగములు, కుత్ర - ఎక్కడ?, అశేష రుజామ్ - సకలములగు రోగములకు, విరోహః - పుట్టుక స్థానమగు, ఇదమ్ - ఈ, కలేవరమ్ - దేహము, క్వ - ఎక్కడ?, ఇతి - అని, జనః - మానవుడు, విద్వాన్ యత్ అపి - తెలిసినవాడే అయిననూ, దురాపైః - దుఃఖముతో పొందబడే, మధులవైః - తేనె తుంపరలతో, కామ-అనలమ్ -

కామము అనే అగ్నిని, శమయన్ - చల్లార్చుచున్నవాడై, న తు నిర్విద్యతే - సుతరాము వైరాగ్యమును పొందుటలేదు.

వినుటకు ఇంపుగా ఉండే ఎండమావులవంటి ఇంద్రియభోగములెక్కడ? సకలరోగములకు ఉద్భవస్థానమగు ఈ దేహమెక్కడ? ఈ విషయము మానవునకు తెలుస్తూనే ఉంటుంది. అయినా, మానవుడు దుఃఖముతో ఏవో కొన్ని అత్యల్పములగు తేనె తుంపరలవంటి భోగములను అతికష్టము మీద పొంది, వాటితో తన కోరికలు అనే అగ్నిని తాత్కాలికముగా చల్లార్చే ప్రయత్నమును చేయునే గాని, సుతరాము వైరాగ్యమును మాత్రము పొందుట లేదు.

క్వాహం రజఃప్రభవ ఈశ తమోఽధికేఽస్మిన్
జాతస్సురేతరకులే క్వ తవానుకంపా ।
న బ్రహ్మణో న తు భవస్య న వై రమాయా
యన్మేఽర్పితశ్శిరసి పద్మకరః ప్రసాదః ॥ 26

ఈశ - ఓ ఈశ్వరా!, రజఃప్రభవః - రజోగుణప్రధానమగు జన్మగలవాడను, అస్మిన్ - ఈ, తమః-అధికే - తమోగుణ ప్రధానమగు, సుర-ఇతరకులే - అసురుల వంశమునందు, జాతః - పుట్టినవాడను అగు, అహమ్ - నేను, క్వ - ఎక్కడ?, తవ - నీ, అనుకంపా - దయ, క్వ - ఎక్కడ?, ప్రసాదః - అనుగ్రహము, బ్రహ్మణః - బ్రహ్మగారికి, న - లేదు, భవస్య తు - రుద్రునకు కూడ, న - లేదు, రమాయాః - లక్ష్మీదేవికి, న వై - నిశ్చయముగా లేదు, యత్ - ఏలయనగా, మే - నాయొక్క, శిరసి - తలపై, పద్మకరః - పద్మమువంటి చేయి, అర్పితః - ఉంచబడినదో.

ఓ ఈశ్వరా! తమోగుణ ప్రధానమగు ఈ అసురుల వంశములో రజోగుణ ప్రధానమగు జన్మను పొందిన నేను ఎక్కడ? నీ దయ ఎక్కడ? ఎందుకంటే, నీవు నా తలపై పద్మమువంటి చేతిని ఉంచితివి. ఈ అనుగ్రహము బ్రహ్మగారికి గాని, రుద్రునకు గాని, లక్ష్మీదేవికైననూ నిశ్చయముగా లేదు.

నైషా పరావరమతిర్భవతో నను స్యాత్
జంతోర్యథాఽఽత్మసుహృదో జగతస్తథాపి ।
సంసేవయా సురతరోరివ తే ప్రసాదః
సేవానురూపముదయో న పరావరత్వమ్ ॥ 27

ఏషా - ఈ, పర-అవరమతిః - గొప్ప తక్కువ అనే బుద్ధి, యథా - ఏ విధముగా, జంతోః - జీవునకు గలదో, తథా - అదే విధముగా, జగతః - జగత్తునకు, ఆత్మసుహృదః - ఆత్మ మరియు హితకారియగు, భవతః - నీకు, న స్యాత్ అపి - ఉండనే ఉండదు, నను - నిశ్చయము, సురతరోః ఇవ - కల్పవృక్షమువంటి, తే - నీయొక్క, సంసేవయా - చక్కని సేవచే, ప్రసాదః - అనుగ్రహము, సేవా-అనురూపమ్ - సేవకు అనుగుణముగా, ఉదయః - ఫలము పుట్టుట, పర-అవరత్వమ్ - గొప్ప తక్కువ అనే భావము, న - లేదు.

వీరు గొప్ప, వారు తక్కువ అనే భేదబుద్ధి అజ్ఞానులగు జనులకు మాత్రమే ఉండును. నీవు జగత్తునకు ఆత్మవు, హితకారివి. నీయందు అట్టి భేదబుద్ధి నిశ్చయముగా లేనే లేదు. కల్పవృక్షమువంటి నిన్ను చక్కగా సేవించువారలకు నీ అనుగ్రహము కలుగును. ఆ నీ అనుగ్రహము వారి సేవకు అనురూపముగా నుండును. అంతేగాని, ఫలము లభించుటకు వ్యక్తులలోని ఎక్కువ-తక్కువలు హేతువు కాదు.

ఏవం జనం నిపతితం ప్రభవాహికూపే
కామాభికామమను యః ప్రపతన్ ప్రసంగాత్ ।
కృత్వాఽఽత్మసాత్సురర్షిణా భగవన్ గృహీతః
సోఽహం కథం ను విసృజే తవ భృత్యసేవామ్ ॥ 28

భగవన్ - ఓ భగవానుడా!, ఏవమ్ - ఈ విధముగా, ప్రభవ-అహి కూపే - బలీయమైన సంసారమనే పాముతో కూడియున్న నూతియందు, నిపతితమ్ - పడియున్నట్టియు, కామ-అభికామమ్ - ఇంద్రియభోగము లను నిరంతరముగా కోరుచున్న, జనమ్ - మానవుని, అను - అనుసరించి, ప్రసంగాత్ - తీవ్రమగు ఆసక్తి వలన, ప్రపతన్ - నిశ్చయముగా పడిపో

వృచున్న, యః - ఏ, అహమ్ - నేను, సుర-ఋషిణా - దేవర్షియగు నార దునిచే, ఆత్మసాత్ కృత్వా - తనవానినిగా చేసుకొని, గృహీతః - పట్టుకొన బడితినో, సః - అట్టి నేను, తవ - నీయొక్క, భృత్యసేవామ్ - సేవకుల సేవను, కథం ను - ఏ విధముగా, విసృజే - విడిచిపెట్టెదను?

ఓ భగవానుడా! మానవుడు నిరంతరముగా విషయభోగములను కోరుతూ సంసారమనే నూతిలో కూరుకొనిపోవును. ఆ నూతిలో కాలమనే సర్పము గలదు. అట్టి జనుని వెనుకబడి తీవ్రమగు భోగాసక్తితో ఆ నూతిలో పడిపోవలసిన నన్ను దేవర్షియగు నారదుడు తనవానినిగా స్వీకరించి అను గ్రహించినాడు (పడిపోకుండా కాపాడినాడు). అట్టి నేను నీ సేవకుల సేవను ఎట్లు విడిచిపెట్టగలను? (విడిచిపెట్ట లేను).

మత్ప్రాణరక్షణమనంత పితుర్వధశ్చ
మన్యే స్వభృత్యఋషివాక్యమృతం విధాతుమ్ ।
ఖడ్గం ప్రగృహ్య యదవోచదసద్విధిత్సుః
త్వామీశ్వరో మదపరోఽవతు కం హరామి ॥ 29

అనంత - ఓ అనంతుడా!, మత్-ప్రాణరక్షణమ్ - నా ప్రాణము లను రక్షించుట, పితుః - తండ్రియొక్క, వధః చ - సంహారము కూడ, స్వభృత్యఋషివాక్యమ్ - నీ సేవకుడైన నారదమహర్షియొక్క వాక్యము ను, ఋతమ్ - సత్యమును, విధాతుమ్ - చేయుటకని, మన్యే - తలంచెద ను, యత్ - ఎందువలననగా, అసత్ - అయోగ్యమగు పనిని, విధిత్సుః - చేయగోరువాడై, ఖడ్గమ్ - కత్తిని, ప్రగృహ్య - పట్టుకొని, అవోచత్ - పలికె ను, మద్-అపరః - నాకంటె మరియొకడు, ఈశ్వరః - ప్రభుడు, త్వామ్ - నిన్ను, అవతు - రక్షించుగాక!, కమ్ - తలను, హరామి - ఊడగొట్టెదను.

ఓ అనంతా! నీవు నీ సేవకుడగు నారదమహర్షి పలుకులను యథార్థము చేయుటకై నా తండ్రియగు హిరణ్యకశిపుని వధించి నా ప్రాణ ములను కాపాడితివని నేను తలంచెదను. ఎందుకంటే, నా తండ్రి నన్ను చంపుట అనే తప్పు పనిని చేయ గోరి కత్తిని చేతబట్టి ఇట్లు పలికెను --

నాకంటె మరియొక ప్రభుడు ఉన్నచో, నిన్ను కాపాడుగాక! నేను నీ తలను నరుకుచున్నాను. (అట్టి స్థితిలో నీవు నన్ను రక్షించితివి).

ఏకస్త్వమేవ జగదేతదముష్య యత్త్వ-
మాద్యంతయోః పృథగవస్యసి మధ్యతశ్చ ।
సృష్ట్వా గుణవ్యతికరం నిజమాయయేదం
నానేవ తైరవసితస్తదనుప్రవిష్టః ।। 30

ఏతత్ - ఈ, జగత్ - జగత్తు, ఏకః - రెండవది లేని, త్వం ఏవ - నీవు మాత్రమే, యత్ - ఏలయనగా, అముష్య - దీనియొక్క, ఆది-అంతయోః - ఆది అంతములయందు, త్వమ్ - నీవు, పృథక్ - వేరుగా, అవస్యసి - అవధిగా ఉండెదవు, మధ్యతః చ - మధ్యలో కూడ (నీవే), నిజమాయయా - నీ మాయాశక్తిచే, గుణవ్యతికరమ్ - సత్త్వరజస్తమోగుణముల పరిణామమైన, ఇదమ్ - ఈ జగత్తును, సృష్ట్వా - సృష్టించి, తత్ - దానిని, అనుప్రవిష్టః - తరువాత ప్రవేశించినవాడవై, తైః - వాటిచే, నానా ఇవ - అనేకమా యన్నట్లు, అవసితః - భాసించువాడవు.

ఈ జగత్తు నీవే. నీవు తప్ప రెండవది లేదు. ఏలయనగా, ఈ జగత్తునకు కారణము నీవే; ఈ జగత్తు విలీనమయ్యేది నీవే; జగత్తును నిలబెట్టేది కూడ నీవే. కాని, నీవు జగత్తుకంటె విలక్షణమైనవాడవు. సత్త్వరజస్తమోగుణముల పరిణామమగు ఈ జగత్తును నీవు నీ మాయాశక్తిచే సృష్టించి, దానిలో నీవే (సత్తాస్ఫూర్తుల రూపముగా) ప్రవేశించి, ఆ గుణముల కారణముగా నీవే అనేకమా యన్నట్లుగా భాసించుచున్నావు.

త్వం వా ఇదం సదసదీశ భవాంస్తతోఽన్యో
మాయా యదాత్మపరబుద్ధిరియం హ్యపార్థా ।
యద్యస్య జన్మ నిధనం స్థితిరీక్షణం చ
తద్వై తదేవ వసుకాలవదుష్టితర్వోః ।। 31

ఈశ - ఓ ఈశ్వరా!, సద్-అసత్ - కార్యకారణరూపమగు, ఇదమ్ - ఈ జగత్తు, త్వం వై - నిశ్చయముగా నీవే, భవాన్ - నీవు, తతః - దాని

కంటె, అన్యః - విలక్షణుడవు, ఇయమ్ - ఈ, ఆత్మపరబుద్ధిః - నావాడు పరాయివాడు అనే బుద్ధి, అప-అర్థా - యథార్థము కానిది, మాయా - అజ్ఞానము, యత్ - ఏలయనగా, యస్య - దేనియొక్క, జన్మ - పుట్టుక, నిధనమ్ - విలీనమయ్యే అధిష్ఠానము, స్థితిః - నిలకడకు అధిష్ఠానము, ఈక్షణం చ - ప్రకాశము కూడ, యత్ - దేనివలననో, తత్ - అది, ఉష్టి తర్వోః - ఉషఃకాలమునకు చెట్టునకు, వసుకాలవత్ - పృథివి కాలములు వలె, వై - నిశ్చయముగా, తత్ ఏవ - అదియే.

ఓ ఈశ్వరా! ఈ కార్యకారణరూపమగు జగత్తు నిశ్చయముగా నీవే. కాని, నీవు జగత్తుకంటె విలక్షణుడవు (జగత్తులోని గుణదోషములు జగత్కారణమగు పరబ్రహ్మను స్పృశించవు). నావాడు, పరాయివాడు అనే ఈ అజ్ఞానకల్పితమైన భేదబుద్ధి యథార్థము కాదు. ఎందుకంటే, ఎయ్యది దేనినుండి పుట్టి, దేనియందు మనుగడను సాగించి, దేనియందు ప్రకాశించి, దేనియందు విలీనమగునో, అది దానికంటె భిన్నముగా నుండదు. ఉదాహరణకు, పృథివీవికారమగు చెట్టు పృథివికంటె భిన్నముగా లేదు. కాలము యొక్క వికారమైన ఉషస్సు కాలముకంటె భిన్నము కాదు.

న్యస్యేదమాత్మని జగద్విలయాంబుమధ్యే
శేషేఽత్మనా నిజసుఖానుభవో నిరీహః ।
యోగేన మీలితదృగాత్మనిపీతనిద్రః
తుర్యే స్థితో న తు తమో న గుణాంశ్చ యుంక్షే ।। 32

నిజసుఖ-అనుభవః - ఆత్మానందస్వరూపుడవు, నిరీహః - చేష్ట లేనివాడవు అగు నీవు, ఇదమ్ - ఈ, జగత్ - జగత్తును, ఆత్మనా - నీచే, ఆత్మని - నీయందు, న్యస్య - ఉంచుకొని, విలయ-అంబుమధ్యే - ప్రళయజలముల మధ్యయందు, శేషే - పరుండెదవు, యోగేన - స్వరూపమును అనుసంధానము చేయుటచే, మీలితదృక్ - మూయబడిన కన్నులు గలవాడవు, ఆత్మనిపీతనిద్రః - తన స్వరూపముచే త్రోసివేయబడిన నిద్ర గలవాడవు, తుర్యే - నాల్గవదియగు స్వరూపమునందు, స్థితః - నిలిచి యున్నవాడవు, తమః - తమస్సును, న తు యుంక్షే - సంయోగమును

పొందుటలేదు, గుణాన్ చ - విషయములను కూడ, న యుంక్షే - సంయో గమును పొందుట లేదు.

ఆత్మానందస్వరూపుడవు, నిష్క్రియుడవు అగు నీవు ఈ జగత్తును నీచేతనే నీయందే విలీనము చేసుకొని ప్రళయకాలమునందలి జలముల మధ్యలో పరుండెదవు. నీవు నీ స్వరూపమగు చైతన్యముచేతనే నిద్ర (తమోగుణము) ను నిరసించి కళ్లను మూసుకొని స్వస్వరూపమును అనుసంధానము చేసెదవు. ప్రాణులలో ఆత్మరూపుడవైన నీకు నిద్రావస్థయందలి అజ్ఞానముతో గాని, జాగ్రత్తు-స్వప్నము అనే అవస్థలయందలి విషయానుభవములతో గాని సంగము లేదు. ఆ అవస్థలను ప్రకాశింపజేస్తూనే నీవు తురీయము (నాల్గవది, వాటికి అతీతము) అగు శుద్ధచైతన్య-ఆత్మవై విలసిల్లెదవు.

తస్యైవ తే వపురిదం నిజకాలశక్త్యా
సంచోదితప్రకృతిధర్మణ ఆత్మగూఢమ్ ।
అంభస్యనంతశయనాద్విరమత్సమాధేః
నాభేరభూత్స్వకణికావటవన్మహాబ్జమ్ ॥ 33

తస్య - అట్టి, తే - నీయొక్క, ఇదమ్ - ఈ, ఆత్మగూఢమ్ - నీయందే విలీనమై యున్న, వపుః ఏవ - జగద్రూపమైన దేహమే, నిజకాలశక్త్యా - నీ కాలరూపమైన శక్తిచే, సంచోదితప్రకృతిధర్మణః - ప్రేరితమైన మాయాశక్తియొక్క గుణములు కలిగినట్టియు, అనంతశయనాత్ - అనంతుడనే శయ్యనుండి, విరమత్-సమాధేః - తొలగిపోవుచున్న యోగనిద్ర గల నీయొక్క, నాభేః - నాభినుండి, అంభసి - ప్రళయజలమునందు, మహా -అబ్జమ్ - పెద్ద పద్మము, స్వకణికావటవత్ - తన చిన్న విత్తునుండి మర్రి చెట్టువలె, అభూత్ - ఉదయించెను.

ఈ జగత్తు నీ శరీరమే. ప్రళయకాలమునందు అది ప్రళయజలములలో శయనించియున్న నీయందే విలీనమైయుండెను. నీయొక్క కాలరూపమైన శక్తిచే ప్రేరితమై మాయాశక్తియందలి సత్త్వరజస్తమోగుణములలో సంక్షోభము కలిగెను. అప్పుడు నీవు అనంతుడు అనే శయ్యనుండి యోగ

నిద్రను విరమించి లేచితివి. అప్పుడు ఆ ప్రళయజలమునందు నీ నాభి నుండి ఈ జగత్తు పెద్ద పద్మము రూపముగా, సూక్ష్మమగు విత్తునుండి పెద్ద మర్రి చెట్టు వలె, ఆవిర్భవించెను.

తత్సంభవః కవిరతోఽన్యదపశ్యమానః
త్వాం బీజమాత్మని తతం స్వబహిర్విచింత్య ।
నావిందదబ్దశతమప్సు నిమజ్జమానో
జాతేఽంకురే కథము హోపలభేత బీజమ్ ॥ 34

తత్-సంభవః - ఆ పద్మమునుండి పుట్టిన, కవిః - సూక్ష్మదర్శి యగు బ్రహ్మగారు, అతః - దానికంటె, అన్యత్ - ఇతరమును, అపశ్య మానః - కానరానివాడై, బీజమ్ - తనకు కారణమైనట్టియు, ఆత్మని - తన యందు, తతమ్ - వ్యాపించియున్న, త్వామ్ - నిన్ను, స్వబహిః - తనకు బయట, విచింత్య - తలపోసి, అబ్దశతమ్ - వంద సంవత్సరములు, అప్సు - జలములయందు, నిమజ్జమానః - మునుగుచున్నవాడై, న అవిందత్ - కనుగొనలేదు, అంకురే - అంకురము, జాతే - పుట్టగా, బీజమ్ - విత్తును, కథం ఉ హ - ఏ విధముగా, ఉపలభేత - కనుగొనును?

ఆ పద్మమునుండి సూక్ష్మదర్శియగు బ్రహ్మగారు ఆవిర్భవించె ను. ఆయనకు ఆ పద్మముకంటె మరియొకటి ఏదీ కానరాలేదు. తనకు కార ణమై తనయందు వ్యాపించియే యున్న నిన్ను ఆయన బయట వెదుకజొ చ్చెను. ఆయన ప్రళయజలములలో మునిగి వంద సంవత్సరములు నీ కొరకు వెదికిననూ, నీవు ఆయనకు కానరాలేదు. ఇది యుక్తియుక్తమే. ఎందుకంటే, అంకురము పుట్టిన తరువాత విత్తు దానికి బయట వేరుగా ఎట్లు కానవచ్చును? (కానరాదు).

స త్వాత్మయోనిరతివిస్మిత ఆస్థితోఽబ్జం
కాలేన తీవ్రతపసా పరిశుద్ధభావః ।
త్వామాత్మనీశ భువి గంధమివాతిసూక్ష్మం
భూతేంద్రియాశయమయే వితతం దదర్శ ॥ 35

ఈశ - ఓ ఈశ్వరా!, సః - ఆ, ఆత్మయోనిః తు - స్వయంభువు డగు బ్రహ్మగారైతే, అతివిస్మితః - మిక్కిలి ఆశ్చర్యమును పొందినవాడై, అబ్జమ్ - పద్మమును, ఆస్థితః - ఆశ్రయించినవాడై, కాలేన - కాలముచే, తీవ్రతపసా - కఠినమగు తపస్సుచే, పరిశుద్ధభావః - పరిశుద్ధమైన అంతఃక రణము గలవాడై, అతిసూక్ష్మమ్ - సూక్ష్మాతిసూక్ష్ముడవగు, త్వామ్ - నిన్ను, భువి - భూమియందు, అతిసూక్ష్మమ్ - మిక్కిలి సూక్ష్మమగు, గంధం ఇవ - గంధమును వలె, భూత-ఇంద్రియ-ఆశయమయే - పంచ భూతములు ఇంద్రియములు అంతఃకరణముల సంఘాతమైన, ఆత్మని - తనయందు, వితతమ్ - వ్యాపించియున్నవానినిగా, దదర్శ - కనుగొనెను.

ఓ ఈశ్వరా! అపుడా స్వయంభువుడగు బ్రహ్మగారు చాల విస్మితు డై, అదే పద్మమునాశ్రయించి కొంతకాలము తీవ్రమగు తపస్సును చేయ గా, ఆయన అంతఃకరణము పరిశుద్ధమాయెను. సూక్ష్మాతిసూక్ష్ముడవగు నీవు, భూమియందు మిక్కిలి సూక్ష్మమగు గంధము వలె, సర్వమునందు సత్తారూపముగా వ్యాపించియున్నావు. అట్టి నిన్ను ఆయన పంచభూతము లు, కర్మజ్ఞానేంద్రియములు, అంతఃకరణముల సంఘాతమైన తనయందే సత్తారూపముగా వ్యాపించియున్నవానినిగా కనుగొనెను.

ఏవం సహస్రవదనాంఘ్రిశిరఃకరోరు-
నాసాస్యకర్ణనయనాభరణాయుధాఢ్యమ్ ।
మాయామయం సదుపలక్షితసన్నివేశం
దృష్ట్వా మహాపురుషమాప ముదం విరించః ॥ 36

ఏవమ్ - ఈ విధముగా, సహస్రవదన-అంఘ్రిశిరఃకర-ఊరునాసా-ఆస్యకర్ణనయన-ఆభరణ-ఆయుధ-ఆఢ్యమ్ - అనంతములగు ముఖములు పాదములు తలలు చేతులు తొడలు ముక్కులు నోళ్లు చెవులు కళ్లు ఆభర ణములు మరియు ఆయుధములతో సంపన్నమైనట్టియు, మాయామ యమ్ - మాయాశక్తిచే స్వీకరించబడిన విశ్వరూపము కలిగినట్టియు, సద్-ఉపలక్షితసన్నివేశమ్ - కార్యజగత్తుచే నిర్ధారించబడే అవయవరచన కలిగి న, మహాపురుషమ్ - గొప్ప పురుషుని, దృష్ట్వా - చూచి, విరించః - బ్రహ్మగారు, ముదమ్ - ఆనందమును, ఆప - పొందెను.

ఈ విధముగా తపస్సును చేసి బ్రహ్మగారు -- పరబ్రహ్మయే తన మాయాశక్తిచే గొప్ప విరాట్పురుషుని రూపములో ప్రకటము కాగా -- ఆ మహారూపమును దర్శించి ఆనందమును పొందెను. ఆ పురుషుడు అనంతములగు ముఖములు, పాదములు, తలలు, చేతులు, తొడలు, ముక్కులు, నోళ్లు, చెవులు, కళ్లు, ఆభరణములు మరియు ఆయుధము లతో సమృద్ధుడై యుండెను. కార్యజగత్తులోని వివిధలోకములే ఆ పురుషుని వివిధములైన అవయవములకు సూచకములై యుండెను.

తస్మై భవాన్ హయశిరస్తనువం చ బిభ్రద్
వేదద్రుహావతిబలౌ మధుకైటభాఖ్యౌ ।
హత్వాఽఽనయచ్ఛ్రుతిగణాంస్తు రజస్తమశ్చ
సత్త్వం తవ ప్రియతమాం తనుమామనంతి ॥ 37

భవాన్ - నీవు, హయశిరః-తనువమ్ - హయగ్రీవరూపమును, బిభ్రత్ - ధరించువాడవై, వేదద్రుహౌ - వేదమునకు ద్రోహమును చేసినట్టి యు, అతిబలౌ - గొప్ప బలశాలురైనట్టియు, రజః తమః చ - రజోగుణ తమోగుణ రూపులైన, మధుకైటభ-ఆఖ్యౌ - మధుకైటభులనే రాక్షసులను, హత్వా - సంహరించి, శ్రుతిగణాన్ తు - వేదముల గణములనైతే, తస్మై - ఆ బ్రహ్మగారి కొరకు, ఆనయత్ - తీసుకు వచ్చితివి, సత్త్వమ్ - సత్త్వగుణ మును, తవ - నీకు, ప్రియతమామ్ - మిక్కిలి ప్రియమైన, తనుమ్ - రూప మునుగా, ఆమనంతి - చెప్పుచున్నారు.

మహాబలశాలురు, రజోగుణ తమోగుణ స్వరూపులు అగు మధు కైటభులనే రాక్షసులు వేదములకు ద్రోహమును చేయుచుండిరి. అపుడు నీవు హయగ్రీవావతారమునెత్తి, ఆ రాక్షసులను సంహరించి, వేదముల గణ ములను తెచ్చి, బ్రహ్మగారికి అప్పజెప్పితివి. సత్త్వగుణము నీకు మిక్కిలి ప్రియమైన రూపమని మహాత్ములు చెప్పెదరు.

ఇత్థం నృతిర్యగృషిదేవఝషావతారైః
లోకాన్ విభావయసి హంసి జగత్ప్రతీపాన్ ।

ధర్మం మహాపురుష పాసి యుగానువృత్తం
ఛన్నః కలౌ యదభవస్త్రియుగోऽథ స త్వమ్ ॥ 38

ఇత్థమ్ - ఈ విధముగా, నృతిర్యగ్-ఋషిదేవఝష-అవతారైః - మానవుడు పశువు మహర్షి దేవత చేపల అవతారములతో, లోకాన్ - లోకములను, విభావయసి - పాలించుచున్నావు, జగత్-ప్రతీపాన్ - జగత్తునకు ద్రోహము చేయువారలను, హంసి - సంహరించుచున్నావు, మహాపురుష - ఓ పురుషోత్తమా!, యుగ-అనువృత్తమ్ - యుగములయందు ప్రవర్తిల్లే, ధర్మమ్ - ధర్మమును, పాసి - పాలించుచున్నావు, యత్ - ఎందువలనైతే, కలౌ - కలియుగమునందు, ఛన్నః - గుప్తరూపుడవై, అభవః - అయితివో, అథ - అందువలన, సః - అట్టి, త్వమ్ - నీవు, త్రియుగః - త్రియుగుడవు.

ఈ విధముగా మానవుడు (శ్రీరాముడు, శ్రీకృష్ణుడు), పశువు (వరాహము), మహర్షి (పరశురాముడు), దేవత (వామనుడు), మత్స్యము అనే అవతారముల ద్వారా నీవు జగత్తునకు ద్రోహము చేయువారలను సంహరించి, లోకములను పాలించుచున్నావు. ఓ పురుషోత్తమా! యుగములయందు ప్రవర్తిల్లే ధర్మమును నీవే రక్షించుచున్నావు. నీవు కలియుగములో గుప్తరూపుడవై ఉండెదవు. కావుననే, అట్టి నీవు త్రియుగుడవు (మూడు యుగములలో ప్రకటమగువాడు) అయినావు.

నైతన్మనస్తవ కథాసు వికుంఠనాథ
సంప్రీయతే దురితదుష్టమసాధు తీవ్రమ్ ।
కామాతురం హర్షశోకభయైషణార్తం
తస్మిన్ కథం తవ గతిం విమృశామి దీనః ॥ 39

వికుంఠనాథ - ఓ వైకుంఠనాథా!, దురితదుష్టమ్ - పాపకృత్యములచే కలుషితమైనది, అసాధు - దుష్టమైనది, తీవ్రమ్ - పొగరుబోతు, కామ-ఆతురమ్ - కోరికలచే ఆదుర్దా గలది, హర్షశోకభయ-ఏషణా-ఆర్తమ్ - హర్షము శోకము భయము కామనలతో దుఃఖితమైనది అగు, ఏతత్ - ఈ, మనః - మనస్సు, తవ - నీయొక్క, కథాసు - కథలయందు, న సంప్రీయతే - చక్కగా ప్రీతిని చెందుట లేదు, తస్మిన్ - దానియందు, దీనః -

దీనుడనగు నేను, తవ - నీయొక్క, గతిమ్ - స్వరూపమును గురించి, కథమ్ - ఏ విధముగా, విమృశామి - విచారము చేసెదను?

ఓ వైకుంఠనాథా! నా ఈ మనస్సు పాపకార్యములచే కలుషితము, దుష్టము, వినయము లేనిది, కోరికలచే అలజడి చెందియుండునది, హర్షము శోకము భయము కామనలు అనువాటిచే ఖిన్నమై యుండునది. కావుననే, ఈ మనస్సు నీ గాథలయందు చక్కని ప్రీతిని పొందుట లేదు. అట్టి ఈ మనస్సులో దీనుడనగు నేను నీ స్వరూపమును గురించి ఎట్లు విచారమును చేయగల్గుదును? (చేయలేను).

జిహ్వైకతోఽచ్యుత వికర్షతి మాఽవితృప్తా
శిశ్నోఽన్యతస్త్వగుదరం శ్రవణం కుతశ్చిత్ ।
ఘ్రాణోఽన్యతశ్చపలదృక్ క్వ చ కర్మశక్తిః
బహ్వ్యస్సపత్న్య ఇవ గేహపతిం లునంతి ॥ 40

అచ్యుత - ఓ అచ్యుతా!, అవితృప్తా - సంతృప్తిని చెందని, జిహ్వా - నాలుక, మా - నన్ను, ఏకతః - ఒకవైపునుండి, శిశ్నః - జననేంద్రియము, అన్యతః - మరియొకవైపునుండి, త్వక్ - చర్మము, ఉదరమ్ - పొట్ట, శ్రవణమ్ - చెవి, కుతశ్చిత్ - ఇంకోవైపునుండి, ఘ్రాణః - ముక్కు, చపల దృక్ - చంచలమగు కన్ను, అన్యతః - మరోవైపునుండి, వికర్షతి - ఆకర్షించుచున్నది, కర్మశక్తిః - పనిని చేసే శక్తి గల కర్మేంద్రియములు, క్వ చ - ఎక్కడికో, బహ్వ్యః - అనేకులగు, సపత్న్యః - సవతులు, గేహపతిం ఇవ - గృహయజమానిని వలె, లునంతి - లాగివేయుచుండును.

ఓ అచ్యుతా! ఈ సంతృప్తినెరుగని జిహ్వ నన్ను రుచ్యములగు పదార్థముల వైపునకు, జననేంద్రియము సంభోగము వైపునకు, చర్మము మధురమగు స్పర్శ వైపునకు, పొట్ట ఆహారము వైపునకు, చెవి సంగీతము మొదలగువాటి వైపునకు, ముక్కు సుగంధముల వైపునకు, చంచలమగు కన్ను సుందరదృశ్యముల వైపునకు ఆకర్షించుచున్నవి. చేయి మొదలగు కర్మేంద్రియములు వివిధవ్యాపారములలోనికి నన్ను లాగుకొని పోవుచున్న

వి. ఈ విధముగా ఈ ఇంద్రియములు నన్ను, అనేకులగు భార్యలు గృహ యజమానిని వలె, అన్ని వైపులకు లాగి వేయుచున్నవి.

ఏవం స్వకర్మపతితం భవవైతరణ్యా-
మన్యోన్యజన్మమరణాశనభీతభీతమ్ ।
పశ్యన్ జనం స్వపరవిగ్రహవైరమైత్రం
హంతేతి పారచర పీపృహి మూఢమద్య ॥ 41

పారచర - సంసారమునకు అతీతుడవగు ఓ ఈశ్వరా!, ఏవమ్ - ఈ విధముగా, భవవైతరణ్యామ్ - సంసారము అనే వైతరణీనదియందు, స్వకర్మపతితమ్ - తన కర్మలచే పడినట్టియు, అన్యోన్యజన్మమరణ-అశన భీతభీతమ్ - పరస్పరము పుట్టుక మరణము కర్మఫలముల అనుభవము లచే మిక్కిలి భయపడినట్టియు, స్వపరవిగ్రహవైరమైత్రమ్ - తనవారి యొక్క పరాయివారియొక్క దేహములయందు వైరము మైత్రి కలిగి నట్టియు, మూఢమ్ - మూఢుడైన, జనమ్ - జనుని, పశ్యన్ - చూచుచు న్న నీవు, హంత - అయ్యో!, ఇతి - అని, అద్య - ఈనాడు, పీపృహి - పాలించుము.

సంసారమునకు అతీతుడవగు ఓ ఈశ్వరా! ఈ విధముగా మూఢు డైన జనుడు సంసారము అనే వైతరణీ (యమలోకద్వారమువద్ద యాతన లను కలిగించే నది) నదియందు తన కర్మల ఫలముగా పడియున్నాడు. మానవుడు ఒకదాని తరువాత మరియొకటిగా వస్తూ ఉండే పుట్టుక-మరణ ముల వలన, వాటి మధ్యలోనుండే కర్మఫలముల అనుభవము వలన చాల భయపడి యున్నాడు. తాను ఒక దేహమై కొన్ని దేహములయందు తన వారనే భావముతో మైత్రిని, మరికొన్ని దేహములయందు పరాయి వారు అనే భావనతో వైరమును నెరపే ఈ మూఢజనుని నీవు చూచి, అయ్యో! అని దయను చూపి ఈనాడే పాలించుము.

కోఽన్వత్ర తేఽఖిలగురో భగవన్ ప్రయాస
ఉత్తారణేఽస్య భవసంభవలోపహేతోః ।

మూఢేషు వై మహదనుగ్రహ ఆర్తబంధో
కిం తేన తే ప్రియజనాననుసేవతాం నః ॥ 42

అఖిలగురో - సకలజగత్తునకు తండ్రియైనవాడా!, భగవన్ - ఓ భగవానుడా!, ఆర్తబంధో - దుఃఖితులకు బంధువా!, అస్య - ఈ జగత్తు యొక్క, భవసంభవలోపహేతోః - ఉత్పత్తిస్థితిలయములకు కారణమగు, తే - నీకు, ఉత్తారణే - తరింప జేయుట అనే, అత్ర - ఈ విషయమునందు, ప్రయాసః - ప్రయాస, కః ను - ఎట్టిది?, మూఢేషు - మూర్ఖులయందు, మహద్-అనుగ్రహః - మహాత్ముల అనుగ్రహము, వై - నిశ్చయము, తే - నీయొక్క, ప్రియజనాన్ - భక్తజనులను, అనుసేవతామ్ - అనుసరించి సేవించే, నః - మాకు, తేన - దానితో, కిమ్ - పని యేమి?

ఓ భగవానుడా! నీవు సకలజగత్తునకు తండ్రివి, దుఃఖితులకు బంధుడవు. ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు కారణమగు నీకు జీవులను తరింపజేయుట అనే విషయములో ప్రయాస ఏమి ఉండును? మహాత్ముల అనుగ్రహము నిశ్చయముగా మూఢులపై ప్రసరించును. కాని, నీ భక్తజనులను అనుసరించి సేవించే మాకు అట్టి గొప్పవారి అనుగ్రహముతో పని యేమున్నది?

నైవోద్విజే పర దురత్యయవైతరణ్యాః
త్వద్వీర్యగాయనమహాఽమృతమగ్నచిత్తః ।
శోచే తతో విముఖచేతస ఇంద్రియార్థ-
మాయాసుఖాయ భరముద్వహతో విమూఢాన్ ॥ 43

పర - ఓ పరమాత్మా!, త్వద్-వీర్యగాయనమహా-అమృతమగ్న చిత్తః - నీ పరాక్రమమును గానము చేయుట అనే గొప్ప అమృతమునందు నిమగ్నమైన చిత్తము గల నేను, దురత్యయవైతరణ్యాః - దాట శక్యము కాని వైతరణీ నది వలన, న ఏవ ఉద్విజే - సుతరాము ఉద్వేగమును పొందను, తతః - దానినుండి, విముఖచేతసః - విముఖమైన బుద్ధి కలిగిన ట్టియు, ఇంద్రియ-అర్థమాయాసుఖాయ - ఇంద్రియవిషయములయందలి

మిథ్యాసుఖము కొరకు, భరమ్ - భారమును, ఉద్వహతః - మోయుచున్న, విమూఢాన్ - పరమమూర్ఖులను గురించి, శోచే - చింతిల్లెదను.

ఓ పరమాత్మా! నా చిత్తము నీ పరాక్రమమును గానము చేయుట అనే గొప్ప అమృతమునందు మునకలు వేయుచున్నది. అట్టి నేను దాట శక్యము కాని వైతరణీనది వలన సుతరాము భయపడను. కాని, ఆ అమృతమునుండి విముఖమైన బుద్ధి కలిగి ఇంద్రియభోగములయందలి మిథ్యాసుఖము కొరకై సంసారభారమును మోయుచున్న పరమమూర్ఖులను గురించి నేను చింతిల్లుచున్నాను.

ప్రాయేణ దేవ మునయస్స్వవిముక్తికామా
మౌనం చరంతి విజనే న పరార్థనిష్ఠాః ।
నైతాన్ విహాయ కృపణాన్ విముముక్ష ఏకో
నాన్యం త్వదస్య శరణం భ్రమతోఽనుపశ్యే ।। 44

దేవ - ఓ దేవా!, ప్రాయేణ - తరచుగా, మునయః - మహర్షులు, స్వవిముక్తికామాః - తమ మోక్షమును కోరువారై, విజనే - ఏకాంతమునందు, మౌనమ్ - మౌనవ్రతమును, చరంతి - అనుష్ఠించెదరు, పర-అర్థనిష్ఠాః - ఇతరుల ప్రయోజనమునందు నిష్ఠ గలవారు, న - కారు, ఏతాన్ - ఈ, కృపణాన్ - దీనులను, విహాయ - విడిచిపెట్టి, ఏకః - ఒక్కడినే, విముముక్షః - మోక్షమును కోరువాడను, న - కాను, భ్రమతః - పరిభ్రమించుచున్న, అస్య - వీనికి, త్వత్ - నీకంటె, అన్యమ్ - మరియొక, శరణమ్ - రక్షకుని, న అనుపశ్యే - కానరాను.

ఓ దేవా! తరచుగా మహర్షులు తమ మోక్షమును కోరువారై ఏకాంతమునందు మౌనవ్రతమునసుష్ఠించెదరు. కాని, వారికి ఇతరుల ప్రయోజనమునందు నిష్ఠ లేదు. కాని, నేను ఈ దీనులను విడిచిపెట్టి ఒక్కడినే మోక్షమును పొందగోరుట లేదు. సంసారములో పరిభ్రమించే ఈ జనమునకు నీవు తప్ప రక్షకుడు మరియొకడు నాకు ఎంత వెదికినా కానరాడు.

యన్మైథునాది గృహమేధిసుఖం హి తుచ్ఛం
కండూయనేన కరయోరివ దుఃఖదుఃఖమ్ ।

తృప్యంతి నేహ కృపణా బహుదుఃఖభాజః
కండూతివన్మనసిజం విషహేత ధీరః ॥ 45

మైథున-ఆది - సంభోగము మొదలైన, గృహమేధిసుఖమ్ - గృహాశ్రమమునందలి సుఖము, యత్ - ఏది గలదో అది, తుచ్ఛం హి - నింద్యమైనది గదా!, కరయోః - రెండు చేతులయొక్క, కండూయనేన ఇవ - గోకుకొనుట చేతను వలె, దుఃఖదుఃఖమ్ - నిరంతరమగు దుఃఖము, బహుదుఃఖభాజః - అనేకములగు దుఃఖములను పొందే, కృపణాః - దీనులు, ఇహ - ఈ సుఖము విషయములో, న తృప్యంతి - సంతృప్తిని చెందుట లేదు, ధీరః - వివేకి, కండూతివత్ - దురదను వలె, మనసిజమ్ - కాముని, విషహేత - సహించును.

గృహాశ్రమమునందలి సంభోగము మొదలైన సుఖము నింద్యమైనది సుమా! ఇంద్రియభోగములు రెండు చేతులను గోకుకొనుట వంటిది. ఆరంభములో కొంత సుఖము కనబడిననూ, తరువాత కలిగేది నిరంతరమగు దుఃఖము మాత్రమే. కాని, మానవులు ఈ ఇంద్రియసుఖముల యెడల తృప్తి లేనివారై అనేకములగు దుఃఖములననుభవిస్తూ దీనులై యున్నారు. వివేకము గల వ్యక్తి దురదను సహించినట్లే ఇంద్రియభోగములకు చెందిన కామనలను కూడ సహించునే గాని, వాటి వెంట పడడు.

మౌనవ్రతశ్రుతతపోఽధ్యయనస్వధర్మ-
వ్యాఖ్యారహోజపసమాధయ ఆపవర్గ్యాః ।
ప్రాయః పరం పురుష తే త్వజితేంద్రియాణాం
వార్తా భవంత్యుత న వాత్ర తు దాంభికానామ్ ॥ 46

పురుష - ఓ పూర్ణస్వరూపా!, మౌనవ్రతశ్రుతతపః-అధ్యయనస్వధర్మవ్యాఖ్యారహః-జపసమాధయః - మౌనము బ్రహ్మచర్యవ్రతము శాస్త్రశ్రవణము తపస్సు వేదాధ్యయనము స్వధర్మానుష్ఠానము శాస్త్రవిచారము ఏకాంతవాసము జపము సమాధి అనే, ఆపవర్గ్యాః - మోక్షసాధనములు, తే తు - అవియైతే, అత్ర - ఈ లోకమునందు, అజిత-ఇంద్రియాణామ్ - జయించబడని ఇంద్రియములు గలవారలకు, ప్రాయః - తరచుగా, పరమ్

- కేవలము, వార్తాః - జీవనోపాయములు, భవంతి - అగుచున్నవి, ఉత - మరియు, దాంభికానాం తు - డాంబీకము చేయువారలకైతే, వా - కావచ్చును, న - కాకపోవచ్చును.

ఓ పూర్ణస్వరూపా! మౌనము, బ్రహ్మచర్యవ్రతము, శాస్త్రశ్రవణము, తపస్సు, వేదాధ్యయనము, స్వధర్మానుష్ఠానము, శాస్త్రమును మననము చేయుట, ఏకాంతవాసము, జపము, సమాధి అనేవి మోక్షసాధనములు. కాని, ఇవి లోకములో తరచుగా ఇంద్రియజయము లేనివారలకు జీవనోపాయములుగా మారిపోయినవి. దంభపరాయణులకైతే ఇవి ఒకప్పుడు జీవికలు కావచ్చును; వారి మోసము బయట పడ్డప్పుడు జీవికలు కూడ కాకపోవచ్చును.

రూపే ఇమే సదసతీ తవ వేదసృష్టే
బీజాంకురావివ న చాన్యదరూపకస్య ।
యుక్తాస్సమక్షముభయత్ర విచిన్వతే త్వాం
యోగేన వహ్నిమివ దారుషు నాన్యతస్స్యాత్ ॥ 47

వేదసృష్టే - వేదముచే ప్రతిపాదించబడునవి, బీజ-అంకురౌ ఇవ - విత్తు అంకురముల వంటివి అగు, ఇమే - ఈ, సద్-అసతీ - కార్యకారణములు, అరూపకస్య - రూపము లేని, తవ - నీయొక్క, రూపే - రూపములు, అన్యత్ - మరియొకటి, న చ - లేనే లేదు, యుక్తాః - మనస్సును వశము చేసుకున్న సాధకులు, త్వామ్ - నిన్ను, ఉభయత్ర - రెండింటియందు, యోగేన - యోగసాధనచే, దారుషు - కట్టెలయందు, వహ్నిం ఇవ - అగ్నిని వలె, సమక్షమ్ - ప్రత్యక్షముగా, విచిన్వతే - అన్వేషించుచున్నారు, అన్యతః - మరియొక విధముగా, న స్యాత్ - కలుగదు.

స్వతహాగా రూపము లేని పరమేశ్వరునకు వేదము కారణము, కార్యము (జగత్తు) అనే విత్తు-అంకురమువంటి రెండు రూపములను ప్రతిపాదించుచున్నది. నీ కంటె భిన్నముగా మరియొకటి లేదు. సాధకులు చిత్తమును వశము చేసుకొని భక్తియోగముతో నిన్ను, కట్టెలయందు నిప్పును వలె, తమ హృదయములో అన్వేషించి సాక్షాత్కరించుకొనుచున్నారు.

ఈశ్వరసాక్షాత్కారమునకు సర్వమునందు ఈశ్వరుని దర్శించుట తప్ప మరియొక ఉపాయము లేదు.

త్వం వాయురగ్నిరవనిర్వియదంబుమాత్రాః
ప్రాణేంద్రియాణి హృదయం చిదనుగ్రహశ్చ ।
సర్వం త్వమేవ సగుణో విగుణశ్చ భూమన్
నాన్యత్త్వదస్త్యపి మనోవచసా నిరుక్తమ్ ॥ 48

భూమన్ - దేశకాలములకు అతీతమైన వాడా!, వాయుః - వాయువు, అగ్నిః - అగ్ని, అవనిః - పృథివి, వియత్ - ఆకాశము, అంబు - నీరు, మాత్రాః - సూక్ష్మభూతములు, ప్రాణ-ఇంద్రియాణి - ప్రాణములు ఇంద్రియములు, హృదయమ్ - మనస్సు, చిత్ - చిత్తము, అనుగ్రహః చ - ఇంద్రియములను అనుగ్రహించే దేవతల వర్గము కూడ, త్వమ్ - నీవే, సర్వమ్ - సర్వము, త్వం ఏవ - నీవే, సగుణః - గుణములు కలవాడవు (స్థూలము), చ - మరియు, నిర్గుణః - గుణములు లేనివాడవు (సూక్ష్మము), మనః-వచసా - మనస్సుచే వాక్కుచే, నిరుక్తమ్ - నిర్వచించబడేది, త్వత్ - నీకంటె, అన్యత్ - మరియొకటి, న అస్తి అపి - లేనే లేదు.

దేశకాలములకు అతీతమైన వాడా! నేల-నీరు-నిప్పు-గాలి-ఆకాశము అనే పంచభూతములు, శబ్దస్పర్శరూపరసగంధములనే సూక్ష్మభూతములు, ప్రాణాపానాదులు, ఇంద్రియములు, మనస్సు, చిత్తము, ఇంద్రియములను అనుగ్రహించే సూర్యాది దేవతలు, స్థూలము, సూక్ష్మము అనే ఈ సర్వము నీవే. సగుణుడవు నీవే; నిర్గుణుడవు కూడ నీవే. మనస్సుచే ఊహించబడేది, వాక్కుచే నిర్దేశించబడేది ఏదైననూ నీకంటె భిన్నముగా ఏదీ లేదు.

నైతే గుణా న గుణినో మహదాదయో యే
సర్వే మనఃప్రభృతయస్సహదేవమర్త్యాః ।
ఆద్యంతవంత ఉరుగాయ విదంతి హి త్వా-
మేవం విమృశ్య సుధియో విరమంతి శబ్దాత్ ॥ 49

ఉరుగాయ - గొప్పగా కీర్తించబడువాడా!, ఏతే - ఈ, గుణాః - గుణములు, త్వామ్ - నిన్ను, న హి విదంతి - సుతరాము తెలియకున్నవి, గుణినః - గుణముల పరిణామములగు, మహద్-ఆదయః - మహత్తత్త్వము మొదలగునవి, యే - ఏవి గలవో అవి, సర్వే - అన్నియు, మనఃప్రభృతయః - మనస్సు మొదలగునవి, సరదేవమర్త్యాః - దేవతలతో మానవులతో కూడియున్నవి, న - తెలియకున్నవి, ఆది-అంతవంతః - ఆది అంతములు గలవి, ఏవమ్ - ఈ విధముగా, విమృశ్య - నిశ్చయించుకొని, సుధియః - చక్కని వివేకము గలవారు, శబ్దాత్ - శబ్దమునుండి, విరమంతి - విరమించెదరు.

గొప్పగా కీర్తించబడే ఓ దేవా! ఈ సత్త్వరజస్తమోగుణములు గాని, వాటి పరిణామరూపములగు మహత్తు (సమష్టిక్రియా-విజ్ఞానశక్తులు) మొదలగు తత్త్వములు గాని, మనస్సు మొదలగు అంతఃకరణవృత్తులు గాని, దేవతలు గాని, మానవులు గాని ఈ సర్వము వచ్చి పోయేవే గాని, నీ స్వరూపమును తెలియలేకున్నవి. ఈ సత్యమును గుర్తించిన వివేకవంతులు శబ్దజాలమునుండి విరమించుకొనెదరు.

తత్తేఽర్హత్తమ నమఃస్తుతికర్మపూజాః
కర్మ స్మృతిశ్చరణయోశ్శ్రవణం కథాయామ్ ।
సంసేవయా త్వయి వినేతి షడంగయా కిం
భక్తిం జనః పరమహంసగతౌ లభేత ॥ 50

అర్హత్తమ - పూజనీయులలో శ్రేష్ఠుడా!, తత్ - అది యట్లుండ, నమఃస్తుతికర్మపూజాః - నమస్కారము స్తోత్రము కర్మలను సమర్పించుటలు, కర్మ - పూజ, చరణయోః - రెండు పాదములయొక్క, స్మృతిః - స్మరణము, కథాయామ్ - గాథయందు, శ్రవణమ్ - వినుట, ఇతి - ఈ విధమైన, షడ్-అంగయా - ఆరు అంగములు గల, తే - నీయొక్క, సంసేవయా వినా - చక్కని సేవ లేకుండగా, పరమహంసగతౌ - పరమహంసలచే పొందబడే, త్వయి - నీయందు, జనః - మానవుడు, భక్తిమ్ - భక్తిని, కిం లభేత - పొందునా?

పూజనీయులలో శ్రేష్ఠుడవగు ఓ దేవా! నమస్కారము, స్తోత్రము, కర్మలను సమర్పించుట, పూజ, నీ రెండు పాదములను స్మరించుట, నీ గాథలను వినుట అనే ఆరు నిన్ను చక్కగా సేవించుటకు అంగములు. పరమహంసలచే ఆత్మరూపముగా పొందబడే నీయందలి భక్తి, ఇట్టి సేవ లేకుండగా మానవులకు లభించునా? (లభించదు). కావున, అట్టి భక్తిని అనుగ్రహించుము.

నారద ఉవాచ ।
ఏతావద్వర్ణితగుణో భక్త్యా భక్తేన నిర్గుణః ।
ప్రహ్లాదం ప్రణతం ప్రీతో యతమన్యురభాషత ।। 51

నిర్గుణః - నిర్గుణుడగు నరసింహుడు, భక్తేన - భక్తునిచే, భక్త్యా - భక్తితో, ఏతావద్-వర్ణితగుణః - ఇన్ని విధములుగా వర్ణించబడిన గుణములు గలవాడై, ప్రీతః - ప్రసన్నుడై, యతమన్యుః - నియంత్రించబడిన కోపము గలవాడై, ప్రణతమ్ - ప్రణమిల్లిన, ప్రహ్లాదమ్ - ప్రహ్లాదుని ఉద్దేశించి, అభాషత - పలికెను.

నారదమహర్షి ఇట్లు పలికెను --- స్వతహాగా నిర్గుణుడే అయినా సగుణుడై ప్రకటమైన నరసింహుని గుణములను భక్తుడగు ప్రహ్లాదుడు భక్తితో ఇన్ని విధములుగా వర్ణించెను. ఆయన అపుడు ప్రసన్నుడై తన కోపమును నియంత్రించి, ప్రణమిల్లిన ప్రహ్లాదునితో ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
ప్రహ్లాద భద్ర భద్రం తే ప్రీతోఽహం తేఽసురోత్తమ ।
వరం వృణీష్వాభిమతం కామపూరోఽస్మ్యహం నృణామ్ ।।52

ప్రహ్లాద - ఓ ప్రహ్లాదా!, భద్ర - కల్యాణస్వరూపా!, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళము, అసుర-ఉత్తమ - అసురులలో శ్రేష్ఠుడా!, అహమ్ - నేను, తే - నీ కొరకు, ప్రీతః - ప్రసన్నుడను, అభిమతమ్ - అభీష్టమైన, వరమ్ - వరమును, వృణీష్వ - కోరుకొనుము, అహమ్ - నేను, నృణామ్ - మానవులకు, కామపూరః - కామనలను పూర్తి చేయువాడను, అస్మి - అగుదును.

శ్రీభగవానుడిట్లు పలికెను --- ఓ ప్రహ్లాదా! నీవు మంగళస్వరూపుడవు, అసురులలో శ్రేష్ఠుడవు. నేను నీ యెడల ప్రసన్నుడనైతిని. నీకు అభీష్టమైన వరమును కోరుకొనుము. నేను మానవుల కామనలను పూర్తి చేయువాడను.

మామప్రీణత ఆయుష్మన్దర్శనం దుర్లభం హి మే ।
దృష్ట్వా మాం న పునర్జంతురాత్మానం తప్తుమర్హతి ।। 53

ఆయుష్మన్ - ఓ చిరంజీవీ!, మామ్ - నన్ను, అప్రీణతః - ప్రసన్నము చేసుకొనని వానికి, మే - నాయొక్క, దర్శనమ్ - దర్శనము, దుర్లభం హి - పొంద శక్యము కానిది సుమా!, మామ్ - నన్ను, దృష్ట్వా - చూచి, జంతుః - ప్రాణి, పునః - మరల, ఆత్మానమ్ - తనను, తప్తుమ్ - తపింప జేయుటకు, న అర్హతి - తగదు.

ఓ చిరంజీవీ! నేను ప్రసన్నుడను కానిచో నా దర్శనము లభించుట సంభవము కాదు. కాని, నన్ను దర్శించిన ప్రాణికి మరల హృదయములో తాపము కలుగదు.

ప్రీణంతి హ్యథ మాం ధీరాస్సర్వభావేన సాధవః ।
శ్రేయస్కామా మహాభాగాస్సర్వాసామాశిషాం పతిమ్ ।। 54

అథ హి - అందువలననే, ధీరాః - వివేకము గలవారు, శ్రేయస్కామాః - మోక్షమును కోరువారు, మహాభాగాః - గొప్ప భాగ్యము గలవారు అగు, సాధవః - సత్పురుషులు, సర్వాసామ్ - సకలములైన, ఆశిషామ్ - మనోరథములకు, పతిమ్ - ప్రభువునగు, మామ్ - నన్ను, సర్వభావేన - సర్వస్వమును అర్పించుటచే, ప్రీణంతి - ప్రీతిని కలిగించెదరు.

అందువలననే, నిత్యానిత్యవస్తువివేకము గలవారై మోక్షమును కోరుట అనే గొప్ప భాగ్యము గల సత్పురుషులు సర్వస్వమును సమర్పించి సకలమనోరథములకు ప్రభువునగు నన్ను ప్రసన్నుని చేసుకొనెదరు.

ఏవం ప్రలోభ్యమానోఽపి వరైర్లోకప్రలోభనైః ।
ఏకాంతిత్వాద్భగవతి నైచ్ఛత్తానసురోత్తమః ।। 55

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే
ప్రహ్లాదచరితే నృసింహస్తుతిర్నామ నవమోऽధ్యాయః ||

ఏవమ్ - ఈ విధముగా, లోకప్రలోభనైః - జనులను ప్రలోభపెట్టే, వరైః - వరములతో, ప్రలోభ్యమానః అపి - ప్రలోభపెట్టబడినవాడే అయిన నూ, అసుర-ఉత్తమః - అసురులలో శ్రేష్ఠుడగు ప్రహ్లాదుడు, భగవతి - భగ వానునియందు, ఏకాంతిత్వాత్ - ఏకాంతమగు భక్తి కలవాడగుట వలన, తాన్ - వాటిని, న ఐచ్ఛత్ - కోరలేదు.

ఈ విధముగా అసురోత్తముడగు ప్రహ్లాదుని నరసింహుడు జను లను ప్రలోభపెట్టే వరములతో ప్రలోభపెట్టెను. అయిననూ, ఆతడు భగవా నునియందు ఏకాంతమగు భక్తి కలవాడగుట వలన, వాటిని కోరలేదు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
ప్రహ్లాదచరితమునందు ప్రహ్లాదుడు నరసింహుని
స్తుతించుటను వర్ణించే తొమ్మిదవ
అధ్యాయము ముగిసినది (9).

*****

# అథ దశమోఽధ్యాయః

## ప్రహ్లాద చరితము - ప్రహ్లాదుని నిష్కామ భక్తి, త్రిపుర దహనము

నారద ఉవాచ ।
భక్తియోగస్య తత్సర్వమంతరాయతయార్భకః ।
మన్యమానో హృషీకేశం స్మయమాన ఉవాచ హ ॥ 1

అర్భకః - పిల్లవాడగు ప్రహ్లాదుడు, తత్ - ఆ, సర్వమ్ - సర్వమును, భక్తియోగస్య - భక్తియోగమునకు, అంతరాయతయా - అంతరాయముగా, మన్యమానః - తలపోయుచున్నవాడై, స్మయమానః - చిరునవ్వు నవ్వుచున్నవాడై, హృషీకేశమ్ - ఇంద్రియాధిపతియగు నరసింహుని ఉద్దేశించి, ఉవాచ హ - ఆ సమయములో పలికెను.

నారద మహర్షి ఇట్లు పలికెను --- ప్రహ్లాదుడు పిల్లవాడే అయినా, ఆ వరములన్నియు భక్తియోగమునకు ఆటంకములనియే భావించి, చిరునవ్వుతో ఇంద్రియాధిపతియగు నరసింహునితో ఆ సమయములో ఇట్లు పలికెను.

ప్రహ్లాద ఉవాచ ।
మా మాం ప్రలోభయోత్పత్త్యాఽఽసక్తం కామేషు తైర్వరైః ।
తత్సంగభీతో నిర్విణ్ణో ముముక్షుస్త్వాముపాశ్రితః ॥ 2

ఉత్పత్త్యా - స్వభావముచే, కామేషు - భోగములయందు, ఆసక్తమ్ - ఆసక్తి కలిగిన, మామ్ - నన్ను, తైః - ఆ, వరైః - వరములచే, మా ప్రలోభయ - ప్రలోభపెట్టవద్దు, తత్-సంగభీతః - ఆ కామనల సంగము

వలన భయపడినవాడను, నిర్విణ్ణః - విరక్తుడను, ముముక్షుః - మోక్షమును కోరువాడను, త్వామ్ - నిన్ను, ఉప-ఆశ్రితః - శరణు వేడినవాడను.

ప్రహ్లాదుడు ఇట్లు పలికెను --- స్వభావముచేతనే కామనల యందు ఆసక్తి కలిగియున్న నన్ను ఆ వరములతో ప్రలోభపెట్ట వద్దు. నేను విరక్తుడనై ఆ కామనలయందలి ఆసక్తి వలన భయపడుచున్నవాడను. మోక్షమును కోరే నేను నిన్ను శరణు వేడుచున్నాను.

భృత్యలక్షణజిజ్ఞాసుర్భక్తం కామేష్వచోదయత్ ।
భవాన్ సంసారబీజేషు హృదయగ్రంథిషు ప్రభో ॥ 3

ప్రభో - ఓ ప్రభూ!, భృత్యలక్షణజిజ్ఞాసుః - భక్తుని లక్షణములను తెలియగోరిన, భవాన్ - నీవు, సంసారబీజేషు - సంసారమునకు బీజములై నట్టియు, హృదయగ్రంథిషు - హృదయములో ముడులై ఉండే, కామేషు - కామనలయందు, భక్తమ్ - భక్తుడనగు నన్ను, అచోదయత్ - ప్రేరేపించి తివి.

ఓ ప్రభూ! కామనలు సంసారమునకు మూలములు, హృదయ ములోని ముడులు. నీవు భక్తుని లక్షణములనరయుటకు మాత్రమే భక్తుడ నగు నన్ను అట్టి కామనలయందు ప్రేరేపించితివి.

నాన్యథా తేఽఖిలగురో ఘటేత కరుణాత్మనః ।
యస్త ఆశిష ఆశాస్తే న స భృత్యస్స వై వణిక్ ॥ 4

అఖిలగురో - ఓ సకలజగద్గురూ!, అన్యథా - అట్లు గానిచో, కరు ణాత్మనః - కరుణానిధివగు, తే - నీకు, న ఘటేత - ఘటిల్లదు, యః - ఎవ డైతే, తే - నీనుండి, ఆశిషః - కామనలను, ఆశాస్తే - కోరునో, సః - అట్టి వాడు, భృత్యః - భక్తుడు, న - కాదు, సః - అట్టివాడు, వై - నిశ్చయము గా, వణిక్ - వర్తకుడు.

ఓ సకలజగద్గురూ! అట్లు (పరీక్ష కోసము) గానిచో, కరుణానిధివగు నీవు భక్తుని ప్రలోభపెట్టుట సంభవము కాదు. ఎవడైతే నీనుండి కామన లను కోరునో, ఆతడు నిశ్చయముగా వర్తకుడే గాని, భక్తుడు కాదు.

ఆశాసానో న వై భృత్యస్స్వామిన్యాశిష ఆత్మనః ।
న స్వామీ భృత్యతస్స్వామ్యమిచ్ఛన్ యో రాతి చాశిషః ॥5

స్వామిని - ప్రభువునందు, ఆత్మనః - తనయొక్క, ఆశిషః - కామనలను, ఆశాసానః - కోరువాడు, భృత్యః - సేవకుడు, వై - నిశ్చయముగా, న - కాదు, యః - ఎవడైతే, భృత్యతః - సేవకునినుండి, స్వామ్యమ్ - స్వామియగు తన కార్యమును, ఇచ్ఛన్ - కోరువాడై, ఆశిషః - కామనలను, రాతి - ఇచ్చునో, న స్వామీ చ - స్వామి కూడ కాదు.

ప్రభువు వలన తన కామనలను తీర్చుకొనగోరే సేవకుడు యథార్థమైన సేవకుడు కాడు. తన పనిని చేయించుకొనుటకు మాత్రమే సేవకుని కోరికలను తీర్చే ప్రభువు కూడ యథార్థమగు ప్రభువు కాడు.

అహం త్వకామస్త్వద్భక్తస్త్వం చ స్వామ్యనపాశ్రయః ।
నాన్యథేహావయోరర్థో రాజసేవకయోరివ ॥ 6

అహం తు - నేనైతే, అకామః - కామనలు లేనివాడను, త్వద్-భక్తః - నీ భక్తుడను, త్వం చ - నీవు కూడ, అనపాశ్రయః - అపేక్ష లేని, స్వామీ - ప్రభుడవు, రాజసేవకయోః - రాజునకు సేవకునకు, అన్యథా ఇవ - ఇతరవిధముగా వలె, ఆవయోః - మనిద్దరికి, అర్థః - ప్రయోజనము, న - లేదు.

నేనైతే కామనలు లేని నీ భక్తుడను. నీవు కూడ నానుండి దేనినీ అపేక్షించని ప్రభుడవు. రాజు పనిని అపేక్షించి సేవకునకు జీతము ఇస్తే, ఆ ధనము కొరకై సేవకుడు రాజును సేవించును. కాని, మన ఇద్దరి మధ్య స్వామి-సేవకభావము ఆ విధముగా ఫలముచే ప్రేరితమైనది కాదు.

యది రాసీశ మే కామాన్ వరాంస్త్వం వరదర్షభ ।
కామానాం హృద్యసంరోహం భవతస్తు వృణే వరమ్ ॥ 7

ఈశ - ఓ ఈశ్వరా!, వరద-ఋషభ - వరములనిచ్చువారిలో శ్రేష్ఠుడా!, మే - నా కొరకు, త్వమ్ - నీవు, కామాన్ - అభీష్టములైన, వరాన్ - వరములను, రాసి యది - ఇచ్చే పక్షములో, వరం తు - వరము

నైతే, కామానామ్ - కామనలకు, హృది - హృదయమునందు, అసంరోహమ్ - మొలకెత్తకుండుటను, భవతః - నీనుండి, వృణే - కోరుచున్నాను.

ఓ ఈశ్వరా! నీవు వరములనిచ్చువారిలో శ్రేష్ఠుడవు. నీవు నాకు అభీష్టములైన వరములనిచ్చే పక్షములో, నేను నీ నుండి హృదయములో కామనలు మొలకెత్తకుండుటను వరముగా కోరుచున్నాను.

ఇంద్రియాణి మనః ప్రాణ ఆత్మా ధర్మో ధృతిర్మతిః ।
హ్రీశ్శ్రీస్తేజస్స్మృతిస్సత్యం యస్య నశ్యంతి జన్మనా ॥ 8

యస్య - ఏ కామనయొక్క అంకురముయొక్క, జన్మనా - పుట్టుకచే, ఇంద్రియాణి - ఇంద్రియములు, మనః - మనస్సు, ప్రాణః - ప్రాణశక్తి, ఆత్మా - దేహము, ధర్మః - ధర్మము, ధృతిః - ధైర్యము, మతిః - బుద్ధి, హ్రీః - సిగ్గు, శ్రీః - సంపద, తేజః - తేజస్సు, స్మృతిః - స్మరణము, సత్యమ్ - సత్యము, నశ్యంతి - నశించునో.

హృదయములో కామన అంకురించినచో ఇంద్రియములు, మనస్సు, ప్రాణశక్తి, దేహము, ధర్మము, ధైర్యము, బుద్ధి, సిగ్గు, సంపద, తేజస్సు, స్మరణము మరియు సత్యము అనే అన్నీ నశించును.

విముంచతి యదా కామాన్ మానవో మనసి స్థితాన్ ।
తర్హ్యేవ పుండరీకాక్ష భగవత్త్వాయ కల్పతే ॥ 9

పుండరీక-అక్ష - పద్మమువంటి కన్నులు గలవాడా!, మానవః - మానవుడు, యదా - ఏ కాలమునందైతే, మనసి - మనస్సునందు, స్థితాన్ - ఉన్న, కామాన్ - కామనలను, విముంచతి - విడిచిపెట్టునో, తర్హి ఏవ - అదే కాలమునందు, భగవత్త్వాయ - భగవంతుడు అగుటకు, కల్పతే - సమర్థుడగును.

పద్మమువంటి కన్నులు గల ఓ దేవా! ఏ కాలమునందు మానవుడు మనస్సులోనుండే కామనలను విడిచిపెట్టునో, అదే కాలములో ఆతడు భగవత్స్వరూపుడగును.

నమో భగవతే తుభ్యం పురుషాయ మహాత్మనే ।
హరయేఽద్భుతసింహాయ బ్రహ్మణే పరమాత్మనే ।। 10

భగవతే - భగవానుడవైనట్టియు, పురుషాయ - పూర్ణుడవైనట్టియు, మహాత్మనే - సర్వాత్మస్వరూపుడవైనట్టియు, హరయే - హరివైనట్టియు, అద్భుతసింహాయ - అద్భుతమగు సింహమైనట్టియు, బ్రహ్మణే - పరబ్రహ్మ స్వరూపుడవైనట్టియు, పరమాత్మనే - అంతరతమమగు ఆత్మ స్వరూపుడవగు, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము.

ఓ భగవానుడా! పూర్ణుడవగు నీవు సర్వాత్మస్వరూపుడవు. సకల ప్రాణులలో అంతరతమమగు ఆత్మస్వరూపుడవై విరాజిల్లే పరబ్రహ్మవు నీవే. నీవు అద్భుతమగు సింహము రూపు దాల్చిన శ్రీహరివి. నీకు నమస్కారము.

నృసింహ ఉవాచ ।
నైకాంతినో మే మయి జాత్విహాశిష
ఆశాసతేఽముత్ర చ యే భవద్విధాః ।
అథాపి మన్వంతరమేతదత్ర
దైత్యేశ్వరాణామనుభుంక్ష్వ భోగాన్ ।। 11

మయి - నాయందు, ఏకాంతినః - ఏకాంతమగు భక్తి గలవారు, భవద్-విధాః - నీవంటి వారలు, యే - ఎవరు గలరో వారు, ఇహ - ఈ లోకమునందు, అముత్ర చ - పరలోకమునందు కూడ, ఆశిషః - కామనలను, జాతు - ఏ నాడైననూ, న ఆశాసతే - కోరరు, అథాపి - అయినప్పటికీ, ఏతత్ - ఈ, మన్వంతరమ్ - మన్వంతర కాలమును (నిరంతరముగా), అత్ర - ఈ లోకమునందు, దైత్య-ఈశ్వరాణామ్ - రాక్షసప్రభువులయొక్క, భోగాన్ - భోగములను, అనుభుంక్ష్వ - అనుభవించుము.

నరసింహస్వామి ఇట్లు పలికెను --- నాయందు ఏకాంతమగు (ఫలాపేక్ష లేని) భక్తి గల నీవంటి వారలు ఇహలోకమునందు గాని, పరలోకమునందు గాని కోరికలను ఏనాడైననూ నానుండి కోరరు. అయినప్పటికీ,

నీవీ మన్వంతరము పూర్తి అయ్యేవరకు ఈ లోకమునందు రాక్షసప్రభువుల భోగములను నిరంతరముగా అనుభవించుము.

కథా మదీయా జుషమాణః ప్రియాస్త్వం
ఆవేశ్య మామాత్మని సంతమేకమ్ ।
సర్వేషు భూతేష్వధియజ్ఞమీశం
యజస్వ యోగేన చ కర్మ హిన్వన్ ॥ 12

మదీయాః - నాకు చెందిన, ప్రియాః - అభీష్టములగు, కథాః - కథలను, త్వమ్ - నీవు, జుషమాణః - వినుచున్నవాడవై, సర్వేషు - సకలములైన, భూతేషు - ప్రాణులయందు, సంతమ్ - ఉండునట్టియు, ఏకమ్ - అద్వితీయుడనైనట్టియు, అధియజ్ఞమ్ - యజ్ఞేశ్వరుడనగు, మామ్ - నన్ను, ఆత్మని - చిత్తమునందు, ఆవేశ్య - దృఢముగా నిలబెట్టుకొని, యోగేన - కర్మయోగముచే, కర్మ చ - కర్మను కూడ, హిన్వన్ - క్షీణింప జేయువాడవై, యజస్వ - ఆరాధించుము.

నీవు అభీష్టములైన నా గాథలను వినుచుండుము. నాకంటె భిన్నముగా రెండవది ఏదీ లేదు. సకలప్రాణులలో నేనే ఆత్మరూపుడనై యున్నాను. యజ్ఞేశ్వరుడనగు నాపై నీ మనస్సును దృఢముగా నిలిపియుంచుము. కర్మయోగము (ఈశ్వరార్పణబుద్ధితో కర్మలను చేయుట) తో నన్ను ఆరాధిస్తూ, ప్రారబ్ధకర్మను క్షయము చేసుకొనుము.

భోగేన పుణ్యం కుశలేన పాపం కలేవరం కాలజవేన హిత్వా ।
కీర్తిం విశుద్ధాం సురలోకగీతాం వితాయ మామేష్యసి ముక్తబంధః॥

భోగేన - అనుభవించుటచే, పుణ్యమ్ - పుణ్యమును, కుశలేన - ధర్మానుష్ఠానముచే, పాపమ్ - పాపమును, కాలజవేన - కాలముయొక్క వేగముచే, కలేవరమ్ - దేహమును, హిత్వా - విడిచిపెట్టి, విశుద్ధామ్ - పరిశుద్ధమైనట్టియు, సురలోకగీతామ్ - దేవలోకమునందు గానము చేయబడే, కీర్తిమ్ - కీర్తిని, వితాయ - విస్తరింప జేసి, ముక్తబంధః - విడిచిపెట్టబడిన బంధములు గలవాడవై, మామ్ - నన్ను, ఏష్యసి - పొందగలవు.

సుఖానుభవముచే పుణ్యమును, ధర్మానుష్ఠానముచే పాపమును క్షయము చేసుకొనుము. దేవలోకములో కూడ గానము చేయబడే పరిశుద్ధ మైన కీర్తిని విస్తరింప జేయుము. కాలముయొక్క వేగముచే దేహమును విడిచిపెట్టి నన్ను చేరుకొనుము.

యం ఏతత్కీర్తయేన్మహ్యం త్వయా గీతమిదం నరః ।
త్వాం చ మాం చ స్మరన్ కాలే కర్మబంధాత్ప్రముచ్యతే ॥14

యః - ఏ, నరః - మానవుడైతే, త్వయా - నీచే, గీతమ్ - గానము చేయబడిన, మహ్యమ్ - నా కొరకైన, ఇదమ్ - ఈ స్తోత్రమును, కీర్తయేత్ - కీర్తించునో, కాలే - కాలమునందు, త్వాం చ - నిన్ను, మాం చ - నన్ను కూడ, స్మరన్ - స్మరించుచున్నవాడై, కర్మబంధాత్ - కర్మబంధ మునుండి, ప్రముచ్యతే - విముక్తుడగును.

ఏ మానవుడైతే నీవు గానము చేసిన ఈ నా స్తోత్రమును కీర్తించి నిన్ను నన్ను కూడ స్మరించునో, అతడు తగిన కాలములో కర్మబంధము నుండి విముక్తిని పొందగలడు.

ప్రహ్లాద ఉవాచ ।
వరం వరయ ఏతత్తే వరదేశాన్మహేశ్వర ।
యదనిందత్పితా మే త్వామవిద్వాంస్తేజ ఐశ్వరమ్ ॥ 15

విద్ధామర్షాశయస్సాక్షాత్సర్వలోకగురుం ప్రభుమ్ ।
భ్రాతృహేతి మృషాదృష్టిస్త్వద్భక్తే మయి చాఘవాన్ ॥ 16

తస్మాత్పితా మే పూయేత దురంతాద్దుస్తరాదఘాత్ ।
పూతస్తేఽపాంగసందృష్టస్తదా కృపణవత్సల ॥ 17

మహా-ఈశ్వర - ఓ మహేశ్వరా!, వరద-ఈశాత్ - వరములని చ్చువారలకు ప్రభుడవగు, తే - నీనుండి, ఏతత్ - ఈ, వరమ్ - వరము ను, వరయే - కోరుచున్నాను, కృపణవత్సల - దీనబంధూ!, ఐశ్వరమ్ - ఈశ్వరునకు చెందిన, తేజః - తేజస్సును, అవిద్వాన్ - ఎరుగనివాడు, విద్ధ

-అమర్ష-ఆశయః - వ్యథను పొందినవాడు కోపముతో నిండిన అంతఃకరణము గలవాడు, భ్రాతృహా - సోదరుని చంపినవాడు, ఇతి - అనే, మృషాదృష్టిః - తప్పుడు ధారణ గలవాడు, త్వద్-భక్తే - నీ భక్తుడనగు, మయి చ - నాయందు కూడ, అఘవాన్ - ద్రోహము గలవాడు అగు, మే - నాయొక్క, పితా - తండ్రి, సాక్షాత్ - సాక్షాత్తుగా, సర్వలోకగురుమ్ - సకలప్రాణులకు తండ్రివైయైనట్టియు, ప్రభుమ్ - జగన్నాథుడవగు, త్వామ్ - నిన్ను, అనిందత్ - నిందించెను, యత్ - అనేది ఏది గలదో, తస్మాత్ - అట్టి, దురంతాత్ - అంతము లేని, దుస్తరాత్ - తరించ శక్యము కాని, అఘాత్ - పాపమునుండి, పూయేత - పవిత్రుడగు గాక!, తదా - అప్పుడు, తే - నీయొక్క, అపాంగసందృష్టః - కడకంటి చూపుచే చక్కగా చూడబడినవాడై, పూతః - పవిత్రుడైనాడు.

ప్రహ్లాదుడు ఇట్లు పలికెను --- ఓ మహేశ్వరా! నీవు వరములనిచ్చువారికి ప్రభుడవు. నేను నీనుండి ఈ వరమును కోరుచున్నాను. ఈశ్వరుని తేజస్సు గురించి తెలియని నా తండ్రి నీవే తన సోదరుని చంపినావనే తప్పుడు ధారణను కలిగియుండెను. ఆయన అంతఃకరణము వ్యథతో మరియు కోపముతో నిండియుండెను. పైగా, ఆయన నీ భక్తుడనగు నాకు కూడ ద్రోహమును చేసెను. సర్వసమర్థుడవగు నీవు సాక్షాత్తుగా సకలప్రాణులకు తండ్రివి. అట్టి నిన్ను నిందించి, ఆయన అంతము లేని పాపమును చేసెను. ఆ పాపమును తరించుట శక్యము కాదు. ఓ దీనబంధూ! ఆయన ఆ పాపమునుండి విముక్తుడగు గాక! నీవు ఆయనను సంహరించినప్పుడు కడకంటితో చక్కగా చూచితివి. ఆ చూపుతోనే ఆయన పవిత్రుడైనాడు.

శ్రీభగవానువాచ ।
త్రిస్సప్తభిః పితా పూతః పితృభిస్సహ తేఽనఘ ।
యత్సాధోఽస్య గృహే జాతో భవాన్ వై కులపావనః ॥ 18

అనఘ - పాపము లేనివాడా!, సాధో - ఓ సత్పురుషా!, తే - నీయొక్క, పితా - తండ్రి, త్రిః సప్తభిః - ఇరవై ఒక్క, పితృభిః సహ - పితరులతో సహా, పూతః - పవిత్రుడైనాడు, యత్ - ఎందువలననగా, అస్య -

వీనియొక్క, గృహే - ఇంటియందు, కులపావనః - కులమును పవిత్రము చేసే, భవాన్ - నీవు, జాతః - పుట్టినాడవు, వై - నిశ్చయము.

ఓ సత్పురుషా! నీలో పాపము లేదు. నీ తండ్రి ఇరవై ఒక్క తరాల పితృదేవతలతో సహా పవిత్రుడైనాడు. ఇది నిశ్చయము. ఎందుకంటే, కులమును పావనము చేసే నీవు వీని ఇంటిలో జన్మించినావు గదా!

యత్ర యత్ర చ మద్భక్తాః ప్రశాంతాస్సమదర్శినః ।
సాధవస్సముదాచారాస్తే పూయంత్యపి కీకటాః ॥ 19

ప్రశాంతాః - ప్రసన్నమైన మనస్సులు గలవారు, సమదర్శినః - సర్వసముడగు పరబ్రహ్మను దర్శించువారు, సాధవః - సత్పురుషులు, సముదాచారాః - చక్కని ఉత్తమమగు ప్రవృత్తి గలవారు అగు, మద్-భక్తాః - నా భక్తులు, యత్ర యత్ర చ - ఎక్కడెక్కడనైతే ఉందురో, తే - అవి, కీకటాః అపి - కీకటదేశములు కూడ, పూయంతి - పవిత్రమగును.

సత్పురుషులగు నా భక్తులు ప్రసన్నమైన మనస్సుతో సర్వమునందు పరమాత్మను దర్శించెదరు. చక్కని ఉత్తమమైన ప్రవృత్తి గల అట్టి నా భక్తులు ఏయే దేశములో అడుగిడుదురో, ఆ స్థానములు కీకటములే (అపవిత్రదేశములు) అయినా, పావనమగును.

సర్వాత్మనా న హింసంతి భూతగ్రామేషు కించన ।
ఉచ్చావచేషు దైత్యేంద్ర మద్భావేన గతస్పృహాః ॥ 20

దైత్య-ఇంద్ర - ఓ రాక్షసరాజా!, మద్-భావేన - నాయందలి భక్తిచే, గతస్పృహాః - తొలగిపోయిన కోరికలు గలవారు, ఉచ్చావచేషు - పెద్ద చిన్న, భూతగ్రామేషు - ప్రాణుల వర్గములయందు, కించన - దేనినైననూ, సర్వాత్మనా - ఏ విధముగనైననూ, న హింసంతి - హింసించరు.

ఓ రాక్షసరాజా! తొలగిపోయిన కోరికలు గల నా భక్తులు పెద్ద గాని, చిన్న గాని ప్రాణుల సముదాయములయందు ఏ ప్రాణికైననూ ఏ విధమైన హింసను చేయరు. వారు హింసను పరిహరించుటకు సర్వప్రయత్నములను చేసెదరు.

భవంతి పురుషా లోకే మద్భక్తాస్త్వామనువ్రతాః ।
భవాన్మే ఖలు భక్తానాం సర్వేషాం ప్రతిరూపధృక్ ।। 21

లోకే - లోకమునందు, త్వామ్ - నిన్ను, అనువ్రతాః - నిష్ఠగా అనుసరించువారు, మద్-భక్తాః - నా భక్తులు, భవంతి - అగుదురు, మే - నాయొక్క, భక్తానామ్ - భక్తులకు, సర్వేషామ్ - అందరికి, భవాన్ - నీవు, ప్రతిరూపధృక్ ఖలు - పోలికగా ఆదర్శమును నిల్పువాడవు సుమా!

లోకములో నిన్ను నిష్ఠగా అనుసరించే జనులు నా భక్తులగుదురు. నా భక్తులందరిలో శ్రేష్ఠుడవగు నీవు నా భక్తులందరికీ ఆదర్శము అగుచున్నావు సుమా!

కురు త్వం ప్రేతకార్యాణి పితుః పూతస్య సర్వశః ।
మదంగస్పర్శనేనాంగ లోకాన్ యాస్యతి సుప్రజాః ।। 22

అంగ - ఓ వత్సా!, మద్-అంగస్పర్శనేన - నా అవయవములను స్పృశించుటచే, సర్వశః - అన్ని విధములుగా, పూతస్య - పవిత్రుడైన, పితుః - తండ్రియొక్క, ప్రేతకార్యాణి - దహనము మొదలగు ప్రేతకర్మలను, త్వమ్ - నీవు, కురు - చేయుము, సుప్రజాః - చక్కని సంతానము గల ఆతడు, లోకాన్ - లోకములను, యాస్యతి - పొందగలడు.

ఓ వత్సా! నా అవయవములను స్పృశించుటచే నీ తండ్రి అన్ని విధములుగా (అన్ని పాపములనుండి) పవిత్రుడైనాడు. నీవంటి మంచి పుత్రుని కన్నందువలన ఆయన పుణ్యలోకములను పొందగలడు.

పిత్ర్యం చ స్థానమాతిష్ఠ యథోక్తం బ్రహ్మవాదిభిః ।
మయ్యావేశ్య మనస్తాత కురు కర్మాణి మత్పరః ।। 23

పిత్ర్యమ్ - తండ్రికి చెందిన, స్థానం చ - స్థానమును కూడ, ఆతిష్ఠ - అధిష్ఠించుము, తాత - వత్సా!, మనః - మనస్సును, మయి - నాయందు, ఆవేశ్య - గట్టిగా నిలిపి, బ్రహ్మవాదిభిః - వేదవేత్తలచే, యథా-ఉక్తమ్ - చెప్పబడినదానిని అతిక్రమించకుండగా, మత్-పరః - నేనే పరమ లక్ష్యముగా గలవాడవై, కర్మాణి - కర్మలను, కురు - చేయుము.

ఓ వత్సా! నీ తండ్రియొక్క రాజ్యాధికారమును కూడ నీవు చేపట్టుము. మనస్సును నాయందే గట్టిగా నిలిపి, నేనే పరమలక్ష్యముగా గలవాడవై, వేదవేత్తల బోధనలను ఉల్లంఘించకుండా, కర్మలను చేయుము.

నారద ఉవాచ ।
ప్రహ్లాదోఽపి తథా చక్రే పితుర్యత్సాంపరాయికమ్ ।
యథాఽఽహ భగవాన్ రాజన్నభిషిక్తో ద్విజోత్తమైః ।। 24

రాజన్ - ధర్మరాజా!, ప్రహ్లాదః అపి - ప్రహ్లాదుడు కూడ, పితుః - తండ్రియొక్క, యత్ - ఏ, సాంపరాయికమ్ - ప్రేతకర్మ గలదో దానిని, తథా - ఆ విధముగా, చక్రే - చేసెను, యథా - ఏ విధముగానైతే, భగవాన్ - భగవానుడు, ఆహ - చెప్పెనో, ద్విజ-ఉత్తమైః - గొప్ప వేదవేత్తలచే, అభిషిక్తః - అభిషేకించబడినవాడు.

నారదుడిట్లు పలికెను --- ఓ ధర్మరాజా! నరసింహ భగవానుడు ఆదేశించిన విధముగా ప్రహ్లాదుడు కూడ తండ్రియొక్క ప్రేతకర్మను చేసెను. గొప్ప వేదవేత్తలు ఆయనను రాజ్యాభిషిక్తుని చేసిరి.

ప్రసాదసుముఖం దృష్ట్వా బ్రహ్మా నరహరిం హరిమ్ ।
స్తుత్వా వాగ్భిః పవిత్రాభిః ప్రాహ దేవాదిభిర్వృతః ।। 25

బ్రహ్మా - బ్రహ్మగారు, నరహరిమ్ - నరసింహరూపములోనున్న, హరిమ్ - శ్రీహరిని, ప్రసాదసుముఖమ్ - ప్రసన్నతచే సుందరమైన ముఖము గలవానినిగా, దృష్ట్వా - గమనించి, పవిత్రాభిః - పవిత్రములగు, వాగ్భిః - వాక్కులతో, స్తుత్వా - స్తుతించి, దేవ-ఆదిభిః - దేవతలు మొదలగువారిచే, వృతః - చుట్టువారబడియున్నవాడై, ప్రాహ - పలికెను.

నరసింహరూపములోనున్న శ్రీహరి ప్రసన్నుడై సుందరమగు ముఖమును కలిగియుండుటను గమనించిన బ్రహ్మగారు, దేవతలు మహర్షులు మొదలగువారు చుట్టువారియుండగా, పవిత్రములగు వాక్కులతో స్తుతించి ఇట్లు పలికెను.

బ్రహ్మోవాచ ।
దేవదేవాఖిలాధ్యక్ష భూతభావన పూర్వజ ।
దిష్ట్యా తే నిహతః పాపో లోకసంతాపనోఽసురః ।। 26

దేవదేవ - ఓ దేవదేవా!, అఖిల-అధ్యక్ష - సర్వేశ్వరా!, భూతభావన - ప్రాణులను వెలయించువాడా!, పూర్వజ - తండ్రీ!, పాపః - పాపి, లోకసంతాపనః - లోకములకు అధికమగు తాపమును కలిగించినవాడు అగు, అసురః - రాక్షసుడు, తే - నీచే, నిహతః - సంహరించబడినవాడు, దిష్ట్యా - మంగళము.

ఓ దేవదేవా! సర్వేశ్వరడవగు నీవే సకలప్రాణులను సృష్టించితివి. తండ్రీ! పాపియై లోకములకు అధికమగు పీడను కలిగించుచున్న రాక్షసుని నీవు సంహరించి లోకకల్యాణమును చేసితివి.

యోఽసౌ లబ్ధవరో మత్తో న వధ్యో మమ సృష్టిభిః ।
తపోయోగబలోన్నద్ధస్సమస్తనిగమానహన్ ।। 27

మత్తః - నానుండి, లబ్ధవరః - పొందబడిన వరములు గల, యః - ఏ రాక్షసుడు గలడో, అసౌ - ఈతడు, మమ - నాయొక్క, సృష్టిభిః - సృష్టించబడినవారిచే, వధ్యః - సంహరించబడువాడు, న - కాడు, తపః-యోగబల-ఉన్నద్ధః - తపస్సుచే కలిగిన యోగసిద్ధుల బలముచే గర్వించినవాడై, సమస్తనిగమాన్ - సకలవేదములను, అహన్ - చెడగొట్టెను.

ఈ రాక్షసుడు నా సృష్టిలోని వారెవ్వరైననూ సంహరించలేని విధముగా నానుండి వరములను పొందెను. ఈతడు తపస్సును చేసి యోగశక్తులను సంపాదించి గర్వించినవాడై వైదికధర్మములనన్నింటినీ చెడగొట్టెను.

దిష్ట్యాస్య తనయస్సాధుర్మహాభాగవతోఽర్భకః ।
త్వయా విమోచితో మృత్యోర్దిష్ట్యా త్వాం సమితోఽధునా ।।28

అస్య - వీనియొక్క, తనయః - పుత్రుడు, అర్భకః - బుడతడు, దిష్ట్యా - సౌభాగ్యముచే, సాధుః - సత్పురుషుడు, మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడు, త్వయా - నీచే, మృత్యోః - మృత్యువునుండి, విమోచితః -

విడిపించబడినవాడు, దిష్ట్యా - సౌభాగ్యముచే, అధునా - ఇప్పుడు, త్వామ్ - నిన్ను, సమితః - శరణు పొందినవాడు.

కాని సౌభాగ్యమేమనగా వీని పుత్రుడగు ఈ బుడతడు సత్పురుషుడు, గొప్ప భగవద్భక్తుడు. వానిని నీవు మృత్యువునుండి విడిపించితివి. ఈతడు సౌభాగ్యముచే నిన్ను ఇప్పుడు శరణు పొందినాడు.

ఏతద్వపుస్తే భగవన్ ధ్యాయతః ప్రయతాత్మనః ।
సర్వతో గోప్తృ సంత్రాసాన్మృత్యోరపి జిఘాంసతః ॥ 29

భగవన్ - భగవానుడా!, తే - నీయొక్క, ఏతత్ - ఈ, వపుః - రూపమును, ప్రయత-ఆత్మనః - నియంత్రించబడిన మనస్సు గలవానికి, ధ్యాయతః - ధ్యానించువానికి, జిఘాంసతః - సంహరించగోరే, మృత్యోః - మృత్యువు వలని, సంత్రాసాత్ అపి - అధికమగు భయమునుండి కూడ, సర్వతః - అన్ని విధములుగా, గోప్తృ - రక్షించునది.

ఓ భగవానుడా! నీ ఈ రూపము నియంత్రించబడిన మనస్సుతో ధ్యానించువానిని అన్ని విధములుగా రక్షించును; మృత్యుదేవత సంహరించగోరువానినైననూ ఈ రూపముయొక్క ధ్యానము రక్షించును.

నృసింహ ఉవాచ ।
మైవం వరోఽసురాణాం తే ప్రదేయః పద్మసంభవ ।
వరః క్రూరనిసర్గాణామహీనామమృతం యథా ॥ 30

పద్మసంభవ - పద్మమునుండి పుట్టినవాడా!, తే - నీచే, ఏవమ్ - ఈ విధముగా, అసురాణామ్ - అసురులకు, వరః - వరము, మా ప్రదేయః - ఈయబడరాదు, క్రూరనిసర్గాణామ్ - క్రూరస్వభావము గలవారికి, వరః - వరము, అహీనామ్ - పాములకు, అమృతం యథా - పాలు వంటిది.

నరసింహుడిట్లు పలికెను --- పద్మమునుండి పుట్టిన ఓ బ్రహ్మ! నీవు అసురులకు ఇట్టి వరమును ఈయరాదు. క్రూరస్వభావము గలవారికి వరమునిచ్చుట పాములకు పాలు పోయుట వంటిది.

నారద ఉవాచ ।

ఇత్యుక్త్వా భగవాన్ రాజంస్తత్రైవాంతర్దధే హరిః ।
అదృశ్యస్సర్వభూతానాం పూజితః పరమేష్ఠినా ॥ 31

రాజన్ - ధర్మరాజా!, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, ఇతి - ఈ విధముగా, ఉక్త్వా - పలికి, పరమేష్ఠినా - బ్రహ్మగారిచే, పూజితః - పూజించబడినవాడై, తత్ర ఏవ - అప్పుడే (అచ్చటనే), అంతః-దధే - అంతర్ధానమాయెను, సర్వభూతానామ్ - సకలప్రాణులకు, అదృశ్యః - కానరానివాడు.

ఓ ధర్మరాజా! శ్రీహరి భగవానుడీ విధముగా పలికి, బ్రహ్మగారి పూజలనందుకొని, అప్పుడే అక్కడే సకలప్రాణులకు కానరాకుండా అంతర్ధానమాయెను.

తతస్సంపూజ్య శిరసా వవందే పరమేష్ఠినమ్ ।
భవం ప్రజాపతీన్ దేవాన్ ప్రహ్లాదో భగవత్కలాః ॥ 32

ప్రహ్లాదః - ప్రహ్లాదుడు, తతః - తరువాత, భగవత్-కలాః - భగవానుని అంశలగు, పరమేష్ఠినమ్ - బ్రహ్మగారిని, భవమ్ - రుద్రుని, ప్రజాపతీన్ - ప్రజాపతులను, దేవాన్ - దేవతలను, సంపూజ్య - చక్కగా పూజించి, శిరసా - శిరస్సుతో, వవందే - నమస్కరించెను.

తరువాత ప్రహ్లాదుడు భగవానుని అంశలగు బ్రహ్మగారిని, రుద్రుని, ప్రజాపతులను, దేవతలను చక్కగా పూజించి తల వంచి ప్రణమిల్లెను.

తతః కావ్యాదిభిస్సార్ధం మునిభిః కమలాసనః ।
దైత్యానాం దానవానాం చ ప్రహ్లాదమకరోత్పతిమ్ ॥ 33

తతః - తరువాత, కావ్య-ఆదిభిః - శుక్రాచార్యుడు మొదలైన, మునిభిః సార్ధమ్ - మహర్షులతో గూడి, కమల-ఆసనః - పద్మాసనుడగు బ్రహ్మగారు, దైత్యానామ్ - దితి వంశీయులకు, దానవానాం చ - దనువంశీయులకు కూడ, ప్రహ్లాదమ్ - ప్రహ్లాదుని, పతిమ్ - ప్రభువునుగా, అకరోత్ - చేసెను.

తరువాత పద్మాసనుడగు బ్రహ్మగారు శుక్రాచార్యుడు మొదలగు మహర్షులతో గూడి, ప్రహ్లాదుని దితి-దనువంశీయులగు రాక్షసులకు ప్రభువునుగా చేసెను.

ప్రతినంద్య తతో దేవాః ప్రయుజ్య పరమాశిషః ।
స్వధామని యయూ రాజన్ బ్రహ్మాద్యాః ప్రతిపూజితాః ।।34

రాజన్ - ఓ ధర్మరాజా!, తతః - తరువాత, బ్రహ్మ-ఆద్యాః - బ్రహ్మగారు మొదలైన, దేవాః - దేవతలు, ప్రతినంద్య - అభినందించి, పరమ-ఆశిషః - గొప్ప ఆశీస్సులను, ప్రయుజ్య - చేసి, ప్రతిపూజితాః - తిరిగి పూజించబడినవారై, స్వధామని - తమ స్థానమునందు, యయుః - వెళ్లిరి.

ఓ ధర్మరాజా! తరువాత బ్రహ్మగారు మొదలగు దేవతలు ప్రహ్లాదుని అభినందించి గొప్ప ఆశీస్సులను చేసిరి. ప్రహ్లాదుడు కూడ వారిని పూజించెను. అపుడు వారు తమ తమ స్థానములకు వెళ్లిరి.

ఏవం తౌ పార్షదౌ విష్ణోః పుత్రత్వం ప్రాపితౌ దితేః ।
హృది స్థితేన హరిణా వైరభావేన తౌ హతౌ ।। 35

ఏవమ్ - ఈ విధముగా, విష్ణోః - విష్ణువుయొక్క, పార్షదౌ - అనుచరులైన, తౌ - వారిద్దరు, దితేః - దితియొక్క, పుత్రత్వమ్ - సంతానమగుటను, ప్రాపితౌ - పొందించబడినవారు, వైరభావేన - వైరబుద్ధిచే, హరిణా - శ్రీహరి, హృది - హృదయమునందు, స్థితేన - నిలిచియుండగా, తౌ - వారిద్దరు, హతౌ - సంహరించబడినవారు.

ఈ విధముగా విష్ణువుయొక్క అనుచరులగు ఆ జయ విజయులిద్దరు దితికి పుత్రులై జన్మించిరి. వైరబుద్ధిచే శ్రీహరియే హృదయమునందు స్థిరముగా నిలిచియుండగా, వారిద్దరు సంహరించబడిరి.

పునశ్చ విప్రశాపేన రాక్షసౌ తౌ బభూవతుః ।
కుంభకర్ణదశగ్రీవౌ హతౌ తౌ రామవిక్రమైః ।। 36

పునః చ - మరల, విప్రశాపేన - వేదవేత్తలగు సనకాదుల శాపము చే, తౌ - వారిద్దరు, కుంభకర్ణదశగ్రీవౌ - కుంభకర్ణుడు రావణుడు అనే, రాక్షసౌ - రాక్షసులుగా, బభూవతుః - అయిరి, తౌ - వారిద్దరు, రామవిక్రమైః - శ్రీరాముని పరాక్రమములచే, హతౌ - సంహరించబడినవారు.

వేదవేత్తలగు సనకాదుల శాపముచే మరల వారిద్దరు కుంభకర్ణుడు, రావణుడు అనే రాక్షసులై జన్మించిరి. వారినిద్దరిని పరాక్రమశాలియగు శ్రీరాముడు సంహరించెను.

శయానౌ హృది నిర్భిన్నహృదయౌ రామసాయకైః ।
తచ్చిత్తౌ జహతుర్దేహం యథా ప్రాక్తనజన్మని ॥ 37

రామసాయకైః - శ్రీరాముని బాణములచే, నిర్భిన్నహృదయైః - పగులగొట్టబడిన హృదయములు గలవారై, శయానౌ - నేలకొరిగినవారై, **తత్**-చిత్తౌ - ఆయననయే చిత్తమునందు గలవారై, ప్రాక్తనజన్మని యథా - గడచిన జన్మయందు వలెనే, దేహమ్ - దేహమును, జహతుః - విడిచిరి.

శ్రీరాముడు తన బాణములతో వారి గుండెలను పగులగొట్టగా, వారు నేలకొరిగి, గడచిన జన్మ (హిరణ్యాక్ష-హిరణ్యకశిపులు) లో వలెనే ఆయననే చిత్తములో స్మరిస్తూ దేహమును విడిచిపెట్టిరి.

తావిహాథ పునర్జాతౌ శిశుపాలకరూషజౌ ।
హరౌ వైరానుబంధేన పశ్యతస్తే సమీయతుః ॥ 38

అథ - తరువాత, తౌ - వారిద్దరు, ఇహ - ఈ కాలమునందు, పునః - మరల, శిశుపాలకరూషజౌ - శిశుపాల దంతవక్త్రులై, జాతౌ - జన్మించినవారు, హరౌ - శ్రీహరియందు, వైర-అనుబంధేన - వైరమును నిరంతరముగా చేయుటచే, తే - నీవు, పశ్యతః - చూచుచుండగా, సమీయతుః - విలీనమైరి.

తరువాత వారిద్దరు ఈ సమయములో శిశుపాల దంతవక్త్రులై జన్మించి శ్రీహరియందు వైరమును నిరంతరముగా చేసిరి. నీవు చూచుచుండగనే వారిద్దరు శ్రీహరియందు విలీనమైరి.

ఏనః పూర్వకృతం యత్తద్రాజానః కృష్ణవైరిణః ।
జహుస్త్వంతే తదాత్మానః కీటః పేశస్కృతో యథా ।। 39

కృష్ణవైరిణః - శ్రీకృష్ణునియందు వైరముగల, రాజానః తు - రాజులైతే, పూర్వకృతమ్ - పూర్వజన్మలో చేయబడిన, ఏనః - పాపము, యత్ - ఏది గలదో, తత్ - దానిని, అంతే - అంతమునందు, కీటః - గొంగళి పురుగు, పేశస్కృతః యథా - తుమ్మెద రూపమును వలె, తద్-ఆత్మానః - ఆ శ్రీకృష్ణుని స్వరూపము గలవారై, జహుః - విడిచి పెట్టిరి.

శ్రీకృష్ణునియందు వైరము గల రాజులు పూర్వజన్మలో ఆయనను నిందించి చాల పాపమును చేసిరి. కాని, గొంగళిపురుగు తుమ్మెదను ధ్యానించి దాని రూపమును పొందినట్లుగా, వారు దేహత్యాగసమయమునందు శ్రీకృష్ణుని స్వరూపములో విలీనమై ఆ పాపమును విడిచిపెట్టిరి.

యథా యథా భగవతో భక్త్యా పరమయాఽభిదా ।
నృపాశ్చైద్యాదయస్సాత్మ్యం హరేస్తచ్చింతయా యయుః ।। 40

అభిదా - భేదము లేని, పరమయా - సర్వోత్కృష్టమైన, భగవతః - భగవంతుని, భక్త్యా - భక్తిచే, తత్-చింతయా - ఆయనను ధ్యానించుటచే, యథా యథా - ఏయే విధముగా, హరేః - శ్రీహరియొక్క, సాత్మ్యమ్ - స్వరూపమును, యయుః - పొందిరో, చైద్య-ఆదయః - చేదిరాజగు శిశుపాలుడు మొదలగు, నృపాః - రాజులు.

భక్తులు భేదదర్శనము లేని సర్వోత్కృష్టమైన భగవంతునియందలి భక్తితో ఏయే విధముగా శ్రీహరిని ధ్యానించి ఆయన స్వరూపములో విలీనమగుదురో, అదే విధముగా చేదిరాజగు శిశుపాలుడు మొదలగు రాజులు కూడ ఆయననే నిరంతరముగా స్మరించి ఆయనలో విలీనమైరి.

ఆఖ్యాతం సర్వమేతత్తే యన్మాం త్వం పరిపృష్టవాన్ ।
దమఘోషసుతాదీనాం హరేస్సాత్మ్యమపి ద్విషామ్ ।। 41

ఏతత్ - ఈ, సర్వమ్ - సర్వము, తే - నీ కొరకు, ఆఖ్యాతమ్ - చెప్పబడినది, యత్ - దేనిని, త్వమ్ - నీవు, మామ్ - నన్ను, పరిపృష్ట

వాన్ - భక్తితో ప్రశ్నించితివో, ద్విషాం అపి - శత్రువులే అయిననూ, దమ ఘోషసుత-ఆదీనామ్ - దమఘోషుని పుత్రుడగు శిశుపాలుడు మొదలగు వారియొక్క, హరేః - శ్రీహరియొక్క, సాత్మ్యమ్ - స్వరూపములో విలీన మగుట.

దమఘోషుని పుత్రుడగు శిశుపాలుడు మొదలగువారు శ్రీహరిని ద్వేషించి కూడా ఆయన స్వరూపములో విలీనమగుటను గురించి నీవు నన్ను సాదరముగా ప్రశ్నించితివి. ఈ విషయమునంతనూ నేను నీకు చెప్పితిని.

ఏషా బ్రహ్మణ్యదేవస్య కృష్ణస్య చ మహాత్మనః ।
అవతారకథా పుణ్యా వధో యత్రాదిదైత్యయోః ॥ 42

బ్రహ్మణ్యదేవస్య - వేదవేత్తలయెడల భక్తి గల దేవుడైనట్టియు, మహాత్మనః - సర్వాత్మస్వరూపుడగు, కృష్ణస్య చ - శ్రీకృష్ణునియొక్క, ఏషా - ఈ, అవతారకథా - అవతార గాథ, పుణ్యా - పవిత్రమైనది, యత్ర - దేనియందైతే, ఆదిదైత్యయోః - మొట్టమొదటి దైత్యులిద్దరి, వధః - సంహారమో.

శ్రీకృష్ణుడు వేదవేత్తల యెడల భక్తి గల దేవుడు. సర్వా త్మస్వరూపుడగు ఆయనయొక్క ఈ అవతార గాథ పవిత్రమైనది. దీని యందు మొట్టమొదటి దితిపుత్రులగు హిరణ్యాక్ష-హిరణ్యకశిపుల సంహా రము వర్ణించబడినది.

ప్రహ్లాదస్యానుచరితం మహాభాగవతస్య చ ।
భక్తిర్జ్ఞానం విరక్తిశ్చ యాథాత్మ్యం చాస్య వై హరేః ॥ 43

మహాభాగవతస్య - గొప్ప భగవద్భక్తుడగు, ప్రహ్లాదస్య - ప్రహ్లాదు నియొక్క, అనుచరితమ్ - వృత్తాంతము, భక్తిః - భక్తి, జ్ఞానమ్ - జ్ఞానము, విరక్తిః చ - వైరాగ్యము, అస్య - ఈ, హరేః - శ్రీహరియొక్క, యాథా త్మ్యం చ - స్వరూపము కూడ, వై - నిశ్చయముగా.

గొప్ప భగవద్భక్తుడగు ప్రహ్లాదుని వృత్తాంతము, భక్తి, జ్ఞానము, వైరాగ్యము, ఈ శ్రీహరియొక్క స్వరూపము అను విషయములు నిశ్చయముగా వర్ణించబడినవి.

సర్గస్థిత్యప్యయేశస్య గుణకర్మానువర్ణనమ్ ।
పరావరేషాం స్థానానాం కాలేన వ్యత్యయో మహాన్ ।। 44

సర్గస్థితి-అప్యయ-ఈశస్య - సృష్టిస్థితిలయములకు ప్రభువగు శ్రీహరియొక్క, గుణకర్మ-అనువర్ణనమ్ - గుణముల మరియు లీలల వర్ణనము, పర-అవరేషామ్ - గొప్పవారగు దేవతల మరియు నికృష్టులగు రాక్షసులయొక్క, స్థానానామ్ - స్థానములకు, కాలేన - కాలముచే, మహాన్ - పెద్ద, వ్యత్యయః - మార్పు.

సృష్టిస్థితిలయములకు ప్రభుడగు శ్రీహరియొక్క గుణములు, లీలలు వర్ణించబడినవి. గొప్పవారగు దేవతల స్థానములలో, నికృష్టులగు రాక్షసుల స్థానములలో కాలమును బట్టి వచ్చిన గొప్ప మార్పులు (తల్లక్రిందులగుట) కూడ వర్ణించబడినవి.

ధర్మో భాగవతానాం చ భగవాన్ యేన గమ్యతే ।
ఆఖ్యానేఽస్మిన్ సమామ్నాతమాధ్యాత్మికమశేషతః ।। 45

భాగవతానామ్ - భగవద్భక్తులయొక్క, ధర్మః చ - ధర్మము కూడ, యేన - దేనిచే, భగవాన్ - భగవానుడు, గమ్యతే - పొందబడునో, అస్మిన్ - ఈ, ఆఖ్యానే - గాథయందు, ఆధ్యాత్మికమ్ - ఆత్మస్వరూపము మొదలైనవి, అశేషతః - నిశ్శేషముగా, సమామ్నాతమ్ - చక్కగా వర్ణించబడినది.

భగవానుని పొందించే భగవద్భక్తుల ధర్మము, ఆత్మానాత్మవివేకము మొదలైన ఆత్మస్వరూప నిరూపణము కూడ ఈ గాథలో చక్కగా వర్ణించ బడినవి.

య ఏతత్పుణ్యమాఖ్యానం విష్ణోర్వీర్యోపబృంహితమ్ ।
కీర్తయేచ్ఛ్రద్ధయా శ్రుత్వా కర్మపాశైర్విముచ్యతే ।। 46

విష్ణోః - విష్ణువుయొక్క, వీర్య-ఉపబృంహితమ్ - పరాక్రమముచే విస్తారమైన, ఏతత్ - ఈ, పుణ్యమ్ - పవిత్రమైన, ఆఖ్యానమ్ - గాథను, యః - ఎవడైతే, శ్రద్ధయా - శ్రద్ధతో, కీర్తయేత్ - కీర్తించునో, శ్రుత్వా - విని, కర్మపాశాత్ - కర్మబంధమునుండి, విముచ్యతే - విముక్తుడగును.

ఈ పవిత్రమైన గాథలో విష్ణువుయొక్క పరాక్రమము విస్తారముగా వర్ణించబడినది. దీనిని ఎవడైతే శ్రద్ధతో కీర్తించునో మరియు వినునో, అట్టి వాడు కర్మబంధమునుండి విముక్తుడగును.

ఏతద్య ఆదిపురుషస్య మృగేంద్రలీలాం
దైత్యేంద్రయూథపవధం ప్రయతః పఠేత ।
దైత్యాత్మజస్య చ సతాం ప్రవరస్య పుణ్యం
శ్రుత్వానుభావమకుతోభయమేతి లోకమ్ ॥ 47

యః - ఎవడైతే, ఏతత్ - ఈ విధముగా, ఆదిపురుషస్య - సర్వజగత్కారణుడగు పురుషోత్తమునియొక్క, మృగ-ఇంద్రలీలామ్ - నరసింహావతారముయొక్క లీలను, దైత్య-ఇంద్రయూథపవధమ్ - రాక్షసరాజు సేనానాయకుడు అగు హిరణ్యకశిపుని సంహారమును, సతామ్ - సత్పురుషులలో, ప్రవరస్య - శ్రేష్ఠుడగు, దైత్య-ఆత్మజస్య - అసురపుత్రుడగు ప్రహ్లాదునియొక్క, పుణ్యమ్ - పవిత్రమగు, అనుభావం చ - ప్రభావమును గురించి కూడ, శ్రుత్వా - విని, ప్రయతః - ఏకాగ్రచిత్తము గలవాడై, పఠేత - పఠించునో, అకుతః-భయమ్ - దేనివలనైననూ భయము లేని, లోకమ్ - లోకమును, ఏతి - పొందును.

ఈ విధముగా సర్వజగత్కారణుడగు పురుషోత్తముడు నరసింహావతారమునెత్తి లీలలను చేసెను. ఆయన రాక్షసరాజు సేనానాయకుడు అగు హిరణ్యకశిపుని సంహరించెను. హిరణ్యకశిపుని పుత్రుడగు ప్రహ్లాదుడు పవిత్రమగు ప్రభావము గలవాడు. ఈ వృత్తాంతమునంతనూ ఎవడైతే వినునో, ఏకాగ్రమగు చిత్తముతో పఠించునో, అట్టివాడు దేనివలనైననూ భయము లేని ఆత్మలోకమును (ఆత్మజ్ఞానముచే) పొందును.

యూయం నృలోకే బత భూరిభాగా
లోకం పునానా మునయోఽభియంతి ।
యేషాం గృహానావసతీతి సాక్షాద్
గూఢం పరం బ్రహ్మ మనుష్యలింగమ్ ॥ 48

బత - ఆహా!, నృలోకే - మానవలోకమునందు, యూయమ్ - మీరు, భూరిభాగాః - గొప్ప భాగ్యము గలవారు, యేషామ్ - ఏ మీయొక్క, గృహాన్ - ఇంటిని, గూఢమ్ - రహస్యమైనట్టియు, మనుష్యలింగమ్ - మానవాకారము గల, పరం బ్రహ్మ - పరబ్రహ్మ, సాక్షాత్ - సాక్షాత్తుగా, ఆవసతి - నివసించుచున్నాడో, ఇతి - అని, లోకమ్ - లోకమును, పునానాః - పావనము చేయు, మునయః - మహర్షులు, అభియంతి - అభిముఖముగా వచ్చుచున్నారో.

ఆహా! మానవలోకములో మీ భాగ్యము చాల గొప్పది. రహస్యముగా మానవాకృతిని దాల్చియున్న పరబ్రహ్మ సాక్షాత్తుగా మీ ఇంటిలో నివసించుచున్నాడు. కావుననే, లోకమును పావనము చేసే మహర్షులు అన్ని వైపులనుండియు మీ గృహమునకు వచ్చుచున్నారు.

స వా అయం బ్రహ్మ మహద్విమృగ్యం
కైవల్యనిర్వాణసుఖానుభూతిః ।
ప్రియస్సుహృద్వః ఖలు మాతులేయ
ఆత్మాఽర్హణీయో విధికృద్గురుశ్చ ॥ 49

మహద్-విమృగ్యమ్ - మహాత్ములచే అన్వేషించబడేది, కైవల్యనిర్వాణసుఖ-అనుభూతిః - అద్వయమగు ఆత్మస్వరూపమునందలి నిష్ఠ అనే ఉపద్రవములు లేని ఆనందముయొక్క అనుభవమే స్వరూపముగా కలిగినది అగు, సః - ప్రసిద్ధమైన, అయమ్ - ఈ ఆత్మరూపమైన, బ్రహ్మ - పరబ్రహ్మ, వై - నిశ్చయముగా, వః - మీకు, ప్రియః - ప్రియమైన, సుహృత్ ఖలు - మిత్రుడు గదా!, మాతులేయః - మేనమామ కొడుకు, ఆత్మా - అనుకూలుడు, అర్హణీయః - పూజనీయుడు, విధికృత్ - పనులను చేసిపెట్టువాడు, గురుః చ - హితమును ఉపదేశించువాడు కూడ.

అద్వయ-ఆత్మాభిన్నము, నిరుపద్రవము, ఆనందానుభవమే స్వరూపముగా గలది, వేదములలో ప్రసిద్ధమైనది అగు పరబ్రహ్మను మహర్షులు ధ్యానమార్గములో అన్వేషించుచుందురు. అట్టి పరబ్రహ్మ మీ మేన మామ కొడుకగు శ్రీకృష్ణుడే. ఆయన మీకు ప్రియమైన హితకారియై హితమునుపదేశించి మీ పనులను కూడ చేసిపెట్టును. మీ పూజలనందుకొనే ఆయన మీకు మిక్కిలి అనుకూలుడు గదా!

న యస్య సాక్షాద్భవపద్మజాదిభీ
రూపం ధియా వస్తుతయోపవర్ణితమ్ ।
మౌనేన భక్త్యోపశమేన పూజితః
ప్రసీదతామేష స సాత్వతాం పతిః ॥ 50

యస్య - ఏ శ్రీకృష్ణునియొక్క, రూపమ్ - తత్త్వము, సాక్షాత్ - సాక్షాత్తుగా, భవపద్మజ-ఆదిభిః - రుద్రుడు బ్రహ్మగారు మొదలగువారిచే, ధియా - బుద్ధితో, వస్తుతయా - యథార్థముగా, న ఉపవర్ణితమ్ - వర్ణించ బడలేదో, మౌనేన - మౌనముచే, భక్త్యా - భక్తిచే, ఉపశమేన - ఇంద్రియజయముచే, పూజితః - ఆరాధించబడువాడు, సాత్వతామ్ - భక్తులకు, పతిః - ప్రభువు అగు, సః - అట్టి, ఏషః - ఈ శ్రీకృష్ణుడు, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!

శ్రీకృష్ణునియొక్క తత్త్వమును సాక్షాత్తుగా బ్రహ్మగారు, రుద్రుడు మొదలగువారైననూ తమ బుద్ధితో యథాతథముగా వర్ణించజాలరు. ఆయనను సాధకులు మౌనముచే, భక్తితో, ఇంద్రియజయముతో ఆరాధించెదరు. భక్తజనపాలకుడగు ఆ ఈ శ్రీకృష్ణుడు మాపై ప్రసన్నుడగు గాక!

స ఏష భగవాన్ రాజన్ వ్యతనోద్విహతం యశః ।
పురా రుద్రస్య దేవస్య మయేనానంతమాయినా ॥ 51

రాజన్ - ఓ రాజా!, పురా - పూర్వము, అనంతమాయినా - అంతు లేనన్ని మాయలు గల, మయేన - మయునిచే, విహతమ్ - నశింప జేయబడిన, రుద్రస్య దేవస్య - రుద్రదేవునియొక్క, యశః - కీర్తిని, సః -

అట్టి, ఏషః - ఈ, భగవాన్ - శ్రీహరి భగవానుడు, వ్యతనోత్ - విస్తరింప జేసెను.

పూర్వము రుద్రదేవుని కీర్తిని అంతు లేని మాయలు గల మయుడు వినష్టము చేసెను. అపుడు ఆ ఈ శ్రీహరి భగవానుడు ఆయన కీర్తిని మరల విస్తరింప జేసెను.

రాజోవాచ ।
కస్మిన్ కర్మణి దేవస్య మయోఽహన్ జగదీశితుః ।
యథా చోపచితా కీర్తిః కృష్ణేనానేన కథ్యతామ్ ॥ 52

జగద్-ఈశితుః - జగన్నాథుడగు, దేవస్య - రుద్రదేవునియొక్క, కస్మిన్ - ఏ, కర్మణి - కార్యమునందు, మయః - మయుడు, అహన్ - వినష్టము చేసెను?, అనేన - ఈ, కృష్ణేన - శ్రీకృష్ణునిచే, కీర్తిః - కీర్తి, ఉపచితా చ - వర్ధిల్ల జేయబడినది?, కథ్యతామ్ - చెప్పబడు గాక!

ధర్మరాజు ఇట్లు పలికెను --- జగన్నాథుడగు రుద్రదేవుని ఏ కార్యమునందు మయుడు ఆయన కీర్తిని వినష్టము చేసినాడు? ఈ శ్రీకృష్ణుడు ఆ కీర్తిని ఎట్లు వర్ధిల్ల జేసెను? వివరించుము.

నారద ఉవాచ ।
నిర్జితా అసురా దేవైర్యుధ్యనేనోపబృంహితైః ।
మాయినాం పరమాచార్యం మయం శరణమాయయుః ॥53

యుధి - యుద్ధమునందు, అనేన - ఈ శ్రీకృష్ణునిచే, ఉపబృంహితైః - వర్ధిల్ల జేయబడిన, దేవైః - దేవతలచే, నిర్జితాః - జయించబడిన, అసురాః - రాక్షసులు, మాయినామ్ - మాయావులకు, పరమ-ఆచార్యమ్ - పరమగురువగు, మయమ్ - మయుని, శరణమ్ - శరణును, ఆయయుః - పొందిరి.

నారదుడిట్లు పలికెను --- ఒకప్పుడు ఈ శ్రీకృష్ణునిచే శక్తి అనుగ్రహించబడిన దేవతలు యుద్ధములో అసురులను జయించిరి. అపుడు వారు మాయావులకు పరమగురువగు మయుని శరణు వేడిరి.

స నిర్మాయ పురస్తిస్రో హైమీరౌప్యాయసీర్విభుః ।
దుర్లక్ష్యాపాయసంయోగా దుర్వితర్క్యపరిచ్ఛదాః ॥ 54

విభుః - సర్వసమర్థుడగు, సః - ఆ మయుడు, హైమీరౌప్య-ఆయసీః - బంగరు వెండి ఇనుములతో చేసినట్టియు, దుర్లక్ష్య-అపాయసంయోగాః - తెలియ శక్యము కాని పోక రాకలు కలిగినట్టియు, దుర్వితర్క్య పరిచ్ఛదాః - ఊహకు అందని వస్తుసామగ్రి గల, తిస్రః - మూడు, పురః - నగరములను, నిర్మాయ - నిర్మించి (ఇచ్చెను).

సర్వసమర్థుడగు ఆ మయుడు బంగారము, వెండి, ఇనుములతో మూడు నగరములను నిర్మించి వారికి ఇచ్చెను. విమానముల రూపములో నుండే ఆ నగరముల రాకపోకలు కంటికి కానరావు. వాటిలోని వస్తు సామగ్రి ఊహకైననూ అందదు.

తాభిస్తేऽసురసేనాన్యో లోకాంస్త్రీన్ సేశ్వరాన్ నృప ।
స్మరంతో నాశయాంచక్రుః పూర్వవైరమలక్షితాః ॥ 55

నృప - ధర్మరాజా!, తే - ఆ, అసురసేనాన్యః - రాక్షస సేనానాయకులు, స-ఈశ్వరాన్ - లోకపాలకులతో కూడిన, త్రీన్ - మూడు, లోకాన్ - లోకములను గురించి, పూర్వవైరమ్ - పూర్వమునందలి వైరమును, స్మరంతః - గుర్తుకు తెచ్చుకున్నవారై, తాభిః - ఆ నగరములతో, అలక్షితాః - కానరానివారై, నాశయాంచక్రుః - నశింప జేసిరి.

ఓ ధర్మరాజా! ఆ రాక్షస సేనానాయకులు లోకపాలకులతో సహా ముల్లోకముల యెడల తమకు పూర్వమునందు గల వైరమును గుర్తుకు తెచ్చుకొని ఆ నగరములలో ఉంటూ కంటికి కనబడకుండా నాశనము చేయ దొడగిరి.

తతస్తే సేశ్వరా లోకా ఉపాసాద్యేశ్వరం విభో ।
త్రాహి నస్తావకాన్ దేవ వినష్టాంస్త్రిపురాలయైః ॥ 56

**తతః** - అప్పుడు, స-ఈశ్వరాః - లోకపాలకులతో గూడిన, తే - ఆ, లోకాః - లోకులు, ఈశ్వరమ్ - రుద్రుని, ఉపాసాద్య - సమీపమునకు

వెళ్లి, దేవ - ఓ దేవా!, త్రిపుర-ఆలయైః - మూడు నగరములయందు నివసించువారిచే, వినష్టాన్ - వినాశము చేయబడిన, తావకాన్ - నీ వారలమగు, నః - మమ్ములను, త్రాహి - రక్షించుము.

ఓ ధర్మరాజా! అపుడు దేవతలు లోకపాలకులతో గూడి రుద్రుని వద్దకు వెళ్లి ఇట్లు విన్నవించిరి -- ఓ దేవా! మూడు నగరములలో నివసించియున్న రాక్షసులు మాకు వినాశము తెచ్చిపెట్టుచున్నారు. నీ వారలమగు మమ్ములను కాపాడుము.

అథానుగృహ్య భగవాన్ మా భైష్టేతి సురాన్ విభుః ।
శరం ధనుషి సంధాయ పురేష్వస్త్రం వ్యముంచత ॥ 57

అథ - తరువాత, విభుః - సర్వసమర్థుడగు, భగవాన్ - రుద్ర భగవానుడు, సురాన్ - దేవతలనుద్దేశించి, మా భైష్ట - భయపడకుడు, ఇతి - అని, అనుగృహ్య - అనుగ్రహించి, ధనుషి - ధనుస్సునందు, శరమ్ - బాణమును, సంధాయ - ఎక్కుపెట్టి, పురేషు - నగరములయందు, అస్త్రమ్ - అస్త్రమును, వ్యముంచత - విడిచి పెట్టెను.

అపుడు సర్వసమర్థుడగు రుద్ర భగవానుడు దేవతలను, భయపడకుడు అని అనుగ్రహించి, ధనుస్సుపై బాణమునెక్కుపెట్టి ఆ మూడు నగరములపై అస్త్రమును ప్రయోగించెను.

తతోఽగ్నివర్ణా ఇషవ ఉత్పేతుస్సూర్యమండలాత్ ।
యథా మయూఖసందోహా నాదృశ్యంత పురో యతః ॥ 58

సూర్యమండలాత్ - సూర్యమండలమునుండి, మయూఖసందోహాః యథా - కిరణముల సమూహములు వలె, తతః - ఆ బాణమునుండి, అగ్నివర్ణాః - అగ్నివలె ప్రకాశించే, ఇషవః - బాణములు, ఉత్పేతుః - బయల్వెడలినవి, యతః - వేటి వలన, పురః - నగరములు, న అదృశ్యంత - కానరాలేదో.

సూర్యమండలమునుండి కిరణముల సమూహములు వచ్చినట్లు గా, ఆ బాణమునుండి అగ్ని వలె ప్రకాశించే బాణములు బయల్వెడలినవి. వాటి కారణముగా ఆ నగరములు కానరాలేదు.

తైస్స్పృష్టా వ్యసవస్సర్వే నిపేతుస్స్మ పురౌకసః ।
తానానీయ మహాయోగీ మయః కూపరసేఽక్షిపత్ ॥ 59

తైః - వాటిచే, స్పృష్టాః - స్పృశించబడిన, పుర-ఓకసః - పురవాసులు, సర్వే - అందరు, వి-అసవః - తొలగిన ప్రాణములు గలవారై, నిపేతుః స్మ - క్రింద బడిరి, మహాయోగీ - గొప్ప సిద్ధులు గల, మయః - మయుడు, తాన్ - వారిని, ఆనీయ - తీసుకువచ్చి, కూపరసే - కూపము నందలి అమృతమునందు, అక్షిపత్ - ఉంచెను.

ఆ బాణములు తగులగానే ఆ పురములలోని వారందరు ప్రాణము లను కోల్పోయి నేలకొరిగిరి. మయుడు గొప్ప సిద్ధులు గలవాడు. ఆతడు అమృతము ఉండే నూతిని నిర్మించి, వారిని తెచ్చి అందులో వైచెను.

సిద్ధామృతరసస్పృష్టా వజ్రసారా మహౌజసః ।
ఉత్తస్థుర్మేఘదలనా వైద్యుతా ఇవ వహ్నయః ॥ 60

సిద్ధ-అమృతరసస్పృష్టాః - జీవమునిచ్చే అమృతరసముచే స్పృశించబడినవారు, వజ్రసారాః - వజ్రము వలె దృఢమైనవారు, మహా-ఓజసః - గొప్ప శక్తి గలవారు, మేఘదలనాః - మేఘములను పగులగొట్టే, వైద్యుతాః - మెరుపుల రూపములోనున్న, వహ్నయః ఇవ - అగ్నులు వలె, ఉత్తస్థుః - పైకి లేచిరి.

జీవమునిచ్చే ఆ అమృతరసము తగులగానే ఆ రాక్షసులు వజ్రము వలె దృఢమైన దేహములు మరియు గొప్ప శక్తి గలవారై లేచి నిలబడిరి. వారు మేఘములను పగులగొట్టే మెరుపుల రూపములోనున్న అగ్నులు వలె ప్రకాశించిరి.

విలోక్య భగ్నసంకల్పం విమనస్కం వృషధ్వజమ్ ।
తదాఽయం భగవాన్ విష్ణుస్తత్రోపాయమకల్పయత్ ॥ 61

భగ్నసంకల్పమ్ - భగ్నమైన సంకల్పము కలిగినట్టియు, విమన స్కమ్ - చెడిన మనస్సు గల, వృషధ్వజమ్ - వృషభము ధ్వజమునందు గల రుద్రుని, విలోక్య - చూచి, తదా - అప్పుడు, అయమ్ - ఈ, భగవాన్ విష్ణుః - విష్ణు భగవానుడు, తత్ర - ఆ పురములను భేదించుటయందు, ఉపాయమ్ - ఉపాయమును, అకల్పయత్ - చేసెను.

తన సంకల్పము భగ్నము కాగా మనస్సు చెడియున్న వృషభధ్వజుడగు రుద్రుని చూచి, ఈ శ్రీకృష్ణుని రూపములోనున్న ఆ విష్ణు భగవానుడు అపుడు ఆ పురములను భేదించుటకై ఒక ఉపాయమును పన్నెను.

వత్స ఆసీత్తదా బ్రహ్మా స్వయం విష్ణురయం హి గౌః ।
ప్రవిశ్య త్రిపురం కాలే రసకూపామృతం పపౌ ॥ 62

తదా - అప్పుడు, బ్రహ్మ - బ్రహ్మగారు, వత్సః - దూడ, ఆసీత్ - ఆయెను, అయమ్ - ఈ, విష్ణుః - విష్ణువు, స్వయమ్ - స్వయముగా, గౌః హి - గోవు, కాలే - సమయమునందు, త్రిపురమ్ - మూడు పురముల ను, ప్రవిశ్య - ప్రవేశించి, రసకూప-అమృతమ్ - నూతియందలి అమృతర సమును, పపౌ - త్రాగెను.

అప్పుడు బ్రహ్మగారు దూడయై, ఈ విష్ణువు స్వయముగా ఆవువై మూడు పురములలో మధ్యాహ్నసమయములో ప్రవేశించి, ఆ నూతియందలి అమృతరసమును త్రాగివేసిరి.

తేఽసురా హ్యపి పశ్యంతో న న్యషేధన్ విమోహితాః ।
తద్విజ్ఞాయ మహాయోగీ రసపాలానిదం జగౌ ॥ 63

స్వయం విశోకశ్శోకార్తాన్ స్మరన్ దైవగతిం చ తామ్ ।
దేవోఽసురో నరోఽన్యో వా నేశ్వరోఽస్తీహ కశ్చన ॥ 64

ఆత్మనోఽన్యస్య వా దిష్టం దైవేనాపోహితుం ద్వయోః ।

విమోహితాః - వ్యామోహమును పొందియున్న, తే - ఆ, అసురాః - రాక్షసులు, పశ్యంతః అపి - చూచుచున్ననూ, న హి న్యషేధన్

- నివారించనేలేదు, తత్ - ఆ విషయమును, విజ్ఞాయ - తెలుసుకొని, మహాయోగీ - గొప్ప శక్తులు గలవాడు, తామ్ - ఆ, దైవగతిం చ - దైవ ముయొక్క లీలను కూడ, స్మరన్ - స్మరించువాడు, స్వయమ్ - తాను, విశోకః - శోకము లేనివాడు అగు మయుడు, శోకార్తాన్ - శోకముతో పీడను పొందియున్న, రసపాలాన్ - ఆ నూతి కాపలాదారులను ఉద్దేశించి, ఇదమ్ - ఈ మాటను, జగౌ - పలికెను, ఇహ - ఈ జగత్తునందు, దేవః - దేవత గాని, అసురః - అసురుడు గాని, నరః - మానవుడు గాని, అన్యః వా - మరియొకడు గాని, కశ్చన - ఎవడైననూ, ఆత్మనః - తనకు గాని, అన్యస్య వా - ఇతరునకు గాని, ద్వయోః - ఇద్దరికి గాని, దైవేన - దైవము చే, దిష్టమ్ - కల్పించబడినదానిని, అపోహితుమ్ - పరిహరించుటకు, ఈశ్వరః - సమర్థుడు, న అస్తి - లేదు.

వ్యామోహితులైయున్న ఆ రాక్షసులు ఆ దూడను, ఆవును చూచి కూడ అడ్డుకొననేలేదు. గొప్ప శక్తులు గల మయుడు ఆ విషయము తెలిసి ఆ దైవముయొక్క లీలను స్మరించి తాను శోకమును పొందలేదు. కాని, శోకముతో పీడితులైయున్న నూతి కాపలాదారులతో ఆయన ఇట్లు పలికెను -- ఈ జగత్తులో దేవత గాని, అసురుడు గాని, మానవుడు గాని, మరియొ కడు గాని, ఎవడైననూ తనకు గాని, ఇతరునకు గాని, ఇద్దరికీ గాని దైవ ముచే కల్పించబడిన దానిని పరిహరించుటకు సమర్థుడైనవాడు లేదు.

అథాసౌ శక్తిభిస్స్వాభిశ్శంభోః ప్రాధనికం వ్యధాత్ ।। 65

ధర్మజ్ఞానవిరక్త్యృద్ధితపోవిద్యాక్రియాదిభిః ।
రథం సూతం ధ్వజం వాహాన్ ధనుర్వర్మ శరాది యత్ ।।66

అథ - తరువాత, అసౌ - ఈ విష్ణువు, శంభోః - రుద్రునియొక్క, ప్రాధనికమ్ - యుద్ధసామగ్రిని, రథమ్ - రథమును, సూతమ్ - సూతుని, ధ్వజమ్ - జెండాను, వాహాన్ - గుర్రములను, ధనుః - ధనుస్సును, వర్మ - కవచమును, శర-ఆది - బాణములు మొదలగునది, యత్ - ఏది గలదో దానిని, ధర్మజ్ఞానవిరక్తి-ఋద్ధితపః-విద్యాక్రియా-ఆదిభిః - ధర్మము

జ్ఞానము వైరాగ్యము ఐశ్వర్యము తపస్సు విద్య కర్మ మొదలగు, స్వాభిః - తన, శక్తిభిః - శక్తులతో, వ్యధాత్ - నిర్మించెను.

తరువాత ఈ విష్ణువు తన శక్తులతో రుద్రుని యుద్ధసామగ్రిని నిర్మించెను. ధర్మముతో రథమును, జ్ఞానముతో సూతుని, వైరాగ్యముతో జెండాను, ఐశ్వర్యముతో గుర్రములను, తపస్సుతో ధనుస్సును, విద్య (ఉపాసన) తో కవచమును, (వైదిక) కర్మతో బాణమును, ఇతరశక్తులతో ఇతరమగు సామగ్రిని వ్యవస్థ చేసెను.

సన్నద్ధో రథమాస్థాయ శరం ధనురుపాదదే ।
శరం ధనుషి సంధాయ ముహూర్తేఽభిజితీశ్వరః ॥ 67

దదాహ తేన దుర్భేద్యా హరోఽథ త్రిపురో నృప ।

నృప - ధర్మరాజా!, ఈశ్వరః - రుద్రుడు, సన్నద్ధః - సన్నద్ధుడై, రథమ్ - రథమును, ఆస్థాయ - అధిష్ఠించి, శరమ్ - బాణమును, ధనుః - ధనుస్సును, ఉపాదదే - చేబట్టెను, అథ - తరువాత, హరః - రుద్రుడు, అభిజితి ముహూర్తే - అభిజిత్ ముహూర్తమునందు, శరమ్ - బాణమును, ధనుషి - ధనుస్సునందు, సంధాయ - ఎక్కుపెట్టి, దుర్భేద్యాః - భేదించ శక్యము కాని, త్రిపురః - మూడు నగరములను, తేన - దానితో, దదాహ - తగులబెట్టెను.

ఓ ధర్మరాజా! రుద్రుడు యుద్ధమునకు తయారై రథమునెక్కి ధనుర్బాణములను చేబట్టెను. అపుడా రుద్రుడు అభిజిత్ ముహూర్తము (మధ్యాహ్నము) నందు బాణమును ధనుస్సుపై ఎక్కుబెట్టి, భేదించ శక్యము కాని ఆ మూడు నగరములను, ఆ బాణముతో తగుల బెట్టెను.

దివి దుందుభయో నేదుర్విమానశతసంకులాః ॥ 68

దేవర్షిపితృసిద్ధేశా జయేతి కుసుమోత్కరైః ।
అవాకిరన్ జగుర్హృష్టా ననృతుశ్చాప్సరోగణాః ॥ 69

దివి - స్వర్గమునందు, దుందుభయః - దుందుభులు, నేదుః - మ్రోగినవి, విమానశతసంకులాః - వందలాది విమానముల రద్దీలు గల, దేవ-ఋషిపితృసిద్ధ-ఈశాః - దేవతలు దేవర్షులు పితృదేవతలు సిద్ధుల నాయకులు, జయ - సర్వోత్కృష్టముగా నుండుము, ఇతి - అని, కుసుమ -ఉత్కరైః - పూల వానలతో, అవాకిరన్ - చల్లిరి, హృష్టాః - ఆనందమును పొందిన వారై, జగుః - గానము చేసిరి, అప్సరః-గణాః చ - అప్సరసల గుంపులు కూడ, ననృతుః - నాట్యమాడిరి.

స్వర్గమునందు దుందుభులు మ్రోగినవి. ఆకాశమునందు వందలాది విమానముల రద్దీలు ఏర్పడెను. దేవతలు, దేవర్షులు, పితృదేవతలు, సిద్ధుల నాయకులు జయము, జయము అంటూ పూల వానలను చల్లిరి. ఆనందముతో కొందరు గానము చేయగా, అప్సరసల గుంపులు నాట్యమాడిరి.

ఏవం దగ్ధ్వా పురస్తిస్రో భగవాన్ పురహా నృప ।
బ్రహ్మాదిభిః స్తూయమానస్స్వధామ ప్రత్యపద్యత ॥ 70

నృప - ఓ ధర్మరాజా!, పురహా - త్రిపురములను నశింపజేసిన, భగవాన్ - రుద్ర భగవానుడు, ఏవమ్ - ఈ విధముగా, తిస్రః - మూడు, పురః - నగరములను, దగ్ధ్వా - తగులబెట్టి, బ్రహ్మ-ఆదిభిః - బ్రహ్మగారు మొదలైనవారిచే, స్తూయమానః - స్తుతించబడుచున్నవాడై, స్వధామ - తన ధామమును, ప్రత్యపద్యత - చేరుకొనెను.

ఓ ధర్మరాజా! ఈ విధముగా రుద్ర భగవానుడు మూడు నగరములను తగులబెట్టి త్రిపురనాశకుడు ఆయెను. బ్రహ్మగారు మొదలగువారు స్తుతించుచుండగా, అపుడాయన తన ధామమును చేరుకొనెను.

ఏవంవిధాన్యస్య హరేస్స్వమాయయా
విడంబమానస్య నృలోకమాత్మనః ।
వీర్యాణి గీతాన్యృషిభిర్జగద్గురోః
లోకాన్ పునానాన్యపరం వదామి కిమ్ ॥ 71

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే ప్రహ్లాదచరితే
ప్రహ్లాదస్య నిష్కామభక్తివర్ణనం త్రిపురదహన
వర్ణనం నామ దశమోऽధ్యాయః ||

ఆత్మనః - ఆత్మస్వరూపుడైనట్టియు, స్వమాయయా - తన మాయాశక్తిచే, నృలోకమ్ - మానవరూపమును, విడంబమానస్య - అనుక రించుచున్నట్టియు, జగద్-గురోః - జగత్తునకు తండ్రి (గురువు) యైన, అస్య - ఈ, హరేః - శ్రీహరియొక్క, ఏవంవిధాని - ఈ విధమైన, వీర్యాణి - పరాక్రమములు, ఋషిభిః - మహర్షులచే, గీతాని - గానము చేయబడిన వి, లోకాన్ - జనులను, పునానాని - పావనము చేయుచున్నవి, అపరమ్ - మరియొకదానిని, కిమ్ - దేనిని, వదామి - నేను చెప్పవలెను?

జగత్తునకు తండ్రి, గురువు, ఆత్మస్వరూపుడు అగు శ్రీహరి తన మాయాశక్తిచే మానవరూపమును అనుకరిస్తూ ఈ విధమైన పరాక్రమము లను నెరపెను. మహర్షులచే గానము చేయబడిన ఆ లీలలు జనులను పావనము చేయుచున్నవి. నేను ఇంకనూ దేనిని గురించి చెప్పవలెను?

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
ప్రహ్లాదచరితమునందు ప్రహ్లాదుని నిష్కామభక్తిని,
త్రిపుర దహనమును వర్ణించే పదవ
అధ్యాయము ముగిసినది (10).

*****

# అథ ఏకాదశోఽధ్యాయః

## వివిధ ధర్మముల వర్ణనము

శ్రీశుక ఉవాచ ।
శ్రుత్వేహితం సాధుసభాసభాజితం
మహత్తమాగ్రణ్య ఉరుక్రమాత్మనః ।
యుధిష్ఠిరో దైత్యపతేర్ముదా యుతః
పప్రచ్ఛ భూయస్తనయం స్వయంభువః ॥ 1

మహత్-తమ-అగ్రణ్యః - చాల గొప్పవారిలో అగ్రేసరుడగు, యుధిష్ఠిరః - ధర్మరాజు, ఉరుక్రమ-ఆత్మనః - శ్రీహరియందు చిత్తము గల, దైత్యపతేః - రాక్షసరాజగు ప్రహ్లాదునియొక్క, సాధుసభాసభాజితమ్ - సత్పురుషుల సభలయందు సత్కరించబడే, ఈహితమ్ - చరితమును, శ్రుత్వా - విని, ముదా - ఆనందముతో, యుతః - కూడినవాడై, భూయః - మరల, స్వయంభువః - స్వయంభువుడగు బ్రహ్మగారి, తనయమ్ - పుత్రుడగు నారదుని, పప్రచ్ఛ - ప్రశ్నించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- వామనావతారములో పెద్ద అడుగులు వేసి జగత్తును కొలిచిన శ్రీహరిని చిత్తమునందు నిలిపియున్న రాక్షసరాజగు ప్రహ్లాదుని చరితము సత్పురుషుల సభయందు సత్కరించబడును. చాల గొప్పవారిలో కూడ అగ్రేసరుడగు ధర్మరాజు ఆ చరితమును విని ఆనందించెను. ఆయన మరల స్వయంభువుడైన బ్రహ్మగారి పుత్రుడగు నారద మహర్షిని ఇట్లు ప్రశ్నించెను.

యుధిష్ఠిర ఉవాచ ।
భగవన్ శ్రోతుమిచ్ఛామి నృణాం ధర్మం సనాతనమ్ ।
వర్ణాశ్రమాచారయుతం యత్పుమాన్ విందతే పరమ్ ।। 2

భగవన్ - ఓ పూజనీయా!, సనాతనమ్ - సనాతనమైనట్టియు, వర్ణ -ఆశ్రమ-ఆచారయుతమ్ - వర్ణముల ఆశ్రమముల ఆచారములతో కూడి యున్న, నృణామ్ - మానవులయొక్క, ధర్మమ్ - ధర్మమును గురించి, శ్రోతుమ్ - వినుటకు, ఇచ్ఛామి - కోరుచున్నాను, యత్ - దేనివలనైతే, పుమాన్ - మానవుడు, పరమ్ - పరమపురుషార్థమగు మోక్షమును, విందతే - పొందునో.

ఓ పూజనీయా! వర్ణములు మరియు ఆశ్రమముల ఆచారములతో కూడియున్న మానవుల ధర్మము సనాతనమైనది. దానిని గురించి వినగోరుచున్నాను. ఏలయనగా, దాని వలన మానవుడు పరమపురుషార్థమగు మోక్షమును పొందును.

భవాన్ ప్రజాపతేస్సాక్షాదాత్మజః పరమేష్ఠినః ।
సుతానాం సమ్మతో బ్రహ్మంస్తపోయోగసమాధిభిః ।। 3

భవాన్ - నీవు, సాక్షాత్ - సాక్షాత్తుగా, ప్రజాపతేః - ప్రజలను సృష్టించిన, పరమేష్ఠినః - బ్రహ్మగారియొక్క, ఆత్మజః - పుత్రుడవు, బ్రహ్మన్ - ఓ మహర్షీ!, తపః-యోగసమాధిభిః - తపస్సు భక్తియోగము చిత్తైకాగ్రతలచే, సుతానామ్ - పుత్రులలో, సమ్మతః - ఆదరించబడువాడవు.

ఓ మహర్షీ! నీవు సాక్షాత్తుగా సృష్టికర్తయగు బ్రహ్మగారి పుత్రుడవు. తపస్సు, భక్తియోగము మరియు చిత్తైకాగ్రతలను బట్టి నీకు ఆయన పుత్రులలో అధికమగు సమ్మానము గలదు.

నారాయణపరా విప్రా ధర్మం గుహ్యం పరం విదుః ।
కరుణాస్సాధవశ్శాంతాస్త్వద్విధా న తథాఽపరే ।। 4

నారాయణపరాః - నారాయణుడు పరమలక్ష్యముగా గలవారు, కరుణాః - దయామయులు, సాధవః - సత్పురుషులు, శాంతాః - శాంత స్వభావులు, త్వద్-విధాః - నీవంటివారు అగు, విప్రాః - వేదవేత్తలు, గుహ్యమ్ - రహస్యమైన, పరమ్ - సర్వోత్కృష్టమైన, ధర్మమ్ - ధర్మమును, విదుః - ఎరుగుదురు, తథా - ఆ విధముగా, అపరే - ఇతరులు, న - ఎరుగరు.

నీవంటి వేదవేత్తలకు నారాయణుడే పరమలక్ష్యము. దయామయులు, శాంతస్వభావులు అగు నీవంటి సత్పురుషులు రహస్యమైన పరమధర్మమును తెలియుదురు. ఇతరులకు ఆ రహస్యమగు ధర్మము తెలియదు.

నారద ఉవాచ ।
నత్వా భగవతేఽజాయ లోకానాం ధర్మహేతవే ।
వక్ష్యే సనాతనం ధర్మం నారాయణముఖాచ్ఛ్రుతమ్ ॥ 5

లోకానామ్ - లోకములయొక్క, ధర్మహేతవే - ధర్మమునకు కారణమైనట్టియు, భగవతే - పూజనీయుడైనట్టియు, అజాయ - స్వయంభువుడగు బ్రహ్మగారి కొరకు, నత్వా - నమస్కరించి, నారాయణముఖాత్ - నారాయణుని ముఖమునుండి, శ్రుతమ్ - వినబడిన, సనాతనమ్ - కాలాతీతమైన, ధర్మమ్ - ధర్మమును గురించి, వక్ష్యే - చెప్పగలను.

నారదుడిట్లు పలికెను --- స్వయంభువుడగు బ్రహ్మగారు లోకముల ధర్మమునకు కారణము. ఆయనకు నమస్కరించి నేను నారాయణుని ముఖమునుండి విన్న సనాతన ధర్మమును గురించి చెప్పెదను.

యోఽవతీర్యాత్మనోంఽశేన దాక్షాయణ్యాం తు ధర్మతః ।
లోకానాం స్వస్తయేఽధ్యాస్తే తపో బదరికాశ్రమే ॥ 6

యః - ఏ నారాయణుడైతే, ఆత్మనః - తనయొక్క, అంశేన - అంశమైన నరునితో గూడి, ధర్మతః - ధర్ముని వలన, దాక్షాయణ్యాం తు - దక్షుని పుత్రికయగు మూర్తియందు, అవతీర్య - అవతరించి, లోకానామ్

- లోకముల, స్వస్తయే - కల్యాణము కొరకు, బదరికాశ్రమే - బదరికాశ్రమ మునందు, తపః - తపస్సును, అధ్యాస్తే - అనుష్ఠించుచున్నాడో.

ఆ నారాయణుడు తన అంశయగు నరునితో గూడి ధర్ముని వలన దక్షపుత్రికయగు మూర్తియందు అవతరించి, లోకముల కల్యాణము కొరకై బదరికాశ్రమమునందు తపస్సును అనుష్ఠించుచున్నాడు.

ధర్మమూలం హి భగవాన్ సర్వవేదమయో హరిః ।
స్మృతం చ తద్విదాం రాజన్ యేన చాత్మా ప్రసీదతి ॥ 7

రాజన్ - ఓ ధర్మరాజా!, సర్వవేదమయః - సకలవేదముల రూప ములో ఆవిర్భవించిన, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, తద్-విదామ్ - ఆ వేదమునెరింగిన మహర్షులయొక్క, స్మృతం చ - స్మృతి, యేన చ - దేనిచే, ఆత్మా - అంతఃకరణము, ప్రసీదతి - ప్రసన్నమగునో అది, ధర్మ మూలం హి - ధర్మమునకు ప్రమాణము గదా!

ఓ ధర్మరాజా! సలకవేదస్వరూపుడగు శ్రీహరి భగవానుడు, వేదవే త్తలగు మహర్షుల స్మృతులు మరియు ఏ కర్మచే అంతఃకరణము ప్రసన్న మగునో అట్టి కర్మ -- ఈ మూడు ధర్మమునకు మూలము (ప్రమాణము).

సత్యం దయా తపశ్శౌచం తితిక్షేక్షా శమో దమః ।
అహింసా బ్రహ్మచర్యం చ త్యాగస్స్వాధ్యాయ ఆర్జవమ్ ॥8

సంతోషస్సమదృక్సేవా గ్రామ్యేహోపరమశ్శనైః ।
నృణాం విపర్యయేహేక్షా మౌనమాత్మవిమర్శనమ్ ॥ 9

అన్నాద్యాదేస్సంవిభాగో భూతేభ్యశ్చ యథార్హతః ।
తేష్వాత్మదేవతాబుద్ధిస్సుతరాం నృషు పాండవ ॥ 10

శ్రవణం కీర్తనం చాస్య స్మరణం మహతాం గతేః ।
సేవేజ్యావనతిర్దాస్యం సఖ్యమాత్మసమర్పణమ్ ॥ 11

**నృణామయం పరో ధర్మస్సర్వేషాం సముదాహృతః ।**
**త్రింశల్లక్షణవాన్ రాజన్ సర్వాత్మా యేన తుష్యతి ॥ 12**

పాండవ రాజన్ - పాండువంశమునకు చెందిన ఓ ధర్మరాజా!, సత్యమ్ - సత్యము, దయా - దయ, తపః - తపస్సు, శౌచమ్ - శౌచము, తితిక్షా - సహనశక్తి, ఈక్షా - వివేకము, శమః - మనోనిగ్రహము, దమః - ఇంద్రియ నిగ్రహము, అహింసా - అహింస, బ్రహ్మచర్యం చ - బ్రహ్మచర్యము, త్యాగః - దానము, స్వాధ్యాయః - వేదాధ్యయనము, ఆర్జవమ్ - తిన్ననైన స్వభావము, సంతోషః - సంతృప్తి, సమదృక్-సేవా - అంతటా ఈశ్వరుని దర్శించే మహాత్ములను సేవించుట, శనైః - మెల్లగా, గ్రామ్య-ఈహా-ఉపరమః - ఇంద్రియభోగములకు చెందిన కర్మలనుండి విరమించుకొనుట, నృణామ్ - మానవులయొక్క, విపర్యయ-ఈహా-ఈక్షా - నిష్ఫలమగు కర్మల వివేకము, మౌనమ్ - మౌనము, ఆత్మవిమర్శనమ్ - ఆత్మచింతనము, భూతేభ్యః - ప్రాణుల కొరకు, యథా-అర్హతః - వాటి వాటి అర్హతలను బట్టి, అన్న-ఆద్య-ఆదేః - తినదగిన ఆహారము మొదలగువాటియొక్క, సంవిభాగః చ - చక్కగా పంచి యిచ్చుట, తేషు - ఆ ప్రాణులయందు, నృషు సుతరామ్ - ప్రత్యేకించి మానవులయందు, ఆత్మదేవతాబుద్ధిః - ఆత్మభావము ఈశ్వరభావము, మహతామ్ - మహాత్ములకు, గతేః - లక్ష్యమైన, అస్య - ఈ ఈశ్వరునియొక్క, శ్రవణమ్ - వినుట, కీర్తనమ్ - కీర్తించుట, స్మరణం చ - స్మరించుట, సేవా - సేవ, ఇజ్యా - పూజ, అవనతిః - నమస్కారము, దాస్యమ్ - దాస్యము, సఖ్యమ్ - మైత్రి, ఆత్మసమర్పణమ్ - తనను సమర్పించుకొనుట, త్రింశత్-లక్షణవాన్ - ముప్పది లక్షణములు గల, అయమ్ - ఇది, సర్వేషామ్ - అందరు, నృణామ్ - మానవులకు, పరః - సర్వోత్తమమైన, ధర్మః - ధర్మముగా, సముదాహృతః - ఉటంకించ బడినది, యేన - దేనిచే, సర్వ-ఆత్మా - సర్వమునకు ఆత్మరూపుడగు శ్రీహరి, తుష్యతి - ప్రసన్నుడగునో.

పాండువంశీయుడవగు ఓ ధర్మరాజా! సత్యము, దయ, తపస్సు, బాహ్యమునందు అంతరమునందు శుచిగా నుండుట, సహనశక్తి, ఆత్మానాత్మ (నిత్యానిత్య) వివేకము, మనోనిగ్రహము, ఇంద్రియనిగ్రహము,

అహింస, బ్రహ్మచర్యము, దానము, వేదాధ్యయనము, కుటిలత లేని వ్యవహారము, లభించిన దానితో తృప్తి పడుట, అంతటా సమానముగా ఈశ్వరుని దర్శించే మహాత్ములను సేవించుట, మెల్లగా ఇంద్రియభోగములకు చెందిన చేష్టలనుండి విరమించుకొనుట, మానవులు చేసే లౌకికములగు ప్రయత్నములన్నియు నిష్ఫలములేనన సత్యమును దర్శించుట, మౌనము, ఆత్మచింతనము, ప్రాణులకు వాటి యోగ్యతకు తగ్గట్లుగా అన్నపానములు మొదలగువాటిని పంచి యిచ్చుట, ప్రాణులను విశేషించి మానవులను ఆత్మస్వరూపులనియు ఈశ్వరరూపులనియు భావించుట, మహాత్ములకు పరమలక్ష్యమగు శ్రీహరియొక్క లీలలను వినుట, కీర్తించుట, స్మరించుట, ఈశ్వరుని సేవించి పూజించుట, నమస్కరించుట, దాస్యము, మైత్రి, తనను తాను ఈశ్వరునకు సమర్పించుకొనుట -- అనే ఈ ముప్పది లక్షణములు గల ధర్మము సకలమానవులకు సర్వోత్తమమైన ధర్మమని మహాత్ములచే వర్ణించబడినది. ఈ ధర్మమును పాలించుటచే సర్వాత్మస్వరూపుడగు శ్రీహరి ప్రసన్నుడగును.

సంస్కారా యదవిచ్ఛిన్నాస్స ద్విజోఽజో జగాద యమ్ ।
ఇజ్యాధ్యయనదానాని విహితాని ద్విజన్మనామ్ ।
జన్మకర్మావదాతానాం క్రియాశ్చాశ్రమచోదితాః ।। 13

యత్ - ఎవనియందైతే, సంస్కారాః - ఉపనయనము మొదలైన సంస్కారములు, అవిచ్ఛిన్నాః - ఆగిపోకుండా జరిగినవో, యమ్ - ఎవనిని, అజః - స్వయంభువుడగు బ్రహ్మగారు, జగాద - చెప్పెనో, సః - అతడు, ద్విజః - ద్విజుడు, ద్విజన్మనామ్ - ఉపనయన సంస్కారము గలవారికి, ఇజ్యా-అధ్యయనదానాని - యజ్ఞము వేదాధ్యయనము దానములు, విహితాని - విధించబడినవి, జన్మకర్మ-అవదాతానామ్ - పుట్టుకచే కర్మలచే పవిత్రులైనవారికి, ఆశ్రమచోదితాః - ఆశ్రమములకు విధించబడిన, క్రియాః చ - కర్మలు కూడ.

ఎవనియందైతే ఉపనయనము మొదలైన సంస్కారములు ఆగిపోకుండా జరిగినవో, ఎవనిని బ్రహ్మగారు (వేదము ద్వారా) నిర్ధారించిరో, అట్టివాడు ద్విజుడగును. ద్విజులకు యజ్ఞము, వేదాధ్యయనము, దానములు

విధించబడినవి. పుట్టుకచే మరియు కర్మలచే పవిత్రులైన ద్విజులకు బ్రహ్మ చర్య-గృహస్థ-వానప్రస్థ-సన్న్యాస-ఆశ్రమములకు చెందిన కర్మలు కూడ విధించబడినవి.

విప్రస్యాధ్యయనాదీని షడన్యస్యాప్రతిగ్రహః ।
రాజ్ఞో వృత్తిః ప్రజాగోప్తురవిప్రాద్వా కరాదిభిః ॥ 14

**అధ్యయన-ఆదీని** - అధ్యయనము మొదలగు, **షట్** - ఆరు, **విప్రస్య** - విప్రునకు, **అన్యస్య** - ఇతరునకు (క్షత్రియునకు), **అప్రతిగ్రహః** - ప్రతిగ్రహము లేదు, **ప్రజాగోప్తుః** - ప్రజలను రక్షించే, **రాజ్ఞః** - రాజునకు, **అవిప్రాత్** - విప్రుడు తక్క ఇతరుని వద్దనుండి, **కర-ఆదిభిః వా** - పన్ను మొదలగువాటిచే గాని, **వృత్తిః** - జీవిక.

యజ్ఞమును చేయుట, చేయించుట, వేదమును అధ్యయనము చేయుట, బోధించుట, దానమును చేయుట, స్వీకరించుట (ప్రతిగ్రహము) అనే ఆరు కర్మలు వేదవేత్తయగు బ్రాహ్మణునకు విధించబడినవి. వీటిలో ప్రతిగ్రహము క్షత్రియునకు తగదు. ప్రజలను రక్షించే క్షత్రియుడు వేదవేత్త లను మినహాయించి ఇతరుల వద్ద పన్నును తీసుకొనవలెను. అదియే క్షత్రి యునకు జీవిక.

వైశ్యస్తు వార్తావృత్తిశ్చ నిత్యం బ్రహ్మకులానుగః ।
శూద్రస్య ద్విజశుశ్రూషా వృత్తిశ్చ స్వామినో భవేత్ ॥ 15

**బ్రహ్మకుల-అనుగః** - వేదవేత్తల సముదాయమునకు అనుచరుడగు, **వైశ్యః తు** - వైశ్యుడైతే, **నిత్యమ్** - అన్ని కాలములలో, **వార్తావృత్తిః చ** - గోపాలనము వ్యవసాయము వ్యాపారము జీవికగా గలవాడు, **శూద్రస్య** - శూద్రునకు, **ద్విజశుశ్రూషా** - వేదవేత్తలను సేవించుట, **స్వామినః** - యజమానియొక్క సేవ, **వృత్తిః చ** - జీవిక కూడ, **భవేత్** - అగును.

అన్ని కాలములలో వేదవేత్తలకు అనుచరుడై యుండే వైశ్యునకు గోవులను పాలించుట, వ్యవసాయము, వ్యాపారము అనునవి జీవిక. వేదవేత్తలను సేవించుట శూద్రునకు ధర్మము మరియు జీవిక కూడ అగును.

వార్తా విచిత్రా శాలీనయాయావరశిలోంఛనమ్ ।
విప్రవృత్తిశ్చతుర్ధేయం శ్రేయసీ చోత్తరోత్తరా ॥ 16

విచిత్రా - పలువిధములైన, వార్తా - వ్యవసాయము మొదలగునది, శాలీనయాయావరశిలోంఛనమ్ - శాలీనము యాయావరము శిలోంఛనము, విప్రవృత్తిః - వేదవేత్తయగు బ్రాహ్మణునకు జీవిక, చతుర్ధా - నాల్గు విధములుగా నున్నది, ఇయమ్ - ఇది, ఉత్తర-ఉత్తరా - ముందు దాని కంటె తరువాతిది, శ్రేయసీ - శ్రేయస్కరము.

పలువిధములైన వ్యవసాయము మొదలగునవి, శాలీనము (యాచించకుండా లభించినదానితో జీవించుట), యాయావరము (ప్రతిదినము బియ్యము మొదలగువాటిని యాచించి వాటితో జీవించుట), శిలోంఛనము (రైతులు ధాన్యమును నూర్చినప్పుడు క్రింద పడే గింజలను ఏరుకొని వాటితో జీవించుట) -- అని వేదవేత్తయగు బ్రాహ్మణుని జీవిక నాలుగు విధములు. వీటిలో ముందుదానికంటె తరువాతిది శ్రేయస్కరము.

జఘన్యో నోత్తమాం వృత్తిమనాపది భజేన్నరః ।
ఋతే రాజన్యమాపత్సు సర్వేషామపి సర్వశః ॥ 17

జఘన్యః - క్రింది స్థాయికి చెందిన, నరః - వ్యక్తి, ఉత్తమామ్ - పై స్థాయికి చెందిన, వృత్తిమ్ - జీవికను, అనాపది - ఆపత్తు వచ్చిన సమయములో తప్ప, న భజేత్ - సేవించవద్దు, ఆపత్సు - ఆపదలయందు, రాజన్యం ఋతే - క్షత్రియుని మినహాయించి, సర్వేషామ్ - అందరికి, సర్వశః అపి - అన్ని విధములుగ కూడ.

క్రింది స్థాయికి చెందిన వ్యక్తి ఆపదలలో తప్ప పై స్థాయికి చెందిన జీవికను చేబట్టవద్దు. ఆపదలలో మాత్రము క్షత్రియుని మినహాయించి అందరు అన్ని రకముల వృత్తులను చేబట్టవచ్చును.

**ఋతామృతాభ్యాం జీవేత మృతేన ప్రమృతేన వా ।**
**సత్యానృతాభ్యాం జీవేత న శ్వవృత్త్యా కథంచన ॥ 18**

ఋత-అమృతాభ్యామ్ - ఋతముతో గాని అమృతముతో గాని, మృతేన - మృతముతో గాని, ప్రమృతేన వా - ప్రమృతముతో గాని, సత్య-అనృతాభ్యామ్ - సత్యముతో గాని అనృతముతో గాని, జీవేత - జీవించవలెను, శ్వవృత్త్యా - శ్వవృత్తిచే, కథంచన - ఏ విధముగనైననూ, న జీవేత - జీవించరాదు.

ఋత-అమృతములతో గాని, మృత-ప్రమృతములతో గాని, సత్య-అనృతములతో జీవించవలెనే గాని, శ్వవృత్తితో ఏనాడైననూ జీవించరాదు.

**ఋతముంఛశిలం ప్రోక్తమమృతం యదయాచితమ్ ।**
**మృతం తు నిత్యయాచ్ఞా స్యాత్ ప్రమృతం కర్షణం స్మృతమ్ ॥19**

ఉంఛశిలమ్ - ఉంఛశిలము, ఋతమ్ - ఋతము అని, ప్రోక్తమ్ - చెప్పబడినది, అయాచితమ్ - కోరకుండా లభించినది, యత్ - ఏది గలదో అది, అమృతమ్ - అమృతము, నిత్యయాచ్ఞా తు - నిత్యము యాచించుటైతే, మృతమ్ - మృతము, కర్షణమ్ - భూమి దున్నుట, ప్రమృతమ్ - ప్రమృతము అని, స్మృతమ్ - చెప్పబడినది.

పొలములో క్రిందపడిన గింజలనేరుకొని బ్రతుకుట ఋతమనబడును. కోరకుండా లభించిన దానితో బ్రతుకుట అమృతమనియు, నిత్యము యాచించి బ్రతుకుట (యాయావరము) మృతమనియు, భూమిని దున్ని బ్రతుకుట ప్రమృతమనియు చెప్పబడినది.

సత్యానృతం తు వాణిజ్యం శ్వవృత్తిర్నీచసేవనమ్ ।
వర్జయేత్తాం సదా విప్రో రాజన్యశ్చ జుగుప్సితామ్ ।
సర్వవేదమయో విప్రస్సర్వదేవమయో నృపః ॥ 20

వాణిజ్యం తు - వర్తకమైతే, సత్యానృతమ్ - సత్యానృతము, నీచసేవనమ్ - నీచుని సేవించుట, శ్వవృత్తిః - శ్వవృత్తి, విప్రః - వేదవేత్త, రాజన్యః చ - క్షత్రియుడు కూడ, జుగుప్సితామ్ - ఏవగించుకొనదగిన,

తామ్ - దానిని, వర్జయేత్ - విడిచిపెట్టవలెను, విప్రః - వేదవేత్త, సర్వవేద మయః - సర్వవేదములే రూపముగా గలవాడు, నృపః - రాజు, సర్వదేవ మయః - సకలదేవతలే స్వరూపముగా గలవాడు.

వర్తకము సత్యానృతమనబడును. బ్రదుకు దెరువుకై నీచుని సేవించుట శ్వవృత్తి యనబడును. ఏవగించుకొనదగిన అట్టి శ్వవృత్తిని వేదవేత్త గాని, క్షత్రియుడు గాని ఆశ్రయించరాదు. ఎందుకంటే, సకలవేదములు వేద వేత్తయగు బ్రాహ్మణునియందున్నవి. రాజు సకలదేవతాస్వరూపుడు.

శమో దమస్తపశ్శౌచం సంతోషః క్షాంతిరార్జవమ్ ।
జ్ఞానం దయాచ్యుతాత్మత్వం సత్యం చ బ్రహ్మలక్షణమ్ ।।21

శమః - మనోనిగ్రహము, దమః - ఇంద్రియనిగ్రహము, తపః - తపస్సు, శౌచమ్ - బాహ్యమునందు ఆంతరములో స్వచ్ఛత, సంతోషః - తృప్తిని చెందే లక్షణము, క్షాంతిః - సహనము, ఆర్జవమ్ - తిన్ననైన స్వభావము, జ్ఞానమ్ - జ్ఞానము, దయా - దయ, అచ్యుత-ఆత్మత్వమ్ - శ్రీహరియందు నిలిచే మనస్సు, సత్యం చ - సత్యము, బ్రహ్మలక్షణమ్ - బ్రాహ్మణుని లక్షణము.

మనస్సు వశములో నుండుట, ఇంద్రియనిగ్రహము, తపస్సు, బాహ్యమునందు ఆంతరములో స్వచ్ఛత, ఉన్నదానితో తృప్తి పడుట, సుఖ దుఃఖములను సహించుట, కుటిలత లేని స్వభావము, వివేకజ్ఞానము, దయ, శ్రీహరియందు లగ్నమైయుండే బుద్ధి, సత్యము అనునవి బ్రాహ్మణుని లక్షణములు.

శౌర్యం వీర్యం ధృతిస్తేజస్త్యాగ ఆత్మజయః క్షమా ।
బ్రహ్మణ్యతా ప్రసాదశ్చ రక్షా చ క్షత్రలక్షణమ్ ।। 22

శౌర్యమ్ - యుద్ధములో ఉత్సాహము, వీర్యమ్ - ప్రభావము, ధృతిః - ధైర్యము, త్యాగః - దానము, ఆత్మజయః - మనస్సుపై విజయము, క్షమా - సహనశక్తి, బ్రహ్మణ్యతా - వేదవేత్తల యెడల భక్తి, ప్రసాదః

చ - అనుగ్రహము, రక్షా చ - రక్షించుట, క్షత్రలక్షణమ్ - క్షత్రియుని లక్షణము.

యుద్ధములో ఉత్సాహము, ప్రభావము, ధైర్యము, దానము, మనస్సుపై విజయము, సహనశక్తి, వేదవేత్తలగు బ్రాహ్మణుల యెడల భక్తి, ప్రజలను అనుగ్రహించి రక్షించుట అనునవి క్షత్రియ లక్షణములు.

దేవగుర్వచ్యుతే భక్తిస్త్రివర్గపరిపోషణమ్ ।
ఆస్తిక్యముద్యమో నిత్యం నైపుణం వైశ్యలక్షణమ్ ॥ 23

దేవగురు-అచ్యుతే - దేవతలు గురువు అచ్యుతుడు అనువారలయందు, భక్తిః - భక్తి, త్రివర్గపరిపోషణమ్ - ధర్మార్థకామములనే మూడు పురుషార్థములను చక్కగా పాలించుట, ఆస్తిక్యమ్ - ఈశ్వరుడు గలడు అనే విశ్వాసము, నిత్యమ్ - అన్ని కాలములలో, ఉద్యమః - కార్యశూరత, నైపుణమ్ - పనిని చేయుటలో నేర్పు, వైశ్యలక్షణమ్ - వైశ్యుని లక్షణము.

దేవతలయందు గురువునందు శ్రీహరియందు భక్తిని కలిగియుండుట, ధర్మము అర్థము కామము అనే మూడు పురుషార్థములను చక్కగా సేవించుట, ఈశ్వరుడు గలడు అనే విశ్వాసము, అన్ని కాలములలో కార్యశూరత, పనిని చేయుటలో నేర్పు అనునవి వైశ్యుని లక్షణములు.

శూద్రస్య సంనతిశ్శౌచం సేవా స్వామిన్యమాయయా ।
అమంత్రయజ్ఞో హ్యస్తేయం సత్యం గోవిప్రరక్షణమ్ ॥ 24

సంనతిః - వినయము, శౌచమ్ - స్వచ్ఛత, స్వామిని - యజమానియందు, అమాయయా - నిష్కపటముగా, సేవా - సేవ, అమంత్రయజ్ఞః - మంత్రములు లేని యజ్ఞము, అస్తేయమ్ - పరధనమును అపహరించకుండుట, సత్యమ్ - సత్యము, గోవిప్రరక్షణమ్ - గోవులను విప్రులను కాపాడుట, శూద్రస్య - శూద్రునకు.

వినయము, బాహ్యమునందు ఆంతరమునందు స్వచ్ఛత, యజమానిని నిష్కపటముగా సేవించుట, మంత్రములు లేకున్ననూ ఈశ్వరుని

ఆరాధించుట, పరధనమును అపహరించకుండుట, సత్యము, గోవులను విప్రులను రక్షించుట అనునవి శూద్ర లక్షణములు.

స్త్రీణాం చ పతిదేవానాం తచ్ఛుశ్రూషానుకూలతా ।
తద్బంధుష్వనువృత్తిశ్చ నిత్యం తద్వ్రతధారణమ్ ॥ 25

పతిదేవానామ్ - పతియే దైవమైయున్న, స్త్రీణాం చ - స్త్రీలకు కూడ, తత్-శుశ్రూషా - వానిని సేవించుట, అనుకూలతా - అనుకూలముగా నుండుట, తద్-బంధుషు - వాని బంధువులయందు, అనువృత్తిః చ - సేవ చేయుట, నిత్యమ్ - అన్ని కాలములయందు, తద్-వ్రతధారణమ్ - భర్తయొక్క నియమములను పరిరక్షించుట.

స్త్రీలకు పతియే దైవము. భర్తను సేవించుట, భర్తకు అనుకూలముగా నుండుట, భర్తవైపు బంధువులను సేవించుట, అన్ని కాలములలో భర్తయొక్క నియమములను పరిరక్షించుట అనునవి స్త్రీల ధర్మములు.

సమ్మార్జనోపలేపాభ్యాం గృహమండలవర్తనైః ।
స్వయం చ మండితా నిత్యం పరిమృష్టపరిచ్ఛదా ॥ 26

కామైరుచ్చావచైస్సాధ్వీ ప్రశ్రయేణ దమేన చ ।
వాక్యైస్సత్యైః ప్రియైః ప్రేమ్ణా కాలే కాలే భజేత్పతిమ్ ॥27

స్వయం చ - స్వయముగా, మండితా - అలంకరించుకున్నది, నిత్యమ్ - ప్రతిదినము, పరిమృష్టపరిచ్ఛదా - శుభ్రము చేయబడిన సామగ్రి గలది అగు, సాధ్వీ - పతివ్రత, సమ్మార్జన-ఉపలేపాభ్యామ్ - తుడుచుట సుగంధద్రవ్యములను అలముటలచే, గృహమండలవర్తనైః - గృహములో రంగవల్లులను దిద్దుట గృహములో ఉండుటలచే, ఉచ్చావచైః - చిన్న పెద్ద, కామైః - ఇచ్ఛలచే, ప్రశ్రయేణ - వినయముతో, దమేన చ - ఇంద్రియనిగ్రహముతో, సత్యైః - సత్యములైనట్టియు, ప్రియైః - విన సొంపైన, వాక్యైః - వాక్యములతో, ప్రేమ్ణా - ప్రేమతో, కాలే కాలే - ఆయా సమయములయందు, పతిమ్ - భర్తను, భజేత్ - సేవించవలెను.

సాధ్వీ ఇంటిలోనే ఉంటూ ఇంటిని తుడిచి సుగంధద్రవ్యములను చల్లి రంగవల్లులను దిద్దవలెను. నిత్యము తనను కూడ తాను అలంకరించుకొని, ఇంటి సామగ్రిని శుచిగా ఉంచుకొనవలెను. ఆమె వినయముతో భర్తయొక్క చిన్న-పెద్ద ఇచ్ఛలను పూర్తి చేయవలెను. ఆమె ఇంద్రియనిగ్రహము గలదియై, సత్యము మరియు వినుటకు సొంపైన వాక్యములతో ప్రేమపూర్వకముగా భర్తను ఆయా సమయములయందు సేవించవలెను.

సంతుష్టాఽలోలుపా దక్షా ధర్మజ్ఞా ప్రియసత్యవాక్ ।
అప్రమత్తా శుచిస్స్నిగ్ధా పతిం త్వపతితం భజేత్ ॥ 28

సంతుష్టా - తృప్తి గలది, అలోలుపా - తీవ్రమగు ఆసక్తి లేనిది, దక్షా - సమర్థురాలు, ధర్మజ్ఞా - ధర్మము తెలిసినది, ప్రియసత్యవాక్ - సత్యమును వినుటకు ఇంపుగా చెప్పునది, అప్రమత్తా - జాగరూకరాలై ఉండునది, శుచిః - స్వచ్ఛత గలది, స్నిగ్ధా - ప్రేమ గలదియై, అపతితం తు - పతితుడు కాని, పతిమ్ - భర్తను, భజేత్ - సేవించవలెను.

ఆమె లభించిన దానితో తృప్తి జెంది, దేనియందైననూ తీవ్రమగు ఆసక్తిని విడనాడవలెను. ఆమె ధర్మము తెలిసిన సమర్థురాలు కావలెను. ఆమె సత్యమును వినుటకు ఇంపుగా చెప్పవలెను. ఆమె సావధానముగా ఉంటూ బాహ్యమునందు అంతరములో స్వచ్ఛతను కలిగియుండవలెను. తన భర్త పతితుడు కానిచో, ఆమె అతనిని ప్రేమతో సేవించవలెను.

యా పతిం హరిభావేన భజేచ్ఛ్రీరివ తత్పరా ।
హర్యాత్మనా హరేర్లోకే పత్యా శ్రీరివ మోదతే ॥ 29

యా - ఏ స్త్రీ, పతిమ్ - భర్తను, హరిభావేన - శ్రీహరి అనే భావనతో, తత్-పరా - ఆ శ్రీహరియే ఏకైకలక్ష్యముగా గల, శ్రీః ఇవ - లక్ష్మీదేవి వలె, భజేత్ - సేవించునో ఆమె, హరేః - శ్రీహరియొక్క, లోకే - లోకమునందు, హరి-ఆత్మనా - శ్రీహరిరూపుడైన, పత్యా - భర్తతో, శ్రీః ఇవ - లక్ష్మీదేవివలె, మోదతే - ఆనందించును.

ఏ స్త్రీయైతే తన భర్త సాక్షాత్తుగా శ్రీహరియే అనే భావనతో, శ్రీహరియే ఏకైకలక్ష్యముగా గల లక్ష్మీదేవి శ్రీహరిని సేవించు విధముగా సేవించునో, ఆమె శ్రీహరియొక్క లోకము (వైకుంఠము) లో శ్రీహరిరూపు డగు తన భర్తతో గూడి లక్ష్మీదేవి వలెనే ఆనందించును.

వృత్తిస్సంకరజాతీనాం తత్తత్కులకృతా భవేత్ ।
అచౌరాణామపాపానామంత్యజాంతేఽవసాయినామ్ ॥ 30

అచౌరాణామ్ - చోరులు కానట్టియు, అపాపానామ్ - పాపకృత్యములను చేయనట్టియు, అంత్యజ-అంతేఽవసాయినామ్ - పౌరసమాజమునకు దూరమై గ్రామములకు నగరములకు బయట నివసించే, సంకర జాతీనామ్ - సంకరజాతులకు, తత్-తత్-కులకృతా - ఆయా కులములను బట్టి నిర్ధారించబడిన, వృత్తిః - జీవిక, భవేత్ - ఉండును.

చోరులు కాకుండా పాపములను చేయకుండా పౌరసమాజమునకు దూరముగా గ్రామములకు నగరములకు బయట నివసించే సంకరజాతుల జీవిక ఆయా కులములను బట్టి నిర్ధారితమగును.

ప్రాయస్స్వభావవిహితో నృణాం ధర్మో యుగే యుగే ।
వేదదృగ్భిస్స్మృతో రాజన్ ప్రేత్య చేహ చ శర్మకృత్ ॥ 31

రాజన్ - ధర్మరాజా!, యుగే యుగే - ప్రతియుగమునందు, నృణామ్ - మానవులకు, ప్రాయః - తరచుగా, స్వభావవిహితః - స్వభావమును బట్టి విధించబడిన, ధర్మః - ధర్మము, వేదదృగ్భిః - మంత్రద్రష్టలగు మహర్షులచే, స్మృతః - స్మరించబడినది, ప్రేత్య - మరణించిన పిదప, ఇహ చ - ఈ లోకమునందు కూడ, శర్మకృత్ - సుఖమును చేయునది.

ఓ ధర్మరాజా! ప్రతియుగమునందు మంత్రద్రష్టలగు మహర్షులు మానవులకు వారి వారి స్వభావమును బట్టి ధర్మమును స్మృతుల రూపములో విధించిరి. ఈ ధర్మమునాచరించువారలకు ఇహమునందు మాత్రమే గాక, పరమునందు కూడ సుఖము లభించును.

వృత్త్యా స్వభావకృతయా వర్తమానస్స్వకర్మకృత్ ।
హిత్వా స్వభావజం కర్మ శనైర్నిర్గుణతామియాత్ ॥ 32

స్వభావకృతయా - స్వభావమును బట్టి నిర్ధారించబడిన, వృత్త్యా - జీవిక (బ్రదుకు దెరువు) తో, వర్తమానః - ఉంటున్నవాడై, స్వకర్మకృత్ - స్వధర్మమునను ష్ఠించువాడై, స్వభావజమ్ - స్వభావమును బట్టి వచ్చిన, కర్మ - కర్మను, శనైః - మెల్లగా, హిత్వా - విడిచిపెట్టి, నిర్గుణతామ్ - గుణాతీతమగు స్థితి (జీవన్ముక్తావస్థ) ని, ఇయాత్ - పొందవలెను.

స్వభావమును బట్టి నిర్ధారించబడిన బ్రదుకు దెరువుతో స్వధర్మ మును అనుష్ఠించి జీవిస్తూ మానవుడు మెల్లగా ఆ స్వభావసిద్ధమగు కర్మను కూడ విడిచి గుణాతీతుడై జీవన్ముక్తుడు కావలెను.

ఉప్యమానం ముహుః క్షేత్రం స్వయం నిర్వీర్యతామియాత్ ।
న కల్పతే పునస్సూత్యై ఉప్తం బీజం చ నశ్యతి ॥ 33

ముహుః - పలుమార్లు, ఉప్యమానమ్ - నాట్లు వేయబడే, క్షేత్రమ్ - పొలము, స్వయమ్ - తనంత తానుగా, నిర్వీర్యతామ్ - నిస్సారతను, ఇయాత్ - పొందును, పునః - మరల, సూత్యై - పంట పండుటకు, న కల్పతే - సమర్థము కాదు, ఉప్తమ్ - నాటబడిన, బీజం చ - విత్తు కూడ, నశ్యతి - నశించును.

అతిగా నాట్లు వేసిన క్షేత్రము తనంత తానే నిస్సారమగును. ఆ తరువాత దానిలో పంట పండకపోవుట మాత్రమే గాక, నాటిన విత్తు కూడ నష్టమగును.

ఏవం కామాశయం చిత్తం కామానామతిసేవయా ।
విరజ్యేత యథా రాజన్నాగ్నివత్కామబిందుభిః ॥ 34

రాజన్ - ఓ ధర్మరాజా!, ఏవమ్ - ఈ విధముగా, కామ-ఆశయమ్ - కోరికలకు నిలయమైన, చిత్తమ్ - మనస్సు, కామానామ్ - కామనలయొక్క, అతిసేవయా - అధికమగు సేవించుటచే, విరజ్యేత - విరక్తిని పొందు

ను, అగ్నివత్ - అగ్నివలె, కామబిందుభిః - కోరికలు అనే బిందువులచే, న - విరక్తిని పొందదు.

ఓ ధర్మరాజా! ఈ విధముగా కోరికలకు నిలయమైన మనస్సు కామనలను కొంత కాలము సేవించగా విరక్తిని పొందును. అంతే గాని, ఒక్కసారిగా విరక్తిని పొందదు. ఏవో కొద్దిపాటి కామనలను మాత్రమే సేవించినచో, కొద్ది నేతిచుక్కలను వేసిన అగ్ని వలె, ఉపశమమును పొందదు (అనగా, స్వధర్మానుష్ఠానమును చేస్తూ మానవుడు ఏవో కొన్ని కామనలను గృహస్థాశ్రమములో అనుభవించుటయే మంచిది; స్థాయిగా ఉండే వైరాగ్యము ఆ విధముగనే వర్ధిల్లును అని అభిప్రాయము).

యస్య యల్లక్షణం ప్రోక్తం పుంసో వర్ణాభివ్యంజకమ్ ।
యదన్యత్రాపి దృశ్యేత తత్తేనైవ వినిర్దిశేత్ ॥ 35

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే
వివిధధర్మవర్ణనం నామ ఏకాదశోऽధ్యాయః ॥

యస్య - ఏ, పుంసః - వ్యక్తికి, వర్ణ-అభివ్యంజకమ్ - ఆ వర్ణమునకు అసాధారణమైన, యత్ - ఏ, లక్షణమ్ - లక్షణము, ప్రోక్తమ్ - చెప్పబడినదో, తత్ - అది, అన్యత్ర అపి - మరియొకనియందు కూడ, యత్ దృశ్యేత - కానబడినచో, తత్ - ఆ మరియొక వర్ణమును, తేన ఏవ - ఆ వర్ణముతోనే, వినిర్దిశేత్ - నిర్దేశించ వలెను.

ఆయా వర్ణముల వారికి ఆయా అసాధారణ లక్షణములు చెప్పబడినవి. ఒక వర్ణమునకు చెందిన లక్షణములు మరియొక వర్ణమునకు చెందిన వ్యక్తియందు కానవచ్చినచో, ఆ వ్యక్తికి వర్ణమును ఆ లక్షణములను బట్టియే నిర్ధారించవలెను (జన్మను బట్టి వర్ణమును నిర్ధారించరాదు).

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో వివిధధర్మములను వర్ణించే పదునొకండవ అధ్యాయము ముగిసినది (11).

*****

# అథ ద్వాదశోऽధ్యాయః

## బ్రహ్మచర్య-వానప్రస్థ ధర్మముల వర్ణనము

నారద ఉవాచ ।
బ్రహ్మచారీ గురుకులే వసన్ దాంతో గురోర్హితమ్ ।
ఆచరన్ దాసవన్నీచో గురౌ సుదృఢసౌహృదః ॥ 1

గురుకులే - గురుకులమునందు, వసన్ - నివసించే, బ్రహ్మచారీ - బ్రహ్మచారి, దాంతః - ఇంద్రియనిగ్రహము గలవాడు, గురోః - గురువునకు, హితమ్ - హితమును, ఆచరన్ - ఆచరించువాడు, దాసవత్ - సేవకుడు వలె, నీచః - నమ్రుడై, గురౌ - గురువునందు, సుదృఢసౌహృదః - మిక్కిలి దృఢమైన అనురాగము గలవాడు.

బ్రహ్మచారి ఇంద్రియనిగ్రహముతో గురుకులములో నివసిస్తూ గురువునకు హితమునాచరించవలెను. సేవకుడు వలె గురువు యెడల నమ్రుడై గురువునందు మిక్కిలి దృఢమగు అనురాగమును కలిగియుండవలెను.

సాయం ప్రాతరుపాసీత గుర్వగ్న్యర్కసురోత్తమాన్ ।
ఉభే సంధ్యే చ యతవాగ్ జపన్ బ్రహ్మ సమాహితః ॥ 2

సాయమ్ - సాయంకాలము, ప్రాతః - ఉదయము, గురు-అగ్ని-అర్కసుర-ఉత్తమాన్ - గురువును అగ్నిని సూర్యుని శ్రీహరిని, ఉపాసీత - ఉపాసించవలెను, ఉభే - రెండు, సంధ్యే చ - సంధ్యలను కూడ, యత వాక్ - మితముగా మాటలాడువాడు, సమాహితః - ఏకాగ్రచిత్తము గలవాడై, బ్రహ్మ - గాయత్రిని, జపన్ - జపించుచున్నవాడు.

బ్రహ్మచారి ఉదయము సాయంకాలము గురువును, అగ్నిని, సూర్యుని, శ్రీహరిని పూజించవలెను. మితముగా మాటలాడవలెను. రెండు సంధ్యలయందు కూడ ఏకాగ్రమగు చిత్తముతో గాయత్రిని జపించవలెను.

**ఛందాంస్యధీయీత గురోరాహూతశ్చేత్సుయంత్రితః ।**
**ఉపక్రమేఽవసానే చ చరణౌ శిరసా నమేత్ ॥ 3**

గురోః - గురువుచే, ఆహూతః చేత్ - పిలువబడినచో, సుయంత్రితః - మిక్కిలి సావధానము గలవాడై, ఛందాంసి - వేదమంత్రములను, **అధీయీత** - అధ్యయనము చేయవలెను, ఉపక్రమే - ఆరంభమునందు, **అవసానే చ** - అంతమునందు కూడ, చరణౌ - పాదములను, శిరసా - శిరస్సుతో, నమేత్ - నమస్కరించవలెను.

గురువు పిలిచినప్పుడు బ్రహ్మచారి మిక్కిలి సావధానుడై వేదమంత్రములను అధ్యయనము చేయవలెను. అధ్యయనమునకు ముందు వెనుక కూడ గురువు పాదములకు సాష్టాంగనమస్కారమును చేయవలెను.

**మేఖలాజినవాసాంసి జటాదండకమండలూన్ ।**
**బిభృయాదుపవీతం చ దర్భపాణిర్యథోదితమ్ ॥ 4**

దర్భపాణిః - దర్భలు చేతియందున్న బ్రహ్మచారి, మేఖలా-అజిన వాసాంసి - మౌంజిని మృగచర్మమును వస్త్రములను, జటాదండకమండలూన్ - జటలను దండమును కమండలమును, ఉపవీతం చ - యజ్ఞోపవీతమును కూడ, యథా-ఉదితమ్ - శాస్త్రములో చెప్పిన పద్ధతిని అతిక్రమించకుండగా, బిభృయాత్ - ధరించవలెను.

బ్రహ్మచారి శాస్త్రములో విధించిన పద్ధతిలో మౌంజి, మృగచర్మము, వస్త్రములు, జటలు, దండము, కమండలము, యజ్ఞోపవీతములను, చేతిలో దర్భలను ధరించవలెను.

**సాయం ప్రాతశ్చరేద్భైక్షం గురవే తన్నివేదయేత్ ।**
**భుంజీత యద్యనుజ్ఞాతో నో చేదుపవసేత్క్వచిత్ ॥ 5**

సాయమ్ - సాయంకాలము, ప్రాతః - ఉదయము, భైక్షమ్ - భిక్షాటనను, చరేత్ - చేయవలెను, తత్ - దానిని, గురవే - గురువు కొరకు, నివేదయేత్ - సమర్పించవలెను, అనుజ్ఞాతః యది - అనుమతించబడినవాడైనచో, భుంజీత - భుజించవలెను, క్వచిత్ - ఒకప్పుడు, నో చేత్ - అట్లు గానిచో, ఉపవసేత్ - ఉపవాసము చేయవలెను.

ఉదయము సాయంకాలము బ్రహ్మచారి భిక్షాటనను చేసి ఆ ఆహారమును గురువునకు సమర్పించవలెను. గురువు అనుమతితో ఆ ఆహారమును భుజించవలెను. ఒకప్పుడు (అపరాధము చేసినప్పుడు) గురువు అనుమతినీయనిచో, ఆతడు ఆనాడు ఉపవాసమును చేయవలెను.

సుశీలో మితభుగ్దక్షశ్శ్రద్దధానో జితేంద్రియః ।
యావదర్థం వ్యవహరేత్ స్త్రీషు స్త్రీనిర్జితేషు చ ॥ 6

సుశీలః - చక్కని శీలము గలవాడు, మితభుక్ - మితముగా తినువాడు, దక్షః - సమర్థుడు, శ్రద్దధానః - శ్రద్ధ గలవాడు, జిత-ఇంద్రియః - జయించబడిన ఇంద్రియములు గలవాడు, స్త్రీషు - స్త్రీలయందు, స్త్రీనిర్జితేషు చ - స్త్రీలకు వశులైన వారియందు, యావత్ అర్థమ్ - ప్రయోజనమున్నంతవరకు, వ్యవహరేత్ - వ్యవహరించవలెను.

బ్రహ్మచారి చక్కని శీలము గలవాడై మితముగా తినవలెను; దక్షుడుగా ఉంటూ శ్రద్ధను కలిగియుండవలెను; స్త్రీలతో మరియు స్త్రీలకు వశులైన పురుషులతో పని ఉన్నంత వరకు మాత్రమే వ్యవహరించవలెను.

వర్జయేత్ప్రమదాగాథామగృహస్థో బృహద్వ్రతః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరంత్యపి యతేర్మనః ॥ 7

అగృహస్థః - గృహస్థుడు కానివాడు, బృహద్-వ్రతః - బ్రహ్మచర్యవ్రతము గలవాడు, ప్రమదాగాథామ్ - స్త్రీలకు సంబంధించిన ప్రసంగమును, వర్జయేత్ - విడిచిపెట్టవలెను, ఇంద్రియాణి - ఇంద్రియములు, ప్రమాథీని - చాల బలము గలవి, యతేః - యతియొక్క, మనః అపి - మనస్సును కూడ, హరంతి - లాగివేయును.

గృహస్థుడు కానివాడు, బ్రహ్మచర్యవ్రతము గలవాడు స్త్రీలకు సంబంధించిన ప్రసంగమునకు దూరముగా నుండవలెను. ఎందుకంటే, ఇంద్రియములకు దొడ్డ బలము గలదు. అవి యతియొక్క మనస్సునైననూ లాగివేయును.

కేశప్రసాధనోన్మర్దస్నపనాభ్యంజనాదికమ్ ।
గురుస్త్రీభిర్యువతిభిః కారయేన్నాత్మనో యువా ॥ 8

యువా - యువకుడు, ఆత్మనః - తనకు, కేశప్రసాధన-ఉన్మర్దస్నపన-అభ్యంజన-ఆదికమ్ - జుట్టును అలంకరించుట శరీరమునకు మర్దనము చేయించుట స్నానము నలుగు పెట్టి స్నానము చేయుట మొదలగు వాటిని, యువతిభిః - యౌవనములోనున్న, గురుస్త్రీభిః - గురుభార్యలచే, న కారయేత్ - చేయించుకొనరాదు.

యువకుడగు బ్రహ్మచారి యువతులగు గురుభార్యలచే తనకు జుట్టునకు అలంకారము, శరీరమునకు మర్దనము, స్నానము, నలుగు పెట్టి స్నానము చేయించుట మొదలగువాటిని చేయించుకొనరాదు.

నన్వగ్నిః ప్రమదా నామ ఘృతకుంభసమః పుమాన్ ।
సుతామపి రహో జహ్యాదన్యదా యావదర్థకృత్ ॥ 9

ప్రమదా నామ - యువతి యనగా, అగ్నిః - అగ్ని, నను - నిశ్చయము, పుమాన్ - మగవాడు, ఘృతకుంభసమః - నేతి పాత్రతో సమానమైనవాడు, రహః - ఏకాంతమునందు, సుతాం అపి - కుమార్తెను కూడ, జహ్యాత్ - విడిచిపెట్టవలెను, అన్యదా - ఇతరసమయములయందు, యావద్-అర్థకృత్ - ఎంతవరకు పనియో అంతవరకే వ్యవహరించువాడు.

యువతి నిప్పు వంటిది కాగా, మగవాడు నేతి కుండవంటివాడు. ఇది నిశ్చయము. కావున, వ్యక్తి తన కుమార్తెతోనైననూ ఏకాంతమునందుండరాదు. బ్రహ్మచారి యువతితో ఏకాంతము కాని సందర్భములలో కూడ పని ఎంతవరకో అంతవరకే వ్యవహరించవలెను.

కల్పయిత్వాఽఽత్మనా యావదాభాసమిదమీశ్వరః ।
ద్వైతం తావన్న విరమేత్తతో హ్యస్య విపర్యయః ॥ 10

యావత్ - ఎంతవరకైతే, ఆత్మనా - తన స్వరూపముచే, ఇదమ్ - ఈ దేహాదికమును, ఆభాసమ్ - ప్రతీతినిగా, కల్పయిత్వా - నిశ్చయించి, ఈశ్వరః - స్వతంత్రుడు అగునో, తావత్ - అంతవరకు, ద్వైతమ్ - భేదబుద్ధి, న విరమేత్ - తొలగిపోదు, తతః - దానివలన, అస్య - వీనికి, విపర్యయః హి - తప్పు ధారణ కలుగును గదా!

మానవుడు తన స్వరూపమును తెలుసుకొని దేహాదులతో సహా ఈ సర్వము కేవలము ప్రతీతి (కనబడేదే గాని ఉన్నది కాదు) మాత్రమేనని నిశ్చయించుకొనవలెను. అంతవరకు వానికి స్త్రీ-పురుషుడు అనే భేదబుద్ధి దూరము కాదు. అట్టి భేదబుద్ధి వలన వీనికి స్త్రీయెడల కామన కలుగును గదా! (కావున, పై నియమములను పాటించవలెను అని యర్థము).

ఏతత్సర్వం గృహస్థస్య సమామ్నాతం యతేరపి ।
గురువృత్తిర్వికల్పేన గృహస్థస్యర్తుగామినః ॥ 11

ఏతత్ - ఈ, సర్వమ్ - సర్వము, గృహస్థస్య - గృహస్థునకు, యతేః అపి - సన్న్యాసికి కూడ, సమామ్నాతమ్ - విధించబడినది, ఋతుగామినః - భార్యతో కలిసి జీవించే, గృహస్థస్య - గృహస్థునకు, గురువృత్తిః - గురువు యెడల ప్రవృత్తి, వికల్పేన - వికల్పముగా.

ఈ శీలమును రక్షించుకొనుట మొదలైన ఉపదేశమంతయు గృహస్థునకు, సన్న్యాసికి కూడ విధించబడినది. భార్యతో కలిసి కాపురము చేసే గృహస్థునకు గురుశుశ్రూష మొదలైనవి వికల్పము, అనగా వీలుంటే చేయవచ్చును, లేకపోతే అక్కర లేదు.

అంజనాభ్యంజనోన్మర్దస్త్ర్యవలేఖామిషం మధు ।
స్రగ్గంధలేపాలంకారాంస్త్యజేయుర్యే ధృతవ్రతాః ॥ 12

యే - ఎవరైతే, ధృతవ్రతాః - ధరించబడిన వ్రతము గలవారో వారు, అంజన-అభ్యంజన-ఉన్మర్దస్త్రీ-అవలేఖ-ఆమిషమ్ - కళ్లకు అంజ

నము అభ్యంగన స్నానము శరీరమునకు మర్దనము స్త్రీల చిత్రములను చూచుట మాంసము అనువాటిని, మధు - మద్యమును, స్రగ్-గంధలేప-అ లంకారాన్ - పుష్పమాలలను గంధమును అలముకొనుటను అలంకారము లను, త్యజేయుః - విడిచి పెట్టెదరు గాక!

ఎవరైతే బ్రహ్మచర్య వ్రతమునసనుష్ఠించెదరో వారు కళ్లకు అంజన మును, అభ్యంగన స్నానమును, శరీరమునకు మర్దనమును, స్త్రీల చిత్ర ములను చూచుటను, మాంసమును, మద్యమును, పుష్పమాలలను ధరిం చుటను, సుగంధద్రవ్యములను అలముకొనుటను, అలంకారములను విడి చిపెట్ట వలెను.

**ఉషిత్వైవం గురుకులే ద్విజోఽధీత్యావబుధ్య చ ।**
**త్రయీం సాంగోపనిషదం యావదర్థం యథాబలమ్ ॥ 13**

**దత్త్వా వరమనుజ్ఞాతో గురోః కామం యదీశ్వరః ।**
**గృహం వనం వా ప్రవిశేత్ప్రవ్రజేత్తత్ర వా వసేత్ ॥ 14**

ద్విజః - ఉపనయన సంస్కారమును పొందిన వ్యక్తి, ఏవమ్ - ఈ విధముగా, గురుకులే - గురుకులమునందు, ఉషిత్వా - నివసించి, స-అం గ-ఉపనిషదమ్ - వేదాంగములతో ఉపనిషత్తులతో కూడియున్న, త్రయీమ్ - మూడు వేదములను, యథాబలమ్ - తన శక్తిని అతిక్రమించ కుండగా, యావద్-అర్థమ్ - ప్రయోజనమున్నంత వరకు, అధీత్య - అధ్య యనము చేసి, అవబుధ్య చ - తెలుసుకొని, గురోః - గురువునకు, కామమ్ - అభీష్టమైన, వరమ్ - కానుకను, దత్త్వా - ఇచ్చి, అనుజ్ఞాతః - అనుమతిని పొందినవాడై, గృహమ్ - గృహమును గాని, వనం వా - వన మును గాని, ప్రవిశేత్ - ప్రవేశించవలెను, ప్రవ్రజేత్ - సన్న్యసించ వలెను, వా - లేక, తత్ర - అచటనే, వసేత్ - నివసించవలెను.

ఉపనయనసంస్కారము గల వ్యక్తి ఈ విధముగా గురుకులములో నివసించి తన శక్తికి, ఆవశ్యకతకు అనురూపముగా మూడు వేదములను, వాటి ఉపనిషత్తులను, వాటి అంగములను (శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, కల్పము, జ్యోతిషము, నిరుక్తము) అధ్యయనము చేసి, వేదార్థమును కూడ

విచారణ చేయవలెను. తరువాత, ఆతడు గురువు కోరిన వరమును ఆయ
నకు సమర్పించి, ఆయన అనుమతితో గృహస్థాశ్రమములో ప్రవేశించవలె
ను; లేదా, అడవికి వెళ్లి తపస్సు చేయవచ్చును; లేదా, సన్న్యసించవచ్చు
ను; లేదా, గురుకులములోనే కొనసాగవచ్చును.

అగ్నౌ గురావాత్మని చ సర్వభూతేష్వధోక్షజమ్ ।
భూతైస్స్వధామభిః పశ్యేదప్రవిష్టం ప్రవిష్టవత్ ।। 15

అగ్నౌ - అగ్నియందు, గురౌ - గురువునందు, ఆత్మని - తన
యందు, సర్వభూతేషు చ - సకలప్రాణులయందు కూడ, అధోక్షజమ్ -
ప్రత్యక్షాది ప్రమాణములకు అతీతుడగు శ్రీహరిని, స్వధామభిః - తన
అంశలే అయిన, భూతైః - ప్రాణులచే, అప్రవిష్టమ్ - ప్రవేశించని వాడే
అయిననూ, ప్రవిష్టవత్ - ప్రవేశించినాడా యన్నట్లు, పశ్యేత్ - చూడవలె
ను.

బ్రహ్మచారి అగ్నియందు, గురువునందు, తనయందు, సకలప్రా
ణులయందు కూడ సర్వప్రమాణములకు అతీతుడైన శ్రీహరిని దర్శించవ
లెను. శ్రీహరి సర్వత్రా వ్యాపించియే యున్నాడు గనుక, కొత్తగా దేనియం
దైననూ ప్రవేశించ బని లేదు. అయిననూ, సర్వమునందు తన అంశలే
యగు జీవుల రూపములో ప్రవేశించినాడా యన్నట్లు భాసించును.

ఏవంవిధో బ్రహ్మచారీ వానప్రస్థో యతిర్గృహీ ।
చరన్ విదితవిజ్ఞానః పరం బ్రహ్మాధిగచ్ఛతి ।। 16

ఏవంవిధః - ఇటువంటి ప్రకారము గలవాడు, చరన్ - ప్రవృత్తి
గలవాడు అగు, బ్రహ్మచారీ - బ్రహ్మచారి, వానప్రస్థః - వానప్రస్థుడు,
యతిః - సన్న్యాసి, గృహీ - గృహస్థుడు, విదితవిజ్ఞానః - తెలియబడిన
తెలియదగినది గలవాడై, పరం బ్రహ్మ - పరబ్రహ్మను, అధిగచ్ఛతి -
పొందును.

ఈ విధముగా నియమబద్ధముగా జీవించే బ్రహ్మచారి, గృహస్థుడు, వానప్రస్థుడు, సన్న్యాసి కూడ తెలియదగిన ఆత్మతత్త్వమును తెలుసుకున్నవారై పరబ్రహ్మను ఆత్మరూపముగా పొందెదరు.

వానప్రస్థస్య వక్ష్యామి నియమాన్మునిసమ్మతాన్ ।
యానాతిష్ఠన్ మునిర్గచ్ఛేదృషిలోకమిహాంజసా ॥ 17

మునిసమ్మతాన్ - మహర్షులకు సమ్మతములైన, వానప్రస్థస్య - వానప్రస్థుని, నియమాన్ - నియమములను గురించి, వక్ష్యామి - చెప్పగలను, ఇహ - ఈ లోకమునందు, యాన్ - వేటిని, మునిః - మననశీలుడగు వానప్రస్థుడు, ఆతిష్ఠన్ - అనుష్ఠించువాడై, అంజసా - తేలికగా, ఋషిలోకమ్ - మహర్షుల లోకమగు మహర్లోకమును, గచ్ఛేత్ - పొందునో.

మహర్షులచే ప్రవచించబడిన వానప్రస్థ ధర్మములను చెప్పెదను. ఈ లోకములో మననశీలుడై ఈ ధర్మములనాచరించు వ్యక్తి మహర్షుల లోకమగు మహర్లోకమును పొందును.

న కృష్టపచ్యమశ్నీయాదకృష్టం చాప్యకాలతః ।
అగ్నిపక్వమథామం వా అర్కపక్వముతాహరేత్ ॥ 18

కృష్టపచ్యమ్ - భూమిని దున్ని పండించిన ఆహారమును, న అశ్నీయాత్ - తినరాదు, అకృష్టం చ అపి - సహజసిద్ధమగు ఆహారమునైననూ, అకాలతః - కాలము కాని కాలమునందు (తినరాదు), అగ్నిపక్వమ్ - నిప్పులలో పక్వమైనదానిని గాని, అథ - లేదా, ఆమం వా - పచ్చికాయను గాని (తినరాదు), ఉత - కాని, అర్కపక్వమ్ - సూర్యుని కిరణములతో పండిన దానిని, ఆహరేత్ - భక్షించవలెను.

భూమిని దున్ని పండించిన ఆహారమును గాని, నిప్పులలో కాల్చిన ఆహారమును గాని, పచ్చి కాయలను గాని, వానప్రస్థుడు తినరాదు. సహజముగా లభించే ఆహారమునైననూ కాలము కాని కాలమునందు తినరాదు. కాని, సూర్యుని వేడికి పండిన ఫలములు మొదలగువాటిని తినవచ్చును.

వన్యైశ్చరుపురోడాశాన్ నిర్వపేత్కాలచోదితాన్ ।
లబ్ధే నవే నవేఽన్నాద్యే పురాణం తు పరిత్యజేత్ ॥ 19

వన్యైః - అడవిలో లభించే ధాన్యములతో, కాలచోదితాన్ - కాలమునందు విధించబడిన, చరుపురోడాశాన్ - అన్నము పురోడాశములను, నిర్వపేత్ - హోమము కొరకు నిర్దేశించవలెను, నవే నవే - కొత్త కొత్త, అన్న-ఆద్యే - తినదగిన ఆహారము, లబ్ధే - లభించగా, పురాణం తు - పాత అన్నమును, పరిత్యజేత్ - విడిచిపెట్టవలెను.

వానప్రస్థుడు అడవిలో లభించే ధాన్యములతో అన్నమును పురోడాశములను తయారు చేసి వాటితోనే, ఆయా కాలములయందు విధించబడిన (నిత్యనైమిత్తిక) హోమములను చేయవలెను. తినదగిన ఆహారధాన్యములు కొత్త కొత్తవి లభించుట తోడనే, పాతవాటిని విడిచి పెట్టవలెను (ఇతరులకు, లేక పశుపక్ష్యాదులకు సమర్పించవలెను).

అగ్న్యర్థమేవ శరణముటజం వాఽద్రికందరామ్ ।
శ్రయేత హిమవాయ్వగ్నివర్షార్కాతపషాట్ స్వయమ్ ॥ 20

అగ్ని-అర్థం ఏవ - అగ్ని కొరకు మాత్రమే, ఉటజమ్ - పర్ణశాలను గాని, అద్రికందరామ్ - కొండగుహను గాని, శరణమ్ - ఇల్లుగా, శ్రయేత - ఆశ్రయించవలెను, స్వయమ్ - స్వయముగా, హిమవాయు-అగ్నివర్షా-అర్క-ఆతపషాట్ - చలి గాలి అగ్ని వర్షము సూర్యుని వేడిమి అనువాటిని సహించువాడు.

వానప్రస్థుడు అగ్నులను రక్షించుట కొరకు మాత్రమే పర్ణశాలను గాని, కొండ గుహను గాని ఆశ్రయించవలెను. తనకై తాను చలిని, గాలిని, అగ్నిని, వర్షమును, సూర్యుని వేడిని సహించవలెను.

కేశరోమనఖశ్మశ్రుమలాని జటిలో దధత్ ।
కమండల్వజినే దండవల్కలాగ్నిపరిచ్ఛదాన్ ॥ 21

జటిలః - జటాధారియగు వానప్రస్థుడు, కేశరోమనఖశ్మశ్రుమలాని - జుట్టు శరీరమునందలి రోమములు గోళ్లు గడ్డము మొదలగువాటి కాలు

ష్యములను, కమండలు-అజినే - కమండలమును మృగచర్మమును, దండవల్కల-అగ్నిపరిచ్ఛదాన్ - దండమును ముదక వస్త్రములను అగ్ని హోత్రమునకు సంబంధించిన స్రుక్కు మొదలగు సాధనములను, దధత్ - ధరించువాడు.

వానప్రస్థుడు జటాధారియై జుట్టు, రోమములు, గోళ్లు, గడ్డము, మీసములయందలి మాలిన్యమును ఉపేక్ష చేయవలెను. అతడు కమండల మును, మృగచర్మమును, దండమును, ముదక వస్త్రములను, అగ్నిహోత్ర మునకు చెందిన స్రుక్కు మొదలగు సామగ్రిని ధరించవలెను.

చరేద్వనే ద్వాదశాబ్దానష్టౌ వా చతురో మునిః ।
ద్వావేకం వా యథా బుద్ధిర్న విపద్యేత కృచ్ఛ్రతః ॥ 22

మునిః - మననశీలుడగు వానప్రస్థుడు, వనే - వనమునందు, ద్వాదశ - పన్నెండు గాని, అష్టౌ వా - ఎనిమిది గాని, చతురః - నాలుగు గాని, ద్వౌ - రెండు గాని, ఏకం వా - ఒకటి గాని, అబ్దాన్ - సంవత్సరము లను, వనే చరేత్ - వానప్రస్థ నియమములను పాటించవలెను, యథా - ఏ విధముగానైతే, బుద్ధిః - బుద్ధి, కృచ్ఛ్రతః - క్లేశముల వలన, న విపద్యేత - నశించదో.

వానప్రస్థుడు మననశీలుడై పన్నెండు, ఎనిమిది, నాలుగు, రెండు, లేక ఒక సంవత్సరము వానప్రస్థ ధర్మములను పాటించవలెను. కాని, ఆ ప్రయత్నములో క్లేశముల ఆధిక్యముచే బుద్ధి వినష్టము కాకుండ చూచుకొ నవలెను.

యదాఽకల్పస్స్వక్రియాయాం వ్యాధిభిర్జరయాఽథ వా ।
ఆన్వీక్షిక్యాం వా విద్యాయాం కుర్యాదనశనాదికమ్ ॥ 23

యదా - ఎప్పుడైతే, వ్యాధిభిః - వ్యాధులచే, అథవా - లేక, జరయా - ముసలిదనముచే, స్వక్రియాయామ్ - తన పనియందు గాని, ఆన్వీక్షిక్యామ్ - ఆత్మవిచారము అనే, విద్యాయాం వా - విద్యయందు

గాని, అకల్పః - అసమర్థుడో అప్పుడు, అనశన-ఆదికమ్ - నిరాహారము మొదలగు వ్రతములను, కుర్యాత్ - చేయవలెను.

ఎప్పుడైతే సాధకుడు వ్యాధుల వలన గాని, ముసలిదనముచే గాని, నిత్యకర్మలను అనుష్ఠించుటకు గాని ఆత్మవిచారమునకు గాని సమర్థుడు కాడో, అప్పుడు నిరాహారము మొదలగు వ్రతములను చేయవలెను.

**ఆత్మన్యగ్నీన్ సమారోప్య సన్న్యస్యాహంమమాత్మతామ్ ।**
**కారణేషు న్యసేత్సమ్యక్ సంఘాతం తు యథార్హతః ॥ 24**

**ఆత్మని** - తనయందు, **అగ్నీన్** - అగ్నులను, **సమారోప్య** - సమంత్రకముగా ఆరోపించుకొని, **అహంమమ-ఆత్మతామ్** - అహంకార మమకారములను, **సన్న్యస్య** - విడిచిపెట్టి, **సంఘాతం తు** - దేహము ఇంద్రియములు మనస్సుల సమూహమునైతే, **సమ్యక్** - చక్కగా, **కారణేషు** - వాటి వాటి కారణములయందు, **యథా-అర్హతః** - యోగ్యతను అతిక్రమించకుండగా, **న్యసేత్** - నిక్షేపించవలెను.

వానప్రస్థుడు మూడు అగ్నులను తనయందు సమంత్రకముగా భావనారూపముగా ఆరోపించుకొనవలెను. అతడు దేహేంద్రియ మనస్సంఘాతమునందలి అహంకార (నేను)-మమకారము (నాది) లను విడిచిపెట్టి, వాటిని యోగ్యతననుసరించి వాటి వాటి కారణములయందు విలాపము (భావనారూపముగా) చేయవలెను.

**ఖే ఖాని వాయౌ నిశ్వాసాంస్తేజస్యూష్మాణమాత్మవాన్ ।**
**అప్స్వసృక్శ్లేష్మపూయాని క్షితౌ శేషం యథోద్భవమ్ ॥ 25**

**ఆత్మవాన్** - జితేంద్రియుడగు వానప్రస్థుడు, **ఖాని** - ఇంద్రియములను, **ఖే** - ఆకాశమునందు, **నిశ్వాసాన్** - ప్రాణాపానములను, **వాయౌ** - వాయువునందు, **ఊష్మాణమ్** - దేహమునందలి వేడిని, **తేజసి** - అగ్నియందు, **అసృక్శ్లేష్మపూయాని** - రక్తము శ్లేష్మము మూత్రాదులను, **అప్సు** - జలములయందు, **శేషమ్** - మిగిలిన దేహమును, **క్షితౌ** - పృథివియందు, **యథా-ఉద్భవమ్** - పుట్టిన ప్రకృతిని అతిక్రమించకుండగా.

సాధకుడు జితేంద్రియుడై దేహేంద్రియమనస్సంఘాతమును వాటివాటికి చెందిన ప్రకృతి తత్త్వములయందు భావనారూపముగా విలీనము చేయవలెను. ఇంద్రియములను ఆకాశమునందు, ప్రాణాపానములను వాయువునందు, దేహపు వేడిని అగ్నియందు, రక్తము శ్లేష్మము మూత్రము మొదలగువాటిని జలములయందు, మిగిలిన దేహమును పృథివియందు విలీనము చేయవలెను.

వాచమగ్నౌ సవక్తవ్యామింద్రే శిల్పం కరావపి ।
పదాని గత్యా వయసి రత్యోపస్థం ప్రజాపతౌ ॥ 26

సవక్తవ్యామ్ - పలుకులతో కూడియున్న, వాచమ్ - వాగింద్రియమును, అగ్నౌ - అగ్నియందు, శిల్పమ్ - పట్టుకొనుట మొదలగు వ్యాపారమును, కరౌ అపి - చేతులను రెండింటిని కూడ, ఇంద్రే - ఇంద్రునియందు, గత్యా - గమనముతో బాటుగా, పదాని - పాదములను, వయసి - కాలస్వరూపుడగు విష్ణువునందు, రత్యా - ప్రీతితో బాటుగా, ఉపస్థమ్ - జననేంద్రియమును, ప్రజాపతౌ - ప్రజాపతియందు.

పలుకులతో బాటుగా వాగింద్రియమును అగ్నియందు, పట్టుకొనుట మొదలగు పనులతో బాటుగా చేతులను ఇంద్రునియందు, నడకతో బాటుగా కాళ్లను కాలస్వరూపుడగు విష్ణువునందు, ప్రీతితో బాటుగా జననేంద్రియమును ప్రజాపతియందు విలీనము (భావన) చేయవలెను.

మృత్యౌ పాయుం విసర్గం చ యథాస్థానం వినిర్దిశేత్ ।
దిక్షు శ్రోత్రం సనాదేన స్పర్శమధ్యాత్మని త్వచమ్ ॥ 27

పాయుమ్ - విసర్జనేంద్రియమును, విసర్గం చ - విసర్జనమును కూడ, మృత్యౌ - మృత్యుదేవతయందు, శ్రోత్రమ్ - శ్రోత్రేంద్రియమును, సనాదేన - శబ్దముతో సహా, దిక్షు - దిక్కులయందు, స్పర్శమ్ - స్పర్శేంద్రియమును, త్వచమ్ - చర్మమును, అధ్యాత్మని - వాయువునందు, యథాస్థానమ్ - స్థానముల నతిక్రమించకుండగా, వినిర్దిశేత్ - విలీనము చేయవలెను.

ఆయా ఇంద్రియశక్తులను వాటి వాటి అనుగ్రాహక దేవతలయందు విలీనమగుటను సాధకుడు భావన చేయవలెను. విసర్జనేంద్రియమును విసర్జనక్రియను మృత్యుదేవతయందు, శ్రోత్రేంద్రియమును శబ్దముతో సహా దిక్కులయందు, స్పర్శేంద్రియమును చర్మమును వాయువునందు విలీనము చేయవలెను.

**రూపాణి చక్షుషా రాజన్ జ్యోతిష్యభినివేశయేత్ ।**
**అప్సు ప్రచేతసా జిహ్వాం ఘ్రేయైర్ఘ్రాణం క్షితౌ న్యసేత్ ॥28**

రాజన్ - ఓ ధర్మరాజా!, రూపాణి - రూపములను, చక్షుషా - కన్నుతో సహా, జ్యోతిషి - సూర్యునియందు, అభినివేశయేత్ - విలీనము చేయవలెను, జిహ్వామ్ - రసనేంద్రియమును, ప్రచేతసా - అధిదేవతయగు వరుణునితో (మనస్సు ఆకర్షించబడే రసముతో) సహా, అప్సు - జలములయందు, ఘ్రాణమ్ - ఘ్రాణేంద్రియమును, ఘ్రేయైః - ఆఘ్రాణించబడే గంధములతో సహా, క్షితౌ - పృథివియందు, న్యసేత్ - విలీనము చేయవలెను.

ఓ ధర్మరాజా! రూపములను కన్నుతో సహా సూర్యునియందు, రసనేంద్రియమును అధిదేవతయగు వరుణునితో (మనస్సును ఆకర్షించే రుచులతో) సహా జలములయందు, ఘ్రాణేంద్రియమును ఆఘ్రాణించబడే గంధములతో సహా పృథివియందు విలీనము చేయవలెను.

**మనో మనోరథైశ్చంద్రే బుద్ధిం బోధ్యైః కవౌ పరే ।**
**కర్మాణ్యధ్యాత్మనా రుద్రే యదహంమమతా క్రియా ।**
**సత్త్వేన చిత్తం క్షేత్రజ్ఞే గుణైర్వైకారికం పరే ॥ 29**

మనః - మనస్సును, మనోరథైః - కామనలతో సహా, చంద్రే - చంద్రునియందు, బోధ్యైః - తెలియబడే విషయములతో సహా, బుద్ధిమ్ - బుద్ధిని, పరే - సర్వోత్తముడైన, కవౌ - బ్రహ్మగారియందు, అధ్యాత్మనా - అహంకారముతో బాటుగా, కర్మాణి - క్రియలను, రుద్రే - రుద్రునియందు, యత్ - ఏ అహంకారము వలన, అహంమమతా - దేహమునందు నేను అనే బుద్ధి, దేహమునకు సంబంధించినవాటియందు నాది అనే బుద్ధి,

క్రియా - క్రియ కలుగునో, సత్త్వేన - సత్త్వగుణకార్యమగు ప్రకాశముతో సహా, చిత్తమ్ - చిత్తమును, క్షేత్రజ్ఞే - క్షేత్రజ్ఞునియందు, గుణైః - గుణములతో బాటుగా, వైకారికమ్ - వికారములు కలవానివలె కన్పట్టే జీవుని, పరే - పరబ్రహ్మయందు.

కామనలతో సహా మనస్సును చంద్రునియందు, తెలియబడే విషయములతో సహా బుద్ధిని సర్వోత్కృష్టుడగు బ్రహ్మగారియందు, అహంకారముతో సహా క్రియలను రుద్రునియందు, సత్త్వగుణకార్యమగు ప్రకాశముతో సహా చిత్తమును క్షేత్రజ్ఞుని (జీవుని) యందు, సత్త్వరజస్తమోగుణములతో సహా వికారములు కలవానివలె కన్పట్టే జీవుని పరబ్రహ్మయందు విలీనము చేయవలెను.

**అప్సు క్షితిమపో జ్యోతిష్యదో వాయౌ నభస్యముమ్ ।**
**కూటస్థే తచ్చ మహతి తదవ్యక్తేఽక్షరే చ తత్ ॥ 30**

క్షితిమ్ - పృథివిని, అప్సు - జలములయందు, అపః - జలములను, జ్యోతిషి - అగ్నియందు, అదః - ఈ అగ్నిని, వాయౌ - వాయువునందు, అముమ్ - ఈ వాయువును, నభసి - ఆకాశమునందు, తత్ చ - దానిని కూడ, కూటస్థే - వాస్తవముగా వికారములు లేని జీవునియందు, మహతి - మహత్తత్త్వమునందు, తత్ - దానిని, అవ్యక్తే - అవ్యక్తమగు ప్రకృతియందు, తత్ చ - దానిని కూడ, అక్షరే - అక్షర పరబ్రహ్మయందు.

పృథివీ తత్త్వమును జలములయందు, జలములను అగ్నియందు, అగ్నిని వాయువునందు, వాయువును ఆకాశమునందు, ఆకాశమును వాస్తవముగా వికారములు లేని జీవునియందు, జీవుని మహత్తత్త్వమునందు (మహదభిమానియగు హిరణ్యగర్భునియందు), మహత్తును మూలప్రకృతియందు, మూలప్రకృతిని కాలాతీతమైన పరబ్రహ్మయందు విలీనము చేయవలెను.

**ఇత్యక్షరతయాఽఽత్మానం చిన్మాత్రమవశేషితమ్ ।**
**జ్ఞాత్వాఽద్వయోఽథ విరమేద్దగ్ధయోనిరివానలః ॥ 31**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే
బ్రహ్మచారి-వానప్రస్థ ధర్మవర్ణనం నామ ద్వాదశోऽధ్యాయః ॥

ఇతి - ఈ విధముగా, చిత్-మాత్రమ్ - శుద్ధమగు చైతన్యముగా, **అవశేషితమ్** - మిగిలియున్న, **ఆత్మానమ్** - ఆత్మను, **అక్షరతయా** - వినాశము లేని పరబ్రహ్మగా, **జ్ఞాత్వా** - తెలుసుకొని, **అద్వయః** - రెండవది లేనివాడై, **అథ** - తరువాత, **దగ్ధయోనిః** - తగులబెట్టబడిన ఇంధనము గల, **అనలః ఇవ** - అగ్ని వలె, **విరమేత్** - విరమించవలెను.

ఈ విధముగా తన స్వరూపమునందలి అనాత్మలనన్నింటినీ నిషేధించగా మిగిలేది శుద్ధచైతన్యస్వరూపమగు ఆత్మయే. అది వినాశము లేని పరబ్రహ్మకంటె భిన్నము కాదు అనియు, దానియందు రెండవది లేదనియు తెలుసుకొని, తరువాత ఆ వానప్రస్థుడు, ఇంధనమును తగులబెట్టిన అగ్ని వలె, సర్వకృత్యములనుండి విరమించును.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
బ్రహ్మచర్య-వానప్రస్థ ధర్మములను వర్ణించే
పన్నెండవ అధ్యాయము ముగిసినది (12).

*****

# అథ త్రయోదశోఽధ్యాయః

## యతి ధర్మములు- ప్రహ్లాద దత్తాత్రేయ సంవాదము

నారద ఉవాచ ।
కల్పస్త్వేవం పరివ్రజ్య దేహమాత్రావశేషితః ।
గ్రామైకరాత్రవిధినా నిరపేక్షశ్చరేన్మహీమ్ ॥ 1

కల్పః తు - సమర్థుడైతే, ఏవమ్ - ఈ విధముగా, పరివ్రజ్య - సన్న్యసించి, దేహమాత్ర-అవశేషితః - దేహముచే మాత్రమే మిగిలినవాడై, గ్రామ-ఏకరాత్రవిధినా - గ్రామమునందు ఒక రాత్రి అనే పద్ధతితో, నిరపేక్షః - కామనలు లేనివాడై, మహీమ్ - భూమిని, చరేత్ - సంచరించవలెను.

ఆత్మవిచారమునందు సమర్థుడైన వ్యక్తి అద్వయమగు ఆత్మను ధ్యానిస్తూ సన్న్యసించి శరీరముతో మాత్రమే మిగిలియున్నవాడై, ఒక గ్రామములో ఒక దినము చొప్పున నిష్కామముగా భూమియందు సంచరించవలెను.

బిభృయాద్యద్యసౌ వాసః కౌపీనాచ్ఛాదనం పరమ్ ।
త్యక్తం న దండలింగాదేరన్యత్కించిదనాపది ॥ 2

అసౌ - ఈ సన్న్యాసి, వాసః - వస్త్రమును, యది బిభృయాత్ - ధరించే పక్షములో, పరమ్ - కేవలము, కౌపీన-ఆచ్ఛాదనమ్ - కౌపీనమును మాత్రమే ధరించుట, అనాపది - ఆపద కాని సందర్భమునందు, దండలింగాదేః - దండము సన్న్యాసిచిహ్నములు మొదలగువాటికంటె, అన్యత్ - ఇతరమును, త్యక్తమ్ - విడువబడినదానిని, కించిత్ - దేనినైననూ, న - ధరించరాదు.

ఈ సన్న్యాసి వస్త్రమును ధరించే పక్షములో కేవలము కౌపీన మును మాత్రమే ధరించవలెను. దండమును, సన్న్యాసచిహ్నములగు జప మాల మొదలగువాటిని తప్పించి ఇతరమును, సన్న్యాసమును స్వీకరించే సమయములో విడిచిపెట్టినదానిని దేనినైననూ స్వీకరించరాదు.

ఏక ఏవ చరేద్భిక్షురాత్మారామోఽనపాశ్రయః ।
సర్వభూతసుహృచ్ఛాంతో నారాయణపరాయణః ॥ 3

భిక్షుః - భిక్షాన్నముతో జీవించువాడు, ఆత్మారామః - ఆత్మనిష్ఠ యందు ఆనందించువాడు, అనపాశ్రయః - ఇతరులపై ఆధారపడనివాడు, సర్వభూతసుహృత్ - సకలప్రాణులకు హితమును చేయువాడు, శాంతః - సకలకామనలు చల్లారిన వాడు, నారాయణపరాయణః - నారాయణుడే పరమలక్ష్యముగా గలవాడు, ఏకః ఏవ - ఒక్కడే, చరేత్ - సంచరించవలె ను.

సన్న్యాసి భిక్షాన్నముతో జీవిస్తూ ఆత్మనిష్ఠయందు రమిస్తూ ఇత రులపై ఆధారపడకుండా సకలప్రాణులకు హితమును చేగూర్చువాడై ఒంటరిగా సంచరించవలెను. సకలకామనలు చల్లారిన సన్న్యాసి నారాయ ణుడే పరమలక్ష్యముగా గలవాడై ఉండవలెను.

పశ్యేదాత్మన్యదో విశ్వం పరే సదసతోఽవ్యయే ।
ఆత్మానం చ పరం బ్రహ్మ సర్వత్ర సదసన్మయే ॥ 4

సద్-అసతః - కార్యకారణములకు, పరే - అతీతమైనట్టియు, అవ్యయే - కాలాతీతమైన, ఆత్మని - ఆత్మయందు, అదః - ఈ, విశ్వమ్ - జగత్తును, సద్-అసత్-మయే - కార్యకారణరూపమగు, సర్వత్ర - సకలజగ త్తునందు, ఆత్మానమ్ - ఆత్మయే అగు, పరం బ్రహ్మ చ - పరబ్రహ్మను కూడ, పశ్యేత్ - దర్శించవలెను.

ఆత్మ కార్యకారణములకు, కాలమునకు అతీతమైనది. సన్న్యాసి సకలజగత్తును ఆత్మయందు దర్శించవలెను. మరియు, కార్యకారణరూప

ములోనుండే సకలజగత్తును ఆత్మ-అభిన్నమగు పరబ్రహ్మయందు దర్శిం చవలెను. అనగా, ఆత్మయందు అధ్యస్తమని తెలియవలెను.

సుప్తప్రబోధయోస్సంధావాత్మనో గతిమాత్మదృక్ ।
పశ్యన్ బంధం చ మోక్షం చ మాయామాత్రం న వస్తుతః ॥5

సుప్తప్రబోధయోః - నిద్ర తెలివి అనే అవస్థలకు, సంధౌ - సంధి యందు, ఆత్మదృక్ - ఆత్మనిష్ఠ గల సన్న్యాసి, ఆత్మనః - ఆత్మయొక్క, గతిమ్ - తత్త్వమును, బంధం చ - బంధమును, మోక్షం చ - మోక్షమును కూడ, మాయామాత్రమ్ - కల్పనా మాత్రముగా, న వస్తుతః - వాస్తవము కానిదిగా, పశ్యన్ - దర్శించువాడు.

నిద్ర-తెలివి అనే ఈ రెండు అవస్థల సంధిలో, అనగా నిద్ర లేచే సమయములో మరియు నిద్ర పోయే సమయములో (అజ్ఞానముయొక్క ఆవరణ గాని, విక్షేపము కాని ఉండదు), ఆత్మనిష్ఠుడగు సన్న్యాసి ఆత్మ యొక్క తత్త్వమునరయవలెను. బంధమోక్షములు కేవలము కల్పన మాత్రమే; ఆత్మకు అవి వాస్తవముగా లేవు అని అతడు ఆ సంధిలో గుర్తించవచ్చును.

నాభినందేద్ధ్రువం మృత్యుమధ్రువం వాస్య జీవితమ్ ।
కాలం పరం ప్రతీక్షేత భూతానాం ప్రభవాప్యయమ్ ॥ 6

అస్య - ఈ దేహమునకు, ధ్రువమ్ - నిశ్చితమైన, మృత్యుమ్ - మృత్యువును గాని, అధ్రువమ్ - నిశ్చితము గాని, జీవితమ్ - జీవితమును గాని, న అభినందేత్ - అభినందించ రాదు, భూతానామ్ - ప్రాణులకు, ప్రభవ-అప్యయమ్ - జననమరణములకు కారణమైన, కాలమ్ - కాలము ను, పరమ్ - కేవలము, ప్రతీక్షేత - వేచి చూడవలెను.

ఈ దేహమునకు మరణము నిశ్చితము. ఈ దేహముయొక్క జీవి తకాలము అనిశ్చితము. సన్న్యాసి ఇటు జీవితమును గాని, అటు మరణ మును గాని అభినందించరాదు. ప్రాణుల జననమరణములకు కారణమగు కాలమును కేవలము ప్రతీక్షించుచుండవలెను.

**నాసచ్ఛాస్త్రేషు సజ్జేత నోపజీవేత జీవికామ్ ।**
**వాదవాదాంస్త్యజేత్తర్కాన్ పక్షం కం చ న సంశ్రయేత్ ॥ 7**

అసత్-శాస్త్రేషు - అనాత్మశాస్త్రములగు నాట్యశాస్త్రము మొదలగువాటియందు, న సజ్జేత - ఆసక్తిని కలిగియుండరాదు, జీవికామ్ - జీవికను, న ఉపజీవేత - ఆశ్రయించరాదు, వాదవాదాన్ - వాదవివాదరూపములైన, తర్కాన్ - తర్కములను, త్యజేత్ - విడిచిపెట్టవలెను, పక్షమ్ - పక్షమును, కం చ - దేనినైననూ, న సంశ్రయేత్ - బలపరచరాదు.

అనాత్మశాస్త్రములగు నాట్యశాస్త్రము మొదలగువాటియందు సన్న్యాసి ఆసక్తిని కలిగియుండరాదు. జీవిక (జాతకములు చెప్పి ధనమును సంపాదించుట, ఉద్యోగము చేయుట, వ్యాపారమును చేయుట) ను ఆధారముగా చేసుకొని జీవించరాదు. వాదప్రతివాదములను తర్కములను విడిచిపెట్టవలెను. వైష్ణవ-శైవ ఇత్యాది ఏ పక్షమునైననూ ఆశ్రయించరాదు.

న శిష్యాననుబధ్నీత గ్రన్థాన్నైవాభ్యసేద్బహూన్ ।
న వ్యాఖ్యాముపయుంజీత నారంభానారభేత్క్వచిత్ ॥ 8

శిష్యాన్ - శిష్యులను, న అనుబధ్నీత - జమ చేయరాదు, బహూన్ - అనేకములగు, గ్రన్థాన్ - గ్రంథములను, న ఏవ అభ్యసేత్ - సుతరాము అభ్యసించరాదు, వ్యాఖ్యామ్ - ప్రవచనమును, న ఉపయుంజీత - ప్రయోగించరాదు, క్వచిత్ - ఏ కాలమునందైననూ, ఆరంభాన్ - మఠము మొదలగు వ్యాపారములను, న ఆరభేత్ - ఆరంభించరాదు.

శిష్యమండలులను తయారు చేయరాదు. అనేకములగు వేదాంతశాస్త్రమునకు సహకరించని జ్యోతిశ్శాస్త్రమువంటి అనాత్మశాస్త్ర గ్రంథములను సుతరాము అభ్యసించరాదు. అట్టి గ్రంథములను ప్రవచించరాదు. ఏ కాలమునందైననూ మఠము మొదలగు పెద్ద పెద్ద కార్యములను ఆరంభించరాదు.

**న యతేరాశ్రమః ప్రాయో ధర్మహేతుర్మహాత్మనః ।**
**శాంతస్య సమచిత్తస్య బిభృయాదుత వా త్యజేత్ ॥ 9**

మహాత్మనః - సర్వాత్మభావము కలిగినట్టియు, శాంతస్య - చల్లా రిన కామనలు కలిగినట్టియు, సమచిత్తస్య - సర్వమునందు ఈశ్వరుని దర్శించే, యతేః - యతికి, ఆశ్రమః - సన్న్యాసాశ్రమము, ప్రాయః - తర చుగా, ధర్మహేతుః - ఆత్మనిష్ఠకు కారణము, న - కాదు, బిభృయాత్ - ఆశ్రమమును కొనసాగించవచ్చును, ఉత వా - లేదా, త్యజేత్ - విడిచిపెట్ట వచ్చును.

సర్వాత్మభావముతో సర్వమునందు ఈశ్వరుని దర్శిస్తూ కామన లకు అతీతుడై ఉండే యతికి తరచుగా సన్న్యాసచిహ్నములు ఆత్మనిష్ఠా రూపమగు ధర్మమునకు ఆలంబనము కాజాలవు. అనగా, అట్టి యతి బాహ్యచిహ్నములతో సంబంధము లేకుండా ఆత్మనిష్ఠుడై యుండును. అట్టి మహాత్ముడు బాహ్యచిహ్నములను కొనసాగించవచ్చును; లేదా, విడిచి పెట్టవచ్చును.

అవ్యక్తలింగో వ్యక్తార్థో మనీష్యున్మత్తబాలవత్ ।
కవిర్మూకవదాత్మానం స దృష్ట్యా దర్శయేన్నృణామ్ ॥ 10

సః - ఆ యతి, అవ్యక్తలింగః - బయటకు కనబడని చిహ్నములు గలవాడు, వ్యక్త-అర్థః - సుస్పష్టమైన (ఆత్మనిష్ఠ అనే) ప్రయోజనము గల వాడు, మనీషీ - మనోనిగ్రహము గలవాడు, కవిః - విద్వాంసుడు, నృణామ్ - జనులయొక్క, దృష్ట్యా - దృష్టితో, ఆత్మానమ్ - తనను, ఉన్మ త్తబాలవత్ - పిచ్చివాని వలె పిల్లవాని వలె, మూకవత్ - మూగవాని వలె, దర్శయేత్ - ప్రదర్శించవలెను.

యతికి తన ప్రయోజనము ఆత్మానుసంధానము అని స్పష్టమే. అయిననూ, ఆయన తన ఆత్మనిష్ఠను బట్టబయలు చేసే చిహ్నములను ధరించడు. ఆయన మనోనిగ్రహము గలవాడే అయిననూ జనుల దృష్టిలో తనను తాను పిచ్చివానిని వలె, అవివేకియగు పిల్లవానిని వలె, తాను విద్వాంసుడే అయిననూ, తనను మూగవానిని వలె ప్రదర్శించవలెను.

అత్రాప్యుదాహరంతీమమితిహాసం పురాతనమ్ ।
ప్రహ్లాదస్య చ సంవాదం మునేరాజగరస్య చ ॥ 11

అత్ర - ఈ విషయమునందు, ప్రహ్లాదస్య చ - ప్రహ్లాదునకు, అజగరస్య - కొండచిలువవలె జీవించే, మునేః చ - దత్తాత్రేయ మహర్షికి, సంవాదమ్ - సంవాదరూపమైన, ఇమమ్ - ఈ, పురాతనమ్ - ప్రాచీనమైన, ఇతిహాసం అపి - వృత్తాంతమును కూడ, ఉదాహరంతి - ఉటంకించెదరు.

ఈ సందర్భములో మహాత్ములు ఒక ప్రాచీనమైన వృత్తాంతమును ఉటంకించెదరు. ఒకప్పుడు ప్రహ్లాదునకు దత్తాత్రేయ మహర్షితో సంభాషణము జరిగినది. ఆ మహర్షి కొండచిలువ వలె తన వద్దకు వచ్చిన ఆహారమును మాత్రమే తిని (అజగర వృత్తి) జీవించును.

తం శయానం ధరోపస్థే కావేర్యాం సహ్యసానుని ।
రజస్వలైస్తనూదేశైర్నిగూఢామలతేజసమ్ ॥ 12

దదర్శ లోకాన్ విచరన్ లోకతత్త్వవివిత్సయా ।
వృతోఽమాత్యైః కతిపయైః ప్రహ్లాదో భగవత్ప్రియః ॥ 13

కావేర్యామ్ - కావేరీ నదీతీరమునందు, సహ్యసానుని - సహ్యపర్వతపు చరియయందు, ధరా-ఉపస్థే - నేలపై, శయానమ్ - పరుండి ఉన్నట్టియు, రజస్వలైః - దుమ్ము నిండిన, తనూదేశైః - దేహావయవములతో, నిగూఢ-అమలతేజసమ్ - దాగియున్న స్వచ్ఛమగు తేజస్సు గల, తమ్ - ఆ దత్తాత్రేయుని, లోకతత్త్వవివిత్సయా - ప్రాణుల స్వరూపమును తెలియాలనే కోరికతో, కతిపయైః - కొంతమంది, అమాత్యైః - మంత్రులతో గూడి, లోకాన్ - లోకములను, విచరన్ - సంచరించుచున్నవాడు, భగవత్-ప్రియః - భగవానునకు ప్రియుడు అగు, ప్రహ్లాదః - ప్రహ్లాదుడు, దదర్శ - చూచెను.

దత్తాత్రేయ మహర్షి కావేరీ నదీతీరమునందు సహ్యపర్వతము యొక్క చరియపై కటికనేలపై పరుండియుండెను. ఆయన దేహావయవములు దుమ్ముతో నిండియుండుటచే, ఆయన స్వచ్ఛమైన తేజస్సు ప్రకటమగుట లేదు. భగవానునకు ప్రియుడగు ప్రహ్లాదుడు ఒకప్పుడు కొందరు

మంత్రులతో గూడి ప్రాణుల తత్త్వమునరయుటకై లోకములను సంచరిస్తూ, ఆ మహర్షిని చూచెను.

కర్మణాఽఽకృతిభిర్వాచా లింగైర్వర్ణాశ్రమాదిభిః ।
న విదంతి జనా యం వై సోఽసావితి న వేతి చ ॥ 14

కర్మణా - కర్మచే, ఆకృతిభిః - ముఖకవళికలచే, వాచా - మాటచే, వర్ణ-ఆశ్రమ-ఆదిభిః - వర్ణము ఆశ్రమము మొదలగువాటికి చెందిన, లింగైః - చిహ్నములచే, యమ్ - ఎవనిని, జనాః - జనులు, సః - ఆతడు, అసౌ - ఈతడు, ఇతి - అని గాని, న వా ఇతి చ - కాదు అని గాని, న విదంతి - తెలియరో.

ఆయన చేసే పనులను బట్టి, ముఖకవళికలను బట్టి, మాటను బట్టి, వర్ణము ఆశ్రమము మొదలగువాటికి చెందిన గురుతులను బట్టి, ఆయన ఒక సిద్ధపురుషుడా, కాడా అనే విషయము జనులకు తెలియదు.

తం నత్వాభ్యర్చ్య విధివత్పాదయోశ్శిరసా స్పృశన్ ।
వివిత్సురిదమప్రాక్షీన్మహాభాగవతోఽసురః ॥ 15

తమ్ - ఆయనను, నత్వా - నమస్కరించి, విధివత్ - యథావిధిగా, అభ్యర్చ్య - పూజించి, పాదయోః - పాదములయందు, శిరసా - శిరస్సుతో, స్పృశన్ - స్పృశించువాడై, వివిత్సుః - తెలియగోరువాడై, మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడు, అసురః - అసురుడు అగు ప్రహ్లాదుడు, ఇదమ్ - దీనిని, అప్రాక్షీత్ - ప్రశ్నించెను.

గొప్ప భగవద్భక్తుడు, రాక్షసరాజు అగు ప్రహ్లాదుడు తత్త్వమును తెలియగోరి, ఆయనకు నమస్కరించి యథావిధిగా పూజించి తల ఆయన పాదములను సోకునట్లుగా సాష్టాంగప్రణామమును చేసి ఇట్లు ప్రశ్నించెను.

బిభర్షి కాయం పీవానం సోద్యమో భోగవాన్ యథా ।
విత్తం చైవోద్యమవతాం భోగో విత్తవతామిహ ।
భోగినాం ఖలు దేహోఽయం పీవా భవతి నాన్యథా ॥ 16

స-ఉద్యమః - ధనమును సంపాదించే ప్రయత్నమును చేయువాడు, భోగవాన్ యథా - భోగములు కలవాడు వలె, పీవానమ్ - బలమైన, కాయమ్ - శరీరమును, బిభర్షి - ధరించుచున్నావు, ఇహ - ఈ లోకము నందు, ఉద్యమవతాం ఏవ - ఉద్యమమును చేయువారలకు మాత్రమే, విత్తమ్ - ధనము, విత్తవతామ్ - ధనము గలవారలకు, భోగః చ - భోగము, అయమ్ - ఈ, దేహః - దేహము, భోగినామ్ - భోగము గలవారలకు, పీవా - బలము గలది, భవతి ఖలు - అగును గదా!, అన్యథా - మరియొక విధముగా, న - కాదు.

ధనమును సంపాదించే ప్రయత్నము చేసి భోగములు అనుభవించే వ్యక్తి వలె తమరు బలమైన దేహమును కలిగియున్నారు. ఈ లోకములో ఉద్యమము చేయువారికి మాత్రమే ధనము, ధనము గలవారికి మాత్రమే భోగము ఉండుట, భోగము గలవారికి మాత్రమే ఈ దేహము బలముగానుండుట అనుభవసిద్ధమే. దీనికి విరుద్ధమగు అనుభవము లేదు.

**న తే శయానస్య నిరుద్యమస్య బ్రహ్మన్ను హార్థో యత ఏవ భోగః,**
**అభోగినోఽయం తవ విప్ర దేహః పీవా యతస్తద్వద నః క్షమం చేత్.**

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, శయానస్య - పరుండి ఉన్నట్టియు, నిరుద్యమస్య - ఉద్యమము లేని, తే - నీకు, అర్థః - ధనము, న హ - ఉండియుండదు, యతః ఏవ - దేనివలన మాత్రమే, భోగః - భోగము కలుగునో, విప్ర - ఓ వేదవేత్తా!, అభోగినః - భోగము లేని, తవ - నీ, అయమ్ - ఈ, దేహః - దేహము, యతః - ఎందువలన, పీవా - బలముగా నున్నదో, తత్ - ఆ విషయమును, క్షమం చేత్ - వినదగినది అయినచో, నః - మాకు, వద - చెప్పుము.

ఓ మహర్షీ! ఉద్యమము లేకుండా పరుండియున్న నీ వద్ద ధనము ఉండియుండదు. ధనము లేనిదే భోగము ఉండదు గదా! ఓ వేదవేత్తా! భోగము లేని నీ ఈ దేహము బలముగా నుండుటకు గల హేతువును, మేము వినదగ్గది అయినచో, చెప్పుడు.

కవిః కల్పో నిపుణదృక్ చిత్రప్రియకథస్సమః ।
లోకస్య కుర్వతః కర్మ శేషే తద్వీక్షితాఽపి వా ॥ 18

కవిః - విద్వాంసుడవు, కల్పః - సమర్థుడవు, నిపుణదృక్ - చాతుర్యము గలవాడవు, చిత్రప్రియకథః - విచిత్రములైన లోకప్రియములైన పలుకులు గలవాడవు, సమః - సముడవు, లోకస్య - లోకము, కర్మ - కర్మను, కుర్వతః - చేయుచుండగా, శేషే - పరుండియున్నావు, వా - లేదా, తద్-వీక్షితా అపి - ఆ లోకమును చూచువాడవు కూడ.

తమరు విద్వాంసులు, సమర్థులు, చతురులు. తమరి పలుకులు విచిత్రములు, లోకప్రియములు. లోకము కర్మలలో మునిగియుండగా, తమరు ఉదాసీనులై చూచుచున్నారు, లేదా పరుండి యున్నారు. దీనికి కారణమేమి?

నారద ఉవాచ ।
స ఇత్థం దైత్యపతినా పరిపృష్టో మహామునిః ।
స్మయమానస్తమభ్యాహ తద్వాగమృతయంత్రితః ॥ 19

దైత్యపతినా - రాక్షసరాజగు ప్రహ్లాదునిచే, ఇత్థమ్ - ఈ విధముగా, పరిపృష్టః - వినయపూర్వకముగా ప్రశ్నించబడిన, సః - ఆ, మహామునిః - మహర్షి, స్మయమానః - చిరునవ్వు నవ్వుచున్నవాడై, తద్-వాగ్-అమృతయంత్రితః - ఆయన అమృతమువంటి వాక్కుచే వశుడై, తమ్ - ఆయనను ఉద్దేశించి, అభి-ఆహ - బదులు పలికెను.

నారద మహర్షి ఇట్లు పలికెను --- రాక్షసరాజగు ప్రహ్లాదుడు ఈ విధముగా వినయపూర్వకముగా ప్రశ్నించగా, ఆ మహర్షి అమృతమువంటి ప్రహ్లాదుని పలుకులకు వశుడై చిరునవ్వుతో ఆయనకు ఇట్లు బదులు చెప్పెను.

బ్రాహ్మణ ఉవాచ ।
వేదేదమసురశ్రేష్ఠ భవాన్నన్వార్యసంమతః ।
ఈహోపరమయోర్నౄణాం పదాన్యధ్యాత్మచక్షుషా ॥ 20

అసురశ్రేష్ఠ - ఓ రాక్షసోత్తమా!, ఆర్యసంమతః - సత్పురుషులచే సమ్మానించబడే, భవాన్ - నీవు, అధ్యాత్మచక్షుషా - అంతర్దృష్టితో, ఇదమ్ - ఈ విషయమును, నృణామ్ - మానవులయొక్క, ఈహా-ఉపరమయోః - కర్మలను చేయుటకు మానివేయుటకు, పదాని - స్థానములను (ఫలములను), నను - నిశ్చయముగా, వేద - తెలియుదువు.

దత్తాత్రేయ మహర్షి ఇట్లు పలికెను --- ఓ రాక్షసోత్తమా! సత్పురుషులు నిన్ను సమ్మానించెదరు. మానవులు కర్మలను చేయుటకు, మానివేయుటకు ఉండే ఫలములు, ఈ విషయములన్నీ అంతర్దృష్టి గల నీకు తెలిసినవే.

యస్య నారాయణో దేవో భగవాన్ హృద్గతస్సదా ।
భక్త్యా కేవలయాఽజ్ఞానం ధునోతి ధ్వాంతమర్కవత్ ॥ 21

యస్య - ఎవనికి, కేవలయా - నిష్కామమైన, భక్త్యా - భక్తిచే, సదా - అన్ని కాలములలో, హృద్-గతః - హృదయమునందుండే, భగవాన్ - భగవానుడు, నారాయణః దేవః - నారాయణ దేవుడు, ధ్వాంతమ్ - చీకటిని, అర్కవత్ - సూర్యుడు వలె, అజ్ఞానమ్ - అజ్ఞానమును, ధునోతి - పారద్రోలునో.

నిష్కామ భక్తి కారణముగా భగవానుడగు నారాయణ దేవుడు అన్ని కాలములలో నీ హృదయమునందున్నవాడై, సూర్యుడు చీకటిని వలె, అజ్ఞానమును పారద్రోలును.

అథాపి బ్రూమహే ప్రశ్నాంస్తవ రాజన్ యథాశ్రుతమ్ ।
సంభావనీయో హి భవానాత్మనశ్శుద్ధిమిచ్ఛతామ్ ॥ 22

రాజన్ - ఓ రాజా!, అథాపి - అయినప్పటికీ, తవ - నీ, ప్రశ్నాన్ - ప్రశ్నలను, యథాశ్రుతమ్ - నేను విన్నదానికి అనురూపముగా, బ్రూమహే - చెప్పెదము, హి - ఏలయనగా, ఆత్మనః - అంతఃకరణమునకు, శుద్ధిమ్ - పరిశుద్ధిని, ఇచ్ఛతామ్ - కోరువారలకు, భవాన్ - నీవు, సంభావనీయః - సమ్మానించ దగినవాడవు.

ఓ రాజా! అయినప్పటికీ, నీ ప్రశ్నలకు మాకు తెలిసినంతలో సమాధానమును చెప్పెదము. ఎందుకంటే, అంతఃకరణశుద్ధిని గోరువార లకు నీవు సమ్మానించ దగినవాడవు.

తృష్ణయా భవవాహిన్యా యోగ్యైః కామైరపూరయా ।
కర్మాణి కార్యమాణోఽహం నానాయోనిషు యోజితః ।। 23

యోగ్యైః - యోగ్యములగు, కామైః - కామనలచే, అపూరయా - పూరించబడనట్టియు, భవవాహిన్యా - జన్మమరణపరంపరను కలిగించే, తృష్ణయా - దురాశచే, కర్మాణి - కర్మలను, కార్యమాణః - చేయించబడు చున్న, అహమ్ - నేను, నానాయోనిషు - అనేకజన్మలయందు, యోజితః - నియోగించ బడితిని.

తృష్ణను యోగ్యములగు కామనలచే పూరించుట సంభవము కాదు. అది జీవునకు జన్మమరణముల పరంపరను కలిగించును. దానిచే నేను కర్మలను చేయించబడుతూ అనేకజన్మలనెత్తునట్లు చేయబడితిని.

యదృచ్ఛయా లోకమిమం ప్రాపితః కర్మభిర్భ్రమన్ ।
స్వర్గాపవర్గయోర్ద్వారం తిరశ్చాం పునరస్య చ ।। 24

కర్మభిః - కర్మలచే, భ్రమన్ - తిరుగాడుచున్నవాడనై, స్వర్గ-అపవ ర్గయోః - స్వర్గమోక్షములకు, తిరశ్చామ్ - పశుపక్ష్యాది జన్మలకు, పునః - మరల, అస్య చ - ఈ మనుష్యజన్మకు కూడ, ద్వారమ్ - ద్వారమైన, ఇమమ్ - ఈ, లోకమ్ - మనుష్యజన్మను, యదృచ్ఛయా - అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే), ప్రాపితః - పొందించబడితిని.

మనుష్యజన్మ స్వర్గమునకు (పుణ్యముచే). మోక్షమునకు (ఆత్మ జ్ఞానముచే), పశుపక్ష్యాదిజన్మలకు (పాపముచే) మరియు మరల ఈ మాన వజన్మకు (పుణ్యపాపముల మిశ్రమముచే) కూడ ద్వారము. కర్మలచే తిరు గాడుచున్న నేను అనుకోకుండా ఈశ్వరేచ్ఛచే ఈ మనుష్యజన్మను పొందించబడితిని.

**అత్రాపి దంపతీనాం చ సుఖాయాన్యాపనుత్తయే ।**
**కర్మాణి కుర్వతాం దృష్ట్వా నివృత్తోఽస్మి విపర్యయమ్ ॥ 25**

**అత్ర అపి** - ఈ జన్మయందు కూడ, **సుఖాయ** - సుఖము కొరకు, **అన్య-అపనుత్తయే చ** - ఇతరము అగు దుఃఖమును తొలగించుట కొరకు కూడ, **కర్మాణి** - కర్మలను, **కుర్వతామ్** - చేయుచున్న, **దంపతీనామ్** - దంపతులకు, **విపర్యయమ్** - తల్లక్రిందులగుటను, **దృష్ట్వా** - చూచి, **నివృత్తః** - కర్మలనుండి వెనుకకు మరలినవాడను, **అస్మి** - అగుచున్నాను.

ఈ మనుష్యజన్మలో కూడ దంపతులు దుఃఖమును దూరము చేసి సుఖమును పొందుటకై కర్మలను చేసి, వారి ప్రయత్నమునకు విరుద్ధముగా సుఖము దూరమై దుఃఖమునే పొందుచుండుటను గాంచి, నేను కర్మలనుండి నివృత్తుడనైతిని.

**సుఖమస్యాత్మనో రూపం సర్వేహోపరతిస్తనూః ।**
**మనస్సంస్పర్శజాన్ దృష్ట్వా భోగాన్ స్వప్స్యామి సంవిశన్ ॥26**

**అస్య** - వీనియొక్క, **ఆత్మనః** - స్వరూపముయొక్క, **రూపమ్** - రూపము, **సుఖమ్** - సుఖమే, **సర్వ-ఈహా-ఉపరతిః** - సకలములైన చేష్టల నివృత్తియే, **తనూః** - శరీరము, **భోగాన్** - భోగములను, **మనః-సంస్పర్శజాన్** - మనస్సునకు విషయములతోడి సంస్పర్శ వలన పుట్టెవిగా, **దృష్ట్వా** - గమనించి, **సంవిశన్** - ప్రారబ్ధముననుభవించువాడనై, **స్వప్స్యామి** - పరుండెదను.

ఈ జీవుని స్వరూపము సుఖనిధానము. సకలములైన చేష్టలు నివృత్తమైనప్పుడు ఆ ఆత్మస్వరూపమగు సుఖము ప్రకటమగును. మనస్సునకు ఇంద్రియముల ద్వారా విషయములతో సంపర్కము కలిగినప్పుడు మాత్రమే భోగము కలుగును. ఈ విషయమును గమనించిన నేను ప్రారబ్ధమువనుభవిస్తూ, సుఖము కొరకై చేసే ప్రయత్నమునుండి విరమించుకొని సుఖముగా నుండెదను.

ఇత్యేతదాత్మనస్స్వార్థం సంతతం విస్మృత్య వై పుమాన్ ।
విచిత్రామసతి ద్వైతే ఘోరామాప్నోతి సంసృతిమ్ ॥ 27

ఇతి - ఈ విధముగా, ఆత్మనః - తనకు, స్వ-అర్థమ్ - పురుషార్థమైనట్టియు, సంతమ్ - తనలోనే ఉన్న, ఏతత్ - ఈ సుఖమును, వై - నిశ్చయముగా, విస్మృత్య - విస్మరించి, పుమాన్ - మానవుడు, అసతి - మిథ్యయగు, ద్వైతే - నానాత్వమునందు, విచిత్రామ్ - పలువిధముల జన్మలు కలిగినట్టియు, ఘోరామ్ - భయంకరమైన, సంసృతిమ్ - సంసారమును, ఆప్నోతి - పొందుచున్నాడు.

ఈ విధముగా మానవుడు తనకు పురుషార్థమై తనలోనే ఆత్మరూపముగా ఉన్న సుఖమును నిశ్చయముగా విస్మరించి, మిథ్యయైన నానాత్వమునందు పలువిధముల జన్మలను పొందుచున్నవాడై, భయంకరమగు సంసారములో పడిపోవుచున్నాడు.

జలం తదుద్భవైశ్ఛన్నం హిత్వాఽజ్ఞో జలకామ్యయా ।
మృగతృష్ణాముపాధావేద్యథాఽన్యత్రార్థదృక్స్వతః ॥ 28

యథా - ఏ విధముగానైతే, అజ్ఞః - అజ్ఞాని, జలమ్ - నీటిని, తద్-ఉద్భవైః - దానియందు పుట్టిన గడ్డి మొదలగువాటిచే, ఛన్నమ్ - కప్పివేయబడిన దానిని, హిత్వా - విడిచిపెట్టి, జలకామ్యయా - నీటియందలి కోరికచే, మృగతృష్ణామ్ - ఎండమావిని, ఉపాధావేత్ - పరుగు తీయునో అదే విధముగా, స్వతః - తన స్వరూపముకంటె, అన్యత్ర - ఇతరమునందు, అర్థదృక్ - పురుషార్థమును దర్శించువాడు.

అజ్ఞాని నీటియందు పుట్టిన గడ్డి మొదలగువాటిచే కప్పివేయబడిన నీటిని విడిచిపెట్టి నీటియందలి కోరికతో ఎండమావి వెంట పరుగులు తీయును. అదే విధముగా అజ్ఞాని తన ఆత్మకంటె ఇతరము (అనాత్మ) యందు పురుషార్థము (ఆనందము) ఉన్నదని తలపోయును. (ఇంద్రియభోగముల వెంట పరుగులెత్తును).

దేహాదిభిర్దైవతంత్రైరాత్మనస్సుఖమీహతః ।
దుఃఖాత్యయం చానీశస్య క్రియా మోఘాః కృతాః కృతాః॥29

దైవతంత్రైః - ప్రారబ్ధమునకు వశమై యుండే, దేహ-ఆదిభిః - దేహము ఇంద్రియములు మొదలగువాటిచే, ఆత్మనః - తనకు, సుఖమ్ - సుఖమును, దుఃఖ-అత్యయం చ - దుఃఖనివృత్తిని కూడ, ఈహతః - కోరుచున్నట్టియు, అనీశస్య - అస్వతంత్రుడగు మానవునియొక్క, కృతాః కృతాః - మరల మరల చేయబడిన, క్రియాః - క్రియలు, మోఘాః - వ్యర్థములు.

దేహము, ఇంద్రియములు మొదలైనవి ప్రారబ్ధమునకు వశమై యుండును. వాటి ద్వారా తనకు సుఖమును, దుఃఖనివృత్తిని సాధింపబూనే అస్వతంత్రుడైన వ్యక్తి మరల మరల చేసే కర్మలన్నియు వ్యర్థములే యగుచుండును.

ఆధ్యాత్మికాదిభిర్దుఃఖైరవిముక్తస్య కర్హిచిత్ ।
మర్త్యస్య కృచ్ఛ్రోపనతైరర్థైః కామైః క్రియేత కిమ్ ॥ 30

కర్హిచిత్ - ఏ కాలమునందైననూ, ఆధ్యాత్మిక-ఆదిభిః - ఆధ్యాత్మికము అధిదైవికము మొదలైన, దుఃఖైః - దుఃఖములనుండి, అవిముక్తస్య - విముక్తుడు కాని, మర్త్యస్య - మరణశీలుడగు మానవునకు, కృచ్ఛ్ర-ఉపనతైః - కష్టము మీద సంపాదించబడిన, అర్థైః - సంపదలచే, కామైః - భోగములచే, కిమ్ - ఏమి, క్రియేత - చేయబడును?

మరణము సర్వదా వెన్నాడి ఉండే మానవునకు ఏ కాలమునందైననూ శారీరకములైన మరియు ప్రకృతినుండే పుట్టే దుఃఖములనుండి విముక్తి లేదు. అట్టి వాడు కష్టపడి సంపదలను, భోగములను సంపాదించిననూ, వాటివలన ఒరిగేది ఏమున్నది?

పశ్యామి ధనినాం క్లేశం లుబ్ధానామజితాత్మనామ్ ।
భయాదలబ్ధనిద్రాణాం సర్వతోఽభివిశంకినామ్ ॥ 31

లుబ్ధానామ్ - లోభులైనట్టియు, అజిత-ఆత్మనామ్ - జయించబడని మనస్సు కలిగినట్టియు, భయాత్ - భయము వలన, అలబ్ధనిద్రాణామ్ - పొందబడని నిద్ర కలిగినట్టియు, సర్వతః - అందరి వలన, అభివిశంకినామ్ - అధికమగు శంక కలిగిన, ధనినామ్ - ధనవంతుల, క్లేశమ్ - కష్టమును, పశ్యామి - చూచుచున్నాను.

లోభులై మనోనిగ్రహము లేక, భయము వలన నిద్ర పట్టక, అందరినీ అధికముగా శంకిస్తూ ఉండే ధనవంతుల పాట్లను నేను చూస్తూనే ఉన్నాను.

రాజతశ్చోరతశ్శత్రోస్స్వజనాత్పశుపక్షితః ।
అర్థిభ్యః కాలతస్స్వస్మాన్నిత్యం ప్రాణార్థవద్భయమ్ ॥ 32

రాజతః - రాజు వలన, చోరతః - చోరుల వలన, శత్రోః - శత్రువు వలన, స్వజనాత్ - తన వారి వలన, పశుపక్షితః - పశు పక్షుల వలన, అర్థిభ్యః - యాచకుల వలన, కాలతః - కాలము వలన, స్వస్మాత్ - తన వలన, నిత్యమ్ - అన్ని కాలములలో, ప్రాణార్థవద్-భయమ్ - ప్రాణములు ధనములు గలవారికి భయము.

ప్రాణమునందు, ధనమునందు లోభము గల జనులకు రాజు, చోరులు, శత్రువులు, తన వారు, పశు పక్షులు, యాచకులు మరియు కాలముల వలన మాత్రమే గాక, తమ వలన కూడ తమకు సర్వకాలముల యందు భయము తప్పదు. తామే తమ ధనమును పాడు చేసెదమేమో యను భయము కూడ వారికి ఉండును.

శోకమోహభయక్రోధరాగక్లైబ్యశ్రమాదయః ।
యన్మూలాస్స్యుర్నృణాం జహ్యాత్స్పృహాం ప్రాణార్థయోర్బుధః॥

బుధః - వివేకి, ప్రాణ-అర్థయోః - ప్రాణమునందు సంపదయందు, స్పృహామ్ - తృష్ణను, జహ్యాత్ - విడిచి పెట్టవలెను, నృణామ్ - మానవులకు, యత్-మూలాః - ఎయ్యది మూలముగా గలవియై, శోకమో

హభయక్రోధరాగక్లైబ్యశ్రమ-ఆదయః - శోకము వ్యామోహము భయము కోపము ఆసక్తి చేతగానిదనము అలసట మొదలగునవి, స్యుః - కలుగునో.

వివేకి ప్రాణము (దీర్ఘ జీవితము, శరీరబలము) నందు, సంపదల యందు తృష్ణను విడిచి పెట్టవలెను. ఎందుకంటే, మానవులకు ఆ తృష్ణ మూలకముగానే శోకము, వ్యామోహము (అనిత్యమును నిత్యమని భ్రమప డుట), భయము, కోపము, ఆసక్తి, చేతగానిదనము, అలసట మొదలగునవి కలుగుచుండును.

మధుకారమహాసర్పౌ లోకేఽస్మిన్నో గురూత్తమౌ ।
వైరాగ్యం పరితోషం చ ప్రాప్తా యచ్ఛిక్షయా వయమ్ ।। 34

అస్మిన్ - ఈ, లోకే - లోకమునందు, నః - మాకు, మధుకారమ హాసర్పౌ - తేనెటీగ కొండచిలువ, గురు-ఉత్తమౌ - ఉత్తమమగు గురువు లు, యత్-శిక్షయా - ఎవరివద్ద నేర్చుకొనుటచే, వయమ్ - మేము, వైరా గ్యమ్ - వైరాగ్యమును, పరితోషం చ - సంతోషమును, ప్రాప్తాః - పొందితి మో.

మాకీ లోకములో ఇద్దరు ఉత్తములైన గురువులు గలరు. అవి తేనె టీగ, కొండచిలువ. మేము తేనెటీగనుండి వైరాగ్యమును, కొండచిలువ నుండి సంతోషమును నేర్చుకొంటిమి.

విరాగస్సర్వకామేభ్యశ్శిక్షితో మే మధువ్రతాత్ ।
కృచ్ఛ్రాప్తం మధువద్విత్తం హత్వాప్యన్యో హరేత్పతిమ్।।35

సర్వకామేభ్యః - సకలకామనలనుండి, విరాగః - వైరాగ్యము, మే - నాచే, మధువ్రతాత్ - తేనెటీగనుండి, శిక్షితః - నేర్చుకొనబడినది, మధు వత్ - తేనెవలె, కృచ్ఛ్ర-ఆప్తమ్ - కష్టముతో పొందబడిన, విత్తమ్ - ధన మును, పతిమ్ - ప్రభువును, హత్వా అపి - చంపి యైననూ, అన్యః - మరియొకడు, హరేత్ - అపహరించును.

సకలకామనలనుండి వైరాగ్యమును నేను తేనెటీగనుండి నేర్చుకుంటిని. తేనెనువలె కష్టపడి ప్రోగుచేసిన ధనమును దాని యజమానిని చంపియైననూ మరియొకడు అపహరించును.

అనీహః పరితుష్టాత్మా యదృచ్ఛోపనతాదహమ్ ।
నో చేచ్ఛయే బహ్వహాని మహాహిరివ సత్త్వవాన్ ॥ 36

అనీహః - కామనలు లేని, అహమ్ - నేను, యదృచ్ఛా-ఉపనతాత్ - అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) సంప్రాప్తమైనదానితో, పరితుష్ట-ఆత్మా - సంతుష్టమైన బుద్ధి గలవాడను, నో చేత్ - లభించనిచో, సత్త్వవాన్ - ధైర్యము గలవాడనై, బహు-అహాని - చాల రోజులు, మహా-అహిః ఇవ - కొండ చిలువ వలె, శయే - పడి యుండెదను.

నాకు కామనలు లేవు. అనుకోకుండా ఈశ్వరేచ్ఛచే లభించిన దానితో నా మనస్సు సంతోషమును పొందును. ఏదీ లభించనిచో ధైర్యముతో కొండ చిలువ వలె చాల రోజులు పడి యుండెదను.

క్వచిదల్పం క్వచిద్భూరి భుంజేఽన్నం స్వాద్వస్వాదు వా ।
క్వచిద్భూరిగుణోపేతం గుణహీనముత క్వచిత్ ॥ 37

క్వచిత్ - ఒకప్పుడు, అల్పమ్ - తక్కువను, క్వచిత్ - మరియొకప్పుడు, భూరి - అధికమును, స్వాదు - రుచి గలదానిని, అస్వాదు వా - రుచి లేనిదానిని గాని, క్వచిత్ - ఒకప్పుడు, భూరిగుణ-ఉపేతమ్ - గొప్ప లక్షణములతో కూడినదానిని, క్వచిత్ - మరియొకప్పుడు, గుణహీనమ్ - రసములు లేనిదానిని, అన్నమ్ - ఆహారమును, భుంజే - భుజించెదను.

ఒకప్పుడు తక్కువ, మరియొకప్పుడు ఎక్కువ; ఒకప్పుడు రుచియైన ఆహారము, మరియొకప్పుడు రుచి లేనిది; ఒకప్పుడు ఆరు రసములతో కూడినది, మరియొకప్పుడు ఏ రసమైననూ లేనిది; నేను ఏది లభిస్తే దానిని తినెదను.

శ్రద్ధయోపహృతం క్వాపి కదాచిన్మానవర్జితమ్ ।
భుంజే భుక్త్వాథ కస్మింశ్చిద్దివానక్తం యదృచ్ఛయా ॥ 38

క్వ అపి - ఒకప్పుడు, శ్రద్ధయా - శ్రద్ధతో, ఉపహృతమ్ - సమర్పించబడినదానిని, కదాచిత్ - మరియొకప్పుడు, మానవర్జితమ్ - మర్యాద లేనిదానిని, భుంజే - భుజించెదను, కస్మింశ్చిత్ - ఒక సమయమునందు, దివానక్తమ్ - పగలు రాత్రి, యదృచ్ఛయా - అనుకోకుండా, భుక్త్వా - భుజించి, అథ - తరువాత.

ఒకప్పుడు ఒకడు శ్రద్ధతో సమర్పించిన ఆహారమును, మరియొకప్పుడు ఒకడు అమర్యాదగా ఇచ్చిన ఆహారమును కూడ తినెదను. పగలు గాని, రాత్రి గాని ఏ సమయమునందైననూ అనుకోకుండా ఈశ్వరేచ్ఛచే లభించిన ఆహారమును తినెదను. ఒకప్పుడు ఒకసారి తిని, మరల కూడ తినెదను.

క్షౌమం దుకూలమజినం చీరం వల్కలమేవ వా ।
వసేఽన్యదపి సంప్రాప్తం దిష్టభుక్తుష్టధీరహమ్ ॥ 39

క్షౌమమ్ - పట్టు వస్త్రమును గాని, దుకూలమ్ - నాజూకు వస్త్రమును గాని, అజినమ్ - చర్మమును గాని, చీరమ్ - నారవస్త్రమును, వల్కలం ఏవ వా - చెట్టు పట్టనే గాని, అన్యత్ అపి - మరియొకదానినైననూ, సంప్రాప్తమ్ - లభించినదానిని, వసే - ధరించెదను, దిష్టభుక్ - దైవవశముగా లభించినదానిని అనుభవించే, అహమ్ - నేను, తుష్టధీః - సంతుష్టమైన మనస్సు గలవాడను.

పట్టు వస్త్రము గాని, నాజూకు వస్త్రము గాని, చర్మము గాని, నార వస్త్రము గాని, చెట్టు పట్టయే గాని, ఏది దొరికితే దానిని నేను ధరించెదను. ప్రారబ్ధవశముగా లభించినదానిని అనుభవిస్తూ నేను సంతుష్టమైన మనస్సును కలిగియుందును.

క్వచిచ్ఛయే ధరోపస్థే తృణపర్ణాశ్మభస్మసు ।
క్వచిత్ప్రాసాదపర్యంకే కశిపౌ వా పరేచ్ఛయా ॥ 40

క్వచిత్ - ఒకప్పుడు, ధరా-ఉపస్థే - కఠిక నేలపై, తృణపర్ణ-అశ్మభస్మసు - గడ్డి ఆకులు రాయి బూడిదలయందు, క్వచిత్ - ఒకప్పుడు,

ప్రాసాదపర్యంకే - ప్రాసాదములోని పర్యంకమునందు, పర-ఇచ్ఛయా - ఇతరుల ఇచ్ఛచే, కశిపౌ వా - పరుపుపై గాని, శయే - పరుండెదను.

ఒకప్పుడు కటికనేలపై, గడ్డిమీద, ఆకుల మీద, బూడిదలో, మరి యొకప్పుడు ఇతరుల ఇచ్ఛ ప్రకారముగా ప్రాసాదములోని పర్యంకమునం దు, లేదా పరుపుపై పరుండెదను.

క్వచిత్ స్నాతోऽనులిప్తాంగస్సువాసాస్స్రగ్వ్యలంకృతః ।
రథేభాశ్వైశ్చరే క్వాపి దిగ్వాసా గ్రహవద్విభో ।। 41

విభో - ఓ రాజా!, క్వచిత్ - ఒకప్పుడు, స్నాతః - స్నానము చేసి నవాడను, అనులిప్త-అంగః - చందనమలదిన అవయవములు గలవాడను, సువాసాః - చక్కని వస్త్రములు గలవాడను, స్రగ్వీ - మాలలను దాల్చిన వాడను, అలంకృతః - అలంకరించబడినవాడను, రథ-ఇభ-అశ్వైః - రథము ఏనుగు గుఱ్ఱములచే, చరే - సంచరించెదను, క్వ అపి - మరి యొక సమయమునందు, గ్రహవత్ - పిశాచము వలె, దిగ్-వాసాః - దిగం బరుడను.

ఓ రాజా! ఒకప్పుడు నేను స్నానమాడి దేహమంతటా చందనము నలముకొని చక్కని వస్త్రములను మాలలను దాల్చి రథముపై గాని, ఏను గుపై గాని, గుఱ్ఱముపై గాని సంచరించెదను. మరియొకప్పుడు పిశాచము వలె దిగంబరుడనై యుండెదను.

నాహం నిందే న చ స్తౌమి స్వభావవిషమం జనమ్ ।
ఏతేషాం శ్రేయ ఆశాసే ఉతైకాత్మ్యం మహాత్మని ।। 42

స్వభావవిషమమ్ - స్వభావముచేతనే భిన్నభిన్నముగానుండే, జనమ్ - జనుని, అహమ్ - నేను, న నిందే - నిందించను, న చ స్తౌమి - స్తుతించను కూడ, ఉత - కానైతే, ఏతేషామ్ - ఈ జనులయొక్క, శ్రేయః - కల్యాణమును, మహాత్మని - సర్వాత్మయగు పరబ్రహ్మయందు, ఐకా త్మ్యమ్ - ఏకత్వము (మోక్షము) ను, ఆశాసే - ప్రార్థించెదను.

జనులు స్వభావముచేతనే భిన్నభిన్నముగా నుండెదరు. కావున, నన్ను నిందించువానిని నేను నిందించను; నన్ను సమ్మానించువానిని నేను స్తుతించను. కానైతే నేను వీరికై కల్యాణము, సర్వాత్మయగు పరబ్రహ్మ యందు ఏకమగుట అనే మోక్షము కలగాలని ప్రార్థించెదను.

వికల్పం జుహుయాచ్చిత్తౌ తాం మనస్యర్థవిభ్రమే ।
మనో వైకారికే హుత్వా తన్మాయాయాం జుహోత్యను ।।43

వికల్పమ్ - భేదమును, చిత్తౌ - మనోవృత్తియందు, తామ్ - దానిని, అర్థవిభ్రమే - పదార్థములయెడల భ్రమను కలిగించే, మనసి - మనస్సునందు, జుహుయాత్ - హోమము చేయవలెను, మనః - మనస్సును, వైకారికే - అహంకారమునందు, హుత్వా - హోమము చేసి, అను - తరువాత, **తత్** - దానిని, మాయాయామ్ - మాయాశక్తియందు, జుహోతి - హోమము చేయును.

సాధకుడు నానాత్వమును మనోవృత్తియందు, మనోవృత్తిని పదార్థముల నానాత్వముయొక్క విభ్రమమును కలిగించే మనస్సునందు, ఆ మనస్సును అహంకారమునందు, దానిని మాయాశక్తియందు భావనారూపముగా విలీనము చేయవలెను.

**ఆత్మానుభూతౌ తాం మాయాం జుహుయాత్సత్యదృఙ్మునిః।**
**తతో నిరీహో విరమేత్స్వానుభూత్యాఽఽత్మని స్థితః ।। 44**

మునిః - మననశీలుడు, సత్యదృక్ - సత్యమగు పరబ్రహ్మను **అనుసంధానము చేసే సాధకుడు, తామ్ - ఆ, మాయామ్ - మాయను, ఆత్మానుభూతౌ - ఆత్మానుభూతియందు, జుహుయాత్ - హోమము చేయవలెను, తతః - తరువాత, స్వ-అనుభూత్యా - ఆత్మసాక్షాత్కారముచే, ఆత్మని - ఆత్మయందు,** స్థితః - నిష్ఠ గలవాడై, నిరీహః - కర్తృత్వపూర్వకమగు కర్మలు లేనివాడై, విరమేత్ - విరమించవలెను.

సాధకుడు మననశీలుడై సత్యమగు పరబ్రహ్మను అనుసంధానము చేయవలెను. అతడు ఆ మాయాశక్తిని భావనచే ఆత్మానుభూతియందు

విలీనము చేయవలెను. తరువాత ఆత్మస్వరూపదర్శనముచే ఆత్మనిష్ఠ గల వాడై కర్తృత్వపూర్వకమగు కర్మలు లేనివాడై, ప్రవృత్తిమార్గమునుండి ఉపర తిని చేయవలెను.

స్వాత్మవృత్తం మయేత్థం తే సుగుప్తమపి వర్ణితమ్ ।
వ్యపేతం లోకశాస్త్రాభ్యాం భవాన్ హి భగవత్పరః ।। 45

మయా - నాచే, ఇత్థమ్ - ఈ విధముగా, తే - నీ కొరకు, లోకశా స్త్రాభ్యామ్ - లోకముకంటె శాస్త్రముకంటె, వి-అపేతమ్ - అతీతమైన, స్వ-ఆత్మవృత్తమ్ - నా ఆత్మకథ, సుగుప్తం అపి - మిక్కిలి రహస్యమే అయిననూ, వర్ణితమ్ - వర్ణించబడినది, హి - ఏలయనగా, భవాన్ - నీవు, భగవత్-పరః - భగవానుని శరణు పొందినవాడవు.

నీవు భగవానుని శరణు పొందినవాడవు. కావుననే, నేను నీకు నా ఈ ఆత్మకథను, మిక్కిలి రహస్యమే అయిననూ, వర్ణించితిని. నా వృత్తాం తము లోకముయొక్క మరియు శాస్త్రముయొక్క మర్యాదలకు అతీతమైన ది.

నారద ఉవాచ ।
ధర్మం పారమహంస్యం వై మునేశ్శ్రుత్వాఽసురేశ్వరః ।
పూజయిత్వా తతః ప్రీత ఆమంత్ర్య ప్రయయౌ గృహమ్।।46

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే
ప్రహ్లాద దత్తాత్రేయ సంవాదే యతిధర్మవర్ణనం నామ
త్రయోదశోఽధ్యాయః ।।

అసుర-ఈశ్వరః - రాక్షసప్రభువగు ప్రహ్లాదుడు, మునేః - దత్తా త్రేయ మహర్షినుండి, పారమహంస్యమ్ - పరమహంసలకు చెందిన, ధర్మమ్ - ధర్మమును, వై - నిశ్చయముగా, శ్రుత్వా - విని, తతః - తరు వాత, పూజయిత్వా - పూజించి, ప్రీతః - ఆనందించినవాడై, ఆమంత్ర్య - అనుమతి తీసుకొని, గృహమ్ - ఇంటిని గురించి, ప్రయయౌ - వెళ్లెను.

నారద మహర్షి ఇట్లు పలికెను --- రాక్షసప్రభువగు ప్రహ్లాదుడు దత్తాత్రేయ మహర్షినుండి పరమహంసలకు చెందిన ధర్మమును గురించి విని చాల సంతోషించి, ఆయనను పూజించి, ఆయన అనుమతితో తన గృహమునకు వెళ్లెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
ప్రహ్లాద-దత్తాత్రేయ సంవాదములో యతి ధర్మములను
వర్ణించే పదమూడవ అధ్యాయము ముగిసినది (13).

*****

# అథ చతుర్దశోऽధ్యాయః

## గృహస్థుల ధర్మములు

యుధిష్ఠిర ఉవాచ ।
గృహస్థ ఏతాం పదవీం విధినా యేన చాంజసా ।
యాతి దేవఋషే బ్రూహి మాదృశో గృహమూఢధీః ।। 1

దేవఋషే - ఓ దేవర్షీ!, గృహమూఢధీః - గృహమునందు వ్యామోహమును పొందిన బుద్ధి గల, మాదృశః - నావంటి, గృహస్థః - గృహస్థుడు, ఏతామ్ - ఈ, పదవీమ్ - ఆత్మసాక్షాత్కారమును, అంజసా - తేలికగా, యేన - ఏ, విధినా - విధానముచే, యాతి - పొందును?, బ్రూహి - చెప్పుము.

ధర్మరాజు ఇట్లు పలికెను --- ఓ దేవర్షీ! గృహమునందు వ్యామోహమును పొందిన బుద్ధిగల నావంటి గృహస్థుడు ఈ ఆత్మసాక్షాత్కారమును తేలికగా పొందే విధానమెయ్యది? చెప్పుము.

నారద ఉవాచ ।
గృహేష్వవస్థితో రాజన్ క్రియాః కుర్వన్ గృహోచితాః ।
వాసుదేవార్పణం సాక్షాదుపాసీత మహామునీన్ ।। 2

రాజన్ - ఓ రాజా!, గృహేషు - ఇంటియందు, అవస్థితః - ఉన్నవాడు, గృహ-ఉచితాః - ఇంటికి తగిన, క్రియాః - క్రియలను, సాక్షాత్ - సాక్షాత్తుగా, వాసుదేవ-అర్పణమ్ - వాసుదేవునకు అర్పించే విధముగా, కుర్వన్ - చేయుచున్నవాడై, మహామునీన్ - మహర్షులను, ఉపాసీత - సేవించవలెను.

నారదుడిట్లు పలికెను --- ఓ రాజా! గృహస్థుడు ఆ ఆశ్రమము నకు చెందిన కర్మలను సాక్షాత్తుగా వాసుదేవునకు అర్పించే భావనతో చేస్తూ, మహాత్ములను సేవించవలెను.

శృణ్వన్ భగవతోఽభీక్ష్ణమవతారకథామృతమ్ ।
శ్రద్దధానో యథాకాలముపశాంతజనావృతః ॥ 3

యథాకాలమ్ - కాలమునతిక్రమించకుండగా, ఉపశాంతజన-ఆవృతః - విరక్తులైన జనులచే చుట్టువారబడినవాడై, భగవతః - భగవానుని యొక్క, అవతారకథా-అమృతమ్ - అవతారగాథలు అనే అమృతమును, అభీక్ష్ణమ్ - పలుమార్లు, శ్రద్దధానః - శ్రద్ధ గలవాడై, శృణ్వన్ - వినుచున్న వాడు.

గృహస్థుడు నిత్యకృత్యములను చేసుకుంటూ సమయము లభించి నప్పుడు విరక్తజనులచే చుట్టువారబడి భగవానుని అవతారగాథలు అనే అమృతమును మరల మరల శ్రద్ధతో వినుచుండవలెను.

సత్సంగాచ్ఛనకైస్సంగమాత్మజాయాత్మజాదిషు ।
విముచ్యేన్ముచ్యమానేషు స్వయం స్వప్నవదుత్థితః ॥ 4

స్వయమ్ - తమంత తాముగా, ముచ్యమానేషు - విడిచిపెట్టబడు చున్న, ఆత్మజాయా-ఆత్మజ-ఆదిషు - దేహము భార్య సంతానము మొద లగువాటియందలి, సంగమ్ - ఆసక్తిని, సత్-సంగాత్ - సత్పురుషులతోడి సంగము వలన, శనకైః - మెల్లగా, ఉత్థితః - నిద్ర లేచినవాడు, స్వప్నవత్ - స్వప్నమును వలె, విముచ్యేత్ - విడిచిపెట్టవలెను.

దేహము, భార్య, సంతానము మొదలైనవి ఏదో ఒకనాడు తమంత తాముగా విడిచిపెట్టేవే. అయిననూ, వ్యక్తి వాటియందు నాది అనే అభిమా నమును కలిగియుండును. నిద్ర లేచిన వ్యక్తి స్వప్నమును వలె, సాధకుడు సత్పురుషులతోడి సంగముయొక్క ప్రభావము వలన వీటియందలి ఆసక్తిని మెల్లగా విడిచి పెట్టవలెను.

యావదర్థముపాసీనో దేహే గేహే చ పండితః ।
విరక్తో రక్తవత్తత్ర నృలోకే నరతాం న్యసేత్ ॥ 5

పండితః - వివేకి, యావత్ అర్థమ్ - ప్రయోజనము ఎంతవరకో అంతవరకు మాత్రమే, దేహే - దేహమునందు, గేహే చ - గృహము నందు కూడ, ఉపాసీనః - సేవించువాడు, విరక్తః - వైరాగ్యము గలవాడు, రక్తవత్ - ఆసక్తి కలవాడు వలె, తత్ర - అచట, నృలోకే - జనుల మధ్య యందు, నరతామ్ - మనుష్యత్వమును, న్యసేత్ - ఉంచవలెను.

వివేకి దేహముతో, ఇంటితో ప్రయోజనము ఎంతవరకో అంత మాత్రమే వాటిని సేవించవలెను. సాధకుడు విరక్తుడైననూ ఆ జనుల మధ్యలో ఆసక్తి కలవాడు వలె సామాన్య మానవుడు వలెనే వ్యవహరించ వలెను.

జ్ఞాతయః పితరౌ పుత్రా భ్రాతరస్సుహృదోఽపరే ।
యద్వదంతి యదిచ్ఛంతి చానుమోదేత నిర్మమః ॥ 6

జ్ఞాతయః - బంధువులు, పితరౌ - తల్లిదండ్రులు, పుత్రాః - పుత్రులు, భ్రాతరః - సోదరులు, సుహృదః - మిత్రులు, అపరే - ఇతరులు, యత్ - దేనిని, వదంతి - చెప్పెదరో, యత్ చ - దేనిని, ఇచ్ఛంతి - కోరె దరో దానిని, నిర్మమః - మమకారము లేనివాడై, అనుమోదేత - స్వీకరించ వలెను.

సాధకుడు మమకారము లేనివాడై, బంధువులు తల్లిదండ్రులు సంతానము సోదరులు మిత్రులు ఇతరులు దేనిని చెప్తే దానిని, దేనిని కోరితే దానిని, అంగీకరించవలెను.

దివ్యం భౌమం చాంతరిక్షం విత్తమచ్యుతనిర్మితమ్ ।
తత్సర్వముపభుంజాన ఏతత్కుర్యాత్స్వతో బుధః ॥ 7

దివ్యమ్ - ద్యులోకమునుండి వచ్చినది, భౌమమ్ - భూమినుండి వచ్చినది, ఆంతరిక్షం చ - అంతరిక్షమునుండి వచ్చినది అగు, విత్తమ్ - సంపద, స్వతః - స్వయముగా, అచ్యుతనిర్మితమ్ - అచ్యుతునిచే సమకూ

ర్చబడినదియే, తత్ - ఆ, సర్వమ్ - సర్వమును, ఉపభుంజానః - అనుభవించుచున్నవాడై, బుధః - వివేకి, ఏతత్ - దీనిని, కుర్యాత్ - చేయవలెను.

వర్షములు కురిసి పంటలు పండి లభించే సంపద దివ్యము. బంగారము మొదలైనవి భూమినుండి లభించే సంపద. ఇవి గాక అకస్మాత్తుగా సంపదలు వచ్చి పడవచ్చును. ఈ మూడు విధముల సంపద తనంత తానుగా అచ్యుతునిచే సమకూర్చబడినదియే. వివేకియగు సాధకుడు ఈ విషయమును గుర్తించి, ఆ సంపదనంతనూ అనుభవిస్తూ, పైన చెప్పిన ఈ సత్కర్మలను చేయవలెను.

యావద్భ్రియేత జఠరం తావత్స్వత్వం హి దేహినామ్ ।
అధికం యోఽభిమన్యేత స స్తేనో దండమర్హతి ॥ 8

యావత్ - ఎంతతోనైతే, జఠరమ్ - పొట్ట, భ్రియేత - నింపబడునో, దేహినామ్ - ప్రాణులకు, తావత్ - అంతవరకు మాత్రమే, స్వత్వం హి - తమది యగుట గదా!, యః - ఎవడైతే, అధికమ్ - అధికమును, అభిమన్యేత - నాది అని భావిస్తాడో, సః - వాడు, స్తేనః - చోరుడు, దండమ్ - శిక్షను, అర్హతి - అర్హుడగును.

ఎంతటి సంపద మనిషి పొట్ట నిండుటకు సరిపడునో, అంతటి సంపదపై మాత్రమే ఆ వ్యక్తికి హక్కు గలదు. అంతకుమించిన సంపదపై తన హక్కును స్వీకరించే వ్యక్తి చోరుడగును. కావున, ఆ వ్యక్తి శిక్షార్హుడు.

మృగోష్ట్రఖరమర్కాఖుసరీసృప్ఖగమక్షికాః ।
ఆత్మనః పుత్రవత్పశ్యేత్తైరేషామంతరం కియత్ ॥ 9

మృగ-ఉష్ట్రఖరమర్క-ఆఖుసరీసృప్-ఖగమక్షికాః - మృగములు ఒంటెలు గాడిదలు కోతులు ఎలుకలు ప్రాకే జంతువులు పక్షులు ఈగలను, ఆత్మనః - తనకు, పుత్రవత్ - సంతానము వంటివాటినిగా, పశ్యేత్ - భావించవలెను, తైః - వాటితో, ఏషామ్ - ఈ పుత్రాదులకు, అంతరమ్ - తేడా, కియత్ - ఎంతటిది?

మృగములు, ఒంటెలు, గాడిదలు, కోతులు, ఎలుకలు, ప్రాకే జంతువులు, పక్షులు, ఈగలను వివేకి తన సంతానముగానే భావించవలెను. వాస్తవములో ఈ ప్రాణులకు, సంతానమునకు తేడా ఎంతటిది?

త్రివర్గం నాతికృచ్ఛ్రేణ భజేత గృహమేధ్యపి ।
యథాదేశం యథాకాలం యావద్దైవోపపాదితమ్ ॥ 10

గృహమేధీ అపి - గృహస్థుడు కూడ, అతికృచ్ఛ్రేణ - మిక్కిలి కష్టముగా, త్రివర్గమ్ - ధర్మార్థకామములనే మూడు పురుషార్థములను, న భజేత - సేవించరాదు, యథాదేశమ్ - దేశమునతిక్రమించకుండగా, యథాకాలమ్ - కాలమునతిక్రమించకుండగా, యావత్ - ఎంతవరకైతే, దైవ-ఉపపాదితమ్ - దైవముచే సంపన్నము చేయబడినదో అంతే.

గృహస్థుడైననూ అతిశయించిన క్లేశముతో ధర్మార్థకామములనే పురుషార్థములను సాధింప బూనరాదు. దేశకాలములకు అనుగుణముగా దైవము సంపన్నము చేసినంతవరకు మాత్రమే గృహస్థుడు ధర్మార్థకామములను సేవించవలెను.

ఆశ్వాఘాంతేऽవసాయిభ్యః కామాన్ సంవిభజేద్యథా ।
అప్యేకమాత్మనో దారాం నృణాం స్వత్వగ్రహో యతః ॥ 11

ఆశ్వ-అఘ-అంతేవసాయిభ్యః - కుక్కలు పాపులు పతితులవరకు, యథా - అర్హతకు తగ్గట్లుగా, కామాన్ - భోగ్యవస్తువులను, సంవిభజేత్ - పంచి ఈయవలెను, యతః - ఎవతెయందు, నృణామ్ - మానవులకు, స్వత్వగ్రహః - నాది అనే ఆగ్రహము గలదో అట్టి, ఆత్మనః - తనయొక్క, ఏకామ్ - ఒక్క, దారాం అపి - భార్యను కూడ.

గృహస్థుడు భోగ్యవస్తువులను కుక్కలకు, పాపులకు, పతితులకు కూడ వారి అర్హతకు తగ్గట్లుగా పంచి ఈయవలెను. మానవులకు భార్యయందు, ఈమె నా వ్యక్తి అనే అభిమానము ఉండును. గృహస్థుడు అట్టి తన భార్యను కూడ కలుపుకొని సకలప్రాణులకు సేవను చేయవలెను.

జహ్యాద్యదర్థే స్వప్రాణాన్ హన్యాద్వా పితరం గురుమ్ ।
తస్యాం స్వత్వం స్త్రియాం జహ్యాద్యస్తేన హ్యజితో జితః ।। 12

యద్-అర్థే - ఎవతె కొరకై, స్వప్రాణాన్ - తన ప్రాణములను, జహ్యాత్ - విడిచిపెట్టునో, పితరమ్ - తండ్రిని గాని, గురుం వా - గురువును గాని, హన్యాత్ - సంహరించునో, తస్యామ్ - అట్టి, స్త్రియామ్ - భార్యయందు, స్వత్వమ్ - నాది అనే భావమును, యః - ఎవడైతే, జహ్యాత్ - విడిచిపెట్టునో, తేన - వానిచే, అజితః - పరాజయమునెరుంగని భగవానుడు, జితః హి - నిశ్చయముగా వశము చేసుకొనబడినవాడు.

మానవుడు స్త్రీయందు, ఈమె నా భార్య అనే అభిమానము గలవాడై, ఆమె కొరకై ప్రాణములనైననూ విడిచిపెట్టును; తల్లిదండ్రులను, గురవునైననూ హతమార్చును. కాని, ఎవడైతే స్త్రీయందలి అట్టి అభిమానమును విడిచిపెట్టునో, వానికి అపరాజితుడగు భగవానుడు కూడ వశుడగును.

కృమివిడ్భస్మనిష్ఠాంతం క్వేదం తుచ్ఛం కలేవరమ్ ।
క్వ తదీయరతిర్భార్యా క్వాయమాత్మా నభశ్ఛదిః ।। 13

కృమివిడ్-భస్మనిష్ఠా-అంతమ్ - క్రిములు మాలిన్యము బూడిదలయందు పర్యవసానము అంతముగా గల, ఇదమ్ - ఈ, తుచ్ఛమ్ - తుచ్ఛమైన, కలేవరమ్ - దేహము, క్వ - ఎక్కడ?, తదీయరతిః - ఆ దేహమునకు చెందిన ప్రీతి గల, భార్యా - భార్య, క్వ - ఎక్కడ?, నభః-ఛదిః - ఆకాశమును కూడ వ్యాపించే, అయమ్ - ఈ, ఆత్మా - ఆత్మ, క్వ - ఎక్కడ?

ఆఖరుగా క్రిములు, మాలిన్యము, బూడిదలయందు పర్యవసానము చెందే ఈ తుచ్ఛమగు దేహము ఎక్కడ? ఆ దేహమునందు ప్రీతి గల భార్య ఎక్కడ? ఆకాశమునకు కూడ కారణము (ఆకాశము కంటె సూక్ష్మము, వ్యాపకము) అగు ఈ ఆత్మ ఎక్కడ?

సిద్ధైర్యజ్ఞావశిష్టార్థైః కల్పయేద్వృత్తిమాత్మనః ।
శేషే స్వత్వం త్యజన్ ప్రాజ్ఞః పదవీం మహతామియాత్ ।।14

సిద్ధైః - దైవానుగ్రహముచే లభించినట్టియు, యజ్ఞ-అవశిష్ట-అర్థైః - పంచయజ్ఞములయందు మిగిలిన పదార్థములతో, ఆత్మనః - తనకు, వృత్తిమ్ - జీవికను, కల్పయేత్ - నిర్వహించుకొనవలెను, శేషే - మిగిలిన దానియందు, స్వత్వమ్ - నాది అనే అభిమానమును, త్యజన్ - విడిచిపెట్టే, ప్రాజ్ఞః - వివేకి, మహతామ్ - మహాత్ముల, పదవీమ్ - పదమును, ఇయాత్ - పొందును.

దైవానుగ్రహముచే లభించిన సంపదతో పంచయజ్ఞములను (దేవ, పితృ, ఋషి, మనుష్య, భూతయజ్ఞములు) చేసి, ఆపైన మిగిలిన ద్రవ్యములతో గృహస్థుడు తన జీవికను నిర్వహించుకొనవలెను. మిగిలిన సర్వమునందు, ఇది నాది అనే అభిమానమును విడిచిపెట్టిన వివేకి మహాత్ములు పొందే ఆత్మసాక్షాత్కారము (మోక్షము) ను పొందును.

దేవానృషీన్ నృభూతాని పితౄనాత్మానమన్వహమ్ ।
స్వవృత్త్యాగతవిత్తేన యజేత పురుషం పృథక్ ।। 15

స్వవృత్తి-ఆగతవిత్తేన - తన వృత్తిచే లభించిన సంపదతో, అను-అహమ్ - ప్రతిదినము, పురుషమ్ - పరమేశ్వరుని, పృథక్ - వేర్వేరు రూపములలో, దేవాన్ - దేవతలను, ఋషీన్ - ఋషులను, నృభూతాని - మానవులను ప్రాణులను, పితౄన్ - పితృదేవతలను, ఆత్మానమ్ - తనను, యజేత - ఆరాధించవలెను.

గృహస్థుడు తనకు తన వృత్తిచే లభించిన సంపదతో, దేవతలు ఋషులు మానవులు పశుపక్ష్యాదులు మరియు ఆత్మ అనే వేర్వేరు రూపములలోనున్న పరమేశ్వరుని ఆరాధించవలెను.

యర్హ్యాత్మనోఽధికారాద్యాస్సర్వాస్స్యుర్యజ్ఞసంపదః ।
వైతానికేన విధినా అగ్నిహోత్రాదినా యజేత్ ।। 16

యర్హి - ఏ కాలమునందైతే, ఆత్మనః - తనకు, అధికార-ఆద్యాః - యోగ్యత మొదలైన, సర్వాః - సకలములైన, యజ్ఞసంపదః - యజ్ఞమునకు కావలసిన సంపదలు, స్యుః - ఉండునో అప్పుడు, వైతానికేన - కల్పసూత్రములలో చెప్పబడిన, విధినా - విధానముతో, అగ్నిహోత్ర-ఆదినా - అగ్నిహోత్రము మొదలైన కర్మతో, యజేత్ - ఆరాధించవలెను.

గృహస్థుడు తనకు యోగ్యత మొదలైన యజ్ఞమునకు ఆవశ్యకమైన సంపదలు అన్నీ సమకూరిన పక్షములో, అగ్నిహోత్రము మొదలైన కర్మలను కల్పసూత్రములలో చెప్పబడిన విధానముతో చేసి పరమేశ్వరుని ఆరాధించవలెను.

న హ్యగ్నిముఖతోఽయం వై భగవాన్ సర్వయజ్ఞభుక్ ।
ఇజ్యేత హవిషా రాజన్ యథా విప్రముఖే హుతైః ॥ 17

రాజన్ - ఓ రాజా!, సర్వయజ్ఞభుక్ - సకలయజ్ఞములకు భోక్తయగు, భగవాన్ - భగవానుడు, యథా - ఏ విధముగానైతే, విప్రముఖే - వేదవేత్తల నోటియందు, హుతైః - సమర్పించబడిన ఆహుతులచే, యథా - ఏ విధముగా, ఇజ్యేత - ఆరాధించబడునో ఆ విధముగా, అయమ్ - ఈయన, అగ్నిముఖతః - అగ్నియందు సమర్పించుట ద్వారా, న హి - ఆరాధితుడు కాడు గదా!, వై - నిశ్చయము.

ఓ రాజా! యజ్ఞభాగములన్నింటికీ భోక్తయగు ఈ భగవానుడు వేదవేత్తకు ఆహారమును సమర్పించుట అనే యజ్ఞముచే ఎంత బాగా ప్రసన్నుడగునో, అగ్నియందు హోమములతో చేసే ఆరాధనతో అంత బాగా ప్రసన్నుడు కాడు. ఇది నిశ్చయము.

తస్మాద్బ్రాహ్మణదేవేషు మర్త్యాదిషు యథార్హతః ।
తైస్తైః కామైర్యజస్వైనం క్షేత్రజ్ఞం బ్రాహ్మణాననుః ॥ 18

తస్మాత్ - అందువలన, బ్రాహ్మణదేవేషు - బ్రాహ్మణులయందు దేవతలయందు, బ్రాహ్మణాన్ అను - బ్రాహ్మణులను తరువాత, మర్త్య-ఆదిషు - మానవులు మొదలగువారియందు, యథా-అర్హతః - యోగ్యతన

నుసరించి, తైః తైః - ఆయా, కామైః - భోగ్యవస్తువులతో, ఏనమ్ - ఈ, క్షేత్రజ్ఞమ్ - క్షేత్రజ్ఞుని; యజస్వ - ఆరాధించుము.

కావున, దేవతలను, వేదవేత్తలను, ఇతర మానవులను, పశుపక్ష్యాదులను వారి వారి అర్హతకు తగ్గట్లుగా ఆయా భోగ్యవస్తువులను సమర్పించి ఆరాధించుము. ఆ విధముగా వీరందరియందు దేహేంద్రియమనస్సంఘాతమునకు సాక్షియై ఉండే పరమాత్మను ఆరాధించుము.

కుర్యాదాపరపక్షీయం మాసి ప్రౌష్ఠపదే ద్విజః ।
శ్రాద్ధం పిత్రోర్యథావిత్తం తద్బంధూనాం చ విత్తవాన్ ॥ 19

విత్తవాన్ - సంపద గల, ద్విజః - బ్రాహ్మణుడు, యథావిత్తమ్ - తన సంపదను అతిక్రమించకుండా, ప్రౌష్ఠపదే మాసి - ఆశ్వయుజ మాసమునందు, పిత్రోః - తల్లిదండ్రులకు, తద్-బంధూనాం చ - వారి బంధువులకు కూడ, ఆపరపక్షీయమ్ - రెండవ (కృష్ణ) పక్షమునకు చెందిన, శ్రాద్ధమ్ - శ్రాద్ధమును, కుర్యాత్ - చేయవలెను.

సంపద గల బ్రాహ్మణుడు ఆశ్వయుజ కృష్ణపక్షమునందు తల్లిదండ్రులకు, పితామహ మాతామహులకు తన సంపదకు తగ్గట్లుగా మహాలయ శ్రాద్ధమును చేయవలెను.

అయనే విషువే కుర్యాద్వ్యతీపాతే దినక్షయే ।
చంద్రాదిత్యోపరాగే చ ద్వాదశీశ్రవణేషు చ ॥ 20

తృతీయాయాం శుక్లపక్షే నవమ్యామథ కార్తికే ।
చతసృష్వప్యష్టకాసు హేమంతే శిశిరే తథా ॥ 21

మాఘే చ సితసప్తమ్యాం మఘారాకాసమాగమే ।
రాకయా చానుమత్యా వా మాసర్క్షాణి యుతాన్యపి ॥ 22

ద్వాదశ్యామనురాధా స్యాచ్ఛ్రవణస్తిస్ర ఉత్తరాః ।
తిసృష్వేకాదశీ వాఽఽసు జన్మర్క్షశ్రోణయోగయుక్ ॥ 23

అయనే - కర్కట మకర సంక్రాంతులయందు, విషువే - మేష తులా సంక్రాంతులయందు, వ్యతీపాతే - వ్యతీపాతమునాడు, దినక్షయే - దినక్షయమునందు, చంద్ర-ఆదిత్య-ఉపరాగే చ - చంద్ర సూర్య గ్రహణ ములయందు, ద్వాదశీశ్రవణేషు చ - ద్వాదశినాడు శ్రవణము ధనిష్ఠ అనూ రాధ అనే నక్షత్రములయందు, శుక్లపక్షే - శుక్లపక్షమునందు, తృతీయా యామ్ - తదియనాడు, అథ - మరియు, కార్తికే - కార్తిక మాసమునందు, శుక్లే నవమ్యామ్ - శుక్లపక్ష నవమి నాడు, హేమంతే - హేమంత ఋతు వునందు, తథా - మరియు, శిశిరే - శిశిర ఋతువునందు, చతసృషు - నాలుగు, అష్టకాసు అపి - కృష్ణాష్టములయందు, మాఘే చ - మాఘ మాసమునందు కూడ, సితసప్తమ్యామ్ - శుక్ల సప్తమి నాడు, మఘారాకాస మాగమే - మఘానక్షత్రముతో కూడిన పూర్ణిమనాడు, రాకయా - పూర్ణి మతో గాని, అనుమత్యా వా - శుక్ల చతుర్దశితో గాని, యుక్తాని - కూడియు న్న, మాస-ఋక్షాణి అపి - నెలల పేర్లకు మూలమైన నక్షత్రములను కూడ, ద్వాదశ్యామ్ - ద్వాదశినాడు, అనురాధా - అనూరాధ, శ్రవణః - శ్రవణము, తిస్రః - మూడు, ఉత్తరాః - ఉత్తరలు, స్యుః - కలుగునో అప్పు డు, తిసృషు - ఈ మూడు ఉత్తరలయందు, ఏకాదశీ వా - ఏకాదశి గాని వచ్చినచో, ఆసు - ఈ తిథులయందు, జన్మ-ఋక్ష-శ్రోణయోగయుక్ - జన్మ నక్షత్రము శ్రవణములతో యోగము గల ఏకాదశినాడు, కుర్యాత్ - శ్రాద్ధమును చేయవలెను.

కర్కట మకర సంక్రాంతులు, మేష తులా సంక్రాంతులు, వ్యతీపా తము (ఆదివారమైన అమావాస్య), దినక్షయము (సూర్యోదయము తరు వాత వచ్చిన తిథి మరునాడు సూర్యోదయమునకు ముందే అంతమగుట), చంద్ర గ్రహణము, సూర్య గ్రహణము, శ్రవణము ధనిష్ఠ అనూరాధ నక్షత్ర ములు వచ్చిన ద్వాదశి, వైశాఖ శుక్ల తదియ (అక్షయ తదియ), కార్తీక శుక్ల నవమి (అక్షయ నవమి), హేమంత శిశిర ఋతువులలోని (కార్తీక పుష్య మాఘ ఫాల్గున మాసములలో) నాలుగు కృష్ణాష్టములు, మాఘ శుక్ల సప్త మి, మఖా నక్షత్రముతో కూడిన పూర్ణిమ, మాస నక్షత్రము (చిత్ర, విశాఖ మొదలగునవి) తో కూడిన శుక్ల చతుర్దశి పూర్ణిమలు, అనూరాధ శ్రవణము ఉత్తర ఫల్గుని ఉత్తరాషాఢ ఉత్తరాభాద్రలతో కూడిన ద్వాదశి, ఉత్తరఫల్గుని

ఉత్తరాషాఢ ఉత్తరాభాద్ర జన్మనక్షత్రము శ్రవణములతో కూడిన ఏకాదశి -- ఈ దినములలో పితృశ్రాద్ధమును చేయవలెను.

త ఏతే శ్రేయసః కాలా నృణాం శ్రేయోవివర్ధనాః ।
కుర్యాత్సర్వాత్మనైతేషు శ్రేయోఽమోఘం తదాయుషః ॥24

తే - ఆ, ఏతే - ఈ దినములు, నృణామ్ - మానవులకు, శ్రేయసః - కల్యాణమునకు, కాలాః - కాలములు, శ్రేయః-వివర్ధనాః - కల్యాణమును వర్ధిల్ల జేయునవి, ఏతేషు - ఈ దినములయందు, సర్వ-ఆత్మనా - సర్వ ప్రయత్నముచే, శ్రేయః - కల్యాణకర్మను, కుర్యాత్ - చేయవలెను, తద్ - అది, ఆయుషః - ఆయుర్దాయమునకు, అమోఘమ్ - సాఫల్యము.

ఈ పైన చెప్పిన దినములు మానవులకు కల్యాణమును వర్ధిల్ల జేసే కల్యాణ దినములు. కావున, మానవుడు ఈ దినములయందు సర్వప్ర యత్నముచే పుణ్యకార్యములను చేయవలెను. అట్లు చేయుట జీవితము నకు సాఫల్యమును చేకూర్చును.

ఏషు స్నానం జపో హోమో వ్రతం దేవద్విజార్చనమ్ ।
పితృదేవనృభూతేభ్యో యద్దత్తం తద్ధ్యనశ్వరమ్ ॥ 25

హి - ఏలయనగా, ఏషు - ఈ దినములయందు, స్నానమ్ - స్నానము, జపః - జపము, హోమః - హోమము, వ్రతమ్ - వ్రతము, దేవ ద్విజ-అర్చనమ్ - దేవతలను బ్రాహ్మణులను పూజించుట, పితృదేవనృ భూతేభ్యః - పితృదేవతలు దేవతలు మానవులు పశుపక్ష్యాదుల కొరకు, యత్ - ఏది, దత్తమ్ - ఈయబడినదో, తత్ - అది, అనశ్వరమ్ - అక్షయమగును.

ఎందుకంటే, ఈ దినములలో చేసిన తీర్థస్నానము, జపము, హోమము, వ్రతము, దేవపూజ, బ్రాహ్మణపూజ, పితృశ్రాద్ధము, దేవతలకు నైవేద్యాదులను సమర్పించుట, మానవులకు దానమును చేయుట, పశుప క్ష్యాదులకు ఆహారమునిచ్చుట అనే ఈ కర్మలు అక్షయఫలమునిచ్చును.

సంస్కారకాలో జాయాయా అపత్యస్యాత్మనస్తథా ।
ప్రేతసంస్థా మృతాహశ్చ కర్మణ్యభ్యుదయే నృప ।। 26

నృప - ఓ రాజా!, జాయాయాః - భార్యకు, అపత్యస్య - సంతానమునకు, తథా - అదే విధముగా, ఆత్మనః - తనకు, సంస్కారకాలః - సంస్కారములకు సమయము, ప్రేతసంస్థా - ప్రేతకార్యము, మృత-అహః చ - వార్షిక శ్రాద్ధము, అభ్యుదయే కర్మణి చ - మాంగళిక కర్మయందు కూడ.

ఓ రాజా! భార్యకు చేసే పుంసవనము మొదలగు సంస్కారముల యందు, సంతానమునకు చేసే జాతకర్మ మొదలగు సంస్కారములయందు, గృహస్థుడు తనకు చేసుకొనే యజ్ఞోపవీతధారణము మొదలగు సంస్కార కాలములయందు, ప్రేతకార్యములయందు, వార్షిక శ్రాద్ధమునందు మరియు ఇతరములగు మాంగళిక కర్మల (వ్రతములు మొదలైనవి) యందు చేసిన దానము అక్షయమగును.

అథ దేశాన్ ప్రవక్ష్యామి ధర్మాదిశ్రేయఆవహాన్ ।
స వై పుణ్యతమో దేశస్సత్పాత్రం యత్ర లభ్యతే ।। 27

అథ - తరువాత, ధర్మ-ఆదిశ్రేయః-ఆవహాన్ - ధర్మము మొదలైన కల్యాణములను కలిగించే, దేశాన్ - స్థానములను గురించి, ప్రవక్ష్యామి - చెప్పెదను, సః - అది, వై - నిశ్చితముగా, పుణ్యతమః - మిక్కిలి పవిత్రమైన, దేశః - స్థానము, యత్ర - ఎక్కడనైతే, సత్-పాత్రమ్ - దానమునకు యోగ్యుడైన వ్యక్తి, లభ్యతే - లభించునో.

ఇప్పుడు ధర్మము మొదలైన కల్యాణములను కలిగించే స్థానములను గురించి చెప్పెదను. ఎచ్చటనైతే దానమునకు యోగ్యుడైన వ్యక్తి లభించునో, అదియే నిశ్చితముగా మిక్కిలి పవిత్రమైన దేశము.

బింబం భగవతో యత్ర సర్వమేతచ్చరాచరమ్ ।
యత్ర హ బ్రాహ్మణకులం తపోవిద్యాదయాన్వితమ్ ।। 28

యత్ర హ - ఏ స్థానమునందైతే, భగవతః - భగవానుని, బింబమ్ - మూర్తి గలదో, యత్ర - ఏ భగవానునియందు, చర-అచరమ్ - కదిలే కదలని ప్రాణులు గల, ఏతత్ - ఈ, సర్వమ్ - సర్వము ఉన్నదో, బ్రాహ్మణకులమ్ - బ్రాహ్మణుల సమూహము, తపః-శ్రద్ధాదయా-అన్వితమ్ - తపస్సు శ్రద్ధ దయలతో కూడియుండునో.

సకలచరాచరజగత్తునకు అధిష్ఠానమైన భగవానుని మూర్తి గల స్థానము, తపస్సు శ్రద్ధ దయ అనే గుణములతో కూడియున్న బ్రాహ్మణుల సముదాయము ఉన్న స్థానము మిక్కిలి పవిత్రమైన స్థానములు.

యత్ర యత్ర హరేరర్చా స దేశశ్శ్రేయసాం పదమ్ ।
యత్ర గంగాదయో నద్యః పురాణేషు చ విశ్రుతాః ॥ 29

యత్ర యత్ర - ఎక్కడెక్కడనైతే, హరేః - శ్రీహరియొక్క, అర్చా - పూజయో, సః - ఆ, దేశః - స్థానము, శ్రేయసామ్ - కల్యాణములకు, పదమ్ - నిధానము, యత్ర చ - ఎక్కడనైతే, పురాణేషు - పురాణముల యందు, విశ్రుతాః - అధికముగా వర్ణించబడిన, గంగా-ఆదయః - గంగ మొదలగు, నద్యః - నదులు ఉండునో.

శ్రీహరియొక్క పూజ జరిగే ప్రతి స్థానము, పురాణములలో అధికముగా వర్ణించబడిన గంగ మొదలైన నదులు ఉండే స్థానము మిక్కిలి పవిత్రమైనవి, మరియు కల్యాణములకు నిధానములు.

సరాంసి పుష్కరాదీని క్షేత్రాణ్యర్హాశ్రితాన్యుత ।
కురుక్షేత్రం గయశిరః ప్రయాగః పులహాశ్రమః ॥ 30

పుష్కర-ఆదీని - పుష్కరము మొదలైన, సరాంసి - సరస్సులు, ఉత - మరియు, అర్హ-ఆశ్రితాని - మహర్షులు మొదలగు పుణ్యాత్ములచే ఆశ్రయించబడిన, క్షేత్రాణి - క్షేత్రములు, కురుక్షేత్రమ్ - కురుక్షేత్రము, గయశిరః - గయాసురుని తల పడిన గయ, ప్రయాగః - ప్రయాగ, పులహ-ఆశ్రమః - పులహుని ఆశ్రమము.

పుష్కరము మొదలైన సరస్సులు, మహర్షులు సిద్ధులు మొదలైన పుణ్యాత్ములు నివసించిన క్షేత్రములు, కురుక్షేత్రము, గయాసురుని తల పడిన గయాక్షేత్రము, ప్రయాగ, పులహుని ఆశ్రమము (సాలగ్రామ క్షేత్రము) లు మిక్కిలి పవిత్రములైన స్థానములు.

నైమిషం ఫాల్గునం సేతుః ప్రభాసోఽథ కుశస్థలీ ।
వారాణసీ మధుపురీ పంపా బిందుసరస్తథా ॥ 31

నైమిషమ్ - నైమిశారణ్యము, ఫాల్గునమ్ - ఫాల్గున క్షేత్రము, సేతుః - సేతుబంధము, ప్రభాసః - ప్రభాసము, అథ - మరియు, కుశస్థలీ - ద్వారక, వారాణసీ - కాశి, మధుపురీ - మథుర, పంపా - పంపాసరము, తథా - మరియు, బిందుసరః - బిందుసరము.

నైమిశారణ్యము, ఫాల్గున క్షేత్రము, సేతుబంధము, ప్రభాసము, ద్వారక, కాశి, మథుర, పంపాసరము, బిందుసరము పవిత్ర స్థానములు.

నారాయణాశ్రమో నందా సీతారామాశ్రమాదయః ।
సర్వే కులాచలా రాజన్ మహేంద్రమలయాదయః ॥ 32

రాజన్ - ఓ రాజా!, నారాయణాశ్రమః - బదరికాశ్రమము, నందా - అలకనంద, సీతారామాశ్రమ-ఆదయః - సీతారాముల ఆశ్రమములైన చిత్రకూటము మొదలైనవి, సర్వే - అన్ని, కుల-అచలాః - కుల పర్వతములైన, మహేంద్రమలయ-ఆదయః - మహేంద్రము మలయము మొదలైనవి.

ఓ రాజా! బదరికాశ్రమము, అలకనంద, సీతారాముల ఆశ్రమములైన చిత్రకూటము మొదలైనవి, మహేంద్ర-మలయ-సహ్యా-శుక్తిమత్-ఋక్షవత్-వింధ్య-పారియాత్రములు అనే కులపర్వతములు మిక్కిలి పవిత్రమగు స్థానములు.

ఏతే పుణ్యతమా దేశా హరేరర్చాశ్రితాశ్చ యే ।
ఏతాన్ దేశాన్ నిషేవేత శ్రేయస్కామో హ్యభీక్ష్ణశః ।
ధర్మో హ్యత్రేహితః పుంసాం సహస్రాధిఫలోదయః ॥ 33

ఏతే - ఇవి, పుణ్యతమాః - మిక్కిలి పవిత్రములైన, దేశాః - స్థానములు, యే - ఏవి, హరేః - శ్రీహరియొక్క, అర్చా-ఆశ్రితాః చ - అర్చామూర్తులకు ఆశ్రయములో, శ్రేయస్కామః - కల్యాణమును కోరు వ్యక్తి, ఏతాన్ - ఈ, దేశాన్ - స్థానములను, అభీక్ష్ణశః - పలుమార్లు, నిషేవేత హి - నిశ్చయముగా సేవించవలెను, అత్ర - ఈ స్థానములయందు, ఈహితః - చేయబడిన, ధర్మః - ధర్మము, పుంసామ్ - మానవులకు, సహస్ర-అధిఫల-ఉదయః - వేయి రెట్లు అధికమగు ఫలమును ఇచ్చునది.

శ్రీహరియొక్క అర్చామూర్తులకు ఆశ్రయములగు స్థానములు మిక్కిలి పవిత్రములు. కల్యాణమును కోరే వ్యక్తి ఈ స్థానములను నిశ్చయముగా మరల మరల సేవించవలెను. ఈ స్థానములలో చేయబడిన ధర్మము మానవులకు వేయి రెట్లు అధికఫలమునిచ్చును.

పాత్రం త్వత్ర నిరుక్తం వై కవిభిః పాత్రవిత్తమైః ।
హరిరేవైక ఉర్వీశ యన్మయం వై చరాచరమ్ ॥ 34

ఉర్వీ-ఈశ - ఓ మహారాజా!, పాత్రవిత్తమైః - పాత్రగురించి తెలిసినవారిలో అగ్రేసరులగు, కవిభిః తు - మహాత్ములచేనైతే, అత్ర - ఈ లోకమునందు, హరిః - శ్రీహరి, ఏకః ఏవ - ఒక్కడు మాత్రమే, పాత్రమ్ - పూజాపాత్రుడుగా, నిరుక్తమ్ - నిర్దేశించబడినాడు, చర-అచరమ్ - స్థావర జంగమాత్మకమగు జగత్తు, వై - నిశ్చయముగా, యత్-మయమ్ - ఎవనిచే వ్యాపించబడియున్నదో.

ఓ మహారాజా! స్థావర జంగమాత్మకమగు ఈ జగత్తు అంతా శ్రీహరిచే వ్యాప్తమై యున్నది. కావున, ఈ లోకములో శ్రీహరి ఒక్కడే పూజకు పాత్రుడు, అని పాత్రస్వరూపమును తెలిసినవారిలో అగ్రగణ్యులగు మహాత్ములు నిర్దేశించినారు.

దేవర్ష్యర్హత్సు వై సత్సు తత్ర బ్రహ్మాత్మజాదిషు ।
రాజన్ యదగ్రపూజాయాం మతః పాత్రతయాఽచ్యుతః ॥35

రాజన్ - ఓ మహారాజా!, యత్ - ఎందువలననగా, తత్ర - అక్క డ, బ్రహ్మ-ఆత్మజ-ఆదిషు - బ్రహ్మపుత్రుడగు నారదుడు మొదలైన, దేవ-ఋషి-అర్హత్సు - దేవతలు మహర్షులు సిద్ధపురుషులు, సత్సు - ఉండగా, అగ్రపూజాయామ్ - అగ్రపూజయందు, అచ్యుతః - శ్రీకృష్ణుడు, పాత్ర తయా - అర్హుడుగా, మతః - స్వీకరించబడినవాడు.

ఓ మహారాజా! ఎందుకంటే, అక్కడ నీ రాజసూయయాగసభలో బ్రహ్మగారి పుత్రుడగు నారదుడు మొదలైన మహర్షులు, దేవతలు, సిద్ధపు రుషులు ఉండగా, అందరికంటె ముందుగా చేసే పూజకు శ్రీకృష్ణుడు అర్హ మైనవాడుగా స్వీకరించబడినాడు.

జీవరాశిభిరాకీర్ణ ఆండకోశాంఘ్రిపో మహాన్ ।
తన్మూలత్వాదచ్యుతేజ్యా సర్వజీవాత్మతర్పణమ్ ॥ 36

జీవరాశిభిః - జీవుల సమూహములచే, ఆకీర్ణః - అంతటా వ్యాప్త మైన, ఆండకోశ-అంఘ్రిపః - బ్రహ్మాండకోశమనే వృక్షము, మహాన్ - పెద్దది, తత్-మూలత్వాత్ - దానికి మూలము అగుట వలన, అచ్యుత-ఇజ్యా - అచ్యుతుని ఆరాధనము, సర్వజీవ-ఆత్మతర్పణమ్ - సకలజీవుల ఆత్మకు తృప్తిని ఇచ్చునది.

బ్రహ్మాండకోశమనే మహావృక్షము జీవుల సమూహములచే వ్యాప్తమై యున్నది. దానికి మూలము అచ్యుతుడే. కావున, అచ్యుతుని ఆరాధించినచో, సకలజీవుల ఆత్మకు తృప్తి కలుగును.

పురాణ్యనేన సృష్టాని నృతిర్యగృషిదేవతాః ।
శేతే జీవేన రూపేణ పురేషు పురుషో హ్యసౌ ॥ 37

అనేన - ఈ ఈశ్వరునిచే, నృతిర్యగ్-ఋషిదేవతాః - మానవులు పశుపక్ష్యాదులు మహర్షులు దేవతలు అనే, పురాణి - పురములు, సృష్టాని - సృష్టించబడినవి, పురేషు - పురములయందు, జీవేన రూపేణ - జీవుడు రూపముగా, శేతే - ప్రకటమగుచున్నాడు, అసౌ - ఈ ఈశ్వరుడు, పురుషః - పురుషుడు, హి - నిశ్చయము.

ఈ ఈశ్వరుడు మానవులు, పశుపక్ష్యాదులు, మహర్షులు, దేవతలు మొదలగు ప్రాణుల శరీరములను సృష్టించి, వాటియందు జీవరూపముగా ప్రకటమగుచున్నాడు. పురములనదగిన శరీరములయందు ప్రకటమగుచుండుటచే ఈ ఈశ్వరునకు పురుషుడు అనే సార్థకనామము కలిగినది.

తేష్వేషు భగవాన్ రాజంస్తారతమ్యేన వర్తతే ।
తస్మాత్పాత్రం హి పురుషో యావానాత్మా యథేయతే ॥38

రాజన్ - ఓ రాజా!, తేషు - అట్టి, ఏషు - ఈ ప్రాణులయందు, భగవాన్ - భగవానుడు, తారతమ్యేన - తరతమభావముతో, వర్తతే - ఉన్నాడు, తస్మాత్ - అందువలన, పురుషః - మానవమాత్రుడు, పాత్రం హి - దానాదికమునకు యోగ్యుడే గదా!, ఆత్మా - చైతన్యాంశము, యావాన్ - ఎంతవరకు ప్రకటమగునో, యథా - ఏ విధముగా, ఈయతే - అనుభవమునకు వచ్చునో.

ఓ మహారాజా! అట్టి ఈ ప్రాణులయందు భగవానుడు చైతన్యాంశములోని తరతమభావముతో ప్రకటమగుచున్నాడు. కావున, మానవమాత్రుడు దానాదికమునకు యోగ్యుడే. మనుష్యులలో ఎవనియందు చైతన్యరూపమగు జ్ఞానము ఏ విధముగా ప్రకటమగునో, దానిని బట్టి ఆ వ్యక్తి యొక్క యోగ్యత నిర్ధారితమగును.

దృష్ట్వా తేషాం మిథో నృణామవజ్ఞానాత్మతాం నృప ।
త్రేతాదిషు హరేరర్చా క్రియాయై కవిభిః కృతా ॥ 39

నృప - ఓ మహారాజా!, త్రేతా-ఆదిషు - త్రేతాయుగము మొదలగు కాలములయందు, తేషామ్ - ఆ, నృణామ్ - మానవులయొక్క, మిథః - పరస్పరము, అవజ్ఞాన-ఆత్మతామ్ - అవమానించే బుద్ధిని కలిగియుండుటను, దృష్ట్వా - చూచి, క్రియాయై - పూజాకర్మ కొరకు, కవిభిః - మహర్షులచే, హరేః - శ్రీహరియొక్క, అర్చా - ప్రతిమ, కృతా - చేయబడినది.

ఓ మహారాజా! త్రేతా మొదలగు యుగములలో మానవులకు పర స్పరము అవమానించుకొనే లక్షణము అధికముగా నుండును. ఈ విషయ మును గమనించియే, మహర్షులు పూజాకర్మ (ఉపాసన) కొరకు శ్రీహరి యొక్క ప్రతిమను కల్పించిరి.

తతోఽర్చాయాం హరిం కేచిత్ సంశ్రద్ధాయ సపర్యయా ।
ఉపాసత ఉపాస్తాపి నార్థదా పురుషద్విషామ్ ।। 40

**తతః** - తరువాత, **కేచిత్** - కొందరు, సంశ్రద్ధాయ - చక్కని శ్రద్ధను చూపి, అర్చాయామ్ - ప్రతిమయందు, సపర్యయా - పూజచే, హరిమ్ - శ్రీహరిని, ఉపాసతే - ఉపాసించుచున్నారు, ఉపాస్తా అపి - ఉపాసించబడినదే అయిననూ (ప్రతిమ), పురుషద్విషామ్ - మానవులను ద్వేషించువారలకు, అర్థదా - పురుషార్థమును ఇచ్చేది, న - కాదు.

తరువాత కొందరు ప్రతిమయందు చక్కని శ్రద్ధగలవారై పూజలను చేసి శ్రీహరిని ఉపాసించుచున్నారు. కాని, ఇతరమానవులను ద్వేషిస్తూ ప్రతిమయందు శ్రీహరిని ఉపాసించిననూ, దానివలన పురుషార్థము సిద్ధిం చబోదు.

పురుషేష్వపి రాజేంద్ర సుపాత్రం బ్రాహ్మణం విదుః ।
తపసా విద్యయా తుష్ట్యా ధత్తే వేదం హరేస్తనుమ్ ।। 41

రాజ-ఇంద్ర - ఓ మహారాజా!, పురుషేషు అపి - మానవుల యందు కూడ, బ్రాహ్మణమ్ - వేదవేత్తను, సుపాత్రమ్ - దానాదికమునకు మంచి యోగ్యునిగా, విదుః - తెలియుచున్నారు, తపసా - తపస్సుచే, విద్యయా - ఉపాసనచే, తుష్ట్యా - సంతుష్టిచే, హరేః - శ్రీహరియొక్క, తనుమ్ - రూపమైన, వేదమ్ - వేదమును, ధత్తే - ధరించుచున్నాడు.

ఓ మహారాజా! మానవులయందు కూడ వేదవేత్తయగు బ్రాహ్మ ణుడు దానాదికమునకు మంచి యోగ్యుడని మహాత్ములు చెప్పెదరు. ఎందుకంటే, అట్టి బ్రాహ్మణుడు సంతుష్టి గలవాడై, తపస్సు మరియు ఉపా సనల ద్వారా శ్రీహరి రూపమగు వేదమును వల్లించి నిలబెట్టుచున్నాడు.

నన్వస్య బ్రాహ్మణా రాజన్ కృష్ణస్య జగదాత్మనః ।
పునంతః పాదరజసా త్రిలోకీం దైవతం మహత్ ॥ 42

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే
గృహస్థధర్మవర్ణనం నామ చతుర్దశోఽధ్యాయః ॥

రాజన్ - ఓ మహారాజా!, జగద్-ఆత్మనః - జగద్రూపుడైన, అస్య - ఈ, కృష్ణస్య - శ్రీకృష్ణునకు, పాదరజసా - పాదధూళిచే, త్రిలోకీమ్ - ముల్లోకములను, పునంతః - పవిత్రము చేసే, బ్రాహ్మణాః - బ్రాహ్మణులు, మహత్ - గొప్ప, దైవతమ్ - దైవము, నను - నిశ్చయము.

ఓ మహారాజా! జగద్రూపముగా ప్రకటమైయున్న ఈ శ్రీకృష్ణునకు కూడ బ్రాహ్మణులు గొప్ప దైవము. ఇది నిశ్చయము. ఇట్టి బ్రాహ్మణులు తమ పాదధూళిచే ముల్లోకములను పావనము చేయుదురు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
గృహస్థుల ధర్మములను వర్ణించే పదునాల్గవ
అధ్యాయము ముగిసినది (14).

*****

# అథ పంచదశోऽధ్యాయః

## సదాచార నిరూపణము

నారద ఉవాచ ।
కర్మనిష్ఠా ద్విజాః కేచిత్ తపోనిష్ఠా నృపాపరే ।
స్వాధ్యాయేऽన్యే ప్రవచనే యే కేచిజ్జ్ఞానయోగయోః ॥ 1

నృప - ఓ రాజా!, ద్విజాః - వేదవేత్తలు, కేచిత్ - కొందరు, కర్మనిష్ఠాః - కర్మలయందు నిష్ఠ గలవారు, కేచిత్ - కొందరు, తపః-నిష్ఠాః - తపస్సునందు నిష్ఠ గలవారు, అపరే - మరికొందరు, స్వాధ్యాయే - వేదాధ్యయనమునందు, అన్యే - ఇతరులు, ప్రవచనే - బోధించుటయందు, యే కేచిత్ - ఎవరో కొందరు, జ్ఞానయోగయోః - ఆత్మజ్ఞానమునందు భగవద్ధ్యానమునందు.

నారద మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! వేదవేత్తలలో కొందరు కర్మలయందు, కొందరు తపస్సునందు, మరికొందరు వేదమును పఠించుటయందు, ఇంకొందరు బోధించుటయందు, ఎవరో కొందరు ఆత్మజ్ఞానమునందు, ఇంకా కొందరు భగవద్ధ్యానమునందు నిష్ఠను కలిగియుందురు.

జ్ఞాననిష్ఠాయ దేయాని కవ్యాన్యానంత్యమిచ్ఛతా ।
దైవే చ తదభావే స్యాదితరేభ్యో యథార్హతః ॥ 2

అనంత్యమ్ - అనంతఫలమును, ఇచ్ఛతా - కోరువానిచే, కవ్యాని - పితృదేవతలకు సమర్పించే ద్రవ్యమును, దైవే చ - ఈశ్వరుని ఉద్దేశించి సమర్పించే ద్రవ్యములను, జ్ఞాననిష్ఠాయ - జ్ఞాననిష్ఠుని కొరకు, దేయాని - ఈయదగినవి, తద్-అభావే - అట్టి వ్యక్తి లేనప్పుడు, ఇతరేభ్యః - ఇతరుల కొరకు, యథా-అర్హతః - యోగ్యతననుసరించి, స్యాత్ - అగును.

శ్రాద్ధమునందు, దేవపూజయందు అనంతమగు ఫలమును కోరే వ్యక్తి క్రమముగా కవ్య (పితృదేవతలకు సమర్పించేది)-హవ్య (ఈశ్వరునకు అర్పించేది) ములను జ్ఞాననిష్ఠుని కొరకు సమర్పించవలెను. అట్టి వ్యక్తి లేని పక్షములో ఇతరుల కొరకు వారి అర్హతను బట్టి దానము చేయవలెను.

ద్వౌ దైవే పితృకార్యే త్రీనేకైకముభయత్ర వా ।
భోజయేత్సుసమృద్ధోఽపి శ్రాద్ధే కుర్యాన్న విస్తరమ్ ॥ 3

సుసమృద్ధః అపి - మిక్కిలి సంపన్నుడైననూ, శ్రాద్ధే - శ్రాద్ధమునందు, దైవే - విశ్వేదేవస్థానమునందు, ద్వౌ - ఇద్దరిని, పితృకార్యే - పితరులనుద్దేశించి చేసే కార్యమునందు, త్రీన్ - ముగ్గురిని, వా - లేదా, ఉభయత్ర - రెండు స్థానములయందు, ఏక-ఏకమ్ - ఒక్కొక్కని, భోజయేత్ - భుజింప జేయవలెను, విస్తరమ్ - ఆధిక్యమును, న కుర్యాత్ - చేయరాదు.

ఎంతటి సంపన్నుడైననూ శ్రాద్ధములో విశ్వేదేవ స్థానమునందు ఇద్దరిని, పితరుల స్థానమునందు ముగ్గురిని, లేదా రెండు స్థానములలో ఒక్కొక్కరిని భోక్తలను భుజింప జేయవలెను. అంతేగాని, భోక్తల సంఖ్యను ఇంతకు మించి పెంచరాదు.

దేశకాలోచితా శ్రద్ధా ద్రవ్యపాత్రార్హణాని చ ।
సమ్యగ్ భవంతి నైతాని విస్తరాత్స్వజనార్పణాత్ ॥ 4

విస్తరాత్ - విస్తారము వలన, స్వజన-అర్పణాత్ - తన బంధువులయందు సమర్పించుట వలన, దేశకాల-ఉచితా - దేశకాలములకు తగిన, శ్రద్ధా - శ్రద్ధ, ద్రవ్యపాత్ర-అర్హణాని చ - పదార్థములు యోగ్యులగు భోక్తలు పూజాదికములు, ఏతాని - ఇవి, సమ్యక్ - చక్కగా, న భవంతి - ఉండవు.

శ్రాద్ధాదులయందు విస్తారము చేయుట వలన, తన బంధువులను జమ చేసి వారికి భోజనాదులను సమర్పించుట వలన, ఆ దేశకాలములకు ఉచితమైన శ్రద్ధ లోపించును. ద్రవ్యములు, భోక్తల యోగ్యత, వారికి చేసే పూజాదికము ఇత్యాదులు కూడ చక్కగా ఉండవు.

**దేశే కాలే చ సంప్రాప్తే మున్యన్నం హరిదైవతమ్ ।**
**శ్రద్ధయా విధివత్పాత్రే న్యస్తం కామధుగక్షయమ్ ।। 5**

దేశే - దేశము, కాలే చ - కాలము కూడ, సంప్రాప్తే - సంప్రాప్తమైనప్పుడు, ముని-అన్నమ్ - అడవిలోని మునులు తినే అన్నము, హరిదైవతమ్ - శ్రీహరికొరకు నివేదించబడినదై, శ్రద్ధయా - శ్రద్ధతో, విధివత్ - యథావిధిగా, పాత్రే - పాత్రయందు, న్యస్తమ్ - సమర్పించబడినదై, కామధుక్ - మనోరథములనీడేర్చునది, అక్షయమ్ - అనంతమగు ఫలము గలది.

యోగ్యమగు దేశమునందు యోగ్యమగు కాలములో అడవి బియ్యముతో వండిన అన్నమునైననూ శ్రీహరికి నివేదించి శ్రద్ధతో యోగ్యుడగు వ్యక్తికి సమర్పించినచో, అది ఆ దాతయొక్క కామనలను ఈడేర్చుటయే గాక, అనంతఫలమగు మోక్షమునకు కూడ దారి తీయును.

**దేవర్షిపితృభూతేభ్య ఆత్మనే స్వజనాయ చ ।**
**అన్నం సంవిభజన్ పశ్యేత్సర్వం తత్పురుషాత్మకమ్ ।। 6**

దేవ-ఋషిపితృభూతేభ్యః - దేవతలు మహర్షులు పితృదేవతలు మరియు ప్రాణుల కొరకు, ఆత్మనే - తన కొరకు, స్వజనాయ చ - తనవారి కొరకు కూడ, అన్నమ్ - ఆహారమును, సంవిభజన్ - చక్కగా పంచి ఇచ్చువాడై, తత్ - ఆ, సర్వమ్ - సర్వమును, పురుష-ఆత్మకమ్ - పరమేశ్వర స్వరూపముగా, పశ్యేత్ - దర్శించవలెను.

సాధకుడు దేవతలకు, మహర్షులకు, పితృదేవతలకు, ఇతరప్రాణులకు, తనకు, తనవారికి కూడ ఆహారమును చక్కగా పంచి ఇస్తూ, వారందరిని పరమేశ్వర స్వరూపులుగా భావన చేయవలెను.

**న దద్యాదామిషం శ్రాద్ధే న చాద్యాద్ధర్మతత్త్వవిత్ ।**
**మున్యన్నైస్స్యాత్పరా ప్రీతిర్యథా న పశుహింసయా ।। 7**

ధర్మతత్త్వవిత్ - ధర్మముయొక్క స్వరూపమునెరింగిన సాధకుడు, శ్రాద్ధే - శ్రాద్ధమునందు, ఆమిషమ్ - మాంసమును, న దద్యాత్ -

సమర్పించరాదు, న చ అద్యాత్ - తినరాదు కూడ, ముని-అన్నైః - మునులు తినే అడవి బియ్యపు ఆహారముచే, యథా - ఏ విధముగా, పరా - సర్వోత్కృష్టమైన, ప్రీతిః - ప్రీతి కలుగునో ఆ విధముగా, పశుహింసయా - పశువులను హింసించుటచే, న - కలుగదు.

ధర్మముయొక్క స్వరూపమునెరింగిన సాధకుడు శ్రాద్ధమునందు మాంసమును వడ్డించరాదు; తాను కూడ తినరాదు. మునులు తినే అడవి బియ్యపు ఆహారమును వడ్డించిననూ, పితృదేవతలకు ఎట్టి మహాప్రీతి కలుగునో, అట్టి ప్రీతి పశువులను హింసించి మాంసమును సమర్పించుట వలన కలుగదు.

నైతాదృశః పరో ధర్మో నృణాం సద్ధర్మమిచ్ఛతామ్ ।
న్యాసో దండస్య భూతేషు మనోవాక్కాయజస్య యః ।। 8

సద్-ధర్మమ్ - పరమేశ్వరరూపమగు ధర్మమును, ఇచ్ఛతామ్ - కోరే, నృణామ్ - మానవులకు, ఏతాదృశః - ఇట్టి, పరః - ఉత్కృష్టమైన, ధర్మః - ధర్మము, న - లేదు, యః - ఏదనగా, భూతేషు - ప్రాణులయందు, మనః-వాక్-కాయజస్య - మనస్సు వాక్కు శరీరములనుండి కలిగే, దండస్య - హింసయొక్క, న్యాసః - పరిత్యాగము.

ధర్మము పరమేశ్వరుని రూపమే. అట్టి ధర్మమును కోరే సాధకులకు, మనోవాక్కాయముల ద్వారా ఇతరప్రాణులకు కలిగే హింసను పరిత్యాగము చేయుట సర్వోత్కృష్టమైన ధర్మము.

ఏకే కర్మమయాన్ యజ్ఞాన్ జ్ఞానినో యజ్ఞవిత్తమాః ।
ఆత్మసంయమనేఽనీహా జుహ్వతి జ్ఞానదీపితే ।। 9

అనీహాః - కామనలు లేని, ఏకే - కొందరు, జ్ఞానినః - వివేకజ్ఞానము గలవారు, యజ్ఞవిత్-తమాః - యజ్ఞస్వరూపము తెలిసినవారిలో అగ్రేసరులు, కర్మమయాన్ - కర్మరూపములోనుండే, యజ్ఞాన్ - యజ్ఞములను, జ్ఞానదీపితే - జ్ఞానముచే ప్రజ్వలితమైన, ఆత్మసంయమనే - మనోనిగ్రహమునందు, జుహ్వతి - హోమము చేయుదురు.

యజ్ఞముయొక్క స్వరూపమును తెలిసినవారిలో అగ్రేసరులగు కొందరు నిత్యానిత్యవస్తువివేకము గలవారై కామనలను పారద్రోలి, కర్మ రూపములోనుండే యజ్ఞములను జ్ఞానముచే ప్రజ్వలితము చేయబడిన మనోనిగ్రహము అనే అగ్నియందు హోమము చేయుదురు. (అనగా బాహ్యకర్మలనుండి విరమించెదరు).

ద్రవ్యయజ్ఞైర్యక్ష్యమాణం దృష్ట్వా భూతాని బిభ్యతి ।
ఏష మాఽకరుణో హన్యాదతజ్ఞో హ్యసుతృబ్ ధ్రువమ్ ॥10

ద్రవ్యయజ్ఞైః - ద్రవ్యములతో చేసే యజ్ఞములతో, యక్ష్యమాణమ్ - ఆరాధించబోవువానిని, దృష్ట్వా - చూచి, భూతాని - ప్రాణులు, బిభ్యతి - భయపడును, అకరుణః - దయ లేనివాడు, అతద్-జ్ఞః - ధర్మస్వరూపము తెలియనివాడు, అసుతృప్ - తన ఇంద్రియములను తృప్తి పరచుకొనువాడు అగు, ఏషః - ఈతడు, ధ్రువమ్ - నిశ్చయముగా, మా - నన్ను, హన్యాత్ - చంపును.

ద్రవ్యములతో చేసే యజ్ఞమునకు పూనుకున్నవానిని చూచి ప్రాణులు ఈ విధముగా భయపడును -- ఈతడు దయలేనివాడు, ధర్మస్వరూపము తెలియనివాడు, తన ఇంద్రియముల తృప్తియే లక్ష్యముగా గలవాడు. ఈతడు నిశ్చయముగా నన్ను చంపును.

తస్మాద్దైవోపపన్నేన మున్యన్నేనాపి ధర్మవిత్ ।
సంతుష్టోఽహరహః కుర్యాన్నిత్యనైమిత్తికీః క్రియాః ॥ 11

తస్మాత్ - అందువలన, ధర్మవిత్ - ధర్మము తెలిసినవాడు, దైవ-ఉపపన్నేన - దైవముచే సంపన్నమైన, ముని-అన్నేన అపి - మునులు తినే హవిస్సుతోనైననూ, సంతుష్టః - సంతోషమును పొందినవాడై, అహః -అహః - ప్రతి దినము, నిత్యనైమిత్తికీః క్రియాః - నిత్యకర్మలను నైమిత్తిక కర్మలను, కుర్యాత్ - చేయవలెను.

కావున, ధర్మరహస్యమునెరింగిన సాధకుడు మునులు తినే హవిస్సుతోనైననూ సంతోషమును పొంది, ప్రతిదినము సంధ్యావందనాది నిత్య

కర్మలను, దానము మొదలగు నైమిత్తిక కర్మలను చేయవలెను. (కామ్యక ర్మల కొరకై హింసను చేయరాదు).

విధర్మః పరధర్మశ్చ ఆభాస ఉపమా ఛలః ।
అధర్మశాఖాః పంచేమా ధర్మజ్ఞోఽధర్మవత్త్యజేత్ ।। 12

విధర్మః - విధర్మము, పరధర్మః చ - పరధర్మము, ఆభాసః - ఆభాస, ఉపమా - ఉపమ, ఛలః - ఛలము అనే, ఇమాః - ఈ, పంచ - అయిదు, అధర్మశాఖాః - అధర్మముయొక్క శాఖలను, ధర్మజ్ఞః - ధర్మము తెలిసినవాడు, అధర్మవత్ - అధర్మమును వలె, త్యజేత్ - విడిచి పెట్టవలెను.

విధర్మము, పరధర్మము, ఆభాస, ఉపమ, ఛలము అనే అయిదు అధర్మము (ముళ్లచెట్టు) యొక్క శాఖలను ధర్మము తెలిసినవాడు అధర్మమును వలె విడిచి పెట్టవలెను.

ధర్మబాధో విధర్మస్స్యాత్పరధర్మోఽన్యచోదితః ।
ఉపధర్మస్తు పాఖండో దంభో వా శబ్దభిచ్ఛలః ।। 13

ధర్మబాధః - ధర్మమునకు లోపము, విధర్మః - విధర్మము, స్యాత్ - అగును, అన్యచోదితః - ఇతరునిచే ఇతరుని కొరకు విధించబడినది, పరధర్మః - పరధర్మము, పాఖండః తు - వేదవిరుద్ధమగు ఆచారము, దంభః వా - దాంబీకము గాని, ఉపధర్మః - ఉపధర్మము (ఉపమ), శబ్దభిత్ - శాస్త్రవచనమును తప్పుగా వ్యాఖ్యానించుట, ఛలః - ఛలము.

ఏ పనిని చేయుటచే తన ధర్మమునకు ముప్పు వాటిల్లునో, అది విధర్మము (వామాచారము మొదలైనవి). అన్యునిచే అన్యుని కొరకు విధించబడినది పరధర్మము (క్రైస్తవము మొదలైనవి). వేదవిరుద్ధమగు ఆచారము (తనను తాను హింసించుకొనుట మొదలైనవి), దాంబీకము ఉపమలు. శాస్త్రవచనమునకు తప్పుగా వ్యాఖ్యానించుట (భేదమే సత్యము ఇత్యాది బోధలు) ఛలము (మోసము).

**యస్త్విచ్ఛయా కృతః పుంభిరాభాసో హ్యాశ్రమాత్పృథక్ ।**
**స్వభావవిహితో ధర్మః కస్య నేష్టః ప్రశాంతయే ॥ 14**

పుంభిః - మానవులచే, ఇచ్ఛయా - తమ ఇచ్ఛచే, ఆశ్రమాత్ - ఆశ్రమముకంటె, పృథక్ - వేరుగా, యః తు - ఏ జీవనవిధానము, కృతః - కల్పించబడినదో అది, ఆభాసః - ఆభాసము, స్వభావవిహితః - స్వభావమునందు విధించబడిన, ధర్మః - ధర్మము, కస్య - ఎవనియొక్క, ప్రశాంతయే - ప్రశాంతి కొరకు, న ఇష్టః - సమర్థము కాదు?

మానవులు నాలుగు ఆశ్రమధర్మములకంటె విరుద్ధముగా తమ ఇచ్ఛవచ్చినట్లుగా కొన్ని ఆచారములను కల్పించుచుందురు. అట్టి కల్పన ధర్మముయొక్క ఆభాసమే గాని, ధర్మము కాదు. మానవుని స్వభావమును బట్టి విధించబడిన ఆశ్రమధర్మము ఎవనికి ప్రశాంతిని కలిగించ సమర్థము కాదు? (అనగా, అందరికి పరమశాంతిని చేగూర్చును).

**ధర్మార్థమపి నేహేత యాత్రార్థం వాఽధనో ధనమ్ ।**
**అనీహానీహమానస్య మహాహేరివ వృత్తిదా ॥ 15**

అధనః - బీదవాడు, ధర్మ-అర్థం అపి - ధర్మము కొరకైననూ, యాత్రా-అర్థం వా - జీవనయాత్ర కొరకు గాని, ధనమ్ - ధనమును, న ఈహేత - కోరరాదు, అనీహమానస్య - కామనలు లేనివానికి, అనీహా - నిష్కామతయే, మహా-అహేః ఇవ - కొండ చిలువకు వలె, వృత్తిదా - జీవికను ఇచ్చునది.

సాధకుడు బీదవాడైననూ ధర్మమును చేయుటకు గాని, జీవనయాత్రకైననూ ధనమును యాచించరాదు. కామనలు లేనివానికి వాని నిష్కామతయే (దానిచే సూచించబడిన దైవమే), కొండ చిలువకు వలె, బ్రదుకుదెరువును కల్పించును (కొండ చిలువ తన వద్దకు నడచి వచ్చిన ప్రాణిని తిని బ్రదుకును).

**సంతుష్టస్య నిరీహస్య స్వాత్మారామస్య యత్సుఖమ్ ।**
**కుతస్తత్కామలోభేన ధావతోఽర్థేహయా దిశః ॥ 16**

సంతుష్టస్య - సంతుష్టి కలిగినట్టియు, నిరీహస్య - కామనలు లేన ట్టియు, స్వ-ఆత్మ-ఆరామస్య - తన స్వరూపమునందే విశ్రాంతిని పొందే సాధకునకు, యత్ - ఏ, సుఖమ్ - సుఖము కలుగునో, కామలోభేన - భోగ వస్తువులయందలి లోభముచే, అర్థ-ఈహయా - ధనమునందలి కోరికతో, దిశః - దిక్కులను, ధావతః - పరుగులెత్తే వానికి, తత్ - ఆ సుఖము, కుతః ఎక్కడిది?

కామనలు లేకుండా సంతుష్టితో తన స్వరూపమునందే విశ్రాంతి ని, ఆనందమును పొందే వివేకికి లభించే ఆనందము -- భోగవస్తువుల యందలి లోభముతో, ధనమునందలి కామనతో దిక్కులలో పరుగులు తీసే వానికి ఎక్కడ లభించును? (లభించదు).

సదా సంతుష్టమనసస్సర్వాస్సుఖమయా దిశః ।
శర్కరాకంటకాదిభ్యో యథోపానత్పదశ్శివమ్ ॥ 17

సదా - అన్ని కాలములలో, సంతుష్టమనసః - సంతుష్టిని చెంది యున్న మనస్సునకు, సర్వాః - అన్ని, దిశః - దిక్కులు, సుఖమయాః - సుఖముతో నిండియుండును, యథా - ఏ విధముగానైతే, ఉపానత్-పదః - చెప్పులు ఉన్న పాదమునకు, శర్కరాకంటక-ఆదిభ్యః - గులకరాళ్లు ముళ్లు మొదలగువాటినుండి, శివమ్ - దుఃఖము కలుగదో.

చెప్పులు ఉన్న పాదమునకు గులకరాళ్లు, ముళ్లు మొదలగువాటి వలన దుఃఖము కలుగదు. అదే విధముగా, అన్ని కాలములలో సంతృప్తిని చెంది ఉండే మనస్సునకు చుట్టూ దిక్కులు అన్నీ సుఖముతో నిండియుం డును.

సంతుష్టః కేన వా రాజన్న వర్తేతాపి వారిణా ।
ఔపస్థ్యజైహ్వ్యకార్పణ్యాద్గృహపాలాయతే జనః ॥ 18

రాజన్ - ఓ రాజా!, సంతుష్టః - సంతృప్తి గలవాడు, వారిణా అపి - నీటితోనైననూ, కేన వా - ఎందుచే, న వర్తేత - జీవించలేడు?, జనః - మానవుడు, ఔపస్థ్యజైహ్వ్యకార్పణ్యాత్ - ఇంద్రియసుఖములయందు

నాలుకయొక్క రుచులయందు లోభము వలన, గృహపాలాయతే - ఇంటిని కాపలా కాసే కుక్క వలె ప్రవర్తించుచున్నాడు.

ఓ రాజా! సంతృప్తి గలవాడు నీటిని త్రాగియైననూ సుఖముగా జీవించగలడు. అట్లు కాకుండుటకు హేతువు ఏమియు లేదు. మానవుడు ఇంద్రియభోగములయందు, జిహ్వాయొక్క చాపల్యమునందు ఉండే లోభము వలన ఇంటి కుక్క వలె ప్రవర్తిల్లును.

**అసంతుష్టస్య విప్రస్య తేజో విద్యా తపో యశః ।**
**స్రవంతీంద్రియలౌల్యేన జ్ఞానం చైవావకీర్యతే ॥ 19**

**అసంతుష్టస్య** - సంతృప్తి లేని, **విప్రస్య** - విప్రునకు, **తేజః** - తేజస్సు, **విద్యా** - విద్య, **తపః** - తపస్సు, **యశః** - కీర్తి, **ఇంద్రియలౌల్యేన** - ఇంద్రియముల చాపల్యముచే, **స్రవంతి** - జారిపోవును, **జ్ఞానం చ** - జ్ఞానము కూడ, **అవకీర్యతే ఏవ** - నిశ్చయముగా తొలగిపోవును.

సంతృప్తి లేని విప్రునకు వర్చస్సు, విద్య, తపస్సు మరియు కీర్తి క్షీణించిపోవును. ఆతని జ్ఞానము కూడ నిశ్చయముగా తొలగిపోవును.

**కామస్యాంతం చ క్షుత్తృడ్భ్యాం క్రోధస్యైతత్ఫలోదయాత్ ।**
**జనో యాతి న లోభస్య జిత్వా భుక్త్వా దిశో భువః ॥ 20**

**క్షుత్-తృడ్భ్యామ్** - ఆకలి దప్పికలతో బాటుగా, **కామస్య** - కోరికకు, **అంతమ్** - అంతము, **క్రోధస్య** - కోపమునకు, **ఏతత్-ఫల-ఉదయాత్** - దీని ఫలము పుట్టుట వలన, **అంతమ్** - అంతము, **జనః** - మానవుడు, **భువః** - భూమియొక్క, **దిశః** - దిక్కులను, **జిత్వా** - జయించి, **భుక్త్వా** - భోగించి, **లోభస్య** - లోభమునకు, **అంతమ్** - అంతమును, **న యాతి** - పొందుట లేదు.

ఆకలి దప్పికలు తీరగానే తినాలనే కోరిక, త్రాగాలనే కోరిక అంతమగును. కోపము కూడ దాని పని పూర్తియై ఫలము ఉదయించగానే అంతమగును. కాని, మానవుడు భూలోకములోని దిక్కులనన్నిటినీ జయించి భోగించినా, వాని లోభము అంతము కాదు.

పండితా బహవో రాజన్ బహుజ్ఞాస్సంశయచ్ఛిదః ।
సదసస్పతయోఽప్యేకే అసంతోషాత్పతంత్యధః ।। 21

రాజన్ - ఓ రాజా!, పండితాః - పండితులు, బహుజ్ఞాః - చాల తెలిసినవారు, సంశయచ్ఛిదః - సందేహములను పోగొట్టువారు, సదసస్పతయః అపి - సభాపతులు కూడ అగు, బహవః - అనేకులు, ఏకే - కొందరు, అసంతోషాత్ - సంతుష్టి లేకపోవుట వలన, అధః - క్రిందకు, పతంతి - పడెదరు.

ఓ మహారాజా! కొందరు పండితులు చాల తెలిసి సందేహములను పోగొడుతూ సభలకు అధ్యక్షులై యుండి కూడ సంతుష్టి లేని కారణముగా అధఃపతితులగుదురు. ఇట్టి వారి సంఖ్య చిన్నది కాదు.

అసంకల్పాజ్జయేత్కామం క్రోధం కామవివర్జనాత్ ।
అర్థానర్థేక్షయా లోభం భయం తత్త్వావమర్శనాత్ ।। 22

కామమ్ - కోరికను, అసంకల్పాత్ - సంకల్పించకుండుట వలన, క్రోధమ్ - కోపమును, కామవివర్జనాత్ - కోరికలను విడిచి పెట్టుట వలన, లోభమ్ - లోభమును, అర్థ-అనర్థ-ఈక్షయా - ధనము ఆపదలనే తెచ్చిపెట్టునని తెలియుట వలన, భయమ్ - భయమును, తత్త్వ-అవమర్శనాత్ - వస్తుస్థితిని పరిశీలించుట వలన, జయేత్ - జయించవలెను.

భోగ్యములను సంకల్పించుట మానివేసినచో, కోరికలపై విజయము లభించును. కోరికలను విడిచి పెట్టినచో, కోపముపై జయము కలుగును. ధనమును ప్రోగుచేసుకుంటూ పోతే మిగిలేది ఆపదయేనని గుర్తించినచో, లోభము దూరమగును. వస్తుస్థితిని జాగ్రత్తగా పరిశీలించినచో, భయహేతువు దూరమై భయము దూరమగును.

ఆన్వీక్షిక్యా శోకమోహౌ దంభం మహదుపాసయా ।
యోగాంతరాయాన్ మౌనేన హింసాం కాయాద్యనీహయా ।। 23

ఆన్వీక్షిక్యా - ఆత్మానాత్మవివేకముచే, శోకమోహౌ - శోకమును వ్యామోహమును, మహద్-ఉపాసయా - మహాత్ములను సేవించుటచే,

దంభమ్ - డాంబీకమును, యోగ-అంతరాయాన్ - సాధనకు కలిగే విఘ్న ములను, మౌనేన - మౌనముచే, హింసామ్ - హింసను, కాయ-ఆది-అనీహయా - దేహము ఇంద్రియములు మొదలగువాటిలో చేష్ట లేకుండుటచే.

ఆత్మానాత్మవివేకముచే శోకమును వ్యామోహమును జయించవలెను. మహాత్ములను సేవించినచో డాంబీకము తొలగిపోవును. నలుగురు కలిసి కబుర్లాడుచున్నచో, సాధనకు విఘ్నము కలుగును. ఇట్టి విఘ్నములను మౌనముచే జయించవలెను. దేహమును, ఇంద్రియములను నిశ్చేష్టగా ఉంచినచో, హింసపై విజయము లభించును.

కృపయా భూతజం దుఃఖం దైవం జహ్యాత్సమాధినా ।
ఆత్మజం యోగవీర్యేణ నిద్రాం సత్త్వనిషేవయా ॥ 24

భూతజమ్ - ప్రాణుల వలన కలిగే, దుఃఖమ్ - దుఃఖమును, కృపయా - దయతో, దైవమ్ - ప్రారబ్ధమును బట్టి వచ్చే దుఃఖమును, సమాధినా - ఆత్మనిష్ఠచే, ఆత్మజమ్ - దేహమునుండి పుట్టే దుఃఖమును, యోగవీర్యేణ - యోగాభ్యాస బలముచే, నిద్రామ్ - నిద్రను, సత్త్వనిషేవయా - సత్త్వగుణమును వర్ధిల్లజేసే విషయములను సేవించుటచే.

ఇతరప్రాణుల వలన దుఃఖము కలిగినచో, దుఃఖమును కలిగించిన ఆ ప్రాణుల పైననే దయను చూపినచో, ఆ దుఃఖమును జయించవచ్చును. ప్రారబ్ధవశముగా వచ్చే దుఃఖమును ఆత్మనిష్ఠ (అంతర్ముఖత్వము) చే జయించవలెను. దేహములో వ్యాధులు మొదలగువాటి వలన కలిగే దుఃఖమును యోగాభ్యాస బలముచే దూరము చేసుకొనవలెను. సత్త్వగుణమును పెంపొందించే ఆహారము మొదలగువాటిని సేవించినచో, అధికనిద్ర దూరమగును.

రజస్తమశ్చ సత్త్వేన సత్త్వం చోపశమేన చ ।
ఏతత్సర్వం గురౌ భక్త్యా పురుషో హ్యంజసా జయేత్ ॥ 25

పురుషః - మానవుడు, రజః - రజోగుణమును, తమః చ - తమోగుణమును కూడ, సత్త్వేన - సత్త్వగుణముచే, సత్త్వం చ - సత్త్వగుణము

ను కూడ, ఉపశమేన చ - ఉపరతి (కామ్యకర్మపరిత్యాగము) చే, ఏతత్ - ఈ, సర్వమ్ - సర్వమును, గురౌ - గురువుయందలి, భక్త్యా - భక్తిచే, అంజసా - తేలికగా, జయేత్ హి - నిశ్చయముగా జయించవలెను.

మానవుడు రజోగుణము (భోగపరాయణత్వము) ను, తమోగుణము (సోమరితనము) ను సత్త్వగుణము (వైరాగ్యము, జ్ఞానమునందలి ప్రీతి) చే జయించవలెను. సాధకుడు సత్త్వగుణమును కూడ ఉపశమము (శాంతమైన మనస్సు) చే జయించవలెను. ఈ దోషములనన్నింటినీ మానవుడు గురువునందలి భక్తిచే తేలికగా నిశ్చయముగా జయించవచ్చును.

యస్య సాక్షాద్భగవతి జ్ఞానదీపప్రదే గురౌ ।
మర్త్యాసద్ధీశ్శ్రుతం తస్య సర్వం కుంజరశౌచవత్ ।। 26

సాక్షాత్ - సాక్షాత్తుగా, భగవతి - భగవానుడైనట్టియు, జ్ఞానదీపప్రదే - జ్ఞానము అనే దీపమును ఇచ్చిన, గురౌ - గురువునందు, యస్య - ఎవనికైతే, మర్త్య-అసద్-ధీః - మానవుడే అనే తప్పుడు ధారణ ఉండునో, తస్య - వానికి, శ్రుతమ్ - శ్రవణము చేసినది, సర్వమ్ - సర్వము, కుంజర శౌచవత్ - ఏనుగు స్నానము వంటిది.

జ్ఞానమనే దీపమును అనుగ్రహించిన గురువు సాక్షాత్తుగా భగవానుడే. అట్టి గురువునందు ఎవనికైతే, ఈయన మామూలు మనిషే అనే ధారణ ఉండునో, వానికి చేసిన శాస్త్రశ్రవణమంతా ఏనుగు చేసిన స్నానము వలె వ్యర్థము (ఏనుగు స్నానము చేసి బూడిదను చల్లుకొనును).

ఏష వై భగవాన్ సాక్షాత్ప్రధానపురుషేశ్వరః ।
యోగేశ్వరైర్విమృగ్యాంఘ్రిర్లోకో యం మన్యతే నరమ్ ।।27

ఏషః - ఈ శ్రీకృష్ణుడు, సాక్షాత్ - సాక్షాత్తుగా, ప్రధానపురుష-ఈశ్వరః - ప్రకృతికి జీవులకు ప్రభుడగు, భగవాన్ - భగవానుడే, వై - నిశ్చయము, యోగ-ఈశ్వరైః - యోగిపుంగవులచే, విమృగ్య-అంఘ్రిః - అధికముగా అన్వేషించబడే పాదములు గలవాడు, లోకః వై - లోకమైతే, యమ్ - ఎవ్వానిని, నరమ్ - మానవునిగా, మన్యతే - తలపోయుచున్నదో.

ఈ శ్రీకృష్ణుడు సాక్షాత్తుగా ప్రకృతికి, జీవులకు ప్రభుడగు భగవానుడే. ఇది నిశ్చయము. యోగిపుంగవులు ఈయన పాదములను తమ హృదయములో ధ్యానించెదరు. కాని లోకము ఈయన సామాన్యమానవుడని తలపోయును. అదే విధముగా, గురువు కూడ భగవానుడే.

షడ్వర్గసంయమైకాంతాస్సర్వా నియమచోదనాః ।
తదంతా యది నో యోగానావహేయుశ్శ్రమావహాః ।। 28

సర్వాః - అన్ని, నియమచోదనాః - నియమములను బోధించే విధులు, షడ్-వర్గసంయమ-ఏకాంతాః - ఆరింటి సముదాయముయొక్క వశీకరణమునందు మాత్రమే పర్యవసానమును చెందునవి, తద్-అంతాః - ఆ షడ్వర్గజయమే పరమలక్ష్యముగా గల సాధకులు, యోగాన్ - భగవానుని ధారణ ధ్యానము సమాధులను, యది నో ఆవహేయుః - సాధించలేకపోయినచో, శ్రమ-ఆవహాః - శ్రమను మాత్రమే కలిగించునవి.

శాస్త్రములో బోధించబడిన నియమములన్నింటికీ పరమప్రయోజనము కామక్రోధలోభమోహమదమాత్సర్యములనే ఆరు శత్రువుల వర్గమును (అయిదు జ్ఞానేంద్రియములను, మనస్సును) వశము చేసుకొనుటయే. ఇట్లు వశము చేసుకున్న తరువాత కూడ ఆ నియమములు భగవానుని ధారణను, ధ్యానమును, సమాధిని ఈయలేకపోయినచో, అవి కేవలము నిష్ఫలమగు శ్రమను మిగిల్చేవి మాత్రమే.

యథా వార్తాదయో హ్యర్థా యోగస్యార్థం న బిభ్రతి ।
అనర్థాయ భవేయుస్తే పూర్తమిష్టం తథాऽసతః ।। 29

యథా - ఏ విధముగానైతే, వార్తా-ఆదయః - వ్యవసాయము మొదలైనవి, అర్థాః - వాటి ఫలములు, యోగస్య - యోగముయొక్క, అర్థమ్ - ఫలమగు మోక్షమును, న బిభ్రతి - సాధించవో, తే - అవి, అనర్థాయ - సంసారము కొరకే, భవేయుః - అగునో, తథా - అదే విధముగా, అసతః - దుష్టునియొక్క, పూర్తమ్ - పూర్తము, ఇష్టమ్ - ఇష్టము.

మానవుడు వ్యవసాయము మొదలగువాటిని చేసి వాటి ఫలములు పొందుచుండును. ఈ కర్మలు, వాటి ఫలములు వ్యక్తికి సంసారము కొనసాగుటకు మాత్రమే పనికి వచ్చునే గాని, మోక్షమును సంపాదించి పెట్టలేవు. అదే విధముగా, దుర్బుద్ధి గలవాడు చేసే పూర్తకర్మలు (ప్రజలకు ఉపయోగించే చెరువులను త్రవ్వించుట మొదలగు పనులు), ఇష్టకర్మలు (యజ్ఞములను చేయుట) కూడ సంసారమును కొనసాగించునే గాని, మోక్షమునకు దారి తీయవు.

యశ్చిత్తవిజయే యత్తస్స్యాన్నిస్సంగోఽపరిగ్రహః ।
ఏకో వివిక్తశరణో భిక్షుర్భిక్షామితాశనః ॥ 30

యః - ఎవడైతే, చిత్తవిజయే - చిత్తమును జయించుటయందు, యత్తః - ఉద్యుక్తుడై, స్యాత్ - అగునో అతడు, నిస్సంగః - సంగము లేనివాడు, అపరిగ్రహః - పరిగ్రహము లేనివాడు, ఏకః - ఏకాంతమునందుండువాడు, వివిక్తశరణః - పవిత్రమగు స్థానమునందుండువాడు, భిక్షుః - భిక్షుకుడు, భిక్షామిత-అశనః - భిక్షాన్నమును మితముగా భుజించువాడు.

ఎవడైతే చిత్తమును జయించుటకు పూనుకొనునో, అతడు సంగమును పరిగ్రహము (భోగవస్తువులను ప్రోగుచేయుట) ను విడిచిపెట్టవలెను. పవిత్రమగు స్థానమునందు ఏకాంతముగా నుండవలెను. భిక్షుకుడై భిక్షాన్నమును కూడ మితముగా భుజించవలెను.

దేశే శుచౌ సమే రాజన్ సంస్థాప్యాసనమాత్మనః ।
స్థిరం సమం సుఖం తస్మిన్నాసీతర్జ్వంగ ఓమితి ॥ 31

అంగ - ఓయీ!, రాజన్ - ఓ మహారాజా!, శుచౌ - స్వచ్ఛమైనట్టియు, సమే - సమతలమైన, దేశే - స్థానమునందు, ఆత్మనః - తన, ఆసనమ్ - ఆసనమును, సంస్థాప్య - చక్కగా వేసుకొని, తస్మిన్ - దానిపై, స్థిరమ్ - స్థిరముగా, సమమ్ - సమముగా, సుఖమ్ - సుఖముగా, ఋజు-అంగః - నిటారైన అవయవములు గలవాడై, ఓమ్ ఇతి - ఓమ్ అంటూ, ఆసీత - కూర్చుండవలెను.

ఓయీ మహారాజా! సాధకుడు స్వచ్ఛమైన సమతలస్థానము నందు తన ఆసనమును చక్కగా వేసుకొని, దానిపై స్థిరముగా సమముగా సుఖముగా నిటారైన అవయవములు గలవాడై కూర్చుండి ఓంకారమును జపించవలెను.

ప్రాణాపానౌ సన్నిరుంధ్యాత్పూరకుంభకరేచకైః ।
యావన్మనస్త్యజేత్కామాన్ స్వనాసాగ్రనిరీక్షణః ॥ 32

**యావత్** - ఎంతవరకైతే, మనః - మనస్సు, కామాన్ - కోరికలను, **త్యజేత్** - విడిచిపెట్టునో అంతవరకు, స్వనాసా-అగ్రనిరీక్షణః - తన ముక్కు కొనను చూచువాడై, పూరకుంభకరేచకైః - గాలిని పీల్చుట నిలిపి యుంచుట విడిచిపెట్టుటలచే, ప్రాణ-అపానౌ - ఉచ్ఛ్వాసనిశ్శ్వాసలను, సన్నిరుంధ్యాత్ - చక్కగా నియంత్రించవలెను.

మనస్సు కామనలను (సంకల్పములను) విడిచిపెట్టేటంతవరకు సాధకుడు తన ముక్కు కొనపై ధ్యాసను ఉంచి, పూరక కుంభక రేచకము లనే ప్రాణాయామమును చేయవలెను. గాలిని నిండా పీల్చుట పూరకము. పూర్తిగా విడిచిపెట్టుట రేచకము. గాలిని లోపల, బయట నిలిపి యుంచుట కుంభకము.

**యతో యతో నిస్సరతి మనః కామహతం భ్రమత్ ।**
**తతస్తత ఉపాహృత్య హృది రుంధ్యాచ్ఛనైర్బుధః ॥ 33**

**కామహతమ్** - కామనలచే చెడగొట్టబడినదై, **భ్రమత్** - పరిభ్రమించే, **మనః** - మనస్సు, **యతః యతః** - ఎక్కడెక్కడికి, నిస్సరతి - బయటకు పారిపోవునో, **తతః తతః** - అక్కడక్కడనుండి, బుధః - వివేకి, శనైః - మెల్లగా, **ఉపాహృత్య** - వెనుకకు మరల్చి, హృది - హృదయమునందు, **నిరుంధ్యాత్** - గట్టిగా నిలుపవలెను.

కామనలచే చెడగొట్టబడి పరిభ్రమిస్తూ ఉండే మనస్సు ఎక్కడెక్కడికి పరుగులెత్తునో, అక్కడక్కడనుండి దానిని మెల్లమెల్లగా వెనుకకు

మరల్చి (అనగా ఇంద్రియవ్యాపారములను ఉపసంహరించి), హృదయము నందు స్థిరముగా నిలుపవలెను.

ఏవమభ్యసతశ్చిత్తం కాలేనాల్పీయసా యతేః ।
అనిశం తస్య నిర్వాణం యాత్యనింధనవహ్నివత్ ॥ 34

ఏవమ్ - ఈ విధముగా, అనిశమ్ - నిరంతరముగా, అభ్యసతః - అభ్యాసము చేసే, తస్య - ఆ, యతేః - ప్రయత్నశీలియొక్క, చిత్తమ్ - చిత్తము, అల్పీయసా - తక్కువ, కాలేన - కాలముచే, అనింధనవహ్నివత్ - ఇంధనము లేని నిప్పు వలె, నిర్వాణమ్ - ఉపశమమును, యాతి - పొందును.

ఈ విధముగా నిరంతరముగా అభ్యాసము చేసే ప్రయత్నశీలి యగు అట్టి సాధకుని చిత్తము, ఇంధనము లేని నిప్పు వలె, తక్కువ కాలములోనే ఉపశమమును పొందును.

కామాదిభిరనావిద్ధం ప్రశాంతాఖిలవృత్తి యత్ ।
చిత్తం బ్రహ్మసుఖస్పృష్టం నైవోత్తిష్ఠేత కర్హిచిత్ ॥ 35

యత్ - ఏ, చిత్తమ్ - చిత్తము, కామ-ఆదిభిః - కామక్రోధములు మొదలగువాటిచే, అనావిద్ధమ్ - క్షోభింప జేయబడనిదో, ప్రశాంత-అఖిల వృత్తి - ఉపశమించిన సకలవృత్తులు గలదియో అది, బ్రహ్మసుఖస్పృష్టమ్ - బ్రహ్మానందముచే స్పృశించబడినదై, కర్హిచిత్ - ఏ కాలమునందైననూ, న ఏవ ఉత్తిష్ఠేత - బహిర్ముఖము కానే కాదు.

ఎప్పుడైతే సాధకుని చిత్తము కామక్రోధాదుల సంక్షోభములో పడ కుండా సకలవృత్తులు ఉపశమించి యుండునో, అప్పుడు ఆ చిత్తము బ్రహ్మానందముయొక్క సంస్పర్శను పొంది, మరల ఎన్నటికీ బహిర్ముఖము కాబోదు.

యః ప్రవ్రజ్య గృహాత్పూర్వం త్రివర్గావపనాత్పునః ।
యది సేవేత తాన్ భిక్షుస్స వై వాంతాశ్యపత్రపః ॥ 36

యః - ఎవడైతే, పూర్వమ్ - ముందుగా, త్రివర్గ-ఆవపనాత్ - ధర్మార్థకామములకు మూలమైన, గృహాత్ - గృహాశ్రమమునుండి, ప్రవ్రజ్య - సన్న్యసించినాడో, సః - అట్టి, భిక్షుః - భిక్షువు, తాన్ - వాటిని, యది సేవేత - సేవించినచో, అపత్రపః - తొలగిన సిగ్గు గల, సః - ఆతడు, వై - నిశ్చయముగా, వాంతాశీ - వమనమును భక్షించువాడు.

గృహాశ్రమము ధర్మార్థకామములకు మూలము. దానిని ఎవడైతే ముందుగా విడిచి సన్న్యసించునో, అట్టి భిక్షువు సిగ్గు విడిచి అవే ధర్మార్థకామములను సేవించే పక్షములో, ఆతడు నిశ్చయముగా వమనమును భక్షించువాడు అగును.

యైస్స్వదేహస్స్మృతో నాత్మా మర్త్యో విట్క్రిమిభస్మసాత్ ।
త ఏనమాత్మసాత్కృత్వా శ్లాఘయంతి హ్యసత్తమాః ॥ 37

యైః - ఎవరిచేనైతే, దేహః - దేహము, న-ఆత్మా - అనాత్మయనియు, మర్త్యః - మరణించే స్వభావము గలది అనియు, విట్-క్రిమిభస్మసాత్ - మాలిన్యము క్రిములు బూడిద అయ్యేది అని, స్మృతః - చింతించబడినదో, అసత్-తమాః - మిక్కిలి దుష్టులగు, తే - వారు, ఏనమ్ - ఈ దేహమును, ఆత్మసాత్ - ఆత్మరూపముగా, కృత్వా - స్వీకరించి, శ్లాఘయంతి హి - ప్రశంసించుచుందురు గదా!

కొందరు పరమదుష్టులు ముందుగా ఈ దేహము అనాత్మ, మరణించే స్వభావము గలది, మాలిన్యము గాని క్రిములు గాని బూడిద గాని అయ్యేది అని చింతించి, తరువాత వారే మరల ఆ దేహమును ఆత్మరూపముగా స్వీకరించి ప్రశంసించెదరు.

గృహస్థస్య క్రియాత్యాగో వ్రతత్యాగో వటోరపి ।
తపస్వినో గ్రామసేవా భిక్షోరింద్రియలోలతా ॥ 38

ఆశ్రమాపసదా హ్యేతే ఖల్వాశ్రమవిడంబకాః ।
దేవమాయావిమూఢాంస్తానుపేక్షేతానుకంపయా ॥ 39

గృహస్థస్య - గృహస్థునకు, క్రియాత్యాగః - కర్మలను విడిచిపెట్టుట, వటోః - బ్రహ్మచారికి, వ్రతత్యాగః అపి - బ్రహ్మచర్యవ్రతమును విడిచిపెట్టుట, తపస్వినః - వానప్రస్థునకు, గ్రామసేవా - భోగములను సేవించుట, భిక్షోః - సన్న్యాసికి, ఇంద్రియలోలతా - ఇంద్రియ చాంచల్యము, ఏతే - వీరు, హి - నిశ్చయముగా, ఆశ్రమ-అపసదాః - ఆశ్రమస్థులలో అధములు, ఆశ్రమవిడంబకాః ఖలు - కేవలము ఆశ్రమస్థులను అనుకరించేవారు, దేవమాయావిమూఢాన్ - ఈశ్వరుని మాయచే వ్యామోహమును పొందియున్న, తాన్ - వారలను, అనుకంపయా - దయతో, ఉపేక్షేత - ఉపేక్షించవలెను.

బ్రహ్మచర్యవ్రతమును విడిచిపెట్టిన బ్రహ్మచారి, నిత్యకర్మలను విడిచిపెట్టిన గృహస్థుడు, తపస్సును విడిచిపెట్టి ఇంద్రియభోగములను సేవించే వానప్రస్థుడు, ఇంద్రియభోగముల ఆకర్షణకు వశుడయ్యే సన్న్యాసి -- వీరు ఆయా ఆశ్రమస్థులలో అధములు. వీరు కేవలము ఆశ్రమస్థులను అనుకరించువారు మాత్రమే (ఆశ్రమస్థుల పవిత్రత వీరిలో ఉండదు). వీరు ఈశ్వరుని మాయలో పడి వ్యామోహితులై యున్నారు. వీరియందు దయను మాత్రమే చూపవలెను. కాని, వీరిని ఉపేక్షించవలెను (అనగా, వీరితోడి సంగము తగదు).

ఆత్మానం చేద్విజానీయాత్పరం జ్ఞానధుతాశయః ।
కిమిచ్ఛన్ కస్య వా హేతోర్దేహం పుష్ణాతి లంపటః ॥ 40

జ్ఞానధుత-ఆశయః - జ్ఞానముచే శోధితమైన అంతఃకరణము గలవాడు, ఆత్మానమ్ - తనను, పరమ్ - పరబ్రహ్మనుగా, విజానీయాత్ చేత్ - తెలుసుకున్నచో, లంపటః - ఇంద్రియలోలుడై, కిమ్ - దేనిని, ఇచ్ఛన్ - కోరువాడై, కస్య వా - ఎవ్వాని, హేతోః - కారణముగా, దేహమ్ - దేహమును, పుష్ణాతి - పోషించును?

వివేకజ్ఞానముచే శోధితమైన అంతఃకరణము గల వ్యక్తి తన స్వరూపము పరబ్రహ్మ (పూర్ణము) అని తెలుసుకొనును. అట్టి జ్ఞానియందు

భోక్తృత్వము ఉండదు. ఆ జ్ఞాని మరల ఇంద్రియలోలుడై దేనిని కోరి ఏ భోక్తను తృప్తి పరచుటకై దేహమును పోషించును?

ఆహుశ్శరీరం రథమింద్రియాణి
హయానభీషూన్ మన ఇంద్రియేశమ్ ।
వర్త్మాని మాత్రా ధిషణాం చ సూతం
సత్త్వం బృహద్బంధురమీశసృష్టమ్ ॥ 41

ఈశసృష్టమ్ - ఈశ్వరునిచే సృష్టించబడిన, శరీరమ్ - శరీరమును, రథమ్ - రథమునుగా, ఇంద్రియాణి - ఇంద్రియములను, హయాన్ - గుర్రములనుగా, ఇంద్రియ-ఈశమ్ - ఇంద్రియములకు ప్రభువగు, మనః - మనస్సును, అభీషూన్ - కళ్లెపు త్రాళ్లనుగా, మాత్రాః - తన్మాత్రలను, వర్త్మాని - మార్గములనుగా, ధిషణాం చ - బుద్ధిని కూడ, సూతమ్ - సారథినిగా, సత్త్వమ్ - అంతఃకరణమును, బృహత్ - పెద్ద, బంధురమ్ - బంధనమునుగా, ఆహుః - చెప్పెదరు.

ఈశ్వరునిచే సృష్టించబడిన దేహము రథమనియు, ఇంద్రియములే గుర్రములనియు, ఇంద్రియములకు ప్రభువగు మనస్సే కళ్లెమనియు, శబ్దస్పర్శరూపరసగంధములు ఇంద్రియములనే గుర్రములు నడిచే మార్గములనియు, బుద్ధియే సారథి అనియు, అంతఃకరణమే పెద్ద కట్టుత్రాడు అనియు మహాత్ములు చెప్పెదరు.

అక్షం దశప్రాణమధర్మధర్మౌ చక్రేఽభిమానం రథినం చ జీవమ్,
ధనుర్హి తస్య ప్రణవం పఠంతి శరం తు జీవం పరమేవ లక్ష్యమ్।42

దశప్రాణమ్ - పది ప్రాణముల సముదాయమును, అక్షమ్ - ఇరుసునుగా, అధర్మధర్మౌ - ధర్మాధర్మములను, చక్రే - చక్రములునుగా, అభిమానమ్ - దేహాదులయందు నేను-నాది అనే అభిమానము గల, జీవం తు - జీవునియైతే, రథినమ్ - రథ స్వామినిగా, ప్రణవమ్ - ఓంకారమును, తస్య - ఆ జీవునకు, ధనుః హి - ధనుస్సునుగా, జీవం తు - జీవునియైతే, శరమ్ - బాణమునుగా, పరం ఏవ - పరబ్రహ్మనే, లక్ష్యమ్ - లక్ష్యమునుగా, పఠంతి - చెప్పెదరు.

ప్రాణ (శ్వాసక్రియ)-అపాన (విసర్జనక్రియ)-వ్యాన (బలవత్కర్మకు మూలము)-ఉదాన (వమనము ఇత్యాది ఊర్ధ్వగతికి ఆధారము)-సమాన ము (ఆహారము జీర్ణమగుట, రక్తప్రసారములకు ఆధారము)లు, నాగ (త్రే న్పును కలిగించునది)-కూర్మ (కన్నులను తెరుచుటకు ఆధారము)-కృకల (ఆకలిని కలిగించునది)-దేవదత్త (ఆవులించుటకు ఆధారము)-ధనంజయ ము (దేహమునకు పుష్టినిచ్చునది) లు అనే పది ప్రాణవృత్తుల సముదా యమే దేహము అనే రథమునకు ఇరుసు; ధర్మాధర్మములే చక్రములు; దేహాదులయందు నేను-నాది అనే అభిమానము గల జీవుడే రథస్వామి; ఓంకారమే ఆ జీవుని ధనుస్సు; జీవుడే బాణము; పరబ్రహ్మయే లక్ష్యము అని మహాత్ములు చెప్పెదరు.

రాగో ద్వేషశ్చ లోభశ్చ శోకమోహౌ భయం మదః ।
మానోఽవమానోఽసూయా చ మాయా హింసా చ మత్సరః ।। 43

రజః ప్రమాదః క్షున్నిద్రా శత్రవస్త్వేవమాదయః ।
రజస్తమఃప్రకృతయస్సత్త్వప్రకృతయః క్వచిత్ ।। 44

రాగః - రాగము, ద్వేషః చ - ద్వేషము, లోభః చ - లోభము, శోకమోహౌ - శోకము మోహము, భయమ్ - భయము, మదః - గర్వము, మానః - అభిమానము, అవమానః - అవమానము, అసూయా చ - అసూయ, మాయా - మోసము, హింసా చ - హింస, మత్సరః - మాత్స ర్యము, రజః - దురాగ్రహము, ప్రమాదః - మరుపు, క్షుత్ - ఆకలి, నిద్రా - నిద్ర, ఏవం-ఆదయః - ఇటువంటి, శత్రవః - శత్రువులు, రజః-తమఃప్రకృ తయః - రజోగుణము తమోగుణము ప్రధానముగా గలవి, క్వచిత్ - అక్క డక్కడ, సత్త్వప్రకృతయః - సత్త్వగుణము ప్రధానముగా గలవి.

రాగము, ద్వేషము, లోభము, శోకము, మోహము, భయము, గర్వము, అభిమానము, అవమానము, ఇతరుల గుణములలో దోషమును చూచుట, మోసము, హింస, ఇతరుల అభివృద్ధి యెడల ఓర్వలేని దనము, దురాగ్రహము, మరుపు, ఆకలి, నిద్ర మొదలగునవి సాధకుని శత్రువులు. వీటిలో కొన్ని రజోగుణ తమోగుణ ప్రధానములు కాగా, అప్పుడప్పుడు

కొన్ని (ఆసక్తిగా మారిన ప్రేమ మొదలైనవి) సత్త్వగుణప్రధానములుగా కూడ ఉండును.

యావన్నృకాయరథమాత్మవశోపకల్పం
ధత్తే గరిష్ఠచరణార్చనయా నిశాతమ్ ।
జ్ఞానాసిమచ్యుతబలో దధదస్తశత్రుః
స్వారాజ్యతుష్ట ఉపశాంత ఇదం విజహ్యాత్ ।। 45

ఆత్మవశ-ఉపకల్పమ్ - తన వశములోనుండే పరికరములు గల, నృకాయరథమ్ - మానవదేహము అనే రథమును, యావత్ - ఎంతవరకైతే, ధత్తే - కలిగియుండునో అంతవరకు, గరిష్ఠచరణ-అర్చనయా - మహాత్ముల పాదములను పూజించుటచే, నిశాతమ్ - పదును పెట్టబడిన, జ్ఞాన -అసిమ్ - జ్ఞానమనే కత్తిని, దధత్ - ధరించినవాడు, అచ్యుతబలః - అచ్యుతుడే బలముగా గలవాడు, అస్తశత్రుః - అస్తమించిన అంతశ్శత్రువులు గలవాడు, స్వారాజ్యతుష్టః - తన స్వరూపభూతమైన ఆనందముచే సంతుష్టిని చెందినవాడు, ఉపశాంతః - ఉపశమించిన చిత్తము గలవాడు అగు సాధకుడు, ఇదమ్ - దీనిని, విజహ్యాత్ - విడిచి పెట్టవలెను.

సాధకుడు ఇంద్రియములనే పరికరములతో గూడియున్న ఈ మానవదేహము అనే రథము ఎంతవరకైతే తన వశములో నుండునో, అంతవరకు మహాత్ముల చరణములను సేవించి అచ్యుతుడే బలముగా గలవాడై, వివేకజ్ఞానమనే కత్తికి పదును పెట్టి దానితో అంతశ్శత్రువులను జయించవలెను. అతడు తన స్వరూపభూతమైన ఆనందమును పొంది సంతుష్టుడై కామనలు చల్లారిన చిత్తము గలవాడై ఈ దేహమును విడిచి పెట్ట (ఉపేక్షించ) వలెను.

నో చేత్ప్రమత్తమసదింద్రియవాజిసూతా
నీత్వోత్పథం విషయదస్యుషు నిక్షిపంతి ।
తే దస్యవస్సహయసూతమముం తమోఽంధే
సంసారకూప ఉరుమృత్యుభయే క్షిపంతి ।। 46

నో చేత్ - అట్లు గానిచో, ప్రమత్తమ్ - ఆదమరచియున్న వానిని, అసద్-ఇంద్రియవాజిసూతాః - దుష్టములైన ఇంద్రియములనే గుర్రములు సూతుడు, ఉత్-పథమ్ - తప్పు దారిని, నీత్వా - తీసుకుపోయి, విషయద స్యుషు - విషయభోగములనే దారి దోపిడీగాండ్రయందు, నిక్షిపంతి - పార వేసెదరు, తే - ఆ, దస్యవః - దారి దోపిడీగాండ్రు, సహయసూతమ్ - గుర్రములతో సూతునితో గూడియున్న, అముమ్ - వీనిని, తమః-అంధే - అజ్ఞానము అనే చీకటితో నిండినట్టియు, ఉరుమృత్యుభయే - అధికమగు మృత్యుభయము గల, సంసారకూపే - సంసారమనే నూతియందు, క్షిపంతి - పారవేయుదురు.

సాధకుడు ఆదమరచియున్న పక్షములో, దుష్టములైన ఇంద్రియ ములనే గుర్రములు మరియు బుద్ధి అనే సారథి కలిసి ఆ వ్యక్తిని (దేహము అనే రథమును) తప్పు దారిలో నడిపించి విషయభోగములనే దారిదోపిడీ గాండ్రవద్ద పారవేయును. అపుడా భోగములనే దారి దోపిడీగాండ్రు గుర్ర ములతో మరియు సూతునితో సహా ఈ రథయజమాని (వ్యక్తి) ని సంసార మనే నూతిలో పారద్రోయుదురు. అజ్ఞానము అనే చీకటితో నిండియున్న ఆ నూతియందు మరణభయము అధికముగా నుండును.

ప్రవృత్తం చ నివృత్తం చ ద్వివిధం కర్మ వైదికమ్ ।
ఆవర్తేత ప్రవృత్తేన నివృత్తేనాఽశ్నుతేఽమృతమ్ ॥ 47

వైదికమ్ - వేదవిహితమైన, కర్మ - కర్మ, ప్రవృత్తం చ - ప్రవృత్తి రూపము, నివృత్తం చ - నివృత్తి రూపము అని, ద్వివిధమ్ - రెండు విధ ములుగా నున్నది, ప్రవృత్తేన - ప్రవృత్తి రూపమునందలి కర్మచే, ఆవర్తేత - సంసారములో తిరుగాడును, నివృత్తేన - నివృత్తి రూపమగు కర్మచే, అమృ తమ్ - అమృతత్వమును, అశ్నుతే - పొందును.

వేదవిహితమగు కర్మ రెండు రకములుగా నున్నది. కామనల పరి పూర్తి కొరకై చేసేది ప్రవృత్తి రూపమగు కర్మ. దాని వలన వ్యక్తి సంసార ములో పరిభ్రమించుచుండును. కామనలను విడనాడి ఆత్మనిష్ఠులై

యుండుట నివృత్తి రూపమగు ధర్మము. దాని వలన సాధకుడు మోక్షము (అమరణ భావము) ను పొందును.

హింస్రం ద్రవ్యమయం కామ్యమగ్నిహోత్రాద్యశాంతిదమ్ ।
దర్శశ్చ పూర్ణమాసశ్చ చాతుర్మాస్యం పశుస్సుతః ।। 48

ఏతదిష్టం ప్రవృత్తాఖ్యం హుతం ప్రహుతమేవ చ ।
పూర్తం సురాలయారామకూపాజీవ్యాదిలక్షణమ్ ।। 49

హింస్రమ్ - హింసతో కూడినది, ద్రవ్యమయమ్ - ద్రవ్యబాహుళ్యము గలది, కామ్యమ్ - కామనచే ప్రేరితమైనది అగు, అగ్నిహోత్ర-ఆది - అగ్నిహోత్రము మొదలగు కర్మ, అశాంతిదమ్ - అశాంతిని ఇచ్చునది, దర్శః చ - దర్శ, పూర్ణమాసః చ - పూర్ణమాస, చాతుర్మాస్యమ్ - చాతుర్మాస్యము, పశుః - పశుయాగము, సుతః - సోమయాగము, ఏతత్ - ఈ కర్మ, ఇష్టమ్ - ఇష్టము, హుతమ్ - వైశ్వదేవము, ప్రహుతం ఏవ చ - ప్రాణులకు ఆహారమునిచ్చుట కూడ, సుర-ఆలయ-ఆరామకూప-ఆజీవ్య-ఆదిలక్షణమ్ - దేవాలయము విశ్రాంతిగృహము బావులు చలివేంద్రము మొదలగునది, పూర్తమ్ - పూర్తము, ప్రవృత్త-ఆఖ్యమ్ - ప్రవృత్తి అనే పేరు గలది.

ప్రవృత్తి అనబడే కర్మ ఇష్టము, పూర్తము అని రెండు రకములు. అగ్నిహోత్రము (వైదికుడు ప్రతిదినము చేసే హోమము), దర్శ (అమావాస్యనాడు చేసే ఇష్టి), పూర్ణమాస (పూర్ణిమనాడు చేసే ఇష్టి), చాతుర్మాస్యము, పశుయాగము, సోమయాగము (ఇవి విస్తారమైన యాగములు) మొదలగునవి ఇష్టము. ఈ కర్మలు హింసతో కూడినవి. వీటిలో ద్రవ్యబాహుళ్యము అధికము. కామనచే ప్రేరితములైన ఈ కర్మలు అశాంతిని కలిగించును. దేవాలయము, విశ్రాంతిగృహము, బావి, చలివేంద్రము, అన్నసత్రము మొదలగువాటిని నిర్మించుట పూర్తకర్మ అనబడును.

ద్రవ్యసూక్ష్మవిపాకశ్చ ధూమో రాత్రిరపక్షయః ।
అయనం దక్షిణం సోమో దర్శ ఓషధివీరుధః ।। 50

అన్నం రేత ఇతి క్ష్మేశ పితృయానం పునర్భవః ।
ఏకైకశ్యేనానుపూర్వం భూత్వా భూత్వేహ జాయతే ॥ 51
నిషేకాదిశ్మశానాంతైస్సంస్కారైస్సంస్కృతో ద్విజః ।

క్ష్మా-ఈశ - ఓ మహారాజా!, ద్రవ్యసూక్ష్మవిపాకః - పదార్థములు పరిణామము ద్వారా పొందిన సూక్ష్మరూపము, ధూమః - ధూమము, రాత్రిః - రాత్రి, అపక్షయః - కృష్ణపక్షము, సోమః - చంద్రుడు, పితృయానమ్ - పితృయాన మార్గము, దర్శః - దేవదేహము క్షీణమగుట, ఓషధివీరుధః - మొక్కలు పంటధాన్యములు, అన్నమ్ - ఆహారము, రేతః - రేతస్సు, పునః-భవః - మరల పుట్టుట, ఏక-ఏకశ్యేన - ప్రతి ఒక్కటిగా, అనుపూర్వమ్ - క్రమముగా, భూత్వా - అయి, భూత్వా - అయి, ఇహ - ఈ లోకమునందు, జాయతే - పుట్టును, నిషేక-ఆదిశ్మశాన-అంతైః - గర్భాధానముతో మొదలిడి అంత్యేష్టి (ప్రేతకర్మ) వరకు ఉండే, సంస్కారైః - సంస్కారములచే, సంస్కృతః - సంస్కరించబడినవాడు, ద్విజః - బ్రాహ్మణుడు.

ఓ మహారాజా! ప్రవృత్తి పరాయణుడగు వ్యక్తి మరణించి వైదికకర్మలలో సమర్పించిన ఆహుతుల పరిణామమైన సూక్ష్మరూపమును పొంది పితృయానమార్గములో చంద్రలోకమును పొందును. అతడీ మార్గములో క్రమముగా ఒక్కొక్కటిగా పొందే స్థితులేవనగా -- హోమధూమము ( ఆ అభిమాని దేవత), రాత్రి, కృష్ణపక్షము (కాలాభిమాన దేవతలు), మరియు చంద్రలోకము. పుణ్యము క్షయమైన తరువాత ఆ జీవుని ఆ దేవదేహము పూర్తిగా క్షీణించును (అమావాస్య). ఆ జీవుడు సూక్ష్మరూపముతో వర్షజలముల ద్వారా మొక్కలలో ప్రవేశించి, ధాన్యమునందు సూక్ష్మరూపముగా నుండి పురుషునకు ఆహారమై వాని శరీరములో రేతస్సు రూపమును పొంది, స్త్రీ ద్వారా మరల ఈ లోకములో జన్మించును. గర్భాధానముతో మొదలిడి అంత్యేష్టి వరకు ఉండే సంస్కారములచే సంస్కరించబడే వైదికుడు ఈ మార్గములననుసరించును.

ఇంద్రియేషు క్రియాయజ్ఞాన్ జ్ఞానదీపేషు జుహ్వతి ॥ 52

ఇంద్రియాణి మనస్యూర్మౌ వాచి వైకారికం మనః ।
వాచం వర్ణసమామ్నాయే తమోంకారే స్వరే న్యసేత్ ।
ఓంకారం బిందౌ నాదే తం తం తు ప్రాణే మహత్యముమ్ ॥ 53

జ్ఞానదీపేషు - జ్ఞానముతో ప్రకాశించే, ఇంద్రియేషు - ఇంద్రియములయందు, క్రియాయజ్ఞాన్ - క్రియల రూపములోనుండే యజ్ఞములను, జుహ్వతి - హోమము చేయుచున్నారు, ఊర్మౌ - సంకల్పముల రూపములోనుండే, మనసి - మనస్సునందు, ఇంద్రియాణి - ఇంద్రియములను, వైకారికమ్ - వికారములను పొందుతూ ఉండే, మనః - మనస్సును, వాచి - వాక్కునందు, వాచమ్ - వాక్కును, వర్ణసమామ్నాయే - అక్షరముల సముదాయమునందు, తమ్ - దానిని, ఓంకారే - ఓంకారమునందు, తమ్ - ఆ, ఓంకారమ్ - ఓంకారమును, బిందౌ - బిందువునందు, తం తు - ఆ నాదమునైతే, ప్రాణే - సూత్రాత్మయందు, అముమ్ - ఈ సూత్రాత్మను, మహతి - పరబ్రహ్మయందు, న్యసేత్ - విలీనము చేయవలెను.

నివృత్తి పరాయణులగు సాధకులు యజ్ఞము మొదలగు క్రియలను జ్ఞానశక్తితో ప్రకాశించే ఇంద్రియములయందు, ఇంద్రియములను సంకల్పముల రూపములోనుండే మనస్సునందు, వికారములను పొందే మనస్సును వాక్కునందు, వాక్కును అక్షరముల మాతృకయందు, అక్షరమాతృకను ఓమ్ (అ, ఉ, మకారములు) నందు, ఓంకారమును బిందువు (అను నాసిక ధ్వని) నందు, బిందువును నాదము (దీర్ఘమగు ప్రతిధ్వని) నందు, నాదమును సూత్రాత్మ (సర్వజగద్వ్యాపకమగు ప్రాణతత్త్వము) నందు, ఈ సూత్రాత్మను పరబ్రహ్మలో (భావనారూపముగా) విలీనము చేయవలెను.

అగ్నిస్సూర్యో దివా ప్రాహ్ణశ్శుక్లో రాకోత్తరం స్వరాట్ ।
విశ్వశ్చ తైజసః ప్రాజ్ఞస్తుర్య ఆత్మా సమన్వయాత్ ॥ 54

అగ్నిః - అగ్ని, సూర్యః - సూర్యుడు, దివా - పగలు, ప్రాహ్ణః - సాయంకాలము, శుక్లః - శుక్లపక్షము, రాకా - పూర్ణిమ, ఉత్తరమ్ - ఉత్తరాయణము, స్వరాట్ - హిరణ్యగర్భుడు, విశ్వః చ - స్థూలోపాధియగు దేహమునకు అభిమాని, తైజసః - సూక్ష్మోపాధియగు మనస్సునకు అభిమాని,

ప్రాజ్ఞః - కారణోపాధికుడగు జీవుడు, సమన్వయాత్ - సర్వమునందు అను వృత్తమగుట వలన, తుర్యః - మూడింటికి అతీతమైన, ఆత్మా - ఆత్మ.

నివృత్తిపరాయణుడగు సాధకుడు మరణించిన తరువాత క్రమముగా అగ్ని, సూర్యుడు, పగలు, సాయంకాలము, శుక్లపక్షము, పూర్ణిమ, ఉత్తరాయణము (కాలాభిమాని దేవతలు), హిరణ్యగర్భలోకములను పొంది అచట భోగములననుభవించును. అతడు క్రమముగా స్థూలోపాధియగు దేహమునకు అభిమానియగు విశ్వుని సూక్ష్మోపాధియగు తైజసునియందు, మరల తైజసుని కారణోపాధియగు ప్రాజ్ఞునియందు విలీనము చేసి, ఈ మూడు ఉపాధులకు అధిష్ఠానముగా ఉంటూనే వాటికి అతీతమైన శుద్ధ-ఆత్మను తన స్వరూపముగా తెలుసుకొని మోక్షమును పొందును.

దేవయానమిదం ప్రాహుర్భూత్వా భూత్వానుపూర్వశః ।
ఆత్మయాజ్యుపశాంతాత్మా హ్యాత్మస్థో న నివర్తతే ॥ 55

ఇదమ్ - దీనిని, దేవయానమ్ - దేవయానముగా, ప్రాహుః - చెప్పెదరు, ఉపశాంత-ఆత్మా - కామనలు చల్లారిన అంతఃకరణము గల, ఆత్మయాజీ - ఆత్మోపాసకుడు, అనుపూర్వశః - క్రమముగా, భూత్వా భూత్వా - అయి అయి, ఆత్మస్థః - ఆత్మనిష్ఠుడై, న నివర్తతే హి - మరల జన్మించడు గదా!

దీనిని మహాత్ములు దేవయానము అని నిర్దేశించెదరు. కామనలు చల్లారిన అంతఃకరణముతో ఆత్మను ఉపాసించిన నివృత్తి పరాయణుడగు సాధకుడు క్రమముగా ఆయా దేవతలను పొంది హిరణ్యగర్భ (సత్య) లోకమునందు ఆత్మనిష్ఠుడై మోక్షమును పొందును (మరల సంసారములో జన్మించడు).

య ఏతే పితృదేవానామయనే వేదనిర్మితే ।
శాస్త్రేణ చక్షుషా వేద జనస్థోఽపి న ముహ్యతి ॥ 56

యః - ఎవడైతే, వేదనిర్మితే - వేదముచే నిశ్చయముగా బోధించబడిన, పితృదేవానామ్ - పితరులు మరియు దేవతల, అయనే - మార్గము

లను, శాస్త్రేణ - వేదము అనే, చక్షుషా - కన్నుతో, వేద - తెలియునో అట్టి వాడు, జనస్థః అపి - దేహమునందున్నవాడే అయిననూ, న ముహ్యతి - వ్యామోహమును పొందడు.

వేదముచే నిశ్చయముగా బోధించబడిన ఈ పితృయాన, దేవ యాన మార్గములను ఎవడైతే శాస్త్రమే కన్నుగా గలవాడై తెలుసుకొనునో, అట్టి వివేకి దేహముతో జీవించియున్ననూ వ్యామోహితుడు కాడు.

**ఆదావంతే జనానాం సద్బహిరంతః పరావరమ్ ।**
**జ్ఞానం జ్ఞేయం వచో వాచ్యం తమో జ్యోతిస్త్వయం స్వయమ్॥57**

జనానామ్ - దేహములకు, ఆదౌ - ఆదియందు, అంతే - అంత మునందు, బహిః - బయట, అంతః - లోపల, సత్ - ఉన్నది, పర-అవ రమ్ - గొప్పది తక్కువది, జ్ఞానమ్ - జ్ఞానము, జ్ఞేయమ్ - తెలియబడేది, వచః - నామము, వాచ్యమ్ - రూపము, తమః - చీకటి, జ్యోతిః తు - ప్రకాశము కూడ, అయమ్ - ఈ జ్ఞాని, స్వయమ్ - తానే.

ఈ జ్ఞాని స్వయముగా -- దేహములకు ఆదిలో కారణమై అంత ములో దేహములు విలీనమయ్యే అవధియై బయట భోగ్యముగను, లోపల భోక్తగను ఉన్న అఖండసద్ఘనమగు -- ఆత్మయే. గొప్పది, తక్కువది, తెలు సుకునే బుద్ధి, తెలియబడే విషయము, నామము, రూపము, చీకటి, వెలు తురు అనే సర్వము ఈ ఆత్మయే.

**అబాధితోఽపి హ్యాభాసో యథా వస్తుతయా స్మృతః ।**
**దుర్ఘటత్వాదైంద్రియకం తద్వదర్థవికల్పితమ్ ॥ 58**

ఆభాసః - ప్రతిబింబము, ఆబాధితః అపి - అన్ని విధములుగా బాధించబడేదే అయిననూ, యథా - ఏ విధముగానైతే, వస్తుతయా - యథార్థవస్తువుగా, స్మృతః - కల్పించబడినదో, తద్వత్ - అదే విధముగా, ఐంద్రియకమ్ - ఇంద్రియగోచరమగు జగత్తు, దుర్ఘటత్వాత్ - ఘటిల్లేది కాదు గనుక, అర్థవికల్పితమ్ - యథార్థమని కల్పించబడినది.

యుక్తిపూర్వకముగా విచారించినచో, ప్రతిబింబము యథార్థముగా ఉన్నది కాదని తెలియుచునే యుండును. కాని, అది యథార్థవస్తువా యన్నట్లు కనబడును. అదే విధముగా, ఇంద్రియగోచరమగు ఈ జగత్తు లోని భేదము యుక్తికి, ప్రమాణమునకు మరియు అనుభవమునకు విరుద్ధమే అయిననూ, అవివేకులు ఆ భేదమే యథార్థమని స్వీకరించెదరు.

క్షిత్యాదీనామిహార్థానాం ఛాయా న కతమాపి హి ।
న సంఘాతో వికారోఽపి న పృథజ్ నాన్వితో మృషా ।। 59

ఇహ - ఈ లోకమునందు, క్షితి-ఆదీనామ్ - పృథివి మొదలగు భూతముల కార్యములగు, అర్థానామ్ - పదార్థముల, ఛాయా - ఛాయ, కతమా అపి - ఏ ఒక్కటీ కూడ, న హి - కాదు గదా!, సంఘాతః - అయిదు భూతముల కలయిక, న - కాదు, వికారః అపి - వాటి వికారము కూడ, న - కాదు, న పృథక్ - భిన్నముగా లేదు, అన్వితః - జత గూడియున్నది, న - కాదు, మృషా - మిథ్య.

ఈ లోకములో పృథివి మొదలగు అయిదు భూతముల సమాహారమగు దేహము మొదలగు పదార్థములు నీడ వలె మిథ్యయే. అవి అయిదు భూతముల కలయిక గాని, వాటి వికారము గాని కావు. అవి పంచభూతములకంటె భిన్నముగా గాని, వాటితో జతగూడి గాని లేవు. కావున, పంచభూతముల కలయిక యగు దేహాదులు కేవలము మిథ్య మాత్రమే.

ధాతవోఽవయవిత్వాచ్చ తన్మాత్రావయవైర్వినా ।
న స్యుర్హ్యసత్యవయవిన్యసన్నవయవోఽంతతః ।। 60

ధాతవః - జగత్తునకు మూలమునందలి ధాతువులైన పంచమహాభూతములు, అవయవిత్వాత్ చ - అవయవములు గలవి యగుట వలన, తత్-మాత్రా-అవయవైః వినా - వాటి అవయవములగు తన్మాత్రలు లేకుండా, న స్యుః హి - ఉండవు గదా!, అవయవిని - అవయవములు గలది, అసతి - లేనప్పుడు, అంతతః - ఆఖరుగా, అవయవః - అవయవము, అసన్ - లేనిది.

పంచమహాభూతములు జగత్తునకు మూలమునందలి ధాతువులు. కాని, అవి కూడ పంచతన్మాత్రల (సూక్ష్మభూతముల) కలయికలే అగుట వలన, అవయవములు లేకుండా అవయవియొక్క ఉనికి సిద్ధించదు. అంతిమముగా అవయవి లేకున్నచో, అవయవముల ఉనికి సిద్ధించదు.

స్యాత్సాదృశ్యభ్రమస్తావద్వికల్పే సతి వస్తునః ।
జాగ్రత్స్వాపౌ యథా స్వప్నే తథా విధినిషేధతా ॥ 61

వస్తునః - వస్తువునకు, వికల్పే - భేదము, సతి - కలుగగా, సాదృశ్యభ్రమః - అవే ఇవి అనే భ్రాంతి, తావత్ - అంతవరకు, స్యాత్ - కలుగును, జాగ్రత్-స్వాపౌ - తెలివిగానుండుట నిద్రపోవుట, స్వప్నే యథా - స్వప్నములో ఎట్లో, విధినిషేధతా - విధినిషేధముల స్థితి, తథా - అటులనే.

ఉన్నది ఒక్కటి మాత్రమే. అయిననూ, అజ్ఞానముచే వస్తువు (ఉన్నది) నందు భేదము గోచరించుచుండగా, మనముందు కనబడే ఈ పదార్థములన్నీ సర్వకాలములలో ఏకరూపముగా ఉన్నవి అనే భ్రాంతి కలుగుచునే యుండును. స్వప్నములో కూడ జాగ్రత్తు-నిద్ర అనే అవస్థల అనుభవము కలుగుచుండును. స్వప్నకాలములో అవి సత్యములే అనే భ్రమ కొనసాగును. అదే విధముగా ఈ జగత్తు, దానియందలి వ్యక్తియొక్క జీవితము, ఆ జీవితమును నిర్దేశించే విధినిషేధములు అనే ఈ సర్వము అజ్ఞానకాలములో వాస్తవములే యన్నట్లు అనుభవమునకు వచ్చుచుండును.

భావాద్వైతం క్రియాద్వైతం ద్రవ్యాద్వైతం తథాఽఽత్మనః ।
వర్తయన్ స్వానుభూత్యేహ త్రీన్ స్వప్నాన్ ధునుతే మునిః ॥ 62

ఆత్మనః - ఆత్మకు, భావ-అద్వైతమ్ - భావాద్వైతమును, క్రియా-అద్వైతమ్ - క్రియాద్వైతమును, తథా - మరియు, ద్రవ్య-అద్వైతమ్ - ద్రవ్యాద్వైతమును, వర్తయన్ - మననము చేయు, మునిః - మననశీలుడగు సాధకుడు, ఇహ - ఈ దేహమునందు, స్వ-అనుభూత్యా - ఆత్మనిష్ఠయొక్క అనుభవముచే, త్రీన్ - మూడు, స్వప్నాన్ - కలలను, ధునుతే - తొలగించుకొనును.

ఆత్మయొక్క మూడు అద్వైతములను, అనగా భావాద్వైత-క్రి యాద్వైత-ద్రవ్యాద్వైతములను మననము చేయు సాధకుడు ఆత్మనిష్ఠ యొక్క అనుభవముచే జాగ్రత్తు-స్వప్నము-నిద్ర (లేదా, జ్ఞాత-జ్ఞానము-జ్ఞే యము అనే) మూడు స్వప్నములను తొలగించుకొనును. అనగా, ఈ అవ స్థలకు అతీతమైన ఆత్మతత్త్వమునందు నిష్ఠను కలిగి యుండును.

కార్యకారణవస్త్వైక్యమర్శనం పటతంతువత్ ।
అవస్తుత్వాద్వికల్పస్య భావాద్వైతం తదుచ్యతే ॥ 63

వికల్పస్య - భేదము, అవస్తుత్వాత్ - యథార్థము కాకుండుట వలన, పటతంతువత్ - వస్త్రము నూలు వలె, కార్యకారణవస్తు-ఐక్యమర్శ నమ్ - కార్యకారణములు వస్తువునందు ఐక్యమగుటను దర్శించుట, తత్ - అది, భావ-అద్వైతమ్ - భావాద్వైతము అని, ఉచ్యతే - చెప్పబడుచు న్నది.

మనకు కనబడే భేదము యథార్థము కాదు. వస్త్రము, నూలు వంటి కార్యకారణభేదము కనబడేదే గాని యథార్థము కాదు. కార్యకారణ ముల కనబడే భేదము రెండవది లేని తత్త్వమునందు విలీనమగును. ఈ దర్శనము భావాద్వైతము (పదార్థముల ఐక్యము) అనబడును.

యద్బ్రహ్మణి పరే సాక్షాత్సర్వకర్మసమర్పణమ్ ।
మనోవాక్తనుభిః పార్థ క్రియాద్వైతం తదుచ్యతే ॥ 64

పార్థ - కుంతీపుత్రుడవగు ఓ ధర్మరాజా!, సాక్షాత్ - సాక్షాత్తుగా, పరే బ్రహ్మణి - పరబ్రహ్మయందు, మనః-వాక్-తనుభిః - మనస్సు వాక్కు కాయములతో, సర్వకర్మసమర్పణమ్ - సకలకర్మలను సమర్పించుట, యత్ - ఏది గలదో, తత్ - అది, క్రియా-అద్వైతమ్ - క్రియాద్వైతము అని, ఉచ్యతే - చెప్పబడును.

కుంతీపుత్రుడవగు ఓ ధర్మరాజా! మనము మనోవాక్కాయము లతో చేసే కర్మలనన్నింటినీ సాక్షాత్తుగా పరబ్రహ్మయందు సమర్పించు టయే క్రియాద్వైతము (క్రియకు సంబంధించిన అద్వైతము) అనబడును.

**ఆత్మజాయాసుతాదీనామన్యేషాం సర్వదేహినామ్ ।**
**యత్స్వార్థకామయోరైక్యం ద్రవ్యాద్వైతం తదుచ్యతే ।। 65**

**ఆత్మజాయాసుత-ఆదీనామ్** - తనకు భార్య పుత్రుడు మొదలగు వారియొక్క, **అన్యేషామ్** - ఇతరులగు, **సర్వదేహినామ్** - సకలప్రాణుల యొక్క, **స్వ-అర్థకామయోః** - తమ అర్థకామములయొక్క, **ఐక్యమ్** - ఒకటే అనే భావన, **యత్** - ఏది గలదో, **తత్** - అది, **ద్రవ్య-అద్వైతమ్** - ద్రవ్యాద్వైతము అని, **ఉచ్యతే** - చెప్పబడుచున్నది.

సాధకుని దృష్టిలో తాను, తన భార్య, తన సంతానము, తన బంధువులు మొదలగువారికి, ఇతరులైన సకలప్రాణులకు అర్థకామముల (సంపదను సంపాదించి ఇంద్రియసుఖములననుభవించుట) విషయములో (నాది పరాయి అనే) తేడా లేదు అనే దృష్టి యేది గలదో, అది ద్రవ్యాద్వైతము (పదార్థములకు సంబంధించిన ఏకత్వము) అనబడును.

**యద్యస్య వానిషిద్ధం స్యాద్యేన యత్ర యతో నృప ।**
**స తేనేహేత కర్మాణి నరో నాన్యైరనాపది ।। 66**

**నృప** - ఓ మహారాజా!, **యత్** - ఏది, **యస్య** - ఎవనికి, **యేన** - ఏ ఉపాయముచే, **యత్ర** - ఏ దేశము (కాలము) నందు, **యతః వా** - ఎవ నినుండి, **అనిషిద్ధమ్** - నిషేధించబడినది కాదో, **సః** - ఆ, **నరః** - మానవుడు, **తేన** - దానితో, **కర్మాణి** - పనులను, **ఈహేత** - చేసుకొనవలె ను, **అనాపది** - ఆపద కాని సందర్భములయందు, **అన్యైః** - ఇతరపదార్థ ములతో, **న** - కాదు.

ఓ ధర్మరాజా! ఏ ఉపాయముచే ఎక్కడనుండి పొందబడిన ఏ వస్తువు ఏ వ్యక్తికి ఏ దేశకాలములయందు నిషిద్ధము కాదో, ఆ వ్యక్తి ఆ వస్తువుతోనే తన పనులను నిర్వహించుకొనవలెను. ఆపదల సందర్భ ములలో తప్పించి, ఆ వ్యక్తి ఇతర నిషిద్ధపదార్థముల జోలికి పోరాదు.

ఏతైరన్యైశ్చ వేదోక్తైర్వర్తమానస్స్వకర్మభిః ।
గృహేఽప్యస్య గతిం యాయాద్రాజంస్తద్భక్తిభాజ్నరః ।। 67

రాజన్ - ఓ మహారాజా!, ఏతైః - ఇట్టివి, అన్యైః చ - ఇతరములు అగు, వేద-ఉక్తైః - వేదవిహితములైన, స్వకర్మభిః - తనకు విధించబడిన కర్మలచే, వర్తమానః - నడుచుకొనుచున్న, నరః - మానవుడు, తద్-భక్తి భాక్ - ఆ భగవానునియందు భక్తిని సేవించువాడై, గృహే అపి - ఇంటి యందున్ననూ, అస్య - ఈ ఈశ్వరునియొక్క, గతిమ్ - స్వరూపమును, యాయాత్ - పొందును.

ఓ ధర్మరాజా! ఆ భగవానుని భక్తితో ఆరాధించే మానవుడు ఇట్టి కర్మలను, వేదముచే తనకు విహితములైన ఇతరకర్మలను చేస్తూ గృహస్థా శ్రమమునందే ఉన్ననూ, ఆ ఈశ్వరుని స్వరూపము (మోక్షము) ను పొందును.

యథా హి యూయం నృపదేవ దుస్త్యజా-
దాపద్గణాదుత్తరతాత్మనః ప్రభోః ।
యత్పాదపంకేరుహసేవయా భవా-
నహార్షీన్నిర్జితదిగ్గజః క్రతూన్ ॥ 68

నృపదేవ - ఓ మహారాజా!, ఆత్మనః - నీ, ప్రభోః - ప్రభుడగు శ్రీకృష్ణుని కారణముగా, (నృపదేవ) దుస్త్యజాత్ - (రాజులు దేవతలచే కూడ) విడిపించుకొనుట శక్యము కాని, ఆపద్-గణాత్ - ఆపదల సమూహ మునుండి, యూయమ్ - మీరు, ఉత్తరత - గట్టెక్కినారో, భవాన్ - నీవు, యత్-పాదపంకేరుహసేవయా - ఏ భగవానుని పాదపద్మముల సేవచే, నిర్జితదిగ్-గజః - జయించబడిన దిగ్గజములు గలవాడవై, క్రతూన్ - క్రతు వులను, అహార్షీత్ - అనుష్ఠించితివో.

ఓ మహారాజా! రాజులు, దేవతలు కూడ విడిపించుకొన శక్యము కాని ఆపదల సమూహములనుండి మీరు మీ ప్రభుడగు శ్రీకృష్ణుని కారణ ముగా గట్టెక్కితిరి. నీవు ఆయన పాదపద్మములను సేవించి ఆ శక్తితో దిగ్గజ ములను (భూమండలమును) జయించి అనేక క్రతువులను అనుష్ఠించితివి.

అహం పురాఽభవం కశ్చిద్గంధర్వ ఉపబర్హణః ।
నామ్నాతీతే మహాకల్పే గంధర్వాణాం సుసమ్మతః ॥ 69

అహమ్ - నేను, అతీతే - గడచిపోయిన, మహాకల్పే - గొప్ప కల్పమునందు, పురా - పూర్వజన్మయందు, గంధర్వాణామ్ - గంధర్వుల లో, సుసమ్మతః - మిక్కిలి శ్రేష్ఠుడు, నామ్నా - పేరుచే, ఉపబర్హణః - ఉప బర్హణుడు అనే, కశ్చిత్ - ఒకానొక, గంధర్వః - గంధర్వుడను, అభవమ్ - అయి ఉంటిని.

గడచిన మహాకల్పమునందు పూర్వజన్మలో నేను ఉపబర్హణుడనే పేరు గల ఒకానొక గంధర్వుడను. అప్పుడు నేను గంధర్వులలో గొప్పవా డిగా ఉండెడివాడను.

రూపపేశలమాధుర్యసౌగంధ్యప్రియదర్శనః ।
స్త్రీణాం ప్రియతమో నిత్యం మత్తస్తు పురులంపటః ॥ 70

రూపపేశలమాధుర్యసౌగంధ్యప్రియదర్శనః - రూపము సౌకుమా ర్యము మధురముగా మాటలాడుట పరిమళభరితుడనై యుండుట అనువా టిచే ప్రీతికరమైన దర్శనము గలవాడను, స్త్రీణామ్ - స్త్రీలకు, ప్రియతమః - మిక్కిలి ప్రియమైనవాడను, నిత్యమ్ - అన్ని కాలములయందు, మత్తః తు - నిశ్చయముగా గర్వించినవాడను, పురులంపటః - అధికమగు భోగా సక్తి గలవాడను.

అప్పుడు నేను రూపము, సౌకుమార్యము, మధురభాషణము, పరిమళభరితుడై యుండుట అనే లక్షణములచే ప్రీతికరమైన దర్శనము గలవాడనగుటచే, స్త్రీలకు మిక్కిలి ప్రియుడుగా ఉండెడివాడను. నేను అన్ని కాలములయందు అధికమగు భోగాసక్తి గలవాడనై గర్వించి యుండె డివాడను.

ఏకదా దేవసత్రే తు గంధర్వాప్సరసాం గణాః ।
ఉపహూతా విశ్వసృగ్భిర్హరిగాథోపగాయనే ॥ 71

ఏకదా - ఒకనాడు, దేవసత్రే తు - దేవతల సత్రయాగమునందైతే, విశ్వసృగ్భిః - ప్రజాపతులచే, హరిగాథా-ఉపగాయనే - శ్రీహరి గాథలను

గానము చేయుటయందు, గంధర్వ-అప్సరసామ్ - గంధర్వులు అప్సరస ల, గణాః - గణములు, ఉపహూతాః - ఆహ్వానించబడిరి.

ఒకనాడు ప్రజాపతులు దేవతల సత్రయాగమునందు శ్రీహరి గాథ లను పాడుట కొరకై గంధర్వులు, అప్సరసల గణములను ఆహ్వానించిరి.

అహం చ గాయంస్తద్విద్వాన్ స్త్రీభిః పరివృతో గతః ।
జ్ఞాత్వా విశ్వసృజస్తన్మే హేలనం శేపురోజసా ।
యాహి త్వం శూద్రతామాశు నష్టశ్రీః కృతహేలనః ।। 72

తత్ - ఆ విషయమును, విద్వాన్ - తెలుసుకున్న, అహం చ - నేను కూడ, స్త్రీభిః - స్త్రీలచే, పరివృతః - చుట్టువారబడి యున్నవాడనై, గాయన్ - గానము చేయుచున్నవాడనై, గతః - వెళ్లినవాడను, విశ్వసృజః - ప్రజాపతులు, మే - నాయొక్క, తత్ - ఆ, హేలనమ్ - అవహేళనము ను, జ్ఞాత్వా - తెలిసి, ఓజసా - కోపవేగముతో, శేపుః - శపించిరి, కృతహే లనః - చేయబడిన అపరాధము గల, త్వమ్ - నీవు, ఆశు - వెంటనే, నష్టశ్రీః - నశింప జేయబడిన సంపదలు గలవాడవై, శూద్రతామ్ - శూద్ర భావమును, యాహి - పొందుము.

ఆ ఆహ్వానము సంగతి తెలిసిన నేను స్త్రీలు చుట్టువారియుండగా విలాసగీతములను పాడుతూ అచటకు వెళ్లితిని. నేను చేసిన ఆ అవహేళన మును చూసిన ప్రజాపతులు కోపవేగముతో నన్ను ఈ విధముగా శపించిరి -- అపరాధమును చేసిన నీవు వెంటనే సంపదలనన్నింటినీ పోగొట్టుకొని శూద్రుడవు కమ్ము.

తావద్దాస్యామహం జజ్ఞే తత్రాపి బ్రహ్మవాదినామ్ ।
శుశ్రూషయానుషంగేణ ప్రాప్తోఽహం బ్రహ్మపుత్రతామ్ ।।73

తావత్ - అంతలో, అహమ్ - నేను, దాస్యామ్ - దాసియందు, జజ్ఞే - జన్మించితిని, తత్ర అపి - ఆ జన్మయందు కూడ, బ్రహ్మవాదినామ్ - బ్రహ్మవేత్తల, శుశ్రూషయా - సేవతోడి, అనుషంగేణ - సంబంధముచే, బ్రహ్మపుత్రతామ్ - బ్రహ్మపుత్రుడనై జన్మించుటను, ప్రాప్తః - పొందితిని.

వెంటనే నేను దాసికి పుత్రుడనై జన్మించితిని. ఆ జన్మలో కూడ బ్రహ్మవేత్తలను సేవించితిని. ఆ సేవయొక్క ప్రభావముచే మరుజన్మలో బ్రహ్మగారి పుత్రుడనై జన్మించితిని.

ధర్మస్తే గృహమేధీయో వర్ణితః పాపనాశనః ।
గృహస్థో యేన పదవీమంజసా న్యాసినామియాత్ ॥ 74

పాపనాశనః - పాపములను నశింపజేసే, గృహమేధీయః - గృహస్థులకు చెందిన, ధర్మః - ధర్మము, తే - నీ కొరకు, వర్ణితః - వర్ణించబడినది, యేన - దేనిచేనైతే, గృహస్థః - గృహస్థుడు, న్యాసినామ్ - సన్న్యాసులయొక్క, పదవీమ్ - గతిని, అంజసా - తేలికగా, ఇయాత్ - పొందునో.

నేను నీకు గృహస్థుల ధర్మమును వర్ణించితిని. ఈ ధర్మము పాపములను నశింపజేయును. దీనిని పాటించే గృహస్థులు సన్న్యాసులు పొందే గతి (మోక్షము) ని సునాయాసముగా పొందెదరు.

యూయం నృలోకే బత భూరిభాగా
లోకం పునానా మునయోఽభియంతి ।
యేషాం గృహానావసతీతి సాక్షాద్
గూఢం పరం బ్రహ్మ మనుష్యలింగమ్ ॥ 75

బత - అహా!, నృలోకే - మానవలోకమునందు, యూయమ్ - మీరు, భూరిభాగాః - గొప్ప భాగ్యవంతులు, గూఢమ్ - రహస్యమైన, పరం బ్రహ్మ - పరబ్రహ్మ, సాక్షాత్ - సాక్షాత్తుగా, మనుష్యలింగమ్ - మనుష్యరూపము గలదియై, ఆవసతి - నివసించియున్నది, ఇతి - అనే కారణముగా, లోకమ్ - లోకమును, పునానాః - పావనము చేసే, మునయః - మహర్షులు, యేషామ్ - ఏ మీయొక్క, గృహాన్ - ఇంటిని, అభియంతి - అభిముఖముగా విచ్చేయుదురో.

అహా! మానవలోకములో మీరు గొప్ప భాగ్యవంతులు. రహస్యమగు పరబ్రహ్మ మనుష్యరూపముతో మీ ఇంటియందు నివసించియున్న

ది. కావుననే, లోకమును పావనము చేసే మహర్షులు మీ ఇంటిని వెతు క్కుంటూ వస్తూ ఉంటారు.

స వా అయం బ్రహ్మ మహద్విమృగ్యం
కైవల్యనిర్వాణసుఖానుభూతిః ।
ప్రియస్సుహృద్వః ఖలు మాతులేయ
ఆత్మార్హణీయో విధికృద్గురుశ్చ ॥ 76

మహద్-విమృగ్యమ్ - మహాత్ములచే అన్వేషించబడేది, కైవల్యని ర్వాణసుఖ-అనుభూతిః - రెండవది లేనిది ఉపద్రవములు లేనిది అగు ఆనందముయొక్క అనుభూతియే స్వరూపముగా గల, బ్రహ్మ - పరబ్ర హ్మ, సః - అట్టి, అయమ్ - ఈయనయే, వై - నిశ్చయము, వః - మీకు, ప్రియః - ప్రీతిని కలిగించే, సుహృత్ - హితకారి, మాతులేయః ఖలు - మేనమామ కొడుకు గదా!, ఆత్మా - ప్రాణము, అర్హణీయః - పూజనీయు డు, విధికృత్ - ఆదేశమును పాటించువాడు, గురుః చ - గురువు కూడ.

మహాత్ములు బ్రహ్మానందముయొక్క అనుభూతిని అన్వేషింపు చుందురు. రెండవది లేని ఆ ఆనందములో ఉపద్రవములు సుతరాము లేవు. అట్టి ఆ పరబ్రహ్మయే మీకు ప్రీతిని, హితమును కలిగించే శ్రీకృష్ణు డు. ఇది నిశ్చయము. ఆయన మీకు మేనమామ కొడుకు మాత్రమే గాక, మీ ప్రాణము, గురువు కూడ ఆయనయే. మీచే పూజించబడే ఆయన మీ ఆదేశమును కూడ పాటించును.

న యస్య సాక్షాద్భవపద్మజాదిభీ
రూపం ధియా వస్తుతయోపవర్ణితమ్ ।
మౌనేన భక్త్యోపశమేన పూజితః
ప్రసీదతామేష స సాత్వతాం పతిః ॥ 77

యస్య - ఎవనియొక్క, రూపమ్ - స్వరూపము, సాక్షాత్ - సాక్షా త్తుగా, భవపద్మజ-ఆదిభిః - రుద్రుడు పద్మసంభవుడగు బ్రహ్మగారు మొద లగువారిచే, ధియా - బుద్ధిచే, వస్తుతయా - ఇదమిత్థముగా, న ఉపవర్ణి

తమ్ - వర్ణించబడలేదో, సః - అట్టి, ఏషః - ఈ, సాత్వతామ్ - భక్తులకు, పతిః - ప్రభువగు శ్రీకృష్ణుడు, మౌనేన - మౌనముచే, భక్త్యా - భక్తితో, ఉప శమేన - ఉపరతిచే, పూజితః - పూజించబడినవాడై, ప్రసీదతామ్ - ప్రస న్నుడగు గాక!

ఆ ఈ భక్తపాలకుడగు శ్రీకృష్ణుని స్వరూపమును సాక్షాత్తుగా రుద్రుడు, పద్మసంభవుడగు బ్రహ్మగారు మొదలైన వారు కూడ తమ బుద్ధితో ఇదమిత్థముగా వర్ణించలేకపోయిరి. ఆయనను మౌనపూర్వకమగు భక్తితో మరియు సకలకామనాపరిత్యాగముతో ఆరాధించవలెను. ఆయన మనపై ప్రసన్నుడగు గాక!

శ్రీశుక ఉవాచ ।
ఇతి దేవర్షిణా ప్రోక్తం నిశమ్య భరతర్షభః ।
పూజయామాస సుప్రీతః కృష్ణం చ ప్రేమవిహ్వలః ॥ 78

ఇతి - ఈ విధముగా, దేవ-ఋషిణా - దేవర్షియగు నారదునిచే, ప్రోక్తమ్ - చెప్పబడినదానిని, నిశమ్య - విని, భరత-ఋషభః - భరతవం శశ్రేష్ఠుడగు ధర్మరాజు, సుప్రీతః - మిక్కిలి ప్రీతిని పొందినవాడై, ప్రేమవి హ్వలః - ప్రేమచే పరవశుడై, కృష్ణం చ - శ్రీకృష్ణుని కూడ, పూజయా మాస - పూజించెను.

శ్రీశుకమహర్షి ఇట్లు చెప్పెను --- దేవర్షియగు నారదుడు చెప్పిన ఈ మాటలను విని, భరతవంశ శ్రేష్ఠుడగు ధర్మరాజు చాల సంతోషించి ప్రేమపారవశ్యముతో నారదుని, శ్రీకృష్ణుని కూడ పూజించెను.

కృష్ణపార్థావుపామంత్ర్య పూజితః ప్రయయౌ మునిః ।
శ్రుత్వా కృష్ణం పరం బ్రహ్మ పార్థః పరమవిస్మితః ॥ 79

పూజితః - పూజించబడిన, మునిః - నారద మహర్షి, కృష్ణపార్థౌ - శ్రీకృష్ణుని ధర్మరాజును, ఉపామంత్ర్య - సెలవు తీసుకొని, ప్రయయౌ - వెళ్లెను, కృష్ణమ్ - శ్రీకృష్ణుని, పరం బ్రహ్మ - పరబ్రహ్మనుగా, శ్రుత్వా - విని, పార్థః - ధర్మరాజు, పరమవిస్మితః - మిక్కిలి విస్మితుడాయెను.

నారదుడు పూజలనందుకొని శ్రీకృష్ణుని వద్ద మరియు ధర్మరాజు వద్ద సెలవు తీసుకొని వెళ్లెను. శ్రీకృష్ణుడే పరబ్రహ్మ అని విని ధర్మరాజు గొప్ప అచ్చెరువును పొందెను.

**ఇతి దాక్షాయణీనాం తే పృథగ్వంశాః ప్రకీర్తితాః ।**
**దేవాసురమనుష్యాద్యా లోకా యత్ర చరాచరాః ।। 80**

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే సప్తమస్కంధే సదాచార నిరూపణం నామ పంచదశోఽధ్యాయః ।।**

**।। ఇతి సప్తమః స్కంధః సమాప్తః ।।**

ఇతి - ఈ విధముగా, తే - నీ కొరకు, దాక్షాయణీనామ్ - దక్షుని పుత్రికలయొక్క, వంశాః - వంశములు, పృథక్ - వేరువేరుగా, ప్రకీర్తితాః - వర్ణించి చెప్పబడినవి, యత్ర - ఏ వంశములయందు, దేవ-అసురమనుష్య -ఆద్యాః - దేవతలు అసురులు మానవులు మొదలగు, చర-అచరాః - కదిలే మరియు కదలని, లోకాః - ప్రాణులు గలవో.

ఓ పరీక్షిన్మహారాజా! నేను నీకు దక్షుని పుత్రికల వంశములను వేర్వేరుగా వర్ణించి చెప్పితిని. దేవతలు, అసురులు, మానవులు మొదలైన కదిలే మరియు కదలని ప్రాణులు ఈ వంశములలో జన్మించినవే.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి సప్తమ స్కంధములో
సదాచారమును నిరూపించే పదునైదవ అధ్యాయము ముగిసినది (15).
సప్తమ స్కంధము ముగిసినది.

।। హరిః ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।।

*****

శ్రీగణేశాయ నమః

ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రీ మహర్షి వేదవ్యాస ప్రణీతం

# శ్రీమద్భాగవత మహాపురాణమ్

## తత్త్వ ప్రకాశికా సంయుతమ్

## అష్టమః స్కంధః

## అథ ప్రథమోఽధ్యాయః

### మన్వంతరముల వర్ణనము

రాజోవాచ ।
స్వాయంభువస్యేహ గురో వంశోఽయం విస్తరాచ్ఛ్రుతః ।
యత్ర విశ్వసృజాం సర్గో మనూనన్యాన్ వదస్వ నః ॥ 1

గురో - ఓ గురుదేవా!, ఇహ - ఈ సందర్భమునందు, స్వాయంభువస్య - స్వాయంభువ మనువుయొక్క, వంశః - వంశము, విస్తరాత్ - విస్తారముగా, శ్రుతః - వినబడినది, యత్ర - దేనియందైతే, విశ్వసృజామ్ - ప్రజాపతుల, సర్గః - సృష్టియో, అన్యాన్ - ఇతరులగు, మనూన్ - మనువులను గురించి, నః - మాకు, వదస్వ - చెప్పుము.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ గురుదేవా! ఈ సందర్భములో స్వాయంభువ మనువుయొక్క వంశమును గురించి, ప్రజాపతులు చేసిన సృష్టిని గురించి మీరు చెప్పగా నేను వినియుంటిని. ఇతర మనువులను గురించి నాకు చెప్పుము.

యత్ర యత్ర హరేర్జన్మ కర్మాణి చ మహీయసః ।
గృణంతి కవయో బ్రహ్మంస్తాని నో వద శృణ్వతామ్ ॥ 2

బ్రహ్మన్ - ఓ మహాత్మా!, యత్ర యత్ర - ఏయే మన్వంతరమునందైతే, మహీయసః - పురుషోత్తముడగు, హరేః - శ్రీహరియొక్క, జన్మ - అవతారమును, కర్మాణి చ - లీలలను కూడ, కవయః - మహాత్ములు, గృణంతి - వర్ణించెదరో, తాని - వాటిని, శృణ్వతామ్ - వినుచున్న, నః - మాకు, వద - చెప్పుము.

ఓ మహాత్మా! ఏయే మన్వంతరములలో పురుషోత్తముడగు శ్రీహరియొక్క అవతారములను, లీలలను మహాత్ములు వర్ణించినారో, వాటిని మాకు చెప్పుడు. మేము శ్రద్ధగా వినెదము.

యద్యస్మిన్నంతరే బ్రహ్మన్ భగవాన్ విశ్వభావనః ।
కృతవాన్ కురుతే కర్తా హ్యతీతేఽనాగతేఽద్య వా ॥ 3

బ్రహ్మన్ - ఓ మహాత్మా!, యస్మిన్ - ఏ, అతీతే - గడచిన, అంతరే - మన్వంతరమునందు, విశ్వభావనః - జగత్పాలకుడగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, యత్ - దేనిని, కృతవాన్ - చేసినాడో, అనాగతే - రాబోయే మన్వంతరమునందు, కర్తా - చేయబోవుచున్నాడో, అద్య వా - ఈ మన్వంతరములో కూడ, కురుతే హి - చేయుచున్నాడో.

ఓ మహాత్మా! జగత్తును పాలించే శ్రీహరి భగవానుడు గడచిన మన్వంతరములో చేసిన లీలలను, రాబోయే మన్వంతరములో చేయబోవు లీలలను, ఈ మన్వంతరములో చేయుచున్నవాటిని మాకు చెప్పుము.

ఋషిరువాచ ।
మనవోఽస్మిన్ వ్యతీతాష్షట్ కల్పే స్వాయంభువాదయః ।
ఆద్యస్తే కథితో యత్ర దేవాదీనాం చ సంభవః ॥ 4

అస్మిన్ - ఈ, కల్పే - కల్పమునందు, స్వాయంభువ-ఆదయః - స్వాయంభువమనువు మొదలగు, షట్ - ఆర్గురు, మనవః - మనువులు, వ్యతీతాః - గడచినారు, తే - నీకు, ఆద్యః - మొదటిది, కథితః - చెప్పబడి నది, యత్ర - దేనియందైతే, దేవ-ఆదీనాం చ - దేవతలు మొదలగువారి యొక్క, సంభవః - ఉత్పత్తియో.

శుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ కల్పములో స్వాయంభువుడు మొదలగు ఆర్గురు మనువులు గడచినారు. మొదటి మన్వంతరములో దేవతలు మొదలగువారి ఉత్పత్తిని గురించి నీకు చెప్పియుంటిని.

ఆకూత్యాం దేవహూత్యాం చ దుహిత్రోస్తస్య వై మనోః ।
ధర్మజ్ఞానోపదేశార్థం భగవాన్ పుత్రతాం గతః ॥ 5

తస్య వై - అదే, మనోః - మనువుయొక్క, దుహిత్రోః - కుమార్తె లైన, ఆకూత్యామ్ - ఆకూతియందు, దేవహూత్యాం చ - దేవహూతి యందు కూడ, ధర్మజ్ఞాన-ఉపదేశ-అర్థమ్ - ధర్మమును జ్ఞానమును ఉపదే శించుట కొరకై, పుత్రతామ్ - పుత్రుడు అగుటను, గతః - పొందినాడు.

అదే స్వాయంభువమనువునకు ఆకూతి, దేవహూతి అనే కుమా ర్తెలు ఉండిరి. వారియందు భగవానుడు పుత్రుడై జన్మించి, ధర్మమును జ్ఞానమును ఉపదేశించెను.

కృతం పురా భగవతః కపిలస్యానువర్ణితమ్ ।
ఆఖ్యాస్యే భగవాన్ యజ్ఞో యచ్చకార కురూద్వహ ॥ 6

భగవతః కపిలస్య - కపిల భగవానునియొక్క, కృతమ్ - చేయబ డినది, పురా - ఇదివరలో, అనువర్ణితమ్ - వర్ణించబడినది, కురు-ఉద్వహ - కురువంశశ్రేష్ఠుడవగు ఓ రాజా!, భగవాన్ యజ్ఞః - యజ్ఞ భగవానుడు, యత్ - దేనిని, చకార - చేసెనో దానిని, ఆఖ్యాస్యే - చెప్పగలను.

కురువంశ శ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా! కపిల భగవానుడు చేసిన ఉపదేశమును నేనిదివరలో వర్ణించి చెప్పితిని. యజ్ఞ భగవానుడు చేసిన ఉపదేశమును గురించి చెప్పెదను.

విరక్తః కామభోగేషు శతరూపాపతిః ప్రభుః ।
విసృజ్య రాజ్యం తపసే సభార్యో వనమావిశత్ ॥ 7

శతరూపాపతిః - శతరూపకు భర్తయగు, ప్రభుః - మను మహారాజు, కామభోగేషు - విషయభోగములయందు, విరక్తః - విరక్తిని పొందినవాడై, రాజ్యమ్ - రాజ్యమును, విసృజ్య - విడిచిపెట్టి, సభార్యః - భార్యతో గూడినవాడై, వనమ్ - అడవిని, ఆవిశత్ - ప్రవేశించెను.

స్వాయంభువ మనువు ఇంద్రియభోగములయందు విరక్తిని చెంది, రాజ్యమును విడిచి, తన భార్యయగు శతరూపతో గూడి అడవికి వెళ్లెను.

సునందాయాం వర్షశతం పదైకేన భువం స్పృశన్ ।
తప్యమానస్తపో ఘోరమిదమన్వాహ భారత ॥ 8

భారత - భరతవంశీయుడవగు ఓ రాజా!, సునందాయామ్ - సునందానదీ తీరమునందు, వర్షశతమ్ - వంద సంవత్సరములు, ఏకేన - ఒక, పదా - కాలితో, భువమ్ - నేలను, స్పృశన్ - స్పృశించుచున్నవాడై, ఘోరమ్ - కఠోరమగు, తపః - తపస్సును, తప్యమానః - అనుష్ఠించుచున్నవాడై, ఇదమ్ - దీనిని, అను-ఆహ - జపించెను.

భరతవంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! ఆయన సునందా నదీ తీరమునందు ఒంటి కాలిపై నిలబడి వంద సంవత్సరములు కఠోరమగు తపస్సును అనుష్ఠిస్తూ, ప్రతిదినము ఈ స్తోత్రమును జపించెను.

మనురువాచ ।
యేన చేతయతే విశ్వం విశ్వం చేతయతే న యమ్ ।
యో జాగర్తి శయానేఽస్మిన్నాయం తం వేద వేద సః ॥ 9

విశ్వమ్ - జగత్తు, యేన - ఎవనిచే, చేతయతే - చేతనమగుచు న్నదో, విశ్వమ్ - జగత్తు, యమ్ - ఎవనిని, న చేతయతే - చేతనము చేయదో, అస్మిన్ - ఇది, శయానే - నిద్రించుచుండగా, యః - ఎవడైతే, జాగర్తి - జాగరూకుడై యుండునో, అయమ్ - ఈతడు, తమ్ - వానిని, న వేద - తెలియడు, సః - ఆతడు, వేద - తెలియును.

స్వాయంభువ మనువు ఇట్లు పలికెను --- శుద్ధచైతన్యస్వరూపు డగు భగవానుని స్పర్శచే జగత్తు చేతనమగుచున్నది (సత్తా-స్ఫూర్తులను పొందుచున్నది). కాని, ఈ జగత్తు ఈశ్వరునకు చైతన్యమునిచ్చుట లేదు. ప్రళయములో ఈ జగత్తు (నిద్రలో ఈ దేహము) విలీనమైననూ, ఈ భగవానుడు తెలివిగా యుండును. ఈ జగత్తు (దేహము) ఆయనను తెలియలేదు. కాని, ఆయన క్షేత్రజ్ఞరూపుడై ఈ దేహమును తెలియుచునే యుండును.

ఆత్మావాస్యమిదం విశ్వం యత్కించిజ్జగత్యాం జగత్ ।
తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ధనమ్ ।। 10

ఇదమ్ - ఈ, విశ్వమ్ - సర్వము, ఆత్మావాస్యమ్ - ఆత్మచే కప్పివేయబడ దగినది, జగత్యామ్ - పృథివియందు, జగత్ - చరాచరము, కించిత్ - ఏదైననూ, యత్ - ఏది గలదో, తేన - ఆ కారణముచే, త్యక్తేన - త్యాగముచే, భుంజీథాః - పాలించుకొనుము, కస్య స్విత్ - ఎవనిదైననూ, ధనమ్ - ధనమును గురించి, మా గృధః - తృష్ణను చేయకుము, (మా గృధః - లోభమును చేయకుము, ధనమ్ - ధనము, కస్య స్విత్ - ఎవనిది?)

పృథివియందలి చరాచరమగు ఈ సర్వము ఏది గలదో, అది ఆత్మచే కప్పివేయబడవలెను (సర్వము ఆత్మయేనని తెలియవలెను). అందుచేతనే, కామనలను త్యాగము చేసి సాధకుడు తన స్వరూపమును పాలించుకొనవలెను. పరధనమును గురించి తృష్ణను చేయకుము. ఈ 'ధన మెవ్వరిది? ( ఎవ్వరిదైననూ కాదు).

యం న పశ్యతి పశ్యంతం చక్షుర్యస్య న రిష్యతి ।
తం భూతనిలయం దేవం సుపర్ణముపధావత ॥ 11

పశ్యంతమ్ - చూచుచున్న, యమ్ - ఎవనిని, న పశ్యతి - చూడ డో, యస్య - ఎవ్వాని, చక్షుః - చూపు, న రిష్యతి - లోపించదో, భూతనిల యమ్ - ప్రాణులే నివాసముగా కలిగినట్టియు, దేవమ్ - ప్రకాశస్వరూపుడై నట్టియు, సుపర్ణమ్ - జీవసఖుని, ఉపధావత - సేవించుడు.

చూసేది ఆత్మస్వరూపుడగు ఈశ్వరుడే. కాని, ఆయనను ఈ కన్ను చూడలేదు, మనస్సు తెలియలేదు. నిద్రలో మనస్సు, ఇంద్రియ ములు విలీనమైననూ, ఆత్మయొక్క చూపు లోపించేది కాదు (ఆ స్థితికి కూడ సాక్షిగనే యుండును). సకలప్రాణులలో ఆ ఈశ్వరుడు ఆత్మ చైతన్యరూపుడై యున్నాడు. జీవుని సఖుడగు ఆ పరమాత్మను సేవించుడు (విచారముచే తెలుసుకొనుడు).

న యస్యాద్యంతౌ మధ్యం చ స్వః పరో నాంతరం బహిః ।
విశ్వస్యామూని యద్యస్మాద్విశ్వం చ తదృతం మహత్ ॥12

యస్య - ఎవనికి, ఆది-అంతౌ - ఆది గాని అంతము గాని, మధ్యం చ - మధ్యము కూడ, న - లేదో, స్వః - తనవాడు, పరః - పరా యివాడు, అంతరమ్ - లోపల, బహిః - బయట, న - లేదో, విశ్వస్య - జగత్తునకు, అమూని - ఇవి, యస్మాత్ - ఎవని వలననో, విశ్వం చ - జగత్తు కూడ, యత్ - ఎవని రూపమో, తత్ - ఆ, మహత్ - పరబ్రహ్మ యే, ఋతమ్ - సత్యము.

పరబ్రహ్మకు ఆదిమధ్యాంతములు లేవు; తన-పరాయి గాని, లోపల-బయట గాని లేవు. జగత్తునకు ఆదిమధ్యాంతములు పరబ్రహ్మ వలననే కలుగుచున్నవి. జగత్తు పరబ్రహ్మరూపమే. ఆ పరబ్రహ్మయే సత్యము (జగత్తు మిథ్య).

స విశ్వకాయః పురుహూత ఈశః
సత్యస్స్వయంజ్యోతిరజః పురాణః ।

ధత్తేऽస్య జన్మాద్యజయాऽऽత్మశక్త్యా
తాం విద్యయోదస్య నిరీహ ఆస్తే ॥ 13

విశ్వకాయః - జగత్తే దేహముగా గలవాడు, పురుహూతః - అనేక ములగు నామములు గలవాడు అగు, సః - ఆ, ఈశః - ఈశ్వరుడు, సత్యః - అఖండసద్రూపుడు, స్వయంజ్యోతిః - స్వయంప్రకాశ స్వరూపుడు, అజః - పుట్టుక లేనివాడు, పురాణః - జగత్తునకు కారణమైనవాడు, అజయా - అనాదియగు, ఆత్మశక్త్యా - తన మాయాశక్తిచే, అస్య - ఈ జగత్తుయొక్క, జన్మ-ఆది - సృష్టిస్థితిలయములను, ధత్తే - చేయుచున్నాడు, విద్యయా - జ్ఞానముచే, తామ్ - ఆ మాయను, ఉదస్య - పోగొట్టుకొని, నిరీహః - క్రియలు లేనివాడై, ఆస్తే - ఉన్నాడు.

ఈ జగత్తు ఈశ్వరుని రూపమే. ఈ జగత్తులోని నామములన్నీ ఈశ్వరుని నామములే. అఖండసద్రూపుడు, స్వయంప్రకాశస్వరూపుడు, పుట్టుక లేనివాడు, జగత్తునకు కారణమైనవాడు అగు ఆ ఈశ్వరుడే ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను చేయుచున్నాడు. ఆయన తన విద్యాశక్తిచే మాయకు అతీతుడై నిష్క్రియుడై స్వస్వరూపమునందున్నాడు.

అథాగ్రే ఋషయః కర్మాణీహంతేऽకర్మహేతవే ।
ఈహమానో హి పురుషః ప్రాయోऽనీహాం ప్రపద్యతే ॥ 14

అథ - అందువలన, ఋషయః - మహర్షులు, అకర్మహేతవే - నైష్కర్మ్యసిద్ధి కొరకై, అగ్రే - ముందుగా, కర్మాణి - కర్మలను, ఈహంతే - చేయుదురు, హి - ఎందువలననగా, ఈహమానః - కర్మలను చేయుచున్న, పురుషః - వ్యక్తి, ప్రాయః - తరచుగా, అనీహామ్ - నైష్కర్మ్యమును, ప్రపద్యతే - పొందును.

కావుననే, మహర్షులు అకర్తృ-ఆత్మస్వరూపముయొక్క జ్ఞానమును పొంది జీవన్ముక్తులగుట కొరకై ముందుగా కర్మలను ఆచరించెదరు. ఎందుకంటే, కర్మలను చేయుచున్న వ్యక్తియే వాటిని భగవదర్పణము చేసి తరచుగా నైష్కర్మ్యసిద్ధిని బడయును.

ఈహతే భగవానీశో న హి తత్ర విషజ్జతే ।
ఆత్మలాభేన పూర్ణార్థో నావసీదంతి యేఽను తమ్ ॥ 15

ఈశః - సర్వేశ్వరుడగు, భగవాన్ - భగవానుడు, ఆత్మలాభేన - స్వరూపలాభముచే, పూర్ణ-అర్థః - పూర్ణమైన కామన గలవాడై, ఈహతే - కర్మలను చేయును, తత్ర - వాటియందు, న విషజ్జతే - తగుల్కొనడు, హి - నిశ్చయము, యే - ఎవరైతే, తమ్ - ఆయనను, అను - అనుసరించెద రో వారు, న అవసీదంతి - వినాశమును పొందరు.

సర్వేశ్వరుడగు భగవానుడు స్వరూపానుసంధానముచే పూర్ణమైన కామనలు గలవాడు. కావుననే, ఆయన సృష్టి మొదలగు కర్మలను చేసిన నూ, వాటిచే బంధించబడడు. ఎవరైతే ఆయనను అనుకరించి నిష్కామ ముగా కర్తృత్వాహంకారము లేకుండా కర్మలను చేసెదరో, వారు కర్మబంధ మునుండి విముక్తులగుదురు.

తమీహమానం నిరహంకృతం బుధం
నిరాశిషం పూర్ణమనన్యచోదితమ్ ।
నౄన్ శిక్షయంతం నిజవర్త్మసంస్థితం
ప్రభుం ప్రపద్యేఽఖిలధర్మభావనమ్ ॥ 16

ఈహమానమ్ - కర్మలను చేయుచున్నట్టియు, నిరహంకృతమ్ - అహంకారము లేనట్టియు, బుధమ్ - వివేకి యైనట్టియు, నిరాశిషమ్ - కామనలు లేనట్టియు, పూర్ణమ్ - పూర్ణుడైనట్టియు, అనన్యచోదితమ్ - ఇత రులచే (ఇతరములచే) ప్రేరితుడు కానట్టియు, నౄన్ - మానవులను, శిక్ష యంతమ్ - శిక్షణనిచ్చుచున్నట్టియు, నిజవర్త్మసంస్థితమ్ - తన మార్గము నందు నిలిచి యున్నట్టియు, అఖిలధర్మభావనమ్ - సకలధర్మములను పాలించే, తమ్ - ఆ, ప్రభుమ్ - ప్రభుని, ప్రపద్యే - శరణు వేడుచున్నాను.

ఆ ప్రభుడు ప్రకృతిపురుషవివేకము కలవాడగుటచే సృష్టి మొద లైన కర్మలను చేయుచున్ననూ అహంకారము లేనివాడు. ఆయన పూర్ణ-ఆత్మస్వరూపుడగుటచే కామనలు లేనివాడు. ఆయన రెండవది లేనివాడ గుటచే ఇతరముచే గాని, ఇతరులచే గాని ప్రేరితుడు కాని స్వతంత్రుడు.

ఆయన తన స్వరూపమునందు నిలిచి సకలధర్మములను పాలించును. ఆయనను నేను శరణు వేడుచున్నాను.

శ్రీశుక ఉవాచ ।
ఇతి మంత్రోపనిషదం వ్యాహరంతం సమాహితమ్ ।
దృష్ట్వాఽసురా యాతుధానా జగ్ధుమభ్యద్రవన్ క్షుధా ॥ 17

**ఇతి** - ఈ విధముగా, **మంత్ర-ఉపనిషదమ్** - మంత్రరూపముగా నుండే **ఆత్మతత్త్వము**ను, **వ్యాహరంతమ్** - పఠించుచున్నట్టియు, **సమాహితమ్** - ఏకాగ్రమగు చిత్తము గల ఆయనను, **దృష్ట్వా** - చూచి, **అసురాః** - అసురులు, **యాతుధానాః** - రాక్షసులు, **క్షుధా** - ఆకలితో, **జగ్ధుమ్** - తినుటకు, **అభి-అద్రవన్** - అభిముఖముగా పరుగెత్తిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా మంత్రరూపములోనున్న **ఆత్మతత్త్వము**ను పఠిస్తూ ఏకాగ్రచిత్తుడైయున్న ఆ మనువును చూచి, **అసురులు** (భోగపరాయణులు), రాక్షసులు (క్రూరకర్ములు) ఆకలితో **ఆయనను తినివేయుటకై** మీదకు ఉరికిరి.

**తాంస్తథావసితాన్ వీక్ష్య యజ్ఞస్సర్వగతో హరిః ।**
**యామైః పరివృతో దేవైర్హత్వాఽశాసత్త్రివిష్టపమ్ ॥ 18**

**తథా** - ఆ విధముగా, **అవసితాన్** - నిశ్చయించుకున్న, **తాన్** - వారిని, **యజ్ఞః** - యజ్ఞరూపుడు, **సర్వగతః** - సర్వవ్యాపకుడు అగు, **హరిః** - శ్రీహరి, **వీక్ష్య** - చూచి, **యామైః** - యాములనే, **దేవైః** - దేవతలతో, **పరివృతః** - చుట్టువారబడినవాడై, **హత్వా** - సంహరించి, **త్రివిష్టపమ్** - స్వర్గమును, **అశాసత్** - పాలించెను.

ఆ విధముగా మనువును తినుటకు నిశ్చయించుకున్న ఆ రాక్షసులను యజ్ఞుడు అనే రూపములోనున్న సర్వవ్యాపకుడగు శ్రీహరి చూచెను. ఆయన తన పుత్రులగు యాములు అనే దేవతలతో చుట్టువారబడి యున్నవాడై, ఆ రాక్షసులను సంహరించి తానే ఇంద్రుడై స్వర్గమును పాలించెను.

స్వారోచిషో ద్వితీయస్తు మనురగ్నేస్సుతోఽభవత్ ।
ద్యుమత్సుషేణరోచిష్మత్ప్రముఖాస్తస్య చాత్మజాః ॥ 19

అగ్నేః - అగ్నియొక్క, సుతః - పుత్రుడగు, స్వారోచిషః తు - స్వారోచిషుడైతే, ద్వితీయః - రెండవ, మనుః - మనువు, అభవత్ - ఆయెను, ద్యుమత్-సుషేణరోచిష్మత్-ప్రముఖాః చ - ద్యుమంతుడు సుషేణుడు రోచిష్మంతుడు మొదలగువారు, తస్య - ఆయనయొక్క, ఆత్మజాః - పుత్రులు.

అగ్నిపుత్రుడగు స్వారోచిషుడు రెండవ మనువు ఆయెను. ద్యుమంతుడు, సుషేణుడు, రోచిష్మంతుడు మొదలగువారు ఆయన పుత్రులు.

తత్రేంద్రో రోచనస్త్వాసీద్దేవాశ్చ తుషితాదయః ।
ఊర్జస్తంభాదయస్సప్త ఋషయో బ్రహ్మవాదినః ॥ 20

తత్ర - ఆ మన్వంతరమునందు, రోచనః తు - రోచనుడైతే, ఇంద్రః - ఇంద్రుడుగా, ఆసీత్ - ఉండెను, దేవాః చ - దేవతలు కూడ, తుషిత-ఆదయః - తుషితులు మొదలగువారు, ఊర్జస్తంభ-ఆదయః - ఊర్జస్తంభుడు మొదలగు, బ్రహ్మవాదినః - బ్రహ్మవేత్తలు, సప్త ఋషయః - సప్తర్షులు.

ఆ మన్వంతరములో రోచనుడు ఇంద్రుడు. తుషితులు, పారావతులు మొదలగువారు దేవతలు. ఊర్జస్తంభుడు, ఊర్జుడు మొదలగు బ్రహ్మవేత్తలు సప్తర్షులుగా నుండిరి.

ఋషేస్తు వేదశిరసస్తుషితా నామ పత్న్యభూత్ ।
తస్యాం జజ్ఞే తతో దేవో విభురిత్యభివిశ్రుతః ॥ 21

వేదశిరసః - వేదశిరసుడు అనే, ఋషేః తు - మహర్షికైతే, తుషితా నామ - తుషిత అని ప్రసిద్ధి గాంచిన, పత్నీ - భార్య, అభూత్ - ఉండెను, తతః - ఆయన వలన, తస్యామ్ - ఆమెయందు, విభుః - విభు

డు, ఇతి - అని, అభివిశ్రుతః - ప్రఖ్యాతిని గాంచిన, దేవః - భగవానుడు, జజ్ఞే - పుట్టెను.

వేదశిరసుడు అనే మహర్షికి తుషిత అని ప్రసిద్ధి గాంచిన భార్య ఉండెను. ఆయనకు ఆమెయందు భగవానుడు అవతరించి విభుడు అనే పేరుతో ప్రసిద్ధి గాంచెను.

అష్టాశీతిసహస్రాణి మునయో యే ధృతవ్రతాః ।
అన్వశిక్షన్ వ్రతం తస్య కౌమారబ్రహ్మచారిణః ॥ 22

అష్ట-అశీతిసహస్రాణి - ఎనభై ఎనిమిది వేలమంది, ధృతవ్రతాః - ధరించబడిన వ్రతము గల, యే - ఏ, మునయః - మహర్షులు గలరో వారు, కౌమారబ్రహ్మచారిణః - బాల్యమునుండి బ్రహ్మచారిగానున్న, తస్య - ఆ విభునియొక్క, వ్రతమ్ - వ్రతమును, అన్వశిక్షన్ - నేర్చుకొనిరి.

ఆ విభుడు బాల్యమునుండియు నైష్ఠిక బ్రహ్మచారిగనే ఉండెను. ఎనభై ఎనిమిది వేలమంది మహర్షులు ఆయననుండి ఆ బ్రహ్మచర్యవ్రతమును నేర్చుకొని పాటించిరి.

తృతీయ ఉత్తమో నామ ప్రియవ్రతసుతో మనుః ।
పవనస్సృంజయో యజ్ఞహోత్రాద్యాస్తత్సుతా నృప ॥ 23

నృప - ఓ మహారాజా!, ఉత్తమః నామ - ఉత్తముడని ప్రసిద్ధి గాంచిన, ప్రియవ్రతసుతః - ప్రియవ్రతుని పుత్రుడు, తృతీయః - మూడవ, మనుః - మనువు, పవనః - పవనుడు, సృంజయః - సృంజయుడు, యజ్ఞ హోత్ర-ఆద్యాః - యజ్ఞహోత్రుడు మొదలగువారు, తత్-సుతాః - ఆయన పుత్రులు.

ఓ మహారాజా! ఉత్తముడని ప్రసిద్ధి గాంచిన ప్రియవ్రతుని పుత్రుడు మూడవ మనువు. పవనుడు, సృంజయుడు. యజ్ఞహోత్రుడు, ఊర్జుడు మొదలగువారలు ఆయన పుత్రులు.

వసిష్ఠతనయాస్సప్త ఋషయః ప్రమదాదయః ।
సత్యా వేదశ్రుతా భద్రా దేవా ఇంద్రస్తు సత్యజిత్ ॥ 24

వసిష్ఠతనయాః - వసిష్ఠుని పుత్రులు, ప్రమద-ఆదయః - ప్రమదుడు మొదలగువారు, సప్త ఋషయః - సప్తర్షులు, సత్యాః - సత్యులు, వేదశ్రుతాః - వేదశ్రుతులు, భద్రాః - భద్రులు, దేవాః - దేవతలు, ఇంద్రః తు - ఇంద్రుడైతే, సత్యజిత్ - సత్యజిత్తు.

వసిష్ఠుని పుత్రులగు ప్రమదుడు, ద్యుమంతుడు మొదలగువారలు ఆ మన్వంతరములోని సప్తర్షులు. సత్యులు, వేదశ్రుతులు, భద్రులు అను వారలు దేవతలు కాగా, సత్యజిత్తు ఇంద్రుడాయెను.

ధర్మస్య సూనృతాయాం తు భగవాన్ పురుషోత్తమః ।
సత్యసేన ఇతి ఖ్యాతో జాతస్సత్యవ్రతైస్సహ ॥ 25

ధర్మస్య - ధర్మునకు, సూనృతాయాం తు - సూనృతయందైతే, భగవాన్ - భగవానుడగు, పురుషోత్తమః - పురుషోత్తముడు, సత్యసేనః - సత్యసేనుడు, ఇతి - అని, ఖ్యాతః - ప్రఖ్యాతిని చెందినవాడై, సత్యవ్రతైః సహ - సత్యవ్రతులతో గూడి, జాతః - జన్మించెను.

పురుషోత్తమ భగవానుడు ధర్మునకు సూనృతయందు జన్మించి సత్యసేనుడని ప్రసిద్ధి గాంచెను. ఆయనకు తోడుగా సత్యవ్రతులనే దేవగణము ఉండెను.

సోఽనృతవ్రతదుశ్శీలానసతో యక్షరాక్షసాన్ ।
భూతద్రుహో భూతగణాంస్త్వవధీత్సత్యజిత్సఖః ॥ 26

సత్యజిత్-సఖః - సత్యజిత్తునకు మిత్రుడగు, సః - ఆ సత్యసేనుడు, అనృతవ్రతదుశ్శీలాన్ - అసత్యమే వ్రతముగా గల దుష్టస్వభావులైనట్టియు, అసతః - దుష్టులైన, యక్షరాక్షసాన్ - యక్షులను రాక్షసులను, భూతద్రుహః - ప్రాణులకు ద్రోహమును చేసే, భూతగణాన్ తు - భూతముల గణములను కూడ, అవధీత్ - సంహరించెను.

సత్యజిత్తు అనే ఇంద్రునకు మిత్రుడై ఆ సత్యసేనుడు దుష్టులగు యక్షులను, రాక్షసులను సంహరించెను. వారు అసత్యమునందు నిష్ఠ గల దుష్టస్వభావులు. అంతేగాక, ఆయన ప్రాణులకు ద్రోహమును చేసే భూత ముల గణములను కూడ సంహరించెను.

చతుర్థ ఉత్తమభ్రాతా మనుర్నామ్నా చ తామసః ।
పృథుః ఖ్యాతిర్నరః కేతురిత్యాద్యా దశ తత్సుతాః ॥ 27

ఉత్తమభ్రాతా - ఉత్తముని సోదరుడు, నామ్నా - పేరుచే, తామసః - తామసుడు, చతుర్థః - నాల్గవ, మనుః చ - మనువు, పృథుః - పృథువు, ఖ్యాతిః - ఖ్యాతి, నరః - నరుడు, కేతుః - కేతువు, ఇతి-ఆద్యాః - ఈ మొదలైన, దశ - పదిమంది, తత్-సుతాః - వాని పుత్రులు.

ఉత్తముని సోదరుడు తామసుడు అనే ఆయన నాల్గవ మనువు. ఆయనకు పృథువు, ఖ్యాతి, నరుడు, కేతువు, శాంతుడు మొదలగు పది మంది పుత్రులు గలరు.

సత్యకా హరయో వీరా దేవాస్త్రిశిఖ ఈశ్వరః ।
జ్యోతిర్ధామాదయస్సప్త ఋషయస్తామసేఽంతరే ॥ 28

తామసే అంతరే - తామస మన్వంతరమునందు, సత్యకాః - సత్యకులు, హరయః - హరులు, వీరాః - వీరులు, దేవాః - దేవతలు, త్రిశిఖః - త్రిశిఖుడు, ఈశ్వరః - దేవతలకు ప్రభువు, జ్యోతిర్ధామ-ఆదయః - జ్యోతిర్ధాముడు మొదలగువారు, సప్త ఋషయః - సప్తర్షులు.

తామస మన్వంతరములో సత్యకులు, హరులు, వీరులు అనువా రలు దేవతలు కాగా, త్రిశిఖుడు వారికి ప్రభువగు ఇంద్రుడు. జ్యోతిర్ధాము డు, కావ్యుడు మొదలగువారు సప్తర్షులు.

దేవా వైధృతయో నామ విధృతేస్తనయా నృప ।
నష్టాః కాలేన యైర్వేదా విధృతాస్స్వేన తేజసా ॥ 29

నృప - ఓ రాజా!, విధృతేః - విధృతియొక్క, తనయాః - పుత్రులు, వైధృతయః నామ - వైధృతులు అని ప్రసిద్ధి గాంచినవారు, దేవాః - దేవతలు, యైః - ఎవరిచేనైతే, స్వేన - తమ, తేజసా - తేజస్సుచే, కాలేన - కాలముచే, నష్టాః - లుప్తములైన, వేదాః - వేదములు, విధృతాః - రక్షించబడినవో.

ఓ మహారాజా! ఆ తామస మన్వంతరములో వైధృతులని ప్రసిద్ధి గాంచిన దేవతలు కూడ గలరు. వారు విధృతి సంతానము. వారు కాలప్రభావముచే లుప్తమైన వేదములను కాపాడినారు.

తత్రాపి జజ్ఞే భగవాన్ హరిణ్యాం హరిమేధసః ।
హరిరిత్యాహృతో యేన గజేంద్రో మోచితో గ్రహాత్ ॥ 30

తత్ర అపి - ఆ మన్వంతరమునందే, భగవాన్ - భగవానుడు, హరిమేధసః - హరిమేధసుని వలన, హరిణ్యామ్ - హరిణియందు, జజ్ఞే - జన్మించెను, హరిః - హరి, ఇతి - అని, ఆహృతః - నిర్దేశించబడినవాడు, యేన - ఎవనిచే, గజ-ఇంద్రః - గజేంద్రుడు, గ్రహాత్ - మొసలినుండి, మోచితః - విడిపించ బడినాడో.

ఆ మన్వంతరమునందే భగవానుడు హరిమేధసుడు-హరిణి అనే దంపతులకు పుత్రుడై జన్మించి, హరి అని పిలువబడినాడు. అయన గజేంద్రుని మొసలి బారినుండి విడిపించెను.

రాజోవాచ ।
బాదరాయణ ఏతత్తే శ్రోతుమిచ్ఛామహే వయమ్ ।
హరిర్యథా గజపతిం గ్రాహగ్రస్తమమూముచత్ ॥ 31

బాదరాయణే - బాదరాయణుని పుత్రుడవగు ఓ శుక మహర్షీ!, వయమ్ - మేము, ఏతత్ - దీనిని, తే - నీనుండి, శ్రోతుమ్ - వినుటకు, ఇచ్ఛామహే - కోరుచున్నాము, హరిః - హరి, గ్రాహగ్రస్తమ్ - మొసలిచే పట్టుకొనబడిన, గజపతిమ్ - గజేంద్రుని, యథా - ఏ విధముగా, అమూముచత్ - విడిపించెనో.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- బాదరాయణ వ్యాసుని పుత్రుడవగు ఓ శుక మహర్షీ! హరి మొసలికి చిక్కిన గజేంద్రుని ఏ విధముగా విడిపించెనో, మేము నీనుండి విన గోరుచున్నాము.

తత్కథాసు మహత్పుణ్యం ధన్యం స్వస్త్యయనం శుభమ్ ।
యత్ర యత్రోత్తమశ్లోకో భగవాన్ గీయతే హరిః ॥ 32

తత్ - అది, కథాసు - కథలయందు, మహత్ - గొప్పది, పుణ్యమ్ - పావనమైనది, ధన్యమ్ - సంపదలనిచ్చునది, స్వస్తి-అయనమ్ - కల్యాణములకు నిలయము, శుభమ్ - మంగళకరము, యత్ర యత్ర - ఏయే కథలయందైతే, ఉత్తమశ్లోకః - గొప్ప కీర్తి గల, హరిః భగవాన్ - శ్రీహరి భగవానుడు, గీయతే - గానము చేయబడునో.

శ్రీహరి భగవానుని కీర్తి ఉత్తమమైనది. దానిని గానము చేసే గాథ సకలగాథలలో గొప్పది. పావనమైన శ్రీహరి గాథ సంపదలనిచ్చును. మంగళకరమగు అట్టి గాథ కల్యాణములకు నిధానము.

సూత ఉవాచ ।
పరీక్షితైవం స తు బాదరాయణిః
ప్రాయోపవిష్టేన కథాసు చోదితః ।
ఉవాచ విప్రాః ప్రతినంద్య పార్థివం
ముదా మునీనాం సదసి స్మ శృణ్వతామ్ ॥ 33

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే మన్వంతర
వర్ణనం నామ ప్రథమోఽధ్యాయః ॥

విప్రాః - ఓ మహర్షులారా!, ప్రాయోపవిష్టేన - ప్రాయోపవేశము చేసియున్న, పరీక్షితా - పరీక్షిత్తుచే, ఏవమ్ - ఈ విధముగా, కథాసు - గాథలయందు, చోదితః - ప్రేరేపించబడిన, సః - ఆ, బాదరాయణిః తు - వ్యాసపుత్రుడగు శుకుడైతే, పార్థివమ్ - ఆ మహారాజును, ప్రతినంద్య - అభినందించి, సదసి - సభయందు, మునీనామ్ - మహర్షులు, ముదా - ఆనందముతో, శృణ్వతామ్ - వినుచుండగా, ఉవాచ స్మ - చెప్పెనట.

ఓ మహర్షులారా! ప్రాయోపవేశమును చేసియున్న పరీక్షిత్తు ఈ విధముగా గాథలను చెప్పుడని బాదరాయణ వ్యాసుని పుత్రుడగు శుక మహర్షిని ప్రేరేపించెను. అపుడాయన ఆ రాజును అభినందించి, సభలోని మహర్షులు ఆనందముతో వినుచుండగా ఆ గాథను చెప్పెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
మన్వంతరములను వర్ణించే మొదటి
అధ్యాయము ముగిసినది (1) .

*****

# అథ ద్వితీయోऽధ్యాయః

## గజేంద్రోపాఖ్యానము - గజేంద్రుని మొసలి పట్టుకొనుట

శ్రీశుక ఉవాచ ।
ఆసీద్గిరివరో రాజంస్త్రికూట ఇతి విశ్రుతః ।
క్షీరోదేనావృతశ్శ్రీమాన్ యోజనాయుతముచ్ఛ్రితః ॥ 1

రాజన్ - ఓ మహారాజా!, త్రికూటః - త్రికూటము, ఇతి - అని, విశ్రుతః - వినుతికెక్కినది, క్షీరోదేన - పాల సముద్రముచే, ఆవృతః - చుట్టువారబడి యున్నది, శ్రీమాన్ - అందమైనది, యోజన-అయుతమ్ - పదివేల యోజనములను, ఉచ్ఛ్రితః - ఎత్తైన, గిరివరః - గొప్ప పర్వతము, ఆసీత్ - ఉండెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! త్రికూటము అని వినుతికెక్కిన అందమైన పర్వతము గలదు. పదివేల యోజనముల ఎత్తు గల ఆ పర్వతమును పాల సముద్రము చుట్టువారి యుండును.

తావతా విస్తృతః పర్యక్ త్రిభిశ్శృంగైః పయోనిధిమ్ ।
దిశః ఖం రోచయన్నాస్తే రౌప్యాయసహిరణ్మయైః ॥ 2

పర్యక్ - చుట్టూ, తావతా - అంతే పరిమాణముచే, విస్తృతః - విస్తరించి యున్నది, రౌప్య-ఆయసహిరణ్మయైః - వెండి ఇనుము బంగారములు, త్రిభిః - మూడు, శృంగైః - శిఖరములతో, పయోనిధిమ్ - సముద్రమును, దిశః - దిక్కులను, ఖమ్ - ఆకాశమును, రోచయన్ - ప్రకాశింపచేయుచున్నదై, ఆస్తే - ఉన్నది.

దాని చుట్టు కొలత కూడ అంతే ఉండెను. దానికి వెండి, ఇనుము, బంగారముల మూడు శిఖరములు ఉండెను. అవి సముద్రమును, దిక్కుల ను, ఆకాశమును ప్రకాశింప జేసెను.

అన్యైశ్చ కకుభస్సర్వా రత్నధాతువిచిత్రితైః ।
నానాద్రుమలతాగుల్మైర్నిర్ఘోషైర్నిర్ఝరాంభసామ్ ॥ 3

రత్నధాతువిచిత్రితైః - రత్నములతో గైరికాది ధాతువులతో వేర్వేరు రంగులు కలిగినట్టియు, నానాద్రుమలతాగుల్మైః - వివిధములైన చెట్లు తీగలు పొదలు గల, అన్యైః చ - ఇతరములగు శిఖరములతో గూడ, నిర్ఝర-అంభసామ్ - కొండకాలువల నీళ్లయొక్క, నిర్ఘోషైః - ధ్వనులతో, సర్వాః - సకలములైన, కకుభః - దిక్కులను.

ఆ పర్వతముయొక్క ఇతరములగు శిఖరములు రత్నములతో మరియు గైరికాది ధాతువులతో వేర్వేరు రంగులను కలిగియున్నవి. వాటిపై ఉండే వివిధములైన చెట్లు, తీగలు, పొదలు, కొండకాలువల నీటి గలగలలు దిక్కులనన్నింటినీ ప్రకాశింప జేయుచుండెను.

స చావనిజ్యమానాంఘ్రిస్సమంతాత్పయఊర్మిభిః ।
కరోతి శ్యామలాం భూమిం హరిన్మరకతాశ్మభిః ॥ 4

పయః-ఊర్మిభిః - నీటి తరంగములతో, సమంతాత్ - అన్ని వైపు లా, అవనిజ్యమాన-అంఘ్రిః - కడుగబడుచున్న పాదములు గల, సః చ - ఆ పర్వతము, హరిత్-మరకత-అశ్మభిః - పచ్చని మరకత మాణిక్యములు పొదిగిన రాళ్లతో, భూమిమ్ - భూమిని, శ్యామలామ్ - శ్యామల వర్ణము గలదానివిగా, కరోతి - చేయుచున్నది.

సముద్రతరంగములు ఆ పర్వతముయొక్క పాదభూములను అన్ని వైపులా ప్రక్షాళనము చేయుచుండును. పచ్చని మరకత మాణిక్య ములు పొదిగియున్న ఆ పర్వతముయొక్క రాళ్లు అచటి నేలను శ్యామల వర్ణము గలదిగా చేయుచున్నవి.

సిద్ధచారణగంధర్వవిద్యాధరమహోరగైః ।
కిన్నరైరప్సరోభిశ్చ క్రీడద్భిర్జుష్టకందరః ॥ 5

సిద్ధచారణగంధర్వవిద్యాధరమహా-ఉరగైః - సిద్ధులు చారణులు గంధర్వులు విద్యాధరులు గొప్ప నాగులచే, కిన్నరైః - కిన్నరులచే, అప్సరోభిః చ - అప్సరసలచే గూడ, జుష్టకందరః - సేవించబడే గుహలు గలది.

సిద్ధులు, చారణులు, గంధర్వులు, విద్యాధరులు, గొప్ప నాగులు, కిన్నరులు, అప్సరసలు కూడ ఆ పర్వతగుహలను సేవించుచుందురు.

యత్ర సంగీతసన్నాదైర్నదద్గుహమమర్షయా ।
అభిగర్జంతి హరయః శ్లాఘినః పరశంకయా ॥ 6

యత్ర - ఎక్కడనైతే, సంగీతసన్నాదైః - సంగీతముయొక్క చక్కని ధ్వనులచే, నదద్-గుహమ్ - ప్రతిధ్వనించుచున్న గుహలు గల ప్రదేశమును, అభి - అభిముఖముగా, శ్లాఘినః - ప్రసిద్ధమైన బలము గల, హరయః - సింహములు, పరశంకయా - ఇంకో సింహమనే ఆశంకతో, అమర్షయా - అసహనముతో, గర్జంతి - గర్జించుచున్నవో.

అచట సంగీతముయొక్క చక్కని ధ్వనులతో గుహలు ప్రతిధ్వనించగా, సింహములు తమకు ప్రతిపక్షులైన సింహములు గర్జించుచున్నవనే ఆశంకతో అటువైపు తిరిగి అసహనముగా గర్జించుచున్నవి. సింహముల ప్రతాపము లోకప్రసిద్ధమైనదే గదా!

నానారణ్యపశువ్రాతసంకులద్రోణ్యలంకృతః ।
చిత్రద్రుమసురోద్యానకలకంఠవిహంగమః ॥ 7

నానా-అరణ్యపశువ్రాతసంకులద్రోణి-అలంకృతః - పలురకముల అడవి జంతువులతో రద్దీగా ఉండే కొండ పల్లములతో అలంకరించబడి యున్నది, చిత్రద్రుమసుర-ఉద్యానకలకంఠవిహంగమః - రకరకముల చెట్లు గల దేవతల ఉద్యానములయందలి తియ్యని కూతల పక్షులు గలది.

ఆ పర్వతమునందలి లోయలు పలురకముల అడవి జంతువులతో రద్దీగా అందముగా నున్నవి. ఆ పర్వతమునందలి ఉద్యానములలో దేవతలు సంచరించెదరు. అచటి రకరకముల చెట్లపై పక్షులు మధురముగా కూయుచుండును.

సరిత్సరోభిరచ్ఛోదైః పులినైర్మణివాలుకైః ।
దేవస్త్రీమజ్జనామోదసౌరభాంబ్వనిలైర్యుతః ॥ 8

అచ్ఛోదైః - స్వచ్ఛమగు నీరు గల, సరిత్-సరోభిః - కొండ కాలువలతో మరియు సరస్సులతో, మణివాలుకైః - మణుల వంటి ఇసుకలు గల, పులినైః - తిన్నెలతో, దేవస్త్రీమజ్జన-ఆమోదసౌరభ-అంబు-అనిలైః - దేవతాస్త్రీల జలకాలాడుటచే వచ్చిన పరిమళముచే సుగంధభరితములైన నీరు వాయువులతో, యుతః - కూడియున్నది.

ఆ పర్వతమునందలి కొండ కాలువలలో మరియు సరస్సులలో స్వచ్ఛమగు నీరు గలదు. ఆ జలములలో దేవతాస్త్రీలు జలకాలాడుటచే ఆ జలములు, వాటిపైనుండి వీచే గాలులు పరిమళ భరితములై యుండును. అచటి సరస్సుల ఇసుక తిన్నెలు మణుల గుట్టల వలె ప్రకాశించును.

తస్య ద్రోణ్యాం భగవతో వరుణస్య మహాత్మనః ।
ఉద్యానమృతుమన్నామ ఆక్రీడం సురయోషితామ్ ॥ 9
సర్వతోఽలంకృతం దివ్యైర్నిత్యం పుష్పఫలద్రుమైః ।

తస్య - ఆ పర్వతముయొక్క, ద్రోణ్యామ్ - లోయయందు, భగవతః - పూజనీయుడైనట్టియు, మహాత్మనః - సర్వాత్మభావము గల, వరుణస్య - వరుణునియొక్క, ఉద్యానమ్ - ఉద్యానము, ఋతుమత్ - ఋతుమత్ అని, నామ - ప్రసిద్ధి గాంచినది, సురయోషితామ్ - దేవతాస్త్రీలకు, ఆక్రీడమ్ - విహారస్థానము, సర్వతః - అంతటా, నిత్యమ్ - అన్ని కాలములయందు, దివ్యైః - దేవలోకమునకు చెందిన, పుష్పఫలద్రుమైః - పుష్పములు పళ్లు చెట్లతో, అలంకృతమ్ - అలంకరించబడినది.

ఆ పర్వతపు లోయలో సర్వాత్మభావము గల వరుణ భగవానుని ఉద్యానము గలదు. ఋతుమత్ అని ప్రసిద్ధి గాంచిన ఆ ఉద్యానమునందు దేవతాస్త్రీలు విహరించుచుందురు. ఆ ఉద్యానము అంతటా అన్ని కాలములలో దేవలోకమునకు చెందిన పుష్పములు, పళ్లు, చెట్లతో చాల శోభగా నుండును.

మందారైః పారిజాతైశ్చ పాటలాశోకచంపకైః ॥ 10

చూతైః ప్రియాలైః పనసైరామ్రైరామ్రాతకైరపి ।
క్రముకైర్నాలికేరైశ్చ ఖర్జూరైర్బీజపూరకైః ॥ 11

మధూకైస్సాలతాలైశ్చ తమాలైరసనార్జునైః ।
అరిష్టోదుంబరప్లక్షైర్వటైః కింశుకచందనైః ॥ 12

పిచుమందైః కోవిదారైస్సరలైస్సురదారుభిః ।
ద్రాక్షేక్షురంభాజంబూభిర్బదర్యక్షాభయామలైః ॥ 13

బిల్వైః కపిత్థైర్జంబీరైర్వృతో భల్లాతకాదిభిః ।

మందారైః - మందారములతో, పారిజాతైః చ - పారిజాతములతో, పాటల-అశోకచంపకైః - కలిగొట్టు చెట్లు అశోకములు సంపెంగలతో, చూతైః - మామిళ్లతో, ప్రియాలైః - ద్రాక్ష మొక్కలతో, పనసైః - పనస చెట్లతో, ఆమ్రైః - మామిళ్లతో, ఆమ్రాతకైః అపి - అంబాళపు చెట్లతో గూడ, క్రముకైః - పోకచెట్లతో, నాలికేరైః చ - కొబ్బరి చెట్లతో గూడ, ఖర్జూరైః - ఖర్జూర వృక్షములతో, బీజపూరకైః - మాదీఫల వృక్షములతో, మధూకైః - ఇప్పచెట్లతో, సాలతాలైః చ - మద్ది తాటి చెట్లతో, తమాలైః - ఉలిమిరి చెట్లతో, అసన-అర్జునైః - వేగిస ఏరుమద్ది చెట్లతో, అరిష్ట-ఉదుంబరప్లక్షైః - కుంకుడు మేడి జువ్వి చెట్లతో, వటైః - మర్రి చెట్లతో, కింశుకచందనైః - మానేరు గంధపు చెట్లతో, పిచుమందైః - వేము చెట్లతో, కోవిదారైః - రక్త కాంచన వృక్షములతో, సరలైః - తెల్లతెగడ చెట్లతో, సురదారుభిః - దేవదారు వృక్షములతో, ద్రాక్షా-ఇక్షురంభాజంబూభిః - ద్రాక్ష చెరుకు అరటి నేరేడు చెట్లతో, బదరీ-అక్ష-అభయ-అమలైః - రేగు తాండ్ర వట్టివేరు నేల

ఉసిరి చెట్లతో, బిల్వైః - మారేడు చెట్లతో, కపిత్థైః - వెలగ చెట్లతో, జంబీరైః - నిమ్మ చెట్లతో, భల్లాతక-ఆదిభిః - జీడిమామిడి మొదలగు చెట్లతో, వృతః - కూడియున్నది.

మందారములు, పారిజాతములు, కలిగొట్టు చెట్లు, అశోకవృక్షములు, సంపెంగ చెట్లు, వివిధరకముల మామిళ్లు, రకరకముల ద్రాక్ష మొక్కలు, పనసలు, అంబాళపు చెట్లు, పోక చెట్లు, కొబ్బరి చెట్లు, ఖర్జూరపు చెట్లు, మాదీఫల వృక్షములు, ఇప్ప, మద్ది, తాటి, ఉలిమిరి, వేగిస, ఏరుమద్ది, కుంకుడు, మేడి, జువ్వి, మఱ్ఱి, మానేరు, గంధము, వేము చెట్లు, రక్త కాంచన వృక్షములు, తెల్లతెగడ, దేవదారు, చెరుకు మొక్కలు, అరటి, నేరేడు, రేగు, తాండ్ర, వట్టివేరు, నేల ఉసిరి, మారేడు, వెలగ, నిమ్మ, జీడిమామిడి మొదలగు చెట్లు ఆ పర్వతముపై గలవు.

తస్మిన్ సరస్సువిపులం లసత్కాంచనపంకజమ్ ॥ 14

కుముదోత్పలకహ్లారశతపత్రశ్రియోర్జితమ్ ।
మత్తషట్పదనిర్ఘుష్టం శకుంతైశ్చ కలస్వనైః ॥ 15

తస్మిన్ - ఆ ఉద్యానవనమునందు, సువిపులమ్ - మిక్కిలి విశాలమైన, సరః - సరస్సు, లసత్-కాంచనపంకజమ్ - ప్రకాశించే బంగరు పద్మములు గలది, కుముద-ఉత్పలకహ్లారశతపత్రశ్రియా - తెల్ల కలువలు నల్ల కలువలు చెంగలువలు తామర పువ్వుల శోభతో, ఊర్జితమ్ - సంపన్నమైనది, మత్తషట్-పదనిర్ఘుష్టమ్ - మత్తెక్కిన తుమ్మెదలతో ప్రతిధ్వనిస్తున్నది. కలస్వనైః - మధురమైన ధ్వనులు గల, శకుంతైః చ - పక్షులతో గూడ.

ఆ ఉద్యానములో మిక్కిలి విశాలమైన సరస్సు గలదు. దానిలో ప్రకాశించే బంగరు పద్మములు గలవు. అది తెల్ల కలువలు, నల్ల కలువలు, చెంగలువలు, తామర పువ్వుల శోభతో సంపన్నమై యుండెను. అది మధురముగా కూసే పక్షులతో, మత్తెక్కిన తుమ్మెదలతో ప్రతిధ్వనించుచుండెను.

హంసకారండవాకీర్ణం చక్రాహ్వైస్సారసైరపి ।
జలకుక్కుటకోయష్టిదాత్యూహకులకూజితమ్ ॥ 16

హంసకారండవ-ఆకీర్ణమ్ - హంసలు కారండవ పక్షులతో ఎడము లేక నిండియున్నది, చక్ర-ఆహ్వైః - జక్కవ పక్షులతో, సారసైః అపి - బెగ్గురు పక్షులతో గూడ, జలకుక్కుటకోయష్టిదాత్యూహకులకూజితమ్ - నీటి కోళ్లు గ్రుడ్డి కొంగలు భరతపక్షుల గుంపులతో ప్రతిధ్వనించుచున్నది.

ఆ సరస్సు హంసలు, కారండవ పక్షులు, జక్కవ, బెగ్గురు పక్షులతో ఎడము లేకుండా నిండియుండెను. నీటి కోళ్లు, గ్రుడ్డి కొంగలు, భరత పక్షుల గుంపులతో ఆ సరస్సు ప్రతిధ్వనించుచుండెను.

మత్స్యకచ్ఛపసంచారచలత్పద్మరజఃపయః ।
కదంబవేతసనలనీపవంజులకైర్వృతమ్ ॥ 17

మత్స్యకచ్ఛపసంచారచలత్-పద్మరజఃపయః - చేపలు తాబేళ్లు ఇటునటు తిరుగుచుండుటచే కదిలే పద్మముల పుప్పొడితో కూడిన నీరు గలది, కదంబవేతసనలనీపవంజులకైః - కడిమి చెట్లు నీటి ప్రబ్బలి చెట్లు కిక్కస గడ్డి మంకెన చెట్లు తినాస చెట్లతో, వృతమ్ - కూడియున్నది.

చేపలు, తాబేళ్లు కదలుచుండగా పద్మములు కదిలి రాలిన పుప్పొడితో ఆ సరస్సులోని నీరు నిండియుండెను. కడిమి చెట్లు, నీటి ప్రబ్బలి చెట్లు, కిక్కస గడ్డి, మంకెన చెట్లు, తినాస చెట్లతో ఆ సరస్సు తీరముల వెంబడి నిండి యుండెను.

కుందైః కురవకాశోకైశ్శిరీషైః కుటజేంగుదైః ।
కుబ్జకైస్స్వర్ణయూథీభిర్నాగపున్నాగజాతిభిః ॥ 18

మల్లికాశతపత్రైశ్చ మాధవీజాలకాదిభిః ।
శోభితం తీరజైశ్చాన్యైర్నిత్యర్తుభిరలం ద్రుమైః ॥ 19

కుందైః - గన్నేరు చెట్లతో, కురవక-అశోకైః - గోరంట కంకేళి చెట్లతో, శిరీషైః - దిరిసెన చెట్లతో, కుటజ-ఇంగుదైః - అవిసె గార చెట్లతో, కుబ్జకైః - ఉత్తరేణి మొక్కలతో, స్వర్ణయూథీభిః - ఎఱ్ఱ బెంకాయ అడవి మొల్ల చెట్లతో, నాగపున్నాగజాతిభిః - పొన్న సురపొన్న ఉసిరి చెట్లతో, మల్లికాశతపత్రైః చ - మల్లె తీగలు తామరలతో, మాధవీజాలక-ఆదిభిః -

గురివింద అరటి మొదలగు చెట్లతో, తీరజైః - తీరములయందు పెరిగే, నిత్య-ఋతుభిః - నిత్యము పూలతో పళ్లతో నిండియుండే, అన్యైః - ఇతర ములైన, ద్రుమైః - చెట్లతో, అలమ్ - మిక్కిలి, శోభితమ్ - శోభిల్ల జేయబ డినది.

ఆ సరస్సు తీరమునందు గన్నేరు, గోరంట, కంకేళి, దిరిసెన, అవి సె, గార, ఉత్తరేణి, ఎఱ్ఱ టెంకాయ, అడవి మొల్ల, పొన్న, సురపొన్న, ఉసి రి, గురివింద, అరటి మొదలగు ఇతరములగు చెట్లు, మల్లె తీగలు, తామర మొక్కలు పెరుగుతూ ఆ సరస్సుయొక్క శోభను మిక్కిలి ఇనుమడింప జేయుచుండెను. ఆ చెట్లు అన్ని ఋతువులలో పూలతో, పళ్లతో నిండి యుండెను.

తత్రైకదా తద్గిరికాననాశ్రయః కరేణుభిర్వారణయూథపశ్చరన్,
సకంటకాన్ కీచకవేణువేత్రవద్విశాలగుల్మం ప్రరుజన్వనస్పతీన్।20

తత్ర - అచట, ఏకదా - ఒకనాడు, తద్-గిరికానన-ఆశ్రయః - ఆ పర్వతముయొక్క అడవిలో నివసించే, వారణయూథపః - ఏనుగుల దండుకు నాయకుడు, కరేణుభిః - ఆడు ఏనుగులతో గూడి, చరన్ - సంచ రించువాడై, సకంటకాన్ - ముళ్లతో కూడిన, వనస్పతీన్ - చెట్లను, కీచకవే ణువేత్రవద్-విశాలగుల్మమ్ - సన్న వెదురు వెదురు పేములు గల విశాల మైన పొదను, ప్రరుజన్ - విరుగకొట్టుచున్నది.

ఆ అడవిలో ఒక గజేంద్రుడు నివసించుచుండెను. అది ఒకనాడు తన గుంపులోని ఆడు ఏనుగులతో గూడి సంచారము చేస్తూ, ముళ్ల చెట్ల ను, విశాలమైన సన్న వెదురు వెదురు వేము డొంకలను విరుగకొట్టుచుండె ను.

యద్గంధమాత్రాద్ధరయో గజేంద్రా
వ్యాఘ్రాదయో వ్యాలమృగాస్సఖడ్గాః ।
మహోరగాశ్చాపి భయాద్ద్రవంతి
సగౌరకృష్ణాశ్శరభశ్చమర్యః ॥ 21

యద్-గంధమాత్రాత్ - ఎవని గంధము మాత్రము వలన, హరయః - సింహములు, గజ-ఇంద్రాః - పెద్ద ఏనుగులు, వ్యాఘ్ర-ఆదయః - పెద్దపులి మొదలైన, వ్యాలమృగాః - క్రూరమృగములు, సఖడ్గాః - ఖడ్గమృగములతో కూడినవి, మహా-ఉరగాః చ అపి - పెద్ద సర్పములు కూడ, సగౌరకృష్ణాః - గౌరమృగములు నల్ల యిర్రులతో కూడినవి, శరభాః - మీగండ్ల మెకములు, చమర్యః - సవరపు మెకములు, భయాత్ - భయము వలన, ద్రవంతి - పారిపోవునో.

ఆ ఏనుగు వాసన తగిలినంత మాత్రాన సింహములు, మిగిలిన పెద్ద ఏనుగులు, పెద్దపులులు ఖడ్గమృగములు మొదలగు క్రూరమృగములు, పెద్ద సర్పములు, గౌరమృగములు, నల్ల యిర్రులు, మీగండ్ల మెకములు, సవరపు మెకములు కూడ భయముతో పరుగు తీయుచుండును.

వృకా వరాహా మహిషర్క్షశల్యా గోపుచ్ఛసాలావృకమర్కటాశ్చ ।
అన్యత్ర క్షుద్రా హరిణాశ్శశాదయశ్చరంత్యభీతా యదనుగ్రహేణ॥

యద్-అనుగ్రహేణ - దేని అనుగ్రహముచే, వృకాః - తోడేళ్లు, వరాహాః - అడవి పందులు, మహిష-ఋక్షశల్యాః - అడవి దున్నలు ఎలుగుబంట్లు ఏదుపందులు, గోపుచ్ఛసాలావృకమర్కటాః చ - కొండముచ్చులు అడవి కుక్కలు కోతులు కూడ, హరిణాః - లేళ్లు, శశ-ఆదయః చ - కుందేళ్లు మొదలగు, క్షుద్రాః - చిన్న మృగములు, అభీతాః - భయము లేనివై, అన్యత్ర - మరియొకచోట, చరంతి - సంచరించునో.

ఆ ఏనుగు అనుగ్రహమును పొందిన తోడేళ్లు, అడవి పందులు, అడవి దున్నలు, ఎలుగుబంట్లు, ఏదుపందులు, కొండముచ్చులు, అడవి కుక్కలు, కోతులు, లేళ్లు, కుందేళ్లు మొదలగు అనేక చిన్న జంతువులు దానికి దూరముగా సంచరించును.

స ఘర్మతప్తః కరిభిః కరేణుభిర్వృతో మదచ్యుత్కలభైరనుద్రుతః,
గిరిం గరిమ్ణా పరితః ప్రకంపయన్నిషేవ్యమాణోఽలికులైర్మదాశనైః।

సరోఽనిలం పంకజరేణురూషితం
జిఘ్రన్ విదూరాన్మదవిహ్వలేక్షణః ।
వృతస్స్వయూథేన తృషార్దితేన తత్-
సరోవరాభ్యాశమథాగమద్ద్రుతమ్ ॥ 24

ఘర్మతప్తః - వేడిచే తాపమును పొందినది, కరిభిః - ఏనుగులతో, కరేణుభిః - ఆడు ఏనుగులతో, వృతః - చుట్టువారబడియున్నది, మదచ్యుత్-కలభైః - మదమును స్రవించే ఏనుగు గున్నలచే, అనుద్రుతః - పరుగెత్తుతూ అనుసరించబడునది, గరిమ్ణా - బరువుచే, గిరిమ్ - పర్వతమును, పరితః - చుట్టూ, ప్రకంపయన్ - అధికముగా కంపింప జేయుచున్నది, మద-అశనైః - మదమును భక్షించే, అలికులైః - తుమ్మెదల గుంపులచే, నిషేవ్యమాణః - సేవించబడుచున్నది అగు, సః - ఆ ఏనుగు, పంకజరేణు రూషితమ్ - పద్మముల పుప్పొడిచే సుగంధితమైన, సరః-అనిలమ్ - సరస్సునుండి వచ్చే గాలిని, విదూరాత్ - చాల దూరమునుండియే, జిఘ్రన్ - ఆఘ్రాణించునదై, మదవిహ్వల-ఈక్షణః - మదముచే మూసుకొనిపోవుచున్న కన్నులు గలదియై, తృషా-అర్దితేన - దప్పికచే పీడించబడిన, స్వయూథేన - తన గుంపుతో, వృతః - చుట్టువారబడినదై, అథ - అప్పుడు, తత్-సరోవర-అభ్యాశమ్ - ఆ సరస్సు సమీపమును గురించి, ద్రుతమ్ - వేగముగా, అగమత్ - చేరుకొనెను.

ఆ ఏనుగు చుట్టూ మిగిలిన మగ మరియు ఆడ ఏనుగులు చుట్టు వారియుండెను. మదమును స్రవించే ఏనుగు గున్నలు దాని వెనుక పరుగెత్తుచుండెను. దాని బరువుచే పర్వతము చుట్టూ అధికముగా కంపించుచుండెను. మదమును భక్షించే తుమ్మెదల గుంపులు దాని చుట్టూ తిరుగుచుండెను. పద్మముల పుప్పొడిచే సుగంధితమైన వాయువు సరస్సు మీదనుండి వీచుచుండగా, అది ఆ గంధమును చాల దూరమునుండియే ఆఘ్రాణించెను. మదముచే దాని కన్నులు మూసుకొని పోవుచుండెను. అది వేడి వలన తాపమును పొందియుండెను. ఆ ఏనుగు దప్పికతో ఇబ్బంది పడుచున్న తన గుంపు తనను చుట్టువారి రాగా, అప్పుడు ఆ సరస్సు ఒడ్డును వేగముగా చేరుకొనెను.

విగాహ్య తస్మిన్నమృతాంబు నిర్మలం
హేమారవిందోత్పలరేణువాసితమ్ ।
పపౌ నికామం నిజపుష్కరోద్ధృత-
మాత్మానమద్భిస్స్నపయన్ గతక్లమః ॥ 25

తస్మిన్ - దానియందు, విగాహ్య - దిగి, ఆత్మానమ్ - తనను, అద్భిః - నీళ్లతో, స్నపయన్ - తడుపుకొనుచున్నదై, నిర్మలమ్ - స్వచ్ఛమైనట్టియు, హేమ-అరవింద-ఉత్పలరేణువాసితమ్ - బంగరు పద్మములు కలువల పుప్పొడిచే సుగంధితమైనట్టియు, నిజపుష్కర-ఉద్ధృతమ్ - తన తొండముతో అందజేయబడిన, అమృత-అంబు - అమృతమువంటి నీటిని, నికామమ్ - కడుపు నిండా, పపౌ - త్రాగెను, గతక్లమః - దూరమైన అలసట గలది.

ఆ సరస్సులోని స్వచ్ఛమైన నీరు బంగరు రంగు గల పద్మములు మరియు కలువల పుప్పొడితో సుగంధితమై యుండెను. ఆ ఏనుగు దానిలో దిగి తనపై నీళ్లను చల్లుకుంటూ, అమృతమువంటి ఆ నీటిని కడుపు నిండా త్రాగి సేద దీరెను.

స్వపుష్కరేణోద్ధృతశీకరాంబుభిః
నిపాయయన్ సంస్నపయన్ యథా గృహీ ।
ఘృణీ కరేణూః కలభాంశ్చ దుర్మదో
నాచష్ట కృచ్ఛ్రం కృపణోఽజమాయయా ॥ 26

ఘృణీ - దయ గలది, దుర్మదః - మిక్కిలి మదించియున్నది, కృపణః - ఆసక్తమైనది అగు ఆ ఏనుగు, గృహీ యథా - గృహస్థుడు వలె, స్వపుష్కరేణ - తన తొండముచే, ఉద్ధృతశీకర-అంబుభిః - పైకి తీయబడిన నీటి బిందువులతో, కరేణూః - ఆడు ఏనుగులను, కలభాన్ చ - గున్నలను కూడ, నిపాయయన్ - చక్కగా త్రాగించుచున్నదై, సంస్నపయన్ - చక్కగా స్నానము చేయించుచున్నదై, అజమాయయా - దేవుని మాయచే, కృచ్ఛ్రమ్ - ఆపదను, న ఆచష్ట - కనుగొనలేదు.

గృహస్థునకు వలెనే ఆ ఏనుగునకు తన గున్నలపై ప్రేమ, ఆడు ఏనుగులపై ఆసక్తి అధికము. మిక్కిలి మదించియున్న ఆ ఏనుగు తన తొండముతో నీటిని పైకి తీసి, తుంపరలతో వాటికి చక్కగా స్నానము చేయిస్తూ వాటిచే చక్కగా ఆ నీటిని త్రాగిస్తూ, దేవుని మాయచే తనపై పడబోవుచున్న ఆపదను అది కనుగొనలేదు.

తం తత్ర కశ్చిన్నృప దైవచోదితో
గ్రాహో బలీయాంశ్చరణే రుషాఽగ్రహీత్ ।
యదృచ్ఛయైవం వ్యసనం గతో గజో
యథాబలం సోఽతిబలో విచక్రమే ।। 27

నృప - ఓ రాజా!, తత్ర - ఆ సరస్సునందు, దైవచోదితః - దైవముచే ప్రేరేపించబడిన, కశ్చిత్ - ఒకానొక, బలీయాన్ - బలశాలియగు, గ్రాహః - మొసలి, రుషా - కోపముతో, చరణే - కాలియందు, అగ్రహీత్ - పట్టుకొనెను, ఏవమ్ - ఈ విధముగా, యదృచ్ఛయా - అనుకోకుండా, వ్యసనమ్ - ఆపదను, గతః - పొందిన, అతిబలః - గొప్ప బలము గల, సః - ఆ, గజః - ఏనుగు, యథాబలమ్ - తన బలమునకు తగ్గట్లుగా, విచక్రమే - పరాక్రమించెను.

ఓ రాజా! ఆ సరస్సులోని బలశాలియగు ఒకానొక మొసలి దైవముచే ప్రేరితమై కోపముతో ఆ ఏనుగు కాలును పట్టుకొనెను. ఈ విధముగా ఆ ఏనుగు ఈశ్వరేచ్ఛచే అనుకోకుండా ఆపదలో పడెను. కాని అది చాల బలము గలది. అది తన బలమునకు తగ్గట్లుగా పరాక్రమించి, విడిపించుకొనే ప్రయత్నమును చేసెను.

తథాఽఽతురం యూథపతిం కరేణవో
వికృష్యమాణం తరసా బలీయసా ।
విచుక్రుశుర్దీనధియోఽపరే గజాః
పార్ష్ణిగ్రహాస్తారయితుం న చాశకన్ ।। 28

తథా - ఆ విధముగా, ఆతురమ్ - స్వాధీనత తప్పినట్టియు, బలీయసా - బలశాలియగు మొసలిచే, తరసా - బలముగా, వికృష్యమాణమ్ - లాగివేయబడుచున్న, యూథపతిమ్ - గజేంద్రుని ఉద్దేశించి, దీనధియః - దీనమైన అంతఃకరణము గల, కరేణవః - ఆడు ఏనుగులు, విచుక్రుశుః - ఆక్రోశించినవి, పార్ష్ణిగ్రహాః - వెనుకనుండే లాగే, అపరే - ఇతరములగు, గజాః చ - ఏనుగులు కూడ, తారయితుమ్ - దాటించుటకు, న అశకన్ - సమర్థులు కాలేదు.

ఆ విధముగా బలశాలియగు మొసలి బలముగా లాగుచుండగా ఆ ఏనుగు స్వాధీనత తప్పియుండెను. ఆడు ఏనుగులు దీనమైన అంతఃకరణములతో ఆ గజేంద్రుని గురించి ఆక్రోశించుచుండెను. ఇతరగజములు కూడ దానిని వెనుకనుండి పట్టుకొని లాగుటకు ప్రయత్నించినవి. అయినను, అవి ఆ గజేంద్రుని సరస్సునుండి బయటకు దాటించలేక పోయినవి.

నియుధ్యతోరేవమిభేంద్రనక్రయోః
వికర్షతోరంతరతో బహిర్మిథః ।
సమాస్సహస్రం వ్యగమన్ మహీపతే
సప్రాణయోశ్చిత్రమమంసతామరాః ॥ 29

మహీపతే - ఓ మహారాజా!, ఏవమ్ - ఈ విధముగా, సప్రాణయోః - బలశాలురగు, ఇభేంద్రనక్రయోః - గజేంద్రుడు మొసలి, అంతరతః - లోపలనుండి, బహిః - బయట, మిథః - పరస్పరము, వికర్షతోః - లాగుచున్నవై, నియుధ్యతోః - యుద్ధమును చేయుచుండగా, సహస్రమ్ - వేయి, సమాః - సంవత్సరములు, వ్యగమన్ - గడచి పోయినవి, అమరాః - దేవతలు, చిత్రమ్ - ఆశ్చర్యముగా, అమంసత - తలపోసిరి.

ఓ మహారాజా! ఈ విధముగా బలశాలురగు ఏనుగు, మొసలి పరస్పరము యుద్ధమును చేయుచుండిరి. ఏనుగు బయటనుండి, మొసలి లోపలినుండి లాగుచుండెను. ఈ విధముగా వేయి సంవత్సరములు గడిచి పోయెను. దేవతలు కూడ ఆ యుద్ధము అద్భుతమని తలపోసిరి.

తతో గజేంద్రస్య మనోబలౌజసాం
కాలేన దీర్ఘేణ మహానభూద్వ్యయః ।
నికృష్యమాణస్య జలేఽవసీదతో
విపర్యయోఽభూత్సకలం జలౌకసః ॥ 30

తతః - తరువాత, దీర్ఘేణ - దీర్ఘమైన, కాలేన - కాలముచే, జలే - నీటియందు, నికృష్యమాణస్య - గట్టిగా లాగివేయబడుచున్నట్టియు, అవసీదతః - ఖేదమును పొందియున్న, గజేంద్రస్య - గజేంద్రునియొక్క, మనోబల-ఓజసామ్ - ఉత్సాహము శరీరబలము ఇంద్రియపాటవములయొక్క, మహాన్ - అధికమగు, వ్యయః - ఖర్చు, అభూత్ - ఆయెను, జల-ఓకసః - నీటిలో నివసించే మొసలికి, సకలమ్ - అంతా, విపర్యయః - దీనికి తల్లక్రిందులు, అభూత్ - ఆయెను.

తరువాత దీర్ఘకాలము గడుచునాటికి, నీటిలోనికి గట్టిగా లాగివేయబడుతూ ఖేదమును పొందియున్న గజేంద్రునకు మనోబలము, ఇంద్రియపాటవము, శరీరబలము కూడ చాలవరకు క్షీణించి పోయెను. అదే సమయములో, నీటిలో నివసించే మొసలికి ఆ మూడు తల్లక్రిందులు ఆయెను; అనగా, క్రమముగా అవి వర్ధిల్ల జొచ్చెను.

ఇత్థం గజేంద్రస్స యదాఽఽప సంకటం
ప్రాణస్య దేహీ వివశో యదృచ్ఛయా ।
అపారయన్నాత్మవిమోక్షణే చిరం
దధ్యావిమాం బుద్ధిమథాభ్యపద్యత ॥ 31

ఇత్థమ్ - ఈ విధముగా, దేహీ - దేహాభిమానియగు (దేహము మాత్రమే మిగిలియున్న), సః - ఆ, గజేంద్రః - గజేంద్రుడు, యదా - ఎప్పుడైతే, వివశః - స్వాధీనత తప్పినవాడై, చిరమ్ - చాలకాలము వరకు, ఆత్మవిమోక్షణే - తనను విడిపించుకొనుటయందు, అపారయన్ - సమర్థము కానిదై, యదృచ్ఛయా - అనుకోకుండా, ప్రాణస్య - ప్రాణమునకు, సంకటమ్ - ముప్పును, ఆప - పొందెనో, దధ్యౌ - ఆలోచించెను, అథ -

అప్పుడు, ఇమామ్ - ఈ, బుద్ధిమ్ - నిశ్చయమును, అభ్యపద్యత - పొందెను.

ఈ విధముగా దేహాభిమానియగు (బలము పోయి దేహమాత్రావశిష్టుడై యున్న) ఆ గజేంద్రుడు చాల కాలము తనను విడిపించుకొనలేక స్వాధీనత తప్పి ఈశ్వరేచ్ఛచే అనుకోకుండా ప్రాణసంకటమును పొందెను. అపుడాతడు ఆలోచించి, ఈ నిశ్చయమునకు వచ్చెను.

న మామిమే జ్ఞాతయ ఆతురం గజాః
కుతః కరిణ్యః ప్రభవంతి మోచితుమ్ ।
గ్రాహేణ పాశేన విధాతురావృతో-
ఽప్యహం చ తం యామి పరం పరాయణమ్ ॥ 32

ఆతురమ్ - ఆపదలోనున్న, మామ్ - నన్ను, ఇమే - ఈ, జ్ఞాతయః - జ్ఞాతులైన, గజాః - ఏనుగులు, మోచితుమ్ - విడిపించుటకు, న ప్రభవంతి - సమర్థములు అగుట లేదు, కరిణ్యః - ఆడు ఏనుగులు, కుతః - ఎట్లు?, విధాతుః - బ్రహ్మగారి, పాశేన - పాశము అయిన, గ్రాహేన - మొసలిచే, ఆవృతః - చుట్టబడినవాడను, అహం అపి - (పశువునగు) నేను కూడ, పరాయణమ్ - సర్వోత్తమమగు ఆశ్రయమైన, తమ్ - ఆ, పరమ్ - పరమేశ్వరుని, యామి చ - శరణు పొందెదను.

ఆపదలోనున్న నన్ను నాతో సమానులగు ఈ ఏనుగులు విడిపించలేకపోయినవి. ఆడు ఏనుగులు ఎట్లు విడిపించ గల్గును? (లేవు). బ్రహ్మగారి మృత్యుపాశము ఈ మొసలి రూపములో నన్ను చుట్టివేసినది. నేను పశువునే అయిననూ, ఆ పరమేశ్వరుని శరణు వేడెదను. ఈశ్వరుడే సర్వోత్తమమైన ఆశ్రయము.

యః కశ్చనేశో బలినోఽంతకోరగాత్
ప్రచండవేగాదభిధావతో భృశమ్ ।
భీతం ప్రపన్నం పరిపాతి యద్భయా-
న్మృత్యుః ప్రధావత్యరణం తమీమహి ॥ 33

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే గజేంద్రోపాఖ్యానే గజేంద్రవిపత్తివర్ణనం నామ ద్వితీయోధ్యాయః ||

బలినః - బలశాలియైనట్టియు, ప్రచండవేగాత్ - భయంకరమగు వేగము కలిగినట్టియు, అభిధావతః - అంతటా పరుగులు తీయుచున్న, అంతక-ఉరగాత్ - మృత్యువు అనే సర్పమునుండి, భృశమ్ - మిక్కిలి, భీతమ్ - భయపడినట్టియు, ప్రపన్నమ్ - శరణు వేడినవానిని, యః కశ్చన - ఏ ఒకడు, ఈశః - సర్వేశ్వరుడో ఆయన, పరిపాతి - పాలించును, యద్ -భయాత్ - ఎవని వలని భయము వలన, మృత్యుః - మృత్యుదేవత, ప్రధావతి - నిరంతరముగా ప్రవర్తిల్లుచున్నదో, తమ్ - ఆ దేవుని, అరణమ్ - శరణును, ఈమహి - పొందుచున్నాము.

బలశాలియగు మృత్యువు అనే సర్పము భయంకరమగు వేగముతో అంతటా పరుగెత్తుచున్నది. దాని వలన భయపడి శరణు పొందినవానిని ఆ సర్వేశ్వరుడు, ఎవడో వాడు, రక్షించును. ఆయనకు భయపడియే మృత్యుదేవత నిరంతరముగా ప్రాణులయందు ప్రవర్తిల్లుచున్నది. ఆ దేవుని మేము శరణు వేడుచున్నాము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
గజేంద్రోపాఖ్యానములో గజేంద్రుని మొసలి పట్టుకొనుటను
వర్ణించే రెండవ అధ్యాయము ముగిసినది (2) .

*****

# అథ తృతీయోఽధ్యాయః

## గజేంద్రోపాఖ్యానము - గజేంద్రునకు విముక్తి లభించుట

శ్రీశుక ఉవాచ ।
ఏవం వ్యవసితో బుద్ధ్యా సమాధాయ మనో హృది ।
జజాప పరమం జాప్యం ప్రాగ్జన్మన్యనుశిక్షితమ్ ॥ 1

ఏవమ్ - ఈ విధముగా, వ్యవసితః - నిశ్చయించుకున్న ఆ గజేంద్రుడు, బుద్ధ్యా - బుద్ధితో, మనః - మనస్సును, హృది - హృదయమునందు, సమాధాయ - ఏకాగ్రము చేసి, ప్రాగ్-జన్మని - పూర్వజన్మయందు, అనుశిక్షితమ్ - నేర్వబడిన, పరమమ్ - సర్వోత్తమమైన, జాప్యమ్ - స్తోత్రమును, జజాప - జపించెను.

శ్రీ శుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా (భగవానుని శరణు వేడవలెనని) నిశ్చయించుకున్న ఆ గజేంద్రుడు బుద్ధి (నిశ్చయశక్తి) తో మనస్సును హృదయమునందు ఏకాగ్రము చేసి, సర్వోత్తమమైన స్తోత్రమును జపించెను. అది ఆతడు పూర్వజన్మలో అభ్యసించిన స్తోత్రము.

గజేంద్ర ఉవాచ ।
ఓం నమో భగవతే తస్మై యత ఏతచ్చిదాత్మకమ్ ।
పురుషాయాదిబీజాయ పరేశాయాభిధీమహి ॥ 2

ఓమ్ - భగవానుని నామము (రక్షకుడు), పురుషాయ - పూర్ణుడైనట్టియు, ఆదిబీజాయ - సర్వజగత్కారణుడైనట్టియు, పర-ఈశాయ - సర్వేశ్వరుడగు, తస్మై - ఆ, భగవతే - భగవానుని కొరకు, నమః - నమస్కారము, యతః - ఎవనినుండైతే, చిద్-ఆత్మకమ్ - చైతన్యపూర్ణమగు, ఏతత్ - ఈ జగత్తు (ఆవిర్భవించినదో), అభిధీమహి - ధ్యానించుచున్నాము.

గజేంద్రుడు ఇట్లు పలికెను --- ఓమ్. పూర్ణుడు, సర్వజగత్కారణుడు, సర్వేశ్వరుడు అగు ఆ భగవానుని కొరకు నమస్కారము. చైతన్య పూర్ణమగు ఈ జగత్తు ఆయననుండియే ఆవిర్భవించినది. మేము ఆయనను ధ్యానించెదము.

యస్మిన్నిదం యతశ్చేదం యేనేదం య ఇదం స్వయమ్ ।
యోఽస్మాత్పరస్మాచ్చ పరస్తం ప్రపద్యే స్వయంభువమ్ ॥3

ఇదమ్ - ఈ జగత్తు, యస్మిన్ - ఎవనియందు ఉన్నదో, చ - మరియు, ఇదమ్ - ఇది, యతః - ఎవనినుండియో, ఇదమ్ - ఇది, యేన - ఎవనిచేతనో, ఇదమ్ - ఇది, స్వయమ్ - స్వయముగా, యః - ఎవడో, యః - ఎవడు, అస్మాత్ - దీనికంటె, పరస్మాత్ చ - సర్వకారణమగు ప్రకృతికంటె కూడ, పరః - అతీతుడో, తమ్ - అట్టి, స్వయంభువమ్ - స్వయంసిద్ధసద్రూపుడగు భగవానుని, ప్రపద్యే - శరణు వేడుచున్నాను.

ఈ జగత్తు ఈశ్వరునినుండి ప్రకటమై, ఈశ్వరునియందే మనుగడను సాగిస్తూ, ఈశ్వరునియందే విలీనమగును. ఈశ్వరుడే స్వయముగా ఈ జగత్తు రూపముగా నున్నాడు. కాని, ఈశ్వరుడు ఈ జగత్తునకు, దానికి ఉపాదానమగు మాయాశక్తికి అతీతుడు. అట్టి స్వయంసిద్ధసద్రూపుడగు భగవానుని శరణు వేడుచున్నాము.

యస్స్వాత్మనీదం నిజమాయయార్పితం
క్వచిద్విభాతం క్వ చ తత్తిరోహితమ్ ।
అవిద్ధదృక్సాక్ష్యుభయం తదీక్షతే
స ఆత్మమూలోఽవతు మాం పరాత్పరః ॥ 4

యః - ఏ ఈశ్వరుడైతే, స్వ-ఆత్మని - తన స్వరూపమునందు, నిజమాయయా - తన మాయాశక్తిచే, అర్పితమ్ - విరచించ బడినట్టియు, క్వచిత్ - ఒకప్పుడు, విభాతమ్ - అభివ్యక్తమైన, ఇదమ్ - ఈ జగత్తును, క్వ చ - మరియొకప్పుడు, తిరోహితమ్ - విలీనమైన, తత్ - ఆ జగత్కారణమగు మాయాశక్తిని, తత్ - ఆ, ఉభయమ్ - కార్యకారణములను రెండింటినీ, అవిద్ధదృక్ - లుప్తము కాని దర్శనము గల, సాక్షీ - సాక్షియై, ఈక్షతే

- దర్శించునో, ఆత్మమూలః - స్వయంసిద్ధుడైనట్టియు, పరాత్ - సర్వజగత్తునకు ఉపాదానమగు మాయాశక్తికంటె, పరః - అతీతుడగు, సః - ఆ పరమేశ్వరుడు, మామ్ - నన్ను, అవతు - రక్షించు గాక!

ఈ జగత్తు ఈశ్వరునిచే తనయందే తన మాయాశక్తిచే ఒకప్పుడు ప్రకటితమగును. మరియొకప్పుడు ఇది విలీనమై మాయాశక్తి రూపముగా నుండును. లుప్తము గాని దర్శనము గల (శుద్ధచైతన్యస్వరూపుడైన) ఈశ్వరుడు ఈ కార్యకారణములు రెండింటికీ సాక్షియై యుండును. స్వయంసిద్ధుడు, సర్వజగత్తునకు ఉపాదానమగు మాయాశక్తికి అతీతుడు అగు ఆ పరమేశ్వరుడు నన్ను రక్షించు గాక!

కాలేన పంచత్వమితేషు కృత్స్నశో
లోకేషు పాలేషు చ సర్వహేతుషు ।
తమస్తదాఽఽసీద్గహనం గభీరం
యస్తస్య పారేఽభివిరాజతే విభుః ॥ 5

లోకేషు - లోకములు, పాలేషు - లోకపాలకులు, కాలేన - కాలముచే, కృత్స్నశః - పూర్తిగా, సర్వహేతుషు - సర్వమునకు కారణమగు మహదాది తత్త్వములు, పంచత్వమ్ - విలీనమగుటను, ఇతేషు - పొందగా, తదా - అప్పుడు, గహనమ్ - మిక్కిలి దట్టనిది, గభీరమ్ - అంతు పట్టనిది అగు, తమః - చీకటి, ఆసీత్ - ఉండెను, యః - ఏ, విభుః - సర్వశక్తిమంతుడగు ఈశ్వరుడు, తస్య - దానియొక్క, పారే - ఆవల, అభివిరాజతే - అధికముగా ప్రకాశించుచున్నాడో.

ప్రళయకాలము రాగానే లోకములు, లోకేశులు, సర్వమునకు కారణమగు మహదాది తత్త్వములు మాయాశక్తియందు పూర్తిగా విలీనమగును. అప్పుడు ఆ మాయాశక్తి మిక్కిలి దట్టనైన అంతు పట్టని చీకటి (అవ్యక్తము) రూపముగా నుండును. కాని, సర్వశక్తిమంతుడగు పరమేశ్వరుడు దానికి అతీతుడై అధికముగా (స్వరూపముచేతనే) ప్రకాశించును.

న యస్య దేవా ఋషయః పదం విదుః
జంతుః పునః కోఽర్హతి గంతుమీరితుమ్ ।

యథా నటస్యాకృతిభిర్విచేష్టతో
దురత్యయానుక్రమణస్స మాऽవతు ॥ 6

యస్య - ఏ పరమేశ్వరునియొక్క, పదమ్ - స్వరూపమును, దేవాః - దేవతలు, ఋషయః - మహర్షులు, న విదుః - తెలియకున్నారో, జంతుః పునః - ప్రాకృతజనుడైతే, కః - ఎవడు, గంతుమ్ - తెలియుటకు, ఈరితుమ్ - వర్ణించుటకు, అర్హతి - అర్హుడగును?, ఆకృతిభిః - వివిధరూపములచే, విచేష్టతః - నటించుచున్న, నటస్య యథా - నటునియొక్క తత్త్వమును వలె, దురత్యయ-అనుక్రమణః - తెలియ శక్యము కాని చరితము గల, సః - ఆ ఈశ్వరుడు, మా - నన్ను, అవతు - రక్షించు గాక!

పరమేశ్వరుని స్వరూపమును దేవతలు, మహర్షులు తెలియకున్నారు. అట్టిచో, ప్రాకృత (అజ్ఞానియగు) జనుడు ఎవడు ఈశ్వరస్వరూపమును తెలియుటకు గాని, వర్ణించుటకు గాని సమర్థుడగును? (కాడు). వివిధరూపములలో నటించే నటుని యథార్థతత్త్వమును జనులు తెలియలేరు గదా! తెలియ శక్యము కాని చరితము గల ఆ ఈశ్వరుడు నన్ను రక్షించు గాక!

దిదృక్షవో యస్య పదం సుమంగలం
విముక్తసంగా మునయస్సుసాధవః ।
చరంత్యలోకవ్రతమవ్రణం వనే
భూతాత్మభూతాస్సుహృదస్స మే గతిః ॥ 7

యస్య - ఏ పరమేశ్వరునియొక్క, సుమంగళమ్ - పరమమంగళమగు, పదమ్ - స్వరూపమును, దిదృక్షవః - సాక్షాత్కరించుకొనగోరువారు, విముక్తసంగాః - విడిచిపెట్టబడిన సంసారాసక్తి గలవారు, సుసాధవః - గొప్ప సత్పురుషులు, భూత-ఆత్మభూతాః - ప్రాణులకు ఆత్మ అయినవారు, సుహృదః - దయాళువులు అగు, మునయః - మహర్షులు, వనే - అడవియందు, అవ్రణమ్ - ఖండితము కాని, అలోకవ్రతమ్ - అలౌకికమగు బ్రహ్మచర్యము మొదలగు వ్రతమును, చరంతి - అనుష్ఠించెదరో, సః - ఆ పరమేశ్వరుడు, మే - నాకు, గతిః - గతి.

పరమేశ్వరుని స్వరూపము పరమ మంగళము. దానిని సాక్షాత్కరించుకొనగోరే మహర్షులు సంసారాసక్తిని విడిచిపెట్టి, గొప్ప సదాచారమును పాలించువారై, సర్వప్రాణులను ఆత్మరూపముగా దర్శిస్తూ, దయాళువులై అడవిలో నిరంతరముగా అలౌకికమగు బ్రహ్మచర్యాది వ్రతములను అనుష్ఠించెదరు. ఆ పరమేశ్వరుడే నాకు గతి.

న విద్యతే యస్య చ జన్మ కర్మ వా
న నామరూపే గుణదోష ఏవ వా ।
తథాపి లోకాప్యయసంభవాయ యః
స్వమాయయా తాన్యనుకాలమృచ్ఛతి ॥ 8

యస్య - ఎవనికైతే, జన్మ - పుట్టుక గాని, కర్మ వా - కర్మ గాని, న విద్యతే - ఉండదో, నామరూపే - నామరూపములు గాని, గుణదోషః ఏవ వా - గుణము గాని దోషము గాని, న - లేవో, తథాపి - అయినప్పటికీ, లోక-అప్యయసంభవాయ - లోకముల ప్రళయము ఉత్పత్తుల కొరకై, యః - ఏ పరమేశ్వరుడు, స్వమాయయా - తన మాయాశక్తిచే, తాని - వాటిని, అనుకాలమ్ - ఆయా కాలములయందు, ఋచ్ఛతి - స్వీకరించునో.

ఈశ్వరునకు జన్మ, కర్మ, నామము, రూపము, గుణము, దోషము అనేవి ఉండవు. అయిననూ, ఆయన లోకముల ఉత్పత్తి ప్రళయముల కొరకై తన మాయాశక్తిచే వాటిని ఆయా కాలములలో స్వీకరించును.

తస్మై నమః పరేశాయ బ్రహ్మణేఽనంతశక్తయే ।
అరూపాయోరురూపాయ నమ ఆశ్చర్యకర్మణే ॥ 9

బ్రహ్మణే - దేశకాలములకు అతీతుడైనట్టియు, అనంతశక్తయే - అనంతమగు శక్తి కలిగినట్టియు, అరూపాయ - రూపము లేనట్టియు, ఉరురూపాయ - అనేకరూపములు కలిగినట్టియు, ఆశ్చర్యకర్మణే - ఆశ్చర్యమును గొల్పే లీలలు కలిగిన, తస్మై - ఆ, పరేశాయ - పరమేశ్వరుని కొరకు, నమః నమః - అనేక నమస్కారములు.

దేశకాలములకు అతీతుడైన పరమేశ్వరుడు వాస్తవముగా రూపములు లేనివాడే అయిననూ, బహురూపములు (జగత్తు) గా ప్రకటమైనాడు. అనంతశక్తిమంతుడగు ఆయన చేసే లీలలు అద్భుతములు. ఆయనకు అనేక నమస్కారములు.

నమ ఆత్మప్రదీపాయ సాక్షిణే పరమాత్మనే ।
నమో గిరాం విదూరాయ మనసశ్చేతసామపి ॥ 10

ఆత్మప్రదీపాయ - స్వయంప్రకాశమైనట్టియు, సాక్షిణే - సాక్షియైనట్టియు, గిరామ్ - వాక్కులకు, మనసః - మనస్సునకు, చేతసాం అపి - చిత్తవృత్తులకు, విదూరాయ - చాల దూరములోనుండే, పరమ-ఆత్మనే - జీవుని అంతరతమమగు స్వరూపమైన భగవానుని కొరకు, నమః నమః - అనేక నమస్కారములు.

స్వయంప్రకాశస్వరూపుడైన ఈశ్వరుడు సకలప్రాణులలో అంతరతమమగు ఆత్మరూపుడై సర్వమునకు సాక్షియై ఉన్నాడు. అట్టి ఈశ్వరుని స్వరూపము వాక్కులకు గాని, మనస్సునకు గాని గోచరము కాదు. ఈశ్వరుని మనోవృత్తులలో విషయము చేయుట సంభవము కాదు. అట్టి పరమేశ్వరునకు అనేక నమస్కారములు.

సత్త్వేన ప్రతిలభ్యాయ నైష్కర్మ్యేణ విపశ్చితా ।
నమః కైవల్యనాథాయ నిర్వాణసుఖసంవిదే ॥ 11

విపశ్చితా - వివేకియగు సాధకునిచే, సత్త్వేన - సత్త్వగుణముచే, నైష్కర్మ్యేణ - శమదమాది నివృత్తి ధర్మముచే (అకర్తృ-ఆత్మస్వరూపము యొక్క జ్ఞానముచే), ప్రతిలభ్యాయ - పొందబడునట్టియు, కైవల్యనాథాయ - మోక్షాధిపతియైనట్టియు, నిర్వాణసుఖసంవిదే - మోక్షానందము యొక్క అనుభవమే స్వరూపముగా గల భగవానుని కొరకు, నమః - నమస్కారము.

వివేకియగు సాధకుడు సత్త్వగుణప్రధానుడై నివృత్తి ధర్మమును పాటించి, అకర్తృ-ఆత్మస్వరూపమును తెలుసుకొని పరమేశ్వరుని ఆత్మరూ

పముగా పొందును. మోక్షప్రదాతయగు భగవానుడే మోక్షానందము యొక్క అనుభవము రూపములో నున్నాడు. ఆయనకు నమస్కారము.

నమశ్శాంతాయ ఘోరాయ మూఢాయ గుణధర్మిణే ।
నిర్విశేషాయ సామ్యాయ నమో జ్ఞానఘనాయ చ ।। 12

శాంతాయ - సత్త్వగుణప్రధానుడైనట్టియు, ఘోరాయ - రజోగుణ ప్రధానుడైనట్టియు, మూఢాయ - తమోగుణప్రధానుడైనట్టియు, గుణధర్మిణే - గుణధర్మములు కలిగినట్టియు, నిర్విశేషాయ - విశేషములు లేని చైతన్యమే స్వరూపముగా కలిగినట్టియు, సామ్యాయ - సర్వసముడైనట్టియు, జ్ఞానఘనాయ - ఏకరసమగు జ్ఞప్తియే స్వరూపముగా గల ఈశ్వరుని కొరకు, నమః నమః చ - అనేక నమస్కారములు.

పరమేశ్వరుడు సత్త్వరజస్తమోగుణాత్మకమగు తన మాయాశక్తియందు ప్రకటమై సత్త్వగుణాధిక్యముచే శాంతుడుగను, రజోగుణాధిక్యముచే ఘోరుడుగను, తమోగుణాధిక్యముచే మూఢుడుగను భాసించిననూ, ఆయనయొక్క ఏకరసమగు జ్ఞానస్వరూపమునందు భేదములు లేవు. సర్వమునందు సమానముగా సత్తాస్ఫూర్తుల రూపముగా ప్రకటమయ్యే ఆ పరమేశ్వరునకు అనేక నమస్కారములు.

క్షేత్రజ్ఞాయ నమస్తుభ్యం సర్వాధ్యక్షాయ సాక్షిణే ।
పురుషాయాత్మమూలాయ మూలప్రకృతయే నమః ।। 13

క్షేత్రజ్ఞాయ - క్షేత్రమును తెలుసుకుంటూ ఉండే చైతన్యమే స్వరూపముగా కలిగినట్టియు, సర్వ-అధ్యక్షాయ - సర్వమునకు అధ్యక్షుడైన, సాక్షిణే - సాక్షియైనట్టియు, పురుషాయ - పూర్ణుడైనట్టియు, ఆత్మమూలాయ - తనకు తానే కారణమైనట్టియు, మూలప్రకృతయే - మాయాశక్తికి మూలమైన పరమేశ్వరుని కొరకు, నమః నమః - అనేక నమస్కారములు.

సర్వాధీశ్వరుడగు పరమేశ్వరుడే దేహేంద్రియమనస్సంఘాతములన్నింటియందు చైతన్యరూపుడై సాక్షిగా వెలుగుచున్నాడు. పూర్ణుడగు ఆ పరమేశ్వరుడు ప్రకృతి (మాయాశక్తి) కి అధిష్ఠానమై యున్నాడు. సర్వకార

ఋడగు ఈశ్వరునకు మరియొక కారణము లేదు. ఆయనకు అనేక నమస్కారములు.

సర్వేంద్రియగుణద్రష్ట్రే సర్వప్రత్యయహేతవే ।
అసతా చ్ఛాయయోక్తాయ సదాభాసాయ తే నమః ॥ 14

సర్వ-ఇంద్రియగుణద్రష్ట్రే - సకలేంద్రియములకు వాటి విషయములకు ద్రష్ట అయినట్టియు, సర్వప్రత్యయహేతవే - సకలమనోవృత్తులకు మూలమైనట్టియు, అసతా - మిథ్యయైనదానిచే, ఛాయయా - ప్రతిబింబముచే, ఉక్తాయ - సూచింపబడునట్టియు, సద్-ఆభాసాయ - నామరూపకర్మాత్మకమగు దేహములయందు ప్రతిఫలించే, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

సకలప్రాణిదేహములలో ఆత్మచైతన్యరూపముగా ప్రతిఫలించే నీవు సకలేంద్రియములకు, వాటి విషయములైన శబ్ద-స్పర్శ-రూప-రస-గంధములకు సాక్షివి అగుచున్నావు. మనస్సులో ఉదయించే సంకల్పములన్నింటికీ మూలములో ఆత్మరూపుడవగు నీవే ఉన్నావు. మిథ్యయైన ఈ జగత్తు, ఆత్మప్రతిబింబములైన ఈ దేహాదులు శుద్ధచైతన్యఘనుడవగు నిన్నే సూచించుచున్నవి. నీకు నమస్కారము.

నమో నమస్తేఽఖిలకారణాయ నిష్కారణాయాద్భుతకారణాయ,
సర్వాగమామ్నాయమహార్ణవాయ నమోఽపవర్గాయ పరాయణాయ.

అఖిలకారణాయ - సర్వమునకు కారణమైనట్టియు, నిష్కారణాయ - కారణము లేనట్టియు, అద్భుతకారణాయ - ఆశ్చర్యమును గొలిపే కారణమైనట్టియు, సర్వ-ఆగమ-ఆమ్నాయమహా-అర్ణవాయ - సకలములైన శాస్త్రములు వేదములయొక్క గొప్ప సముద్రము అయినట్టియు, అపవర్గాయ - మోక్షస్వరూపుడవైనట్టియు, పరాయణాయ - సర్వోత్తమమగు గతి అయిన, తే - నీ కొరకు, నమః నమః నమః - అనేక నమస్కారములు.

సర్వమునకు కారణమైన నీకు మరియొక కారణము లేదు. సర్వము నీనుండియే ఉద్భవించినా, సర్వము నీయందు వాస్తవముగా లేదు. నీవు అట్టి ఆశ్చర్యమును గొలిపే జగత్కారణుడవు. నదులు సముద్రమునందువలె సకలములైన శాస్త్రములు, వేదములు నీయందే పర్యవసానమును చెందుచున్నవి. మోక్షస్వరూపుడవగు నీవే సాధకులు పొందే సర్వోత్తమమైన గతివి. నీకు అనేక నమస్కారములు.

గుణారణిచ్ఛన్నచిదూష్మపాయ తత్క్షోభవిస్ఫూర్జితమానసాయ ।
నైష్కర్మ్యభావేన వివర్జితాగమస్వయంప్రకాశాయ నమస్కరోమి ॥

గుణ-అరణిచ్ఛన్నచిద్-ఊష్మపాయ - సత్త్వరజస్తమోగుణములు అనే అరణిచే కప్పివేయబడిన జ్ఞానాగ్ని అయినట్టియు, తత్-క్షోభవిస్ఫూర్జితమానసాయ - ఆ గుణముల క్షోభను చెందుటయందు బయటకు ప్రకటమైన సంకల్పము కలిగినట్టియు, నైష్కర్మ్యభావేన - సకలకర్మల సంశ్లేషము లేని ఆత్మతత్త్వముయొక్క భావనచే, వివర్జిత-ఆగమస్వయంప్రకాశాయ - తొలగించబడిన విధినిషేధములు గల జ్ఞానులయందు ఆత్మరూపముగా ప్రకటమయ్యే ఈశ్వరుని కొరకు, నమః-కరోమి - నమస్కరించెదను.

నిప్పును అరణి (మథించే కొయ్య) దాచి పెట్టినట్లుగా సత్త్వరజస్తమోగుణముల కార్యమగు దేహాదికము జ్ఞానఘనమగు ఆత్మను కప్పివేయును. సృష్ట్యాదిలో ఆ గుణములయందు క్షోభను కలిగించి తద్వారా జగద్రూపముగా ప్రకటము కావాలనే సంకల్పము భగవానునియందు కలిగెను. సకలకర్మల సంశ్లేషము లేని ఆత్మతత్త్వమునందు పరినిష్ఠితులై విధినిషేధముల పరిధిని దాటివేసిన మహాత్ములయందు ఆ భగవానుడు ఆత్మరూపుడుగా సాక్షాత్కరించును. ఆయనకు నేను నమస్కరించుచున్నాను.

మాదృక్ప్రపన్నపశుపాశవిమోక్షణాయ
ముక్తాయ భూరికరుణాయ నమోఽలయాయ ।
స్వాంశేన సర్వతనుభృన్మనసి ప్రతీత-
ప్రత్యగ్దృశే భగవతే బృహతే నమస్తే ॥ 17

మాదృక్-ప్రపన్నపశుపాశవిమోక్షణాయ - నావంటి శరణు వేడిన అజ్ఞానులయొక్క సంసారబంధమును విడిపించునట్టియు, ముక్తాయ - ముక్తుడైనట్టియు, భూరికరుణాయ - అతిశయించిన దయ కలిగినట్టియు, అలయాయ - అవినాశియైనట్టియు, స్వ-అంశేన - తన అంశచే, సర్వతను భృత్-మనసి - సకల దేహధారుల మనస్సునందు, ప్రతీతప్రత్యగ్-దృశే - అనుభవమునకు వచ్చే అంతరతమమగు చైతన్యస్వరూపుడైనట్టియు, భగవతే - ఆరు ఐశ్వర్యములు కలిగిన, బృహతే - పరబ్రహ్మవైన, తే - నీ కొరకు, నమః నమః - అనేక నమస్కారములు.

ఓ దేవా! నీవు నిత్యముక్తుడవు. అతిశయించిన దయ గల నీవు నావంటి శరణు వేడిన అజ్ఞానుల సంసారబంధమును విడిపించెదవు. వినాశ రహితుడవు, అంతర్యామివి అగు నీవు దేహధారులందరి అంతఃకరణముల యందు అనుభవమునకు వచ్చే అంతరతమమగు చైతన్యము రూపముగా ప్రకటమగుచున్నావు. పూర్ణమగు ఈశ్వరభావము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యములు అనే ఆరు ఐశ్వర్యములు గల నీవు దేశకాలవస్తుపరిచ్ఛేదములకు అతీతుడవు. నీకు అనేక నమస్కారములు.

ఆత్మాత్మజాప్తగృహవిత్తజనేషు సక్తైః
దుష్ప్రాపణాయ గుణసంగవివర్జితాయ ।
ముక్తాత్మభిస్స్వహృదయే పరిభావితాయ
జ్ఞానాత్మనే భగవతే నమ ఈశ్వరాయ ॥ 18

ఆత్మా-ఆత్మజ-ఆప్తగృహవిత్తజనేషు - దేహము సంతానము ఇంటిలోని పెద్దలు ఇల్లు సంపదలు బంధుజనములయందు, సక్తైః - తగుల్కొన్నవారిచే, దుష్ప్రాపణాయ - పొంద శక్యము కానట్టియు, గుణసంగ వివర్జితాయ - సత్త్వరజస్తమోగుణములతో సంగము లేనట్టియు, ముక్త-ఆత్మభిః - జీవన్ముక్తులచే, స్వహృదయే - తమ హృదయమునందు, పరిభావితాయ - నిరంతరముగా భావన చేయబడునట్టియు, జ్ఞాన-ఆత్మనే - జ్ఞప్తియే స్వరూపముగా కలిగినట్టియు, భగవతే - షడైశ్వర్యసంపన్నుడైన, ఈశ్వరాయ - ఈశ్వరుని కొరకు, నమః - నమస్కారము.

దేహము, సంతానము, ఇంటిలోని పెద్దలు, ఇల్లు, సంపదలు, బంధుజనులు అనువాటియందు తగుల్కొన్నవారలు ఈశ్వరుని పొందలేరు. ఆయనకు మాయాశక్తియొక్క సత్త్వరజస్తమోగుణములతో సంగము (నేను-నాది అనే తాదాత్మ్యము) లేదు. జీవన్ముక్తులు షడైశ్వర్యసంపన్నుడగు ఆ ఈశ్వరుని నిరంతరముగా తమ హృదయములో భావన చేసెదరు. ఏకరసమగు జ్ఞానమే స్వరూపముగా గల ఆ ఈశ్వరుని కొరకు నమస్కారము.

యం ధర్మకామార్థవిముక్తికామా
భజంత ఇష్టాం గతిమాప్నువంతి ।
కిం త్వాశిషో రాత్యపి దేహమవ్యయం
కరోతు మేఽదభ్రదయో విమోక్షణమ్ ॥ 19

ధర్మకామ-అర్థవిముక్తికామాః - ధర్మార్థకామమోక్షములను కోరువారలు, యమ్ - ఏ ఈశ్వరుని, భజంతః - భజించువారై, ఇష్టామ్ - కోరబడిన, గతిమ్ - ఫలమును, ఆప్నువంతి - పొందుచున్నారో, కిం తు - ఇంతేగాక, ఆశిషః - కామనలను, అవ్యయమ్ - వినాశము లేని, దేహం అపి - దేహమును కూడ, రాతి - ఇచ్చునో, అదభ్రదయః - అల్పము కాని దయ గల ఆ దేవుడు, మే - నాకు, విమోక్షణమ్ - విముక్తిని, కరోతు - చేయుగాక!

ధర్మార్థకామములను కోరి ఈశ్వరుని భజించువారలకు ఆయన వారు కోరిన ఫలమును మాత్రమే గాక, వారి ఇతరములగు కామనలను మరియు కల్పాంతము వరకు నశించని దేవతాదేహమును కూడ ఇచ్చును. దయానిధియగు ఆ ఈశ్వరుడు నాకు విముక్తిని కలిగించు గాక!

ఏకాంతినో యస్య న కంచనార్థం
వాంఛంతి యే వై భగవత్ప్రపన్నాః ।
అత్యద్భుతం తచ్చరితం సుమంగలం
గాయంత ఆనందసముద్రమగ్నాః ॥ 20

భగవత్-ప్రపన్నాః - భగవానుని శరణు వేడిన, యే వై - ఎవరైతే, యస్య - ఎవనియొక్క, ఏకాంతినః - ఏకాంతభక్తులో, కంచన - ఏదైననూ, అర్థమ్ - ఫలమును, న వాంఛంతి - కోరరో, అతి-అద్భుతమ్ - మిక్కిలి అచ్చెరువును గొల్పునట్టియు, సుమంగలమ్ - గొప్ప మంగళకరమగు, తత్-చరితమ్ - ఆయన చరితమును, గాయంతః - గానము చేయువారై, ఆనందసముద్రమగ్నాః - ఆనందసముద్రములో ఓలలాడెదరో.

భగవానుని శరణు జొచ్చిన ఏకాంతభక్తులు ఏ ఫలమునైననూ కోరరు. వారు మంగళములకు నిధానమై అచ్చెరువును గొల్పే భగవానుని లీలలను గానము చేస్తూ ఆనందసముద్రములో ఓలలాడెదరు.

**తమక్షరం బ్రహ్మ పరం పరేశమవ్యక్తమాధ్యాత్మికయోగగమ్యమ్,**
**అతీంద్రియం సూక్ష్మమివాతిదూరమనంతమాద్యం పరిపూర్ణమీడే।**

అక్షరమ్ - అవినాశియైనట్టియు, పర-ఈశమ్ - మాయాశక్తి తన వశములోనున్నట్టియు, అవ్యక్తమ్ - ఇంద్రియములకు మనస్సునకు గోచరము కానట్టియు, ఆధ్యాత్మికయోగగమ్యమ్ - అంతర్ముఖత్వము అనే సాధనచే పొందబడునట్టియు, అతి-ఇంద్రియమ్ - ఇంద్రియములకు అతీతమైనట్టియు, అతిదూరం ఇవ - చాల దూరమునందున్నవానివవలె, సూక్ష్మమ్ - సూక్ష్ముడైనట్టియు, అనంతమ్ - కాలాతీతుడైనట్టియు, ఆద్యమ్ - సర్వకారణుడైనట్టియు, పరిపూర్ణమ్ - పరిపూర్ణుడగు, తమ్ - ఆ, పరం బ్రహ్మ - పరబ్రహ్మను, ఈడే - స్తుతించుచున్నాను.

అవినాశియగు పరబ్రహ్మ మాయాశక్తిని తన వశములోనుంచుకొనియుండును. ఇంద్రియములకు, వాక్కునకు, మనస్సునకు కూడ గోచరము కాని ఆ పరబ్రహ్మ అంతర్ముఖులైన సాధకులచే ఆత్మరూపముగా పొందబడును. కాలమునకు అతీతమగు పరబ్రహ్మ ఆకాశము కంటె సూక్ష్మమగుటచే ఆత్మరూపమై యున్ననూ చాల దూరమునందున్నదా యన్నట్లున్నది. సర్వమునకు కారణము, పరిపూర్ణము అగు ఆ పరబ్రహ్మను నేను స్తుతించుచున్నాను.

యస్య బ్రహ్మాదయో దేవా వేదా లోకాశ్చరాచరాః ।
నామరూపవిభేదేన ఫల్గ్వ్యా చ కలయా కృతాః ॥ 22

బ్రహ్మ-ఆదయః - బ్రహ్మగారు మొదలైన, దేవాః - దేవతలు, వేదాః - వేదములు, లోకాః - లోకములు, చర-అచరాః - కదిలేవి కదలనివి, నామరూపవిభేదేన - నామరూపములయందు తేడాగా, ఫల్గ్వ్యా - అల్పమగు, కలయా చ - అంశచే, కృతాః - నిర్మించబడినవి.

బ్రహ్మగారు మొదలైన దేవతలు, వేదములు, లోకములు, స్థావర జంగమాత్మకమగు జగత్తు అంతా కేవలము నామరూపముల భేదము మాత్రమే. ఇది అంతా భగవానుని ఒక అల్పమైన అంశచే మాత్రమే నిర్మితమైనది (అంశయే ఈ సర్వము రూపముగా ప్రకటమైనది).

యథాఽర్చిషోఽగ్నేః సవితుర్గభస్తయో
నిర్యాంతి సంయాంత్యసకృత్స్వరోచిషః ।
తథా యతోఽయం గుణసంప్రవాహో
బుద్ధిర్మనః ఖాని శరీరసర్గాః ॥ 23

యథా - ఏ విధముగానైతే, అగ్నేః - అగ్నినుండి, అర్చిషః - మిణుగురులు, సవితుః - సూర్యునినుండి, గభస్తయః - కిరణములు, అసకృత్ - మరల మరల, నిర్యాంతి - బయల్వెడలుచున్నవో, సంయాంతి - విలీనమగుచున్నవో, తథా - అదే విధముగా, స్వరోచిషః - స్వయంప్రకాశ స్వరూపుడైన, యతః - ఎవనినుండి, బుద్ధిః - బుద్ధి, మనః - మనస్సు, ఖాని - ఇంద్రియములు, శరీరసర్గాః - దేహముల సంఘాతములు అనే, అయమ్ - ఈ, గుణసంప్రవాహః - సత్త్వరజస్తమోగుణముల ప్రవాహము.

మిణుగురులు అగ్నినుండి, కిరణములు సూర్యునినుండి మరల మరల పుట్టి విలీనమగుచుండును. అదే విధముగా, సత్త్వరజస్తమోగుణముల చక్కని ప్రవాహమగు ఈ సృష్టి స్వయంప్రకాశ స్వరూపుడగు ఆ ఈశ్వరునినుండియే మరల మరల పుట్టి, ఆయనయందే విలీనమగుచున్నది. బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, దేహముల వివిధ సంఘాతములు ఆ మూడు గుణముల పరిణామములే.

స వై న దేవాసురమర్త్యతిర్యఙ్
న స్త్రీ న షంఢో న పుమాన్న జంతుః ।
నాయం గుణః కర్మ న సన్న చాసత్
నిషేధశేషో జయతాదశేషః ॥ 24

సః - ఆ ఈశ్వరుడు, వై - నిశ్చయముగా, దేవ-అసురమర్త్యతిర్యక్ - దేవత గాని అసురుడు గాని మానవుడు గాని పశుపక్ష్యాదులు గాని, న - కాదు, స్త్రీ - ఆడుది, న - కాదు, షంఢః - నపుంసకుడు, న - కాదు, పుమాన్ - మగవాడు, న - కాదు, జంతుః - ప్రాణి మాత్రము, న - కాదు, అయమ్ - ఈ ఈశ్వరుడు, గుణః - గుణము, న - కాదు, కర్మ - క్రియ, న - కాదు, సత్ - కార్యము, న - కాదు, అసత్ చ - కారణము కూడ, న - కాదు, నిషేధశేషః - నిషేధించగా మిగిలినవాడు, అశేషః - సర్వము తానే అయినవాడు, జయతాత్ - ప్రకటమగు గాక!

ఈశ్వరుడనగా దేవత గాని, అసురుడు గాని, మానవుడు గాని, పశువు గాని, పక్షి గాని, ఆడుది గాని, మగవాడు గాని, నపుంసకుడు గాని, సత్త్వరజస్తమోగుణములలో ఒక గుణము గాని, క్రియ గాని, కార్యము గాని, కారణము గాని కాదు. ఈశ్వరుడు ఒకానొక ప్రాణిమాత్రము కాదు. సర్వమును నిషేధించగా మిగిలేది, సర్వమును తనయందు కలిగియున్నది అగు (చైతన్య) తత్త్వమే ఈశ్వరుడు. అట్టి ఈశ్వరుడు ప్రకటమగు గాక!

జిజీవిషే నాహమిహాముయా కిమంతర్బహిశ్చావృతయేభయోన్యా
ఇచ్ఛామి కాలేన న యస్య విప్లవస్తస్యాత్మలోకావరణస్య మోక్షమ్।

అహమ్ - నేను, న జిజీవిషే - జీవించ గోరుట లేదు, అంతః - లోపల, బహిః చ - బయట కూడ, అవృతయా - కప్పివేయబడిన, అముయా - ఈ, ఇభయోన్యా - ఏనుగు జన్మతో, ఇహ - ఈ లోకమునందు, కిమ్ - ఏమి ప్రయోజనము?, ఆత్మలోక-ఆవరణస్య - ఆత్మప్రకాశమును కప్పివేసే అజ్ఞానముయొక్క, మోక్షమ్ - నివృత్తిని, ఇచ్ఛామి - కోరుచున్నాను, యస్య - దేనికి, కాలేన - కాలముతో, విప్లవః - వినాశము, న - లేదో.

నేను జీవించాలని కోరుట లేదు. లోపల, బయట వివేకము లేని ఈ ఏనుగు జన్మతో ఈ లోకములో ప్రయోజనమేమి గలదు? ఆత్మప్రకాశ మును కప్పివేసే అజ్ఞానముయొక్క నివృత్తి (మోక్షము) ని నేను కోరుచు న్నాను. ఆ అజ్ఞానము కాలక్రమంలో తనంత తానుగా తొలగిపోయేది కాదు. మోక్షము కూడ కాలక్రమములో నష్టమయ్యేది కాదు.

సోఽహం విశ్వసృజం విశ్వమవిశ్వం విశ్వవేదసమ్ ।
విశ్వాత్మానమజం బ్రహ్మ ప్రణతోఽస్మి పరం పదమ్ ॥ 26

సః - అట్టి, అహమ్ - నేను, విశ్వసృజమ్ - జగత్తును సృష్టించిన ట్టియు, విశ్వమ్ - జగత్తు అయి ఉన్నట్టియు, అవిశ్వమ్ - జగత్తు వాస్తవ ముగా తనయందు లేనట్టియు, విశ్వవేదసమ్ - విశ్వమే సంపదగా కలిగిన ట్టియు, విశ్వ-ఆత్మానమ్ - జగత్తునకు ఆత్మ అయినట్టియు, అజమ్ - పుట్టుక లేనట్టియు, బ్రహ్మ - సర్వవ్యాపకమైనట్టియు, పరమ్ - సర్వోత్తమ మైన, పదమ్ - లక్ష్య మైన భగవానుని, ప్రణతః అస్మి - నమస్కరించెదను.

అట్టి నేను జీవునకు సర్వోత్తమ లక్ష్య మైన ఈశ్వరుని నమస్కరిం చుచున్నాను. జగద్రూపముగా ప్రకటమై ఆ విధముగా జగత్తును సృష్టించిన ఈశ్వరుడు జగత్తుకంటె విలక్షణుడుగనే యున్నాడు. పుట్టుక లేని ఈశ్వరు నకు జగత్తే సంపద, లీలాక్షేత్రము. జగత్తుయొక్క ఆత్మ (సత్తాస్ఫూర్తులు) ఈశ్వరుడే.

యోగరంధితకర్మాణో హృది యోగవిభావితే ।
యోగినో యం ప్రపశ్యంతి యోగేశం తం నతోఽస్మ్యహమ్ ॥ 27

యోగరంధితకర్మాణః - జ్ఞానముచే భస్మము చేయబడిన కర్మలు గల, యోగినః - జ్ఞానులు, యోగవిభావితే - యోగముచే పరిశుద్ధము చేయబడిన, హృది - హృదయమునందు, యమ్ - ఏ, యోగ-ఈశమ్ - యోగేశ్వరుని, ప్రపశ్యంతి - సాక్షాత్కరించు కొనుచున్నారో, తమ్ - ఆ ఈశ్వరుని, అహమ్ - నేను, నతః అస్మి - నమస్కరించుచున్నాను.

ఆత్మజ్ఞానము అనే యోగము (ఈశ్వరునితో జీవుని కలిపేది) చే భస్మము చేయబడిన కర్మలు గల జీవన్ముక్తులు యోగముచే పరిశుద్ధమైన తమ అంతఃకరణమునందు ఆ యోగేశ్వరుని ఆత్మరూపముగా సాక్షాత్కరించు కొనెదరు. నేను అట్టి ఈశ్వరుని నమస్కరించుచున్నాను.

నమో నమస్తుభ్యమసహ్యవేగశక్తిత్రయాయాఖిలధీగుణాయ,
ప్రపన్నపాలాయ దురంతశక్తయే కదింద్రియాణామనవాప్యవర్త్మనే।

అసహ్యవేగశక్తిత్రయాయ - సహించ శక్యము కాని వేగముగల మూడు శక్తులు కలిగినట్టియు, అఖిలధీగుణాయ - సకలమనోవృత్తులు కలిగినట్టియు (సర్వేంద్రియముల గుణములగు శబ్దాదుల రూపములోనున్నట్టియు), ప్రపన్నపాలాయ - శరణు జొచ్చినవారిని రక్షించునట్టియు, దురంత శక్తయే - అనంతమగు శక్తి కలిగినట్టియు, కదింద్రియాణామ్ - కుత్సితమగు ఇంద్రియములు గలవారలకు, అనవాప్యవర్త్మనే - పొంద శక్యము కాని మార్గము గల, తుభ్యమ్ - నీకొరకు, నమః నమః - నమస్కారములు.

ఓ దేవా! సత్త్వరజస్తమోగుణములనే నీ శక్తుల వేగమును సహించుట కష్టము. సకలమనోవృత్తులకు మూలమగు ఆత్మవు నీవే. సర్వేంద్రియములకు విషయములగు శబ్దాదుల రూపములోనుండే జగత్తు కూడ నీవే. శరణు జొచ్చినవారిని రక్షించే నీ దారిలోనికి కుత్సితమగు (భోగపరాయణములగు) ఇంద్రియములు గలవారు చేరుకొనలేరు. నీకు అనేక నమస్కారములు.

నాయం వేద స్వమాత్మానం యచ్ఛక్త్యాహంధియా హతమ్ ।
తం దురత్యయమాహాత్మ్యం భగవంతమితోఽస్మ్యహమ్ ।। 29

యత్-శక్త్యా - ఏ పరమేశ్వరుని శక్తియైన, అహంధియా - నేను అనే బుద్ధిచే, హతమ్ - కప్పివేయబడిన, స్వమ్ - తనదైన, ఆత్మానమ్ - చైతన్యస్వరూపమును, అయమ్ - ఈ జనుడు, న వేద - తెలియకున్నాడో, దురత్యయమాహాత్మ్యమ్ - తెలియ శక్యము కాని మహిమ గల, తమ్ - అట్టి, భగవంతమ్ - భగవానుని, అహమ్ - నేను, ఇతః - శరణు పొందిన వాడను, అస్మి - అగుచున్నాను.

భగవంతుని మాయాశక్తియే అవిద్యయై వివేకమును కప్పివేయు టచే వ్యక్తి దేహాదులయందు నేను-అనే బుద్ధిని కలిగి తన చైతన్యస్వరూప మును తెలియకున్నాడు. భగవానుని మహిమను అంచనా వేయుట సంభ వము కాదు. అట్టి భగవానుని నేను శరణు వేడుచున్నాను.

శ్రీశుక ఉవాచ ।
ఏవం గజేంద్రముపవర్ణితనిర్విశేషం
బ్రహ్మాదయో వివిధలింగభిదాఽభిమానాః ।
నైతే యదోపసస్రృపుర్నిఖిలాత్మకత్వాత్
తత్రాఖిలామరమయో హరిరావిరాసీత్ ॥ 30

యదా - ఎప్పుడైతే, ఏవమ్ - ఈ విధముగా, ఉపవర్ణితనిర్విశే షమ్ - వర్ణించబడిన భేదరహితమైన పరబ్రహ్మ కలిగిన, గజేంద్రమ్ - గజేంద్రుని, వివిధలింగభిదా-అభిమానాః - వివిధములైన చిహ్నముల భేద మునందు అభిమానము గల, ఏతే - ఈ, బ్రహ్మ-ఆదయః - బ్రహ్మగారు మొదలగువారలు, న ఉపసస్రృపుః - సమీపమునకు వెళ్లలేదో, నిఖిల-ఆత్మ కత్వాత్ - సర్వమునకు ఆత్మయై ఉండుట వలన, అఖిల-అమరమయః - సర్వదేవతాస్వరూపుడగు, హరిః - శ్రీహరి, తత్ర - అచట (అప్పుడు), ఆవిః-ఆసీత్ - ఆవిర్భవించెను.

ఈ విధముగా గజేంద్రుడు భేదరహితమగు పరబ్రహ్మను వర్ణించె ను. బ్రహ్మగారు మొదలగు దేవతలకు తమ తమ చిహ్నములు మరియు మూర్తుల భేదమునందు, ఇది నేను అనే అభిమానము గలదు. కావుననే, వారు గజేంద్రుని వద్దకు వెళ్లలేదు. కాని, సర్వమునకు ఆత్మరూపుడు మరియు సకలదేవతాస్వరూపుడు అగు శ్రీహరి (నిర్విశేష స్వరూపుడగుట చే) అప్పుడు అచట ఆవిర్భవించెను.

తం తద్వదార్తముపలభ్య జగన్నివాసః
స్తోత్రం నిశమ్య దివిజైస్సహ సంస్తువద్భిః ।
ఛందోమయేన గరుడేన సముహ్యమానః
చక్రాయుధోఽభ్యగమదాశు యతో గజేంద్రః ॥ 31

జగత్-నివాసః - జగత్తునకు అధిష్ఠానమైనవాడు, చక్ర-ఆయుధః - చక్రము ఆయుధముగా గలవాడు అగు శ్రీహరి, తద్వత్ - ఆ విధముగా, ఆర్తమ్ - పీడించబడుచున్న, తమ్ - ఆ గజేంద్రుని గురించి, ఉపలభ్య - తెలిసి, స్తోత్రమ్ - స్తోత్రమును, నిశమ్య - విని, సంస్తువద్భిః - చక్కగా స్తుతించుచున్న, దివిజైః సహ - దేవతలతో సహా, ఛందోమయేన - వేదరూపుడగు, గరుడేన - గరుడునిచే, సముహ్యమానః - చక్కగా వహించబడుచున్నవాడై, ఆశు - శీఘ్రముగా, అభ్యగమత్ - చేరుకొనెను, యతః - ఎక్కడనైతే, గజ-ఇంద్రః - గజేంద్రుడు గలడో.

జగత్తునకు అధిష్ఠానమైన శ్రీహరికి గజేంద్రుడు ఆ విధముగా పీడించబడుట తెలిసెను. గజేంద్రుని స్తోత్రమును కూడ ఆయన వినెను. ఆయన వెంటనే చక్రమనే ఆయుధమును ధరించి, వేదరూపుడగు గరుడుడే వాహనము కాగా, గజేంద్రుడు ఉన్న చోటకు చేరుకొనెను. దేవతలు చక్కగా స్తోత్రములను చేయుచూ ఆయన వెంట వచ్చిరి.

సోఽంతస్సరస్యురుబలేన గృహీత ఆర్తో
దృష్ట్వా గరుత్మతి హరిం ఖ ఉపాత్తచక్రమ్ ।
ఉత్క్షిప్య సాంబుజకరం గిరమాహ కృచ్ఛ్రా-
న్నారాయణాఖిలగురో భగవన్నమస్తే ॥ 32

సరసి - సరస్సునందు, అంతః - లోపల, ఉరుబలేన - గొప్ప బలము గల మొసలిచే, గృహీతః - పట్టుకొనబడినవాడై, ఆర్తః - పీడితుడైన, సః - ఆ గజేంద్రుడు, ఖే - ఆకాశమునందు, గరుత్మతి - గరుత్మంతుని పై, ఉపాత్తచక్రమ్ - పట్టుకొనబడిన చక్రము గల, హరిమ్ - శ్రీహరిని, దృష్ట్వా - చూచి, స-అంబుజకరమ్ - పద్మముతో కూడిన తొండమును, ఉత్క్షిప్య - పైకెత్తి, కృచ్ఛ్రాత్ - కష్టము మీదట, గిరమ్ - మాటను, ఆహ - పలికెను, నారాయణ - ఓ నారాయణా!, అఖిలగురో - సకలజగత్తునకు తండ్రీ!, భగవన్ - భగవానుడా!, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

సరస్సు లోపల గొప్ప బలము గల మొసలిచే పట్టుకొనబడి పీడను పొందియున్న ఆ గజేంద్రుడు ఆకాశములో గరుత్మంతునిపై చక్ర

మును పట్టుకొనియున్న శ్రీహరిని చూచెను. ఆతడు తన తొండముతో పద్మమును పైకెత్తి అతికష్టము మీద ఈ మాటను పలికెను -- ఓ నారాయణా! నీవు జగత్తునకంతకు తండ్రివి. భగవానుడా! నీకు నమస్కారము.

తం వీక్ష్య పీడితమజస్సహసాఽవతీర్య
సగ్రాహమాశు సరసః కృపయోజ్జహార ।
గ్రాహాద్విపాటితముఖాదరిణా గజేంద్రం
సంపశ్యతాం హరిరమూముచదుస్రియాణామ్ ।। 33

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే
గజేంద్రోపాఖ్యానే గజేంద్రమోక్షో నామ తృతీయోఽధ్యాయః ।।

అజః - పుట్టుక లేని, హరిః - శ్రీహరి, పీడితమ్ - పీడను పొందియున్న, తమ్ - ఆ, గజేంద్రమ్ - గజేంద్రుని, వీక్ష్య - చూచి, సహసా - వేగముగా, అవతీర్య - క్రిందకు దిగి, ఆశు - వెంటనే, సగ్రాహమ్ - మొసలితో కూడియున్న గజేంద్రుని, కృపయా - దయతో, సరసః - సరస్సునుండి, ఉజ్జహార - పైకి లాగెను, అరిణా - చక్రముచే, విపాటితముఖాత్ - చీల్చివేయబడిన నోరు గల, గ్రాహాత్ - మొసలినుండి, ఉస్రియాణామ్ - దేవతలు, సంపశ్యతామ్ - చూచుచుండగా, అమూముచత్ - విడిపించెను.

పుట్టుక లేని శ్రీహరి పీడను పొందియున్న ఆ గజేంద్రుని చూచి దయతో వేగముగా క్రిందకు దిగి వెంటనే మొసలితో సహా గజేంద్రుని నీటి నుండి పైకి లాగి, చక్రముతో మొసలి నోటిని చీల్చివేసి, గజేంద్రుని దాని పట్టునుండి విడిపించెను. ఈ దృశ్యమును దేవతలు చక్కగా తిలకించిరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
గజేంద్రోపాఖ్యానములో గజేంద్రునకు విముక్తి లభించుటను
వర్ణించే మూడవ అధ్యాయము ముగిసినది (3) .

*****

# అథ చతుర్థోఽధ్యాయః

## గజేంద్రోపాఖ్యానము - గజేంద్రుని పూర్వజన్మ వృత్తాంతము

శ్రీశుక ఉవాచ ।
తదా దేవర్షిగంధర్వా బ్రహ్మేశానపురోగమాః ।
ముముచుః కుసుమాసారం శంసంతః కర్మ తద్ధరేః ॥ 1

తదా - అప్పుడు, బ్రహ్మ-ఈశానపురోగమాః - బ్రహ్మగారు రుద్రుడు మొదలుగా గల, దేవ-ఋషిగంధర్వాః - దేవతలు మహర్షులు గంధర్వులు, హరేః - శ్రీహరియొక్క, తత్ - ఆ, కర్మ - లీలను, శంసంతః - కొనియాడుచున్నవారై, కుసుమ-ఆసారమ్ - పూలవానను, ముముచుః - విడిచిపెట్టిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- అప్పుడు బ్రహ్మగారు, రుద్రుడు మొదలుగా గల దేవతలు, మహర్షులు, గంధర్వులు శ్రీహరి యొక్క ఆ లీలను కొనియాడుచున్నవారై పూలవానను కురిపించిరి.

నేదుర్దుందుభయో దివ్యా గంధర్వా ననృతుర్జగుః ।
ఋషయశ్చారణాస్సిద్ధాస్తుష్టువుః పురుషోత్తమమ్ ॥ 2

దివ్యాః - దేవతలకు చెందిన, దుందుభయః - దుందుభులు, నేదుః - మ్రోగినవి, గంధర్వాః - గంధర్వులు, ననృతుః - నాట్యమాడిరి, జగుః - గానము చేసిరి, ఋషయః - మహర్షులు, చారణాః - చారణులు, సిద్ధాః - సిద్ధులు, పురుష-ఉత్తమమ్ - పురుషోత్తముని, తుష్టువుః - స్తుతించిరి.

దేవదుందుభులు మ్రోగగా, గంధర్వులు గానము చేసి నాట్యమాడిరి. మహర్షులు, చారణులు, సిద్ధులు పురుషోత్తముడగు శ్రీహరిని స్తుతించిరి.

యోఽసౌ గ్రాహస్స వై సద్యః పరమాశ్చర్యరూపధృక్ ।
ముక్తో దేవలశాపేన హూహూర్గంధర్వసత్తమః ॥ 3

యః - ఏ, అసౌ - ఈ, గ్రాహః వై - మొసలి గలదో, సః - అది, సద్యః - వెంటనే, పరమ-ఆశ్చర్యరూపధృక్ - గొప్ప ఆశ్చర్యమును కలిగించే రూపమును దాల్చినది, దేవలశాపేన - దేవలుని శాపముచే, ముక్తః - విముక్తుడైన, హూహూః - హూహూ అనే, గంధర్వసత్తమః - గంధర్వశ్రేష్ఠుడు.

ఆ మొసలి వెంటనే గొప్ప ఆశ్చర్యమును కలిగించే రూపమును దాల్చెను. దేవలుని శాపముచే మొసలి అయిన హూహూ అనే గంధర్వశ్రేష్ఠుడు శాపవిముక్తుడాయెను.

ప్రణమ్య శిరసాఽధీశముత్తమశ్లోకమవ్యయమ్ ।
అగాయత యశోధామ కీర్తన్యగుణసత్కథమ్ ॥ 4

అధీశమ్ - సర్వేశ్వరుడైనట్టియు, ఉత్తమశ్లోకమ్ - ఉత్తమమగు కీర్తి కలిగినట్టియు, అవ్యయమ్ - వినాశము లేనట్టియు, యశః-ధామ - కీర్తికి నిధానమైనట్టియు, కీర్తన్యగుణసత్-కథమ్ - కీర్తించదగిన గుణములు మంచి గాథలు కలిగిన శ్రీహరిని, శిరసా - శిరస్సుతో, ప్రణమ్య - ప్రణమిల్లి, అగాయత - కీర్తించెను.

సర్వేశ్వరుడగు శ్రీహరి ఉత్తమమగు కీర్తి గలవాడు. వినాశము లేని శ్రీహరి కీర్తికి నిధానము. ఆయన గుణములు కీర్తించదగినవి; గాథలు మంచివి. ఆ గంధర్వుడు ఆయనకు తలను వంచి నమస్కరించి కీర్తించెను.

సోఽనుకంపిత ఈశేన పరిక్రమ్య ప్రణమ్య తమ్ ।
లోకస్య పశ్యతో లోకం స్వమగాన్ముక్తకిల్బిషః ॥ 5

ఈశేన - ఈశ్వరునిచే, అనుకంపితః - అనుగ్రహించబడినవాడై, ముక్తకిల్బిషః - విడువబడిన పాపము గల, సః - ఆతడు, తమ్ - ఆయనను, పరిక్రమ్య - ప్రదక్షిణము చేసి, ప్రణమ్య - ప్రణమిల్లి, లోకస్య - జనము, పశ్యతః - చూచుచుండగా, స్వమ్ - తనదైన, లోకమ్ - లోకమును గురించి, అగాత్ - వెళ్లెను.

ఈశ్వరుని అనుగ్రహముచే ఆ గంధర్వుని పాపము తొలగిపోయెను. ఆతడు ఆయనకు ప్రదక్షిణ నమస్కారమును చేసి, బ్రహ్మాదులు చూచుచుండగా తన లోకమునకు వెళ్లెను.

గజేంద్రో భగవత్స్పర్శాద్విముక్తోఽజ్ఞానబంధనాత్ ।
ప్రాప్తో భగవతో రూపం పీతవాసాశ్చతుర్భుజః ।। 6

భగవత్-స్పర్శాత్ - భగవానుని స్పర్శచే, అజ్ఞానబంధనాత్ - అజ్ఞానము అనే బంధమునుండి, విముక్తః - విముక్తుడైన, గజ-ఇంద్రః - గజేంద్రుడు, భగవతః - భగవానుని, రూపమ్ - రూపమును, ప్రాప్తః - పొందినాడు, పీతవాసాః - పచ్చని వస్త్రము గలవాడు, చతుర్భుజః - నాలుగు భుజములు గలవాడు.

భగవానుని స్పర్శచే గజేంద్రుని అజ్ఞానము అనే బంధము తొలగిపోయెను. ఆతడు భగవానుని రూపమును పొంది నాలుగు భుజములు గల పీతాంబరుడాయెను.

స వై పూర్వమభూద్రాజా పాండ్యో ద్రవిడసత్తమః ।
ఇంద్రద్యుమ్న ఇతి ఖ్యాతో విష్ణువ్రతపరాయణః ।। 7

సః వై - ఆ గజేంద్రుడైతే, పూర్వమ్ - పూర్వజన్మయందు, ద్రవిడ సత్తమః - ద్రవిడదేశములో శ్రేష్ఠుడు, ఇంద్రద్యుమ్నః - ఇంద్రద్యుమ్నుడు, ఇతి - అని, ఖ్యాతః - ప్రఖ్యాతి చెందినవాడు, విష్ణువ్రతపరాయణః - విష్ణువ్రతమునందు పూర్ణమైన నిష్ఠ గలవాడు అగు, పాండ్యః రాజా - పాండ్యవంశపు రాజు, అభూత్ - ఆయెను.

ఆ గజేంద్రుడైతే పూర్వజన్మలో ఇంద్రద్యుమ్నుడని ప్రసిద్ధి గాంచిన పాండ్యవంశపు రాజుగా ఉండెను. ఆయన ద్రవిడదేశములో శ్రేష్ఠుడుగ నుండెను. ఆయనకు విష్ణువ్రతమునందు దృఢమగు నిష్ఠ ఉండెడిది.

స ఏకదాఽఽరాధానకాల ఆత్మవాన్
గృహీతమౌనవ్రత ఈశ్వరం హరిమ్ ।
జటాధరస్తాపస ఆప్లుతోఽచ్యుతం
సమర్చయామాస కులాచలాశ్రమః ॥ 8

ఆత్మవాన్ - మనోనిగ్రహము గలవాడు, గృహీతమౌనవ్రతః - స్వీకరించబడిన మౌనమనే వ్రతము గలవాడు, జటాధరః - జటలను ధరించినవాడు, తాపసః - తపస్సునందు నిష్ఠ గలవాడు, ఆప్లుతః - స్నానమును చేసినవాడు, కుల-అచల-ఆశ్రమః - కులపర్వతమునందు ఆశ్రమము గల వాడు అగు, సః - ఆ ఇంద్రద్యుమ్నుడు, ఏకదా - ఒకనాడు, ఆరాధనకాలే - ఆరాధించే సమయమునందు, ఈశ్వరమ్ - సర్వేశ్వరుడైనట్టియు, అచ్యుతమ్ - స్వరూపమునుండి చ్యుతి లేని, హరిమ్ - శ్రీహరిని, సమర్చయామాస - చక్కగా పూజించెను.

మనోనిగ్రహము గల ఆ ఇంద్రద్యుమ్నుడు మౌనవ్రతమును స్వీకరించి యుండెను. తపోనిష్ఠ గల ఆ రాజు జటాధారియై కులపర్వతమునందు ఆశ్రమమును కట్టుకొని నివసించుచుండెను. ఆయన ఒకనాడు స్నానమును చేసి ఆరాధన సమయమునందు సర్వేశ్వరుడైన శ్రీహరిని చక్కగా పూజించెను. శ్రీహరికి స్వరూపమునుండి చ్యుతి లేదు.

యదృచ్ఛయా తత్ర మహాయశా మునిః
సమాగమచ్ఛిష్యగణైః పరిశ్రితః ।
తం వీక్ష్య తూష్ణీమకృతార్హణాదికం
రహస్యుపాసీనమృషిశ్చుకోప హ ॥ 9

మహాయశాః - గొప్ప కీర్తి గల, మునిః - అగస్త్య మహర్షి, శిష్యగణైః - శిష్యుల గణములచే, పరిశ్రితః - చుట్టువారబడినవాడై, యదృ

చ్ఛయా - అనుకోకుండా, తత్ర - అచటకు, సమాగమత్ - విచ్చేసెను, తూష్ణీమ్ - మిన్నకున్నట్టియు, అకృత-అర్హణ-ఆదికమ్ - చేయబడని అర్ఘ్యము మొదలగునవి కలిగినట్టియు, రహసి - ఏకాంతమునందు, ఉపాసీనమ్ - కూర్చున్న, తమ్ - ఆ ఇంద్రద్యుమ్నుని, వీక్ష్య - చూచి, ఋషిః - ఆ మహర్షి, చుకోప - కోపించెను.

గొప్ప యశస్వియగు అగస్త్య మహర్షి శిష్యుల గణములు చుట్టు వారి రాగా, ఈశ్వరేచ్ఛచే అనుకోకుండా అచటకు విచ్చేసెను. ఏకాంతమునందు మౌనముగా కూర్చున్న ఆ ఇంద్రద్యుమ్నుడు ఆయనకు అర్ఘ్యము మొదలగు ఉపచారములను చేయకపోగా, స్వాగతవచనములను కూడ పలుకలేదు. ఆయనను ఆ విధముగా చూచి ఆ మహర్షి కోపించెను.

తస్మా ఇమం శాపమదాదసాధురయం దురాత్మాఽకృతబుద్ధిరద్య,
విప్రావమంతా విశతాం తమోఽంధం యథా గజః స్తబ్ధమతిస్స ఏవ।

తస్మై - ఆతని కొరకు, ఇమమ్ - ఈ, శాపమ్ - శాపమును, అదాత్ - ఇచ్చెను, అయమ్ - ఈ, అసాధుః - దుష్టుడు, దురాత్మా - దుర్బుద్ధి, అకృతబుద్ధిః - శిక్షితము కాని బుద్ధి గలవాడు, అద్య - ఈనాడు, విప్ర-అవమంతా - మహర్షిని అవమానించువాడు, గజః యథా - ఏనుగు వలె, స్తబ్ధమతిః - జడమైన బుద్ధి గలవాడు, అంధం తమః - దట్టని అజ్ఞానము అనే చీకటిని, విశతామ్ - ప్రవేశించు గాక!, సః ఏవ - అట్టి ఏనుగే (అగుగాక)!

ఆతనికి ఆ మహర్షి ఈ విధముగా శాపమునిచ్చెను -- ఈతడు దుష్టుడు, దుర్బుద్ధి. ఈతని బుద్ధి శిక్షితమైనది కాదు. కావుననే, ఈతడీనాడు మహర్షినగు నన్ను అవమానించినాడు. ఈతడు ఏనుగు వలె జడమైన బుద్ధి గలవాడు గనుక, ఏనుగు అయి అజ్ఞానము అనే దట్టని చీకటిని ప్రవేశించు గాక!

శ్రీశుక ఉవాచ ।
ఏవం శప్త్వా గతోఽగస్త్యో భగవాన్ నృప సానుగః ।
ఇంద్రద్యుమ్నోఽపి రాజర్షిర్దిష్టం తదుపధారయన్ ॥ 11

నృప - ఓ మహారాజా!, భగవాన్ - పూజనీయుడగు, అగస్త్యః - అగస్త్య మహర్షి, ఏవమ్ - ఈ విధముగా, శప్త్వా - శపించి, స-అనుగః - అనుచరులతో కూడినవాడై, గతః - వెళ్లినవాడు, రాజర్షిః - రాజర్షియగు, ఇంద్రద్యుమ్నః అపి - ఇంద్రద్యుమ్నుడైతే, తత్ - దానిని, దిష్టమ్ - దైవనిర్ణయమునుగా, ఉపధారయన్ - నిశ్చయించుకున్నవాడు.

ఓ పరీక్షిన్మహారాజా! పూజనీయుడగు అగస్త్య మహర్షి ఈ విధముగా శపించి, తన అనుచరులతో గూడి వెళ్లెను. రాజర్షియగు ఇంద్రద్యుమ్నుడు ఆ శాపము దైవనిర్ణయమేనని నిశ్చయించుకొనెను.

ఆపన్నః కౌంజరీం యోనిమాత్మస్మృతివినాశినీమ్ ।
హర్యర్చనానుభావేన యద్గజత్వేఽప్యనుస్మృతిః ।। 12

ఆత్మస్మృతివినాశినీమ్ - తన స్వరూపముయొక్క స్మరణమును నశింపజేసే, కౌంజరీమ్ - ఏనుగునకు సంబంధించిన, యోనిమ్ - జన్మను, ఆపన్నః - పొందినవాడు, గజత్వే అపి - ఏనుగై ఉండగా కూడ, అనుస్మృతిః - శ్రీహరి స్తుతి గుర్తుకు వచ్చుట, యత్ - ఏది గలదో అది, హరి -అర్చనా-అనుభావేన - శ్రీహరిని అర్చించుటయొక్క ప్రభావముచే.

జీవునకు తన స్వరూపముయొక్క స్మరణమును నశింపజేసే ఏనుగుజన్మను ఆయన పొందెను. ఏనుగై ఉన్న ఆయనకు శ్రీహరి స్తుతి గుర్తుకు వచ్చుట, పూర్వజన్మలో ఆయన చేసిన శ్రీహరి అర్చనయొక్క ప్రభావమే.

ఏవం విమోక్ష్య గజయూథపమబ్జనాభః
తేనాపి పార్షదగతిం గమితేన యుక్తః ।
గంధర్వసిద్ధవిబుధైరుపగీయమాన-
కర్మాఽద్భుతం స్వభవనం గరుడాసనోఽగాత్ ।। 13

గరుడ-ఆసనః - గరుడుడు వాహనముగా గల, అబ్జనాభః - పద్మనాభుడు, ఏవమ్ - ఈ విధముగా, గజయూథపమ్ - గజేంద్రుని, విమోక్ష్య - విడిపించి, పార్షదగతిమ్ - అనుచరుడు అనే స్థాయిని, గమితేన -

పొందించబడిన, తేన అపి - ఆ గజేంద్రునితో గూడ, యుక్తః - కూడినవా డై, గంధర్వసిద్ధవిబుధైః - గంధర్వులు సిద్ధులు దేవతలచే, ఉపగీయమాన కర్మా - కీర్తించబడుచున్న లీల గలవాడై, అద్భుతమ్ - అద్భుతమైన, స్వభవనమ్ - తన భవనమును గురించి, అగాత్ - వెళ్లెను.

పద్మనాభుడీ విధముగా గజేంద్రుని మొసలినుండి విడిపించి, ఆయనకు తన అనుచరులలో స్థానమునొసంగెను. ఆయన కూడ వెంటరా గా, శ్రీహరి గరుత్మంతుని అధిష్ఠించి అద్భుతమగు తన భవనమునకు వెళ్లె ను. ఆయన లీలను గంధర్వులు, సిద్ధులు, దేవతలు కీర్తించుచుండిరి.

ఏతన్మహారాజ తవేరితో మయా
కృష్ణానుభావో గజరాజమోక్షణమ్ ।
స్వర్గ్యం యశస్యం కలికల్మషాపహం
దుస్స్వప్ననాశం కురువర్య శృణ్వతామ్ ॥ 14

మహారాజ - ఓ మహారాజా!, కురువర్య - కురుశ్రేష్ఠా!, మయా - నాచే, తవ - నీకు, ఏతత్ - ఈ విధముగా, గజరాజమోక్షణమ్ - గజేంద్రుని విముక్తి అనే, కృష్ణ-అనుభావః - శ్రీకృష్ణుని ప్రభావము, ఈరితః - చెప్పబ డినది, శృణ్వతామ్ - వినువారలకు, స్వర్గ్యమ్ - స్వర్గమునిచ్చునది, యశ స్యమ్ - కీర్తినిచ్చునది, కలికల్మష-అపహమ్ - కలిదోషములను నివారిం చునది, దుస్స్వప్ననాశమ్ - చెడు స్వప్నములను పోగొట్టునది.

ఓ పరీక్షిన్మహారాజా! నీవు కురువంశములో శ్రేష్ఠుడవు. నేను నీకీ విధముగా గజేంద్రునకు విముక్తిని కలిగించిన శ్రీకృష్ణుని ప్రభావమును గురించి చెప్పితిని. దీనిని విన్నవారలకు కీర్తి, స్వర్గము లభించును. దీని వలన కలిదోషములు నివారణ యగును. ఇది చెడు స్వప్నములు రాకుండా నివారించును.

యథాऽనుకీర్తయంన్త్యేతచ్ఛ్రేయస్కామా ద్విజాతయః ।
శుచయః ప్రాతరుత్థాయ దుస్స్వప్నాద్యుపశాంతయే ॥ 15

శ్రేయః-కామాః - శ్రేయస్సును కోరే, ద్విజాతయః - వైదికులు, దుస్స్వప్న-ఆది-ఉపశాంతయే - చెడు స్వప్నములు మొదలగునవి తొలగి పోవుటకై, ప్రాతః - ఉదయమే, ఉత్థాయ - నిద్ర లేచి, శుచయః - పరిశుద్ధులై, ఏతత్ - దీనిని, యథా - ఉన్నది ఉన్నట్లుగా, అనుకీర్తయంతి - కీర్తించెదరు.

కల్యాణములను కోరే వైదికులు చెడు స్వప్నములు మొదలగు దోషములు తొలగిపోవుటకై, ఉదయమే నిద్ర లేచి పరిశుద్ధులై దీనిని ఉన్నది ఉన్నట్లుగా కీర్తించెదరు (కీర్తించవలెను).

ఇదమాహ హరిః ప్రీతో గజేంద్రం కురుసత్తమ ।
శృణ్వతాం సర్వభూతానాం సర్వభూతమయో విభుః ।। 16

కురుసత్తమ - ఓ కురుశ్రేష్ఠా!, సర్వభూతమయః - సర్వప్రాణుల రూపముగా నున్నవాడు, విభుః - సర్వసమర్థుడు అగు, హరిః - శ్రీహరి, ప్రీతః - ప్రసన్నుడై, సర్వభూతానామ్ - సకలప్రాణులు, శృణ్వతామ్ - వినుచుండగా, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను.

ఓ కురుశ్రేష్ఠా! సర్వసమర్థుడగు శ్రీహరియే సకలప్రాణుల రూపములో నున్నాడు. ఆయన చాల సంతోషించి, సకలప్రాణులు వినుచుండగా, గజేంద్రునితో నిట్లనెను.

శ్రీభగవానువాచ ।
యే మాం త్వాం చ సరశ్చేదం గిరికందరకాననమ్ ।
వేత్రకీచకవేణూనాం గుల్మాని సురపాదపాన్ ।। 17

శృంగాణీమాని ధిష్ణ్యాని బ్రహ్మణో మే శివస్య చ ।
క్షీరోదం మే ప్రియం ధామ శ్వేతద్వీపం చ భాస్వరమ్ ।। 18

శ్రీవత్సం కౌస్తుభం మాలాం గదాం కౌమోదకీం మమ ।
సుదర్శనం పాంచజన్యం సుపర్ణం పతగేశ్వరమ్ ।। 19

శేషం చ మత్కలాం సూక్ష్మాం శ్రియం దేవీం మదాశ్రయామ్।
బ్రహ్మాణం నారదమృషిం భవం ప్రహ్లాదమేవ చ ॥ 20

మత్స్యకూర్మవరాహాద్యైరవతారైః కృతాని మే ।
కర్మాణ్యనంతపుణ్యాని సూర్యం సోమం హుతాశనమ్ ॥ 21

ప్రణవం సత్యమవ్యక్తం గోవిప్రాన్ ధర్మమవ్యయమ్ ।
దాక్షాయణీర్ధర్మపత్నీస్సోమకశ్యపయోరపి ॥ 22

గంగాం సరస్వతీం నందాం కాలిందీం సితవారణమ్ ।
ధ్రువం బ్రహ్మఋషీన్ సప్త పుణ్యశ్లోకాంశ్చ మానవాన్ ॥23

ఉత్థాయాపరరాత్రాంతే ప్రయతాస్సుసమాహితాః ।
స్మరంతి మమ రూపాణి ముచ్యంతే హ్యేనసోఽఖిలాత్ ॥24

ప్రయతాః - పరిశుద్ధులు, సుసమాహితాః - మంచి చిత్తైకాగ్రత గలవారు అగు, యే - ఏ జనులు, అపరరాత్ర-అంతే - తెల్లవారు జామున, ఉత్థాయ - నిద్ర లేచి, మామ్ - నన్ను, మమ - నాయొక్క, రూపాణి - రూపములైన, త్వాం చ - నిన్ను కూడ, ఇదమ్ - ఈ, సరః - సరస్సును, గిరికందరకాననమ్ - పర్వతము గుహలు అడవుల సమూహమును, వేత్రకీచకవేణూనామ్ - వేము సన్న వెదురు వెదురులయొక్క, గుల్మాని - పొదలను, సురపాదపాన్ - దివ్యవృక్షములను, ఇమాని - ఈ, శృంగాని - శిఖరములను, బ్రహ్మణః - బ్రహ్మగారి, మే - నా, శివస్య - శివుని, ధిష్ణ్యాని చ - ధామములను కూడ, క్షీరోదమ్ - పాల సముద్రమును, మే - నా కొరకు, ప్రియమ్ - ప్రియమైనట్టియు, భాస్వరమ్ - ప్రకాశించే, ధామ - నివాసస్థానమగు, శ్వేతద్వీపం చ - శ్వేతద్వీపమును కూడ, శ్రీవత్సమ్ - శ్రీవత్సమును, కౌస్తుభమ్ - కౌస్తుభమును, మాలామ్ - మాలను, కౌమోదకీం గదామ్ - కౌమోదకీ గదను, మమ - నాయొక్క, సుదర్శనమ్ - సుదర్శన చక్రమును, పాంచజన్యమ్ - పాంచజన్యమును, పతగ-ఈశ్వరమ్ - పక్షిరాజగు, సుపర్ణమ్ - గరుడుని, సూక్ష్మామ్ - సూక్ష్మమైన, మత్-కలామ్ - నా అంశయైన, శేషం చ - ఆదిశేషుని కూడ, మద్-ఆశ్రయామ్ - నన్ను

ఆశ్రయించి ఉండే, శ్రియం దేవీమ్ - లక్ష్మీదేవిని, బ్రహ్మాణమ్ - బ్రహ్మగారిని, నారదం ఋషిమ్ - నారద మహర్షిని, భవమ్ - శివుని, ప్రహ్లాదం ఏవ చ - ప్రహ్లాదుని కూడ, మత్స్యకూర్మవరాహ-ఆద్యైః - మత్స్యకూర్మవరాహములు మొదలైన, మే - నాయొక్క, అవతారైః - అవతారములచే, కృతాని - చేయబడిన, అనంతపుణ్యాని - అనంతమగు పుణ్యమునిచ్చే, కర్మాణి - కర్మలను, సూర్యమ్ - సూర్యుని, సోమమ్ - చంద్రుని, హుతాశనమ్ - అగ్నిని, ప్రణవమ్ - ఓంకారమును, సత్యమ్ - సత్యమును, అవ్యక్తమ్ - మాయాశక్తిని, గోవిప్రాన్ - గోవులను వేదవేత్తలను, అవ్యయమ్ - వినాశము లేని, ధర్మమ్ - ధర్మమును, దాక్షాయణీః - దక్షుని కుమార్తెలైన, ధర్మపత్నీః - ధర్ముని భార్యలను, సోమకశ్యపయోః అపి - చంద్రుడు కశ్యపుల భార్యలైన దక్షపుత్రికలను, గంగామ్ - గంగను, సరస్వతీమ్ - సరస్వతిని, నందామ్ - అలకనందను, కాలిందీమ్ - యమునను, సితవారణమ్ - తెల్లని ఏనుగు (ఐరావతము) ను, ధ్రువమ్ - ధ్రువుని, సప్త - ఏడ్గురు, బ్రహ్మఋషీన్ - బ్రహ్మర్షులను, పుణ్యశ్లోకాన్ - పవిత్రమగు కీర్తి గల, మానవాన్ - మానవులను, స్మరంతి - స్మరించెదరో వారు, అఖిలాత్ - సమస్తమైన, ఏనసః - పాపమునుండి, హి - నిశ్చయముగా, ముచ్యంతే - విముక్తులగుదురు.

శ్రీభగవానుడు ఇట్లు పలికెను --- ఎవరైతే తెల్లవారు జామున నిద్ర లేచి పరిశుద్ధులై మిక్కిలి ఏకాగ్రమైన చిత్తముతో నన్ను మరియు నా రూపములను స్మరించెదరో, వారు నిశ్చయముగా సకలపాపములనుండి విముక్తిని పొందెదరు. నీవు (గజేంద్రుడు), ఈ సరస్సు, పర్వతము, గుహలు, అడవులు, వేము పొదలు, సన్న వెదురు పొదలు, వెదురు పొదలు, మందారము మొదలగు దివ్య వృక్షములు, ఈ శిఖరములు, బ్రహ్మలోకము, శివలోకము, నా లోకము, పాల సముద్రము, నాకు మిక్కిలి ప్రియమైన ప్రకాశవంతమైన నివాస స్థానమగు శ్వేతద్వీపము, శ్రీవత్సము (లక్ష్మి శ్రీహరి వక్షఃస్థలముపై మచ్చయై ఉండును), కౌస్తుభ మాణిక్యము, వైజయంతీ మాల, కౌమోదకీ గద, నా సుదర్శన చక్రము, పాంచజన్యమనే శంఖము, పక్షిరాజగు గరుత్మంతుడు, నా సూక్ష్మకళయైన ఆదిశేషుడు, నన్ను ఆశ్రయించి ఉండే లక్ష్మీదేవి, బ్రహ్మగారు, నారద మహర్షి, శివుడు,

ప్రహ్లాదుడు, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, ఓంకారము, సత్యవాక్యము, మాయాశక్తి, గోవులు, వేదవేత్తలు, వినాశము లేని ధర్మము, ధర్మునకు చంద్రునకు కశ్యపునకు భార్యలైన దక్షుని పుత్రికలు, గంగ, సరస్వతి, అలక నంద, యమున, ఐరావతమనే దిగ్గజము, ధ్రువుడు, వసిష్ఠుడు మొదలగు ఏడ్గురు బ్రహ్మర్షులు, పవిత్రమగు కీర్తి గల నలుడు మొదలగు మహాపురుషులు కూడ నా రూపములే. మత్స్య-కూర్మ-వరాహాది అవతారములలో నేను చేసిన లీలలను స్మరించు వారలకు అనంతమగు పుణ్యము లభించును.

యే మాం స్తువంత్యనేనాంగ ప్రతిబుధ్య నిశాత్యయే ।
తేషాం ప్రాణాత్యయే చాహం దదామి విమలాం మతిమ్ ।।25

అంగ - ఓయీ!, యే - ఎవరైతే, నిశా-అత్యయే - తెల్లవారు జామున, ప్రతిబుధ్య - నిద్ర లేచి, మామ్ - నన్ను, అనేన - దీనితో, స్తువంతి - స్తుతించెదరో, తేషాం చ - వారికి కూడ, అహమ్ - నేను, ప్రాణ-అత్యయే - ప్రాణములు దేహమును విడిచి వెళ్లే సమయమునందు, విమలామ్ - స్వచ్ఛమైన, మతిమ్ - బుద్ధిని, దదామి - ఇచ్చెదను.

ఓ గజేంద్రా! ఎవరైతే తెల్లవారు జామున లేచి నీవు చేసిన ఈ స్తోత్రముతో నన్ను స్తుతించెదరో, వారికి కూడ నేను మరణసమయము నందు స్వచ్ఛమగు (అజ్ఞానమును పోగొట్టే) బుద్ధిని అనుగ్రహించెదను.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యాదిశ్య హృషీకేశః ప్రధ్మాయ జలజోత్తమమ్ ।
హర్షయన్ విబుధానీకమారురోహ ఖగాధిపమ్ ।। 26

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే
గజేంద్రోపాఖ్యానే గజేంద్రస్య పూర్వజన్మ వృత్తాంత
వర్ణనం నామ చతుర్థోఽధ్యాయః ।।

హృషీకేశః - ఇంద్రియాధిపతియగు శ్రీహరి, ఇతి - ఈ విధముగా, ఆదిశ్య - ఉపదేశించి, జలజ-ఉత్తమమ్ - ఉత్తమమగు శంఖమును,

ప్రధ్మాయ - పూరించి, విబుధ-అనీకమ్ - దేవతల సమూహమును, హర్ష యన్ - ఆనందింప జేయుచున్నవాడై, ఖగ-అధిపమ్ - పక్షిరాజగు గరుత్మంతుని, ఆరురోహ - అధిష్ఠించెను.

ఇంద్రియాధిపతియగు శ్రీహరి ఈ విధముగా ఉపదేశించి, ఉత్తమ మగు శంఖమును పూరించి, దేవతల సముదాయమునకు హర్షమును కలిగిస్తూ, పక్షిరాజగు గరుడునిపై ఆసీనుడయ్యేను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
గజేంద్రోపాఖ్యానములో గజేంద్రుని పూర్వజన్మ వృత్తాంతమును
వర్ణించే నాల్గవ అధ్యాయము ముగిసినది (4) .

*****

# అథ పంచమోఽధ్యాయః

## సముద్ర మథనము - విరాట్ పురుషుని స్తుతి

శ్రీశుక ఉవాచ ।
రాజన్నుదితమేతత్తే హరేః కర్మాఘనాశనమ్ ।
గజేంద్రమోక్షణం పుణ్యం రైవతం త్వంతరం శృణు ।। 1

రాజన్ - ఓ మహారాజా!, అఘనాశనమ్ - పాపములను పోగొట్టునది, గజేంద్రమోక్షణమ్ - గజేంద్రుని విముక్తి అనే, పుణ్యమ్ - పవిత్రమైన, హరేః - శ్రీహరియొక్క, ఏతత్ - ఈ, కర్మ - లీల, తే - నీ కొరకు, ఉదితమ్ - చెప్పబడినది, రైవతం అంతరం తు - రైవత మన్వంతరమును గురించియైతే, శృణు - వినుము.

ఓ మహారాజా! గజేంద్రుని విముక్తి అనే ఈ శ్రీహరియొక్క పవిత్రమగు లీల పాపములను పోగొట్టును. దీనిని నేను నీకు చెప్పితిని. ఇప్పుడు రైవత మన్వంతరమును గురించి వినుము.

పంచమో రైవతో నామ మనుస్తామససోదరః ।
బలివింధ్యాదయస్తస్య సుతా అర్జునపూర్వకాః ।। 2

తామససోదరః - తామసుని సోదరుడు, రైవతః నామ - రైవతుడని ప్రసిద్ధి గాంచినవాడు, పంచమః - అయిదవ, మనుః - మనువు, తస్య - వానికి, అర్జునపూర్వకాః - అర్జునుడు ముందు ఉండే, బలివింధ్య-ఆదయః - బలి వింధ్యుడు మొదలగువారలు, సుతాః - పుత్రులు.

తామసుని సోదరుడు రైవతుడని ప్రసిద్ధిగాంచినవాడు అయిదవ మనువు. ఆయనకు అర్జునుడు, బలి, వింధ్యుడు, మహావీర్యుడు మొదలగు పుత్రులు గలరు. వారిలో అర్జునుడు పెద్దవాడు.

విభురింద్రస్సురగణా రాజన్ భూతరయాదయః ।
హిరణ్యరోమా వేదశిరా ఊర్ధ్వబాహ్వాదయో ద్విజాః ।। 3

రాజన్ - ఓ రాజా!, విభుః - విభువు, ఇంద్రః - ఇంద్రుడు, భూతర య-ఆదయః - భూతరయులు మొదలగువారు, సురగణాః - దేవగణము లు, హిరణ్యరోమా - హిరణ్యరోముడు, వేదశిరాః - వేదశిరసుడు, ఊర్ధ్వ బాహు-ఆదయః - ఊర్ధ్వబాహుడు మొదలగువారు, ద్విజాః - మహర్షు లు.

ఓ మహారాజా! ఆ మన్వంతరములో విభువు ఇంద్రుడు. భూతర యులు, సుమేధసులు మొదలగువారు దేవగణములు. హిరణ్యరోముడు, వేదశిరసుడు, ఊర్ధ్వబాహువు, వేదశ్రీ మొదలగువారు సప్తర్షులు.

పత్నీ వికుంఠా శుభ్రస్య వైకుంఠైస్సురసత్తమైః ।
తయోస్స్వకలయా జజ్ఞే వైకుంఠో భగవాన్ స్వయమ్ ।। 4

శుభ్రస్య - శుభ్రునియొక్క, పత్నీ - భార్య, వికుంఠా - వికుంఠ, తయోః - వారిద్దరికి, భగవాన్ - శ్రీహరి భగవానుడు, స్వయమ్ - స్వయ ముగా, స్వకలయా - తన అంశచే, వైకుంఠః - వైకుంఠుడై, వైకుంఠైః - వైకుంఠులనే, సురసత్తమైః - దేవశ్రేష్ఠులతో బాటుగా, జజ్ఞే - పుట్టెను.

ఆ సప్తర్షులలోనివాడగు శుభ్రునకు భార్య వికుంఠ. స్వయముగా శ్రీహరి భగవానుడు తన అంశచే వైకుంఠుడు అనే పేరుతో, వైకుంఠులనే దేవశ్రేష్ఠులతో బాటుగా వారిద్దరికి సంతానమై జన్మించెను.

వైకుంఠః కల్పితో యేన లోకో లోకనమస్కృతః ।
రమయా ప్రార్థ్యమానేన దేవ్యా తత్ప్రియకామ్యయా ।। 5

రమయా దేవ్యా - లక్ష్మీదేవిచే, ప్రార్థ్యమానేన - ప్రార్థించబడిన, యేన - ఏ వైకుంఠునిచే, తత్-ప్రియకామ్యయా - ఆమెకు ప్రీతిని కలిగించ వలెననే కోరికతో, లోకనమస్కృతః - ప్రాణులచే నమస్కరించబడే, వైకుంఠః లోకః - వైకుంఠ లోకము, కల్పితః - రచించబడినదో.

లక్ష్మీదేవి ప్రార్థించగా ఆమెకు ప్రీతిని కలిగించుటకై వైకుంఠుడు వైకుంఠమనే లోకమును రచించెను. సకలప్రాణులు ఆ లోకమునకు నమస్కరించెదరు.

తస్యానుభావః కథితో గుణాశ్చ పరమోదయాః ।
భౌమాన్ రేణూన్ స విమమే యో విష్ణోర్వర్ణయేద్గుణాన్ ॥ 6

తస్య - ఆ వైకుంఠునియొక్క, అనుభావః - ప్రభావము, కథితః - చెప్పబడినది, పరమ-ఉదయాః - సర్వశ్రేష్ఠమైన ఆవిర్భావము గల, గుణాః చ - గుణములు కూడ, యః - ఎవడైతే, విష్ణోః - విష్ణువుయొక్క, గుణాన్ - గుణములను, వర్ణయేత్ - వర్ణించునో, సః - అట్టివాడు, భౌమాన్ - భూమికి చెందిన, రేణూన్ - రేణువులను, విమమే - లెక్కించును.

ఆ వైకుంఠునియొక్క ప్రభావమును గురించి, సర్వశ్రేష్ఠమైన ఆవిర్భావము గల దయాళుత్వము మొదలగు గుణములను గురించి ఇదివరలో చెప్పితిని. ఎవడైతే భూమియందలి రేణువులను లెక్కించగల్గునో, అట్టివాడు మాత్రమే విష్ణువుయొక్క గుణములను వర్ణించగల్గును.

షష్ఠశ్చ చక్షుషః పుత్రశ్చాక్షుషో నామ వై మనుః ।
పూరుపూరుషసుద్యుమ్నప్రముఖాశ్చాక్షుషాత్మజాః ॥ 7

చక్షుషః - చక్షువుయొక్క, పుత్రః - పుత్రుడు, చాక్షుషః - చాక్షుషుడు అని, నామ - ప్రసిద్ధిని గాంచినవాడు, షష్ఠః చ - ఆరవ, మనుః వై - మనువు, పూరుపూరుషసుద్యుమ్నప్రముఖాః - పూరువు పూరుషుడు సుద్యుమ్నుడు మొదలగువారు, చాక్షుష-ఆత్మజాః - చాక్షుష మనువు యొక్క పుత్రులు.

చక్షువుయొక్క పుత్రుడు, చాక్షుషుడు అని ప్రసిద్ధిని గాంచినవాడు ఆరవ మనువు. పూరువు, పూరుషుడు, సుద్యుమ్నుడు మొదలగువారు చాక్షుష మనువుయొక్క పుత్రులు.

ఇంద్రో మంత్రద్రుమస్తత్ర దేవా ఆప్యాదయో గణాః ।
మునయస్తత్ర వై రాజన్ హవిష్మద్వీరకాదయః ॥ 8

రాజన్ - ఓ రాజా!, తత్ర - ఆ మన్వంతరమునందు, మంత్ర ద్రుమః - మంత్రద్రుముడు, ఇంద్రః - ఇంద్రుడు, ఆప్య-ఆదయః - ఆప్యులు మొదలగు, గణాః - గణములు, దేవాః - దేవతలు, తత్ర - ఆ మన్వంతరమునందు, హవిష్మద్-వీరక-ఆదయః వై - హవిష్మంతుడు వీర కుడు మొదలగువారు, మునయః - సప్తర్షులు.

ఓ మహారాజా! ఆ మన్వంతరమునందు ఇంద్ర పదవిలో నుండు వాడు మంత్రద్రుముడు. ఆప్యులు, పరావతులు మొదలగు గణములు దేవ తలు. హవిష్మంతుడు, వీరకుడు, భృగువు మొదలగువారు సప్తర్షులు.

తత్రాపి దేవస్సంభూత్యాం వైరాజస్యాభవత్సుతః ।
అజితో నామ భగవానంశేన జగతః పతిః ॥ 9

తత్ర అపి - ఆ మన్వంతరమునందు కూడ, దేవః - స్వయంప్ర కాశ స్వరూపుడు, జగతః - జగత్తునకు, పతిః - ప్రభువు అగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, అంశేన - అంశచే, సంభూత్యామ్ - సంభూతియం దు, వైరాజస్య - వైరాజునకు, అజితః నామ - అజితుడు అని ప్రసిద్ధి గాంచి న, సుతః - పుత్రుడై, అభవత్ - ఆయెను.

ఆ మన్వంతరమునందు కూడ స్వయంప్రకాశ స్వరూపుడు, జగ న్నాథుడు అగు శ్రీహరి భగవానుడు అంశచే వైరాజునకు సంభూతియందు పుత్రుడై జన్మించి, అజితుడు అనే పేరుతో ప్రసిద్ధి గాంచెను.

పయోధిం యేన నిర్మథ్య సురాణాం సాధితా సుధా ।
భ్రమమాణోఽంభసి ధృతః కూర్మరూపేణ మందరః ॥ 10

యేన - ఎవనిచే, పయోధిమ్ - సముద్రమును, నిర్మథ్య - మథిం చి, సుధా - అమృతము, సురాణామ్ - దేవతలకు, సాధితా - సంపాదించ బడినదో, కూర్మరూపేణ - తాబేలు రూపముగా, అంభసి - నీటియందు, భ్రమమాణః - తిరుగుచున్న, మందరః - మందర పర్వతము, ధృతః - ధరించబడినదో.

అజితుడు సముద్రమును మథించి దేవతలకు అమృతమును సంపాదించి పెట్టెను. నీటియందు తిరుగుతున్న మందర పర్వతము (కవ్వము) ను ఆయన తాబేలు రూపములో నిలబెట్టెను.

రాజోవాచ ।

యథా భగవతా బ్రహ్మన్ మథితః క్షీరసాగరః ।
యదర్థం వా యతశ్చాద్రిం దధారాంబుచరాత్మనా ॥ 11

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, భగవతా - భగవానునిచే, క్షీరసాగరః - పాల సముద్రము, యథా - ఏ విధముగా, యద్-అర్థమ్ - ఎవరి కొరకై, మథితః - మథించబడినది?, యతః - ఎందువలన, అంబుచర-ఆత్మనా - తాబేలు రూపముగా, అద్రిమ్ - పర్వతమును, దధార - ధరించెను?

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! భగవానుడు పాల సముద్రమును ఎవరి కొరకై ఏ విధముగా మథించెను? ఆయన తాబేలు రూపముగా పర్వతమును మోయుటకు కారణమేమి?

యథామృతం సురైః ప్రాప్తం కించాన్యదభవత్తతః ।
ఏతద్భగవతః కర్మ వదస్వ పరమాద్భుతమ్ ॥ 12

సురైః - దేవతలచే, అమృతమ్ - అమృతము, యథా - ఏ విధముగా, ప్రాప్తమ్ - పొందబడినది?, తతః - తరువాత, అన్యత్ చ - ఇంకొకటి కూడ, కిం - ఏమిటి, అభవత్ - ఆయెను?, భగవతః - భగవానునియొక్క, ఏతత్ - ఈ, పరమ-అద్భుతమ్ - అత్యద్భుతమగు, కర్మ - లీలను గురించి, వదస్వ - చెప్పుము.

దేవతలు అమృతమును పొందిన విధమెట్టిది? ఆ తరువాత ఇంకా ఏమి జరిగెను? భగవానుని ఈ అత్యద్భుతమగు లీలను గూర్చి చెప్పుడు.

త్వయా సంకథ్యమానేన మహిమ్నా సాత్వతాం పతేః ।
నాతితృప్యతి మే చిత్తం సుచిరం తాపతాపితమ్ ॥ 13

సాత్వతామ్ - సత్త్వగుణప్రధానులగు భక్తులకు, పతేః - ప్రభువైన శ్రీహరియొక్క, మహిమ్నా - మహిమ, త్వయా - నీచే, సంకథ్యమానేన - చక్కగా చెప్పబడుచుండగా, సుచిరమ్ - చాల కాలము, తాపతాపితమ్ - తాపముచే వేగిపోయిన, మే - నా, చిత్తమ్ - చిత్తము, న అతితృప్యతి - చాల తృప్తిని చెందుట లేదు.

సత్త్వగుణప్రధానులగు భక్తులకు ప్రభువగు శ్రీహరియొక్క మహిమను తమరు చక్కగా వర్ణించి చెప్పుచుండగా, చాల కాలమునుండి తాపముతో వేగిపోవుచున్న నా చిత్తము అధికమగు తృప్తిని చెందుట లేదు (అనగా, చాలుననిపించుట లేదు).

సూత ఉవాచ ।
సంపృష్టో భగవానేవం ద్వైపాయనసుతో ద్విజాః ।
అభినంద్య హరేర్వీర్యమభ్యాచష్టుం ప్రచక్రమే ॥ 14

ద్విజాః - ఓ మహర్షులారా!, ఏవమ్ - ఈ విధముగా, సంపృష్టః - చక్కగా ప్రశ్నించబడిన, ద్వైపాయనసుతః - ద్వీపనివాసియగు వ్యాసుని పుత్రుడగు శుక మహర్షి, అభినంద్య - అభినందించి, హరేః - శ్రీహరియొక్క, వీర్యమ్ - మహిమను గురించి, అభ్యాచష్టుమ్ - వర్ణించి చెప్పుటకు, ప్రచక్రమే - ఆరంభించెను.

సూత మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహర్షులారా! శుక మహర్షి ద్వీపనివాసియగు వ్యాసుని పుత్రుడు. ఆయనను పరీక్షిత్తు ఈ విధముగా చక్కగా ప్రశ్నించగా, ఆయన ఆ రాజును అభినందించి, శ్రీహరియొక్క మహిమను గురించి చెప్పుటకు ఉపక్రమించెను.

శ్రీశుక ఉవాచ ।
యదా యుద్ధేఽసురైర్దేవా బాధ్యమానాశ్శితాయుధైః ।
గతాసవో నిపతితా నోత్తిష్ఠేరన్ స్మ భూయశః ॥ 15

యదా - ఎప్పుడైతే, యుద్ధే - యుద్ధమునందు, దేవాః - దేవతలు, శిత-ఆయుధైః - వాడి ఆయుధములు గల, అసురైః - రాక్షసులచే,

బాధ్యమానాః - పీడించబడుచున్నవారై, భూయశః - అధికముగా, గత-అసవః - పోయిన ప్రాణములు గలవారై, న ఉత్తిష్ఠేరన్ స్మ - పైకి లేవకుండిరి.

ఒకప్పుడు యుద్ధములో వాడి ఆయుధములు గల రాక్షసులు దేవతలను పీడించిరి. ఆ దేవతలు చాల సంఖ్యలో యుద్ధభూమిలో నేలగూలి ప్రాణములను గోల్పోయి మరల లేవకుండిరి.

యదా దుర్వాససశ్శాపాత్సేంద్రా లోకాస్త్రయో నృప ।
నిశ్శ్రీకాశ్చాభవంస్తత్ర నేశురిజ్యాదయః క్రియాః ।। 16

నృప - ఓ రాజా!, యదా - ఎప్పుడైతే, దుర్వాససః - దుర్వాస మహర్షియొక్క, శాపాత్ - శాపము వలన, స-ఇంద్రాః - ఇంద్రునితో గూడిన, త్రయః - మూడు, లోకాః - లోకములు, నిః-శ్రీకాః - తొలగిన సంపదలు గలవి, అభవన్ - అయినవో, తత్ర - అప్పుడు, ఇజ్యా-ఆదయః - యజ్ఞయాగాది, క్రియాః - కర్మలు, నేశుః - నష్టమైనవి.

ఓ మహారాజా! ఒకప్పుడు దుర్వాసుని శాపముచే ఇంద్రునితో సహా ముల్లోకములు సంపదలను కోల్పోయినవి. అప్పుడు యజ్ఞయాగాది కర్మలు కూడ నష్టమైనవి.

నిశామ్యైతత్సురగణా మహేంద్రవరుణాదయః ।
నాధ్యగచ్ఛన్ స్వయం మంత్రైర్మంత్రయంతో వినిశ్చయమ్ ।।17

మహేంద్రవరుణ-ఆదయః - మహేంద్రుడు వరుణుడు మొదలుగా గల, సురగణాః - దేవగణములు, ఏతత్ - దీనిని, నిశామ్య - చూచి, స్వయమ్ - స్వయముగా, మంత్రైః - సలహా సంప్రదింపులతో, మంత్రయంతః - ఆలోచించుచున్నవారై, వినిశ్చయమ్ - నిశ్చయమును, న అధ్యగచ్ఛన్ - పొందలేదు.

ఈ పరిస్థితిని చూసి మహేంద్రుడు, వరుణుడు మొదలగు దేవతా గణములు తమలో తాము సలహా సంప్రదింపులను చేస్తూ ఆలోచించిరి. అయిననూ, వారికి ఆ పరిస్థితినుండి బయట పడే ఉపాయము తోచలేదు.

తతో బ్రహ్మసభాం జగ్ముర్మేరోర్మూర్ధని సర్వశః ।
సర్వం విజ్ఞాపయాంచక్రుః ప్రణతాః పరమేష్ఠినే ॥ 18

తతః - తరువాత, సర్వశః - అందరు, మేరోః - మేరు పర్వతము యొక్క, మూర్ధని - శిఖరమునందున్న, బ్రహ్మసభామ్ - బ్రహ్మగారి సభను గురించి, జగ్ముః - వెళ్లిరి, పరమేష్ఠినే - బ్రహ్మగారి కొరకు, ప్రణతాః - ప్రణమిల్లినవారై, సర్వమ్ - సర్వమును, విజ్ఞాపయాంచక్రుః - విన్నవించిరి.

తరువాత వారందరు మేరు పర్వత శిఖరముపైనున్న బ్రహ్మగారి సభకు వెళ్లి, ఆ పరమేష్ఠికి ప్రణమిల్లి జరిగిన వృత్తాంతమునంతనూ విన్నవించిరి.

స విలోక్యేంద్రవాయ్వాదీన్ నిస్సత్త్వాన్ విగతప్రభాన్ ।
లోకానమంగలప్రాయానసురానయథా విభుః ॥ 19

సమాహితేన మనసా సంస్మరన్ పూరుషం పరమ్ ।
ఉవాచోత్ఫుల్లవదనో దేవాన్ స భగవాన్ పరః ॥ 20

సః - ఆ, విభుః - ప్రభుడు, నిస్సత్త్వాన్ - బలహీనులైనట్టియు, విగతప్రభాన్ - తొలగిపోయిన కాంతి కలిగిన, ఇంద్రవాయు-ఆదీన్ - ఇంద్రుడు వాయువు మొదలగువారిని, అమంగలప్రాయాన్ - మంగళము కాని విషయములతో నిండియున్న, లోకాన్ - లోకములను, అయథా - దీనికి విరుద్ధముగానున్న, అసురాన్ - రాక్షసులను, విలోక్య - చూచి, సమాహితేన - ఏకాగ్రమగు, మనసా - మనస్సుతో, పరం పూరుషమ్ - పురుషోత్తముని, సంస్మరన్ - చక్కగా స్మరించుచున్నవాడు, సః - ఆ, పరః - దేవదేవుడగు, భగవాన్ - బ్రహ్మదేవుడు, ఉత్ఫుల్లవదనః - వికసించిన ముఖము గలవాడై, దేవాన్ - దేవతలనుద్దేశించి, ఉవాచ - పలికెను.

బలహీనులై కాంతిని గోల్పోయి ఉన్న ఇంద్రుడు, వాయువు మొదలగు దేవతలను సర్వసమర్థుడగు ఆ పరమేష్ఠి చూచెను. అమంగళము లగు విషయములతో నిండియున్న లోకములను, సిరిసంపదలతో వెలిగిపో

తున్న రాక్షసులను కూడ ఆయన చూచెను. అపుడాయన ఏకాగ్రమగు చిత్తముతో పురుషోత్తముని చక్కగా స్మరించగా, ముడుచుకుపోయిన ఆయన ముఖము ఆనందముతో వికసించెను. అపుడా బ్రహ్మదేవుడు దేవతలనుద్దేశించి ఇట్లు పలికెను.

అహం భవో యూయమథోఽసురాదయో
మనుష్యతిర్యగ్ద్రుమఘర్మజాతయః ।
యస్యావతారాంశకలావిసర్జితా
వ్రజామ సర్వే శరణం తమవ్యయమ్ ॥ 21

అహమ్ - నేను, భవః - రుద్రుడు, యూయమ్ - మీరు, అథో - మరియు, అసుర-ఆదయః - రాక్షసులు మొదలగువారు, మనుష్యతిర్యగ్-ద్రుమఘర్మజాతయః - మానవులు పశుపక్ష్యాదులు చెట్టుచేమలు చెమట నుండి పుట్టే పేలు మొదలగు ప్రాణులు, సర్వే - అన్నీ, యస్య - ఎవని యొక్క, అవతార-అంశకలావిసర్జితాః - అవతారమైన విరాట్పురుషుని అంశయొక్క అంశచే సృష్టించబడినవో, అవ్యయమ్ - వినాశము లేని, తమ్ - ఆ పరబ్రహ్మను, శరణమ్ - శరణును, వ్రజామ - పొందెదము.

నేను, రుద్రుడు, మీరు, రాక్షసులు, మానవులు, పశుపక్ష్యాదులు, చెట్టుచేమలు, చెమటనుండి పుట్టే పేలు మొదలగునవి ఇత్యాది సకల ప్రాణులు పరబ్రహ్మయొక్క అవతారమైన విరాట్-పురుషుని స్వల్పమైన అంశచే సృష్టించబడినారు. అవినాశియగు అట్టి పరబ్రహ్మను మనము శరణు వేడెదము.

న యస్య వధ్యో న చ రక్షణీయో నోపేక్షణీయాఽఽదరణీయపక్షః ।
అథాపి సర్గస్థితిసంయమార్థం ధత్తే రజస్సత్త్వతమాంసి కాలే ॥22

యస్య - ఏ పరమేశ్వరునకు, వధ్యః - వధించ దగినవాడు, న - లేడో, రక్షణీయః చ - రక్షించ దగినవాడు కూడ, న - లేడో, ఉపేక్షణీయ-ఆదరణీయపక్షః - ఉపేక్షించదగిన పక్షము ఆదరించ దగిన పక్షము, న - లేదో, అథాపి - అయినప్పటికీ, కాలే - కాలమునందు, సర్గస్థితిసంయమ

-అర్థమ్ - సృష్టిస్థితిలయముల కొరకు, రజః-సత్త్వతమాంసి - రజోగుణము సత్త్వగుణము తమోగుణములను, ధత్తే - స్వీకరించునో.

పరమేశ్వరునకు వధించదగినవాడు గాని, రక్షించదగినవాడు గాని, ఉపేక్షించదగిన పక్షము గాని, ఆదరించదగిన పక్షము గాని లేవు. అయిన ప్పటికీ, ఆయన ఆయా కాలములయందు సృష్టిస్థితిలయముల కొరకై క్రమముగా రజస్సత్త్వతమోగుణములను ఉపాధిగా స్వీకరించుచున్నాడు.

అయం చ తస్య స్థితిపాలనక్షణః
సత్త్వం జుషాణస్య భవాయ దేహినామ్ ।
తస్మాద్వ్రజామశ్శరణం జగద్గురుం
స్వానాం స నో ధాస్యతి శం సురప్రియః ॥ 23

దేహినామ్ - ప్రాణులయొక్క, భవాయ - కల్యాణము కొరకు, సత్త్వమ్ - సత్త్వగుణమును, జుషాణస్య - స్వీకరించిన, తస్య - ఆ ఈశ్వ రునకు, అయం చ - ఇది, స్థితిపాలనక్షణః - మర్యాదను రక్షించే కాలము, తస్మాత్ - అందువలన, జగద్-గురుమ్ - జగత్తునకు తండ్రియగు ఈశ్వరు ని, శరణమ్ - శరణును, వ్రజామః - పొందుచున్నాము, సురప్రియః - దేవ తలు ప్రియులైన (దేవతలకు ప్రియుడైన), సః - ఆయన, స్వానామ్ - తన భక్తులమైన, నః - మనకు, శమ్ - సుఖమును, ధాస్యతి - కలిగించగలడు.

ప్రాణుల కల్యాణము కొరకై సత్త్వగుణోపాధిని స్వీకరించిన ఆ ఈశ్వరునకు ఇది లోకమర్యాదలను రక్షించే కాలము. కావున, జగత్తునకు తండ్రియగు ఆ పరమేశ్వరుని మేము శరణు వేడుచున్నాము. ఆయనకు దేవతలయందు ప్రీతి మెండు. దేవతలకు ఆయన ప్రియుడు. తన భక్తుల మగు మనకు ఆయన సుఖమును కలిగించగలడు.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యాభాష్య సురాన్ వేధాస్సహ దేవైరరిందమ ।
అజితస్య పదం సాక్షాజ్జగామ తమసః పరమ్ ॥ 24

అరిందమ - శత్రువులను నియంత్రించినవాడా!, వేధాః - బ్రహ్మ గారు, సురాన్ - దేవతలనుద్దేశించి, ఇతి - ఈ విధముగా, ఆభాష్య - పలికి, దేవైః సహ - దేవతలతో గూడి, సాక్షాత్ - సాక్షాత్తుగా, తమసః - అజ్ఞానమునకు అతీతమైన, అజితస్య - అజితుని (శ్రీహరియొక్క), పదమ్ - ధామమును, జగామ్ - చేరెను.

లోపల బయట శత్రువులను నియంత్రించిన ఓ మహారాజా! బ్రహ్మగారు దేవతలతో ఇట్లు పలికి వారితో గూడి సాక్షాత్తుగా అపరాజితుడగు శ్రీహరియొక్క ధామమునకు వెళ్లెను. ఆ ధామము అజ్ఞానమునకు అతీతమైనది.

తత్రాదృష్టస్వరూపాయ శ్రుతపూర్వాయ వై విభో ।
స్తుతిమబ్రూత దైవీభిర్గీర్భిస్త్వవహితేంద్రియః ॥ 25

విభో - ఓ రాజా!, తత్ర వై - అచటనైతే, అవహిత-ఇంద్రియః - వశము చేసుకొనబడిన ఇంద్రియములు గల బ్రహ్మగారు, అదృష్టస్వరూపాయ - చూడబడని స్వరూపము గలిగినట్టియు, శ్రుతపూర్వాయ - పూర్వమునందు వినబడిన శ్రీహరి కొరకు, దైవీభిః గీర్భిః - వేదవాక్కులతో, స్తుతిమ్ - స్తోత్రమును, అబ్రూత - పలికెను.

ఓ మహారాజా! వారు శ్రీహరి గురించి ఇదివరలో వినియున్ననూ, అచటనైతే వారికి శ్రీహరియొక్క స్వరూపము కానరాలేదు. అపుడు బ్రహ్మగారు ఇంద్రియములను వశము చేసుకొని వేదవాక్కులతో శ్రీహరిని స్తుతించెను.

బ్రహ్మోవాచ ।
అవిక్రియం సత్యమనంతమాద్యం
గుహాశయం నిష్కలమప్రతర్క్యమ్ ।
మనోఽగ్రయానం వచసాఽనిరుక్తం
నమామహే దేవవరం వరేణ్యమ్ ॥ 26

అవిక్రియమ్ - వికారములు లేనట్టియు, సత్యమ్ - అఖండసచ్చి త్స్వరూపుడైనట్టియు, అనంతమ్ - కాలాతీతుడైనట్టియు, ఆద్యమ్ - జగ త్కారణుడైనట్టియు, గుహాశయమ్ - హృదయము అనే గుహయందు ప్రక టమగుచున్నట్టియు, నిష్కలమ్ - అవయవములు లేనట్టియు, అప్రత ర్క్యమ్ - సుతరాము ఊహకు అందనట్టియు, మనః-అగ్రయానమ్ - మన స్సుకంటె ముందు ఉన్నట్టియు, వచసా - వాక్కుచే, అనిరుక్తమ్ - నిర్వ చించ శక్యము కానట్టియు, వరేణ్యమ్ - సర్వోత్కృష్టుడైన, దేవవరమ్ - దేవనాయకుడగు శ్రీహరిని, నమామహే - నమస్కరించుచున్నాము.

అఖండ సచ్చిత్స్వరూపుడగు ఈశ్వరునియందు వికారములే మియు లేవు. జగత్కారణుడగు ఆయన కాలమునకు అతీతుడు. ఆయన సకలప్రాణుల హృదయగుహయందు ఆత్మరూపముగా ప్రకటమగుచున్నా డు. ఆయన నిరవయవుడు. ఆయన స్వరూపము సుతరాము ఊహకు అందేది కాదు, వాక్కుతో నిర్వచించేది కాదు. మనస్సు ఎంత వేగము గలది అయినా, ఆయన స్వరూపమును అందుకోలేదు. సర్వోత్కృష్టుడు, దేవనాయకుడు అగు ఆ శ్రీహరికి మేము నమస్కరించుచున్నాము.

విపశ్చితం ప్రాణమనోధియాత్మనా-
మర్థేంద్రియాభాసమనిద్రమవ్రణమ్ ।
ఛాయాతపౌ యత్ర న గృధ్రపక్షౌ
తమక్షరం ఖం త్రియుగం వ్రజామహే ॥ 27

ప్రాణమనః-ధియాత్మనామ్ - ప్రాణము మనస్సు బుద్ధి దేహముల కు, విపశ్చితమ్ - ద్రష్టయైనట్టియు, అర్థ-ఇంద్రియ-ఆభాసమ్ - శబ్దాది విషయములు చెవి మొదలగు ఇంద్రియముల రూపముగా ప్రకాశించుచు న్నట్టియు, అనిద్రమ్ - లుప్తమగుట లేనట్టియు, అవ్రణమ్ - వెలితి (దుఃఖము) లేనట్టియు, అక్షరమ్ - వినాశము లేనట్టియు, ఖమ్ - ఆకాశము వలె వ్యాపకుడైనట్టియు, త్రియుగమ్ - మూడు యుగములలో ఆవిర్భవిం చే, తమ్ - ఆ శ్రీహరిని, వ్రజామహే - శరణు పొందెదము, యత్ర - ఎవని యందైతే, గృధ్రపక్షౌ - భోగాసక్తిగల జీవుని పక్షములైన, ఛాయా-ఆతపౌ - అవిద్య విద్యలు, న - లేవో.

పరమేశ్వరుడు ప్రాణుల హృదయములో ప్రాణము-మనస్సు-బుద్ధి-దేహములకు సర్వావస్థలలో లుప్తము కాని ద్రష్టయై ఉన్నాడు. జగత్తులో శబ్దస్పర్శరూపరసగంధములుగను, ప్రాణులయందు చెవి-చర్మము-కన్ను-జిహ్వా-ముక్కు అనే ఇంద్రియములగను కూడ ఆయనయే భాసించుచున్నాడు. భోగవాసనలు గల జీవునియందుండే అజ్ఞానము-జ్ఞానము అనే రెండు పక్షములు ఆయనయందు ఉండవు. వినాశము లేని ఆయనయందు వెలితి, దుఃఖము లేవు. సర్వవ్యాపకుడగు ఆయన మూడు యుగములలో ఆవిర్భవించును. ఆయనను మేము శరణు వేడుచున్నాము.

అజస్య చక్రం త్వజయేర్యమాణం మనోమయం పంచదశారమాశు,
త్రిణాభి విద్యుచ్చలమష్టనేమి యదక్షమాహుస్తమృతం ప్రపద్యే।28

అజయా - అనాదియగు మాయాశక్తిచే, ఈర్యమాణమ్ - ప్రవర్తిల్ల జేయబడుచున్నది, మనః-మయమ్ - మనస్సే ప్రధానముగా కలిగినది, పంచదశ-అరమ్ - పదిహేను ఆకులు కలిగినది, ఆశు - వేగము గలది, త్రిణాభి - మూడు తూములు గలది, విద్యుత్-చలమ్ - మెరుపువలె చంచలమైనది, అష్టనేమి - ఎనిమిది కడకమ్మీలు కలది అగు, అజస్య - అనాదియగు జీవుని, చక్రం తు - చక్రమైతే, యద్-అక్షమ్ - ఏ ఈశ్వరుడు ఇరుసుగా గలదియని, ఆహుః - చెప్పెదరో, తమ్ - అట్టి, ఋతమ్ - సత్యస్వరూపుని, ప్రపద్యే - శరణు వేడెదను.

అనాదియగు ఈ జీవుని సంసారచక్రమును అనాదియగు మాయాశక్తి వేగముగా త్రిప్పుచున్నది. మనస్సే ప్రధానముగా గల ఈ చక్రమునకు పదిహేను ఆకులు (కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, పంచ ప్రాణములు), మూడు తూములు (సత్త్వరజస్తమోగుణములు), ఎనిమిది కడకమ్మీలు (పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము) గలవు. మెరుపు వలె చంచలమైన ఈ చక్రమునకు ఇరుసు ఆ ఈశ్వరుడేనని మహాత్ములు చెప్పెదరు. ఆ ఈశ్వరుని మేము శరణు వేడుచున్నాము.

య ఏకవర్ణం తమసః పరం తదలోకమవ్యక్తమనంతపారమ్ ।
ఆసాంచకారోపసుపర్ణమేనముపాసతే యోగరథేన ధీరాః ।।29

**తత్** - ఆ పరబ్రహ్మ, ఏకవర్ణమ్ - ఏకరసమగు జ్ఞానమే స్వరూపముగా కలది, తమసః - ప్రకృతికి, పరమ్ - అతీతము, అలోకమ్ - కంటికి కనబడనిది, అవ్యక్తమ్ - మనస్సునకు గోచరము కానిది, అనంతపారమ్ - కాలముచే గాని దేశముచే పరిచ్ఛిన్నము కానిది, యః - ఎవడైతే, ఉపసుపర్ణమ్ - అందమైన పక్షివంటి జీవుని సమీపమునందు, ఆసాంచకార - స్థిరముగా నున్నాడో, ఏనమ్ - ఈ ఈశ్వరుని, ధీరాః - వివేకులు, యోగరథేన - భక్తియోగము అనే పొందే సాధనముతో, ఉపాసతే - ఉపాసించుచున్నారు.

ఏకరసమగు జ్ఞానమే స్వరూపముగా గల పరబ్రహ్మ ప్రకృతికి అతీతము. అది ఇంద్రియములకు గాని, మనస్సునకు కాని గోచరము కాదు. దేశకాలపరిచ్ఛేదములు లేని ఆ పరబ్రహ్మ అందమైన పక్షివంటి జీవుని ప్రక్కనే (హృదయములో) స్థిరముగా (అంతర్యామియై) ఉన్నాడు. ఆయనను పొందే సాధనము భక్తియోగము. వివేకులు దానితో ఆయనను ఉపాసించెదరు.

న యస్య కశ్చాతితితర్తి మాయాం
  యయా జనో ముహ్యతి వేద నార్థమ్ ।
తం నిర్జితాత్మాత్మగుణం పరేశం
  నమామ భూతేషు సమం చరంతమ్ ॥ 30

యస్య - ఎవనియొక్క, మాయామ్ - మాయను, కశ్చ - ఎవడైననూ, న **అతితితర్తి** - తరించుట లేదో, యయా - దేనిచే, జనః - మానవుడు, ముహ్యతి - మోహమును పొందుచున్నాడో, అర్థమ్ - తన స్వరూపమును, న వేద - తెలియడో, నిర్జిత-ఆత్మాత్మగుణమ్ - జయించబడిన మాయాశక్తి దాని గుణములు కలిగినట్టియు, భూతేషు - ప్రాణులయందు, సమమ్ - సమానముగా, చరంతమ్ - సంచరించే, తమ్ - ఆ, పర-ఈశమ్ - పరమేశ్వరుని, నమామ - నమస్కరించుచున్నాము.

ఈశ్వరుని మాయను ఎవడైననూ తరించలేడు (ఆయన అనుగ్రహముతోనే మాయను తరించుట సంభవము). దానిచే వ్యామోహమును

పొందియున్న జీవుడు తన స్వరూపమును తెలియలేకున్నాడు. మాయాశక్తిని, దాని సత్త్వరజస్తమోగుణములను వశము చేసుకొనియున్న ఆ పరమేశ్వరుని మేము నమస్కరించుచున్నాము. ఆయన సకలప్రాణులలో సమానముగా ప్రాణరూపుడై సంచరించుచున్నాడు.

ఇమే వయం యత్ప్రియయైవ తన్వా
సత్త్వేన సృష్టా బహిరంతరావిః ।
గతిం న సూక్ష్మామృషయశ్చ విద్మహే
కుతోఽసురాద్యా ఇతరప్రధానాః ॥ 31

ఇమే - ఈ, వయమ్ - మేము, ఋషయః చ - మహర్షులు కూడ, యత్-ప్రియయా - ఏ ఈశ్వరునకు ప్రియమైన, తన్వా - శరీరమైన, సత్త్వేన ఏవ - సత్త్వగుణముతోనే, సృష్టాః - సృష్టించబడినవారమో, బహిః - బయట, అంతః - లోపల, ఆవిః - ప్రకాశించుచున్నట్టియు, సూక్ష్మామ్ - సూక్ష్మమైన, గతిమ్ - స్వరూపమును, న విద్మహే - తెలియకున్నామో, ఇతరప్రధానాః - రజస్తమోగుణములు ప్రధానముగా గల, అసుర-ఆద్యాః - అసురులు మొదలైనవారు, కుతః - ఎట్లు?

ఈ దేవతలమగు మేము, మహర్షులు కూడ నీకు ప్రియమగు శరీరమైన సత్త్వగుణము మాత్రమే ప్రధానముగా ఉండునట్లు సృష్టించబడినాము. అయిననూ, బయట ఉనికి రూపముగాను, లోపల తెలివి రూపముగాను ప్రకటమైయున్న ఈశ్వరుని సూక్ష్మతత్త్వమును తెలియలేకున్నాము. రజస్తమోగుణములు ప్రధానముగా గల అసురులు మొదలగువారు తెలియజాలరని వేరుగా చెప్పవలయునా?

పాదౌ మహీయం స్వకృతైవ యస్య
చతుర్విధో యత్ర హి భూతసర్గః ।
స వై మహాపూరుష ఆత్మతంత్రః
ప్రసీదతాం బ్రహ్మ మహావిభూతిః ॥ 32

యస్య - ఏ ఈశ్వరునకు, ఇయమ్ - ఈ, స్వకృతా ఏవ - తనచే మాత్రమే సృష్టించబడిన, మహీ - భూమి, పాదౌ - రెండు పాదములో, యత్ర హి - దేనియందైతే, చతుర్విధః - నాలుగు రకముల, భూతసర్గః - ప్రాణుల సృష్టి గలదో, ఆత్మతంత్రః - స్వతంత్రుడు, బ్రహ్మ - దేశకాల పరిచ్ఛేదములు లేనివాడు, మహావిభూతిః - సర్వోత్తమమైన ఈశ్వరభావము గల, సః - ఆ, మహాపూరుషః వై - పురుషోత్తముడైతే, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!

నాలుగు విధముల ప్రాణుల (తల్లి గర్భమునుండి పుట్టేవి, గ్రుడ్డు నుండి పుట్టేవి, కాలుష్యమునుండి పుట్టే పేలు మొదలగునవి, నేలను చీల్చి పుట్టే చెట్టుచేమలు) సృష్టితో విలసిల్లే ఈ భూమి ఈశ్వరునిచేతనే సృష్టించబడి (విరాడ్రూపుడగు) ఈశ్వరునకు పాదములై యున్నది. స్వతంత్రుడైన ఆ పురుషోత్తముని ఈశ్వరభావము సర్వోత్తమమైనది. దేశకాల పరిచ్ఛేదములు లేని ఆ ఈశ్వరుడు ప్రసన్నుడగు గాక!

**అంభస్తు యద్రేత ఉదారవీర్యం సిధ్యంతి జీవంత్యుత వర్ధమానాః,**
**లోకాస్త్రయోఽథాఖిలలోకపాలాః ప్రసీదతాం బ్రహ్మ మహావిభూతిః.**

ఉదారవీర్యమ్ - గొప్ప శక్తి గల, అంభః తు - నీరైతే, యద్-రేతః - ఏ ఈశ్వరుని రేతస్సో, త్రయః - మూడు, లోకాః - లోకములు, అథ - మరియు, అఖిలలోకపాలాః - సకలలోకపాలకులు, సిధ్యంతి - పుట్టుచున్నారో, జీవంతి - జీవించుచున్నవో, ఉత - మరియు, వర్ధమానాః - వర్ధిల్లుచున్నవో, మహావిభూతిః - పరమైశ్వర్యము గల, బ్రహ్మ - పరబ్రహ్మ, ప్రసీదతామ్ - ప్రసన్నమగు గాక!

గొప్ప శక్తి గల నీరు కారణముగానే ముల్లోకములలోని ప్రాణులు మాత్రమే గాక, సకలలోకపాలకులు కూడ పుట్టి జీవిస్తూ వర్ధిల్లుచున్నారు. పరమైశ్వర్యసంపన్నుడైన విరాడ్రూపుడగు పరబ్రహ్మయొక్క రేతస్సే నీరు. ఆ పరబ్రహ్మ మాపై ప్రసన్నమగు గాక!

**సోమం మనో యస్య సమామనంతి**
**దివౌకసాం వై బలమంధ ఆయుః ।**

ఈశో నగానాం ప్రజనః ప్రజానాం
ప్రసీదతాం నస్స మహావిభూతిః ॥ 34

దివౌకసామ్ - స్వర్గనివాసులగు దేవతలకు, బలమ్ - బలము, అంధః - అన్నము, ఆయుః వై - ఆయుర్దాయము కూడ అయిన, సోమమ్ - చంద్రుని, యస్య - ఏ ఈశ్వరుని, మనః - మనస్సునుగా, సమామనంతి - చెప్పుచున్నారో, నగానామ్ - వృక్షములకు, ఈశః - ప్రభువో, ప్రజానామ్ - ప్రాణులకు, ప్రజనః - ఉత్పాదకమో, మహావిభూతిః - పరమైశ్వర్యసంపన్నుడగు, సః - ఆ విరాట్ పురుషుడు, నః - మా కొరకు, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!

స్వర్గనివాసులగు దేవతలకు బలము, ఆహారము, ఆయుర్దాయము చంద్రుడే. చంద్రుడే చెట్టుచేమలకు ప్రభువై ప్రాణుల ఉత్పత్తిని ఘటిల్ల జేయుచున్నాడు. అట్టి చంద్రుడు సర్వైశ్వర్య సంపన్నుడగు విరాట్ పురుషునకు మనస్సని మహర్షులు చెప్పుచున్నారు. ఆ ఈశ్వరుడు మాపై ప్రసన్నుడగు గాక!

అగ్నిర్ముఖం యస్య తు జాతవేదా
జాతః క్రియాకాండనిమిత్తజన్మా ।
అంతస్సముద్రేఽనుపచన్ స్వధాతూన్
ప్రసీదతాం నస్స మహావిభూతిః ॥ 35

యస్య తు - ఏ విరాట్ పురుషునకైతే, జాతవేదాః - సర్వజ్ఞుడు, క్రియాకాండనిమిత్తజన్మా - కర్మకాండ నిమిత్తముగా ఆవిర్భావము కలిగినది, సముద్రే - సముద్రము (ఉదరము) నందు, అంతః - లోపల, స్వధాతూన్ - తాను పాకము చేసే జలములను (అన్నము మొదలగువాటిని), అనుపచన్ - పరిణమింప జేయుచున్నవాడు అగు, అగ్నిః - అగ్ని, ముఖమ్ - నోరుగా, జాతః - అయినాడో, మహావిభూతిః - సర్వోత్కృష్టమగు ఈశ్వరభావము గల, సః - ఆ విరాట్ పురుషుడు, నః - మా కొరకు, ప్రసీదతు - ప్రసన్నుడగు గాక!

వేదోక్తమైన కర్మలు నిమిత్తముగా ఆవిర్భవించిన అగ్నిదేవుడు సర్వజ్ఞుడు. ఆయన సముద్రము మధ్యలో బడబాగ్ని రూపములోనుండి నీటిని పరిణమింప జేయుచుండును. ఆయనయే ప్రాణుల ఉదరములో వలనుండి అన్నము మొదలగు ఆహారపదార్థములను పక్వము చేయును. ఆయనయే ఆ విరాట్ పురుషుని నోరు. సర్వోత్కృష్టమగు ఈశ్వరభావము గల ఆ విరాట్ పురుషుడు నాపై ప్రసన్నుడగు గాక!

యచ్చక్షురాసీత్తరణిర్దేవయానం
త్రయీమయో బ్రహ్మణ ఏష ధిష్ణ్యమ్ ।
ద్వారం చ ముక్తేరమృతం చ మృత్యుః
ప్రసీదతాం నస్స మహావిభూతిః ॥ 36

దేవయానమ్ - దేవయానమార్గమునకు అధిదేవత, త్రయీమయః - వేదస్వరూపుడు, బ్రహ్మణః - పరబ్రహ్మకు, ధిష్ణ్యమ్ - ఉపాసన స్థానము, ముక్తేః - మోక్షమునకు, ద్వారం చ - ద్వారము, అమృతమ్ - అమృతస్వరూపుడు, మృత్యుః - కాలరూపముగా మృత్యుస్వరూపుడు అగు, ఏషః - ఈ, తరణిః - సూర్యుడు, యత్-చక్షుః - ఏ విరాట్ పురుషుని కన్నయో, మహావిభూతిః - సర్వోత్కృష్టమగు ఐశ్వర్యము గల, సః - ఆయన, నః - మా కొరకు, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!

వేదస్వరూపుడైన సూర్యుడు ఉత్తరాయణ పుణ్యమార్గమునకు అధిష్ఠాన దేవత. ఆయన బింబమునందు పరబ్రహ్మను ఉపాసించువారలకు ఆయన ముక్తిస్వరూపుడై అనుగ్రహించును. కాలరూపుడై ఆయనయే సకల ప్రాణులను అంతము చేయును. అట్టి ఈ సూర్యుడు విరాట్ పురుషునకు కన్ను. మహావిభూతియగు ఆ విరాట్ పురుషుడు మాపై ప్రసన్నుడగును గాక!

ప్రాణాదభూద్యస్య చరాచరాణాం
ప్రాణస్సహో బలమోజశ్చ వాయుః ।
అన్వాస్మ సమ్రాజమివానుగా వయం
ప్రసీదతాం నస్స మహావిభూతిః ॥ 37

చర-అచరాణామ్ - కదిలే కదలని ప్రాణులకు, ప్రాణః - ప్రాణము, సహః - మనోబలము, బలమ్ - దేహశక్తి, ఓజః చ - ఇంద్రియపాటవము అగు, వాయుః - వాయువు, యస్య - ఏ విరాట్ పురుషునియొక్క, ప్రాణాత్ - ప్రాణశక్తినుండి, అభూత్ - ఆవిర్భవించెనో, వయమ్ - మనము, సమ్రాజమ్ - చక్రవర్తిని, అనుగాః ఇవ - అనుచరులు వలె, అన్వాస్మ - అనుసరించి యున్నామో, మహావిభూతిః - పరబ్రహ్మయొక్క సర్వోత్కృష్ట మైన విభూతియగు, సః - ఆ విరాట్ పురుషుడు, నః - మా కొరకు, ప్రసీద తామ్ - ప్రసన్నుడగు గాక!

కదిలే మరియు కదలని ప్రాణులలోని ప్రాణము, మనోబలము, దేహబలము, ఇంద్రియముల పాటవము కూడ వాయుదేవుని వలననే సంపన్నమగుచున్నవి. మనము కూడ, చక్రవర్తిని అనుచరులు వలె, ఆ వాయుదేవుని అనుసరించియే నిలిచియున్నాము. అట్టి వాయువు ఆ విరాట్ పురుషుని ప్రాణశక్తినుండి ఆవిర్భవించెను. పరబ్రహ్మయొక్క సర్వోత్కృ ష్టమగు విభూతియైన ఆ విరాట్ పురుషుడు మాపై ప్రసన్నుడగు గాక!

శ్రోత్రాద్దిశో యస్య హృదశ్చ ఖాని ప్రజజ్ఞిరే ఖం పురుషస్య నాభ్యాః
ప్రాణేంద్రియాత్మాసుశరీరకేతం ప్రసీదతాం నస్స మహావిభూతిః ।।

యస్య - ఏ, పురుషస్య - విరాట్ పురుషునియొక్క, శ్రోత్రాత్ - చెవినుండి, దిశః - దిక్కులు, హృదః చ - హృదయమునుండి, ఖాని - ఇంద్రియములు, నాభ్యాః - నాభినుండి, ప్రాణ-ఇంద్రియ-ఆత్మ-అసుశరీర కేతమ్ - కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములు అంతఃకరణము పంచప్రా ణములు దేహములకు ఆశ్రయమైన, ఖమ్ - ఆకాశము, ప్రజజ్ఞిరే - ప్రకట మైనవో, మహావిభూతిః - పరమైశ్వర్యశాలియగు, సః - ఆ విరాట్ పురుష డు, నః - మా కొరకు, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!

విరాట్ పురుషుని చెవినుండి దిక్కులు, హృదయమునుండి ఇంద్రి యములు, నాభినుండి ఆకాశము ప్రకటమయ్యెను. కర్మ-జ్ఞానేంద్రియము లు, అంతఃకరణము, పంచప్రాణములు, దేహములకు ఆశ్రయము ఆకా శమే. పరమైశ్వర్యశాలి ఆ విరాట్ పురుషుడు మాపై ప్రసన్నుడగు గాక!

బలాన్మహేంద్రస్త్రిదశాః ప్రసాదాత్
మన్యోర్గిరీశో ధిషణాద్విరించః ।
ఖేభ్యశ్చ ఛందాంస్యృషయో మేఢ్రతః కః
ప్రసీదతాం నస్స మహావిభూతిః ।। 39

బలాత్ - బలమునుండి, మహేంద్రః - మహేంద్రుడు, ప్రసాదాత్ - ప్రసన్నతనుండి, త్రిదశాః - దేవతలు, మన్యోః - కోపమునుండి, గిరీశః - రుద్రుడు, ధిషణాత్ - బుద్ధినుండి, విరించః - బ్రహ్మగారు, ఖేభ్యః - ఇంద్రియములనుండి, ఛందాంసి - వేదములు, ఋషయః చ - మహర్షులు కూడ, మేఢ్రతః - జననేంద్రియమునుండి, కః - ప్రజాపతి, మహావిభూతిః - గొప్ప విభూతి గల, సః - ఆ విరాట్ పురుషుడు, నః - మా కొరకు, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!

ఆయన బలమునుండి ఇంద్రుడు, ప్రసన్నతనుండి దేవతలు, కోపమునుండి రుద్రుడు, బుద్ధినుండి బ్రహ్మగారు, ఇంద్రియములనుండి వేదములు మరియు మహర్షులు, జననేంద్రియమునుండి ప్రజాపతి ప్రకటమైనారు. గొప్ప విభూతులకు నిధానమగు ఆ విరాట్ పురుషుడు మాపై ప్రసన్నుడగును గాక!

శ్రీర్వక్షసః పితరశ్ఛాయయాఽఽసన్
ధర్మః స్తనాదితరః పృష్ఠతోఽభూత్ ।
ద్యౌర్యస్య శీర్ష్ణోఽప్సరసో విహారాత్
ప్రసీదతాం నస్స మహావిభూతిః ।। 40

యస్య - ఏ విరాట్ పురుషునియొక్క, వక్షసః - వక్షఃస్థలమునుండి, శ్రీః - మహాలక్ష్మి, ఛాయయా - నీడచే, పితరః - పితృదేవతలు, విహారాత్ - విహారమునుండి, అప్సరసః - అప్సరసలు, ఆసన్ - ప్రకటమైనారో, స్తనాత్ - స్తనమునుండి, ధర్మః - ధర్మము, పృష్ఠతః - వెనుక భాగమునుండి, ఇతరః - అధర్మము, శీర్ష్ణః - శిరస్సునుండి, ద్యౌః - ద్యులోకము, అభూత్ - కలిగెనో, మహావిభూతిః - మహావిభూతియగు, సః - ఆ విరాట్ పురుషుడు, నః - మా కొరకు, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!

విరాట్ పురుషునియొక్క వక్షఃస్థలమునుండి మహాలక్ష్మి, నీడ నుండి పితృదేవతలు, స్తనమునుండి ధర్మము, వెనుక భాగమునుండి అధర్మము, శిరస్సునుండి ద్యులోకము, విహారమునుండి అప్సరసలు ప్రకటమైరి. మహావిభూతియగు ఆ విరాట్ పురుషుడు మాపై ప్రసన్నమగు గాక!

విప్రో ముఖం బ్రహ్మ చ యస్య గుహ్యం
రాజన్య ఆసీద్భుజయోర్బలం చ ।
ఊర్వోర్విడోజోఽంఘ్రిరవేదశూద్రౌ
ప్రసీదతాం నస్స మహావిభూతిః ।। 41

యస్య - ఏ విరాట్ పురుషునకు, ముఖమ్ - నోరు, విప్రః - వేదవేత్తయగు బ్రాహ్మణుడు, చ - మరియు, గుహ్యమ్ - రహస్యమైన, బ్రహ్మ - వేదమో, భుజయోః - రెండు చేతులనుండి, రాజన్యః - క్షత్రియుడు, బలం చ - బలము కూడ, ఆసీత్ - ప్రకటమయ్యెనో, ఊర్వోః - రెండు తొడలనుండి, విట్ - వైశ్యుడు, ఓజః - నైపుణ్యము, అంఘ్రిః - పాదము, అవేదశూద్రౌ - వేదభిన్నమైన ప్రవృత్తి శూద్రుడు (కలిగిరో), మహావిభూతిః - మహావిభూతియగు, సః - ఆ విరాట్ పురుషుడు, నః - మా కొరకు, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!

ఆ విరాట్ పురుషుని ముఖమునుండి వేదవేత్తయగు బ్రాహ్మణుడు మరియు రహస్యమయమగు వేదము, రెండు చేతులనుండి క్షత్రియుడు మరియు బలము, రెండు తొడలనుండి వైశ్యుడు మరియు నైపుణ్యము, పాదములనుండి వేదవిరుద్ధమగు ప్రవృత్తి మరియు శూద్రుడు ఆవిర్భవించిరి. అట్టి మహావిభూతియగు విరాట్ పురుషుడు మాపై ప్రసన్నుడగు గాక!

లోభోఽధరాత్ప్రీతిరుపర్యభూద్ద్యుతిర్నస్తః పశవ్యస్స్పర్శేన కామః,
భ్రువోర్యమః పక్ష్మభవస్తు కాలః ప్రసీదతాం నస్స మహావిభూతిః ।।

అధరాత్ - క్రింది పెదవినుండి, లోభః - లోభము, అభూత్ - కలిగెను, ఉపరి - పై పెదవి, ప్రీతిః - ప్రీతి, నస్తః - ముక్కునుండి, ద్యుతిః - కాంతి, స్పర్శేన - స్పర్శచే, పశవ్యః - పశువులకు (పశువులవంటి అజ్ఞానులకు) హితమగు, కామః - కామము, భ్రువోః - రెండు కనుబొమలనుం

డి, యమః - యముడు, కాలః తు - కాలమైతే, పక్ష్మభవః - కనురెప్పల నుండి పుట్టినది, మహావిభూతిః - మహావిభూతియగు, సః - ఆ విరాట్ పురుషుడు, నః - మా కొరకు, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!

ఆ విరాట్ పురుషుని క్రింది పెదవినుండి లోభము, పై పెదవి నుండి ప్రీతి, ముక్కునుండి కాంతి, స్పర్శనుండి పశువులకు మరియు పశువులవంటి అజ్ఞానులకు హితమైన కామము, కనుబొమలనుండి యముడు, కనురెప్పలనుండి కాలము ప్రకటమైనవి. మహావిభూతియగు ఆ విరాట్ పురుషుడు మాపై ప్రసన్నుడగు గాక!

ద్రవ్యం వయః కర్మ గుణాన్ విశేషం
యద్యోగమాయావిహితాన్ వదంతి ।
యద్దుర్విభావ్యం ప్రబుధాపబాధం
ప్రసీదతాం నస్స మహావిభూతిః ॥ 43

ద్రవ్యమ్ - పదార్థమును, వయః - కాలమును, కర్మ - జీవుల కర్మఫలమును, గుణాన్ - సత్త్వరజస్తమోగుణములను, విశేషమ్ - విశేష పదార్థమును, యత్ - ఏదైతే, దుర్విభావ్యమ్ - ఇదమిత్థముగా తెలియ శక్యము కానిదో, ప్రబుధ-అపబాధమ్ - వివేకము గలవారిచే నిషేధించ దగినదో, యద్-యోగమాయావిహితాన్ - ఎవని యోగమాయచే రచించ బడినవాటినిగా, వదంతి - చెప్పెదరో, మహావిభూతిః - మహావిభూతియగు, సః - ఆ విరాట్ పురుషుడు, నః - మా కొరకు, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!

పంచభూతములు, కాలము, జీవుల కర్మఫలము, సత్త్వరజస్తమోగుణములు, వివిధపదార్థముల మధ్యనుండే తేడాను నిర్ధారించే విశేషములు అనునవి ఇదమిత్థముగా నిర్వచించ శక్యము కానివి. వీటికి ఉపాదానము ఆ విరాట్ పురుషుని మాయాశక్తియే. వివేకులు ఈ సర్వమును నామ రూపములుగా గుర్తించి వాటి అధిష్ఠానమగు పరమాత్మయే సత్యమనే జ్ఞానముతో ఈ నానాత్వమును జ్ఞానముచే నిషేధించెదరు. అట్టి మహావిభూతియగు ఆ విరాట్ పురుషుడు మాపై ప్రసన్నుడగు గాక!

నమోఽస్తు తస్మా ఉపశాంతశక్తయే
స్వారాజ్యలాభప్రతిపూరితాత్మనే ।
గుణేషు మాయారచితేషు వృత్తిభిః
న సజ్జమానాయ నభస్వదూతయే ॥ 44

ఉపశాంతశక్తయే - నివృత్తములైన సత్త్వరజస్తమోగుణములు అనే శక్తులు కలిగినట్టియు, స్వారాజ్యలాభప్రతిపూరిత-ఆత్మనే - పరమానంద ముయొక్క లాభముచే పరిపూర్ణమైన స్వరూపము కలిగినట్టియు, మాయా రచితేషు - మాయాశక్తిచే విరచితములైన, గుణేషు - గుణములయందు, న సజ్జమానాయ - ఆసక్తి లేనట్టియు, నభస్వద్-ఊతయే - వాయువు యొక్క లీలలు వంటి లీలలు గల, తస్మై - ఆ భగవానుని కొరకు, నమః - నమస్కారము, అస్తు - అగుగాక!

పరమేశ్వరునియందు సత్త్వరజస్తమోగుణముల రూపములో నుండే ప్రకృతి శక్తులు విలీనమై యుండును. మాయాశక్తిచే రచితములైన గుణకార్యములయందు ఈశ్వరునకు ఆసక్తి (నేను-నాది అనే అభిమా నము) లేదు. వాయువు అంతటా సంచరించినా, దేనితోనైననూ సంగము వాయువునకు ఉండదు. అదే విధముగా, ఈశ్వరుడు జగత్తుతో సంగము లేకుండగనే లీలలను వెలయించును. ఆయన పూర్ణ-ఆనందఘనమగు తన స్వరూపమునందు నిష్ఠ కలిగి యుండును. ఆ ఈశ్వరుని కొరకు నమస్కార మగు గాక!

స త్వం నో దర్శయాత్మానమస్మత్కరణగోచరమ్ ।
ప్రపన్నానాం దిదృక్షూణాం సస్మితం తే ముఖాంబుజమ్ ॥45

సః - అట్టి, త్వమ్ - నీవు, తే - నీయొక్క, సస్మితమ్ - చిరున వ్వుతో కూడిన, ముఖ-అంబుజమ్ - పద్మమువంటి ముఖమును, దిదృక్షూ ణామ్ - చూడగోరే, నః - మాకు, అస్మత్-కరణగోచరమ్ - మా ఇంద్రియ ములకు గోచరమయ్యే విధముగా, ఆత్మానమ్ - నిన్ను, దర్శయ - చూపించుము.

చిరునవ్వుతో గూడిన నీ పద్మమువంటి ముఖమును మేము చూడ గోరుచున్నాము. కావున, అట్టి నీవు నీ రూపము మా ఇంద్రియములకు గోచరమయ్యే విధముగా దర్శనమిమ్ము.

తైస్తైస్స్వేచ్ఛాధృతై రూపైః కాలే కాలే స్వయం విభో ।
కర్మ దుర్విషహం యన్నో భగవాంస్తత్కరోతి హి ॥ 46

విభో - ఓ ప్రభూ!, కాలే కాలే - ఆయా కాలములయందు, స్వ-ఇచ్ఛాధృతైః - తన సంకల్పముచే (తనవారగు భక్తుల కోరికచే) దాల్చబడిన, తైః తైః - ఆయా, రూపైః - రూపములచే, నః - మాకు, దుర్విషహమ్ - శక్యము కాని, కర్మ - కర్మ, యత్ - ఏది గలదో దానిని, భగవాన్ - భగవానుడు, స్వయమ్ - స్వయముగా, కరోతి హి - చేయును గదా !

ఓ ప్రభూ! పూజనీయుడవగు నీవు భక్తుల కోరికపై యథేచ్ఛగా ఆయా కాలములయందు (ధర్మమునకు గ్లాని కలిగినప్పుడు) ఆయా (కృష్ణాది) రూపములను దాల్చి, మాకు శక్యము కాని (రాక్షస సంహారము మొదలైన) కర్మలను నీవే స్వయముగా చేయుచుందువు.

క్లేశభూర్యల్పసారాణి కర్మాణి విఫలాని వా ।
దేహినాం విషయార్తానాం న తథైవార్పితం త్వయి ॥ 47

విషయ-ఆర్తానామ్ - ఇంద్రియభోగములయందు తగుల్కొని పీడను పొందే, దేహినామ్ - ప్రాణులయొక్క, కర్మాణి - చేష్టలు, క్లేశభూరి -అల్పసారాణి - కష్టము అధికము అల్పమగు ఫలము గలవి, వా - లేదా, విఫలాని - నిష్ఫలములు, త్వయి - నీయందు, అర్పితమ్ - అర్పించబడిన కర్మ, తథా - అట్టిది, న - కాదు.

ఇంద్రియభోగములయందు తగుల్కొని పీడను పొందే ప్రాణులు చేసే కర్మలలో క్లేశము అధికము, ఫలము అల్పము. ఒకప్పుడు అవి పూర్తిగా నిష్ఫలములు కూడ అగును. కాని, నీకు అర్పించే కర్మలు అట్టివి కావు. అనగా, అట్టి నిత్యకర్మలలో క్లేశము తక్కువ. అవి అంతఃకరణశుద్ధి ద్వారా మోక్షహేతువులు కూడ అగును.

నావమః కర్మకల్పోఽపి విఫలాయేశ్వరార్పితః ।
కల్పతే పురుషస్యైవ స హ్యాత్మా దయితో హితః ॥ 48

అవమః - అల్పమైన, కర్మకల్పః అపి - కర్మయొక్క ఆభాసమైన నూ, ఈశ్వర-అర్పితః - ఈశ్వరునియందు అర్పించబడినదై, విఫలాయ - నిష్ఫలమగుటకు, న కల్పతే - సమర్థము కాదు, హి - ఏలయనగా, సః - ఆ ఈశ్వరుడు, పురుషస్య - వ్యక్తికి, ఆత్మా - స్వరూపము, దయితః - ప్రియమైనవాడు, హితః - హితమును చేయువాడు.

అల్పమైన కర్మాభాస (సాంగోపాంగముగా పూర్ణము కానిది) మైననూ ఈశ్వరునకు అర్పించినచో, అది నిష్ఫలము కాబోదు. ఎందుకంటే, ఆ ఈశ్వరుడు వ్యక్తికి ప్రియమైన ఆత్మ మరియు హితకారి.

యథా హి స్కంధశాఖానాం తరోర్మూలావసేచనమ్ ।
ఏవమారాధనం విష్ణోస్సర్వేషామాత్మనశ్చ హి ॥ 49

తరోః - చెట్టుయొక్క, మూల-అవసేచనమ్ - వ్రేళ్లకు నీళ్లను పోయుట, స్కంధశాఖానాం - మ్రానుకు కొమ్మలకు, యథా - ఎట్లు అగునో, ఏవమ్ - ఇదే విధముగా, విష్ణోః - విష్ణువుయొక్క, ఆరాధనమ్ - ఆరాధనము, సర్వేషామ్ - అందరియొక్క, చ - మరియు, ఆత్మనః - ఆత్మయొక్క (ఆరాధనము).

చెట్టు వ్రేళ్లకు నీళ్లను పోసినచో, దాని మ్రానునకు కొమ్మలకు కూడ పోసినట్లే యగును. అదే విధముగా, విష్ణువునారాధించినచో సర్వులను మాత్రమే గాక, స్వరూపము (ఆత్మ) ను కూడ ఆరాధించినట్లే యగును.

నమస్తుభ్యమనంతాయ దుర్వితర్క్యాత్మకర్మణే ।
నిర్గుణాయ గుణేశాయ సత్త్వస్థాయ చ సాంప్రతమ్ ॥ 50

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే సముద్రమథన వృత్తాంతే విరాట్-పురుష స్తుతిర్నామ పంచమోఽధ్యాయః ॥

అనంతాయ - అనంతుడవైనట్టియు, దుర్వితర్క్య-ఆత్మకర్మణే - ఊహకు అందని తన లీలలు గలిగినట్టియు, నిర్గుణాయ - గుణములు లేనట్టియు, గుణ-ఈశాయ - గుణకార్యమగు జగత్తునకు ప్రభుడవైనట్టియు, సాంప్రతమ్ - ఈ స్థితికాలమునందు, సత్త్వస్థాయ - సత్త్వగుణప్రధానుడవైన, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము.

ఓ దేవా! నీ లీలలు ఊహకు అందవు. గుణకార్యమగు జగత్తునకు ప్రభుడవగు. నీయందు స్వతహాగా గుణములు లేవు. అయిననూ, ఇప్పుడు ఈ స్థితికాలమునందు నీవు సత్త్వగుణము ఉపాధిగా కలిగియున్నావు. నీకు నమస్కారము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో సముద్ర మథనవృత్తాంతమునందు విరాట్ పురుషుని స్తుతిని వర్ణించే అయిదవ అధ్యాయము ముగిసినది (5) .

*****

# అథ షష్ఠోఽధ్యాయః

## సముద్ర మథనము - మందర పర్వతమును తీసుకువచ్చుట

శ్రీశుక ఉవాచ ।
ఏవం స్తుతస్సురగణైర్భగవాన్ హరిరీశ్వరః ।
తేషామావిరభూద్రాజన్ సహస్రార్కోదయద్యుతిః ।। 1

రాజన్ - ఓ మహారాజా!, సురగణైః - దేవగణములచే, ఏవమ్ - ఈ విధముగా, స్తుతః - స్తుతించబడినవాడు, ఈశ్వరః - జగన్నాథుడు అగు, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, సహస్ర-అర్క-ఉదయద్యుతిః వేయి సూర్యులు ఉదయించిన కాంతి గలవాడై, తేషామ్ - వారికి, ఆవిః-అభూత్ - ఆవిర్భవించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! దేవగణములీ విధముగా జగన్నాథుడగు శ్రీహరి భగవానుని స్తుతించగా, ఆయన వేయి సూర్యులు ఒక్కసారిగా ఉదయించినంతటి కాంతితో వారి యెదుట ఆవిర్భవించెను.

తేనైవ మహసా సర్వే దేవాః ప్రతిహతేక్షణాః ।
నాపశ్యన్ ఖం దిశః క్షోణిమాత్మానం చ కుతో విభుమ్ ।। 2

తేన - ఆ, మహసా - కాంతిచే, సర్వే - అందరు, దేవాః ఏవ - దేవతలు కూడ, ప్రతిహత-ఈక్షణాః - ధ్వస్తమైన చూపు గలవారై, ఖమ్ - ఆకాశమును, దిశః - దిక్కులను, క్షోణిమ్ - నేలను, ఆత్మానం చ - తమను కూడ, న అపశ్యన్ - చూడరైరి, విభుమ్ - శ్రీహరి విభుని, కుతః - ఎట్లు చూచెదరు?

ఆ కాంతికి కన్నులు మిరిమిట్లు గొల్పుటచే దేవతలు కూడ ఆకాశ మును, దిక్కులను, నేలను, తమను కూడ చూడలేకపోయిరి. అట్టి స్థితిలో వారు శ్రీహరి విభుని ఎట్లు చూడగల్గుదురు?

విరించో భగవాన్ దృష్ట్వా సహ శర్వేణ తాం తనుమ్ ।
స్వచ్ఛాం మరకతశ్యామాం కంజగర్భారుణేక్షణామ్ ॥ 3

తప్తహేమావదాతేన లసత్కౌశేయవాససా ।
ప్రసన్నచారుసర్వాంగీం సుముఖీం సుందరభ్రువమ్ ॥ 4

మహామణికిరీటేన కేయూరాభ్యాం చ భూషితామ్ ।
కర్ణాభరణనిర్భాతకపోలశ్రీముఖాంబుజామ్ ॥ 5

కాంచీకలాపవలయహారనూపురశోభితామ్ ।
కౌస్తుభాభరణాం లక్ష్మీం బిభ్రతీం వనమాలినీమ్ ॥ 6

సుదర్శనాదిభిస్స్వాస్త్రైర్మూర్తిమద్భిరుపాసితామ్ ।
తుష్టావ దేవప్రవరస్సశర్వః పురుషం పరమ్ ।
సర్వామరగణైస్సాకం సర్వాంగైరవనిం గతైః ॥ 7

శర్వేణ సహ - రుద్రునితో గూడి, భగవాన్ - పూజనీయుడు, దేవప్రవరః - దేవతలలో శ్రేష్ఠుడు అగు, విరించః - బ్రహ్మగారు, స్వచ్ఛామ్ - స్వచ్ఛమైనట్టియు, మరకతశ్యామామ్ - ఇంద్రనీలమాణిక్యము వలె శ్యామల వర్ణము కలిగినట్టియు, కంజగర్భ-అరుణ-ఈక్షణామ్ - పద్మము యొక్క లోపలి భాగము వలె ఎర్రని కన్నులు కలిగినట్టియు, తప్తహేమ-అవదాతేన - పుటము పెట్టిన బంగారమువలె పచ్చని, లసత్-కౌశేయవాససా - ప్రకాశించే పట్టు వస్త్రముతో, ప్రసన్నచారుసర్వ-అంగీమ్ - ప్రసన్నములు సుందరములు అగు సకలావయవములు కలిగినట్టియు, సుముఖీమ్ - అందమైన ముఖము కలిగినట్టియు, సుందరభ్రువమ్ - అందమైన కనుబొమలు కలిగినట్టియు, మహామణికిరీటేన - గొప్ప మణులు గల కిరీటముతో, కేయూరాభ్యాం చ - భుజపురులతో గూడ, భూషితామ్ - అలంకరించబడి నట్టియు, కర్ణ-ఆభరణనిర్భాతకపోలశ్రీముఖ-అంబుజామ్ - చెవుల అలం

కారములచే చక్కగా ప్రకాశించుచున్న చెక్కిళ్లతో సుందరమైన పద్మము వంటి ముఖము కలిగినట్టియు, కాంచీకలాపవలయహారనూపురశోభితామ్ - మొలనూలు అనే ఆభరణము హారము కాలియందెలతో ప్రకాశించునట్టి యు, కౌస్తుభ-అభరణామ్ - కౌస్తుభ మాణిక్యము అభరణముగా కలిగినట్టి యు, వనమాలినీమ్ - వనమాలను, బిభ్రతీమ్ - ధరించినట్టియు, మూర్తి మద్భిః - రూపు దాల్చిన, సుదర్శన-ఆదిభిః - సుదర్శన చక్రము మొదలై న, స్వ-అస్త్రైః - తన ఆయుధములచే, ఉపాసితామ్ - సేవించబడే, తామ్ - ఆ, తనుమ్ - రూపమును, దృష్ట్వా - చూచి, సశర్వః - రుద్రునితో గూడినవాడై, సర్వ-అంగైః - సకలావయవములతో, అవనిమ్ - నేలను, గతైః - పొందిన, సర్వ-అమరగణైః సాకమ్ - సకలదేవతాగణములతో గూడి, పరం పురుషమ్ - పురుషోత్తముని, తుష్టావ - స్తుతించెను.

పూజనీయుడు, దేవశ్రేష్ఠుడు అగు బ్రహ్మగారు రుద్రునితో గూడి శ్రీహరియొక్క ఆ స్వచ్ఛమగు మూర్తిని దర్శించెను. ఇంద్రనీలమాణి క్యము వలె శ్యామలవర్ణము గల శ్రీహరి పద్మముయొక్క మధ్యభాగము వలె ఎర్రనైన కన్నులను కలిగియుండెను. పుటము పెట్టిన బంగారము వలె పచ్చగా ప్రకాశించే పట్టు వస్త్రమును దాల్చియున్న ఆయనయొక్క అవ యవములు అన్నీ ప్రసన్నముగను, సుందరముగను ఉండెను. అందమైన కనుబొమలు గల ఆయన గొప్ప మణికిరీటమును దాల్చియుండెను. ఆయన భుజములకు అంగదములను అలంకరించుకొనియుండెను. కుండ లముల కాంతి పడి చక్కగా ప్రకాశించే చెక్కిళ్లతో పద్మమువంటి ఆయన ముఖము వెలిగిపోవుచుండెను. నడుమునకు మొలనూలుతో కాలికి అందె లతో ప్రకాశించే ఆయన కౌస్తుభ మాణిక్యము అనే ఆభరణమును, వనమా లను ధరించియుండెను. సుదర్శన చక్రము, కౌమోదకీ గద మొదలైన ఆయన ఆయుధములు రూపులను దాల్చి ఆయనను సేవించుచుండెను. ఆ రూపమును చూచిన బ్రహ్మగారు రుద్రునితో గూడి ఆ పురుషోత్తముని స్తుతించెను. బ్రహ్మగారి వెంటనున్న సకలదేవగణములు నేలపై సాష్టాంగ పడిరి.

బ్రహ్మోవాచ ।

అజాతజన్మస్థితిసంయమాయాగుణాయ నిర్వాణసుఖార్ణవాయ ।
అణోరణిమ్నేఽపరిగణ్యధామ్నే మహానుభావాయ నమో నమస్తే॥8

అజాతజన్మస్థితిసంయమాయ - కలుగని సృష్టిస్థితిలయములు కలిగినట్టియు, అగుణాయ - నిర్గుణుడైనట్టియు, నిర్వాణసుఖ-అర్ణవాయ - పరమానందమునకు సముద్రమైనట్టియు, అణోః - సూక్ష్మ మైనదానికంటె, అణిమ్నే - సూక్ష్మ మైనట్టియు, అపరిగణ్యధామ్నే - కొలబద్ద లేని స్వరూ పము కలిగినట్టియు, మహానుభావాయ - గొప్ప ప్రభావము గల, తే - నీ కొరకు, నమః నమః - అనేక నమస్కారములు.

ఓ దేవా! నిర్గుణుడవగు నీకు జగత్తుయొక్క సృష్టిస్థితిలయము లతో సంగము లేదు. పరమానంద మహోదధివియగు నీవు సూక్ష్మతమ మగు ఆకాశముకంటె సూక్ష్మమగు స్వరూపము గలవాడవు. నీ స్వరూప మునందు దేశకాలముల కొలతలు (సీమలు) లేవు. సర్వోత్తమమగు ప్రభా వము గల నీకు అనేక నమస్కారములు.

రూపం తవైతత్పురుషర్షభేజ్యం
శ్రేయోఽర్థిభిర్వైదికతాంత్రికేణ ।
యోగేన ధాతస్సహ నస్త్రిలోకాన్
పశ్యామ్యముష్మిన్ను హ విశ్వమూర్తౌ ॥ 9

పురుష-ఋషభ - ఓ పురుషోత్తమా!, ధాతః - సృష్టిని చేయు వాడా!, తవ - నీయొక్క, ఏతత్ - ఈ, రూపమ్ - రూపము, శ్రేయః-అ ర్థిభిః - శ్రేయస్సును కోరువారిచే, వైదికతాంత్రికేణ - వేదము మరియు తంత్రములు బోధించే, యోగేన - ఉపాయముచే, ఇజ్యమ్ - పూజించదగి నది, ఉ హ - ఆహా!, నః - మమ్ములను, త్రిలోకాన్ - ముల్లోకములను, సహ - ఏకకాలమునందు, అముష్మిన్ - ఈ, విశ్వమూర్తౌ - విశ్వరూపము నందు, పశ్యామి - చూచుచున్నాను.

ఓ పురుషోత్తమా! సృష్టిని చేయువాడవు నీవే. నీ ఈ రూపమును శ్రేయస్సును కోరు జనులు వేదములో మరియు తంత్రములలో చెప్పిన ఉపాయములతో ఆరాధించెదరు. ఆహా! ఈ నీ విశ్వరూపమునందు నేను మమ్ములను మరియు ముల్లోకములను ఏకకాలములో చూచుచున్నాను.

త్వయ్యగ్ర ఆసీత్త్వయి మధ్య ఆసీత్
త్వయ్యంత ఆసీదిదమాత్మతంత్రే ।
త్వమాదిరంతో జగతోఽస్య మధ్యం
ఘటస్య మృత్స్నేవ పరః పరస్మాత్ ॥ 10

ఇదమ్ - ఈ జగత్తు, ఆత్మతంత్రే - స్వతంత్రుడవగు, త్వయి - నీయందు, అగ్రే - సృష్టికి పూర్వము, ఆసీత్ - ఉండెను, మధ్యే - స్థితికాలమునందు, త్వయి - నీయందు, ఆసీత్ - ఉన్నది, అంతే - ప్రళయము తరువాత, త్వయి - నీయందు, ఆసీత్ - ఉండును, ఘటస్య - కుండకు, మృత్స్నా ఇవ - మట్టివలె, అస్య - ఈ, జగతః - జగత్తునకు, ఆదిః - ఆది, అంతః - అంతము, మధ్యమ్ - మధ్యము, త్వమ్ - నీవే, పరస్మాత్ - సర్వోత్కృష్టమైన ప్రకృతికంటె, పరః - అతీతుడవు.

ఈ జగత్తు సృష్టికి పూర్వము, స్థితికాలమునందు, ప్రళయము తరువాత కూడ స్వతంత్రుడవగు నీయందే గలదు. కుండకు మట్టివలె, ఈ జగత్తుయొక్క ఆది-మధ్యము-అంతములయందు నీవే గలవు. జగత్తునకు ఉపాదానమగు ప్రకృతికంటె నీవు అతీతుడవు.

త్వం మాయయాఽఽత్మాశ్రయయా స్వయేదం
నిర్మాయ విశ్వం తదనుప్రవిష్టః ।
పశ్యంతి యుక్తా మనసా మనీషిణో
గుణవ్యవాయేఽప్యగుణం విపశ్చితః ॥ 11

త్వమ్ - నీవు, స్వయా - నీదైనట్టియు, ఆత్మాశ్రయయా - నిన్ను ఆశ్రయించి ఉండే, మాయయా - మాయాశక్తిచే, ఇదమ్ - ఈ, విశ్వమ్ - జగత్తును, నిర్మాయ - నిర్మించి, అను - తరువాత, తత్ - దానిని, ప్రవిష్టః

- ప్రవేశించినాడవు, మనీషిణః - మనోనిగ్రహము గల, విపశ్చితః - వివేకులు, యుక్తాః - సావధానచిత్తులై, మనసా - మననముచే, గుణవ్యావాయే అపి - గుణముల పరిణామమునందు కూడ, అగుణమ్ - నిర్గుణుడవగు నిన్ను, పశ్యంతి - దర్శించెదరు.

నీవు నిన్ను ఆశ్రయించి ఉండే నీ మాయాశక్తిచే ఈ జగత్తును సృష్టించి, తరువాత దానియందు ప్రవేశించినావు. మనోనిగ్రహము గల వివేకులు సావధానచిత్తులై మననము చేసి, సత్త్వరజస్తమోగుణముల కార్యమే అయిననూ ఈ జగత్తునందు నిర్గుణుడవగు నిన్ను (అధిష్ఠానముగా) దర్శించెదరు.

యథాగ్నిమేధస్యమృతం చ గోషు
భువ్యన్నమంబూద్యమనే చ వృత్తిమ్ ।
యోగైర్మనుష్యా అధియంతి హి త్వాం
గుణేషు బుద్ధ్యా కవయో వదంతి ॥ 12

యథా - ఏ విధముగానైతే, ఏధసి - కట్టెయందు, అగ్నిమ్ - అగ్నిని, గోషు చ - గోవులయందు, అమృతమ్ - పాలను, భువి - భూమియందు, అన్నమ్ - ఆహారమును, అంబు - నీటిని, ఉద్యమనే చ - పురుషకారమునందు కూడ, వృత్తిమ్ - జీవికను, యోగైః - ఉపాయములచే, మనుష్యాః - మానవులు, అధియంతి - పొందెదరో అదే విధముగా, కవయః - వివేకులు, త్వామ్ - నిన్ను, గుణేషు - గుణకార్యములగు శబ్దాదులయందు, బుద్ధ్యా - బుద్ధితో (పొందెదరు), వదంతి - చెప్పుచున్నారు.

కట్టెను మథించి నిప్పును, ఆవులను పితికి అమృతమువంటి పాలను, నేలను దున్ని ధాన్యము మొదలగు ఆహారమును, నేలను త్రవ్వి నీటిని మానవులు పొందెదరు. మరియు, మానవులు తమ పురుషకారమునందు జీవికను సంపాదించెదరు. అదే విధముగా, వివేకులు సత్త్వరజస్తమోగుణకార్యములగు శబ్దాదులయందు నిన్ను సత్తాస్ఫూర్తుల రూపముగా పరిశుద్ధమగు బుద్ధితో గుర్తించెదరు; మరియు తమ అనుభవమును వర్ణించి చెప్పెదరు.

తం త్వాం వయం నాథ సముజ్జిహానం
సరోజనాభాऽతిచిరేప్సితార్థమ్ ।
దృష్ట్వా గతా నిర్వృతిమద్య సర్వే
గజా దవార్తా ఇవ గాంగమంభః ।। 13

నాథ - ఓ నాథా!, సరోజనాభ - ఓ పద్మనాభా!, అతిచిర-ఈప్సిత -అర్థమ్ - చాల కాలమునుండి కోరబడిన పురుషార్థస్వరూపుడవైనట్టియు, సముజ్జిహానమ్ - ఆవిర్భవించిన, తమ్ - అట్టి, త్వామ్ - నిన్ను, అద్య - ఈనాడు, దృష్ట్వా - చూచి, వయమ్ - మేము, సర్వే - అందరము, గాంగమ్ - గంగానదికి చెందిన, అంభః - నీటిని, దవ-ఆర్తాః - కార్చిచ్చుచే పీడించబడిన, గజాః ఇవ - ఏనుగులు వలె, నిర్వృతిమ్ - సుఖమును, గతాః - పొందితిమి.

ఓ పద్మనాభా! నీవే మాకు నాథుడవు. మేము చాలకాలమునుండి కోరే పురుషార్థము (మోక్షము) నీ స్వరూపమే. నీవు మా ముందు ఆవిర్భవించినావు. అట్టి నిన్ను చూచి ఈ నాడు మేము అందరము, కార్చిచ్చుచే పీడించబడి గంగాజలములను చేరుకున్న ఏనుగులు వలె, సుఖమును పొందినాము.

స త్వం విధత్స్వాఖిలలోకపాలా
వయం యదర్థాస్తవ పాదమూలమ్ ।
సమాగతాస్తే బహిరంతరాత్మన్
కిం వాన్యవిజ్ఞాప్యమశేషసాక్షిణః ।। 14

సః - అట్టి, త్వమ్ - నీవు, విధత్స్వ - సంపాదించి పెట్టుము, యద్-అర్థాః - దేనిని కోరువారమై, వయమ్ - మేము, అఖిలలోకపాలాః - సకలలోకపాలకులము, తవ - నీయొక్క, పాదమూలమ్ - పాదముల మూలమును, సమాగతాః - పొందినామో, బహిః-అంతః-ఆత్మన్ - బయట లోపల వ్యాపించి యున్నవాడా!, అశేషసాక్షిణః - సర్వమునకు సాక్షివగు, తే - నీకు, అన్యవిజ్ఞాప్యమ్ - ఇతరునిచే విన్నవించ దగినది, కిం వా - ఏమి ఉండును?

మేము సకలలోకపాలకులము ఏ ప్రయోజనమును గోరి నీ పాదముల ప్రోల చేరితిమో, అట్టి నీవు దానిని సంపాదించి పెట్టుము. నీవు సర్వమునకు లోపల, బయట కూడ వ్యాపించియున్నావు. నీవు సర్వమునకు సాక్షివి. అట్టి నీకు ఇతరులు విన్నవించ దగినది ఏమి ఉండును?

అహం గిరిత్రశ్చ సురాదయో యే
దక్షాదయోఽగ్నేరివ కేతవస్తే ।
కిం వా విదామేశ పృథగ్విభాతా
విధత్స్వ శం నో ద్విజదేవమంత్రమ్ ॥ 15

ఈశ - ఓ ఈశ్వరా!, అహమ్ - నేను, గిరత్రః చ - రుద్రుడు కూడ, సుర-ఆదయః - దేవతలు మొదలగువారు, యే - ఏ, దక్ష-ఆదయః - దక్షుడు మొదలగువారు గలరో వారు, అగ్నేః - అగ్నినుండి, కేతవః ఇవ - మిణుగురులు వలె, తే - నీనుండి, పృథక్ - వేరుగా, విభాతాః - భావన చేయువారము, శమ్ - సుఖమును, కిం వా - దేనిని, విదామ - తెలియుదుము?, ద్విజదేవమంత్రమ్ - వేదవేత్తలకు దేవతలకు సుఖోపాయమును, నః - మాకు, విధత్స్వ - ఉపదేశించుము (చేయుము).

ఓ ఈశ్వరా! నేను, రుద్రుడు, దేవతలు, దక్షుడు మొదలగువారు, అగ్నినుండి వెలువడిన మిణుగురులు వలె, నీ అంశలే అయిననూ, తాము నీకంటె వేరుగా ఉన్నామని భావించుచున్నారు. అట్టి మేము మాకు సుఖము కలిగే ఉపాయమును ఏమి తెలియగల్గుదుము? (తెలియలేము). కావున, వేదవేత్తలకు మరియు దేవతలకు సుఖము కలిగే ఉపాయమును మాకు ఉపదేశించి, నీవు కూడ దానిని చేయుము.

శ్రీశుక ఉవాచ ।
ఏవం విరించాదిభిరీడితస్తద్విజ్ఞాయ తేషాం హృదయం యథైవ,
జగాద జీమూతగభీరయా గిరా బద్ధాంజలీన్సంవృతసర్వకారకాన్।

విరించ-ఆదిభిః - బ్రహ్మగారు మొదలగువారిచే, ఏవమ్ - ఈ విధముగా, ఈడితః - స్తుతించబడిన శ్రీహరి, తేషామ్ - వారియొక్క, తత్ -

ఆ, హృదయమ్ - అభిప్రాయమును, యథా ఏవ - యథాతథముగానే, విజ్ఞాయ - తెలుసుకొని, బద్ధ-అంజలీన్ - కట్టబడిన దోసిళ్లు గలిగినట్టియు, సంవృతసర్వకారకాన్ - నియంత్రించబడిన అన్ని ఇంద్రియములు గల ఆ దేవతలను ఉద్దేశించి, జీమూతగభీరయా - మేఘగర్జనవలె గంభీరమైన, గిరా - వాక్కుతో, జగాద - పలికెను.

బ్రహ్మ మొదలగువారు శ్రీహరిని ఈ విధముగా స్తుతించిరి. ఆయన వారి హృదయములలోని అభిప్రాయమును యథాతథముగా తెలుసుకొనెను. వారు చేతులను జోడించి సర్వేంద్రియములను నియంత్రించి నిలిచియుండిరి. అపుడు శ్రీహరి మేఘగర్జనవలె గంభీరమైన వాక్కుతో వారితోనిట్లనెను.

ఏక ఏవేశ్వరస్తస్మిన్ సురకార్యే సురేశ్వరః ।
విహర్తుకామస్తానాహ సముద్రోన్మథనాదిభిః ॥ 17

సుర-ఈశ్వరః - దేవతలకు ప్రభువగు శ్రీహరి, ఏకః ఏవ - ఒక్కడు మాత్రమే, తస్మిన్ - ఆ, సురకార్యే - దేవతల కార్యమునందు, ఈశ్వరః - సమర్థుడు, సముద్ర-ఉన్మథన-ఆదిభిః - సముద్రమును మథించుట మొదలగువాటిచే, విహర్తుకామః - విహరించ గోరువాడై, తాన్ - వారిని ఉద్దేశించి, ఆహ - పలికెను.

దేవదేవుడగు శ్రీహరి ఒక్కడే స్వయముగా ఆ దేవకార్యమును సాధించుటకు సమర్థుడే. అయిననూ, ఆయన సముద్రమథనము మొదలగు లీలలతో విహరించగోరి, వారితో నిట్లనెను.

శ్రీభగవానువాచ ।
హంత బ్రహ్మన్నహో శంభో హే దేవా మమ భాషితమ్ ।
శృణుతావహితాస్సర్వే శ్రేయో వస్స్యాద్యథా సురాః ॥ 18

హంత - మంచిది, బ్రహ్మన్ - ఓ బ్రహ్మ!, అహో - ఓయీ!, శంభో - ఓ శంభూ!, హే దేవాః - దేవయోనులగు గంధర్వులారా!, సురాః - ఓ దేవతలారా!, సర్వే - అందరు, మమ - నాయొక్క, భాషితమ్ -

మాటను, అవహితాః - సావధానులై, శృణుత - వినుడు, యథా - ఏ విధముగానైతే, వః - మీకు, శ్రేయః - కల్యాణము, స్యాత్ - కలుగునో.

మంచిది. ఓ బ్రహ్మా! ఓ శంభూ! దేవయోనులగు గంధర్వులారా! ఓ దేవతలారా! మీరు అందరు సావధానముగా నా మాటను వినుడు. మీకు కల్యాణము కలిగే ఉపాయమును చెప్పెదను.

యాత దానవదైతేయైస్తావత్సంధిర్విధీయతామ్ ।
కాలేనానుగృహీతైస్తైర్యావద్వో భవ ఆత్మనః ॥ 19

యాత - వెళ్లుడు, తావత్ - అంతవరకు, కాలేన - కాలముచే, అనుగృహీతైః - అనుగ్రహించబడిన, తైః - ఆ, దానవదైతేయైః - దను దితి వంశీయుల రాక్షసులతో, సంధిః - సంధి, విధీయతామ్ - చేయబడుగాక!, యావత్ - ఎంతవరకైతే, వః - మీకు, ఆత్మనః - మీయొక్క, భవః - వృద్ధియో.

వెళ్లుడు. మీకు మీ వృద్ధి సిద్ధించునంతవరకు మీరు దితి దను వంశీయులగు ఆ రాక్షసులతో సంధి చేసుకొనుడు. ప్రస్తుతము వారిని కాలము అనుగ్రహించినది.

అరయోఽపి హి సంధేయాస్సతి కార్యార్థగౌరవే ।
అహిమూషకవద్దేవా హ్యర్థస్య పదవీం గతైః ॥ 20

హి - ఎందుకంటే, కార్య-అర్థగౌరవే - సాధించదగిన పనియొక్క ప్రయోజనము పెద్దదిగా, సతి - అయినప్పుడు, అరయః అపి - శత్రువులు కూడ, సంధేయాః - సంధి చేసుకొన దగినవారు, దేవాః - ఓ దేవతలారా!, అర్థస్య - ప్రయోజనముయొక్క, పదవీమ్ - సిద్ధిని, గతైః - పొందిన మీచే, హి - నిశ్చయముగా, అహిమూషికవత్ హి - పాము ఎలుకలవలె.

ఎందుకంటే, సాధించదగిన పని చాల ప్రయోజనకరమైనప్పుడు మనము శత్రువులతో కూడ సంధిని చేసుకొనవలెను. ఓ దేవతలారా! ప్రయోజనము సిద్ధించిన తరువాత నిశ్చయముగా పాము-ఎలుకలవలె చేయవచ్చును (ఒక పాము బుట్టలో బందీయై ఉండగా, లోపలికి ఎలుక

వచ్చెను. పాము దానితో స్నేహము చేసి, దానిచే బుట్టకు చిల్లు చేయించి, ఆ తరువాత ఆ ఎలుకను భక్షించి, ఆ బుట్టలోనుండి పారిపోయెను).

అమృతోత్పాదనే యత్నః క్రియతామవిలంబితమ్ ।
యస్య పాతస్య వై జంతుర్మృత్యుగ్రస్తోఽమరో భవేత్ ॥ 21

అమృత-ఉత్పాదనే - అమృతమును ఉత్పన్నము చేయుటయందు, యత్నః - ప్రయత్నము, అవిలింబితమ్ - విలంబము లేకుండా, క్రియతామ్ - చేయబడు గాక!, యస్య - ఏ అమృతము, పాతస్య - త్రాగబడగా, మృత్యుగ్రస్తః - మృత్యువుచే పట్టుకొనబడియున్న, జంతుః - ప్రాణి, వై - నిశ్చయముగా, అమరః - మృత్యువు లేనిది, భవేత్ - అగునో.

మీరు విలంబము లేకుండా అమృతమును ఉత్పన్నము చేయుటకు యత్నించుడు. మృత్యువు కోరలలో ఉన్న ప్రాణి అమృతమును త్రాగినచో మృత్యువును జయించును. ఇది నిశ్చయము.

క్షిప్త్వా క్షీరోదధౌ సర్వా వీరుత్తృణలతౌషధీః ।
మంథానం మందరం కృత్వా నేత్రం కృత్వా తు వాసుకిమ్ ॥ 22

సహాయేన మయా దేవా నిర్మంథధ్వమతంద్రితాః ।
క్లేశభాజో భవిష్యంతి దైత్యా యూయం ఫలగ్రహాః ॥ 23

దేవాః - దేవతలారా!, సర్వాః - సకలములైన, వీరుత్-తృణలతా-ఓషధీః - పొదలు గడ్డిమొక్కలు తీగలు మందుచెట్లు అనువాటిని, క్షీర-ఉదధౌ - పాల సముద్రమునందు, క్షిప్త్వా - వేసి, మందరమ్ - మందర పర్వతమును, మంథానమ్ - కవ్వమునుగా, కృత్వా - చేసి, వాసుకిం తు - వాసుకినైతే, నేత్రమ్ - త్రాడునుగా, కృత్వా - చేసి, మయా - నేను, సహాయేన - సహాయకుడను కాగా, అతంద్రితాః - సోమరిదనము లేనివారై, నిర్మంథధ్వమ్ - గట్టిగా మథించుడు, దైత్యాః - రాక్షసులు, క్లేశభాజః - కష్టములో వాటా గలవారు, భవిష్యంతి - కాగలరు, యూయమ్ - మీరు, ఫలగ్రహాః - ఫలమును తీసుకొనువారు.

ఓ దేవతలారా! సకలములైన పొదలను, గడ్డిమొక్కలను, తీగలను, మందుచెట్లను పాల సముద్రములో వేయుడు. మందర పర్వతమును కవ్వముగా చేసుకొని, వాసుకుని త్రాడుగా చేసుకొని, సోమరిదనము లేకుండా గట్టిగా మథించుడు. నేను మీకు సాహాయ్యము నందించగలను. పైగా, రాక్షసులు మీ కష్టములో పాలు పంచుకొనగలరు. కాని, ఫలమును మాత్రమే మీరే తీసుకొనగలరు.

యూయం తదనుమోదధ్వం యదిచ్ఛంత్యసురాస్సురాః ।
న సంరంభేణ సిధ్యంతి సర్వేఽర్థాస్సాంత్వయా యథా ।।24

సురాః - దేవతలారా!, అసురాః - రాక్షసులు, యత్ - దేనిని, ఇచ్ఛంతి - కోరెదరో, తత్ - దానిని, అనుమోదధ్వమ్ - అంగీకరించుడు, సర్వే - అన్ని, అర్థాః - ప్రయోజనములు, సాంత్వయా - మంచిదనముతో, యథా - ఏ విధముగా, సిధ్యంతి - సిద్ధించునో, సంరంభేణ - కోపముచే, న - అట్లు సిద్ధించవు.

ఓ దేవతలారా! రాక్షసులు ఏది కావాలంటే దానికి మీరు అంగీకరించుడు. సకలకార్యములు మంచిదనముతో సిద్ధించే విధముగా, కోపము వలన సిద్ధించవు.

న భేతవ్యం కాలకూటాద్విషాజ్జలధిసంభవాత్ ।
లోభః కార్యో న వో జాతు రోషః కామస్తు వస్తుషు ।। 25

జలధిసంభవాత్ - సముద్రమునుండి పుట్టే, కాలకూటాత్ - కాలకూట విషము వలన, న భేతవ్యమ్ - భయపడవలదు, వః - మీకు, జాతు - ఏ కాలమునందైననూ, వస్తుషు - పదార్థములయందు, లోభః - తృష్ణ, రోషః - కోపము, కామః తు - కామన కూడ, న కార్యః - చేయబడరాదు.

సముద్రమునుండి కాలకూట విషము పుట్టును. మీరు దాని వలన భయపడకుడు. సముద్రమునుండి పుట్టే పదార్థముల యెడల తృష్ణను గాని, కామనను గాని, ఆ కామన సిద్ధించనప్పుడు కోపమును గాని, మీరు ఏ కాలమునందైననూ చేయరాదు.

శ్రీశుక ఉవాచ ।
ఇతి దేవాన్ సమాదిశ్య భగవాన్ పురుషోత్తమః ।
తేషామంతర్దధే రాజన్ స్వచ్ఛందగతిరీశ్వరః ॥ 26

రాజన్ - ఓ రాజా!, స్వచ్ఛందగతిః - తన ఇచ్ఛచే ప్రవర్తించువాడు, ఈశ్వరః - జగన్నాథుడు, భగవాన్ - భగవానుడు అగు, పురుషోత్తమః - పురుషోత్తముడు, దేవాన్ - దేవతలను, ఇతి - ఈ విధముగా, సమాదిశ్య - ఆదేశించి, తేషామ్ - వారికి, అంతః-దధే - అంతర్ధానమాయెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ రాజా! స్వేచ్ఛచే ప్రవర్తిల్లే జగన్నాథుడైన పురుషోత్తమ భగవానుడు దేవతలనీ విధముగా ఆదేశించి, వారి మధ్యలో అంతర్ధానమాయెను.

అథ తస్మై భగవతే నమస్కృత్య పితామహః ।
భవశ్చ జగ్మతుస్స్వం స్వం ధామోపేయుర్బలిం సురాః॥27

అథ - తరువాత, పితామహః - బ్రహ్మగారు, భవః చ - రుద్రుడు కూడ, తస్మై - ఆ, భగవతే - భగవానుని కొరకు, నమస్కృత్య - నమస్కరించి, స్వం స్వమ్ - తమ తమ, ధామ - లోకమును గురించి, జగ్మతుః - వెళ్లిరి, సురాః - దేవతలు, బలిమ్ - బలిని, ఉపేయుః - దగ్గరకు వెళ్లిరి.

తరువాత బ్రహ్మగారు, రుద్రుడు శ్రీహరి భగవానుని కొరకు నమస్కరించి తమ లోకములకు వెళ్లిరి. దేవతలు బలి చక్రవర్తి వద్దకు వెళ్లిరి.

దృష్ట్వారీనప్యసంయత్తాన్ జాతక్షోభాన్ స్వనాయకాన్ ।
న్యషేధద్దైత్యరాట్ శ్లోక్యస్సంధివిగ్రహకాలవిత్ ॥ 28

అరీన్ అపి - శత్రువులే అయిననూ, అసంయత్తాన్ - యుద్ధమునకు ఉద్యుక్తులు కాని వారిని, దృష్ట్వా - చూచి, జాతక్షోభాన్ - పుట్టిన సంక్షోభము గల, స్వనాయకాన్ - తన సేనానాయకులను, శ్లోక్యః - కొనియాడ దగినవాడు, సంధివిగ్రహకాలవిత్ - సంధికి యుద్ధమునకు తగిన కాలముయొక్క పరిజ్ఞానము గలవాడు, దైత్యరాట్ - రాక్షసరాజు అగు బలి, న్యషేధత్ - వారించెను.

దేవతలు తమకు శత్రువులే. కాని వారు యుద్ధము చేయుటకు సంసిద్ధులై రాలేదు. రాక్షస సేనానాయకులు ఆ సంగతిని గమనించి చాల కంగారు పడిరి. సంధికి, యుద్ధమునకు తగిన కాలముయొక్క పరిజ్ఞానము గల బలి చక్రవర్తి తన వారిని వారించెను. ఆయన ప్రశంసించ దగిన వ్యక్తి.

తే వైరోచనిమాసీనం గుప్తం చాసురయూథపైః ।
శ్రియా పరమయా జుష్టం జితాశేషముపాగమన్ ॥ 29

ఆసీనమ్ - కూర్చున్నట్టియు, అసురయూథపైః - రాక్షస సేనానాయకులచే, గుప్తం చ - రక్షించబడినట్టియు, పరమయా - సర్వోత్కృష్టమైన, శ్రియా - సంపదచే, జుష్టమ్ - సేవించబడినట్టియు, జిత-అశేషమ్ - జయించబడిన సకలలోకములు గల, వైరోచనిమ్ - విరోచనుని పుత్రుడగు బలిని, తే - ఆ దేవతలు, ఉప-అగమన్ - సమీపించిరి.

విరోచనుని పుత్రుడగు బలి సకలలోకములను జయించి సర్వోత్కృష్టమగు సంపదచే సేవించబడుచుండెను. రాక్షస సేనానాయకులు రక్షించుచుండగా, ఆయన సింహాసనముపై కూర్చుండి యుండెను. దేవతలు ఆయనను సమీపించిరి.

మహేంద్రః శ్లక్ష్ణయా వాచా సాంత్వయిత్వా మహామతిః ।
అభ్యభాషత తత్సర్వం శిక్షితం పురుషోత్తమాత్ ॥ 30

మహామతిః - గొప్ప బుద్ధిశాలియగు, మహేంద్రః - మహేంద్రుడు, శ్లక్ష్ణయా - మధురమగు, వాచా - వాక్కుతో, సాంత్వయిత్వా - నచ్చజెప్పి, పురుషోత్తమాత్ - పురుషోత్తమునినుండి, శిక్షితమ్ - నేర్పించబడిన, తత్ - ఆ, సర్వమ్ - సర్వమును, అభ్యభాషత - చెప్పెను.

మహేంద్రుడు గొప్ప బుద్ధిశాలి. ఆయన మధురమగు వాక్కుతో బలికి నచ్చజెప్పుతూ, తాను పురుషోత్తముని వద్ద నేర్చిన విషయములన న్నింటినీ ఆయనకు చెప్పెను.

తదరోచత దైత్యస్య తత్రాన్యే యేఽసురాధిపాః ।
శంబరోఽరిష్టనేమిశ్చ యే చ త్రిపురవాసినః ॥ 31

దైత్యస్య - రాక్షసరాజునకు, తత్ - అది, అరోచత - నచ్చెను, తత్ర - అచట, అన్యే - ఇతరులు, యే - ఏ, అసుర-అధిపాః - రాక్షస నాయకులు గలరో వారు, శంబరః - శంబరుడు, అరిష్టనేమిః చ - అరిష్టనే మి, త్రిపురవాసినః - త్రిపురములలో నివసించువారు, యే చ - ఎవరు గలరో వారు కూడ.

ఆ ప్రతిపాదనము రాక్షసరాజగు బలికి నచ్చెను. అంతేగాక, అక్కడ ఉన్న శంబరుడు, అరిష్టనేమి మొదలగు రాక్షస నాయకులకు, త్రిపు రములలో నివసించే రాక్షసులకు కూడా అది నచ్చెను.

తతో దేవాసురాః కృత్వా సంవిదం కృతసౌహృదాః ।
ఉద్యమం పరమం చక్రురమృతార్థే పరంతప ।। 32

పరంతప - శత్రువులను తపింపజేసే ఓ మహారాజా!, తతః - తరు వాత, కృతసౌహృదాః - చేయబడిన మైత్రి గల, దేవ-అసురాః - దేవతలు రాక్షసులు, సంవిదమ్ - ఒప్పందమును, కృత్వా - కుదుర్చుకొని, అమృత -అర్థే - అమృతము అనే ప్రయోజనమునందు, పరమమ్ - గొప్ప, ఉద్య మమ్ - ఉద్యమమును, చక్రుః - చేసిరి.

శత్రువులను తపింపజేసే ఓ మహారాజా! తరువాత దేవతలు, రాక్ష సులు మైత్రిని చేసుకొని ఒప్పందమును కుదుర్చుకొనిరి. అపుడు వారు అమృతము అనే ఫలమును గోరి, గొప్ప ఉద్యమమును చేసిరి.

తతస్తే మందరగిరిమోజసోత్పాట్య దుర్మదాః ।
నదంత ఉదధిం నిన్యుశ్శక్తాః పరిఘబాహవః ।। 33

తతః - తరువాత, దుర్మదాః - చాల గర్వించి యున్నవారు, శక్తాః - సమర్థులు, పరిఘబాహవః - గుదియలవంటి బాహువులు గల, తే - వారు, నదంతః - సింహనాదమును చేయుచున్నవారై, ఓజసా - బలము తో, మందరగిరిమ్ - మందర పర్వతమును, ఉత్పాట్య - ఊడపీకి, ఉద ధిమ్ - సముద్రమును గురించి, నిన్యుః - తీసుకు వెళ్లిరి.

వారందరు చాల గర్వించి యుండిరి. వారు సమర్థులు, గుదియల వంటి బాహువులు గలవారు. అపుడు వారు సింహనాదములను చేస్తూ బలముతో మందర పర్వతమును ఊడపీకి సముద్రము వైపునకు తీసుకు వె ళ్లిరి.

దూరభారోద్వహశ్రాంతాశ్శక్రవైరోచనాదయః ।
అపారయంతస్తం వోఢుం వివశా విజహుః పథి ॥ 34

దూరభార-ఉద్వహశ్రాంతాః - దూరము బరువును పైకెత్తి మోయుటచే అలసిపోయిన, శక్రవైరోచన-ఆదయః - ఇంద్రుడు బలి మొ( లగువారు, తమ్ - దానిని, వోఢుమ్ - మోయుటకు, అపారయంతః - శ లేనివారై, వివశాః - చేతగానివారై, పథి - మార్గమునందు, విజహుః విడిచి పెట్టిరి.

ఆ పర్వతమును చాల దూరము పైకెత్తి మోయుట వలన ఇంద్ర డు, బలి మొదలగువారు అలసిపోయిరి. దానిని ముందుకు మోసు: పోయే శక్తి వారికి లేకుండెను. అపుడు వారు స్వాధీనత తప్పి ఆ పర్వ మును మార్గములో విడిచి పెట్టిరి.

నిపతన్ స గిరిస్తత్ర బహూనమరదానవాన్ ।
చూర్ణయామాస మహతా భారేణ కనకాచలః ॥ 35

తత్ర - ఆ సమయమునందు, కనక-అచలః - బంగరుది కదలన్ అగు, సః - ఆ, గిరిః - పర్వతము, నిపతన్ - క్రింద పడుచున్నదై, మహ - అధికమగు, భారేణ - బరువుతో, అమరదానవాన్ - దేవతలను రాక్షస ను, బహూన్ - అనేకులను, చూర్ణయామాస - పిండి పిండి చేసెను.

ఆ పర్వతము బంగరు పర్వతమగుటచే దాని బరువు చాల ఎక వ. కావుననే, దానిని కదల్చుట కఠినము. అది ఆ సమయములో మహా రముతో క్రింద పడినప్పుడు, దాని క్రింద పడి చాలమంది దేవతలు, ( సులు నలిగి మరణించిరి.

తాంస్తథా భగ్నమనసో భగ్నబాహూరుకంధరాన్ ।
విజ్ఞాయ భగవాంస్తత్ర బభూవ గరుడధ్వజః ।। 36

తథా - ఆ విధముగా, భగ్నమనసః - నష్టమైన ఉత్సాహము కలిగి నట్టియు, భగ్నబాహు-ఊరుకంధరాన్ - విరిగిన బాహువులు తొడలు మెడలు గల, తాన్ - వారిని గురించి, విజ్ఞాయ - తెలిసి, గరుడధ్వజః - గరుత్మంతుడు ధ్వజముపై చిహ్నముగా గల, భగవాన్ - శ్రీహరి భగవానుడు, తత్ర - అచట, బభూవ - ప్రత్యక్షమయ్యెను.

ఆ విధముగా వారి బాహువులు, తొడలు, మెడలు విరిగి వారి ఉత్సాహము వినష్టమగుట తెలిసిన శ్రీహరి భగవానుడు అచట ప్రత్యక్షమయ్యెను. ఆయన ధ్వజముపై గరుత్మంతుని చిహ్నము ఉండును.

గిరిపాతవినిష్పిష్టాన్ విలోక్యామరదానవాన్ ।
ఈక్షయా జీవయామాస నిర్జరాన్ నిర్వ్రణాన్ యథా ।। 37

గిరిపాతవినిష్పిష్టాన్ - పర్వతము పడుటచే పిండి పిండి అయిన, అమరదానవాన్ - దేవతలను రాక్షసులను, విలోక్య - చూచి, ఈక్షయా - చూపుతో, నిర్జరాన్ - దేవతలను, నిర్వ్రణాన్ యథా - గాయము ^^గలని వారిని వలె, జీవయామాస - బ్రతికించెను.

శ్రీహరి పర్వతము మీద బడి పిండి పిండి అయిన దేవతలను, రాక్షసులను చూచెను. ఆయన తన చూపుతో దేవతలను బ్రతికించెను. వారికి అప్పుడు గాయమే తగలలేదా యన్నట్లు ఉండెను.

గిరిం చారోప్య గరుడే హస్తేనైకేన లీలయా ।
ఆరుహ్య ప్రయయావబ్ధిం సురాసురగణైర్వృతః ।। 38

ఏకేన - ఒక్క, హస్తేన - చేతితో, లీలయా - అవలీలగా, గిరిం చ - పర్వతమును, గరుడే - గరుత్మంతునిపై, ఆరోప్య - ఎక్కించి, ఆరుహ్య - అధిష్ఠించి, సుర-అసురగణైః - దేవతలు రాక్షసుల గణములతో, వృతః - చుట్టువారబడినవాడై, అబ్ధిమ్ - సముద్రమును గురించి, ప్రయయౌ - వెళ్లెను.

శ్రీహరి ఆ పర్వతమును ఒక్క చేతితో అవలీలగా గరుడునిపైకి ఎక్కించి తాను కూడ గరుడుని అధిష్ఠించెను. అపుడాయన దేవతలు, రాక్షసుల గణములు చుట్టువారియుండ సముద్రమునకు పయనమయ్యెను.

అవరోప్య గిరిం స్కంధాత్సుపర్ణః పతతాం వరః ।
యయౌ జలాంత ఉత్సృజ్య హరిణా స విసర్జితః ॥ 39

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే
సముద్రమథనాయ మందరాచలానయనం
నామ షష్ఠోఽధ్యాయః ॥

పతతామ్ - పక్షులలో, వరః - శ్రేష్ఠుడగు, సః - ఆ, సుపర్ణః - గరుత్మంతుడు, స్కంధాత్ - భుజమునుండి, గిరిమ్ - పర్వతమును, అవరోప్య - క్రిందకు దించి, జల-అంతే - నీటి మధ్యలో, ఉత్సృజ్య - విడిచిపెట్టి, హరిణా - శ్రీహరిచే, విసర్జితః - వెళ్లుటకు అనుమతి నీయబడినవాడై, యయౌ - వెళ్లెను.

పక్షులలో శ్రేష్ఠుడగు ఆ గరుత్మంతుడు తన భుజమునుండి ఆ పర్వతమును క్రిందకు దించి నీటి మధ్యలో విడిచిపెట్టెను. శ్రీహరి అనుమతిని పొంది అతడు వెళ్లెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
సముద్ర మథన వృత్తాంతములో మందర పర్వతమును
తీసుకువచ్చుటను వర్ణించే ఆరవ
అధ్యాయము ముగిసినది (6)

*****

# అథ సప్తమోఽధ్యాయః

## సముద్ర మథనము - శివుడు విషమును భక్షించి జగత్తును కాపాడుట

శ్రీశుక ఉవాచ ।

తే నాగరాజమామంత్ర్య ఫలభాగేన వాసుకిమ్ ।
పరివీయ గిరౌ తస్మిన్నేత్రమబ్ధిం ముదాఽన్వితాః ।। 1

ఆరేభిరే సుసంయత్తా అమృతార్థం కురూద్వహ ।
హరిః పురస్తాజ్జగృహే పూర్వం దేవాస్తతోఽభవన్ ।। 2

కురు-ఉద్వహ - కురువంశ శ్రేష్ఠుడవగు ఓ రాజా!, తే - వారు, ఫలభాగేన - ఫలమునందు వాటాచే, నాగరాజమ్ - నాగులకు రాజగు, వాసుకిమ్ - వాసుకిని, ఆమంత్ర్య - ప్రార్థించి, తస్మిన్ - ఆ, గిరౌ - పర్వతమునందు, నేత్రమ్ - త్రాడునుగా, పరివీయ - చుట్టి, ముదా - ఆనందముతో, అన్వితాః - కూడినవారై, సుసంయత్తాః - పూర్ణ ప్రయత్నము గలవారై, అమృత-అర్థమ్ - అమృతము కొరకై, అబ్ధిమ్ - సముద్రమును (మథించుటకు), ఆరేభిరే - ఆరంభించిరి, పూర్వమ్ - ముందుగా, హరిః - అజిత భగవానుడు, పురస్తాత్ - ముఖము వైపు, జగృహే - పట్టుకొనెను, తతః - తరువాత, దేవాః - దేవతలు, అభవన్ - ఉండిరి.

కురువంశ శ్రేష్ఠుడవగు ఓ మహారాజా! వారు మథించగా వచ్చే అమృతమునందు వాటాను ఇస్తామని నాగులకు రాజగు వాసుకిని ప్రార్థించి, ఆయనను ఆ పర్వతమునకు త్రాడుగా చుట్టిరి. అపుడు వారు ఆనందముతో గూడి పూర్ణ ప్రయత్నముతో అమృతము కొరకై సముద్రమును

మథించుటకు ఆరంభించిరి. ముందుగా అజిత భగవానుడు (శ్రీహరి) వాసుకిని ముఖము వైపు పట్టుకోగా, దేవతలు ఆయన ప్రక్కన చేరిరి.

తన్నైచ్ఛన్ దైత్యపతయో మహాపురుషచేష్టితమ్ ।
న గృహ్ణీమో వయం పుచ్ఛమహేరంగమమంగలమ్ ॥ 3

దైత్యపతయః - రాక్షస నాయకులు, తత్ - ఆ, మహాపురుషచేష్టితమ్ - పురుషోత్తముని చేష్టను, న ఐచ్ఛన్ - ఇష్టపడలేదు, వయమ్ - మేము, అహేః - పాముయొక్క, అమంగలమ్ - అమంగళమైన, అంగమ్ - అవయవమగు, పుచ్ఛమ్ - తోకను, న గృహ్ణీమః - పట్టుకొనము.

రాక్షస నాయకులకు పురుషోత్తముని ఆ చేష్ట నచ్చలేదు. పాము యొక్క అమంగళకరమగు అవయవము తోక; దానిని మేము పట్టుకోము, అని వారు పలికిరి.

స్వాధ్యాయశ్రుతసంపన్నాః ప్రఖ్యాతా జన్మకర్మభిః ।
ఇతి తూష్ణీం స్థితాన్ దైత్యాన్ విలోక్య పురుషోత్తమః ।
స్మయమానో విసృజ్యాగ్రం పుచ్ఛం జగ్రాహ సామరః ॥ 4

స్వాధ్యాయశ్రుతసంపన్నాః - వేదముయొక్క అధ్యయనముచే సంపన్నులము, జన్మకర్మభిః - జన్మచే మరియు కర్మలచే, ప్రఖ్యాతాః - ప్రసిద్ధి చెందినవారము, ఇతి - అని, తూష్ణీమ్ - మాటలాడకుండగా, స్థితాన్ - నిలిచియున్న, దైత్యాన్ - రాక్షసులను, విలోక్య - చూచి, పురుషోత్తమః - అజిత భగవానుడు, స్మయమానః - చిరునవ్వు నవ్వుచున్నవాడై, స-అమరః - దేవతలతో గూడినవాడై, అగ్రమ్ - ముఖమును, విసృజ్య - విడిచిపెట్టి, పుచ్ఛమ్ - తోకను, జగ్రాహ - పట్టుకొనెను.

మేము వేదాధ్యయన సంపన్నులము; మేము జన్మచే మరియు కర్మలచే లోకములో ప్రఖ్యాతిని పొందినవారము, అని పలికి రాక్షసులు మిన్నకుండిరి. ఆ విధముగా నిలబడియున్న రాక్షసులను చూచి, అజిత భగవానుడు చిరునవ్వు నవ్వి, దేవతలతో బాటుగా వాసుకి ముఖమును విడిచి పెట్టి తోకను పట్టుకొనెను.

కృతస్థానవిభాగాస్త ఏవం కశ్యపనందనాః ।
మమంథుః పరమాయత్తా అమృతార్థం పయోనిధిమ్ ।। 5

ఏవమ్ - ఈ విధముగా, కృతస్థానవిభాగాః - చేయబడిన స్థానముల కేటాయింపు గల, కశ్యపనందనాః - కశ్యప ప్రజాపతియొక్క పుత్రులగు దేవతలు రాక్షసులు, పరమ-ఆయత్తాః - పూర్ణమగు ప్రయత్నము గలవారై, అమృత-అర్థమ్ - అమృతము కొరకై, పయః-నిధిమ్ - పాల సముద్రమును, మమంథుః - మథించిరి.

కశ్యప ప్రజాపతియొక్క సంతానమగు దేవతలు, రాక్షసులు ఈ విధముగా తమ తమ స్థానములను కేటాయించుకొనిరి. వారు పూర్ణమగు ప్రయత్నముతో అమృతము కొరకై పాల సముద్రమును మథించిరి.

మథ్యమానేऽర్ణవే సోऽద్రిరనాధారో హ్యపోऽవిశత్ ।
ధ్రియమాణోऽపి బలిభిర్గౌరవాత్పాండునందన ।। 6

పాండునందన - పాండువంశమునకు ఆనందమును కలిగించువాడా!, అర్ణవే - సముద్రము, మథ్యమానే - మథించబడుచుండగా, అనాధారః - ఆధారము లేని, సః - ఆ, అద్రిః - పర్వతము, బలిభిః - బలశాలురచే, ధ్రియమాణః అపి - పట్టుకొనబడినదైననూ, గౌరవాత్ - బరువు వలన, అపః - నీటిని, అవిశత్ హి - ప్రవేశించెను.

పాండునందనుడవగు ఓ మహారాజా! సముద్రమును వారు మథిస్తూ ఉంటే ఆధారము లేని ఆ పర్వతము చాల బరువు గలది యగుటచే, బలశాలురు పట్టుకున్ననూ, సముద్రజలములలో మునిగిపోయెను.

తే సునిర్విణ్ణమనసః పరిమ్లానముఖశ్రియః ।
ఆసన్ స్వపౌరుషే నష్టే దైవేనాతిబలీయసా ।। 7

అతిబలీయసా - మిక్కిలి బలశాలియగు, దైవేన - దైవముచే, స్వపౌరుషే - తమ పౌరుషము, నష్టే - నష్టము కాగా, సునిర్విణ్ణమనసః - మిక్కిలి ఖేదమును పొందిన మనస్సు గల, తే - వారు, పరిమ్లానముఖశ్రియః - వాడిపోయిన ముఖముయొక్క శోభ గలవారు, ఆసన్ - అయిరి.

దైవము మిక్కిలి బలమైనది. దైవముచే తమ పౌరుషము నష్టము కాగా, ఆ దేవతలకు రాక్షసులకు మనస్సు చాల ఖేదమును పొందెను. వారి ముఖములు మాడిపోయి శోభ దూరమయ్యెను.

విలోక్య విఘ్నేశవిధిం తదేశ్వరో
దురంతవీర్యోऽవితథాభిసంధిః ।
కృత్వా వపుః కాచ్ఛపమద్భుతం మహత్
ప్రవిశ్య తోయం గిరిముజ్జహార ॥ 8

తదా - అప్పుడు, దురంతవీర్యః - అనంతమగు శక్తి గలవాడు, అవితథ-అభిసంధిః - వ్యర్థము కాని సంకల్పము గలవాడు అగు, ఈశ్వరః - శ్రీహరి, విఘ్న-ఈశవిధిమ్ - విఘ్నేశ్వరుని విధానమును, విలోక్య - తెలుసుకొని, అద్భుతమ్ - అచ్చెరువును గొల్పునట్టియు, మహత్ - పెద్ద, కాచ్ఛపమ్ - తాబేలుకు చెందిన, వపుః - దేహమును, కృత్వా - దాల్చి, తోయమ్ - నీటిని, ప్రవిశ్య - ప్రవేశించి, గిరిమ్ - పర్వతమును, ఉజ్జహార - పైకి ఎత్తెను.

ఆ విఘ్నమును విఘ్నేశ్వరుడే కలిగించినాడని శ్రీహరి తెలుసుకొనెను. అనంతమగు శక్తి గల ఆయన సంకల్పము వ్యర్థము కాదు. ఆయన ఆశ్చర్యమును గొల్పే పెద్ద తాబేలు రూపమును దాల్చి, నీటిలో ప్రవేశించి పర్వతమును పైకి ఎత్తెను.

తముత్థితం వీక్ష్య కులాచలం పునః
సముత్థితా నిర్మథితుం సురాసురాః
దధార పృష్ఠేన స లక్షయోజన-
ప్రస్తారిణా ద్వీప ఇవాపరో మహాన్ ॥ 9

పునః - మరల, ఉత్థితమ్ - పైకి లేచిన, తమ్ - ఆ, కుల-అచలమ్ - కుల పర్వతమును, వీక్ష్య - చూచి, సుర-అసురాః - దేవతలు రాక్షసులు, నిర్మథితుమ్ - మథించుటకు, సముత్థితాః - సంసిద్ధులైరి, అపరః - మరి యొక, ద్వీపః ఇవ - ద్వీపము వలె, మహాన్ - పెద్దదైన, సః - ఆ తాబేలు,

లక్షయోజనప్రస్తారిణా - లక్ష యోజనముల విస్తారము గల, పృష్ఠేన - వీపుతో, దధార - మోసెను.

మరల పైకి లేచిన కులపర్వతమైన ఆ మందరమును చూచి దేవతలు, రాక్షసులు మథించుటకు సంసిద్ధులైరి. మరియొక ద్వీపమా యన్నట్లు పది లక్షల యోజనముల విస్తారము గల పెద్ద వీపుతో తాబేలు ఆ పర్వతమును మోసెను.

సురాసురేంద్రైర్భుజవీర్యవేపితం పరిభ్రమంతం గిరిమంగ పృష్ఠతః
బిభ్రత్తదావర్తనమాదికచ్ఛపో మేనేఽంగకండూయనమప్రమేయః।10

అంగ - ఓయీ!, సుర-అసుర-ఇంద్రైః - దేవనాయకులచే రాక్షస నాయకులచే, భుజవీర్యవేపితమ్ - భుజశక్తిచే కంపించబడినదై, పరిభ్రమంతమ్ - గిరగిర తిరుగుచున్న, గిరిమ్ - పర్వతమును, పృష్ఠతః - వీపుతో, బిభ్రత్ - ధరించినవాడు, అప్రమేయః - ఇంద్రియములకు మనస్సునకు గోచరము కానివాడు అగు, ఆదికచ్ఛపః - ఆదిపురుషుడైన తాబేలు, తద్-ఆవర్తనమ్ - ఆ పర్వతముయొక్క త్రిప్పుటను, అంగకండూయనమ్ - శరీరమునకు దురద తీరునట్లు గోకుటగా, మేనే - తలంచెను.

ఓయీ! దేవనాయకులు, రాక్షస నాయకులు తమ భుజబలముతో ఆ పర్వతమును గిరగిర త్రిప్పుచుండిరి. ఇంద్రియములకు మనస్సునకు గోచరము కాని ఆదిపురుషుడు (శ్రీహరి) తాబేలు రూపును దాల్చి తన వీపుపై ఆ పర్వతమును మోయుచుండెను. ఆయన ఆ పర్వతముయొక్క భ్రమణము వలన కలిగిన రాపిడిచే తన వీపుమీది దురద తీరినదని తలపోసెను.

తథాఽసురానావిశదాసురేణ రూపేణ తేషాం బలవీర్యమీరయన్ ।
ఉద్దీపయన్దేవగణాంశ్చ విష్ణుర్దైవేన నాగేంద్రమబోధరూపః ।। 11

విష్ణుః - విష్ణువు, తేషామ్ - ఆ రాక్షసులయొక్క, బలవీర్యమ్ - బలమును ప్రభావమును, ఈరయన్ - ప్రవర్తిల్ల జేయువాడై, ఆసురేణ రూపేణ - అసురులకు చెందిన రూపముతో, అసురాన్ - అసురులను,

తథా - అదే విధముగా, దేవగణాన్ చ - దేవతల గణములను కూడ, దైవేన - దైవశక్తితో, ఉద్దీపయన్ - వర్ధిల్ల జేయుచున్నవాడై, అబోధరూపః - నిద్ర అనే రూపము గలవాడై, నాగ-ఇంద్రమ్ - నాగరాజగు వాసుకిని, ఆవిశత్ - ఆవేశించెను.

విష్ణువు ఆ రాక్షసుల బలమును ప్రభావమును ప్రవర్తిల్ల జేయు వాడై అసురులకు చెందిన రాజసరూపముతో అసురులను, అదే విధముగా దేవతల గణములను వర్ధిల్ల జేయువాడై వారిని దైవీశక్తి (సాత్త్వికము) తో, మరియు నిద్ర (తామసశక్తి) అనే రూపముతో నాగరాజగు వాసుకిని ఆవేశించెను.

**ఉపర్యగేంద్రం గిరిరాడివాన్య ఆక్రమ్య హస్తేన సహస్రబాహుః,**
**తస్థౌ దివి బ్రహ్మభవేంద్రముఖ్యైరభిష్టువద్భిస్సుమనోఽభివృష్టః।12**

సహస్రబాహుః - వేయి చేతులు గల శ్రీహరి, అగ-ఇంద్రం - గొప్ప మందర పర్వతమును, హస్తేన - చేతితో, ఆక్రమ్య - ఆక్రమించి, ఉపరి - పైన, అన్యః - మరియొక, గిరిరాట్ ఇవ - గొప్ప పర్వతము వలె, తస్థౌ - నిలిచెను, దివి - ఆకాశమునందు, అభిష్టువద్భిః - అభిముఖముగా స్తుతించుచున్న, బ్రహ్మభవ-ఇంద్రముఖ్యైః - బ్రహ్మగారు రుద్రుడు ఇంద్రుడు మొదలగువారిచే, సుమనః-అభివృష్టః - పుష్పములచే వర్షించ బడినవాడు.

శ్రీహరి గొప్ప మందర పర్వతముపై మరియొక గొప్ప పర్వతము వలె నిలిచి వేయి చేతులతో దానిని ఆక్రమించి పట్టుకొని నిలబెట్టెను. ఆకాశమునందు బ్రహ్మగారు, రుద్రుడు, ఇంద్రుడు మొదలగువారు అభిముఖముగా నిలిచి స్తుతిస్తూ పుష్పవర్షములను కురిపించిరి.

**ఉపర్యధశ్చాత్మని గోత్రనేత్రయోః పరేణ తే ప్రావిశతా సమేధితాః,**
**మమంథురబ్ధిం తరసా మదోత్కటా మహాద్రిణా క్షోభితనక్రచక్రమ్।**

ఉపరి - పైన, అధః చ - క్రింద కూడ, ఆత్మని - దేహమునందు, గోత్రనేత్రయోః - పర్వతమునందు త్రాడునందు, ప్రావిశతా - ఆవేశించుచు

న్న, పరేణ - పరమేశ్వరునిచే, సమేధితాః - చక్కగా వర్ధిల్ల జేయబడిన, తే - వారు, మద-ఉత్కటాః - గర్వముచే తీవ్రత గలవారై, తరసా - బలముతో, క్షోభితనక్రచక్రమ్ - క్షోభిల్ల జేయబడిన మొసళ్ల సమూహములు కలిగిన, అబ్ధిమ్ - సముద్రమును, మహా-అద్రిణా - గొప్ప మందర పర్వతముతో, మమంథుః - మథించిరి.

పైన సహస్రబాహు రూపముతో, క్రింద తాబేలు రూపముతో, దేవాసురుల దేహములయందు ఆయా శక్తులతో, పర్వతమునందు దృఢత్వము రూపముగా, త్రాడు (వాసుకి) నందు నిద్ర రూపముగా పరమేశ్వరుడు ఆవేశించెను. ఈ విధముగా వర్ధిల్లజేయబడిన ఆ దేవాసురులు తీవ్రమగు గర్వము గలవారై బలముగా ఆ గొప్ప పర్వతముతో సముద్రమును మథించుచుండగా, దానియందలి మొసళ్ల గుంపులు సంక్షోభమును పొందినవి.

అహీంద్రసాహస్రకఠోరదృఙ్ముఖ-
 శ్వాసాగ్నిధూమాహతవర్చసోఽసురాః ।
పౌలోమకాలేయబలీల్వలాదయో
 దవాగ్నిదగ్ధాస్సరలా ఇవాభవన్ ॥ 14

అహి-ఇంద్రసాహస్రకఠోరదృక్-ముఖశ్వాస-అగ్నిధూమ-ఆహతవర్చసః - నాగరాజగు వాసుకియొక్క వేలాది క్రూరమైన కళ్లు నోళ్లు శ్వాసల నుండి వచ్చే పొగచే నాశము చేయబడిన వర్చస్సు గలవారు, పౌలోమకాలేయబలి-ఇల్వల-ఆదయః - పౌలోములు కాలేయులు బలి ఇల్వలుడు మొదలైన, అసురాః - రాక్షసులు, దవ-అగ్నిదగ్ధాః - కార్చిచ్చుచే కాల్చివేయబడిన, సరలాః ఇవ - తెల్లతెగడ చెట్లు వలె, అభవన్ - అయిరి.

నాగరాజగు వాసుకియొక్క వేలాది క్రూరమైన కళ్లనుండి, నోళ్లనుండి, శ్వాసనుండి వెలువడే పొగ ఆ రాక్షసుల వర్చస్సును నాశము చేసెను. పౌలోములు, కాలేయులు, బలి, ఇల్వలుడు మొదలైన రాక్షసులు కార్చిచ్చుచే కాల్చివేయబడిన తెల్లతెగడ చెట్లవలె అయిరి.

దేవాంశ్చ తచ్ఛ్వాసశిఖాహతప్రభాన్
ధూమ్రాంబరస్రగ్వరకంచుకాననాన్ ।
సమభ్యవర్షన్ భగవద్వశా ఘనా
వవుస్సముద్రోర్మ్యుపగూఢవాయవః ॥ 15

తత్-శ్వాసశిఖా-ఆహతప్రభాన్ - ఆ వాసుకియొక్క ఉచ్ఛ్వాసని శ్శ్వాసలయొక్క మంటలచే నాశము చేయబడిన కాంతి కలిగినట్టియు, ధూమ్ర-అంబరస్రగ్-వరకంచుక-ఆననాన్ - దుమ్ముతో నిండిన వస్త్రములు మాలలు శ్రేష్ఠమైన కవచములు ముఖములు గల, దేవాన్ చ - దేవతలనైతే, భగవద్-వశాః - భగవానుని వశములోనుండే, ఘనాః - మేఘములు, సమభ్యవర్షన్ - చక్కగా అంతటా వర్షించినవి, సముద్ర-ఊర్మి-ఉపగూఢవాయవః - సముద్రముయొక్క తరంగములచే కౌగిలించుకొనబడిన వాయువులు, వవుః - వీచినవి.

ఆ వాసుకియొక్క ఉచ్ఛ్వాసనిశ్శ్వాసలనుండి వచ్చే మంటలు దేవతల వర్చస్సును కూడ నాశనమొనర్చెను. వారి వస్త్రములు, మాలలు, శ్రేష్ఠమైన కవచములు, ముఖములు దుమ్ము కొట్టుకొని యుండెను. అపుడు భగవానునకు అధీనములై యుండే మేఘములు వారిపై చక్కగా అంతటా వర్షమును కురిపించినవి. సముద్రతరంగముల మీదుగా చల్లని వాయువులు వీచి వారికి సేద దీర్చినవి.

మథ్యమానాత్తథా సింధోర్దేవాసురవరూథపైః ।
యదా సుధా న జాయేత నిర్మమంథాజితస్స్వయమ్ ॥ 16

తథా - అ విధముగా, దేవ-అసురవరూథపైః - దేవతల మరియు రాక్షసుల సేనానాయకులచే, సింధోః - సముద్రము, మథ్యమానాత్ - మథించబడుచుండగా, యదా - ఎప్పుడైతే, సుధా - అమృతము, న జాయేత - పుట్టలేదో అప్పుడు, అజితః - అజిత భగవానుడు, స్వయమ్ - స్వయముగా, నిర్మమంథ - మథించెను.

దేవతల మరియు రాక్షసుల సేనానాయకులు ఈ విధముగా సముద్రమును మథించిననూ అమృతము పుట్టలేదు. అప్పుడు అజిత భగవానుడు స్వయముగా మథించెను.

మేఘశ్యామః కనకపరిధిః కర్ణవిద్యోతవిద్యున్-
మూర్ధ్ని భ్రాజద్విలులితకచస్స్రగ్ధరో రక్తనేత్రః ।
జైత్రైర్దోర్భిర్జగదభయదైర్దందశూకం గృహీత్వా
మథ్నన్ మథ్నా ప్రతిగిరిరివాశోభతాథోద్ధృతాద్రిః ॥ 17

అథ - అప్పుడు, మేఘశ్యామః - మేఘము వలె శ్యామలవర్ణము గలవాడు, కనకపరిధిః - బంగారమువంటి వస్త్రము గలవాడు, కర్ణవిద్యోతవిద్యుత్ - చెవులయందు మెరుస్తున్న మెరుపులు (వంటి కుండలములు) గలవాడు, మూర్ధ్ని - తలపై, భ్రాజద్-విలులితకచః - ప్రకాశించే చెల్లాచెదరైన జుట్టు గలవాడు, స్రగ్-ధరః - మాలను ధరించినవాడు, రక్తనేత్రః - ఎఱ్రని కళ్లు గలవాడు, ఉద్ధృత-అద్రిః - పైకి ఎత్తబడిన పర్వతము గలవాడు అగు శ్రీహరి, జైత్రైః - జయమును తెచ్చిపెట్టునట్టియు, జగద్-అభయదైః - జగత్తునకు అభయమునిచ్చే, దోర్భిః - భుజములతో, దందశూకమ్ - సర్పమును, గృహీత్వా - పట్టుకొని, మథ్నా - కవ్వముతో, మథ్నన్ - చిలుకువాడై, ప్రతిగిరిః ఇవ - మరియొక పర్వతము వలె, అశోభత - శోభిల్లెను.

అప్పుడు (అమృతము పుట్టని ఆ సమయమునందు) నీలమేఘశ్యాముడగు అజిత భగవానుడు బంగారము వలె మెరిసే వస్త్రమును ధరించి, చెవులయందు కుండలములు మెరుపులవలె మెరియుచుండగా, జయమును తెచ్చిపెట్టి జగత్తునకు అభయమునిచ్చే భుజములతో సర్పమును పట్టుకొని పర్వతమునే కవ్వముగా చేసి సముద్రమును చిలుకుతూ మరియొక పర్వతము వలె ప్రకాశించెను. మాలను ధరించియున్న ఆయన తలపై చెల్లాచెదరైన జుట్టు ప్రకాశించుచుండెను. ఎఱ్రని కళ్లు గల ఆయన తాబేలు రూపముతో పర్వతమును పైకి ఎత్తి ఉంచెను.

నిర్మథ్యమానాదుదధేరభూద్విషం
మహోల్బణం హాలహలాహ్వమగ్రతః ।

సంభ్రాంతమీనోన్మకరాహికచ్ఛపాత్
తిమిద్విపగ్రాహతిమింగిలాకులాత్ ॥ 18

నిర్మథ్యమానాత్ - గట్టిగా మథించబడుచున్నట్టియు, సంభ్రాంత మీన-ఉత్-మకర-అహికచ్ఛపాత్ - భయపడిపోయిన చేపలు పైకి వచ్చిన మొసళ్లు పాములు తాబేళ్లు కలిగినట్టియు, తిమిద్విపగ్రాహతిమింగిల-ఆకులాత్ - తిమిలు (పెద్ద చేపలు) నీటి యేనుగులు మొసళ్లు తిమింగిలముల (తిమిలను తినే చాల పెద్ద చేపలు) తో కలిచివేయబడిన, ఉదధేః - సముద్రమునుండి, అగ్రతః - ముందుగా, మహా-ఉల్బణమ్ - చాల భయంకరమైన, హాలహల-ఆహ్వామ్ - హాలహలము అనే పేరు గల, విషమ్ - విషము, అభూత్ - పుట్టెను.

సముద్రమును గట్టిగా మథించుచుండగా చేపలు, మొసళ్లు, పాములు, తాబేళ్లు భయపడి పైకి తేలినవి. తిమి, తిమింగిలము, నీటి యేనుగు, మొసలి మొదలైన ప్రాణులతో సముద్రము కలిచి వేయబడెను. అపుడా సముద్రమునుండి ముందుగా చాల భయంకరమైన విషము పుట్టెను. దానికి హాలహలము (హాలాహలము) అని పేరు.

తదుగ్రవేగం దిశి దిశ్యుపర్యధో
విసర్పదుత్సర్పదసహ్యామప్రతి ।
భీతాః ప్రజా దుద్రువురంగ సేశ్వరా
అరక్ష్యమాణాశ్శరణం సదాశివమ్ ॥ 19

అంగ - ఓయీ!, ఉగ్రవేగమ్ - భయంకరమగు వేగము గలది, అసహ్యామ్ - సహించ శక్యము కానిది, అప్రతి - సాటి లేనిది అగు, తత్ - ఆ విషము, దిశి దిశి - ప్రతి దిక్కునందు, ఉపరి - పైన, అధః - క్రింద, విసర్పత్ - వ్యాపించుచున్నదై, ఉత్-సర్పత్ - పైకి ప్రసరించుచున్నది, భీతాః - భయపడిన, ప్రజాః - జనులు, అరక్ష్యమాణాః - రక్షణను పొందనివారై, స-ఈశ్వరాః - పాలకులతో కూడినవారై, శరణమ్ - రక్షకుడైన, సదాశివమ్ - సదాశివుని ఉద్దేశించి, దుద్రువుః - పరుగులు తీసిరి.

ఓయీ! సాటి లేని ఆ విషమును సహించుట శక్యము కాకుండెను. అది భయంకరమగు వేగముతో దిక్కులన్నిటియందు పైన క్రింద కూడ ప్రసరించి వ్యాపించుచుండెను. జనులు భయపడి పరుగులు తీసిరి. వారికి రక్షకుడు కరువాయెను. అపుడు వారు పాలకులతో సహా సదాశివుని శరణు వేడిరి.

విలోక్య తం దేవవరం త్రిలోక్యా
భవాయ దేవ్యాభిమతం మునీనామ్ ।
ఆసీనమద్రావపవర్గహేతోః
తపో జుషాణం స్తుతిభిః ప్రణేముః ॥ 20

దేవవరమ్ - దేవతలలో శ్రేష్ఠుడైనట్టియు, త్రిలోక్యాః - ముల్లోకములయొక్క, భవాయ - కల్యాణము కొరకై, దేవ్యా - పార్వతీదేవితో, అద్రౌ - కైలాస పర్వతముపై, ఆసీనమ్ - అధిష్ఠించి ఉన్నట్టియు, మునీనామ్ - మహర్షులకు, అభిమతమ్ - ప్రియుడైనట్టియు, అపవర్గహేతోః - మోక్షము నిమిత్తముగా, తపః - తపస్సును, జుషాణమ్ - సేవించు చున్న, తమ్ - ఆ శివుని, విలోక్య - చూచి, స్తుతిభిః - స్తోత్రములతో, ప్రణేముః - నమస్కరించిరి.

దేవశ్రేష్ఠుడగు ఆ శివుడు ముల్లోకముల కల్యాణము కొరకై పార్వతీదేవితో గూడి కైలాసగిరిని అధిష్ఠించి యుండెను. మహర్షులకు ప్రియుడైన ఆయన మోక్షము నిమిత్తముగా తపస్సును సేవించుచుండెను. (మోక్షహేతువు అగుటచే మహర్షులకు అభిమతమైన తపస్సును ఆచరించుట ద్వారా శిక్షణ నిచ్చుచుండెను). వారు శివుని చూచి స్తోత్రములతో నమస్కరించిరి.

ప్రజాపతయ ఊచుః ।
దేవదేవ మహాదేవ భూతాత్మన్ భూతభావన ।
పాహి నశ్శరణాపన్నాంస్త్రైలోక్యదహనాద్విషాత్ ॥ 21

దేవదేవ - ఓ దేవదేవా!, మహాదేవ - ఓ మహాదేవా!, భూత-ఆత్మన్ - ప్రాణులకు ఆత్మస్వరూపుడా!, భూతభావన - ప్రాణులను సృష్టించినవాడా!, శరణ-ఆపన్నాన్ - శరణు వేడిన, నః - మమ్ములను, త్రైలోక్య దహనాత్ - ముల్లోకములను దహించే, విషాత్ - విషమునుండి, పాహి - రక్షించుము.

ప్రజాపతులు ఇట్లు పలికిరి --- ఓ మహాదేవా! నీవు దేవదేవుడవు. ప్రాణులను సృష్టించిన నీవే ప్రాణుల ఆత్మస్వరూపుడవై యున్నావు. నిన్ను శరణు వేడిన మమ్ములను ముల్లోకములను దహించి వేయుచున్న విషము నుండి రక్షించుము.

త్వమేకస్సర్వజగత ఈశ్వరో బంధమోక్షయోః ।
తం త్వామర్చంతి కుశలాః ప్రపన్నార్తిహరం గురుమ్ ।। 22

సర్వజగతః - సకల జగత్తునకు, బంధమోక్షయోః - బంధమోక్షములకు, ఈశ్వరః - ఈశ్వరుడవు, త్వమ్ - నీవు, ఏకః - ఒక్కడివే, కుశలాః - వివేకము గల నిపుణులు, ప్రపన్న-ఆర్తిహరమ్ - శరణు వేడినవారి దుఃఖమును పోగొట్టునట్టియు, గురుమ్ - తండ్రివైన, తమ్ - అట్టి, త్వామ్ - నిన్ను, అర్చంతి - పూజించెదరు.

సకలజగత్తుయొక్క బంధమోక్షములకు నీవు ఒక్కడివే ప్రభుడవు. నీవు శరణు వేడినవారి దుఃఖమును పోగొట్టే తండ్రివి. వివేకవంతులగు నేర్పరులు అట్టి నిన్ను పూజించెదరు.

గుణమయ్యా స్వశక్త్యాస్య సర్గస్థిత్యప్యయాన్ విభో ।
ధత్సే యదా స్వదృగ్ భూమన్ బ్రహ్మవిష్ణుశివాభిధామ్ ।।23

విభో - ఓ ప్రభూ!, భూమన్ - ఓ పరబ్రహ్మ!, యదా - ఎప్పుడైతే, గుణమయ్యా - సత్త్వరజస్తమోగుణాత్మకమగు, స్వశక్త్యా - నీ మాయా శక్తిచే, అస్య - ఈ జగత్తుయొక్క, సర్గస్థితి-అప్యయాన్ - సృష్టిస్థితిలయములను, ధత్సే - నిర్వర్తించెదవో అప్పుడు, స్వదృక్ - స్వయంప్రకాశ

చైతన్య స్వరూపుడవగు నీవు, బ్రహ్మవిష్ణుశివ-అభిధామ్ - బ్రహ్మ విష్ణువు శివుడు అనే పేరును, ధత్సే - ధరించెదవు.

ఓ ప్రభూ! స్వయంప్రకాశ స్వరూపుడవగు నీవు పరబ్రహ్మవు. నీవే సత్త్వరజస్తమోగుణాత్మకమగు నీ మాయాశక్తిచే జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను చేయునప్పుడు క్రమముగా బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు అనే పేర్లను ధరించెదవు.

త్వం బ్రహ్మ పరమం గుహ్యం సదసద్భావభావనః ।
నానాశక్తిభిరాభాతస్త్వమాత్మా జగదీశ్వరః ॥ 24

గుహ్యమ్ - రహస్యమైన, పరమం బ్రహ్మ - పరబ్రహ్మ, త్వమ్ - నీవే, సద్-అసద్-భావభావనః - యోగ్యులైన మరియు యోగ్యులు కాని ప్రాణులను సృష్టించువాడవు, నానాశక్తిభిః - అనేకములగు శక్తులతో, ఆభాతః - ప్రకాశించువాడవు, త్వమ్ - నీవే, ఆత్మా - ఆత్మవు, జగద్-ఈశ్వరః - జగన్నాథుడవు.

రహస్యమైన పరబ్రహ్మవు నీవే. యోగ్యులైన దేవతలు మొదలగు ప్రాణులను, అయోగ్యము (దుఃఖరూపము) అయిన చెట్టుచేమలు మొదలైన ప్రాణులను నీవే సృష్టించుచున్నావు. నీవు నీ సత్త్వరజస్తమోగుణములనే శక్తులతో జగద్రూపముగా ప్రకాశించుచున్నావు. నీవే సర్వమునకు ఆత్మవు, జగన్నాథుడవు.

త్వం శబ్దయోనిర్జగదాదిరాత్మా
ప్రాణేంద్రియద్రవ్యగుణస్స్వభావః ।
కాలః క్రతుస్సత్యమృతం చ ధర్మః
త్వయ్యక్షరం యత్త్రివృదామనంతి ॥ 25

త్వమ్ - నీవు, శబ్దయోనిః - వేదమునకు ఉద్గమస్థానము, జగద్-ఆదిః - జగత్తునకు కారణుడవు, ఆత్మా - ఆత్మవు, ప్రాణ-ఇంద్రియద్రవ్యగుణస్స్వభావః - ప్రాణము ఇంద్రియములు ద్రవ్యములకు కారణమైన గుణములే స్వభావముగా గలవాడవు, కాలః - కాలస్వరూపుడవు, క్రతుః -

యజ్ఞస్వరూపుడవు, సత్యమ్ - సత్యము, ఋతం చ - జగత్తులోని నియతి, ధర్మః - ధర్మము, త్వయి - నీయందు, అక్షరమ్ - అవినాశియగు ప్రకృతి, యత్ - ఏది, త్రివృత్ - మూడు పేటలు గలదియని, ఆమనంతి - చెప్పెద రో.

వేదములు నీనుండియే పుట్టినవి. జగత్కారణమగు నీవే ప్రాణులలో ఆత్మరూపుడవై ఉన్నావు. ప్రాణులలోని ప్రాణము, ఇంద్రియములు, ద్రవ్యము (పంచభూతముల దేహము) అనువాటికి కారణమైన సత్త్వరజస్తమోగుణములు నీ స్వభావములే (ప్రకటమయ్యే ఉపాధులే). కాలస్వరూపుడవగు నీవే యజ్ఞరూపముగా ప్రకటమయ్యేదవు. నామరూపాత్మకమగు జగత్తుయొక్క యథార్థ తత్త్వము నీవే. జగత్తులోని నియతి, ధర్మము నీవే. అవినాశి, సత్త్వరజస్తమోగుణములు అనే మూడు పేటలు గలది అగు ప్రకృతి (మాయాశక్తి) కి అధిష్ఠానము నీవేనని మహర్షులు చెప్పెదరు.

**అగ్నిర్ముఖం తేఽఖిలదేవతాత్మా క్షితిం విదుర్లోకభవాంఘ్రిపంకజమ్,**
**కాలం గతిం తేఽఖిలదేవతాత్మనో దిశశ్చ కర్ణౌ రసనం జలేశమ్।26**

లోకభవ - లోకములకు జన్మస్థానమైనవాడా!, అఖిలదేవతా-ఆత్మా - సకల దేవతారూపుడగు, అగ్నిః - అగ్ని, తే - నీ, ముఖమ్ - నోరు, క్షితిమ్ - భూమిని, అంఘ్రిపంకజమ్ - పద్మమువంటి పాదమునుగా, కాలమ్ - కాలమును, అఖిలదేవతా-ఆత్మనః - సకల దేవతా స్వరూపుడవగు, తే - నీయొక్క, గతిమ్ - గతినిగా, కర్ణౌ చ - చెవులను కూడ, దిశః - దిక్కులనుగా, రసనమ్ - నాలుకను, జల-ఈశమ్ - జలాధిపతియగు వరుణునిగా, విదుః - తెలియుదురు.

ఓ దేవా! లోకములు నీనుండియే ఆవిర్భవించినవి. సకల దేవతారూపుడగు అగ్ని సకలదేవతా స్వరూపుడవగు నీ నోరు అనియు, భూమి నీ పద్మమువంటి పాదములనియు, కాలము నీ గమనమనియు, దిక్కులు నీ చెవులనియు, జలాధిపతియగు వరుణుడు నీ నాలుక అనియు మహాత్ములు తెలియుదురు.

నాభిర్నభస్తే శ్వసనం నభస్వాన్
సూర్యశ్చ చక్షూంషి జలం స్మ రేతః ।
పరావరాత్మాశ్రయణం తవాత్మా
సోమో మనో ద్యౌర్భగవన్ శిరస్తే ॥ 27

భగవన్ - ఓ భగవానుడా!, తే - నీ, నాభిః - నాభి, నభః - ఆకాశము, శ్వసనమ్ - ఊపిరి, నభస్వాన్ - వాయువు, చక్షూంషి - కన్నులు, సూర్యః చ - సూర్యుడు, రేతః - రేతస్సు, జలం స్మ - నీరు, తవ - నీ, ఆత్మా - స్వరూపము, పర-అవర-ఆత్మా-ఆశ్రయణమ్ - గొప్ప తక్కువ జీవులకు ఆశ్రయము, మనః - మనస్సు, సోమః - చంద్రుడు, తే - నీ, శిరః - తల, ద్యౌః - ద్యులోకము.

ఓ భగవానుడా! ఆకాశమే నీ నాభి. వాయువే నీ ఊపిరి. సూర్యుడే నీ కన్నులు. నీరే నీ రేతస్సు. గొప్ప-తక్కువ అగు జీవులకు అధిష్ఠానమగు చైతన్యము నీ స్వరూపమే. చంద్రుడే నీ మనస్సు. ద్యులోకమే నీ తల.

కుక్షిస్సముద్రా గిరయోఽస్థిసంఘా
రోమాణి సర్వౌషధివీరుధస్తే ।
ఛందాంసి సాక్షాత్తవ సప్త ధాతవః
త్రయీమయాత్మన్ హృదయం సర్వధర్మః ॥ 28

త్రయీమయ-ఆత్మన్ - వేదములతో నిండిన స్వరూపము గలవాడా!, సముద్రాః - సముద్రములు, కుక్షిః - ఉదరము, గిరయః - పర్వతములు, అస్థిసంఘాః - ఎముకల సమూహములు, తే - నీయొక్క, రోమాణి - రోమములు, సర్వ-ఓషధివీరుధః - సకలములైన మొక్కలు చెట్లు, ఛందాంసి - ఛందస్సులు, సాక్షాత్ - సాక్షాత్తుగా, తవ - నీయొక్క, సప్త - ఏడు, ధాతవః - ధాతువులు, హృదయమ్ - హృదయము, సర్వ ధర్మః - సర్వవిధమైన ధర్మము.

వేదములే స్వరూపముగా గల ఓ దేవా! సముద్రములే నీ ఉదరము. పర్వతములే నీ ఎముకల సమూహములు. సకలములైన మొక్కలు

మరియు చెట్లే నీ రోమములు. గాయత్రి, త్రిష్టుభము, అనుష్టుభము, బృహతి, పంక్తి, జగతి, ఉష్ణిక్ అనే ఏడు ఛందస్సులే సాక్షాత్తుగా నీ ఏడు ధాతువులు (రసము, రక్తము, మాంసము, క్రొవ్వు, ఎముకలు, మూలుగు, వీర్యము). సకలధర్మములు నీ హృదయము.

ముఖాని పంచోపనిషదస్తవేశ యైస్త్రింశదష్టోత్తరమంత్రవర్గః ।
యత్తచ్ఛివాఖ్యం పరమార్థతత్త్వం దేవ స్వయంజ్యోతిరవస్థితిస్తే ।।

ఈశ - ఓ ఈశ్వరా!, పంచ - అయిదు, ఉపనిషదః - మంత్రములు, తవ - నీయొక్క, ముఖాని - ముఖములు, యైః - ఏ ముఖములచే, త్రింశదష్టోత్తరమంత్రవర్గః - ముప్పై ఎనిమిది మంత్రముల సమూహమో, దేవ - ఓ దేవా!. శివ-ఆఖ్యమ్ - శివుడు అనే పేరు గల, పరమ-అర్థతత్త్వమ్ - పరమార్థవస్తువు, యత్ - ఏది గలదో, తత్ - అది, తే - నీయొక్క, స్వయంజ్యోతిః - స్వయంప్రకాశమైన, అవస్థితిః - స్వరూపమునందు నిలిచియుండుట.

ఓ ఈశ్వరా! సద్యోజాతం ప్రపద్యామి అనే మంత్రము నీ సద్యోజాత ముఖము, తత్పురుషాయ విద్మహే అనేది తత్పురుష ముఖము, వామదేవాయ నమః అనేది వామదేవ ముఖము, అఘోరేభ్యః అనేది అఘోర ముఖము, ఈశానస్సర్వవిద్యానాం అనేది ఈశాన ముఖము. ఆ మంత్రముల పదములను విడదీసినచో ముప్పై ఎనిమిది కలా మంత్రములు వచ్చును. ఓ దేవా! ఉపనిషత్ప్రతిపాద్యమైన పరమార్థ వస్తువునకు శివుడు అని పేరు. ఆ తత్త్వము నీవు నీ స్వయంప్రకాశ స్వరూపమునందు నిలిచియుండుటయే.

ఛాయా త్వధర్మోర్మిషు యైర్విసర్గో
నేత్రత్రయం సత్త్వరజస్తమాంసి ।
సాంఖ్యాత్మనశ్శాస్త్రకృతస్తవేక్షా
ఛందోమయో దేవ ఋషిః పురాణః ।। 30

దేవ - ఓ దేవా!, అధర్మ-ఊర్మిషు తు - అధర్మముయొక్క తరంగములైన కామలోభాదులయందైతే, తవ - నీయొక్క, ఛాయా - నీడ,

సత్త్వరజస్తమాంసి - సత్త్వరజస్తమోగుణములు, నేత్రత్రయమ్ - మూడు కన్నులు, యైః - వేటిచే, విసర్గః - సృష్టియో, ఛందః-మయః - ఛందస్సులతో నిండియుండునది, పురాణః - ప్రాచీనమైనది అగు, ఋషిః - వేదము, సాంఖ్య-ఆత్మనః - జ్ఞానస్వరూపుడవైనట్టియు, శాస్త్రకృతః - వేదనిర్మాతవగు, తవ - నీయొక్క, ఈక్షా - సంకల్పము.

ఓ దేవా! అధర్మతరంగములైన కామలోభములయందు నీ నీడ (నీ గురించిన అజ్ఞానము) గలదు. సృష్టికి మూలమునందున్న సత్త్వరజస్తమోగుణములు నీ మూడు కన్నులు. గాయత్రి మొదలైన ఛందస్సులతో నిండియున్న ప్రాచీనమైన వేదమే జ్ఞానస్వరూపుడవు, వేదనిర్మాతవు అగు నీ విచారము (దర్శనము).

న తే గిరిత్రాఖిలలోకపాల-
విరించవైకుంఠసురేంద్రగమ్యమ్ ।
జ్యోతిః పరం యత్ర రజస్తమశ్చ
సత్త్వం న యద్బ్రహ్మ నిరస్తభేదమ్ ॥ 31

గిరిత్ర - కైలాసగిరి పాలకా!, పరమ్ - సర్వాతీతమైన, తే - నీయొక్క, జ్యోతిః - చైతన్యము, అఖిలలోకపాలవిరించవైకుంఠసుర-ఇంద్రగమ్యమ్ - సకలలోకపాలకులు బ్రహ్మగారు వైకుంఠ లోకవాసులు దేవేంద్రులచే పొందబడేది, న - కాదు, యత్ర - దేనియందైతే, రజః - రజోగుణము, తమః - తమోగుణము, సత్త్వం చ - సత్త్వగుణము కూడ, న - లేవో, యత్ - ఏది, బ్రహ్మ - దేశకాలములకు అతీతమైనదో, నిరస్తభేదమ్ - తొలగించబడిన భేదాలు గలదియో.

ఓ కైలాసగిరి పాలకా! సర్వాతీతమైన నీ చైతన్యస్వరూపమునందు సత్త్వరజస్తమోగుణములు లేవు. దేశకాలపరిచ్ఛేదములకు అతీతమైన నీ స్వరూపమునందు భేదములు లేశమైననూ లేవు. నీ స్వరూపమును సకల లోకపాలకులు, బ్రహ్మగారు, వైకుంఠ లోకవాసులు, ఇంద్రుడు కూడ తెలియజాలరు.

కామాధ్వరత్రిపురకాలగరాద్యనేక-
భూతద్రుహః క్షపయతః స్తుతయే న తత్తే ।
యస్త్వంతకాల ఇదమాత్మకృతం స్వనేత్ర-
వహ్నిస్ఫులింగశిఖయా భసితం న వేద ।। 32

కామ-అధ్వర-త్రిపురకాలగర-ఆది-అనేకభూతద్రుహః - కాముడు దక్షయజ్ఞము త్రిపురాసురులు కాలకూట విషము మొదలైన అనేకములగు ప్రాణులకు ద్రోహము చేయువాటిని, క్షపయతః - నశింపజేయు, తే - నీకు, **తత్** - అది, స్తుతయే - స్తోత్రము కొరకు, న - కాదు, యః తు - ఏ నీవైతే, **అంతకాలే** - ప్రళయకాలమునందు, స్వనేత్రవహ్నిస్ఫులింగశిఖయా - తన నేత్రమునుండి వచ్చిన అగ్నియొక్క మిణుగురుయొక్క జ్వాలచే, భసితమ్ - భస్మము చేయబడిన, ఆత్మకృతమ్ - నీచే చేయబడిన, ఇదమ్ - ఈ జగత్తును, న వేద - గమనించనే లేదో.

ప్రాణులకు ద్రోహమును చేసే కాముడు, దక్షుని యజ్ఞము, త్రిపురా సురులు, కాలకూట విషము మొదలైన అనేకములను నీవు నశింప జేసినా వు (కాలకూట విషమును నీవు తప్పక నాశము చేయగలవని అభిప్రా యము). నిన్ను అట్లు స్తుతించుట కూడ నీ విషయములో అత్యల్పమే య. గును. ఈ జగత్తును నీవే సృష్టించితివి. ప్రళయకాలములో నీ కన్నునుండి పుట్టిన అగ్నియొక్క మిణుగురుయొక్క జ్వాలలో ఈ జగత్తు బూడిద కాగా, నీవా విషయమును కూడ గమనించనే గమనించవు.

యే త్వాత్మరామగురుభిర్హృది చింతితాంఘ్రి-
ద్వంద్వం చరంతముమయా తపసాభితప్తమ్ ।
కత్థంత ఉగ్రపురుషం నిరతం శ్మశానే
తే నూనమూతిమవిదంస్తవ హాతలజ్జాః ।। 33

ఆత్మరామగురుభిః - ఆత్మనిష్ఠయందు ఆనందించువారు మరియు గురువులు అయినవారిచే, హృది - హృదయమునందు, చింతిత -అంఘ్రిద్వంద్వమ్ - ధ్యానించబడిన రెండు పాదములు కలిగినట్టియు, తపసా - తపస్సుచే, అభితప్తమ్ - తపింప జేయబడే నిన్ను, యే తు -

ఎవరైతే, ఉమయా - పార్వతీదేవితో, చరంతమ్ - విహరించునట్టియు, నిర తమ్ - అధికమగు ఆసక్తి కలిగినవానినిగా, శ్మశానే - శ్మశానమునందలి, ఉగ్రపురుషమ్ - క్రూరమగు పురుషునిగా, కత్థంతే - ప్రలాపములను పలికె దరో, తే - వారు, నూనమ్ - నిశ్చయముగా, తవ - నీయొక్క, ఊతిమ్ - లీలను, అవిదన్ - తెలుసుకున్నారా?, హాతలజ్జాః - విడువబడిన సిగ్గు గల వారు.

ఆత్మనిష్ఠయందు ఆనందిస్తూ జ్ఞానమును ప్రబోధించే మహా త్ములు నీ రెండు పాదములను తమ హృదయములో ధ్యానించెదరు. నీవు నిరంతరముగా తపస్సును చేయుచుందువు. అయిననూ, కొందరు నీవు పార్వతీదేవితో సంచరిస్తూ ఉండే భోగాసక్తుడవనియు, శ్మశానమునందుండే క్రూర పురుషుడవనియు ప్రలాపములను పలికెదరు. వారికి నీ లీల విశ్చ యముగా తెలిసినదా? (లేదు). వారు సిగ్గును విడిచి పెట్టి అట్లు వదరు చున్నారు.

తత్తస్య తే సదసతోః పరతః పరస్య
నాంజస్స్వరూపగమనే ప్రభవంతి భూమ్నః ।
బ్రహ్మాదయః కిముత సంస్తవనే వయం తు
తత్సర్గసర్గవిషయా అపి శక్తిమాత్రమ్ ॥ 34

తత్ - అందువలన, సద్-అసతోః - కార్యకారణములకంటె అతీత మైన, పరతః - మాయాశక్తికంటె, పరస్య - అతీతుడవైనట్టియు, భూమ్నః - దేశకాలపరిచ్ఛేదములు లేని, తస్య - అట్టి, తే - నీయొక్క, స్వరూపగమనే - స్వరూపమును తెలియుటయందు, బ్రహ్మ-ఆదయః - బ్రహ్మగారు మొదలగువారు, అంజః - తేలికగా, న ప్రభవంతి - సమర్థులు కారు, సంస్త వనే - చక్కగా స్తుతించుటయందు, కిముత - సమర్థులు కారని వేరుగా చెప్పవలయునా?, వయం తు - మేమైతే, తత్-సర్గసర్గవిషయాః - ఆ బ్రహ్మగారి సృష్టియైన ప్రజాపతుల సృష్టిలోని వారము, అపి - అయిన నూ, శక్తిమాత్రమ్ - శక్తిని బట్టి చేసిన స్తోత్రము మాత్రమే.

అందువలన, కార్యకారణములకంటె మాయాశక్తి అతీతమైనది కాగా, నీవు మాయాశక్తికంటె అతీతుడవు. దేశకాలపరిచ్ఛేదములు లేని అట్టి నీయొక్క స్వరూపమును తెలియుటకు బ్రహ్మగారు మొదలగువారు సమర్థులు కారు. నిన్ను చక్కగా స్తుతించే సామర్థ్యము వారికి లేదని వేరుగా చెప్పవలయునా? మేమైతే ఆ బ్రహ్మగారిచే సృష్టించబడిన ప్రజాపతుల సృష్టిలోని వారము. (అట్టి మేము ఎట్లు స్తుతించగలము?) అయిననూ, మా శక్తిని బట్టి ఈ స్తోత్రమును చేయుచున్నాము.

ఏతత్పరం ప్రపశ్యామో న పరం తే మహేశ్వర ।
మృడనాయ హి లోకస్య వ్యక్తిస్తేఽవ్యక్తకర్మణః ॥ 35

మహేశ్వర - ఓ మహేశ్వరా!, పరమ్ - కేవలము, తే - నీయొక్క, ఏతత్ - ఈ రూపమును, ప్రపశ్యామః - చక్కగా చూచుచున్నాము, పరమ్ - దీనికి అతీతమైనదానిని, న - చూడలేము, హి - ఏలయనగా, అవ్యక్తకర్మణః - స్పష్టముగా తెలియని లీలలు గల, తే - నీకు, వ్యక్తిః - ప్రకటరూపము, లోకస్య - లోకముయొక్క, మృడనాయ - రక్షణ కొరకు.

ఓ మహేశ్వరా! మేము కేవలము నీయొక్క ఈ కళ్ల ముందు కనబడే రూపమును మాత్రమే చక్కగా చూడగలము. దీనికి అతీతమైన నీ స్వరూపమును మేము తెలియజాలము. నీ లీలల తత్త్వమును తెలియుట అసంభవము. కాని, నీవు లోకరక్షణ కొరకు మాత్రమే సగుణరూపమును స్వీకరించెదవు.

శ్రీశుక ఉవాచ ।
తద్వీక్ష్య వ్యసనం తాసాం కృపయా భృశపీడితః ।
సర్వభూతసుహృద్దేవ ఇదమాహ సతీం ప్రియామ్ ॥ 36

తాసామ్ - ఆ దేవతలయొక్క, తత్ - ఆ, వ్యసనమ్ - ఆపదను, వీక్ష్య - చూచి, కృపయా - దయచే, భృశపీడితః - మిక్కిలి పీడను పొందినవాడు, సర్వభూతసుహృత్ - సకలప్రాణులకు హితకారి అగు, దేవః - రుద్రదేవుడు, ప్రియామ్ - ప్రియురాలైన, సతీమ్ - సతీదేవిని ఉద్దేశించి, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఆ దేవతల ఆ ఆపదను చూచి రుద్రదేవుడు దయచే అధికమగు పీడను పొందెను. సకలప్రాణులకు హిత కారియగు ఆ దేవుడు ప్రియురాలగు సతీదేవితో నిట్లనెను.

శివ ఉవాచ ।
అహో బత భవాన్యేతత్ ప్రజానాం పశ్య వైశసమ్ ।
క్షీరోదమథనోద్భూతాత్ కాలకూటాదుపస్థితమ్ ।। 37

అహో - ఆహా!, బత - అయ్యో!, భవాని - ఓ పార్వతీ!, క్షీరమథన-ఉద్భూతాత్ - పాలసముద్రమును మథించుటనుండి పుట్టిన, కాలకూటాత్ - కాలకూట విషము వలన, ప్రజానామ్ - ప్రాణులకు, ఉపస్థితమ్ - వచ్చిపడిన, ఏతత్ - ఈ, వైశసమ్ - దుఃఖమును, పశ్య - చూడుము.

ఆహా! అయ్యో! ఓ భవానీ! పాలసముద్రమునుండి మథించగా పుట్టిన కాలకూట విషము వలన ప్రాణులకు వచ్చి పడిన ఈ దుఃఖమును చూడుము.

ఆసాం ప్రాణపరీప్సూనాం విధేయమభయం హి మే ।
ఏతావాన్ హి ప్రభోరర్థో యద్దీనపరిపాలనమ్ ।। 38

ప్రాణపరీప్సూనామ్ - ప్రాణములను రక్షించుకొనగోరే, ఆసామ్ - వీరికి, మే - నాచే, అభయమ్ - అభయము, విధేయమ్ - ఈయదగినది, హి - ఏలయనగా, ప్రభోః - ప్రభువుయొక్క, అర్థః - కర్తవ్యము, ఏతావాన్ హి - ఇంత మాత్రమే గదా!, యత్ - ఏదనగా, దీనపరిపాలనమ్ - దీనులను అన్ని విధములుగా కాపాడుట.

వీరు తమ ప్రాణములను నిలబెట్టుకొన గోరుచున్నారు. వీరికి ప్రభువునగు నేను వీరికి అభయమునిచ్చి రక్షించవలెను. ఎందుకంటే, దీనులను అన్ని విధములుగా కాపాడుట మాత్రమే ప్రభువునకు కర్తవ్యము.

ప్రాణైస్స్వైః ప్రాణినః పాంతి సాధవః క్షణభంగురైః ।
బద్ధవైరేషు భూతేషు మోహితేష్వాత్మమాయయా ।। 39

ఆత్మమాయయా - నా మాయాశక్తిచే, మోహితేషు - వ్యామోహితులై, భూతేషు - ప్రాణులు, బద్ధవైరేషు - దృఢమగు వైరము గలవారై ఉండగా, సాధవః - సత్పురుషులు, క్షణభంగురైః - క్షణములో వినష్టమయ్యే, స్వైః - తమ, ప్రాణైః - ప్రాణములతో, ప్రాణినః - ప్రాణులను, పాంతి - కాపాడెదరు.

నా మాయాశక్తిచే వ్యామోహితులైన జనులు పరస్పరము దృఢమగు వైరమును కలిగియుందురు. కాని, ప్రాణములు క్షణములో వినష్టమగునని సత్పురుషులకు ఎరుకయే. వారు తమ ప్రాణములనొడ్డి ఇతరప్రాణులను కాపాడెదరు.

పుంసః కృపయతో భద్రే సర్వాత్మా ప్రీయతే హరిః ।
ప్రీతే హరౌ భగవతి ప్రీయేఽహం సచరాచరః ।
తస్మాదిదం గరం భుంజే ప్రజానాం స్వస్తిరస్తు మే ॥ 40

భద్రే - కల్యాణీ!, కృపయతః - దయను చూపే, పుంసః - వ్యక్తికి, సర్వ-ఆత్మా - సర్వమునకు ఆత్మయగు, హరిః - శ్రీహరి, ప్రీయతే - ప్రసన్నుడగును, భగవతి హరౌ - శ్రీహరి భగవానుడు, ప్రీతౌ - ప్రసన్నుడు కాగా, సచర-అచరః - కదిలే కదలని ప్రాణులతో గూడిన, అహమ్ - నేను, ప్రీయే - ప్రసన్నుడ నగుదును, తస్మాత్ - అందువలన, ఇదమ్ - ఈ, గరమ్ - విషమును, భుంజే - భక్షించెదను, మే - నా (వలన), ప్రజానామ్ - ప్రాణులకు, స్వస్తిః - మంగళము, అస్తు - కలుగు గాక!

ఓ కల్యాణీ! ప్రాణులపై దయను చూపే వ్యక్తి యెడల శ్రీహరి భగవానుడు ప్రసన్నుడగును. ఆయన ప్రసన్నుడైనచో, కదిలే మరియు కదలని ప్రాణులతో గూడియున్న జగత్తుతో సహా నేను కూడ ప్రసన్నుడవగుదును. కావున, నేనీ విషమును భక్షించెదను. నా వలన నా ప్రజలకు మంగళము కలుగు గాక!

శ్రీశుక ఉవాచ ।
ఏవమామంత్ర్య భగవాన్ భవానీం విశ్వభావనః ।
తద్విషం జగ్ధుమారేభే ప్రభావజ్ఞాఽన్వమోదత ॥ 41

విశ్వభావనః - జగత్తును కాపాడే, భగవాన్ - రుద్ర భగవానుడు, ఏవమ్ - ఈ విధముగా, భవానీమ్ - పార్వతిని, అమంత్ర్య - ఒప్పించి, తత్ - ఆ, విషమ్ - విషమును, జగ్ధుమ్ - భక్షించుటకు, ఆరేభే - ఆరంభించెను, ప్రభావజ్ఞా - ఆయన మహిమను ఎరింగిన పార్వతి, అన్వమోదత - అంగీకరించెను.

జగత్తును కాపాడే రుద్ర భగవానుడు ఈ విధముగా పార్వతిని ఒప్పించి, విషమును భక్షించుటకారంభించెను. ఆమెకు ఆయన మహిమ ఎరుకయే. కావుననే, ఆమె అంగీకరించెను.

తతః కరతలీకృత్య వ్యాపి హాలాహలం విషమ్ ।
అభక్షయన్మహాదేవః కృపయా భూతభావనః ।। 42

తతః - తరువాత, భూతభావనః - ప్రాణులను కాపాడే, మహాదేవః - మహాదేవుడు, వ్యాపి - వ్యాపించుచున్న, హాలాహలం విషమ్ - హాలాహల విషమును, కృపయా - దయతో, కరతలీకృత్య - అరచేతియందు చిక్కబట్టి, అభక్షయత్ - భక్షించెను.

తరువాత ప్రాణులను కాపాడే మహాదేవుడు వ్యాపించుచున్న హాలాహల విషమును దయతో అరచేతిలో చిక్కబట్టి భక్షించెను.

తస్యాపి దర్శయామాస స్వవీర్యం జలకల్మషః ।
యచ్చకార గలే నీలం తచ్చ సాధోర్విభూషణమ్ ।। 43

జలకల్మషః - నీటినుండి పుట్టిన కాలుష్యమగు విషము, తస్య అపి - ఆ రుద్రునకు కూడ, స్వవీర్యమ్ - తన శక్తిని, దర్శయామాస - చూపించెను, యత్ - ఏదనగా, గలే - కంఠమునందు, నీలమ్ - నల్లని రంగును, చకార - చేసెను, తత్ చ - అదియైననూ, సాధోః - సత్పురుషునకు, విభూషణమ్ - అలంకారమే.

నీటినుండి పుట్టిన కాలుష్యమైన ఆ విషము తన శక్తిని ఆయనకు కూడ చూపించెను. అది యేదన, ఆయన కంఠము నల్లగా ఆయెను. లోకోపకారకుడగు ఆయనకు అది కూడ అలంకారమే ఆయెను.

తప్యంతే లోకతాపేన సాధవః ప్రాయశో జనాః ।
పరమారాధనం తద్ధి పురుషస్యాఖిలాత్మనః ।। 44

సాధవః - పరోపకారులగు, జనాః - జనులు, ప్రాయశః - తరచుగా, లోకతాపేన - జనుల దుఃఖముచే, తప్యంతే - దుఃఖమును పొందెదరు, హి - ఏలయనగా, తత్ - అది, అఖిల-ఆత్మనః - సర్వమునకు ఆత్మరూపుడైన, పురుషస్య - పురుషోత్తమునకు, పరమ్ - సర్వోత్కృష్టమగు, ఆరాధనమ్ - పూజ.

పరోపకారులగు జనులు తరచుగా జనుల దుఃఖమును చూసి తాము దుఃఖమును పొందెదరు. ఎందుకంటే, పురుషోత్తముడు సర్వప్రాణులలో ఆత్మరూపుడై యున్నాడు. కావున, పరోపకారమే ఆయనకు చేసే పూజలలోకెల్లా ఉత్తమమైనది.

నిశమ్య కర్మ తచ్ఛంభోర్దేవదేవస్య మీఢుషః ।
ప్రజా దాక్షాయణీ బ్రహ్మ వైకుంఠశ్చ శశంసిరే ।। 45

దేవదేవస్య - దేవదేవుడైనట్టియు, మీఢుషః - మనోరథములను వర్షించే, శంభోః - శంభునియొక్క, తత్ - ఆ, కర్మ - పనిని, నిశమ్య - చూచి, ప్రజాః - ప్రజలు, దాక్షాయణీ - దక్షుని కుమార్తెయగు సతీదేవి, బ్రహ్మ - బ్రహ్మగారు, వైకుంఠః చ - శ్రీహరి కూడ, శశంసిరే - ప్రశంసించిరి.

శంభుడు భక్తులకు మనోరథములను వర్షించే దేవదేవుడు. ఆయన చేసిన ఆ పనిని చూచి ప్రజలు, దక్షపుత్రికయగు సతీదేవి, బ్రహ్మగారు, శ్రీహరి కూడ ప్రశంసించిరి.

ప్రస్కన్నం పిబతః పాణేర్యత్కించిజ్జగృహుస్స్మ తత్ ।
వృశ్చికాహివిషౌషధ్యో దందశూకాశ్చ యేఽపరే ।। 46

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే సముద్రమథన
వృత్తాంతే శివేన విషభక్షణం నామ సప్తమోఽధ్యాయః ।।

పిబతః - త్రాగుచున్న రుద్రునియొక్క, పాణేః - చేతినుండి, ప్రస్కన్నమ్ - జారిన, కించిత్ - కొంచెము, యత్ - ఏది గలదో, తత్ - దానిని, వృశ్చిక-అహివిష-ఓషధ్యః - తేళ్లు పాములు విషపు మొక్కలు, దందశూకాః - త్రాచుపాములు, అపరే - ఇతరములగు, యే చ - ఏ విషప్రాణులు గలవో అవి కూడ, జగృహుః స్మ - స్వీకరించినవి.

విషమును రుద్రుడు త్రాగుచుండగా ఆయన చేతినుండి కొన్ని చుక్కలు జారి క్రింద పడినవి. వాటిని తేళ్లు, త్రాచుపాములు, ఇతర విషసర్పములు, ఇతరములైన విషప్రాణులు, విషపు మొక్కలు కూడ గ్రహించినవి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
సముద్ర మథన వృత్తాంతములో రుద్రుడు విషమును భక్షించి జగత్తును
కాపాడుటను వర్ణించే ఏడవ అధ్యాయము ముగిసినది (7) .

*****

# అథ అష్టమోఽధ్యాయః

## సముద్ర మథనము - లక్ష్మి, ధన్వంతరుల ఆవిర్భావము

శ్రీశుక ఉవాచ ।
పీతే గరే వృషాంకేణ ప్రీతాస్తేఽమరదానవాః ।
మమంథుస్తరసా సింధుం హవిర్ధానీ తతోఽభవత్ ॥ 1

వృషాంకేణ - ధ్వజముపై వృషభము చిహ్నముగా ఉండే రుద్రుని చే, గరే - విషము, పీతే - పానము చేయబడగా, ప్రీతాః - ప్రీతిని పొందిన, తే - ఆ, అమరదానవాః - దేవతలు రాక్షసులు, తరసా - బలముగా, సింధుమ్ - సముద్రమును, మమంథుః - మథించిరి, తతః - దాని వలన, హవిర్ధానీ - కామధేనువు, అభవత్ - పుట్టెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- రుద్రుని ధ్వజముపై వృష భము చిహ్నముగా నుండును. ఆయన విషమును త్రాగగా, దేవతలు రాక్ష సులు ప్రీతిని పొందిరి. వారు వేగముగా సముద్రమును మథించిరి. ఆ మథ నము వలన కామధేనువు పుట్టెను.

తామగ్నిహోత్రీమృషయో జగృహుర్బ్రహ్మవాదినః ।
యజ్ఞస్య దేవయానస్య మేధ్యాయ హవిషే నృప ॥ 2

నృప - ఓ మహారాజా!, బ్రహ్మవాదినః - వేదవేత్తలగు, ఋషయః - మహర్షులు, అగ్నిహోత్రీమ్ - అగ్నిహోత్రమునకు సాధనమైన, తామ్ - ఆ కామధేనువును, దేవయానస్య - సత్యలోకమును పొందించే సాధనమైన, యజ్ఞస్య - యజ్ఞమునకు, మేధ్యాయ - పవిత్రమైన, హవిషే - హవిస్సు కొరకు, జగృహుః - స్వీకరించిరి.

ఓ మహారాజా! సత్యలోకమును సిద్ధింపజేసే యజ్ఞమును చేయుటకు, నిత్యాగ్నిహోత్రమునకు కూడ పవిత్రమగు హవిస్సు ఆవశ్యకము. పాల ద్వారా అట్టి హవిస్సును సమకూర్చే ఆ కామధేనువును వేదవేత్తలైన మహర్షులు స్వీకరించిరి.

తత ఉచ్చైశ్శ్రవా నామ హయోఽభూచ్చంద్రపాండురః ।
తస్మిన్ బలిస్స్పృహాం చక్రే నేంద్ర ఈశ్వరశిక్షయా ॥ 3

**తతః** - తరువాత, ఉచ్చైశ్శ్రవాః నామ - ఉచ్చైశ్శ్రవసము అని ప్రసిద్ధి గాంచినది, చంద్రపాండురః - చంద్రుని వలె తెల్లనైనది అగు, హయః - గుర్రము, అభూత్ - పుట్టెను, తస్మిన్ - దానియందు, బలిః - బలి, స్పృహామ్ - ఇచ్ఛను, చక్రే - చేసెను, ఈశ్వరశిక్షయా - శ్రీహరి యొక్క శిక్షణచే, ఇంద్రః - ఇంద్రుడు, న - కోరలేదు.

తరువాత ఉచ్చైశ్శ్రవసమని ప్రసిద్ధి గాంచిన గుర్రము పుట్టెను. అది చంద్రుని వలె తెల్లగా మెరియుచుండెను. బలి దానిపై మనసు పడెను. శ్రీహరి ముందే శిక్షణనిచ్చియుండుటచే ఇంద్రుడు దానిని కోరలేదు.

తత ఐరావతో నామ వారణేంద్రో వినిర్గతః ।
దంతైశ్చతుర్భిశ్శ్వేతాద్రేర్హరన్ భగవతో మహిమ్ ॥ 4

**తతః** - తరువాత, ఐరావతః నామ - ఐరావతమని ప్రసిద్ధి గాంచిన, వారణ-ఇంద్రః - గొప్ప ఏనుగు, చతుర్భిః - నాలుగు, దంతైః - దంతములతో, భగవతః - రుద్ర భగవానుని, శ్వేత-అద్రేః - తెల్లని పర్వతము యొక్క, మహిమ్ - మహిమను, హరన్ - అపహరించుచున్నదై, వినిర్గతః - బయటకు వచ్చెను.

తరువాత ఐరావతమని ప్రసిద్ధి గాంచిన గొప్ప ఏనుగు పుట్టెను. నాలుగు తెల్లని దంతములు గల ఆ ఏనుగు రుద్ర భగవానుని తెల్లని కైలాస పర్వతముయొక్క మహిమను అపహరించుచుండెను.

కౌస్తుభాఖ్యమభూద్రత్నం పద్మరాగో మహోదధేః ।
తస్మిన్ హరిస్స్పృహాం చక్రే వక్షోఽలంకరణే మణౌ ॥ 5

మహా-ఉదధేః - గొప్ప సముద్రమునుండి, కౌస్తుభ-ఆఖ్యమ్ - కౌస్తుభమనే పేరు గల, పద్మరాగః - పద్మరాగము అనే, రత్నమ్ - రత్నము, అభూత్ - పుట్టెను, హరిః - శ్రీహరి, వక్షః-అలంకరణే - వక్షఃస్థలమునకు అలంకారముగానుండే, మణౌ - మణియందు, స్పృహామ్ - ఇచ్ఛను, చక్రే - చేసెను.

ఆ మహాసముద్రమునుండి కౌస్తుభమనే పేరు గల పద్మరాగమణి పుట్టెను. తన వక్షఃస్థలమునకు అలంకారముగా నుండుననే భావనతో శ్రీహరి ఆ మణిపై మనసు పడెను.

**తతోఽభవత్పారిజాతస్సురలోకవిభూషణమ్ ।**
**పూరయత్యర్థినో యోఽర్థైశ్శశ్వద్భువి యథా భవాన్ ॥ 6**

**తతః** - తరువాత, సురలోకవిభూషణమ్ - దేవలోకమునకు అలంకారమైన, పారిజాతః - కల్పవృక్షము, అభవత్ - పుట్టెను, యః - ఏదైతే, భువి - భూలోకమునందు, భవాన్ యథా - నీ వలెనే, అర్థినః - కోరువారిని, అర్థైః - భోగ్యవస్తువులతో, శశ్వత్ - అన్ని కాలములయందు, పూరయతి - పూర్ణము చేయునో.

తరువాత దేవలోకమునకు అలంకారమైన కల్పవృక్షము పుట్టెను. భూలోకములో నీవు (పరీక్షిత్తు) వలెనే, ఆ వృక్షము కోరువారి కోరికలను సర్వకాలములలో పూర్తి చేయుచుండును.

**తతశ్చాప్సరసో జాతా నిష్కకంఠ్యస్సువాససః ।**
**రమణ్యస్స్వర్గిణాం వల్గుగతిలీలావలోకనైః ॥ 7**

**తతః** - తరువాత, నిష్కకంఠ్యః - పతకము కంఠమునందు గలవారు, సువాససః - చక్కని వస్త్రములు గలవారు అగు, అప్సరసః చ - అప్సరసలు కూడ, జాతాః - పుట్టిరి, స్వర్గిణామ్ - స్వర్గలోకవాసులకు, వల్గుగతి లీలా-అవలోకనైః - మనోహరమగు నడకలతో విలాసపు చూపులతో, రమణ్యః - రమింప జేయువారు.

తరువాత కంఠమునందు పతకములను, చక్కని వస్త్రములను ధరించిన అప్సరసలు కూడ పుట్టిరి. వారు తమ మనోహరమగు నడకలతో, విలాసపు చూపులతో స్వర్గవాసులను రంజింప జేయుదురు.

తతశ్చావిరభూత్సాక్షాచ్ఛ్రీ రమా భగవత్పరా ।
రంజయంతీ దిశః కాంత్యా విద్యుత్సౌదామనీ యథా ॥ 8

తతః చ - తరువాత, సాక్షాత్ - సాక్షాత్తుగా, భగవత్-పరా - శ్రీహరి భగవానునియందు పూర్ణమైన అనురాగము గలది, రమా - రంజింప జేయునది అగు, శ్రీః - లక్ష్మీదేవి, కాంత్యా - కాంతితో, దిశః - దిక్కులను, రంజయంతీ - ప్రకాశింప జేయుచున్నదై, సౌదామనీ - పర్వత శిఖరమునందు మెరిసే, విద్యుత్ యథా - మెరుపు వలె, ఆవిరభూత్ - ఆవిర్భవించెను.

తరువాత సాక్షాత్తుగా లక్ష్మీదేవి, పర్వతశిఖరముపై మెరిసే మెరుపు వలె, దిక్కులను తన కాంతిచే ప్రకాశింప జేయుచూ ఆవిర్భవించెను. ఆమె శ్రీహరి భగవానునియందు పూర్ణమగు అనురాగము గలదియై ఆయనను రంజింపజేయును.

తస్యాం చక్రుస్స్పృహాం సర్వే ససురాసురమానవాః ।
రూపౌదార్యవయోవర్ణమహిమాక్షిప్తచేతసః ॥ 9

ససుర-అసురమానవాః - దేవతలు రాక్షసులు మానవులతో సహా, సర్వే - అందరు, రూప-ఔదార్యవయః-వర్ణమహిమా-ఆక్షిప్తచేతసః - రూపము ఔదార్యము యౌవనము రంగుల గొప్పదనముచే ఆకర్షించబడిన మనస్సులు గలవారై, తస్యామ్ - ఆమెయందు, స్పృహామ్ - ఇచ్ఛను, చక్రుః - చేసిరి.

దేవతలు, రాక్షసులు, మానవులతో సహా అందరు ఆ లక్ష్మీదేవిని కోరిరి. వారి మనస్సులు ఆమెయొక్క రూపము, ఔదార్యము, యౌవనము, రంగుల గొప్పదనముచే ఆకర్షించబడెను.

తస్యా ఆసనమానిన్యే మహేంద్రో మహదద్భుతమ్ ।
మూర్తిమత్యస్సరిచ్ఛ్రేష్ఠా హేమకుంభైర్జలం శుచి ॥ 10

తస్యాః - ఆమెకు, మహేంద్రః - మహేంద్రుడు, మహత్ - పెద్ద, అద్భుతమ్ - ఆశ్చర్యమును కలిగించే, ఆసనమ్ - ఆసనమును, ఆనిన్యే - తీసుకువచ్చెను, మూర్తిమత్యః - రూపు దాల్చిన, సరిత్-శ్రేష్ఠాః - గొప్ప నదులు, హేమకుంభైః - బంగరు కడవలతో, శుచి - స్వచ్ఛమైన, జలమ్ - నీటిని.

ఆమెకు మహేంద్రుడు ఆశ్చర్యమును కలిగించే పెద్ద ఆసనమును తీసుకురాగా, రూపు దాల్చిన గొప్ప నదులు బంగరు కడవలతో స్వచ్ఛమగు నీటిని తెచ్చిరి.

అభిషేచనికా భూమిరాహరత్సకలౌషధీః ।
గావః పంచ పవిత్రాణి వసంతో మధుమాధవౌ ॥ 11

భూమిః - భూమి, అభిషేచనికాః - అభిషేకమునకు వినియోగించే, సకల-ఓషధీః - సకలములైన మొక్కలను, ఆహరత్ - తీసుకు వచ్చెను, గావః - ఆవులు, పంచ - అయిదు, పవిత్రాణి - పావనము చేసే పదార్థములను, వసంతః - వసంతుడు, మధుమాధవౌ - చైత్రవైశాఖముల యందలి పుష్పములను పళ్లను.

భూమి అభిషేకమునకు వినియోగించే మొక్కలనన్నింటినీ, ఆవులు పావనము చేసే పంచగవ్యములను, వసంతుడు (ఋతువునకు అధిదేవత) చైత్రవైశాఖమాసములకు చెందిన పుష్పములను, పళ్లను సమకూర్చిరి.

ఋషయః కల్పయాంచక్రురభిషేకం యథావిధి ।
జగుర్భద్రాణి గంధర్వా నట్యశ్చ ననృతుర్జగుః ॥ 12

ఋషయః - మహర్షులు, యథావిధి - యథావిధిగా, అభిషేకమ్ - అభిషేకమును, కల్పయాంచక్రుః - ఏర్పాటు చేసిరి, గంధర్వాః - గంధ

ర్వులు, భద్రాణి - మంగళములను, జగుః - గానము చేసిరి, నట్యః చ - నటస్త్రీలు కూడ, ననృతుః - నాట్యమును చేసిరి, జగుః - గానము చేసిరి.

మహర్షులు యథావిధిగా అభిషేకమును సంపన్నము చేసిరి. గంధర్వులు మంగళసంగీతమును గానము చేసిరి. నటస్త్రీలు పాటలను పాడుతూ నాట్యమును చేసిరి.

మేఘా మృదంగపణవమురజానకగోముఖాన్ ।
వ్యానాదయన్ శంఖవేణువీణాస్తుములనిస్స్వనాన్ ॥ 13

మేఘాః - మేఘములు, తుములనిస్స్వనాన్ - సంకులమగు ధ్వనిని చేసే, మృదంగపణవమురజ-ఆనకగోముఖాన్ - డోళ్లను తప్పెట్లను మద్దెళ్లను భేరీలను కొమ్ము బూరాలను, శంఖవేణువీణాః - శంఖములను వేణువులను వీణలను, వ్యానాదయన్ - మ్రోగించిరి.

మేఘాధిష్ఠాన దేవతలు సంకులమగు ధ్వనిని చేసే డోళ్లను, తప్పెట్లను, మద్దెళ్లను, భేరీలను, కొమ్ము బూరాలను, శంఖములను, వేణువులను, వీణలను మ్రోగించిరి.

తతోఽభిషిషిచుర్దేవీం శ్రియం పద్మకరాం సతీమ్ ।
దిగిభాః పూర్ణకలశైస్సూక్తవాక్యైర్ద్విజేరితైః ॥ 14

తతః - తరువాత, దిగ్-ఇభాః - దిగ్గజములు, పద్మకరామ్ - పద్మము చేతియందున్నట్టియు, సతీమ్ - పతివ్రతయగు, దేవీం శ్రియమ్ - లక్ష్మీదేవిని, పూర్ణకలశైః - పూర్ణకుంభములతో, ద్విజ-ఈరితైః - వేదవేత్తలచే పఠించబడిన, సూక్తవాక్యైః - అభిషేక మంత్రములతో, అభిషిషిచుః - అభిషేకించిరి.

తరువాత దిగ్గజములు పతివ్రతయగు లక్ష్మీదేవి చేతిలో పద్మమును పట్టుకొనియుండగా, వేదవేత్తలు అభిషేకమంత్రములను పఠించుచుండగా, పూర్ణకుంభములతో ఆమెను అభిషేకించినవి.

సముద్రః పీతకౌశేయవాససీ సముపాహరత్ ।
వరుణస్స్రజం వైజయంతీం మధునా మత్తషట్పదామ్ ॥15

సముద్రః - సముద్రుడు, పీతకౌశేయవాససీ - పచ్చని పట్టువస్త్రముల జంటను, వరుణః - వరుణుడు, మధునా - తేనెచే, మత్తషట్పదామ్ - మదించిన తుమ్మెదలు గల, వైజయంతీమ్ - వైజయంతి అనే, స్రజమ్ - మాలను, సముపాహరత్ - బహుమతిగా నిచ్చెను.

సముద్రుడు పచ్చని పట్టు వస్త్రముల జంటను, వరుణుడు వైజయంతి అనే పుష్పమాలను ఇచ్చెను. ఆ పుష్పములలోని తేనెచే మత్తెక్కిన తుమ్మెదలు ఆ మాలను చుట్టువారి యుండెను.

భూషణాని విచిత్రాణి విశ్వకర్మా ప్రజాపతిః ।
హారం సరస్వతీ పద్మమజో నాగాశ్చ కుండలే ॥ 16

విశ్వకర్మా ప్రజాపతిః - విశ్వకర్మ ప్రజాపతి, విచిత్రాణి - రంగురంగుల, భూషణాని - ఆభరణములను, సరస్వతీ - సరస్వతి, హారమ్ - హారమును, అజః - స్వయంభువుడగు బ్రహ్మగారు, పద్మమ్ - పద్మమును, నాగాః చ - నాగులు కూడ, కుండలే - కుండలముల జతను.

విశ్వకర్మ ప్రజాపతి రంగురంగుల ఆభరణములను, సరస్వతి హారమును, స్వయంభువుడగు బ్రహ్మగారు పద్మమును, నాగులు కుండలముల జతను సమర్పించిరి.

తతః కృతస్వస్త్యయనోత్పలస్రజం
నదద్ద్విరేఫాం పరిగృహ్య పాణినా ।
చచాల వక్త్రం సుకపోలకుండలం
సవ్రీడహాసం దధతీ సుశోభనమ్ ॥ 17

తతః - తరువాత, కృతస్వస్త్యయనా - చేయబడిన స్వస్తివాచనము కలిగిన లక్ష్మీదేవి, నదద్-ద్విరేఫామ్ - ధ్వనించుచున్న తుమ్మెదలు గల, ఉత్పలస్రజమ్ - కలువల మాలను, పాణినా - చేతితో, పరిగృహ్య - పట్టుకొని, సుకపోలకుండలమ్ - చక్కని చెక్కిళ్లు కుండలములు కలిగినట్టి

యు, సవ్రీడహాసమ్ - సిగ్గుతో చిరునవ్వుతో కూడినట్టియు, సుశోభనమ్ - మిక్కిలి శోభిల్లే, వక్త్రమ్ - ముఖమును, దధతీ - కలిగియున్నదై, చచాల - ముందుకు నడిచెను.

వేదవేత్తలు స్వస్తివాచనమును పఠించిన తరువాత లక్ష్మీదేవి చేతిలో ఒక కలువల మాలను పట్టుకొని ముందుకు నడిచెను. ఆ మాల చుట్టూ తుమ్మెదలు ధ్వనించుచుండెను. చక్కని చెక్కిళ్లు గల ఆమె ముఖము కుండలముతో చాల శోభిల్లుచుండెను. ఆమె సిగ్గుతో చిరునవ్వు నవ్వుచుండెను.

స్తనద్వయం చాతికృశోదరీ సమం
నిరంతరం చందనకుంకుమోక్షితమ్ ।
తతస్తతో నూపురవల్గుశింజితైః
విసర్పతీ హేమలతేవ సా బభౌ ।। 18

అతికృశ-ఉదరీ - మిక్కిలి చిక్కిన నడుము గలది, సమమ్ - సమానమైనట్టియు, నిరంతరమ్ - అంతరాళము లేనట్టియు, చందనకుంకుమ-ఉక్షితమ్ - గంధము కుంకుమ అలదబడిన, స్తనద్వయమ్ - పాలిండ్ల జంటను (కలిగియున్నది), నూపురవల్గుశింజితైః - కాలియందెల మనోహరములైన ధ్వనులతో, తతః తతః - అటునటు, విసర్పతీ - వెళ్లుచున్న, సా - ఆ లక్ష్మి, హేమలతా ఇవ - బంగరు తీగవలె, బభౌ - ప్రకాశించెను.

మిక్కిలి చిక్కిన నడుముగల ఆ లక్ష్మీదేవి సమమైన అంతరాళము లేని పాలిండ్ల జంటపై గంధమును కుంకుమను అలముకొని యుండెను. ఆమె అటునటు నడయాడుచుండగా కాలియందెల ధ్వనులు మనస్సును హరించుచుండెను. ఆమె నడయాడే బంగరు తీగవలె ప్రకాశించెను.

విలోకయంతీ నిరవద్యమాత్మనః
పదం ధ్రువం చావ్యభిచారిసద్గుణమ్ ।
గంధర్వయక్షాసురసిద్ధచారణ-
త్రైవిష్టపేయాదిషు నాన్వవిందత ।। 19

ఆత్మనః - తనకు, నిరవద్యమ్ - దోషములు లేనట్టియు, ధ్రువమ్ - శాశ్వతమైనట్టియు, అవ్యభిచారిసద్-గుణమ్ - ఏ కాలమునందైననూ తొలగిపోని ఉత్తమగుణములు గల, పదమ్ - ఆశ్రయమును గురించి, విలోకయంతీ - చూచుచున్నదై, గంధర్వయక్ష-అసురసిద్ధచారణత్రైవిష్టపేయ-ఆదిషు - గంధర్వులు యక్షులు రాక్షసులు సిద్ధులు చారణులు మరియు స్వర్గలోకవాసులగు దేవతలు మొదలగువారియందు, న అన్వవిందత - పొందలేదు.

తనకు దోషములు లేనిది, శాశ్వతమైనది, ఏ కాలమునందైననూ తొలగిపోని సద్గుణములు గలది అగు ఆశ్రయము (భర్త) ను గురించి ఆ లక్ష్మీదేవి చూచుచుండెను. గంధర్వులు, యక్షులు, సిద్ధులు, చారణులు, స్వర్గలోకవాసులగు దేవతలు మొదలగువారిలో ఆమెకు అట్టి భర్త లభించలేదు.

నూనం తపో యస్య న మన్యునిర్జయో
జ్ఞానం క్వచిత్తచ్చ న సంగవర్జితమ్ ।
కశ్చిన్మహాంస్తస్య న కామనిర్జయః
స ఈశ్వరః కిం పరతోవ్యపాశ్రయః ॥ 20

యస్య - ఎవనికైతే, నూనమ్ - నిశ్చయముగా, తపః - తపస్సు గలదో వానికి, మన్యునిర్జయః - కోపముపై విజయము, న - లేదు, క్వచిత్ చ - ఒకనియందు, జ్ఞానమ్ - పాండిత్యము, సంగవర్జితమ్ - అసక్తి లేనిది, న - కాదు, కశ్చిత్ - ఒకానొకడు, మహాన్ - గొప్పవాడు, తస్య - వానికి, కామనిర్జయః - కామముపై విజయము, న - లేదు, పరతః-వ్యపాశ్రయః - ఇతరులనుండి అపేక్ష గలవాడు, సః - అట్టి వ్యక్తి, ఈశ్వరః - ప్రభుడు, కిమ్ - అగునా యేమి? (కాదు).

ఒకడు నిశ్చయముగా గొప్ప తపశ్శాలియే. కాని, వానికి కోపముపై విజయము లేదు. మరియొకడు పండితుడే. కాని, వానికి సంసారాసక్తి మెండు. మరియొకడు గొప్పవాడే. కాని, వానికి కామముపై విజయము లేదు. ఐశ్వర్యము గలవాడైననూ ఇతరులనుండి ఏదో ఒకదాని

కొరకై ఇతరులను ఆశ్రయించే వ్యక్తి సర్వస్వతంత్రుడు కాగల్గునా? (కాలే డు).

ధర్మః క్వచిత్తత్ర న భూతసౌహృదం
త్యాగః క్వచిత్తత్ర న ముక్తికారణమ్ ।
వీర్యం న పుంసోఽస్త్యజవేగనిష్కృతం
న హి ద్వితీయో గుణసంగవర్జితః ॥ 21

క్వచిత్ - ఒకనియందు, ధర్మః - ధర్మము, తత్ర - వానియందు, భూతసౌహృదమ్ - ప్రాణులయందు ప్రేమ, న - లేదు, క్వచిత్ - ఒకానొక నియందు, త్యాగః - దానము, తత్ర - వానియందు, ముక్తికారణమ్ - మోక్షమునకు హేతువు, న - కాదు, పుంసః - వ్యక్తికి, వీర్యమ్ - బలము, అస్తి - కలదు, అజవేగనిష్కృతమ్ - కాలముయొక్క వేగమునుండి బయట పడినది, న - కాదు, గుణసంగవర్జితః - త్రిగుణకార్యమగు జగత్తు నందలి ఆసక్తి లేనివాడు, ద్వితీయః - రెండవవాడు, న హి - లేదు గదా!

ఒకనియందు ధర్మమున్నది. కాని, వానికి ప్రాణులయందు ప్రేమ లేదు. మరియొకనియందు త్యాగము గలదు. కాని, ఆ త్యాగము మోక్షహే తువు కాదు. ఒక వ్యక్తికి బలము ఉన్నది. కాని, వాని ఆ బలము కాలము యొక్క వేగములో నిలిచేది కాదు. ఒకవికి త్రిగుణకార్యమగు జగత్తునందు ఆసక్తి లేదు. కాని, అతడు సర్వదా రెండవది లేని సమాధిలో నుండును.

క్వచిచ్చిరాయుర్న హి శీలమంగలం
క్వచిత్తదప్యస్తి న వేద్యమాయుషః ।
యత్రోభయం కుత్ర చ సోఽప్యమంగలః
సుమంగలః కశ్చ న కాంక్షతే హి మామ్ ॥ 22

క్వచిత్ - ఒకనియందు, చిర-ఆయుః - దీర్ఘమగు ఆయుర్దాయ ము, హి - కాని, శీలమంగలమ్ - శీలము మంగళప్రదము, న - కాదు, క్వచిత్ - మరియొకనియందు, తత్ అపి - అది కూడ, అస్తి - ఉన్నది, ఆయుషః - ఆయుర్దాయమునకు, వేద్యమ్ - తెలియదగినది, న - లేదు,

యత్ర కుత్ర చ - ఎవడో ఒకనియందు, ఉభయమ్ - రెండు ఉన్నవో, సః అపి - అట్టి వ్యక్తి కూడ, అమంగలః - మంగళము కాని వేషము గలవాడు, కశ్చ - ఒకానొకడు, సుమంగలః - సకలకల్యాణగుణములు గలవాడు, మామ్ - నన్ను, న కాంక్షతే హి - కోరుట లేదు గదా!

ఒకనియందు దీర్ఘాయుర్దాయమున్నది. కాని, మంగళప్రదమైన శీలము లేదు. మరియొకనియందు మంగళకరమగు శీలము కూడ గలదు. కాని, వాని ఆయుర్దాయమును గురించి తెలియకపోవుటయే మంచిది. ఒకానొకని (శివుడు) యందు ఈ రెండు గలవు. కాని వాని వేషము అమంగళకరము. ఒకానొకడు (శ్రీహరి) సకలకల్యాణగుణములు గలవాడే. కాని, అతడు నన్ను కోరుటనే లేదు.

ఏవం విమృశ్యావ్యభిచారిసద్గుణైః
వరం నిజైకాశ్రయతయాऽగుణాశ్రయమ్ ।
వవ్రే వరం సర్వగుణైరపేక్షితం
రమా ముకుందం నిరపేక్షమీప్సితమ్ ॥ 23

ఏవమ్ - ఈ విధముగా, విమృశ్య - పరిశీలించి చూచి, రమా - లక్ష్మీదేవి, అవ్యభిచారిసద్-గుణైః - సర్వకాలములయందు కొనసాగే సద్గుణములచే, నిజ-ఏక-ఆశ్రయతయా - తన స్వరూపము మాత్రమే ఏకాంతమైన ఆశ్రయముగా నుండుటచే, అగుణ-ఆశ్రయమ్ - త్రిగుణాత్మకమగు జగత్తునందు ఆశ్రయము లేనట్టియు, వరమ్ - శ్రేష్ఠుడైనట్టియు, సర్వగుణైః - సకలసిద్ధులచే, అపేక్షితమ్ - అర్థించబడునట్టియు, నిరపేక్షమ్ - సిద్ధులయందు అపేక్ష లేనట్టియు, ఈప్సితమ్ - కోరబడిన, ముకుందమ్ - మోక్షప్రదాతయగు శ్రీహరిని, వవ్రే - వరించెను.

ఈ విధముగా విచారించి లక్ష్మీదేవి శ్రేష్ఠుడైన మోక్షప్రదాతయగు శ్రీహరిని వరించెను. ఆయనయందు సకలసద్గుణములు సర్వకాలములలో నుండును. ఆయన తన స్వరూపమునందు మాత్రమే ఆశ్రయము గలవాడగుటచే త్రిగుణకార్యమగు జగత్తునందు ఆయనకు ఆశ్రయము లేదు (అనగా, ఆనందము కొరకై జగత్తుపై ఆధారపడువాడు కాదు). అణిమ మొద

లైన సకలసిద్ధులు ఆయనను ప్రార్థించినమా, ఆయనకు వాటి అపేక్ష లేదు. కావుననే, ఆయన లక్ష్మీదేవికి కోరదగినవాడు ఆయెను.

తస్యాంసదేశ ఉశతీం నవకంజమాలాం
మాద్యన్మధువ్రతవరూథగిరోపఘుష్టామ్ ।
తస్థౌ నిధాయ నికటే తదురస్స్వధామ
సవ్రీడహాసవికసన్నయనేన యాతా ॥ 24

తస్య - ఆ శ్రీహరియొక్క, అంసదేశే - భుజస్థానమునందు, ఉశతీమ్ - సుందరమైనట్టియు, మాద్యత్-మధువ్రతవరూథగిరా - మత్తెక్కిన తుమ్మెదల సమూహముయొక్క ధ్వనిచే, ఉపఘుష్టామ్ - ధ్వనించుచున్న, నవకంజమాలామ్ - కొంగ్రొత్త కమలముల మాలను, నిధాయ - వేసి, సవ్రీడహాసవికసత్-నయనేన - సిగ్గుతో కూడిన చిరునవ్వుతో వికసించిన కన్నుతో, తద్-ఉరః - ఆయన వక్షఃస్థలమును, స్వధామ - తన నివాసస్థానమునుగా, యాతా - పొందినదై, నికటే - సమీపమునందు, తస్థౌ - నిలిచియుండెను.

ఆమె ఆ శ్రీహరియొక్క మెడలో సుందరమైన కొంగ్రొత్త కమలముల మాలను వేసెను. మత్తెక్కిన తుమ్మెదల సమూహముచే ఆ మాల ధ్వనించుచుండెను. ఆమె సిగ్గుపడుతూ చిరునవ్వుతో తన నివాసస్థానమగు ఆయన వక్షఃస్థలమును చూచుచుండెను. ఆమె ఆయన ప్రక్కనే నిలబడెను.

తస్యాశ్శ్రియస్త్రిజగతో జనకో జనన్యా
వక్షో నివాసమకరోత్పరమం విభూతేః ।
శ్రీస్స్వాః ప్రజాస్సకరుణేన నిరీక్షణేన
యత్ర స్థితైధయత సాధిపతీంస్త్రిలోకాన్ ॥ 25

త్రిజగతః - ముల్లోకములకు, జనకః - తండ్రియగు శ్రీహరి, తస్యాః - ఆ, జనన్యాః - తల్లియగు, విభూతేః - సంపద్రూపిణియగు, శ్రియః - లక్ష్మీదేవికి, వక్షః - వక్షఃస్థలమును, పరమమ్ - శ్రేష్ఠమైన, నివాసమ్ - నివాసమునుగా, అకరోత్ - చేసెను, యత్ర - ఎక్కడనైతే, స్థితా -

ఉన్నదై, శ్రీః - లక్ష్మీదేవి, సకరుణేన - దయతో గూడిన, నిరీక్షణేన - చూపుతో, స్వాః - తనవారైన, ప్రజాః - సంతానమైన, స-అధిపతీన్ - లోక పాలకులతో గూడిన, త్రిలోకాన్ - ముల్లోకములను, ఐధయత - వర్ధిల్ల జేసెనో.

ముల్లోకములకు తండ్రియగు శ్రీహరి జగన్మాత, సంపద్రూపిణి యగు లక్ష్మీదేవికి తన వక్షఃస్థలమును శ్రేష్ఠమైన నివాసముగా చేసెను. అచట నిలిచియున్న ఆ దేవి దయతో గూడిన చూపుతో తన సంతానమైన ముల్లోకములను, లోకపాలకులను కూడ వర్ధిల్ల జేసెను.

శంఖతూర్యమృదంగానాం వాదిత్రాణాం పృథుస్స్వనః ।
దేవానుగానాం సస్త్రీణాం నృత్యతాం గాయతామభూత్ ।।26

శంఖతూర్యమృదంగానామ్ - శంఖములు బూరాలు డోళ్లు అనే, వాదిత్రాణామ్ - వాద్య పరికరములయొక్క, సస్త్రీణామ్ - అప్సరసలతో గూడియున్నట్టియు, నృత్యతామ్ - నాట్యమును చేయుచున్నట్టియు, గాయతామ్ - గానమును చేయుచున్న, దేవ-అనుగానామ్ - దేవతల అనుచరులైన గంధర్వులయొక్క, పృథుః - పెద్ద, స్వనః - ధ్వని, అభూత్ - కలిగెను.

అపుడు శంఖములు, బూరాలు, డోళ్లు మొదలైన వాద్యపరికర ములు మ్రోగించబడెను. దేవతలకు అనుచరులగు గంధర్వులు అప్సరస లతో గూడి పాడుతూ నాట్యమును చేసిరి. ఇవి అన్నీ కలిపి పెద్ద ధ్వని ఏర్పడెను.

బ్రహ్మరుద్రాంగిరోముఖ్యాస్సర్వే విశ్వసృజో విభుమ్ ।
ఈడిరేఽవితథైర్మంత్రైస్తల్లింగైః పుష్పవర్షిణః ।। 27

బ్రహ్మరుద్ర-అంగిరః-ముఖ్యాః - బ్రహ్మగారు రుద్రుడు అంగిర సుడు మొదలైన, సర్వే - అందరు, విశ్వసృజః - ప్రజాపతులు, పుష్పవ ర్షిణః - పుష్పములను వర్షించువారై, తత్-లింగైః - ఆ శ్రీహరిని ప్రతిపా

దించే, అవితథైః - యథార్థములగు, మంత్రైః - మంత్రములతో, విభుమ్ - సర్వవ్యాపకుడగు శ్రీహరిని, ఈడిరే - స్తుతించిరి.

బ్రహ్మగారు, రుద్రుడు, అంగిరసుడు మొదలైన ప్రజాపతులు అందరు సర్వవ్యాపకుడగు శ్రీహరిపై పుష్పములను వర్షిస్తూ, శ్రీహరిని ప్రతిపాదించే యథార్థములగు మంత్రములతో ఆయనను స్తుతించిరి.

శ్రియా విలోకితా దేవాస్సప్రజాపతయః ప్రజాః ।
శీలాదిగుణసంపన్నా లేభిరే నిర్వృతిం పరామ్ ॥ 28

శ్రియా - లక్ష్మీదేవిచే, విలోకితాః - చూడబడిన, సప్రజాపతయః - ప్రజాపతులతో గూడియున్న, దేవాః - దేవతలు, ప్రజాః - ప్రాణులు, శీల-అదిగుణసంపన్నాః - సచ్ఛీలము మొదలైన సద్గుణములు నిండా గలవారై, పరామ్ - సర్వోత్తమమైన, నిర్వృతిమ్ - ఆనందమును, లేభిరే - పొందిరి.

లక్ష్మీదేవియొక్క కృపాకటాక్షముచే ప్రజాపతులు, దేవతలు, ఇతర ప్రాణులు కూడ సచ్ఛీలము మొదలగు సద్గుణములను నిండా కలిగి, సర్వోత్తమమగు ఆనందమును పొందిరి.

నిస్సత్త్వా లోలుపా రాజన్ నిరుద్యోగా గతత్రపాః ।
యదా చోపేక్షితా లక్ష్మ్యా బభూవుర్దైత్యదానవాః ॥ 29

రాజన్ - ఓ మహారాజా!, యదా - ఏ కాలమునందైతే, దైత్యదానవాః - దితి దను వంశములకు చెందిన రాక్షసులు, లక్ష్మ్యా - లక్ష్మీదేవిచే, ఉపేక్షితాః - ఉపేక్షించబడిరో అప్పుడు, నిస్సత్త్వాః - బలహీనులు, లోలుపాః - భోగాసక్తులు, నిరుద్యోగాః - ప్రయత్నశీలము లేనివారు, గతత్రపాః - తొలగిన సిగ్గు గలవారు, బభూవుః - అయిరి.

ఓ మహారాజా! లక్ష్మీదేవి దితి దనువంశములకు చెందిన రాక్షసులను ఉపేక్షించెను. అపుడు వారు బలహీనులై భోగాసక్తులై ప్రయత్నశీలము కోల్పోయి సిగ్గు లేని ప్రవృత్తిని కలిగియుండిరి.

అథాసీద్వారుణీ దేవీ కన్యా కమలలోచనా ।
అసురా జగృహుస్తాం వై హరేరనుమతేన తే ॥ 30

అథ - తరువాత, వారుణీ - సురకు అధిష్ఠానదేవతయగు, దేవీ - దేవి, కమలలోచనా - కలువ కన్నులు గల, కన్యా - కన్యయై, ఆసీత్ - ఆవిర్భవించెను, తాం వై - ఆమెనైతే, హరేః - శ్రీహరియొక్క, అనుమతేన - అనుమతితో, తే - ఆ, అసురాః - రాక్షసులు, జగృహుః - తీసుకొనిరి.

తరువాత సురకు అధిష్ఠాన దేవతయగు దేవి కలువ కన్నుల కన్యయై ఆవిర్భవించెను. ఆమెను మాత్రము శ్రీహరి అనుమతితో ఆ రాక్ష సులు తీసుకొనిరి.

అథోదధేర్మథ్యమానాత్కాశ్యపైరమృతార్థిభిః ।
ఉదతిష్ఠన్మహారాజ పురుషః పరమాద్భుతః ॥ 31

మహారాజ - ఓ మహారాజా!, అథ - తరువాత, అమృత-అర్థిభిః - అమృతమును కోరే, కాశ్యపైః - కశ్యప ప్రజాపతి సంతానమగు దేవతలచే మరియు రాక్షసులచే, మథ్యమానాత్ - చిలుకబడుచున్న, ఉదధేః - సము ద్రమునుండి. పరమ-అద్భుతః - గొప్ప ఆశ్చర్యమును గొలిపే, పురుషః - పురుషుడు, ఉదతిష్ఠత్ - పైకి లేచి వచ్చెను.

ఓ మహారాజా! తరువాత అమృతమును కోరే కశ్యపసుతులగు దేవతలు మరియు రాక్షసులు సముద్రమును మథించుచుండగా, దాని నుండి ఒక పరమాశ్చర్యమును కలిగించే పురుషుడు ప్రకటమయ్యెను.

దీర్ఘపీవరదోర్దండః కంబుగ్రీవోఽరుణేక్షణః ।
శ్యామలస్తరుణస్స్రగ్వీ సర్వాభరణభూషితః ॥ 32

దీర్ఘపీవరదోర్దండః - పొడవాటి బలిసిన దండములవంటి భుజ ములు గలవాడు, కంబుగ్రీవః - శంఖమువంటి మెడ గలవాడు, అరుణ-ఈ క్షణః - ఎఱ్ఱని కన్నులు గలవాడు, శ్యామలః - శ్యామల వర్ణము గలవాడు, స్రగ్వీ - మాలను దాల్చినవాడు, సర్వ-ఆభరణభూషితః - సకలాభరణము లచే అలంకరించబడినవాడు.

శంఖమువంటి మెడగల ఆ పురుషుని పొడవాటి దండములవంటి బాహువులు బలిసియుండెను. శ్యామలవర్ణము గల ఆతని కన్నులు ఎర్రగా నుండెను. ఆతడు మాలను దాల్చి సకలాభరణములను అలంకరించుకొని యుండెను.

**పీతవాసా మహోరస్కస్సుమృష్టమణికుండలః ।**
**స్నిగ్ధకుంచితకేశాంతస్సుభగస్సింహవిక్రమః ।। 33**

పీతవాసాః - పచ్చని వస్త్రము గలవాడు, మహా-ఉరస్కః - విశాల మైన వక్షఃస్థలము గలవాడు, సుమృష్టమణికుండలః - మిక్కిలి ప్రకాశించే మణుల కుండలములు కలిగినవాడు, స్నిగ్ధకుంచితకేశ-అంతః - చిక్కని ఉంగరాల జుట్టు కొనలు కలిగినవాడు, సుభగః - అందగాడు, సింహవి క్రమః - సింహముయొక్క పరాక్రమమువంటి పరాక్రమము గలవాడు.

పచ్చని వస్త్రమును ధరించిన ఆ పురుషుడు విశాలమైన వక్షఃస్థల ముతో, మిక్కిలి ప్రకాశించే మణి కుండలములతో చాల అందముగ నుండె ను. ఆతని జుట్టు కొనలు చిక్కగా ఉంగరాలు తిరిగి యుండెను. ఆతడు పరాక్రమములో సింహమువంటి వాడు.

**అమృతాపూర్ణకలశం బిభ్రద్వలయభూషితః ।**
**స వై భగవతస్సాక్షాద్విష్ణోరంశాంశసంభవః ।। 34**

**ధన్వంతరిరితి ఖ్యాత ఆయుర్వేదదృగిజ్యభాక్ ।**

అమృత-ఆపూర్ణకలశమ్ - అమృతముతో నిండియున్న కలశము ను, బిభ్రత్ - ధరించి యున్నవాడు, వలయభూషితః - కంకణములను అలంకరించుకున్న, సః - ఆ పురుషుడు, వై - నిశ్చయముగా, సాక్షాత్ - సాక్షాత్తుగా, విష్ణోః - శ్రీహరియొక్క, అంశ-అంశసంభవః - అంశయగు సముద్రునియొక్క అంశనుండి జన్మించినవాడు, ధన్వంతరిః - ధన్వంతరి, ఇతి - అని, ఖ్యాతః - ప్రసిద్ధి గాంచిన, ఆయుర్వేదదృక్ - ఆయుర్వేద మును ప్రవర్తిల్ల జేసిన ద్రష్ట, ఇజ్యభాక్ - యజ్ఞభాగమును పొందువాడు.

కంకణములను అలంకరించుకున్న ఆ పురుషుడు అమృతముతో నిండియున్న కలశమును ధరించి యుండెను. ఆయన నిశ్చయముగా సాక్షాత్తుగా శ్రీహరియొక్క అంశయైన సముద్రునియొక్క అంశయై జన్మించినవాడు. ఆయనయే ధన్వంతరియని ప్రసిద్ధి గాంచి ఆయుర్వేదమును ప్రవర్తిల్ల జేసిన ద్రష్ట. ఆయనకు యజ్ఞములలోని హవిస్సులో భాగము గలదు.

తమాలోక్యాసురాస్సర్వే కలశం చామృతాభృతమ్ ।। 35

లిప్సంతస్సర్వవస్తూని కలశం తరసాహరన్ ।

తమ్ - ఆ ధన్వంతరిని, అమృత-ఆభృతమ్ - అమృతముతో నిండియున్న, కలశం చ - కలశమును కూడ, ఆలోక్య - చూచి, అసురాః - రాక్షసులు, సర్వే - అందరు, సర్వవస్తూని - సకలవస్తువులను, లిప్సంతః - పొందాలనే కోరిక గలవారై, కలశమ్ - కలశమును, తరసా - బలముగా, అహరన్ - తీసుకుపోయిరి.

ఆ ధన్వంతిరిని, అమృతముతో నిండియున్న కలశమును రాక్షసులు చూచిరి. మథనములో పుట్టిన సకలవస్తువులను తామే పొందాలని వారి కోరిక. అపుడు వారందరు ఆ కలశమును బలాత్కారముగా తీసుకుపోయిరి.

నీయమానేఽసురైస్తస్మిన్ కలశేఽమృతభాజనే ।। 36

విషణ్ణమనసో దేవా హరిం శరణమాయయుః ।

అసురైః - రాక్షసులచే, తస్మిన్ - ఆ, అమృతభాజనే - అమృతముతో నిండియున్న, కలశే - కలశము, నీయమానే - తీసుకు పోబడుచుండగా, విషణ్ణమనసః - అధికమగు ఖేదమును పొందిన మనస్సులు గల, దేవాః - దేవతలు, హరిమ్ - శ్రీహరిని, శరణమ్ - శరణమును, ఆయయుః - పొందిరి.

రాక్షసులు అమృతముతో నిండిన ఆ కలశమును తీసుకుపోవుచుం డగా, దేవతలకు తమ మనస్సులో అధికమగు ఖేదము కలిగెను. వార ప్పుడు శ్రీహరిని శరణు వేడిరి.

ఇతి తద్దైన్యమాలోక్య భగవాన్ భృత్యకామకృత్ ।
మా ఖిద్యత మిథోఽర్థం వస్సాధయిష్యే స్వమాయయా ।।37

భృత్యకామకృత్ - సేవకుల పనిని చేసిపెట్టే, భగవాన్ - శ్రీహరి భగవానుడు, ఇతి - ఈ విధమైన, తద్-దైన్యమ్ - ఆ దేవతల దీనావస్థను, ఆలోక్య - చూచి, మా ఖిద్యత - ఖేదమును పొందుకుడు, వః - మీయొ క్క, అర్థమ్ - పనిని, మిథః - రహస్యముగా, స్వమాయయా - నా మాయ చే, సాధయిష్యే - సాధించగలను.

సేవకుల పనిని చేసిపెట్టే శ్రీహరి భగవానుడు ఈ విధమైన దేవ తల ఆ దీనావస్థను చూచి వారితో నిట్లనెను -- ఖేదమును పొందకుడు. మీ పనిని నేను నా మాయచే రహస్యముగా సాధించగలను.

మిథః కలిరభూత్తేషాం తదర్థే తర్షచేతసామ్ ।
అహం పూర్వమహం పూర్వం న త్వం న త్వమితి ప్రభో।।38

ప్రభో - ఓ మహారాజా!, అహమ్ - నేను, పూర్వమ్ - ముందు, అహం పూర్వమ్ - నేను ముందు, త్వమ్ - నీవు, న - కాదు, త్వం న - నీవు కాదు, ఇతి - అంటూ, తద్-అర్థే - ఆ అమృతము అనే ప్రయోజన మునందు, తర్షచేతసామ్ - తృష్ణతో కూడిన మనస్సులు గల, తేషామ్ - వారికి, మిథః - పరస్పరము, కలిః - కలహము, అభూత్ - కలిగెను.

ఓ మహారాజా! రాక్షసుల మనస్సులో అమృతమును పొందాలనే పేరాస ఉండెను. నేను ముందు, నేను ముందు, నీవు కాదు, నీవు కాదు, అంటూ వారిలో పరస్పరము దాని కొరకై కలహము మొదలాయెను.

దేవాస్స్వం భాగమర్హంతి తే తుల్యాయాసహేతవః ।
సత్రయాగ ఇవైతస్మిన్నేష ధర్మస్సనాతనః ।। 39

తుల్య-ఆయాస హేతవః - సమానమైన పరిశ్రమచే కారణమైన, తే - ఆ, దేవాః - దేవతలు, ఏతస్మిన్ - ఈ అమృతమునందు, సత్రయాగే ఇవ - సత్రయాగమునందు వలె, స్వమ్ - తమదైన, భాగమ్ - వాటాను, అర్హంతి - అర్హులగుదురు, ఏషః - ఇదియే, సనాతనః - కాలాతీతమైన, ధర్మః - ధర్మము.

సత్రయాగముయొక్క ఫలము అందరికీ లభించును. అదే విధముగా, సమానమైన పరిశ్రమను చేసి అమృతోత్పాదనములో కారణమైన ఆ దేవతలకు కూడ ఈ అమృతములో వాటాను ఈయవలెను. ఇదియే సనాతనమైన ధర్మము.

ఇతి స్వాన్ ప్రత్యషేధన్ వై దైతేయా జాతమత్సరాః ।
దుర్బలాః ప్రబలాన్ రాజన్ గృహీతకలశాన్ముహుః ॥ 40

రాజన్ - ఓ మహారాజా!, జాతమత్సరాః - పుట్టిన ఈర్ష్య గలవారు, దుర్బలాః - బలహీనులు అగు, దైతేయాః - దితిపుత్రులగు రాక్షసులు, ప్రబలాన్ - బలశాలురైనట్టియు, గృహీతకలశాన్ - పట్టుకొనబడిన కలశము గల, స్వాన్ వై - తమవారినే, ఇతి - ఈ విధముగా, ముహుః - పలుమార్లు, ప్రత్యషేధన్ - అడ్డు తగిలిరి.

ఓ మహారాజా! ఆ రాక్షసులలో బలశాలురు కలశమును పట్టుకొని పోగా, వారిలోనే బలహీనులకు ఈర్ష్య కలిగి పైన చెప్పిన విధముగా తమ వారికే పలుమార్లు అడ్డు తగిలిరి.

ఏతస్మిన్నంతరే విష్ణుస్సర్వోపాయవిదీశ్వరః ।
యోషిద్రూపమనిర్దేశ్యం దధార పరమాద్భుతమ్ ॥ 41

ప్రేక్షణీయోత్పలశ్యామం సర్వావయవసుందరమ్ ।
సమానకర్ణాభరణం సుకపోలోన్నసాననమ్ ॥ 42

నవయౌవననిర్వృత్తస్తనభారకృశోదరమ్ ।
ముఖామోదానురక్తాలిఝుంకారోద్విగ్నలోచనమ్ ॥ 43

బిభ్రత్స్వకేశభారేణ మాలాముత్ఫుల్లమల్లికామ్ ।
సుగ్రీవకంఠాభరణం సుభుజాంగదభూషితమ్ ॥ 44

విరజాంబరసంవీతనితంబద్వీపశోభయా ।
కాంచ్యా ప్రవిలసద్వల్గుచలచ్చరణనూపురమ్ ॥ 45

సవ్రీడస్మితవిక్షిప్తభ్రూవిలాసావలోకనైః ।
దైత్యయూథపచేతస్సు కామముద్దీపయన్ముహుః ॥ 46

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే సముద్రమథనే లక్ష్మీధన్వంతర్యోరావిర్భావ వర్ణనం నామ అష్టమోఽధ్యాయః ॥

ఏతస్మిన్ - ఈ కలహమునందు, అంతరే - మధ్యయందు, సర్వ-ఉపాయవిత్ - సకలోపాయములను తెలిసినవాడు, ఈశ్వరః - సర్వసమర్థుడు అగు, విష్ణుః - విష్ణువు, అనిర్దేశ్యమ్ - వర్ణించ శక్యము కానట్టియు, పరమ-అద్భుతమ్ - మహాశ్చర్యమును కలిగించునట్టియు, ప్రేక్షణీయ-ఉత్పలశ్యామమ్ - చూడదగినట్టియు మరియు కలువ వలె శ్యామల వర్ణము కలిగినట్టియు, సర్వ-అవయవసుందరమ్ - సకలావయవములయందు సుందరమైనట్టియు, సమానకర్ణ-ఆభరణమ్ - సమమైన చెవులయందు ఆభరణములు కలిగినట్టియు, సుకపోల-ఉత్-నస-ఆననమ్ - చక్కని చెక్కిళ్లు ఎత్తైన ముక్కుగల ముఖము కలిగినట్టియు, నవయౌవననిర్వృత్తస్తనభారకృశ-ఉదరమ్ - నూత్నయౌవనముచే పూర్తి వర్తులమైన స్తనముల భారముచే చిక్కిన నడుము కలిగినట్టియు, ముఖ-ఆమోద-అనురక్త-అలిఝుంకార-ఉద్విగ్నలోచనమ్ - ముఖముయొక్క పరిమళమునందు ప్రీతిగల తుమ్మెదల ఝుంకారముచే భయపడిన కన్నులు కలిగినట్టియు, స్వకేశభారేణ - తన కేశముల భారముచే, ఉత్ఫుల్లమల్లికామ్ - వికసించిన మల్లెలు గల, మాలామ్ - మాలను, బిభ్రత్ - దాల్చినట్టియు, సుగ్రీవకంఠ-ఆభరణమ్ - చక్కని మెడయందు కంఠాభరణము కలిగినట్టియు, సుభుజ-అంగదభూషితమ్ - చక్కని భుజములయందు వంకీలచే అలంకరించబడినట్టియు, విరజ-అంబరసంవీతనితంబద్వీపశోభయా - నిర్మలమైన చీరచే చక్కగా కప్పబడియున్న ద్వీపములవంటి నితంబముల శోభ కల, కాంచ్యా

- వడ్డాణముతో, ప్రవిలసత్ - అధికముగా ప్రకాశించునట్టియు, వల్గుచలత్-చరణనూపురమ్ - అందముగా నడిచే పాదములయందు నూపురములు కలిగినట్టియు, సవ్రీడస్మితవిక్షిప్తభ్రూవిలాస-అవలోకనైః - సిగ్గుతో కూడిన చిరునవ్వు విరువబడిన కనుబొమల విలాసము గల చూపులతో, ముహుః - పలుమార్లు, దైత్యయూథపచేతస్సు - రాక్షస సేనానాయకుల మనస్సుల యందు, కామమ్ - కామనను, ఉద్దీపయత్ - ప్రజ్వరిల్ల జేయుచున్న, యోషిద్-రూపమ్ - యువతియొక్క రూపమును, దధార - దాల్చెను.

శ్రీహరి సకలోపాయములు తెలిసిన సర్వసమర్థుడు. ఈ కల హము మధ్యలో ఆయన వర్ణించ శక్యము కాని యువతి రూపమును దాల్చెను. సకలావయవములయందలి ఆమె సౌందర్యము పరమాశ్చర్య మును కలిగించెను. ఆమె కలువవలె శ్యామలవర్ణము కలిగి చూడ ముచ్చట గొలుపుచుండెను. ఆమె సమమైన చెవులయందు కర్ణాభరణము లను, తన పెద్దదైన కొప్పునందు విరిసిన మల్లెల మాలను, చక్కని మెడలో కంఠాభరణమును, చక్కని భుజములపై వంకీలను, నిర్మలమైన చీరచే కప్పబడిన ద్వీపములవంటి నితంబములపై బాగా శోభిల్లే వడ్డాణము ను, అందముగా నడిచే పాదములయందు అందెలను ధరించి యుండెను. చక్కని చెక్కిళ్లతో, ఎత్తైన ముక్కుతో ఆమె ముఖము అందముగా నుండె ను. వినూత్నమగు యౌవనముచే పూర్తిగా వర్తులమైన స్తనముల భార ముచే ఆమె నడుము చిక్కియుండెను. ఆమె ముఖముయొక్క పరిమళము నందు ప్రీతి గల తుమ్మెదలు ఝుంకారమును చేయుచుండగా ఆమె కళ్లలో తొట్రుపాటు కనబడుచుండెను. ఆమె సిగ్గుతో చిరునవ్వుతో కనుబొమలను విలాసగా విరిచి చూపులను విసరగా, రాక్షస సేనానాయకుల హృదయము లలో కామన పలుమార్లు ప్రజ్వలితమాయెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
సముద్ర మథన వృత్తాంతములో లక్ష్మీదేవి, ధన్వంతరి ఆవిర్భవించుటను
వర్ణించే ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (8) .

*****

# అథ నవమోఽధ్యాయః

## సముద్ర మథనము - శ్రీహరి మోహినీ రూపమును దాల్చుట

శ్రీశుక ఉవాచ ।
తేఽన్యోన్యతోఽసురాః పాత్రం హరంతస్త్యక్తసౌహృదాః ।
క్షిపంతో దస్యుధర్మాణ ఆయాంతీం దదృశుః స్త్రియమ్ ॥ 1

త్యక్తసౌహృదాః - విడిచిపెట్టబడిన ప్రేమ గలవారు, దస్యుధర్మాణః - దోపిడీగాండ్ర ప్రవృత్తి గల, తే - ఆ, అసురాః - రాక్షసులు, అన్యోన్యతః - ఒకరినుండి మరియొకరు, పాత్రమ్ - కలశమును, హరంతః - లాగుకొనుచున్నవారై, క్షిపంతః - విసిరివేయుచున్నవారై, ఆయాంతీమ్ - వచ్చుచున్న, స్త్రియమ్ - యువతిని, దదృశుః - చూచిరి.

ఆ రాక్షసులు ప్రేమను విడిచిపెట్టి దోపిడీగాండ్ర వలె ప్రవర్తిస్తూ ఆ కలశమును ఒకరినుండి మరియొకరు లాగుతూ విసిరి వేయుచుండిరి. ఇంతలో తమ వైపు వచ్చుచున్న యువతిని వారు కనుగొనిరి.

అహో రూపమహో ధామ అహో అస్యా నవం వయః ।
ఇతి తే తామభిద్రుత్య పప్రచ్ఛుర్జాతహృచ్ఛయాః ॥ 2

అహో - ఆహా!, రూపమ్ - రూపము!, అహో - ఆహా!, ధామ - కాంతి, అహో - ఆహా!, అస్యాః - ఈమెయొక్క, నవమ్ - నూతనమైన, వయః - వయస్సు!, ఇతి - అంటూ, జాతహృత్-శయాః - కలిగిన కామము గల, తే - వారు, తామ్ - ఆమెను గురించి, అభిద్రుత్య - అభిముఖముగా పరుగెత్తి, పప్రచ్ఛుః - ప్రశ్నించిరి.

అహా! ఏమి రూపము! అహా! ఏమి కాంతి! అహా! ఈమె వినూత్న యౌవనవతి! అని వారు తలచిరి. వారి హృదయములో మన్మథుడు ఉద యించెను. అపుడు వారు ఆమె వైపు పరుగెత్తి ఇట్లు ప్రశ్నించిరి.

కా త్వం కంజపలాశాక్షి కుతో వా కిం చికీర్షసి ।
కస్యాసి వద వామోరు మథ్నంతీవ మనాంసి నః ।। 3

కంజపలాశ-అక్షి - పద్మపత్రములవంటి కన్నుల దానా!, త్వమ్ - నీవు, కా - ఎవతెవు?, కుతః వా - ఎక్కడనుండి వచ్చితివి?, కిమ్ - దేనిని, చికీర్షసి - చేయ గోరుచున్నావు?, వామోరు - ఓ సుందరీ!, కస్య - ఎవని దానవు, అసి - అగుదువు?, వద - చెప్పుము, నః - మాయొక్క, మనాంసి - మనస్సులను, మథ్నంతీ ఇవ - కలచివేయుచున్నట్లు ఉన్నావు.

పద్మపత్రములవంటి కన్నులు గల ఓ సుందరీ! నీవు ఎవతెవు? ఎక్కడనుండి వచ్చితివి? ఏమి చేయగోరుచున్నావు? నీవు ఎవని దానవు? చెప్పుము. నీవు మా మనస్సులను కలచి వేయుచున్నట్లున్నావు.

న వయం త్వామరైర్దైత్యైస్సిద్ధగంధర్వచారణైః ।
నాస్పృష్టపూర్వాం జానీమో లోకేశైశ్చ కుతో నృభిః ।। 4

అమరైః - దేవతలచే, దైత్యైః - రాక్షసులచే, సిద్ధగంధర్వచారణైః - సిద్ధులు గంధర్వులు చారణులచే, లోక-ఈశైః చ - లోకపాలకులచే కూడ, నృభిః - మానవులచే, కుతః - చెప్పునదేమున్నది?, అస్పృష్టపూ ర్వామ్ - ఇదివరలో స్పృశించబడని, త్వా - నిన్ను, వయమ్ - మేము, న జానీమః - తెలియము అని, న - కాదు.

దేవతలు, రాక్షసులు, సిద్ధులు, గంధర్వులు, చారణులు, లోకపాల కులు కూడ నిన్ను ఇదివరలో స్పృశించి యుండరని మాకు తెలియక పోలే దు. నిన్ను మానవులు స్పృశించి యుండరని వేరుగా చెప్పవలయునా?

నూనం త్వం విధినా సుభ్రూః ప్రేషితాసి శరీరిణామ్ ।
సర్వేంద్రియమనఃప్రీతిం విధాతుం సఘృణేన కిమ్ ।। 5

సుభ్రూః - చక్కని కనుబొమలు గలదానా!, సఘృణేన - దయతో గూడిన, విధినా - దైవముచే, త్వమ్ - నీవు, శరీరిణామ్ - ప్రాణులకు, సర్వ-ఇంద్రియమనఃప్రీతిమ్ - సకలములైన ఇంద్రియములకు మనస్సునకు ప్రీతిని, విధాతుమ్ - కలిగించుటకై, ప్రేషితా అసి కిమ్ - పంపబడినావా యేమి?, నూనమ్ - నిశ్చయము.

చక్కని కనుబొమలు గల ఓ సుందరీ! దైవము దయతో ప్రాణుల సకలేంద్రియములకు మనస్సునకు ప్రీతిని కలిగించుటకై నిన్ను పంపినాడా యేమి? అవును, అదియే నిశ్చయము.

సా త్వం నస్స్పర్ధమానానామేకవస్తుని మానిని ।
జ్ఞాతీనాం బద్ధవైరాణాం శం విధత్స్వ సుమధ్యమే ॥ 6

మానిని - ఓ అభిమానవతీ!, సుమధ్యమే - చక్కని నడుము దానా!, ఏకవస్తుని - ఒకే వస్తువు విషయములో, స్పర్ధమానానామ్ - పోటీ పడుచున్నట్టియు, బద్ధవైరాణామ్ - గట్టి వైరము గల, జ్ఞాతీనామ్ - జ్ఞాతులమగు, నః - మాకు, సా - అట్టి, త్వమ్ - నీవు, శమ్ - సుఖమును, విధత్స్వ - కలిగించుము.

సన్నని నడుము గల ఓ అభిమానవతీ! మేము జ్ఞాతులమే. అయినను, ఒకే వస్తువు విషయములో పోటీ పడి గట్టి వైరమును పూనియుంటిమి. దైవముచే పంపబడిన నీవు మాకు (వైరమును తొలగించి) సుఖమును కలిగించుము.

వయం కశ్యపదాయాదా భ్రాతరః కృతపౌరుషాః ।
విభజస్వ యథాన్యాయం నైవ భేదో యథా భవేత్ ॥ 7

వయమ్ - మేము, కశ్యపదాయాదాః - కశ్యప ప్రజాపతియొక్క పుత్రులము, భ్రాతరః - సోదరులము, కృతపౌరుషాః - చేయబడిన ప్రయత్నము గలవారము, యథాన్యాయమ్ - న్యాయమునతిక్రమించకుండగా, విభజస్వ - పంచి పెట్టుము, యథా - ఏ విధముగానైతే, భేదః - తేడా (కలహము), న ఏవ భవేత్ - రానే రాదో.

మేము కశ్యప ప్రజాపతి పుత్రులము, సోదరులము. అమృతము కొరకై మేము సమానముగా శ్రమించినాము. కావున, మాకు న్యాయమును అతిక్రమించకుండా, కలహము రాని విధముగా అమృతమును పంచి పెట్టుము. పంచి పెట్టుటలో భేదబుద్ధికి తావు ఉండనే రాదు.

ఇత్యుపామంత్రితో దైత్యైర్మాయాయోషిద్వపుర్హరిః ।
ప్రహస్య రుచిరాపాంగైర్నిరీక్షన్నిదమబ్రవీత్ ॥ 8

మాయాయోషిద్-వపుః - కపటమగు యువతి వేషము గల, హరిః - శ్రీహరి, దైత్యైః - రాక్షసులచే, ఇతి - ఈ విధముగా, ఉపామంత్రితః - ప్రార్థించబడినవాడై, ప్రహస్య - నవ్వి, రుచిర-అపాంగైః - ప్రీతిని కలిగించే కడకంటి చూపులతో, నిరీక్షన్ - చూచుచున్నవాడై, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

కపటమగు యువతి వేషమును దాల్చియున్న శ్రీహరిని రాక్షసులీ విధముగా ప్రార్థించిరి. అపుడాయన నవ్వి, ప్రీతిని కలిగించే కడకంటి చూపులతో వారిని చూస్తూ, ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
కథం కశ్యపదాయాదాః పుంశ్చల్యాం మయి సంగతాః ।
విశ్వాసం పండితో జాతు కామినీషు న యాతి హి ॥ 9

కశ్యపదాయాదాః - కశ్యపుని పుత్రులు, పుంశ్చల్యామ్ - కులటనగు, మయి - నాయందు, కథమ్ - ఎట్లు, సంగతాః - అనుసరించుచున్నారు?, హి - ఏలయనగా, పండితః - వివేకి, కామినీషు - కామమును ఉద్దీపింపజేసే స్త్రీలయందు, జాతు - ఏ కాలమునందైననూ, విశ్వాసమ్ - విశ్వాసమును, న యాతి - పొందడు.

శ్రీభగవానుడిట్లు పలికెను --- కశ్యప ప్రజాపతి పుత్రులగు మీరు కులటనగు నన్ను అనుసరించుటకు కారణమేమి? ఎందుకంటే, వివేకి కామమును ఉద్దీపింపజేసే యువతిని ఏ కాలమునందైననూ విశ్వసించడు.

సాలావృకాణాం స్త్రీణాం చ స్వైరిణీనాం సురద్విషః ।
సఖ్యాన్యాహురనిత్యాని నూత్నం నూత్నం విచిన్వతామ్॥10

సురద్విషః - దేవతలను ద్వేషించే ఓ రాక్షసులారా!, నూత్నం నూత్నమ్ - కొత్త కొత్తవాటిని, విచిన్వతామ్ - అన్వేషించే, సాలావృకాణామ్ - తోడేళ్లకు, స్వైరిణీనామ్ - స్వేచ్ఛాచారిణులగు, స్త్రీణాం చ - యువతులకు కూడ, సఖ్యాని - స్నేహములు, అనిత్యాని - అస్థిరములు అని, ఆహుః - చెప్పెదరు.

దేవతలను ద్వేషించే ఓ రాక్షసులారా! తోడేళ్లు కొత్త కొత్త మాంస మును, స్వేచ్ఛాచారిణులగు యువతులు కొత్త కొత్త పురుషులను వెదుకు చుందురు. వారు చేసే స్నేహములు అస్థిరములని పెద్దలు చెప్పెదరు.

శ్రీశుక ఉవాచ ।
ఇతి తే క్ష్వేలితైస్తస్యా ఆశ్వస్తమనసోఽసురాః ।
జహసుర్భావగంభీరం దదుశ్చామృతభాజనమ్ ॥ 11

ఇతి - ఈ విధముగా, తస్యాః - ఆమెయొక్క, క్ష్వేలితైః - కపటపు మాటలచే, ఆశ్వస్తమనసః - విశ్వాసము కలిగిన మనస్సులు గల, అసురాః - రాక్షసులు, భావగంభీరమ్ - భావముచే గంభీరముగా, జహసుః - నవ్వి రి, అమృతభాజనం చ - అమృత కలశమును కూడ, దదుః - ఇచ్చిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా ఆమె పలికిన కపటపు మాటలచే రాక్షసులకు మనస్సులో విశ్వాసము కలిగెను. అపుడు వారు ఆమెయందలి ప్రేమ బయట పడకుండా గంభీరముగా నవ్వి, అమృత కలశమును ఆమెకు ఇచ్చివేసిరి.

తతో గృహీత్వాఽమృతభాజనం హరిః
బభాష ఈషత్స్మితశోభయా గిరా ।
యద్యభ్యుపేతం క్వ చ సాధ్వసాధు వా
కృతం మయా వో విభజే సుధామిమామ్ ॥ 12

తతః - తరువాత, హరిః - శ్రీహరి, అమృతభాజనమ్ - అమృత కలశమును, గృహీత్వా - తీసుకొని, ఈషత్-స్మితశోభయా - కొంచెము చిరునవ్వుతో శోభిల్లే, గిరా - వాక్కుతో, బభాషే - పలికెను, క్వ చ - ఏ అంశమునందైననూ, మయా - నాచే, కృతమ్ - చేయబడినది, సాధు - మంచి గాని, అసాధు వా - చెడు గాని, వః - మీకు, అభ్యుపేతం యది - అంగీకృతమైనచో, ఇమామ్ - ఈ, సుధామ్ - అమృతమును, విభజే - పంచిపెట్టెదను.

తరువాత శ్రీహరి ఆ అమృత కలశమును తీసుకొని, చిన్న చిరున వ్వుతో శోభిల్లే వాక్కుతో ఇట్లు పలికెను -- ఏ అంశములోనైననూ నేను చేయబోయేది మంచిది గాని, చెడు గాని మీకు అంగీకారమయ్యే పక్షము లో, నేనీ అమృతమును పంచి పెట్టెదను.

ఇత్యభివ్యాహృతం తస్యా ఆకర్ణ్యాసురపుంగవాః ।
అప్రమాణవిదస్తస్యాస్తత్తథేత్యన్వమంసత ।। 13

ఇతి - ఈ విధమైన, తస్యాః - ఆమెయొక్క, అభివ్యాహృతమ్ - పలుకును, ఆకర్ణ్య - విని, అసురపుంగవాః - రాక్షస శ్రేష్ఠులు, తస్యాః - ఆమెయొక్క, అప్రమాణవిదః - అభిప్రాయమునెరుగనివారై, తథా- అటులనే, ఇతి - అని, తత్ - ఆ మాటను, అన్వమంసత - అనుమోదించిరి.

ఆమె పలికిన ఈ మాటను ఆ రాక్షస శ్రేష్ఠులు వినిరి. ఆమె అభిప్రాయము వారికి తెలియలేదు. సరే అని వారు ఆమె షరతునకు తమ అంగీకారమును తెలిపిరి.

అథోపోష్య కృతస్నానా హుత్వా చ హవిషానలమ్ ।
దత్త్వా గోవిప్రభూతేభ్యః కృతస్వస్త్యయనా ద్విజైః ।। 14

అథ - తరువాత, ఉపోష్య - ఉపవాసము చేసి, కృతస్నానా - చేయబడిన స్నానము గలదియై, హవిషా - హవిస్సుతో, అనలమ్ - అగ్నిని, హుత్వా చ - హోమము కూడ చేసి, గోవిప్రభూతేభ్యః - ఆవులకు వేద

వేత్తలకు ప్రాణులకు, దత్త్వా - ఇచ్చి, ద్విజైః - వేదవేత్తలచే, కృతస్వస్త్యయనా - చేయబడిన స్వస్తి వాచనము గలది.

తరువాత ఆమె ఒకరోజు ఉపవసించెను. మరునాడు ఆమె స్నానము చేసి అగ్నిలో హవిస్సును హోమము చేసి, ఆవులకు ఇతరప్రాణులకు ఆహారమును వేదవేత్తలకు ధనాదికమును ఇచ్చి, వేదవేత్తలచే స్వస్తి వాచనమును పఠింప జేసెను.

యథోపజోషం వాసాంసి పరిధాయాఽహతాని తే ।
కుశేషు ప్రావిశన్ సర్వే ప్రాగగ్రేష్వభిభూషితాః ॥ 15

యథా-ఉపజోషమ్ - తమ ప్రీతికి తగ్గట్లుగా, అహతాని - కొత్త, వాసాంసి - వస్త్రములను, పరిధాయ - ధరించి, అభిభూషితాః - అలంకరించబడినవారై, సర్వే - అందరు, ప్రాగ్-అగ్రేషు - తూర్పువైపు కొనలు గల, కుశేషు - దర్భలయందు, ప్రావిశన్ - కూర్చుండిరి.

వారందరు తమ ప్రీతికి తగ్గట్లుగా కొత్త వస్త్రములను ధరించి అలంకారములను చేసుకొనిరి. అపుడు వారు తూర్పు వైపు కొనలు గల దర్భలయందు కూర్చుండిరి.

ప్రాఙ్ముఖేషూపవిష్టేషు సురేషు దితిజేషు చ ।
ధూపామోదితశాలాయాం జుష్టాయాం మాల్యదీపకైః ॥ 16

తస్యాం నరేంద్ర కరభోరురుశద్దుకూల-
శ్రోణీతటాలసగతిర్మదవిహ్వలాక్షీ ।
సా కూజతీ కనకనూపురశింజితేన
కుంభస్తనీ కలశపాణిరథావివేశ ॥ 17

నర-ఇంద్ర - ఓ మహారాజా!, మాల్యదీపకైః - మాలలతో దీపములతో, జుష్టాయామ్ - అలంకరించబడినట్టియు, ధూప-ఆమోదితశాలాయామ్ - ధూపముచే పరిమళ భరితము చేయబడిన శాలయందు, సురేషు - దేవతలు, దితిజేషు చ - రాక్షసులు కూడ, ప్రాక్-ముఖేషు - తూర్పునకు అభిముఖులై, ఉపవిష్టేషు - కూర్చున్నవారు కాగా, అథ -

అప్పుడు, కరభ-ఊరుః - సుందరమగు అవయవములు గలది, ఉశద్-దు కూలశ్రోణీతట-అలసగతిః - అందమైన చీరగల విశాలమైన కటిభాగముచే మెల్లనైన నడక గలది, మదవిహ్వల-అక్షీ - సంతోషముతో స్వాధీనత లేని కన్నులు గలది, కనకనూపురశింజితేన - బంగరు కాలియందెల ధ్వనిచే, కూజతీ - ధ్వనించుచున్నది, కుంభస్తనీ - కుంభములవంటి స్తనములు గలది అగు, సా - ఆమె, కలశపాణిః - కలశము చేతియందు గలదియై, తస్యామ్ - ఆ సభయందు, అవిశేశ - ప్రవేశించెను.

మాలలతో మరియు దీపములతో అలంకరించి ధూపముతో పరి మళ భరితము చేయబడిన శాలయందు దేవతలు మరియు రాక్షసులు తూర్పునకభిముఖముగా కూర్చుండిరి. అప్పుడు సుందరమగు అవయవ ములు గల ఆ యువతి బంగరు కాలియందెలు ప్రతిధ్వనించుచుండగా కల శము చేతబట్టి ఆ సభలో ప్రవేశించెను. ఆమె కన్నులు సంతోషముతో స్వాధీనత తప్పియుండెను. అందమైన చీరతో ప్రకాశించే విశాలమైన కటి భాగము గల ఆమె మెల్లగా నడచి వచ్చెను.

తాం శ్రీసఖీం కనకకుండలచారుకర్ణ-
నాసాకపోలవదనాం పరదేవతాఖ్యామ్ ।
సంవీక్ష్య సంముముహురుత్స్మితవీక్షణేన
దేవాసురా విగలితస్తనపట్టికాంతామ్ ॥ 18

శ్రీసఖీమ్ - లక్ష్మీదేవికి సరిదూగునట్టియు, కనకకుండలచారుకర్ణ నాసాకపోలవదనామ్ - బంగరు కుండలములతో అందమైన చెవులు ముక్కు చెక్కిళ్లు గల ముఖము కలిగినట్టియు, పరదేవతా-ఆఖ్యామ్ - పర దేవతారూపిణి అయినట్టియు, విగలితస్తనపట్టికా-అంతామ్ - జారిన కంచు కముయొక్క కొన కలిగిన, తామ్ - ఆమెను, సంవీక్ష్య - బాగా చూచి, దేవ -అసురాః - దేవతలు రాక్షసులు, ఉత్-స్మితవీక్షణేన - చిరునవ్వుతో కూడిన చూపుచే, సంముముహుః - పూర్తిగా మోహమును పొందిరి.

లక్ష్మీదేవితో సరిదూగే ఆమె సాక్షాత్తుగా పరదేవతా (పరబ్రహ్మ) రూపిణియే. ఆమె ముఖము బంగరు కుండలములతో అందమైన చెవులు

ముక్కు మరియు చెక్కిళ్లతో ప్రకాశించెను. కంచుకముయొక్క కొన కొద్దిగా జారుచుండగా ఆమె చిరునవ్వుతో దేవతలను మరియు రాక్షసులను చూచుచుండెను. ఆమెను తదేకముగా చూచే ఆ దేవతలు, రాక్షసులు మోహమును పొందిరి.

అసురాణాం సుధాదానం సర్పాణామివ దుర్నయమ్ ।
మత్వా జాతినృశంసానాం న తాం వ్యభజదచ్యుతః ।। 19

జాతినృశంసానామ్ - పుట్టుకతోడనే క్రూరులైనట్టియు, సర్పాణాం ఇవ - పాములవంటి, అసురాణామ్ - రాక్షసులకు, సుధాదానమ్ - అమృతమునిచ్చుటను, దుర్నయమ్ - నీతి విరుద్ధమునుగా, మత్వా - తలచి, అచ్యుతః - శ్రీహరి, తామ్ - దానిని, న వ్యభజత్ - పంచి ఈయలేదు.

పుట్టుకతోడనే క్రూరులైన రాక్షసులకు అమృతమునిచ్చుట సర్పములకు పాలను పోయుట వంటి నీతి విరుద్ధమగు చర్య. ఇట్లు తలపోసి శ్రీహరి అమృతమును వారికి పంచి ఈయలేదు.

కల్పయిత్వా పృథక్ పంక్తీరుభయేషాం జగత్పతిః ।
తాంశ్చోపవేశయామాస స్వేషు స్వేషు చ పంక్తిషు ।। 20

జగత్-పతిః - జగన్నాథుడగు శ్రీహరి, ఉభయేషామ్ - ఇద్దరికి, పృథక్ - వేరుగా, పంక్తీః - పంక్తులను, కల్పయిత్వా - ఏర్పాటు చేసి, తాన్ చ - వారిని, స్వేషు స్వేషు - తమ తమ, పంక్తిషు చ - పంక్తులయందు, ఉపవేశయామాస - కూర్చుండబెట్టెను.

జగన్నాథుడగు శ్రీహరి దేవతలకు, రాక్షసులకు ఇద్దరికీ వేర్వేరు పంక్తులనేర్పాటు చేసి, వారిని తమ తమ పంక్తులలో కూర్చుండ బెట్టెను.

దైత్యాన్ గృహీతకలశో వంచయన్నుప సంచరైః ।
దూరస్థాన్ పాయయామాస జరామృత్యుహరాం సుధామ్ ।। 21

గృహీతకలశః - పట్టుకొనబడిన కలశము గల శ్రీహరి, ఉప - దగ్గరగా, సంచరైః - సంచారములచే, వంచయన్ - వంచించువాడై, దూరస్థాన్

- దూరముగానున్నవారిని, జరామృత్యుహరామ్ - ముసలిదనము మర ణములను పోగొట్టే, సుధామ్ - అమృతమును, పాయయామాస - త్రావిం చెను.

శ్రీహరి కలశమును పట్టుకొని రాక్షసులకు దగ్గరగా సంచరిస్తూ వారిని వంచించి, దూరముగానున్న దేవతలకు అమృతమును త్రావించెను. అమృతమును త్రావువారికి ముసలిదనము గాని, మరణము గాని ఉండవు.

**తే పాలయంతస్సమయమసురాస్స్వకృతం నృప ।**
**తూష్ణీమాసన్ కృతస్నేహాః స్త్రీవివాదజుగుప్సయా ॥ 22**

నృప - ఓ మహారాజా!, కృతస్నేహాః - చేయబడిన ప్రేమ గల, తే - ఆ, అసురాః - రాక్షసులు, స్వకృతమ్ - తమచే చేయబడిన, సమయమ్ - ఒప్పందమును, పాలయంతః - పాలించువారై, స్త్రీవివాదజుగుప్సయా - స్త్రీతో కలహించుటయందలి ఏహ్యభావముచే, తూష్ణీం ఆసన్ - మిన్న కుండిరి.

ఓ మహారాజా! ఆ రాక్షసులకు ఆమెపై ప్రేమ ఏర్పడెను. పైగా వారు స్త్రీతో కలహించుట జుగుప్సను కలిగించే చర్య అని భావించిరి. కావునవే, వారు తాము చేసుకున్న ఒప్పందమును పాలిస్తూ మిన్నకుండిరి.

**తస్యాం కృతాతిప్రణయాః ప్రణయాపాయకాతరాః ।**
**బహుమానేన చాబద్ధా నోచుః కించన విప్రియమ్ ॥ 23**

తస్యామ్ - ఆమెయందు, కృత-అతిప్రణయాః - చేయబడిన అధి కమగు ప్రేమ గలవారు, ప్రణయ-అపాయకాతరాః - ప్రేమకు భంగము కలుగునవే భయము గలవారు, బహుమానేన - మర్యాదచే, ఆబద్ధాః చ - కట్టివేయబడినవారు, విప్రియమ్ - పరుషమగు మాటను, కించన - దేవినై నను, న ఊచుః - పలుకలేదు.

ఆ రాక్షసులకు ఆమెయందు అధికమగు ప్రేమ కలిగెను. ఆ ప్రేమకు భంగము కలుగునేమో యను భయము వారిలో ఉండెను. పైగా,

ఆమె వారికి చాల మర్యాదనిచ్చెను. అది కూడ వారిని కట్టివేసెను. ఈ కారణములచే, వారు పరుషముగా ఒక్క మాటనైననూ పలుకలేదు.

దేవలింగప్రతిచ్ఛన్నస్స్వర్భానుర్దేవసంసది ।
ప్రవిష్టస్సోమమపిబచ్చంద్రార్కాభ్యాం చ సూచితః ।। 24

దేవలింగప్రతిచ్ఛన్నః - దేవతల చిహ్నములచే కప్పివేయబడిన యథార్థరూపము గల, స్వర్భానుః - రాహువు, దేవసంసది - దేవతల గుంపునందు, ప్రవిష్టః - ప్రవేశించినవాడై, సోమమ్ - అమృతమును, అపిబత్ - త్రాగెను, చ - మరియు, చంద్ర-అర్కాభ్యామ్ - చంద్రసూర్యులచే, సూచితః - చూపించబడినవాడు.

రాహువు తన యథార్థరూపము కనబడకుండా దేవతల గుర్తులను ధరించి వారి గుంపులో ప్రవేశించి అమృతమును త్రాగెను. కాని, చంద్రుడు మరియు సూర్యుడు ఆయనను గుర్తు పట్టి శ్రీహరికి చూపించిరి.

చక్రేణ క్షురధారేణ జహార పిబతశ్శిరః ।
హరిస్తస్య కబంధస్తు సుధయాఽప్లావితోఽపతత్ ।। 25

హరిః - శ్రీహరి, క్షురధారేణ - వాడి యంచులు గల, చక్రేణ - చక్రముతో, పిబతః - త్రాగుచున్న రాహువుయొక్క, శిరః - తలను, జహార - తొలగించెను, సుధయా - అమృతముతో, అప్లావితః - తడుపబడని, కబంధః తు - మొండెమైతే, అపతత్ - పడెను.

శ్రీహరి వాడి యంచులు గల చక్రముతో అమృతమును త్రాగుచున్న రాహువు తలను నరికెను. అమృతము తగలని వాని మొండెము క్రింద పడి మరణించెను. (కేతువు రాహువుయొక్క ఛాయయే గాని, మొండెము కాదు).

శిరస్త్వమరతాం నీతమజో గ్రహమచీక్లుపత్ ।
యస్తు పర్వణి చంద్రార్కావభిధావతి వైరధీః ।। 26

అమరతామ్ - మరణము లేకుండుటను, నీతమ్ - పొందించబడి న, శిరః తు - శిరస్సునైతే, అజః - స్వయంభువుడగు బ్రహ్మగారు, గ్రహమ్ - గ్రహమునుగా, అచీక్లుపత్ - ఏర్పాటు చేసెను, యః తు - ఏ గ్రహమైతే, వైరధీః - వైరబుద్ధి గలదియై, పర్వణి - పూర్ణిమ అమావాస్యల యందు. చంద్ర-అర్కౌ - చంద్రసూర్యులను, అభిధావతి - అభిముఖ ముగా పరుగెత్తునో.

కాని; తల అమరమయ్యెను. స్వయంభువుడగు బ్రహ్మగారు దానిని గ్రహముగా ఏర్పాటు చేసెను. ఆ రాహు గ్రహము వైరబుద్ధి గల దియై పూర్ణిమ, అమావాస్యలయందు సూర్యచంద్రులపై ఆక్రమణను చేయుచుండును.

పీతప్రాయేఽమృతే దేవైర్భగవాంల్లోకభావనః ।
పశ్యతామసురేంద్రాణాం స్వం రూపం జగృహే హరిః ॥ 27

దేవైః - దేవతలచే, అమృతే - అమృతము, పీతప్రాయే - ఇంచు మించు పూర్తిగా త్రాగబడగా, లోకభావనః - లోకములను పాలించే, భగ వాన్ హరిః - శ్రీహరి భగవానుడు, అసుర-ఇంద్రాణామ్ - రాక్షస నాయకు లు, పశ్యతామ్ - చూచుచుండగా, స్వమ్ - తనదైన, రూపమ్ - రూపము ను, జగృహే - స్వీకరించెను.

దేవతలు ఇంచుమించు పూర్తిగా అమృతమును త్రాగిరి. అప్పుడు లోకములను పాలించే శ్రీహరి భగవానుడు, రాక్షస నాయకులు చూస్తుండ గానే వారిని వరకు చేయకుండా, తన అసలు రూపమును స్వీకరించెను.

ఏవం సురాఽసురగణాస్సమదేశకాల-
హేత్వర్థకర్మమతయోఽపి ఫలే వికల్పాః ।
తత్రామృతం సురగణాః ఫలమంజసాఽఽపుః
యత్పాదపంకజరజశ్శ్రయణాన్న దైత్యాః ॥ 28

సుర-అసురగణాః - దేవతలు రాక్షసుల గణములు, ఏవమ్ - ఈ విధముగా, సమదేశకాలహేతు-అర్థకర్మమతయః అపి - సమానమైన

స్థానము కాలము ఉపకరణములు పరిశ్రమ సంకల్పము ఉన్నవారే అయిన నూ, ఫలే - ఫలమునందు, వికల్పాః - తేడాలు, తత్ర - వారిలో, సురగణాః - దేవగణములు, అమృతమ్ - అమృతమును, ఫలమ్ - ఫలముగా, అంజసా - తేలికగా, ఆపుః - పొందిరి, యత్-పాదపంకజరజః-శ్రయణాత్ - ఎవ్వాని పద్మములవంటి పాదముల ధూళిని ఆశ్రయించుట వలననో, దైత్యాః - రాక్షసులు, న - పొందలేదు.

దేవతల మరియు రాక్షసుల గణములు ఈ విధముగా ఒకే స్థానములో ఒకే కాలములో సమానమైన ఉపకరణములతో సమానమైన సంకల్పముతో సమానమైన పరిశ్రమనే చేసిరి. అయిననూ, వారికి లభించిన ఫలములలో చాల తేడాలు గలవు. వారిలో శ్రీహరి పాదపద్మముల ధూళిని ఆశ్రయించిన దేవతలకు అమృతము ఫలముగా తేలికగా లభించెను. కాని, భగవానునకు విముఖులగుటచే, రాక్షసులకు ఏదీ దక్కలేదు.

యద్యుజ్యతేఽసువసుకర్మమనోవచోభిః
దేహాత్మజాదిషు నృభిస్తదసత్పృథక్త్వాత్ ।
తైరేవ సద్భవతి యత్క్రియతేఽపృథక్త్వాత్
సర్వస్య తద్భవతి మూలనిషేచనం యత్ ॥ 29

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే
సముద్రమథనవృత్తాంతే శ్రీహరేః మోహినీరూపవర్ణనం
నామ నవమోఽధ్యాయః ॥

అసుకర్మమనోవచోభిః - ప్రాణములు సంపద కర్మ మనస్సు వాక్కులచే, యత్ - ఏది, దేహ-ఆత్మజ-ఆదిషు - దేహము సంతానము మొదలగువాటియందు, నృభిః - మానవులచే, యుజ్యతే - చేయబడుచున్నదో, తత్ - అది, పృథక్త్వాత్ - భిన్నము అగుట వలన, అసత్ - వ్యర్థము, తైః ఏవ - వాటితోనే, యత్ - ఏది, క్రియతే - చేయబడుచున్నదో అది, అపృథక్త్వాత్ - భిన్నము కాకపోవుట వలన, సత్ - సఫలము, భవతి - అగును, మూలనిషేచనమ్ - వ్రేళ్లను తడుపుట, యత్ - ఏది గలదో, తత్ - అది, సర్వస్య - మొత్తము చెట్టునకు, భవతి - అగును.

ప్రాణములు, సంపదలు, కర్మలు మరియు మనస్సులతో మానవులు తమ దేహము, సంతానము మొదలగువాటి కొరకు చేసే సర్వము భేదబుద్ధితో కూడినది యగుట వలన వ్యర్థమే యగును. కాని, మానవుడు వాటితోనే భగవానుని ఆరాధనను చేసినచో, భగవంతునికంటె భిన్నముగా ఏదీ లేదు గనుక, ఆ సర్వము సఫలమగును. ఎందుకంటే, చెట్టు వ్రేళ్లను తడిపినచో, చెట్టులోని సర్వమునకు నీరు అందును గదా!

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
సముద్ర మథన వృత్తాంతములో శ్రీహరియొక్క మోహినీ రూపమును
వర్ణించే తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (9) .

*****

# అథ దశమోఽధ్యాయః

## సముద్ర మథనము - దేవాసుర సంగ్రామము

శ్రీశుక ఉవాచ ।
ఇతి దానవదైతేయా నావిందన్నమృతం నృప ।
యుక్తాః కర్మణి యత్తాశ్చ వాసుదేవపరాఙ్ముఖాః ।। 1

నృప - ఓ మహారాజా!, దానవదైతేయాః - దను దితి వంశములకు చెందిన రాక్షసులు, యుక్తాః - సావధానులు, కర్మణి - పనియందు, యత్తాః చ - ప్రయత్నమును చేసినవారు కూడ, వాసుదేవపరాఙ్ముఖాః - వాసుదేవుని యెడల విముఖులు, ఇతి - ఈ విధముగా, అమృతమ్ - అమృతమును, న అవిందన్ - పొందలేదు.

ఓ మహారాజా! దను దితి వంశములకు చెందిన రాక్షసులు సావధానులై ప్రయత్నశీలురై పనిని చేసిననూ, వాసుదేవుని యెడల విముఖులైన కారణముగా, అమృతమును పొందలేక పోయిరి.

సాధయిత్వాఽమృతం రాజన్ పాయయిత్వా స్వకాన్ సురాన్ ।
పశ్యతాం సర్వభూతానాం యయౌ గరుడవాహనః ।। 2

రాజన్ - ఓ మహారాజా!, గరుడవాహనః - గరుడుడు వాహనముగా గల శ్రీహరి, అమృతమ్ - అమృతమును, సాధయిత్వా - సాధించి, స్వకాన్ - తన భక్తులైన, సురాన్ - దేవతలను, పాయయిత్వా - త్రాగింపజేసి, సర్వభూతానామ్ - సకలప్రాణులు, పశ్యతామ్ - చూచుచుండగా, యయౌ - వెళ్లెను.

ఓ మహారాజా! శ్రీహరి అమృతమును సాధించి తన భక్తులైన దేవతలచే త్రాగించి, సకలప్రాణులు చూచుచుండగా గరుడుని అధిష్ఠించి నిష్క్రమించెను.

సపత్నానాం పరామృద్ధిం దృష్ట్వా తే దితినందనాః ।
అమృష్యమాణా ఉత్పేతుర్దేవాన్ ప్రత్యుద్యతాయుధాః ॥ 3

తే - ఆ, దితినందనాః - దితిపుత్రులగు రాక్షసులు, సపత్నానామ్ - శత్రువులగు దేవతలయొక్క, పరామ్ - గొప్ప, ఋద్ధిమ్ - సంపత్తిని, దృష్ట్వా - చూచి, అమృష్యమాణాః - సహించ లేనివారై, ఉద్యత-ఆయుధాః - సంసిద్ధము చేయబడిన ఆయుధములు గలవారై, దేవాన్ ప్రతి - దేవతలనుద్దేశించి, ఉత్పేతుః - మీద బడిరి.

దితిపుత్రులగు ఆ రాక్షసులు తమ శత్రువులైన దేవతలయొక్క గొప్ప సంపత్తిని చూచి సహించ లేకపోయిరి. వారు ఆయుధములను సంసిద్ధము చేసుకొని దేవతలపైకి ఉరికిరి.

తతస్సురగణాస్సర్వే సుధయా పీతయైధితాః ।
ప్రతిసంయుయుధుశ్శస్త్రైర్నారాయణపదాశ్రయాః ॥ 4

తతః - తరువాత, పీతయా - త్రాగబడిన, సుధయా - అమృతముచే, ఏధితాః - వర్ధిల్ల జేయబడిన, సురగణాః - దేవగణములు, సర్వే - అందరు, నారాయణపద-ఆశ్రయాః - నారాయణుని పాదములే ఆశ్రయముగా గలవారై, శస్త్రైః - ఆయుధములతో, ప్రతిసంయుయుధుః - తిరిగి యుద్ధమును చేసిరి.

అప్పుడు అమృతమును త్రాగి బలమును పొందియున్న సకల దేవగణములు నారాయణుని పాదములను ఆశ్రయించినవారై ఆయుధములతో యుద్ధమునకు తలపడిరి.

తత్ర దైవాసురో నామ రణః పరమదారుణః ।
రోధస్యుదన్వతో రాజంస్తుములో రోమహర్షణః ॥ 5

తత్ర - అచట (అపుడు), ఉదన్వతః - సముద్రముయొక్క, రోధసి - తీరమునందు, పరమదారుణః - మిక్కిలి దారుణమైనది, దైవాసురః నామ - దైవాసురయుద్ధము అని ప్రసిద్ధి గాంచినది, తుములః - సంకీర్ణమైనది అగు, రణః - యుద్ధము, రోమహర్షణః - శరీరమునకు గగుర్పాటును కలిగించునది.

అపుడు అచట సముద్రతీరమునందు దైవాసుర సంగ్రామమని ప్రసిద్ధి గాంచిన మిక్కిలి దారుణమగు యుద్ధము జరిగెను. రెండు సేనలు కలిసిపోయి చేసిన ఆ యుద్ధము శరీరమునకు గగుర్పాటును కలిగించెను.

తత్రాన్యోన్యం సపత్నాస్తే సంరబ్ధమనసో రణే ।
సమాసాద్యాసిభిర్బాణైర్నిజఘ్నుర్వివిధాయుధైః ॥ 6

తత్ర - అపుడు, సంరబ్ధమనసః - కోపముతో నిండిన మనస్సులు గల, తే - ఆ, సపత్నాః - శత్రువులు, రణే - యుద్ధమునందు, సమాసాద్య - ఎదురెదురుగా వచ్చి, అన్యోన్యమ్ - పరస్పరము, అసిభిః - కత్తులతో, బాణైః - బాణములతో, వివిధ-ఆయుధైః - వివిధములైన ఆయుధములతో, నిజఘ్నుః - కొట్టుకొనిరి.

అపుడా యుద్ధమునందు కోపముతో నిండిన మనస్సులు గల ఆ రెండు ప్రతిపక్షులు ఒకరికి మరియొకరు ఎదురుగా నుండి బాణములు, కత్తులు మొదలగు వివిధములైన ఆయుధములతో కొట్టుకొనిరి.

శంఖతూర్యమృదంగానాం భేరీడమరిణాం మహాన్ ।
హస్త్యశ్వరథపత్తీనాం నదతాం నిస్వనోఽభవత్ ॥ 7

నదతామ్ - ధ్వనించుచున్న, శంఖతూర్యమృదంగానామ్ - శంఖములు తూర్యములు డోళ్లయొక్క, భేరీడమరిణామ్ - భేరీలు డమరువుల యొక్క, హస్తి-అశ్వరథపత్తీనామ్ - ఏనుగులు గుర్రములు రథములు కాలి బంట్లయొక్క, నిస్వనః - పెద్ద ధ్వని, అభవత్ - కలిగెను.

శంఖములు, తూర్యములు, డోళ్లు, భేరీలు, డమరువులు మ్రోగు చుండెను. ఏనుగులు, గుఱ్ఱములు, కాలిబంట్లు ధ్వనులను చేయుచుండిరి. రథముల ధ్వని కూడ తోడై (ఆ యుద్ధములో) పెద్ద ధ్వని బయలు దేరెను.

రథినో రథిభిస్తత్ర పత్తిభిస్సహ పత్తయః ।
హయా హయైరిభాశ్చేభైస్సమసజ్జంత సంయుగే ।। 8

తత్ర - అప్పుడు, సంయుగే - యుద్ధమునందు, రథినః - రథికులు, రథిభిః - రథికులతో, పత్తయః - కాలిబంట్లు, పత్తిభిః సహ - కాలిబంట్లతో సహా, హయాః - గుఱ్ఱములు, హయైః - గుఱ్ఱములతో, ఇభాః చ - ఏనుగులు కూడ, ఇభైః - ఏనుగులతో, సమసజ్జంత - యుద్ధమును చేసిరి.

అపుడా యుద్ధమునందు రథికులు రథికులతో, కాలిబంట్లు కాలిబంట్లతో, గుఱ్ఱపు రౌతులు గుఱ్ఱపు రౌతులతో, ఏనుగులపై నున్నవారు ఏనుగులపై యుద్ధమును చేయువారితో కలిసి యుద్ధమును చేసిరి.

ఉష్ట్రైః కేచిదిభైః కేచిదపరే యుయుధుః ఖరైః ।
కేచిద్గౌరమృగైర్ఋక్షైర్ద్వీపిభిర్హరిభిర్భటాః ।। 9

కేచిత్ - కొందరు, భటాః - యోధులు, ఉష్ట్రైః - ఒంటెలతో, కేచిత్ - కొందరు, ఇభైః - ఏనుగులతో, అపరే - మరికొందరు, ఖరైః - గాడిదలతో, కేచిత్ - కొందరు, గౌరమృగైః - గౌరమృగములతో, ఋక్షైః - ఎలుగుబంట్లతో, ద్వీపిభిః - పులులతో, హరిభిః - సింహములతో, యుయుధుః - యుద్ధమును చేసిరి.

కొందరు యోధులు ఒంటెలను, కొందరు ఏనుగులను, మరికొందరు గాడిదలను, కొందరు గౌరమృగములను, ఎలుగుబంట్లను, పులులను, సింహములను అధిష్ఠించి యుద్ధమును చేసిరి.

గృధ్రైః కంకైర్బకైరన్యే శ్యేనభాసైస్తిమింగిలైః ।
శరభైర్మహిషైః ఖడ్గైర్గోవృషైర్గవయారుణైః ।। 10

అన్యే - ఇతరులు, గృధ్రైః - గ్రద్దలతో, కంకైః - రాపులుగులతో, బకైః - కొంగలతో, శ్యేనభాసైః - డేగలు కోళ్లతో, తిమింగిలైః - తిమింగిల ములతో, శరభైః - మీగండ్ల మెకములతో, మహిషైః - దున్నలతో, ఖడ్గైః - ఖడ్గమృగములతో, గోవృషైః - ఎద్దులతో, గవయ-అరుణైః - గురుపోతులు అరుణమృగములతో.

గ్రద్దలు, రాపులుగులు, కొంగలు, డేగలు, కోళ్లు, తిమింగిలములు, మీగండ్ల మెకములు, దున్నలు, ఖడ్గమృగములు, ఎద్దులు, గురుపోతులు, అరుణమృగములు అనువాటిని వాహనములుగా చేసుకొని మరికొందరు యుద్ధమును చేసిరి.

శివాభిరాఖుభిః కేచిత్ కృకలాసైశ్శశైర్నరైః ।
బస్తైరేకే కృష్ణసారైర్హంసైరన్యే చ సూకరైః ॥ 11

కేచిత్ - కొందరు, శివాభిః - నక్కలతో, ఆఖుభిః - ఎలుకలతో, కృకలాసైః - ముంగిసలతో, శశైః - కుందేళ్లతో, నరైః - మానవులతో, బస్తైః - మేకలతో, ఏకే - కొందరు, కృష్ణసారైః - నల్లయిఱ్ఱిలతో, హంసైః - హంసలతో, అన్యే - మరికొందరు, సూకరైః చ - వరాహములతో.

నక్కలు, ఎలుకలు, ముంగిసలు, కుందేళ్లు, మానవులు, మేకలు, నల్లయిఱ్ఱిలు, హంసలు, వరాహములు అనే వాహనములనెక్కి భటులు యుద్ధమును చేసిరి.

అన్యే జలస్థలఖగైస్సత్త్వైర్వికృతవిగ్రహైః ।
సేనయోరుభయో రాజన్ వివిశుస్తేఽగ్రతోఽగ్రతః ॥ 12

రాజన్ - ఓ మహారాజా!, అన్యే - ఇతరులు, జలస్థలఖగైః - మెట్ట నీటి పక్షులతో, వికృతవిగ్రహైః - రోతను కలిగించే రూపము గల, సత్త్వైః - ప్రాణులతో, ఉభయోః - రెండు, సేనయోః - సేనలయందు, అగ్రతః అగ్రతః - ముందు ముందుకు, వివిశుః - ప్రవేశించిరి.

ఓ మహారాజా! ఇతరయోధులు మెట్ట పక్షులను, నీటి పక్షులను, రోతను కలిగించే రూపము గల ప్రాణులను వాహనములుగా చేసుకొని రెండు సేనలలో ముందు ముందుకు దూసుకు పోవుచుండిరి.

చిత్రధ్వజపటై రాజన్నాతపత్రైస్సితామలైః ।
మహాధనైర్వజ్రదండైర్వ్యజనైర్బార్హచామరైః ।। 13

వాతోద్ధతోత్తరోష్ణీషైరర్చిభిర్వర్మభూషణైః ।
స్ఫురద్భిర్విశదైశ్శస్త్రైస్సుతరాం సూర్యరశ్మిభిః ।। 14

దేవదానవవీరాణాం ధ్వజిన్యౌ పాండునందన ।
రేజతుర్వీరమాలాభిర్యాదసామివ సాగరౌ ।। 15

రాజన్ - ఓ మహారాజా!, పాండునందన - పాండువంశీయులకు ఆనందమును కలిగించువాడా!, చిత్రధ్వజపటైః - రంగురంగుల జెండా వస్త్రములతో, సిత-అమలైః - తెల్లని స్వచ్ఛమైన, ఆతపత్రైః - గొడుగులతో, మహాధనైః - మిక్కిలి విలువైన, వజ్రదండైః - వజ్రములు పొదిగిన కర్రలు గల, వ్యజనైః - విసనకర్రలతో, బార్హచామరైః - నెమలి యీకల వింజామరలతో, వాత-ఉద్ధత-ఉత్తర-ఉష్ణీషైః - గాలిచే ఎగురగొట్టబడుచున్న పై వస్త్రములు తలపాగలతో, అర్చిభిః - ప్రకాశించే, వర్మభూషణైః - కవచములతో ఆభరణములతో, సూర్యరశ్మిభిః - సూర్యుని కిరణములతో, సుతరామ్ - అధికముగా, స్ఫురద్భిః - ప్రకాశించే, విశదైః - స్వచ్ఛమైన, శస్త్రైః - ఆయుధములతో, వీరమాలాభిః - వీరుల మాలలచే, దేవదానవవీరాణామ్ - దేవవీరులు రాక్షసవీరులయొక్క, ధ్వజిన్యౌ - సేనలు, యాదసామ్ - జలచరముల, సాగరౌ ఇవ - సముద్రములు వలె, రేజతుః - ప్రకాశించినవి.

పాండువంశీయులకు ఆనందమును కలిగించే ఓ మహారాజా! రంగురంగుల జెండా వస్త్రములు, తెల్లని స్వచ్ఛమైన గొడుగులు, మిక్కిలి విలువైన వజ్రములు పొదిగిన కర్రలు గల విసనకర్రలు, నెమలి యీకల వింజామరలు, గాలికి ఎగురుచున్న పై వస్త్రములు తలపాగలు, ప్రకాశించే కవచములు ఆభరణములు, సూర్యకిరణములు పడి మెరిసిపోయే స్వచ్ఛ

మైన ఆయుధములు మరియు వీరుల మాలలు అనువాటితో ఆ దేవవీరుల మరియు రాక్షసవీరుల సేనలు, జలచరములతో నిండియున్న రెండు సముద్రముల వలె ప్రకాశించెను.

వైరోచనో బలిస్సంఖ్యే సోఽసురాణాం చమూపతిః ।
యానం వైహాయసం నామ కామగం మయనిర్మితమ్ ॥ 16

సర్వసాంగ్రామికోపేతం సర్వాశ్చర్యమయం ప్రభో ।
అప్రతర్క్యమనిర్దేశ్యం దృశ్యమానమదర్శనమ్ ॥ 17

ఆస్థితస్తద్విమానాగ్ర్యం సర్వానీకాధిపైర్వృతః ।
వాలవ్యజనఛత్రాగ్ర్యై రేజే చంద్ర ఇవోదయే ॥ 18

ప్రభో - ఓ మహారాజా!, అసురాణామ్ - రాక్షసులయొక్క, చమూపతిః - సేనానాయకుడు, వైరోచనః - విరోచనుని పుత్రుడు అగు, సః - ఆ, బలిః - బలి చక్రవర్తి, సంఖ్యే - యుద్ధమునందు, వైహాయసం నామ - వైహాయసము అని ప్రసిద్ధి గాంచినట్టియు, కామగమ్ - స్వేచ్ఛాసంచారియు, మయనిర్మితమ్ - మయునిచే నిర్మించబడినట్టియు, సర్వసాంగ్రామిక-ఉపేతమ్ - సకలములైన యుద్ధసామగ్రితో కూడియున్నట్టియు, సర్వ-ఆశ్చర్యమయమ్ - సకలములైన అద్భుతములతో నిండినట్టియు, అప్రతర్క్యమ్ - ఊహకు అందనట్టియు, అనిర్దేశ్యమ్ - వర్ణించి చెప్పుటకు శక్యము కానట్టియు, దృశ్యమానమ్ - కనబడేది, అదర్శనమ్ - కనబడనిది, తత్ - ఆ, విమాన-అగ్ర్యమ్ - విమానశ్రేష్ఠమును, ఆస్థితః - అధిష్ఠించినవారై, సర్వ-అనీక-అధిపైః - అందరు సేనానాయకులతో, వృతః - చుట్టువారబడినవారై, వాలవ్యజనఛత్రాగ్ర్యైః - వింజామరలు శ్రేష్ఠమైన ఛత్రములతో, వృతః - కూడియున్నవారై, ఉదయే - ఉదయ పర్వతమునందు, చంద్రః ఇవ - చంద్రుడు వలె, రేజే - ప్రకాశించెను.

విరోచనుని పుత్రుడగు బలి చక్రవర్తి రాక్షసుల సేనకు నాయకుడు. ఇతర సేనానాయకులు ఆయనను చుట్టువారి యుండిరి. ఆయన వింజామరలతో మరియు శ్రేష్ఠమైన ఛత్రముతో కూడి ఉదయ పర్వతమునందలి చంద్రుడు వలె ప్రకాశించెను. ఆయన యుద్ధములో వైహాయసమని ప్రసిద్ధి

గాంచిన యథేచ్ఛాసంచారియగు గొప్ప విమానమును అధిష్ఠించెను. మయునిచే నిర్మించబడిన ఆ విమానమునందు సమస్తమైన యుద్ధసామగ్రి గలదు. అనేకములగు అద్భుతవస్తువులతో నిండియున్న ఆ విమానమును మనస్సుతో ఊహించుట గాని, వాక్కుతో వర్ణించుట గాని శక్యము కాదు. అది ఒకప్పుడు కనబడి, మరియొకప్పుడు అదృశ్యమగును.

తస్యాసన్ సర్వతో యానైర్యూథానాం పతయోఽసురాః ।
నముచిశ్శంబరో బాణో విప్రచిత్తిరయోముఖః ॥ 19

ద్విమూర్ధా కాలనాభోఽథ ప్రహేతిర్హేతిరిల్వలః ।
శకునిర్భూతసంతాపో వజ్రదంష్ట్రో విరోచనః ॥ 20

హయగ్రీవశ్శంకుశిరా కపిలో మేఘదుందుభిః ।
తారకశ్చక్రదృక్శుంభో నిశుంభో జంభ ఉత్కలః ॥ 21

అరిష్టోఽరిష్టనేమిశ్చ మయశ్చ త్రిపురాధిపః ।
అన్యే పౌలోమకాలేయా నివాతకవచాదయః ॥ 22

తస్య - ఆ బలి చక్రవర్తికి, సర్వతః - అన్ని వైపులా, యూథానామ్ - సేనలకు, పతయః - నాయకులైన, అసురాః - రాక్షసులు, యానైః - వాహనములతో, ఆసన్ - ఉండిరి, నముచిః - నముచి, శంబరః - శంబరుడు, బాణః - బాణుడు, విప్రచిత్తిః - విప్రచిత్తి, అయోముఖః - అయోముఖుడు, ద్విమూర్ధా - ద్విమూర్ధుడు, కాలనాభః - కాలనాభుడు, అథ - మరియు, ప్రహేతిః - ప్రహేతి, హేతిః - హేతి, ఇల్వలః - ఇల్వలుడు, శకునిః - శకుని, భూతసంతాపః - భూతసంతాపుడు, వజ్రదంష్ట్రః - వజ్రదంష్ట్రుడు, విరోచనః - విరోచనుడు, హయగ్రీవః - హయగ్రీవుడు, శంకుశిరాః - శంకుశిరసుడు, కపిలః - కపిలుడు, మేఘదుందుభిః - మేఘదుందుభి, తారకః - తారకుడు, చక్రదృక్ - చక్రదృక్కు, శుంభః - శుంభుడు, నిశుంభః - నిశుంభుడు, జంభః - జంభుడు, ఉత్కలః - ఉత్కలుడు, అరిష్టః - అరిష్టుడు, అరిష్టనేమిః చ - అరిష్టనేమి కూడ, మయః చ - మయుడు, త్రిపురాధిపః - త్రిపురాధిపుడు, అన్యే - ఇతరులైన, పౌలోమకాలేయాః - పౌలో

ములు కాలేయులు అనే రాక్షసుల గణములు, నివాతకవచ-ఆదయః - నివాతకవచులు మొదలగువారు.

నముచి, శంబరుడు, బాణుడు, విప్రచిత్తి, అయోముఖుడు, ద్విమూర్ధుడు, కాలనాభుడు, ప్రహేతి, హేతి, ఇల్వలుడు, శకుని, భూతసంతాపుడు, వజ్రదంష్ట్రుడు, విరోచనుడు, హయగ్రీవుడు, శంకుశిరసుడు, కపిలుడు, మేఘదుందుభి, తారకుడు, చక్రదృక్కు, శుంభుడు, నిశుంభుడు, జంభుడు, ఉత్కలుడు, అరిష్టుడు, అరిష్టనేమి, మయుడు, త్రిపురాధిపుడు అనే రాక్షస సేనానాయకులు, పౌలోములు కాలేయులు అనే ఇతర రాక్షస గణములు, నివాతకవచులు మొదలగు రాక్షసులు ఆ బలి చక్రవర్తికి అన్ని వైపులా తమ తమ వాహనములపై నిలిచి యుండిరి.

అలబ్ధభాగాస్సోమస్య కేవలం క్లేశభాగినః ।
సర్వ ఏతే రణముఖే బహుశో నిర్జితామరాః ॥ 23

సోమస్య - అమృతముయొక్క, అలబ్ధభాగాః - పొందబడని భాగము గలవారు, కేవలమ్ - కేవలము, క్లేశభాగినః - ప్రయాసలో భాగము గలవారు, ఏతే - వీరు, సర్వే - అందరు, బహుశః - పలుమార్లు, రణముఖే - యుద్ధమునకు ఆరంభమునందు, నిర్జిత-అమరాః - జయించబడిన దేవతలు గలవారు.

వారందరు అమృతము కొరకై ప్రయాసలో పాలు పంచుకున్నవారే గాని, అమృతములో వాటాను పొందినవారు గారు. వారు ఇదివరలో పలుమార్లు దేవతలను యుద్ధమునకు ఆరంభమునందే జయించినవారే.

సింహనాదాన్ విముంచంతశ్శంఖాన్ దధ్ముర్మహారవాన్ ।
దృష్ట్వా సపత్నానుత్సిక్తాన్ బలభిత్కుపితో భృశమ్ ॥ 24

సింహనాదాన్ - సింహనాదములను, విముంచంతః - విడిచి పెట్టుచున్నవారై, మహారవాన్ - పెద్ద ధ్వని చేసే, శంఖాన్ - శంఖములను, దధ్ముః - పూరించిరి, ఉత్సిక్తాన్ - గర్వించియున్న, సపత్నాన్ - శత్రు

వులను, దృష్ట్వా - చూచి, బలభిత్ - ఇంద్రుడు, భృశమ్ - మిక్కిలి, కుపితః - కోపించినవాడు.

ఆ రాక్షసులు సింహనాదములను చేయుచూ, పెద్ద ధ్వనిని చేసే శంఖములను పూరించిరి. గర్వించియున్న శత్రువులను చూచి ఇంద్రుడు చాల కోపమును పొందెను.

ఐరావతం దిక్కరిణమారూఢశ్శుశుభే స్వరాట్ ।
యథా స్రవత్ప్రస్రవణముదయాద్రిమహర్పతిః ॥ 25

స్వరాట్ - స్వర్గాధిపతియగు ఇంద్రుడు, ఐరావతమ్ - ఐరావతమనే, దిక్-కరిణమ్ - దిగ్గజమును, ఆరూఢః - ఎక్కినవాడై, స్రవత్-ప్రస్రవణమ్ - ప్రవహించే కొండ కాలువలు గల, ఉదయ-అద్రిమ్ - ఉదయ పర్వతమును (అధిష్ఠించిన), అహః-పతిః యథా - సూర్యుడు వలె, శుశుభే - శోభిల్లెను.

స్వర్గాధిపతియగు ఇంద్రుడు ఐరావతమనే దిగ్గజమును అధిష్ఠించెను. ఆయన ప్రవహించే కొండకాలువలతో కూడియున్న ఉదయ పర్వతమునధిష్ఠించిన సూర్యుడు వలె ప్రకాశించెను (దిగ్గజము కపోలమునుండి స్రవించే మదధారలకు కొండ కాలువల పోలిక).

తస్యాసన్ సర్వతో దేవా నానావాహధ్వజాయుధాః ।
లోకపాలాస్సహ గణైర్వాయ్వగ్నివరుణాదయః ॥ 26

తస్య - వానికి, సర్వతః - అన్ని వైపులా, నానావాహధ్వజ-ఆయుధాః - పలువిధముల వాహనములు ధ్వజములు ఆయుధములు గల, దేవాః - దేవతలు, వాయు-అగ్నివరుణ-ఆదయః - వాయువు అగ్ని వరుణుడు మొదలైన, లోకపాలాః - లోకపాలకులు, గణైః సహ - గణములతో బాటుగా, ఆసన్ - ఉండిరి.

ఆ ఇంద్రునకు అన్ని వైపులా దేవతలు పలురకముల వాహనములతో ధ్వజములతో ఆయుధములతో నిలిచియుండిరి. వాయువు, అగ్ని,

వరుణుడు, కుబేరుడు మొదలైన లోకపాలకులు తమ తమ గణములతో బాటుగా ఆయన చుట్టూ నిలిచిరి.

తేఽన్యోన్యమభిసంసృత్య క్షిపంతో మర్మభిర్మిథః ।
ఆహ్వయంతో విశంతోఽగ్రే యుయుధుర్ద్వంద్వయోధినః ॥27

ద్వంద్వయోధినః - ద్వంద్వయుద్ధమును చేసే, తే - వారు, అన్యోన్యమ్ - పరస్పరము, అభిసంసృత్య - ఎదురెదురుగా వచ్చి, మిథః - పరస్పరము, మర్మభిః - పరుషవచనములచే, క్షిపంతః - నిందించుకొను చున్నవారై, ఆహ్వయంతః - పేరు పేరునా యుద్ధమునకు కాసుకొమ్మని పిలుచువారై, అగ్రే - ముందుకు, విశంతః - దూసుకుపోవువారై, యుయుధుః - యుద్ధమును చేసిరి.

ద్వంద్వయుద్ధమునందు వీరులగు ఆ దేవతలు, రాక్షసులు ఒకరికె దురుగా మరియొకరు తారసపడి పరస్పరము నిందావాక్యములను పలు కుచుండిరి. వారు పేరు పేరునా ప్రత్యర్థులను యుద్ధమునకు కాసుకొమ్మని పిలుస్తూ ముందుకు దూసుకుపోవుచుండిరి. ఈ విధముగా వారు యుద్ధ మును చేసిరి.

యుయోధ బలిరింద్రేణ తారకేణ గుహోఽస్యత ।
వరుణో హేతినాయుధ్యన్మిత్రో రాజన్ ప్రహేతినా ॥ 28

రాజన్ - ఓ మహారాజా!, బలిః - బలి చక్రవర్తి, ఇంద్రేణ - ఇంద్రు నితో, యుయోధ - యుద్ధమును చేసెను, తారకేణ - తారకునితో, గుహః - కుమారస్వామి, అస్యత - ఆయుధములను ప్రయోగించెను, వరుణః - వరుణుడు, హేతినా - హేతితో, మిత్రః - మిత్రుడు, ప్రహేతినా - ప్రహేతి తో, అయుధ్యత్ - యుద్ధమును చేసెను.

ఓ మహారాజా! బలి చక్రవర్తి ఇంద్రునితో, వరుణుడు హేతితో, మిత్రుడు ప్రహేతితో యుద్ధమును చేసిరి. కుమారస్వామి తారకునిపై ఆయుధములను ప్రయోగించెను.

యమస్తు కాలనాభేన విశ్వకర్మా మయేన వై ।
శంబరో యుయుధే త్వష్ట్రా సవిత్రా తు విరోచనః ॥ 29

యమః తు - యముడైతే, కాలనాభేన - కాలనాభునితో, విశ్వకర్మా - విశ్వకర్మ, మయేన వై - మయునితో, శంబరః - శంబరుడు, త్వష్ట్రా - త్వష్టతో, సవిత్రా తు - సవితతోనైతే, విరోచనః - విరోచనుడు, యుయుధే - యుద్ధమును చేసెను.

యముడు కాలనాభునితో, విశ్వకర్మ మయునితో, శంబరుడు త్వష్టతో, విరోచనుడు సవితతో యుద్ధమును చేసెను.

అపరాజితేన నముచిరశ్వినౌ వృషపర్వణా ।
సూర్యో బలిసుతైర్దేవో బాణజ్యేష్ఠైశ్శతేన చ ॥ 30

నముచిః - నముచి, అపరాజితేన - అపరాజితునితో, అశ్వినౌ - అశ్వినీ దేవతలు, వృషపర్వణా - వృషపర్వునితో, సూర్యః దేవః చ - సూర్యదేవుడు, బలిసుతైః - బలియొక్క పుత్రులైనట్టియు, బాణజ్యేష్ఠైః - బాణుడు జ్యేష్ఠుడుగా గల, శతేన - వందతో.

నముచి అపరాజితునితో, అశ్వినీ దేవతలు వృషపర్వునితో, సూర్యదేవుడు బలిచక్రవర్తియొక్క పుత్రులు బాణుడు మొదలగువారు వందమందితో యుద్ధమును చేసిరి.

రాహుణా చ తథా సోమః పులోమ్నా యుయుధేऽనిలః ।
నిశుంభశుంభయోర్దేవీ భద్రకాలీ తరస్వినీ ॥ 31

తథా - అదే విధముగా, సోమః చ - చంద్రుడు కూడ, రాహుణా - రాహువుతో, అనిలః - వాయుదేవుడు, పులోమ్నా - పులోమతో, తరస్వినీ - వేగము గల, భద్రకాలీ - భద్రకాళి, నిశుంభశుంభయోః - నిశుంభశుంభులతో, యుయుధే - యుద్ధమును చేసెను.

చంద్రుడు రాహువుతో, వాయుదేవుడు పులోమతో, వేగము గల భద్రకాళి నిశుంభ-శుంభులతో యుద్ధమును చేసిరి.

వృషాకపిస్తు జంభేన మహిషేణ విభావసుః ।
ఇల్వలస్సహవాతాపిర్బ్రహ్మపుత్రైరరిందమ ॥ 32

అరిందమ - శత్రువులను నియంత్రించువాడా!, వృషాకపిః తు - శివుడైతే, జంభేన - జంభునితో, విభావసుః - అగ్ని, మహిషేణ - మహిషునితో, సహవాతాపిః - వాతాపితో గూడియున్న, ఇల్వలః - ఇల్వలుడు, బ్రహ్మపుత్రైః - బ్రహ్మగారి పుత్రులతో.

శత్రువులను నియంత్రించిన ఓ మహారాజా! శివుడు జంభునితో, అగ్ని మహిషునితో, వాతాపి మరియు ఇల్వలుడు బ్రహ్మగారి పుత్రులగు మరీచి మొదలగువారితో యుద్ధమును చేసిరి.

కామదేవేన దుర్మర్ష ఉత్కలో మాతృభిస్సహ ।
బృహస్పతిశ్చోశనసా నరకేణ శనైశ్చరః ॥ 33

దుర్మర్షః - దుర్మర్షుడు, కామదేవేన - మన్మథునితో, ఉత్కలః - ఉత్కలుడు, మాతృభిః సహ - బ్రాహ్మి మొదలగు మాతృగణములతో కూడి, బృహస్పతిః చ - బృహస్పతి కూడ, ఉశనసా - శుక్రాచార్యునితో, శనైశ్చరః - శనిదేవుడు, నరకేణ - నరకునితో.

దుర్మర్షుడు మన్మథునితో, ఉత్కలుడు బ్రాహ్మి మొదలగు మాతృగణములతో, బృహస్పతి శుక్రాచార్యునితో, శనిదేవుడు వరుణునితో యుద్ధమును చేసిరి.

మరుతో నివాతకవచైః కాలేయైర్వసవోఽమరాః ।
విశ్వేదేవాస్తు పౌలోమై రుద్రాః క్రోధవశైస్సహ ॥ 34

మరుతః - మరుత్తులు, నివాతకవచైః - నివాతకవచులతో, వసవః - వసువులు అనే, అమరాః - దేవతలు, కాలేయైః - కాలేయులతో, విశ్వేదేవాః తు - విశ్వేదేవతలైతే, పౌలోమైః - పౌలోములతో, రుద్రాః - రుద్రులు, క్రోధవశైః సహ - క్రోధవశులనే సర్పములతో గూడి.

మరుత్తులు నివాతకవచులతో, వసువులనే దేవతలు కాలేయుల తో, విశ్వేదేవతలు పౌలోములతో, రుద్రులు క్రోధవశులనే సర్పములతో యుద్ధమును చేసిరి.

త ఏవమాజావసురాస్సురేంద్రా
ద్వంద్వేన సంహత్య చ యుధ్యమానాః ।
అన్యోన్యమాసాద్య నిజఘ్నురోజసా
జిగీషవస్తీక్ష్ణశరాసితోమరైః ॥ 35

ఆజౌ - యుద్ధమునందు, జిగీషవః - జయించ గోరే, తే - ఆ, అసురాః - రాక్షసులు, సుర-ఇంద్రాః చ - దేవనాయకులు కూడ, ఏవమ్ - ఈ విధముగా, ద్వంద్వేన - ఇద్దరు చొప్పున, సంహత్య - కలుసుకొని, అన్యోన్యమ్ - పరస్పరము, ఆసాద్య - ఎదురేగి, తీక్ష్ణశర-అసితోమరైః - వాడి బాణములు కత్తులు చిల్లకోలలతో, ఓజసా - బలముగా, నిజఘ్నుః -

రాక్షసులు, దేవనాయకులు యుద్ధములో జయమును గోరి ఈ విధముగా ఇద్దరిద్దరు చొప్పున కలిసి పరస్పరము ఎదురేగి వాడి బాణము లు, కత్తులు, చిల్లకోలలతో బలముగా కొట్టుకొనిరి.

భుశుండిభిశ్చక్రగదర్ష్టిపట్టిశైః
శక్త్యుల్ముకైః ప్రాసపరశ్వధైరపి ।
నిస్త్రింశభల్లైః పరిఘైస్సముద్గరైః
సభిందిపాలైశ్చ శిరాంసి చిచ్ఛిదుః ॥ 36

భుశుండిభిః - భుశుండులతో, చక్రగదా-ఋష్టిపట్టిశైః - చక్రములు గదలు చురకత్తులు అడ్డకత్తులతో, శక్తి-ఉల్ముకైః - శక్తులు కొరవిలతో, ప్రాస పరశ్వధైః అపి - ఈటెలు గండ్ర గొడ్డళ్లతో కూడ, నిస్త్రింశభల్లైః - కత్తులు బల్లెములతో, సముద్గరైః - ఇనుప రోకళ్లతో గూడిన, సభిందిపాలైః - ముళ్ల గదలతో గూడిన, పరిఘైః చ - ఇనుప గుదియలతో కూడ, శిరాంసి - తల లను, చిచ్ఛిదుః - తెగగొట్టిరి.

భుశుండులు, చక్రములు, గదలు, చురకత్తులు, అర్ధకత్తులు, కత్తులు, శక్తులు, కొరవిలు, ఈటెలు, గండ్ర గొడ్డళ్లు, బల్లెములు, ఇనుప రోకళ్లు, ముళ్ల గదలు మరియు ఇనుప గుదియలతో వారు శత్రువుల తలలను నరుకుచుండిరి.

గజాస్తురంగాస్సరథాః పదాతయః
సారోహవాహా వివిధా విఖండితాః ।
నికృత్తబాహూరుశిరోధరాంఘ్రయః
ఛిన్నధ్వజేష్వాసతనుత్రభూషణాః ।। 37

గజాః - ఏనుగులు, సరథాః - రథములతో గూడిన, తురంగాః - గుఱ్ఱములు, పదాతయః - కాలిబంట్లు, వివిధాః - పలురకముల, సారోహవాహాః - యుద్ధవీరులతో గూడిన వాహనములు, విఖండితాః - విరుగగొట్టబడినవి, నికృత్తబాహు-ఊరుశిరః-ధర-అంఘ్రయః - తెగగొట్టబడిన చేతులు తొడలు మెడలు కాళ్లు కలవారు, ఛిన్నధ్వజ-ఇషు-ఆసతనుత్రభూషణాః - విరుగగొట్టబడిన జెండాలు ధనుస్సులు కవచములు మరియు ఆభరణములు గలవారు.

ఏనుగులు, గుఱ్ఱములు, కాలిబంట్లు, వాహనములపై యుద్ధమును చేసే యోద్ధలయొక్క చేతులు, తొడలు, మెడలు, కాళ్లు నరకబడినవి. రథములు, పలువిధముల వాహనములు విరుగ గొట్టబడినవి. రథముల జెండాలు, యోద్ధల ధనుస్సులు, కవచములు, ఆభరణములు చెల్లాచెదరుగా పడియుండెను.

తేషాం పదాఘాతరథాంగచూర్ణితా-
దాయోధనాదుల్బణ ఉత్థితస్తదా ।
రేణుర్దిశః ఖం ద్యుమణిం చ ఛాదయన్
న్యవర్తతాసృక్స్రుతిభిః పరిప్లుతాత్ ।। 38

తదా - అప్పుడు, తేషామ్ - వారియొక్క, పద-ఆఘాతరథ-అంగచూర్ణితాత్ - పాదముల త్రొక్కుడులచే రథచక్రములచే పొడిగా చేయబడి

న, ఆయోధనాత్ - యుద్ధభూమినుండి, ఉత్థితః - పైకి లేచిన, ఉల్బణః - అతిశయించిన, రేణుః - ధూళి, దిశః - దిక్కులను, ఖమ్ - ఆకాశమును, ద్యుమణిం చ - సూర్యుని కూడ, ఛాదయన్ - కప్పివేయుచున్నదై, అసృక్-స్రుతిభిః - రక్తధారలచే, పరిప్లుతాత్ - అంతటా తడిసిన యుద్ధభూమి నుండి, న్యవర్తత - తొలగిపోయెను.

వారు కాళ్లతో త్రొక్కుటచే మరియు రథచక్రముల తిరుగుటచే యుద్ధభూమి పొడి పొడి ఆయెను. ఆ యుద్ధభూమినుండి అప్పుడు అతిశయించిన ధూళి పైకి లేచి దిక్కులను, ఆకాశమును, సూర్యుని కూడ కప్పివేసెను. కొంత సేపు తరువాత ఆ యుద్ధభూమి అంతటా రక్తపు ధారలతో తడియగా ఆ ధూళి అణిగిపోయెను.

శిరోభిరుద్ధూతకిరీటకుండలైః
సంరంభదృగ్భిః పరిదష్టదచ్ఛదైః ।
మహాభుజైస్సాభరణైస్సహాయుధైః
సా ప్రాస్తృతా భూః కరభోరుభిర్బభౌ ॥ 39

ఉద్ధూతకిరీటకుండలైః - ఎగురకొట్టబడిన కిరీటములు కుండలములు కలిగినట్టియు, సంరంభదృగ్భిః - కోపముతో నిండిన కన్నులు కలిగినట్టియు, పరిదష్టదచ్ఛదైః - కొరకబడిన పెదవులు గల, శిరోభిః - తలలతో, స-ఆభరణైః - ఆభరణములతో కూడినట్టియు, సహ-ఆయుధైః - ఆయుధములతో కూడియున్న, మహాభుజైః - గొప్ప భుజములతో, కరభ-ఊరుభిః - ఏనుగు తొండములవంటి తొడలతో, సా - ఆ, భూః - నేల, ప్రాస్తృతా - అంతటా పరచబడినదై, బభౌ - ప్రకాశించెను.

ఆ యుద్ధభూమి తెగి పడిన తలలు, గొప్ప భుజములు, ఏనుగు తొండములవంటి తొడలు, ఆభరణములు, మరియు ఆయుధములతో అంతటా పరచబడి ప్రకాశించెను. కొన్ని తలలకు కిరీటములు, మరికొన్నిటికి కుండలములు ఎగిరిపోయెను. కొన్ని తలలకు కోపముతో నిండిన కన్నులు గలవు. మరికొన్ని తలల పెదవులు పళ్లతో కరచియుండెను.

కబంధాస్తత్ర చోత్పేతుః పతితస్వశిరోఽక్షిభిః ।
ఉద్యతాయుధదోర్దండైరాధావంతో భటాన్ మృధే ॥ 40

తత్ర - ఆ సమయమునందు, మృధే - యుద్ధభూమియందు, పతితస్వశిరః-అక్షిభిః - నేల రాలిన తమ తలలు కన్నులతో, ఉద్యత-ఆయుధదోర్దండైః - పైకి ఎత్తబడిన దండములవంటి భుజములతో, కబంధాః చ - మొండెములు కూడ, ఉత్పేతుః - పైకి లేచినవి, భటాన్ - భటులనుద్దేశించి, ఆధావంతః - అంతటా పరుగెత్తుచున్నవి.

ఆ సమయములో యుద్ధభూమియందు మొండెములు కూడ దండములవంటి చేతులలో ఆయుధములను పట్టుకొని పైకి లేచి భటుల పైకి అంతటా పరుగులు తీయుచుండెను. అవి తెగిపడిన తమ తలలయందలి కన్నులతో చూచుచుండెను.

బలిర్మహేంద్రం దశభిస్త్రిభిరైరావతం శరైః ।
చతుర్భిశ్చతురో వాహానేకేనారోహమార్ఛయత్ ॥ 41

బలిః - బలి చక్రవర్తి, మహేంద్రమ్ - మహేంద్రుని, దశభిః - పది, శరైః - బాణములతో, ఐరావతమ్ - ఐరావతమును, త్రిభిః - మూడు, చతురః - నాలుగు, వాహాన్ - పాదరక్షకులను, చతుర్భిః - నాలుగు, ఏకేన - ఒకదానితో, ఆరోహమ్ - మావటివానిని, అర్ఛయత్ - కొట్టెను.

బలి చక్రవర్తి మహేంద్రునిపై పది బాణములను, ఐరావతముపై మూడింటిని, నల్గురు పాదరక్షకులపై నాలుగింటిని, మావటివానిపై ఒక బాణమును వేసి కొట్టెను.

స తానాపతతశ్శక్రస్తావద్భిశ్శీఘ్రవిక్రమః
చిచ్ఛేద నిశితైర్భల్లైరసంప్రాప్తాన్ హసన్నివ ॥ 42

శీఘ్రవిక్రమః - శీఘ్రమగు పరాక్రమము గల, సః - ఆ, శక్రః - ఇంద్రుడు, హసన్ ఇవ - చిరునవ్వు నవ్వుచున్నవాడు వలె, ఆపతతః - వచ్చి పడుచున్నట్టియు, అసంప్రాప్తాన్ - దగ్గరకు రాని, తాన్ - ఆ బాణము

లను, నిశితైః - వాడియైన, తావద్భిః - అంతే సంఖ్యగల, భల్లైః - బాణము లతో, చిచ్ఛేద - తెగగొట్టెను.

శీఘ్రమగు పరాక్రమము గల ఆ ఇంద్రుడు చిరునవ్వుతో అంతే సంఖ్యలో బాణములను ప్రయోగించి మీదకు వచ్చుచున్న ఆ బాణములను దగ్గరకు రాకముందే తెగగొట్టెను.

**తస్య కర్మోత్తమం వీక్ష్య దుర్మర్షశ్శక్తిమాదదే ।**
**తాం జ్వలంతీం మహోల్కాభాం హస్తస్థామచ్ఛినద్ధరిః ।। 43**

తస్య - ఆ ఇంద్రునియొక్క, ఉత్తమమ్ - గొప్ప, కర్మ - పనిని, వీక్ష్య - చూచి, దుర్మర్షః - సహించనివాడై బలి, శక్తిమ్ - శక్తి ఆయుధము ను, ఆదదే - చేతిలోనికి తీసుకొనెను, హరిః - ఇంద్రుడు, జ్వలంతీమ్ - మండుచున్నట్టియు, మహా-ఉల్క-ఆభామ్ - పెద్ద తోకచుక్క వలె ప్రకాశిం చుచున్నట్టియు, హస్తస్థామ్ - చేతియందున్న, తామ్ - దానిని, అచ్ఛినత్ - ఛేదించెను.

ఆ ఇంద్రుని ఆ ఉత్తమమగు కర్మను చూచి బలి చక్రవర్తి సహించ లేక పోయెను. ఆయన మండుతూ పెద్ద తోకచుక్కవలె ప్రకాశించే ఒక శక్తి ఆయుధమును చేతిలోనికి తీసుకొనెను. ఇంద్రుడు దానిని ఆయన చేతిలో ఉండగానే ఛేదించెను.

**తతశ్శూలం తతః ప్రాసం తతస్తోమరమృష్టయః ।**
**యద్యచ్ఛస్త్రం సమాదద్యాత్సర్వం తదచ్ఛినద్విభుః ।। 44**

**తతః** - తరువాత, శూలమ్ - శూలమును, **తతః** - తరువాత, ప్రాసమ్ - ఈటెను, తతః - తరువాత, తోమరమ్ - చిల్లకోలను, ఋష్టయః - కత్తులను, యత్ యత్ - ఏయే, శస్త్రమ్ - ఆయుధమును, సమాద ద్యాత్ - తీసుకొనునో, తత్ - ఆ, సర్వమ్ - సర్వమును, విభుః - సమర్థు డగు ఇంద్రుడు, అచ్ఛినత్ - ఛేదించెను.

తరువాత శూలమును, తరువాత ఈటెను, తరువాత చిల్లకోలను, తరువాత కత్తులను, ఈ విధముగా బలి ఏయే ఆయుధములను చేతిలోనికి తీసుకొనెనో వాటిని అన్నింటినీ సమర్థుడగు ఇంద్రుడు ఛేదించెను.

ససర్జాథాసురీం మాయామంతర్ధానగతోऽసురః ।
తతః ప్రాదురభూచ్ఛైలస్సురానీకోపరి ప్రభో ॥ 45

ప్రభో - ఓ మహారాజా!, అథ - తరువాత, అసురః - రాక్షసుడగు బలి, అంతర్ధానగతః - అంతర్ధానమును పొందినవాడై, ఆసురీమ్ - రాక్షసులకు చెందిన, మాయామ్ - మాయను, ససర్జ - సృష్టించెను, తతః - అప్పుడు, సుర-అనీక-ఉపరి - దేవతల సైన్యము పైన, శైలః - పర్వతము, ప్రాదుః-అభూత్ - ఆవిర్భవించెను.

ఓ మహారాజా! తరువాత రాక్షసుడగు ఆ బలి అంతర్ధానమై రాక్షస మాయను సృష్టించెను. అప్పుడు దేవసైన్యము పైన ఒక పర్వతము ఆవిర్భవించెను.

తతో నిపేతుస్తరవో దహ్యమానా దవాగ్నినా ।
శిలాస్సటంకశిఖరాశ్చూర్ణయంత్యో ద్విషద్బలమ్ ॥ 46

తతః - దానినుండి, దవ-అగ్నినా - కార్చిచ్చుచే, దహ్యమానాః - తగులబెట్ట బడుచున్న, తరవః - చెట్లు, సటంకశిఖరాః - ఉలివలె వాడియైన కొనలతో గూడిన, శిలాః - రాళ్ళు, ద్విషద్-బలమ్ - శత్రుసైన్యమును, చూర్ణయంత్యః - పిండి చేయుచున్నవై, నిపేతుః - పడినవి.

ఆ పర్వతమునుండి కార్చిచ్చుచే తగులబెట్ట బడుచున్న చెట్లు, ఉలివలె వాడియైన కొనలు గల రాళ్ళు పడి శత్రు (దేవతల) సైన్యమును పిండి చేసినవి.

మహోరగాస్సముత్పేతుర్దందశూకాస్సవృశ్చికాః ।
సింహవ్యాఘ్రవరాహాశ్చ మర్దయంతో మహాగజాన్ ॥ 47

మహా-ఉరగాః - పెద్ద పాములు, సవృశ్చికాః - తేళ్లతో గూడియు న్న, దందశూకాః - త్రాచుపాములు, మహాగజాన్ - గొప్ప ఏనుగులను, మర్దయంతః - సంహరించుచున్న, సింహవ్యాఘ్రవరాహాః చ - సింహ ములు పెద్ద పులులు అడవి పందులు కూడ, సముత్పేతుః - బయల్వెడలి నవి.

పెద్ద పాములు, త్రాచులు, తేళ్లు బయల్వెడలినవి. సింహములు, పెద్ద పులులు, అడవి పందులు బయల్వెడలి గొప్ప ఏనుగులను సంహ రించ జొచ్చెను.

యాతుధాన్యశ్చ శతశశ్శూలహస్తా వివాససః ।
ఛింధి భింధీతి వాదిన్యస్తథా రక్షోగణాః ప్రభో ॥ 48

ప్రభో - ఓ మహారాజా!, శూలహస్తాః - శూలములు చేతుల యందు గలవారు, వివాససః - దిగంబరలు అగు, యాతుధాన్యః చ - రాక్ష సస్త్రీలు, శతశః - వందలాదిగా, ఛింధి - నరుకుము, భింధి - పగులగొట్టు ము, ఇతి - అని, వాదిన్యః - పలుకుచున్నవారై, తథా - అదే విధముగా, రక్షః-గణాః - రాక్షసుల గణములు.

ఓ మహారాజా! శూలములను చేతబట్టి దిగంబరలై రాక్షసస్త్రీలు మరియు రాక్షసుల గణములు వందలాదిగా ఆవిర్భవించిరి. వారు నరు కుము, పగుల గొట్టుము అని పలుకుచుండిరి.

తతో మహాఘనా వ్యోమ్ని గంభీరపరుషస్వనాః ।
అంగారాన్ముముచుర్వాతైరాహతాః స్తనయిత్నవః ॥ 49

తతః - తరువాత, వ్యోమ్ని - ఆకాశమునందు, గంభీరపరుష స్వనాః - గంభీరమైన కఠోరమైన ధ్వని గలవి, వాతైః - గాలులచే, ఆహతాః - ఢీకొనునట్లు చేయబడినవి, స్తనయిత్నవః - గర్జించుచున్నవి అగు, మహా ఘనాః - పెద్ద మేఘములు, అంగారాన్ - మండే నిప్పులను, ముముచుః - విడిచి పెట్టినవి.

తరువాత ఆకాశమునందు పెద్ద మేఘముల గుంపులు వచ్చి గాలుల కారణముగా ఢీకొనుచూ గంభీరముగా కర్ణకఠోరముగా గర్జిస్తూ మండే నిప్పులను విడిచి పెట్టినవి.

సృష్టో దైత్యేన సుమహాన్ వహ్నిశ్శ్వసనసారథిః ।
సాంవర్తక ఇవాత్యుగ్రో విబుధధ్వజినీమధాక్ ॥ 50

దైత్యేన - రాక్షసుడగు బలిచే, సృష్టః - సృష్టించబడినది, సుమహాన్ - చాల పెద్దది, శ్వసనసారథిః - వాయువుచే వ్యాపింప జేయబడునది, సాంవర్తకః ఇవ - ప్రళయకాలాగ్ని వలె, అతి-ఉగ్రః - మిక్కిలి భయంకరమైనది అగు, వహ్నిః - అగ్ని, విబుధధ్వజినీమ్ - దేవతల సైన్యమును, అధాక్ - తగుల

రాక్షసుడగు బలి చాల పెద్ద అగ్నిని సృష్టించెను. అది ప్రళయకాలాగ్ని వలె చాల భయమును గొల్పెను. గాలి దానిని వ్యాపింప జేయుగా, అది దేవసైన్యమును తగులబెట్ట జొచ్చెను.

తతస్సముద్ర ఉద్వేలస్సర్వతః ప్రత్యదృశ్యత ।
ప్రచండవాతైరుద్ధూతతరంగావర్తభీషణః ॥ 51

తతః - తరువాత, సర్వతః - అంతటా, ఉద్వేలః - చెలియలి కట్టను దాటునది, ప్రచండవాతైః - మిక్కిలి వేగము గల గాలులచే, ఉద్ధూత తరంగ-ఆవర్తభీషణః - లేవగొట్టబడిన తరంగములచే మరియు సుడిగుండములచే భయమును గొల్పుచున్నది అగు, సముద్రః - సముద్రము, ప్రత్యదృశ్యత - కానవచ్చెను.

తరువాత చెలియలి కట్టను దాటిన సముద్రము (సునామీ) అంతటా కానవచ్చెను. ప్రచండమైన గాలులు దానియందు తరంగములను, సుడిగుండములను లేవగొట్టుచుండగా, అది చాల భయమును గొల్పుచుండెను.

ఏవం దైత్యైర్మహామాయైరలక్ష్యగతిభీషణైః ।
సృజ్యమానాసు మాయాసు విషేదుస్సురసైనికాః ॥ 52

ఏవమ్ - ఈ విధముగా, మహామాయైః - మహామాయావులైనట్టి యు, అలక్ష్యగతిభీషణైః - కంటికి కానరాని గమనముచే భయమును గొల్పు, దైత్యైః - రాక్షసులచే, మాయాసు - మాయలు, సృజ్యమానాసు - సృష్టించబడుచుండగా, సురసైనికాః - దేవసైనికులు, విషేదుః - విషాద మును పొందిరి.

ఈ విధముగా మహామాయావులగు రాక్షసులు కంటికి కానరాని గమనము గలవారై మాయలను సృష్టించి భయమును గొల్పుచుండగా, దేవసైనికులు విషాదమును పొందిరి.

న తత్ప్రతివిధిం యత్ర విదురింద్రాదయో నృప ।
ధ్యాతః ప్రాదురభూత్తత్ర భగవాన్ విశ్వభావనః ।। 53

నృప - ఓ మహారాజా!, యత్ర - ఏ కాలమునందైతే, ఇంద్ర-ఆ దయః - ఇంద్రుడు మొదలగువారు, తత్-ప్రతివిధిమ్ - దానికి నివారణోపా యమును, న విదుః - తెలియకుండిరో అప్పుడు, ధ్యాతః - ధ్యానించబడి నవాడు, విశ్వభావనః - జగత్తును పాలించువాడు అగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, తత్ర - అచ్చట, ప్రాదురభూత్ - సాక్షాత్కరించెను.

ఓ మహారాజా! ఇంద్రుడు మొదలగువారికి ఆ మాయలను నివా రించే ఉపాయము తెలియలేదు. అపుడు వారు లోకములను పాలించే శ్రీహరి భగవానుని ధ్యానించగా, ఆయన అచట సాక్షాత్కరించెను.

తతస్సుపర్ణాంసకృతాంఘ్రిపల్లవః పిశంగవాసా నవకంజలోచనః,
అదృశ్యతాష్టాయుధబాహురుల్లసచ్ఛ్రీకౌస్తుభానర్ఘ్యకిరీటకుండలః।

తతః - తరువాత, సుపర్ణ-అంసకృత-అంఘ్రిపల్లవః - గరుత్మం తుని భుజములపై ఉంచబడిన చిగుళ్లవంటి పాదములు గలవాడు, పిశంగ వాసాః - పీతాంబరుడు, నవకంజలోచనః - కొత్తగా వికసించిన పద్మము వంటి కన్నులు గలవాడు, అష్ట-ఆయుధబాహుః - ఎనిమిది ఆయుధము లను ధరించిన చేతులు గలవాడు, ఉల్లసత్-శ్రీకౌస్తుభ-అనర్ఘ్యకిరీటకుం

దలః - గొప్పగా ప్రకాశించే లక్ష్మి కౌస్తుభ మాణిక్యము మిక్కిలి విలువైన కిరీటము కుండలములు గలవాడు అగు శ్రీహరి, అదృశ్యత - కనబడెను.

అప్పుడు గరుత్మంతుని భుజములపై చిగుళ్లవంటి కాళ్లను ఉంచిన పీతాంబరుడగు శ్రీహరిని వారు చూచిరి. కొత్తగా వికసించిన పద్మమువంటి కన్నులు గల ఆయన ఎనిమిది చేతులలో ఆయుధములను ధరించి యుండెను. ఆయన వక్షఃస్థలముపై శ్రీదేవిని, మెడలో కౌస్తుభ మాణిక్యమును, మిక్కిలి విలువైన కిరీటమును, కుండలములను ధరించి యుండెను.

తస్మిన్ ప్రవిష్టేఽసురకూటకర్మజా
  మాయా వినేశుర్మహినా మహీయసః ।
స్వప్నో యథా హి ప్రతిబోధ ఆగతే
  హరిస్మృతిస్సర్వవిపద్విమోక్షణమ్ ॥ 55

తస్మిన్ - ఆ శ్రీహరి, ప్రవిష్టే - ప్రవేశించగా, మహీయసః - సర్వాధికుడగు శ్రీహరియొక్క, మహినా - మహిమచే, అసురకూటకర్మజాః - రాక్షసులయొక్క మాయలను సృష్టించే కర్మనుండి పుట్టిన, మాయాః - మాయలు, ప్రతిబోధే - తెలివి, ఆగతే - రాగా, స్వప్నః యథా - కల వలె, వినేశుః - నశించినవి, హి - ఏలయనగా, హరిస్మృతిః - శ్రీహరియొక్క స్మరణము, సర్వవిపద్-విమోక్షణమ్ - సకలములైన ఆపదల నుండి విముక్తిని కలిగించునది.

సర్వాధికుడగు ఆ శ్రీహరి ప్రవేశించగానే ఆయన మహిమచేతనే, రాక్షసులు మాయలను సృష్టించే కర్మలను చేసి సృష్టించిన మాయలు, తెలివి రాగానే కల దూరమైనట్లుగా, నశించెను. ఎందుకంటే, శ్రీహరియొక్క స్మరణము అన్ని ఆపదలనుండి విముక్తిని కలిగించును.

దృష్ట్వా మృధే గరుడవాహమిభారివాహ
  ఆవిధ్య శూలమహినోదథ కాలనేమిః ।

తల్లీలయా గరుడమూర్ధ్ని పతద్గృహీత్వా
తేనాహనన్నృప సవాహమరిం త్ర్యధీశః ॥ 56

నృప - ఓ మహారాజా!, మృధే - యుద్ధమునందు, గరుడవాహమ్ - గరుడుడు వాహనముగా గల శ్రీహరిని, దృష్ట్వా - చూచి, అథ - తరువాత, ఇభ-అరివాహః - ఏనుగులకు శత్రువగు సింహము వాహనముగా గల, కాలనేమిః - కాలనేమి, శూలమ్ - శూలమును, ఆవిధ్య - పైకెత్తి, అహినోత్ - కొట్టెను, గరుడమూర్ధ్ని - గరుడుని శిరస్సుపై, పతత్ - పడుచున్న, తత్ - దానిని, లీలయా - అవలీలగా, గృహీత్వా - పట్టుకొని, త్రి-అధి-ఈశః - ముల్లోకములకు అధీశ్వరుడగు శ్రీహరి, తేన - దానితో, సవాహమ్ - వాహనముతో కూడియున్న, అరిమ్ - శత్రువును, అహనత్ - సంహరించెను.

ఓ మహారాజా! యుద్ధమునందు గరుడుని అధిష్ఠించి వచ్చిన శ్రీహరిని చూచి వెంటనే కాలనేమి శూలమును పైకెత్తి కొట్టెను. అతడు ఏనుగులకు శత్రువగు సింహమును అధిష్ఠించి యుండెను. ఆ శూలము గరుడుని తలపై పడబోవుచుండగా, ముల్లోకములకు అధీశ్వరుడగు శ్రీహరి దానిని అవలీలగా పట్టుకొని, దానితోనే కాలనేమిని, వాని వాహనమును కూడ సంహరించెను.

మాలీ సుమాల్యతిబలౌ యుధి పేతతుర్య-
చ్చక్రేణ కృత్తశిరసావథ మాల్యవాంస్తమ్ ।
ఆహత్య తిగ్మగదయాఽహనదండజేంద్రం
తావచ్ఛిరోఽచ్ఛినదరేర్నదతోఽరిణాఽఽద్యః ॥ 57

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే
సముద్రమథనవృత్తాంతే దేవాసురసంగ్రామవర్ణనం
నామ దశమోఽధ్యాయః ॥

అతిబలౌ - మహాబలశాలురగు, మాలీ - మాలి, సుమాలీ - సుమాలి, యుధి - యుద్ధమునందు, యత్-చక్రేణ - ఏ శ్రీహరియొక్క

చక్రముచే, కృత్తశిరసౌ - నరకబడిన తలలు గలవారై, పేతతుః - నేల గూలిరో, అథ - తరువాత, తమ్ - ఆయనను, మాల్యవాన్ - మాల్యవంతుడు, తిగ్మగదయా - వాడి గదతో, ఆహత్య - కొట్టి, అండజ-ఇంద్రమ్ - పక్షి రాజగు గరుత్మంతుని, అహనత్ - కొట్టెను, తావత్ - అంతలో, ఆద్యః - సర్వకారణుడగు శ్రీహరి, అరిణా - చక్రముతో, నదతః - సింహనాదమును చేయుచున్న, అరేః - శత్రువగు మాల్యవంతునియొక్క, శిరః - తలను, అచ్ఛినత్ - తెగగొట్టెను.

మహాబలశాలురగు మాలి, సుమాలి యుద్ధమునందు శ్రీహరి యొక్క చక్రముచే నరుకబడిన తలలు గలవారై నేల గూలిరి. అపుడు మాల్యవంతుడు సింహనాదమును చేసి వాడియైన గదతో శ్రీహరిని, పక్షి రాజగు గరుత్మంతుని కొట్టెను. అంతలోనే, సర్వకారణుడగు శ్రీహరి శత్రువైన ఆ మాల్యవంతుని తలను చక్రముతో నరికెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
సముద్ర మథన వృత్తాంతములో దేవాసుర సంగ్రామమును
వర్ణించే పదవ అధ్యాయము ముగిసినది (10) .

*****

# అథ ఏకాదశోऽధ్యాయః

## సముద్ర మథనము - ఇంద్రుడు నముచిని సంహరించుట

శ్రీశుక ఉవాచ ।
అథో సురాః ప్రత్యుపలబ్ధచేతసః
పరస్య పుంసః పరయానుకంపయా ।
జఘ్నుర్భృశం శక్రసమీరణాదయః
తాంస్తాన్ రణే యైరభిసంహతాః పురా ॥ 1

అథో - తరువాత, పరస్య పుంసః - పురుషోత్తమునియొక్క, పరయా - సర్వాతిశాయియగు, అనుకంపయా - దయచే, ప్రత్యుపలబ్ధచేతసః - పరాజితము కాని అంతఃకరణములు గల, శక్రసమీరణ-ఆదయః - ఇంద్రుడు వాయువు మొదలైన, సురాః - దేవతలు, తాన్ తాన్ - వారి వారిని, భృశమ్ - తీవ్రముగా, జఘ్నుః - కొట్టిరి, యైః - ఎవరిచేనైతే, పురా - ఇదివరలో, రణే - యుద్ధమునందు, అభిసంహతాః - గట్టిగా కొట్టబడిరో.

ఇదివరలో దేవతలు రాక్షసుల చేతిలో దెబ్బలను తినియున్నారు. కాని ఇప్పుడు పురుషోత్తముని సర్వాతిశాయియగు దయచే వారి మనస్సులలోని ధైర్యము రాక్షసుల మాయచే వీగి పోలేదు. అప్పుడు ఇంద్రుడు, వాయువు, అగ్ని మొదలగు దేవతలు ఆ రాక్షసులను యుద్ధములో గట్టిగా దెబ్బ తీసిరి.

వైరోచనాయ సంరబ్ధో భగవాన్ పాకశాసనః ।
ఉదయచ్ఛద్యదా వజ్రం ప్రజా హా హేతి చుక్రుశుః ॥ 2

భగవాన్ - పూజనీయుడు, పాకశాసనః - పాకాసురుని సంహరించినవాడు అగు ఇంద్రుడు, వైరోచనాయ - విరోచన పుత్రుడగు బలి కొరకు,

సంరబ్ధః - కోపించినవాడై, యదా - ఎప్పుడైతే, వజ్రమ్ - వజ్రమును, ఉద యచ్ఛత్ - పైకి ఎత్తెనో అప్పుడు, ప్రజాః - జనులు, హా హా - అయ్యో అయ్యో!, ఇతి - అని, చుక్రుశుః - ఆక్రోశించిరి.

పూజనీయుడు, పాకాసురుని సంహరించినవాడు అగు ఇంద్రుడు విరోచన పుత్రుడగు బలిపై కోపించి వజ్రమును పైకి ఎత్తగా, ప్రజలు అయ్యో అయ్యో! అంటూ ఆక్రోశించిరి.

వజ్రపాణిస్తమాహేదం తిరస్కృత్య పురఃస్థితమ్ ।
మనస్వినం సుసంపన్నం విచరంతం మహామృధే ।। 3

పురఃస్థితమ్ - ఎదుట నున్నట్టియు, మనస్వినమ్ - ధైర్యము కలి గినట్టియు, సుసంపన్నమ్ - యుద్ధసామగ్రి నిండా ఉన్నట్టియు, మహామృధే - ఆ గొప్ప యుద్ధమునందు, విచరంతమ్ - విశేషముగా తిరుగుచున్న, తమ్ - ఆ బలిని, తిరస్కృత్య - తిరస్కరించి, వజ్రపాణిః - వజ్రము చేతి యందున్న ఇంద్రుడు, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను.

ధైర్యశాలియగు విరోచనుడు యుద్ధసామగ్రిని నిండా ఉంచుకొని ఆ గొప్ప యుద్ధములో అంతటా సంచరిస్తూ యుద్ధమును చేయుచుండె ను. ఆయన తన ముందుకు రాగానే ఇంద్రుడు వజ్రము చేతబట్టి తిరస్కార పూర్వకముగా ఆయనతో ఇట్లు పలికెను.

నటవన్మూఢ మాయాభిర్మాయేశాన్నో జిగీషసి ।
జిత్వా బాలాన్నిబద్ధాక్షాన్నటో హరతి తద్ధనమ్ ।। 4

మూఢ - ఓరీ మూర్ఖా!, మాయా-ఈశాన్ - మాయలకు అధిపతు లమగు, నః - మమ్ములను, నటవత్ - నటుడు వలె, మాయాభిః - మాయ లతో, జిగీషసి - జయించ గోరుచున్నావు, నటః - నటుడు, నిబద్ధ-అక్షాన్ - గంతలు కట్టబడిన కన్నులు గల, బాలాన్ - పిల్లలను, జిత్వా - వశము చేసుకొని, తద్-ధనమ్ - వారి సొమ్మును, హరతి - అపహరించును.

ఓరీ మూర్ఖా! నటుడు పిల్లలను మంచి మాటలతో వశము చేసు కొని, వారి కళ్లకు గంతలు కట్టి వారి వద్ద ఉండే సొమ్మును అపహరించును.

నీవు కూడ అదే విధముగా మాయలతో మమ్ములను జయించ గోరుచున్నా వు. కాని, మేము మాయలకు అధిపతులము.

ఆరురుక్షంతి మాయాభిరుత్సిసృప్సంతి యే దివమ్ ।
తాన్ దస్యూన్ విధునోమ్యజ్ఞాన్ పూర్వస్మాచ్చ పదాదధః ॥5

యే - ఎవరైతే, మాయాభిః - మాయలతో, దివమ్ - స్వర్గమును, ఆరురుక్షంతి - చేరుకోవాలని కోరెదరో, ఉత్సిసృప్సంతి - దాటి వెళ్ల గోరెదరో, తాన్ - అట్టి, అజ్ఞాన్ - మూర్ఖులైన, దస్యూన్ - చోరులను, పూర్వస్మాత్ - ఇదివరకటి, పదాత్ చ - స్థానముకంటె కూడ, అధః - క్రిందకు, విధునోమి - పడగొట్టెదను.

ఎవరైతే మాయలతో స్వర్గమును చేరాలని గాని, స్వర్గమును దాటి పై లోకములకు వెళ్లాలని గాని కోరెదరో, వారు మూర్ఖులైన చోరులు. వారిని నేను ఇదివరలో ఉన్న స్థానముకంటె కూడ క్రిందకు పడ గొట్టెదను.

సోఽహం దుర్మాయినస్తేఽద్య వజ్రేణ శతపర్వణా ।
శిరో హరిష్యే మందాత్మన్ ఘటస్వ జ్ఞాతిభిస్సహ ॥ 6

మంద-ఆత్మన్ - ఓరీ మందబుద్ధీ!, సః - అట్టి, అహమ్ - నేను, దుర్మాయినః - చెడ్డ మాయలు గల, తే - నీయొక్క, శిరః - తలను, శతపర్వణా - వంద కణుపులు గల, వజ్రేణ - వజ్రముతో, అద్య - ఇప్పుడు, హరిష్యే - ఊడగొట్టెదను, జ్ఞాతిభిః సహ - బంధువులతో గూడి, ఘటస్వ - కాసుకొనుము.

ఓరీ మందబుద్ధీ! చెడ్డ మాయలను చేసే నీ తలను అట్టి నేను ఇప్పుడే వంద కణుపుల వజ్రముతో ఊడగొట్టెదను. నీవు నీ బంధువులతో గూడి కాసుకొనుము.

బలిరువాచ ।
సంగ్రామే వర్తమానానాం కాలచోదితకర్మణామ్ ।
కీర్తిర్జయోఽజయో మృత్యుస్సర్వేషాం స్యురనుక్రమాత్ ॥ 7

కాలచోదితకర్మణామ్ - కాలముచే ప్రేరితమైన కర్మలు కలిగినట్టి యు, సంగ్రామే - యుద్ధమునందు, వర్తమానానామ్ - ఉన్న, సర్వేషామ్ - అందరికి, కీర్తిః - కీర్తి, జయః - విజయము, అజయః - అపజయము, మృత్యుః - మరణము, అనుక్రమాత్ - క్రమముగా, స్యుః - కలుగును.

బలి ఇట్లు పలికెను --- కాలముచే ప్రేరితులై కర్మలను చేస్తూ యుద్ధమును చేయుచున్నవారందరికి కీర్తి, జయము, అపజయము, మర ణము వరుసగా కలుగుచునే యుండును.

తదిదం కాలరశనం జనాః పశ్యంతి సూరయః ।
న హృష్యంతి న శోచంతి తత్ర యూయమపండితాః ॥ 8

తత్ - ఆ, ఇదమ్ - ఇది, కాలరశనమ్ - కాలముచే నియంత్రించ బడినది, సూరయః - వివేకవంతులగు, జనాః - జనులు, పశ్యంతి - చూచె దరు, న హృష్యంతి - హర్షమును పొందరు, న శోచంతి - దుఃఖించరు, తత్ర - ఆ విషయమునందు, యూయమ్ - మీరు, అపండితాః - తెలిసిన వారు కారు.

ఆ ఈ జయాపజయములు, కీర్తి-అపకీర్తులను కాలము నియం త్రించును. ఈ విషయము తెలిసిన వివేకవంతులు మంచికి హర్షముతో గెంతులు వేయరు; చెడుకు శోకముతో క్రుంగిపోరు. కాని, మీరు ఈ వివే కము గలవారు కారు.

న వయం మన్యమానానామాత్మానం తత్ర సాధనమ్ ।
గిరో వస్సాధుశోచ్యానాం గృహ్ణీమో మర్మతాడనాః ॥ 9

తత్ర - వాటియందు, ఆత్మానమ్ - తనను, సాధనమ్ - సాధన మునుగా, మన్యమానానామ్ - తలపోయునట్టియు, సాధుశోచ్యానామ్ - సత్పురుషులచే జాలిపడదగిన, వః - మీయొక్క, మర్మతాడనాః - మర్మ మునందు కొట్టే, గిరః - వాక్కులను, వయమ్ - మేము, న గృహ్ణీమః - స్వీకరించము.

జయాపజయములకు కర్తలము మేమే అని మీరు తలపోయుచుందురు. మీ అజ్ఞానమునకు సత్పురుషులు మీపై జాలి పడెదరు. అట్టి మీపై హృదయములో గాయమును చేసే నిందావాక్యములను ప్రయోగించుట మాకు సమ్మతము కాదు.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యాక్షిప్య విభుం వీరో నారాచైర్వీరమర్దనః ।
ఆకర్ణపూర్ణైరహనదాక్షేపైరాహతం పునః ॥ 10

వీరమర్దనః - వీరులను సంహరించే, వీరః - వీరుడైన బలి, విభుమ్ - స్వర్గాధిపతిని, ఇతి - ఈ విధముగా, ఆక్షిప్య - ఆక్షేపించి, ఆక్షేపైః - ఆక్షేప వచనములచే, ఆహతమ్ - కొట్టబడిన ఇంద్రుని, పునః - మరల, ఆకర్ణపూర్ణైః - నారిత్రాటిని చెవి వరకు లాగి విడిచిన, నారాచైః - బాణములతో, అహనత్ - కొట్టెను.

బలి వీరులను సంహరించే వీరుడు. ఆయన ఈ విధముగా ఇంద్రునకు ఆక్షేప వచనములచే దుఃఖమును కలిగించెను. అంతేగాక, నారిని చెవి వరకు లాగి విడిచిన బాణములతో ఆయన ఇంద్రుని కొట్టెను.

ఏవం నిరాకృతో దేవో వైరిణా తథ్యవాదినా ।
నామృష్యత్తదధిక్షేపం తోత్రాహత ఇవ ద్విపః ॥ 11

తథ్యవాదినా - సత్యమును పలికే, వైరిణా - శత్రువుచే, ఏవమ్ - ఈ విధముగా, నిరాకృతః - తిరస్కరించబడిన, దేవః - దేవేంద్రుడు, తోత్ర-ఆహతః - అంకుశముచే పొడవబడిన, ద్విపః ఇవ - ఏనుగు వలె, తద్-అధిక్షేపమ్ - ఆయనయొక్క ఆక్షేపమును, న అమృష్యత్ - సహించలేకపోయెను.

బలి ఈ విధముగా సత్యమును పలికి తిరస్కరించగా, దేవేంద్రుడు అంకుశముచే పొడవబడిన ఏనుగు వలె ఆ బలియొక్క ఆక్షేప వచనమును సహించ లేకపోయెను.

ప్రాహరత్కులిశం తస్మై అమోఘం పరమర్దనః ।
సయానో న్యపతద్భూమౌ ఛిన్నపక్ష ఇవాచలః ॥ 12

పరమర్దనః - శత్రువులను సంహరించే ఇంద్రుడు, తస్మై - ఆ బలి కొరకు, అమోఘమ్ - మొక్కవోని, కులిశమ్ - వజ్రమును, ప్రాహరత్ - వేసి కొట్టెను, ఛిన్నపక్షః - తెగగొట్టబడిన రెక్కలు గల, అచలః ఇవ - పర్వతము వలె, సయానః - విమానముతో గూడియున్న బలి, భూమౌ - నేల పై, న్యపతత్ - కూలిపోయెను.

శత్రుసంహారకుడగు ఇంద్రుడు మొక్కవోని వజ్రముతో ఆ బలిని కొట్టగా, ఆయన విమానముతో బాటుగా రెక్కలు తెగగొట్టబడిన పర్వతము వలె నేలపై కుప్పకూలెను.

సఖాయం పతితం దృష్ట్వా జంభో బలిసఖస్సుహృత్ ।
అభ్యయాత్సౌహృదం సఖ్యుర్హతస్యాపి సమాచరన్ ॥ 13

బలిసఖః - బలికి మిత్రుడు, సుహృత్ - హితకారి అగు, జంభః - జంభుడు, పతితమ్ - పడిపోయిన, సఖాయమ్ - మిత్రుని, దృష్ట్వా - చూచి, సఖ్యుః - మిత్రుడు, హతస్య అపి - కొట్టబడిననూ, సౌహృదమ్ - హితమును, సమాచరన్ - చక్కగా చేయుచున్నవాడై, అభి-అయాత్ - ఎదురుగా వచ్చెను.

జంభాసురుడు బలికి మిత్రుడు, హితకారి. ఆయన క్రింద బడిన తన మిత్రుని చూచెను. తన మిత్రుడు హతుడైననూ ఆయనకు హితమునే చేయువాడై ఆ జంభుడు ఇంద్రుని ఎదుటికి వచ్చెను.

స సింహవాహ ఆసాద్య గదాముద్యమ్య రంహసా ।
జత్రావతాడయచ్ఛక్రం గజం చ సుమహాబలః ॥ 14

సింహవాహః - సింహము వాహనముగా గలవాడు, సుమహాబలః - చాల గొప్ప బలశాలి అగు, సః - ఆ జంభాసురుడు, ఆసాద్య - దగ్గరకు వచ్చి, గదామ్ - గదను, రంహసా - వేగముతో, ఉద్యమ్య - పైకెత్తి, శక్రమ్

- ఇంద్రుని, జత్రౌ - కొంకులయందు, అతాడయత్ - కొట్టెను, గజం చ - ఏనుగును కూడ.

మహాబలిశాలియగు ఆ జంభాసురుడు సింహవాహనముపై ఇంద్రుని దగ్గరకు వచ్చి వేగముగా గదను పైకెత్తి కొంకులపై కొట్టెను. అతడు ఐరావతమును కూడ కొట్టెను.

గదాప్రహారవ్యథితో భృశం విహ్వలితో గజః ।
జానుభ్యాం ధరణీం స్పృష్ట్వా కశ్మలం పరమం యయౌ ॥15

గదాప్రహారవ్యథితః - గదయొక్క దెబ్బచే పీడను పొందిన, గజః - ఏనుగు, భృశమ్ - మిక్కిలి, విహ్వలితః - స్వాధీనత తప్పినదై, జానుభ్యామ్ - రెండు మోకాళ్లతో, ధరణీమ్ - నేలను, స్పృష్ట్వా - స్పృశించి, పరమమ్ - చాల ఎక్కువ, కశ్మలమ్ - మూర్ఛను, యయౌ - పొందెను.

గద దెబ్బచే పీడను పొందిన ఆ ఏనుగు పూర్తిగా స్వాధీనత తప్పి రెండు మోకాళ్లపై నేలపై గూలిపోయెను. అది అప్పుడు చాల ఎక్కువ సేపు మూర్ఛను పొందెను.

తతో రథో మాతలినా హరిభిర్దశశతైర్వృతః ।
ఆనీతో ద్విపముత్సృజ్య రథమారురుహే విభుః ॥ 16

తతః - తరువాత, దశశతైః - వేయి, హరిభిః - గుర్రములతో, వృతః - పూన్చబడిన, రథః - రథము, మాతలినా - మాతలిచే, ఆనీతః - తీసుకు రాబడినది, విభుః - దేవేంద్రుడు, ద్విపమ్ - ఏనుగును, ఉత్సృజ్య - విడిచిపెట్టి, రథమ్ - రథమును, ఆరురుహే - ఎక్కెను.

అప్పుడు మాతలి వేయి గుర్రములను పూన్చిన రథమును తీసుకురాగా, దేవేంద్రుడు ఏనుగును విడిచిపెట్టి ఆ రథముపై ఎక్కెను.

తస్య తత్పూజయన్ కర్మ యంతుర్దానవసత్తమః ।
శూలేన జ్వలతా తం తు స్మయమానోఽహనన్మృధే ॥ 17

దానవసత్తమః - రాక్షసశ్రేష్ఠుడగు జంభుడు, మృధే - యుద్ధము నందు, తస్య - ఆ, యంతుః - సారథియొక్క, తత్ - ఆ, కర్మ - పనిని, పూజయన్ - అభినందించువాడై, స్మయమానః - చిరునవ్వు నవ్వుచున్న వాడై, తం తు - ఆ సారథినైతే, జ్వలతా - మండుచున్న, శూలేన - శూలముతో, అహనత్ - కొట్టెను.

రాక్షసశ్రేష్ఠుడగు జంభుడు ఆ సారథి యుద్ధములో చేసిన పనిని అభినందించెను. అపుడాతడు చిరునవ్వు నవ్వుతూ ఆ సారథిని మాత్రము మండే శూలముతో కొట్టెను.

సేహే రుజం సుదుర్మర్షాం సత్త్వమాలంబ్య మాతలిః ।
ఇంద్రో జంభస్య సంక్రుద్ధో వజ్రేణాపాహరచ్ఛిరః ॥ 18

మాతలిః - మాతలి, సుదుర్మర్షామ్ - మిక్కిలి సహించ శక్యము కాని, రుజమ్ - నొప్పిని, సత్త్వమ్ - ధైర్యమును, ఆలంబ్య - కూడగట్టుకొని, సేహే - సహించెను, ఇంద్రః - ఇంద్రుడు, జంభస్య - జంభునకు, సంక్రుద్ధః - చాల కోపించిన వాడై, వజ్రేణ - వజ్రముతో, శిరః - తలను, అపాహరత్ - తొలగించి వేసెను.

మాతలి ధైర్యమును చిక్కబట్టి మిక్కిలి సహించ శక్యము కాని ఆ నొప్పిని సహించెను. ఇంద్రుడు జంభునిపై చాల కోపించి, వజ్రముతో వాని తలను నరికి వేసెను.

జంభం శ్రుత్వా హతం తస్య జ్ఞాతయో నారదాదృషేః ।
నముచిశ్చ బలః పాకస్తత్రాపేతుస్త్వరాన్వితాః ॥ 19

హతమ్ - సంహరించబడిన, జంభమ్ - జంభుని గురించి, నారదాత్ ఋషేః - నారద మహర్షి వలన, శ్రుత్వా - విని, తస్య - వాని, జ్ఞాతయః - బంధువులైన, నముచిః - నముచి, బలః - బలుడు, పాకః చ - పాకుడు కూడ, త్వరా-అన్వితాః - వేగముతో కూడినవారై, తత్ర - అచటకు, ఆపేతుః - వచ్చి పడిరి.

జంభుడు హతుడైనాడని నారద మహర్షి చెప్పగా విని, వాని బంధువులైన నముచి, బలుడు, పాకుడు వేగముగా ఆ స్థానమునకు వచ్చి పడిరి.

వచోభిః పరుషైరింద్రమర్దయంతోఽస్య మర్మసు ।
శరైరవాకిరన్మేఘా ధారాభిరివ పర్వతమ్ ॥ 20

పరుషైః - పరుషములైన, వచోభిః - వాక్కులతో, ఇంద్రమ్ - ఇంద్రుని, అస్య - వీని, మర్మసు - మర్మస్థానములయందు, అర్దయంతః - పీడించువారై, మేఘాః - మేఘములు, ధారాభిః - ధారలతో, పర్వతం ఇవ - పర్వతమును వలె, శరైః - బాణములతో, అవాకిరన్ - వర్షించిరి.

ఆ ముగ్గురు మర్మస్పర్శియగు పరుషవాక్యములతో ఆ ఇంద్రునకు పీడను కలిగిస్తూ, మేఘములు పర్వతముపై వర్షధారలను వలె, ఆతనిపై బాణములను వర్షించిరి.

హరీన్దశశతాన్యాజౌ హర్యశ్వస్య బలశ్శరైః ।
తావద్భిరర్దయామాస యుగపల్లఘుహస్తవాన్ ॥ 21

లఘుహస్తవాన్ - హస్తలాఘవము గల, బలః - బలుడు, ఆజౌ - యుద్ధమునందు, హర్యశ్వస్య - ఇంద్రునియొక్క, దశశతాని - వేయి, హరీన్ - గుర్రములను, తావద్భిః - అంతే సంఖ్య గల, శరైః - బాణములతో, యుగపత్ - ఒక్కసారిగా, అర్దయామాస - పీడను కలిగించెను.

బలుడు అలవోకగా పెద్ద సంఖ్యలో బాణములను విడువగలిగే నైపుణ్యము గలవాడు. ఆతడు యుద్ధములో ఇంద్రుని వేయి గుర్రములపై వేయి బాణములను ఒకే సారి ప్రయోగించి వాటికి పీడను కలిగించెను.

శతాభ్యాం మాతలిం పాకో రథం సావయవం పృథక్ ।
సకృత్సంధానమోక్షేణ తదద్భుతమభూద్రణే ॥ 22

పాకః - పాకుడు, సకృత్-సంధానమోక్షేణ - ఒకేసారి సంధానము చేసి విడిచిపెట్టుటచే, శతాభ్యామ్ - రెండ వందల బాణములతో, మాత

లిమ్ - మాతలిని, స-అవయవమ్ - అంగములతో గూడిన, రథమ్ - రథమును, పృథక్ - వేర్వేరుగా, రణే - యుద్ధమునందు, తత్ - అది, అద్భుతమ్ - ఆశ్చర్యము, అభూత్ - ఆయెను.

పాకుడు ఒకే సారి రెండు వందల బాణములను సంధానము చేసి వందతో మాతలిని, వందతో రథముయొక్క ప్రతి అంగమును కొట్టెను. అది యుద్ధములో ఆశ్చర్యము ఆయెను.

నముచిః పంచదశభిస్స్వర్ణపుంఖైర్మహేషుభిః ।
ఆహత్య వ్యనదత్సంఖ్యే సతోయ ఇవ తోయదః ।। 23

నముచిః - నముచి, సంఖ్యే - యుద్ధమునందు, స్వర్ణపుంఖైః - బంగరు క్రింది భాగములు గల, పంచదశభిః - పదిహేను, మహా-ఇషుభిః - గొప్ప బాణములతో, ఆహత్య - కొట్టి, సతోయః - నీటితో కూడియున్న, తోయదః ఇవ - మేఘము వలె, వ్యనదత్ - సింహనాదమును చేసెను.

నముచి యుద్ధమునందు బంగరు క్రింది భాగములు గల పదిహేను గొప్ప బాణములతో ఇంద్రుని కొట్టి, నీటితో నిండిన మేఘము వలె, గర్జించెను.

సర్వతశ్శరకూటేన శక్రం సరథసారథిమ్ ।
ఛాదయామాసురసురాః ప్రావృట్సూర్యమివాంబుదాః ।। 24

అసురాః - రాక్షసులు, శరకూటేన - బాణముల సమూహముచే, సరథసారథిమ్ - రథముతో సారథితో కూడియున్న, శక్రమ్ - ఇంద్రుని, సర్వతః - అన్ని వైపులా, అంబుదాః - మేఘములు, ప్రావృట్-సూర్యం ఇవ - వర్షాకాలమునందలి సూర్యుని వలె, ఛాదయామాసుః - కప్పివేసిరి.

రాక్షసులు ఇంద్రుని, ఆతని రథమును, దాని సారథిని బాణముల సమూహముతో అన్ని వైపులా, వర్షాకాలమునందలి సూర్యుని మేఘములు వలె, కప్పివేసిరి.

అలక్షయంతస్తమతీవ విహ్వలా విచుక్రుశుర్దేవగణాస్సహానుగాః,
అనాయకాశ్శత్రుబలేన నిర్జితా వణిక్పథా భిన్ననవో యథార్ణవే।25

శత్రుబలేన - శత్రువుల సైన్యముచే, నిర్జితాః - జయించబడిన, సహ-అనుగాః - అనుచరులతో గూడియున్న, దేవగణాః - దేవతల గణములు, తమ్ - ఆ ఇంద్రుని, అలక్షయంతః - కానరానివారై, అనాయకాః - నాయకుడు లేనివారై, అతీవ - మిక్కిలి, విహ్వలాః - ఆదుర్దా చెందినవారై, అర్ణవే - సముద్రమునందు, భిన్ననవః - పగిలిన నావ గల, వణిక్-పథాః ఇవ - వర్తకులు వలె, విచుక్రుశుః - ఆక్రోశించిరి.

శత్రువులగు రాక్షసులచే జయించబడిన దేవగణములు వారి అనుచరులతో బాటుగా ఆక్రోశించిరి. వారికి ఇంద్రుడు కానరాలేదు. నాయకుడు లేని ఆ దేవతలు, సముద్రమధ్యములో నావ పగిలిన వర్తకులు వలె, చాల ఆదుర్దాను చెందిరి.

తతస్తురాషాడిషుబద్ధపంజరాత్
వినిర్గతస్సాశ్వరథధ్వజాగ్రణీః ।
బభౌ దిశః ఖం పృథివీం చ రోచయన్
స్వతేజసా సూర్య ఇవ క్షపాత్యయే ॥ 26

తతః - తరువాత, స-అశ్వరథధ్వజ-అగ్రణీః - గుఱ్ఱములు రథము జెండా సారథులతో కూడియున్న, తురాషాట్ - ఇంద్రుడు, ఇషుబద్ధపంజరాత్ - బాణములచే కట్టబడిన పంజరమునుండి, వినిర్గతః - బయల్వెడలినవాడై, దిశః - దిక్కులను, ఖమ్ - ఆకాశమును, పృథివీం చ - భూమిని కూడ, స్వతేజసా - తన తేజస్సుచే, రోచయన్ - ప్రకాశింప జేయుచున్నవాడై, క్షపా-అత్యయే - రాత్రి గడచినప్పుడు, సూర్యః ఇవ - సూర్యుడు వలె, బభౌ - ప్రకాశించెను.

అప్పుడు గుఱ్ఱములు, జెండా, సారథి, రథములతో బాటుగా ఇంద్రుడు బాణములచే కట్టబడిన పంజరమునుండి బయట పడెను. అపుడాయన రాత్రి గడచిపోగా సూర్యుడు వలె తన తేజస్సుతో దిక్కులను, ఆకాశమును, భూమిని కూడ ప్రకాశింప జేయుచుండెను.

నిరీక్ష్య పృతనాం దేవః పరైరభ్యర్దితాం రణే ।
ఉదయచ్ఛద్రిపుం హంతుం వజ్రం వజ్రధరో రుషా ।। 27

వజ్రధరః - వజ్రమును ధరించే, దేవః - దేవేంద్రుడు, రణే - యుద్ధమునందు, పరైః - శత్రువులచే, అభ్యర్దితామ్ - పీడించబడిన, పృతనామ్ - సేనను, నిరీక్ష్య - చూచి, రుషా - కోపముతో, రిపుమ్ - శత్రువును, హంతుమ్ - సంహరించుటకు, వజ్రమ్ - వజ్రమును, ఉదయచ్ఛత్ - పైకెత్తెను.

వజ్రధారియగు దేవేంద్రుడు యుద్ధమునందు శత్రువులు తన సైన్యమును పీడించుటను చూచెను. ఆయన కోపముతో శత్రువును సంహరించుట కొరకై వజ్రమును పైకెత్తెను.

స తేనైవాష్టధారేణ శిరసీ బలపాకయోః ।
జ్ఞాతీనాం పశ్యతాం రాజన్ జహార జనయన్ భయమ్ ।। 28

రాజన్ - ఓ మహారాజా!, జ్ఞాతీనామ్ - బంధువులు, పశ్యతామ్ - చూచుచుండగా, భయమ్ - భయమును, జనయన్ - కలిగించువాడై, సః - ఆ ఇంద్రుడు, అష్టధారేణ - ఎనిమిది పదునులు గల, తేన ఏవ - ఆ వజ్రముతోనే, బలపాకయోః - బలుడు పాకుల, శిరసీ - తలలను, జహార - తొలగించెను.

ఓ మహారాజా! ఆ ఇంద్రుడు ఎనిమిది ధారలు గల ఆ వజ్రముతోనే బలాసుర పాకాసురులయొక్క తలలను వారి బంధువులు చూచుచుండగా నరికెను. ఆ బంధువులు చాల భయపడిరి.

నముచిస్తద్వధం దృష్ట్వా శోకామర్షరుషాన్వితః ।
జిఘాంసురింద్రం నృపతే చకార పరమోద్యమమ్ ।। 29

నృపతే - ఓ మహారాజా!, నముచిః - నముచి, తద్-వధమ్ - వారిద్దరి సంహారమును, దృష్ట్వా - చూచి, శోక-అమర్షరుషా-అన్వితః - శోకము అసహనము కోపములతో కూడినవాడై, ఇంద్రమ్ - ఇంద్రుని, జిఘాంసుః -

సంహరించ గోరువాడై, పరమ-ఉద్యమమ్ - గొప్ప ప్రయత్నమును, చకార - చేసెను.

ఓ మహారాజా! వారిద్దరి వధను చూచిన నముచికి శోకము, అసహనము, కోపము కలిగెను. ఆతడు ఇంద్రుని చంప గోరి, చాల పెద్ద ప్రయత్నమును చేసెను.

అశ్మసారమయం శూలం ఘంటావద్ధేమభూషణమ్ ।
ప్రగృహ్యాభ్యద్రవత్క్రుద్ధో హతోఽసీతి వితర్జయన్ ।
ప్రాహిణోద్దేవరాజాయ నినదన్మృగరాడివ ॥ 30

క్రుద్ధః - కోపించిన నముచి, మృగరాట్ ఇవ - మృగేంద్రుడు వలె, నినదన్ - నినాదము చేయుచున్నవాడై, అశ్మసారమయమ్ - లోహముతో చేసినట్టియు, ఘంటావత్ - గంటలు కలిగినట్టియు, హేమభూషణమ్ - బంగరు ఆభరణములు గల, శూలమ్ - శూలమును, ప్రగృహ్య - గట్టిగా పట్టుకొని, హతః - సంహరించ బడినవాడవు, అసి - అగుదువు, ఇతి - అని, వితర్జయన్ - అధికముగా బెదిరించుచున్నవాడై, అభ్యద్రవత్ - అభిముఖముగా పరుగెత్తెను, దేవరాజాయ - దేవేంద్రుని కొరకు, ప్రాహిణోత్ - విసిరెను.

నముచి కోపించి మృగేంద్రుడగు సింహము వలె నినదిస్తూ, లోహముతో చేసిన శూలమును గట్టిగా పట్టుకొని దేవరాజగు ఇంద్రుని మీదకు పరుగెత్తెను. ఇదిగో! నీవు చచ్చితివి, అంటూ ఆతడు ఇంద్రుని అధికముగా బెదిరిస్తూ గంటలు, బంగరు ఆభరణములు ఉన్న ఆ శూలమును ఇంద్రుని పైకి విసిరెను.

తదాపతద్గగనతలే మహాజవం
విచిచ్ఛిదే హరిరిషుభిస్సహస్రధా ।
తమాహనన్నృప కులిశేన కంధరే
రుషాన్వితస్త్రిదశపతిశ్శిరో హరన్ ॥ 31

తదా - అప్పుడు, గగనతలే - ఆకాశతలమునందు, ఆపతత్ - వచ్చి పడుచున్నట్టియు, మహాజవమ్ - గొప్ప వేగము గల, తత్ - ఆ శూలమును, హరిః - ఇంద్రుడు, ఇషుభిః - బాణములతో, సహస్రధా - వేయి ముక్కలుగా, విచిచ్ఛిదే - ఛేదించెను, నృప - ఓ మహారాజా!, రుషా - కోపముతో, అన్వితః - కూడియున్న, త్రిదశపతిః - దేవరాజు, శిరః - తలను, హరన్ - తొలగించువాడై, తమ్ - ఆ నముచిని, కంధరే - మెడయందు, కులిశేన - వజ్రముతో, ఆహనత్ - కొట్టెను.

ఓ మహారాజా! ఆకాశతలమునందు మహావేగముగా వచ్చి పడుచున్న ఆ శూలమును ఇంద్రుడు బాణములతో వేయి ముక్కలుగా ఖండించెను. కోపమును పొందియున్న దేవరాజు అపుడు ఆ నముచి తలను నరుకగోరి వజ్రముతో వాని మెడపై కొట్టెను.

న తస్య హి త్వచమపి వజ్ర ఊర్జితో
బిభేద యస్సురపతినౌజసేరితః ।
తదద్భుతం పరమతివీర్యవృత్రభిత్
తిరస్కృతో నముచిశిరోధరత్వచా ॥ 32

ఊర్జితః - బలము గల, వజ్రః - వజ్రము, తస్య - వానియొక్క, త్వచం అపి - చర్మమును కూడ, న హి బిభేద - భేదించనే లేదు, యః - ఏ వజ్రమైతే, సురపతినా - దేవేంద్రునిచే, ఓజసా - బలముతో, ఈరితః - ప్రయోగించబడినదో, తత్ - అది, పరమ్ - గొప్ప, అద్భుతమ్ - ఆశ్చర్యము!, అతివీర్యవృత్రభిత్ - మహాపరాక్రమశాలియగు వృత్రుని సంహరించిన ఇంద్రుడు, నముచిశిరః-ధరత్వచా - నముచియొక్క మెడమీది చర్మముచే, తిరస్కృతః - తిరస్కరించబడినవాడు.

బలము గల ఆ వజ్రమును దేవేంద్రుడు బలముగా ప్రయోగించెను. అయిననూ, అది నముచియొక్క చర్మమును కూడ ఊడగొట్టలేకపోయెను. అది గొప్ప ఆశ్చర్యము! మహాపరాక్రమశాలియగు వృత్రుని సంహరించిన ఇంద్రుని నముచి మెడపై చర్మము తిరస్కారమునకు గురిచేసెను.

తస్మాదింద్రోఽబిభేచ్ఛత్రోర్వజ్రః ప్రతిహతో యతః ।
కిమిదం దైవయోగేన భూతం లోకవిమోహనమ్ ।। 33

ఇంద్రః - ఇంద్రుడు, తస్మాత్ - ఆ, శత్రోః - శత్రువు వలన, అబిభేత్ - భయపడెను, యతః - ఎందువలనైతే, వజ్రః - వజ్రము, ప్రతిహతః - నిర్వీర్యము ఆయెనో, దైవయోగేన - దైవముయొక్క ఘటనచే, లోకవిమోహనమ్ - ప్రాణులకు విశేషమగు మోహమును కలిగించే, ఇదమ్ - ఇది, కిమ్ - ఏమి, భూతమ్ - ఘటిల్లినది?

తన వజ్రమును నిర్వీర్యము చేసిన నముచి అనే ఆ శత్రువు వలన ఇంద్రుడు భయపడెను. దైవముయొక్క ఘటన ఇట్లున్నదేమి? ప్రాణులకు విశేషమగు మోహమును కలిగించే ఘటన ఇట్లు ఏల ఘటిల్లినది? అని ఆయన తలపోసెను.

యేన మే పూర్వమద్రీణాం పక్షచ్ఛేదః ప్రజాత్యయే ।
కృతో నివిశతాం భారైః పతత్త్రైః పతతాం భువి ।। 34

పతత్త్రైః - రెక్కలతో, నివిశతామ్ - ఎగురునట్టియు, భువి - నేలపై, పతతామ్ - పడే, అద్రీణామ్ - పర్వతములయొక్క, భారైః - భారములచే, ప్రజా-అత్యయే - ప్రజల వినాశము కలుగగా, మే - నాయొక్క, యేన - ఏ వజ్రముచే, పూర్వమ్ - పూర్వము, పక్షచ్ఛేదః - రెక్కల నరుకుట, కృతః - చేయబడినదో.

పూర్వము పర్వతములకు రెక్కలుండెడివి. అవి ఇటునటు ఎగురుతూ నేలపై వాలినప్పుడు ఆ భారముచే ప్రజలు నశించెడివారు. ఆ స్థితిలో నేను ఇదే వజ్రముతో వాటి రెక్కలను నరికితిని.

తపస్సారమయం త్వాష్ట్రం వృత్రో యేన విపాటితః ।
అన్యే చాపి బలోపేతాస్సర్వాస్త్రైరక్షయత్వచః ।। 35

సారమయమ్ - ప్రభావము అధికముగా గల, త్వాష్ట్రమ్ - త్వష్టకు చెందిన, తపః - తపస్సు అయిన, వృత్రః - వృత్రుడు, యేన - ఏ వజ్రముచే, విపాటితః - చీల్చివేయబడినాడో, బల-ఉపేతాః - బలముతో

కూడినట్టియు, సర్వ-అస్త్రైః - సకలములైన అస్త్రములచే, అక్షయత్వచః - చెక్కు చెదరని చర్మము గల, అన్యే అపి చ - ఇతరులు కూడ.

త్వష్టయొక్క మహాప్రభావశాలియగు తపస్సే వృత్రాసురుడైనది. అట్టి వృత్రుడు మాత్రమే గాక, సకలములైన అస్త్రములచే చెక్కు చెదరని చర్మము గల ఇతరులైన బలశాలురు కూడ ఈ వజ్రముచే చీల్చి వేయబడి నారు.

సోఽయం ప్రతిహతో వజ్రో మయా ముక్తోఽసురేఽల్పకే ।
నాహం తదాదదే దండం బ్రహ్మతేజోఽప్యకారణమ్ ॥ 36

అల్పకే - అల్పుడైన, అసురే - రాక్షసునియందు, మయా - నాచే, ముక్తః - ప్రయోగించబడిన, సః - అట్టి, అయమ్ - ఈ, వజ్రః - వజ్రము, ప్రతిహతః - నిర్వీర్యము చేయబడినది, బ్రహ్మతేజః అపి - బ్రహ్మవేత్తయగు దధీచియొక్క తేజస్సు అయిననూ, అకారణమ్ - నిష్ప్రయోజనమైన, తత్ - ఆ, దండమ్ - కట్టెను, అహమ్ - నేను, న ఆదదే - స్వీకరించను.

అల్పుడైన రాక్షసునిపై నేను ప్రయోగించిన అట్టి ఈ వజ్రము నిర్వీర్యమైనది. ఇది బ్రహ్మవేత్తయగు దధీచియొక్క తేజస్సే అయిననూ, ఈనాడు ఇది కట్టెవలె నిరర్థకము. కావున, నేను దీనిని స్వీకరించను.

ఇతి శక్రం విషీదంతమాహ వాగశరీరిణీ ।
నాయం శుష్కైరథో నార్ద్రైర్వధమర్హతి దానవః ॥ 37

ఇతి - ఈ విధముగా, విషీదంతమ్ - ఖేదమును పొందుచున్న, శక్రమ్ - ఇంద్రుని ఉద్దేశించి, అశరీరిణీ - శరీరము లేని, వాక్ - వాక్కు, ఆహ - పలికెను, అయమ్ - ఈ, దానవః - రాక్షసుడు, శుష్కైః - ఎండియున్నవాటిచే, వధమ్ - సంహారమును, న అర్హతి - తగడు, అథో - మరియు, ఆర్ద్రైః - తడివాటితో, న - సంహారమును తగడు.

ఈ విధముగా ఖేదమును పొందియున్న ఇంద్రుని ఉద్దేశించి ఆకాశ వాణి ఇట్లు పలికెను -- ఈ రాక్షసుని పొడి వస్తువులతో గాని, తడి వస్తువు లతో గాని సంహరించుట సంభవము కాదు.

మయాస్మై యద్వరో దత్తో మృత్యుర్నైవార్ద్రశుష్కయోః ।
అతోఽన్యశ్చింతనీయస్తే ఉపాయో మఘవన్ రిపోః ॥ 38

యత్ - ఏలయనగా, మయా - నాచే, అస్మై - వీని కొరకు, వరః - వరము, దత్తః - ఈయబడినది, ఆర్ద్రశుష్కయోః - తడి పొడి వస్తువుల చే, మృత్యుః - మరణము, న ఏవ - కలుగనే కలుగదు, అతః - ఇందువల న, తే - నీచే, రిపోః - శత్రువునకు, అన్యః - మరియొక, ఉపాయః - ఉపా యము, చింతనీయః - ఆలోచించ దగినది.

వీనికి తడి గాని, పొడి గాని అయిన వస్తువులచే మరణము కలు గనే కలుగదని నేను వరము నిచ్చితిని. కావున, నీవు వీని సంహారము కొరకై మరియొక ఉపాయమును ఆలోచించుము.

తాం దైవీం గిరమాకర్ణ్య మఘవాన్ సుసమాహితః ।
ధ్యాయన్ ఫేనమథాపశ్యదుపాయముభయాత్మకమ్ ॥ 39

దైవీమ్ - పరమేశ్వరునకు చెందిన, తామ్ - ఆ, గిరమ్ - వాక్కు ను, ఆకర్ణ్య - విని, మఘవాన్ - ఇంద్రుడు, సుసమాహితః - మిక్కిలి ఏకా గ్రమగు చిత్తము గలవాడై, ధ్యాయన్ - ధ్యానించుచున్నవాడై, అథ - అప్పుడు, ఉభయ-ఆత్మకమ్ - రెండింటి లక్షణములు గల, ఫేనమ్ - నురుగును, ఉపాయమ్ - ఉపాయమునుగా, అపశ్యత్ - చూచెను.

పరమేశ్వరునియొక్క ఆ ఆకాశవాణిని విని ఇంద్రుడు మిక్కిలి ఏకాగ్రమగు చిత్తముతో ధ్యానించెను. అపుడు ఆతనికి నురగ తడి మరియు పొడి అనే రెండు లక్షణములు కలదిగా తోచెను.

న శుష్కేణ న చార్ద్రేణ జహార నముచేశ్శిరః ।
తం తుష్టువుర్మునిగణా మాల్యైశ్చావాకిరన్ విభుమ్ ॥ 40

నముచేః - నముచియొక్క, శిరః - తలను, న శుష్కేణ - పొడి కానిది, న చ ఆర్ద్రేణ - తడి కూడ కానిది అగు నురగతో, జహార - అపహరించెను, మునిగణాః - మహర్షుల గణములు, తమ్ - ఆ, విభుమ్ - స్వర్గాధిపతియగు ఇంద్రుని, తుష్టువుః - స్తుతించినవి, మాల్యైః చ - పుష్పములతో కూడ, అవాకిరన్ - చల్లిరి.

ఇంద్రుడు తడి మరియు పొడి కూడ కాని నురగతో నముచి తలను తొలగించెను. అపుడు మహర్షుల గణములు స్వర్గాధిపతియగు ఆ ఇంద్రుని స్తుతించి, పుష్పములను వర్షించిరి.

గంధర్వముఖ్యౌ జగతుర్విశ్వావసుపరావసూ ।
దేవదుందుభయో నేదుర్నర్తక్యో ననృతుర్ముదా ॥ 41

గంధర్వముఖ్యౌ - గంధర్వశ్రేష్ఠులగు, విశ్వావసుపరావసూ - విశ్వావసువు పరావసువులు, జగతుః - గానము చేసిరి, దేవదుందుభయః - దేవతల దుందుభులు, నేదుః - మ్రోగినవి, నర్తక్యః - నర్తకిలు, ముదా - ఆనందముతో, ననృతుః - నాట్యమును చేసిరి.

గంధర్వశ్రేష్ఠులగు విశ్వావసువు పరావసువు గానము చేసిరి. దేవతల దుందుభులు మ్రోగినవి. అప్సరసలు ఆనందముతో నాట్యమాడిరి.

అన్యేఽప్యేవం ప్రతిద్వంద్వాన్ వాయ్వగ్నివరుణాదయః ।
సూదయామాసురస్త్రౌఘైర్మృగాన్ కేసరిణో యథా ॥ 42

అన్యే అపి - ఇతర దేవతలు కూడ, వాయు-అగ్నివరుణ-ఆదయః - వాయువు అగ్ని వరుణుడు మొదలగువారు, ఏవమ్ - ఇదే విధముగా, ప్రతిద్వంద్వాన్ - తమతో ద్వంద్వయుద్ధమును చేయుచున్న శత్రువులను, అస్త్ర-ఓఘైః - అస్త్రముల సమూహములతో, మృగాన్ - లేళ్లను, కేసరిణః యథా - సింహములు వలె, సూదయామాసుః - పచ్చడి చేసిరి.

వాయువు, అగ్ని, వరుణుడు, యముడు మొదలైన ఇతర దేవతలు కూడ తమతో ద్వంద్వయుద్ధమును చేయుచున్న శత్రువులను ఇదే విధ

ముగా అస్త్రముల సమూహములను ప్రయోగించి, లేళ్లను సింహములు వలె, సంహరించిరి.

బ్రహ్మణా ప్రేషితో దేవాన్ దేవర్షిర్నారదో నృప ।
వారయామాస విబుధాన్ దృష్ట్వా దానవసంక్షయమ్ ।। 43

నృప - ఓ మహారాజా!, దానవసంక్షయమ్ - రాక్షసుల పూర్తి వినాశమును, దృష్ట్వా - చూచి, బ్రహ్మణా - బ్రహ్మగారిచే, ప్రేషితః - పంపబడిన, దేవర్షిః - దేవర్షియగు, నారదః - నారదుడు, దేవాన్ - దేవతలను, విబుధాన్ - దేవతల అనుచరులగు గంధర్వాదులను, వారయామాస - వారించెను.

ఓ మహారాజా! రాక్షసులు పూర్తిగా నశించిపోయే పరిస్థితిని చూచి బ్రహ్మగారు దేవర్షియగు నారదుని పంపించెను. ఆయన వచ్చి దేవతలను, వారి అనుచరులగు గంధర్వాదులను రాక్షససంహారమునుండి విరమింపజేసెను.

నారద ఉవాచ ।
భవద్భిరమృతం ప్రాప్తం నారాయణభుజాశ్రయైః ।
శ్రియా సమేధితాస్సర్వ ఉపారమత విగ్రహాత్ ।। 44

నారాయణభుజ-ఆశ్రయైః - నారాయణుని భుజములే ఆశ్రయముగా గల, భవద్భిః - మీచే, అమృతమ్ - అమృతము, ప్రాప్తమ్ - పొందబడినది, సర్వే - అందరు, శ్రియా - సంపదచే, సమేధితాః - చక్కగా వర్ధిల్ల జేయబడినవారు, విగ్రహాత్ - కలహమునుండి, ఉపారమత - విరమించుడు.

నారదుడిట్లు పలికెను --- నారాయణుని భుజములను ఆశ్రయించిన మీకు అమృతము దక్కినది. మిమ్ములనందరిని లక్ష్మీదేవి చక్కగా వర్ధిల్ల జేసినది. కావున, మీరు కలహమునుండి విరమించుడు.

శ్రీశుక ఉవాచ ।
సంయమ్య మన్యుసంరంభం మానయంతో మునేర్వచః ।
ఉపగీయమానానుచరైర్యయుస్సర్వే త్రివిష్టపమ్ ।। 45

మన్యుసంరంభమ్ - కోపోద్రేకమును, సంయమ్య - నియంత్రించి, మునేః - నారద మహర్షియొక్క, వచః - మాటను, మానయంతః - ఆదరించువారై, సర్వే - అందరు, ఉపగీయమాన-అనుచరైః - గానము చేయుచున్న అనుచరులతో, త్రివిష్టపమ్ - స్వర్గమును గురించి, యయుః - వెళ్లిరి.

దేవతలందరు కోపోద్రేకమును నియంత్రించుకొని నారద మహర్షి మాటను మన్నించిరి. వారు తమ కీర్తిని గానము చేసే అనుచరులతో కూడి స్వర్గమునకు వెళ్లిరి.

యేఽవశిష్టా రణే తస్మిన్నారదానుమతేన తే ।
బలిం విపన్నమాదాయ అస్తం గిరిముపాగమన్ ।। 46

తస్మిన్ - ఆ, రణే - యుద్ధమునందు, యే - ఏ రాక్షసులు, అవశిష్టాః - మిగిలి యుండిరో, తే - వారు, నారద-అనుమతేన - నారదుని సమ్మతిచే, విపన్నమ్ - మరణించిన, బలిమ్ - బలిని, ఆదాయ - తీసుకొని, అస్తం గిరిమ్ - అస్తాద్రిని, ఉపాగమన్ - చేరుకొనిరి.

ఆ యుద్ధమునందు ఏ రాక్షసులు మిగిలి యుండిరో, వారు నారదుని అనుమతితో మరణించిన బలిని తీసుకొని అస్తాచలమునకు వెళ్లిరి.

తత్రావినష్టావయవాన్ విద్యమానశిరోధరాన్ ।
ఉశనా జీవయామాస సంజీవిన్యా స్వవిద్యయా ।। 47

తత్ర - ఆ యుద్ధమునందు, అవినష్ట-అవయవాన్ - నష్టము కాని అవయవములు గలవారిని, విద్యమానశిరః-ధరాన్ - నిలిచియున్న మెడలు గలవారిని, ఉశనా - శుక్రుడు, స్వవిద్యయా - తన విద్యయైన, సంజీవిన్యా - సంజీవినితో, జీవయామాస - జీవింప జేసెను.

ఆ యుద్ధములో అవయవములు పోకుండా మెడపై తల ఉన్న రాక్షసులను శుక్రాచార్యుడు తన సంజీవినీ విద్యతో మరల బ్రతికించెను.

బలిశ్చోశనసా స్పృష్టః ప్రత్యాపన్నేంద్రియస్మృతిః ।
పరాజితోఽపి నాఖిద్యల్లోకతత్త్వవిచక్షణః ॥ 48

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే
సముద్రమథనే నముచివధవర్ణనం నామ ఏకాదశోఽధ్యాయః ॥

ఉశనసా - శుక్రాచార్యునిచే, స్పృష్టః - స్పృశించబడిన, బలిః చ - బలి కూడ, ప్రత్యాపన్న-ఇంద్రియస్మృతిః - తిరిగి వచ్చిన ఇంద్రియ ములు స్మరణము గలవాడై, పరాజితః అపి - పరాజయమును పొందిన వాడే అయిననూ, లోకతత్త్వవిచక్షణః - లోకస్వభావము బాగా తెలిసిన వాడు గనుక, న అఖిద్యత్ - ఖేదమును పొందలేదు.

బలిని శుక్రాచార్యుడు స్పృశించగానే ఆయన తిరిగి బ్రతికెను. ఆయనకు ఇంద్రియశక్తులు, స్మరణము తిరిగి వచ్చెను. ఆయన యుద్ధ ములో పరాజయమును పొందినా, లోకస్వభావము బాగా తెలిసినవాడు గనుక, ఖేదమును పొందలేదు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
సముద్ర మథన వృత్తాంతములో ఇంద్రుడు నముచిని సంహరించుటను
వర్ణించే పదకొండవ అధ్యాయము ముగిసినది (11) .

*****

# అథ ద్వాదశోऽధ్యాయః

## సముద్ర మథనము - శివుడు మోహినిని చూచి మోహపడుట

శ్రీబాదరాయణిరువాచ ।
వృషధ్వజో నిశమ్యేదం యోషిద్రూపేణ దానవాన్ ।
మోహయిత్వా సురగణాన్ హరిస్సోమమపాయయత్ ॥ 1

వృషమారుహ్య గిరిశస్సర్వభూతగణైర్వృతః ।
సహ దేవ్యా యయౌ ద్రష్టుం యత్రాస్తే మధుసూదనః ॥ 2

హరిః - శ్రీహరి, యోషిద్-రూపేణ - యువతి రూపముతో, దానవాన్ - రాక్షసులను, మోహయిత్వా - మోహింపజేసి, సురగణాన్ - దేవగణములను, సోమమ్ - అమృతమును, అపాయయత్ - త్రాగించెను, ఇదమ్ - దీనిని, వృషధ్వజః - వృషభము ధ్వజమునందు గలవాడు, గిరిశః - కైలాసవాసి అగు శివుడు, నిశమ్య - విని, వృషమ్ - వృషభమును, దేవ్యా సహ - పార్వతీదేవితో గూడి, ఆరుహ్య - అధిష్ఠించి, సర్వభూతగణైః - సకలభూతగణములచే, వృతః - చుట్టువారబడినవాడై, ద్రష్టుమ్ - చూచుటకు, యయౌ - వెళ్లెను, యత్ర - ఎక్కడనైతే, మధుసూదనః - శ్రీహరి, ఆస్తే - ఉన్నాడో.

బాదరాయణ వ్యాసుని పుత్రుడగు శుకమహర్షి ఇట్లు పలికెను --- మధువు అనే రాక్షసుని చంపిన శ్రీహరి యువతి రూపముతో రాక్షసులను మోహింపజేసి దేవగణములకు అమృతమును త్రాగించెననే విషయమును కైలాసవాసియగు శివుడు వినెను. అపుడా వృషభధ్వజుడు పార్వతీదేవితో

గూడి వృషభమునధిష్ఠించి శ్రీహరి ఉన్న చోటికి వెళ్లెను. సకలభూతగణ ములు ఆ శివుని చుట్టువారి ముందుకు నడిచిరి.

సభాజితో భగవతా సాదరం సోమయా భవః ।
సూపవిష్ట ఉవాచేదం ప్రతిపూజ్య స్మయన్ హరిమ్ ॥ 3

భగవతా - శ్రీహరి భగవానునిచే, స-ఆదరమ్ - ఆదరముతో కూడియున్న విధముగా, స-ఉమయా - పార్వతితో గూడి, సః - ఆ, భవః - శివుడు, సభాజితః - సత్కరించబడినాడు, సు-ఉపవిష్టః - సుఖముగా కూర్చున్న శివుడు, హరిమ్ - శ్రీహరిని, ప్రతిపూజ్య - తిరిగి సత్కరించి, స్మయన్ - చిరునవ్వు నవ్వుచున్నవాడై, ఇదమ్ - ఈ మాటను, ఉవాచ - పలికెను.

శ్రీహరి భగవానుడు పార్వతితో గూడియున్న ఆ శివుని సాదర ముగా సత్కరించెను. ఆయన కూడ శ్రీహరిని తిరిగి పూజించి సుఖముగా కూర్చుండి చిరునవ్వుతో ఇట్లు పలికెను.

శ్రీమహాదేవ ఉవాచ ।
దేవదేవ జగద్వ్యాపిన్ జగదీశ జగన్మయ ।
సర్వేషామపి భావానాం త్వమాత్మా హేతురీశ్వరః ॥ 4

దేవదేవ - ఓ దేవదేవా!, జగద్-వ్యాపిన్ - జగత్తును వ్యాపించి యున్నవాడా!, జగద్-ఈశ - జగన్నాథా!, జగత్-మయ - జగద్రూపుడా!, సర్వేషామ్ - సకలములైన, భావానాం అపి - పదార్థములకు కూడ, త్వమ్ - నీవు, ఆత్మా - స్వరూపము, హేతుః - కారణము, ఈశ్వరః - శాసకుడ వు.

శ్రీమహాదేవుడు ఇట్లు పలికెను --- ఓ దేవదేవా! నీవే జగద్రూప ముగా ప్రకటమై జగత్తునంతనూ వ్యాపించి జగత్తును పాలించుచున్నావు. సకలపదార్థముల స్వరూపము, కారణము నీవే. సర్వమును శాసించువా డవు నీవే.

ఆద్యంతావస్య యన్మధ్యమిదమన్యదహం బహిః ।
యతోఽవ్యయస్య నైతాని తత్సత్యం బ్రహ్మ చిద్భవాన్ ॥ 5

అస్య - ఈ జగత్తుయొక్క, ఆది-అంతౌ - ఆది అంతములు, మధ్యమ్ - స్థితికాలము, యతః - ఏ పరబ్రహ్మ వలననో, అవ్యయస్య - అవినాశియగు ఏ పరబ్రహ్మకు, ఏతాని - ఇవి, న - లేవో, యత్ - ఏ పరబ్రహ్మ, ఇదమ్ - ఎదురుగా నున్నదియో (దృశ్యమో), అహమ్ - నేను (ద్రష్టయో), బహిః - బాహ్యము (భోగ్యమో), అన్యత్ - భోక్తయో, తత్ - అట్టి, సత్యమ్ - అఖండసద్రూపము, చిత్ - ఏకరసమగు చైతన్యము అగు, బ్రహ్మ - పరబ్రహ్మ, భవాన్ - నీవే.

ఈ జగత్తునకు ఆదిమధ్యాంతములు ఆ పరబ్రహ్మనుండియే కలుగుచున్ననూ, అవి అవినాశియగు ఆ పరబ్రహ్మయందు లేవు. ఆ పరబ్రహ్మయే దృక్-దృశ్యములుగా, భోక్తృ-భోగ్యములుగా ప్రకటమగుచున్నది. శ్రుతిప్రసిద్ధమైన అఖండమగు సత్, ఏకరసమగు చిత్ అయిన ఆ పరబ్రహ్మ నీవే.

తవైవ చరణాంభోజం శ్రేయస్కామా నిరాశిషః ।
విసృజ్యోభయతస్సంగం మునయస్సముపాసతే ॥ 6

శ్రేయః-కామాః - మోక్షమును కోరువారు, నిరాశిషః - కోరికలు లేనివారు అగు, మునయః - మహర్షులు, ఉభయతః - ఇహపరములయందు, సంగమ్ - ఆసక్తిని, విసృజ్య - విడిచిపెట్టి, తవ - నీయొక్క, చరణ-అంభోజం ఏవ - పాదపద్మమును మాత్రమే, సముపాసతే - చక్కగా ఉపాసించెదరు.

కోరికలను విడచి మోక్షమును మాత్రమే కోరే మహర్షులు ఇహపరములయందలి ఆసక్తిని విడిచిపెట్టి, నీ పాదపద్మమును మాత్రమే ఉపాసించెదరు.

త్వం బ్రహ్మ పూర్ణమమృతం విగుణం విశోక-
మానందమాత్రమవికారమనన్యదన్యత్ ।

విశ్వస్య హేతురుదయస్థితిసంయమానా-
మాత్మేశ్వరశ్చ తదపేక్షతయాऽనపేక్షః ॥ 7

పూర్ణమ్ - పూర్ణమైనది, అమృతమ్ - అవినాశి, విగుణమ్ - నిర్గుణము, విశోకమ్ - శోకము లేనిది, ఆనందమాత్రమ్ - ఆనందఘనము, అవికారమ్ - వికారములు (మార్పులు) లేనిది, అనన్యత్ - రెండవది లేనిది, అన్యత్ - సర్వము కంటె విలక్షణమైనది, విశ్వస్య - జగత్తుయొక్క, ఉదయస్థితిసంయమానామ్ - సృష్టిస్థితిలయములకు, హేతుః - కారణము, ఆత్మా - ఆత్మ, తద్-అపేక్షతయా - జగత్తుచే అపేక్షించబడేది అగుటచే, ఈశ్వరః చ - జగన్నాథుడు, అనపేక్షః - ఇతరముయొక్క అపేక్ష లేనిది అగు, బ్రహ్మ - పరబ్రహ్మ, త్వమ్ - నీవే.

పూర్ణము, అవినాశి, నిర్గుణము, ఆనందఘనము, అవికారి అగు పరబ్రహ్మ నీవే. నీయందు శోకము లేశమైననూ లేదు. నీకంటె భిన్నముగా రెండవది లేదు. కాని నీవు సర్వము కంటె విలక్షణుడవు. జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు కారణము నీవే. సర్వమునకు ఆత్మ నీవే. జగత్తునకు కర్మఫలదాతయగు నాథుని అపేక్ష గలదు. అట్టి జగన్నాథుడవు నీవే. కాని, నీకు జగత్తుయొక్క అపేక్ష లేదు.

ఏకస్త్వమేవ సదసద్ద్వయమద్వయం చ
స్వర్ణం కృతాకృతమివేహ న వస్తుభేదః ।
అజ్ఞానతస్త్వయి జనైర్విహితో వికల్పో
యస్మాద్గుణైర్వ్యతికరో నిరుపాధికస్య ॥ 8

సత్ - స్థూలము, అసత్ - సూక్ష్మము, ద్వయమ్ - కార్యము, అద్వయం చ - కారణము కూడ, త్వమ్ - నీవు, ఏకః ఏవ - ఒక్కడివే, కృత-అకృతమ్ - ఆభరణముగా చేయబడినది చేయబడనిది అగు, స్వర్ణం ఇవ - బంగారము వలె, ఇహ - ఈ జగత్తునందు, వస్తుభేదః - యథార్థతత్త్వమునందు భేదము, న - లేదు, జనైః - జనులచే, అజ్ఞానతః - అజ్ఞానము వలన, త్వయి - నీయందు, వికల్పః - భేదము, విహితః - ఆరో

పించ బడినది, యస్మాత్ - ఎందువలననగా, నిరుపాధికస్య - ఉపాధి లేని నీకు, గుణైః - గుణములచే, వ్యతికరః - భేదము కానవచ్చుట.

స్థూలసూక్ష్మములు, కార్యకారణములు కూడ నీవు ఒక్కడివే. బంగారమును ఆభరణముగా చేసినా, చేయకున్నా అది కేవలము బంగారము మాత్రమే. అదే విధముగా, ఈ జగత్తులో కనబడే భేదము యథార్థతత్త్వమగు నీయందు లేదు. జనులు అజ్ఞానముచే నీయందు భేదమును ఆరోపించుచున్నారు. ఎందుకంటే, నీకు వాస్తవముగా ఉపాధి (తన ధర్మములను తనకు సమీపమునందున్నదానియందు ప్రసరింపజేసినదాయన్నట్లు ఉండేది) తోడి సంబంధము లేదు. అయిననూ, సత్త్వరజస్తమోగుణములయందు నీవు ప్రతిఫలించి వికల్పములు భాసించుచున్నవి.

త్వాం బ్రహ్మ కేచిదవయంత్యుత ధర్మమేకే
ఏకే పరం సదసతోః పురుషం పరేశమ్ ।
అన్యేఽవయంతి నవశక్తియుతం పరం త్వాం
కేచిన్మహాపురుషమవ్యయమాత్మతంత్రమ్ ।। 9

కేచిత్ - కొందరు, త్వామ్ - నిన్ను, బ్రహ్మ - పరబ్రహ్మనుగా, అవయంతి - తెలియుదురు, ఉత - మరియు, ఏకే - కొందరు, ధర్మమ్ - ధర్మమునుగా, ఏకే - కొందరు, సద్-అసతోః - ప్రకృతిపురుషులకంటె, పరమ్ - అతీతమైన, పర-ఈశమ్ - పరమేశ్వరునిగా, అన్యే - ఇతరులు, త్వామ్ - నిన్ను, నవశక్తియుతమ్ - తొమ్మిది శక్తులతో కూడియున్న, పరమ్ - పరమేశ్వరునిగా, కేచిత్ - కొందరు, అవ్యయమ్ - వినాశము లేనట్టియు, ఆత్మతంత్రమ్ - స్వతంత్రుడవైన, మహాపురుషమ్ - పురుషోత్తమునిగా, అవయంతి - తెలియుదురు.

కొందరు (వేదాంతులు) నీవే పరబ్రహ్మవనియు, కొందరు (మీమాంసకులు) నీవు ధర్మస్వరూపుడవనియు, కొందరు (సేశ్వర సాంఖ్యులు) నీవు ప్రకృతిపురుషులకు అతీతుడవైన పరమేశ్వరుడవనియు, కొందరు (పాంచరాత్రులు) నీవు తొమ్మిది (విమల - అసంగత, ఉత్కర్షిణి - ఉత్కర్ష గలది, జ్ఞాన, క్రియ, యోగ - గుణముల కలయిక, ప్రహ్వీ - విన

యము, సత్య, ఈశాన, అనుగ్రహ) శక్తులతో కూడియున్న పరమేశ్వరుడవ నియు, మరికొందరు (పాతంజలులు) నీవు వినాశము లేని స్వతంత్రుడవైన మహాపురుషుడవనియు తెలియుచున్నారు.

నాహం పరాయుర్ఋషయో న మరీచిముఖ్యా
జానంతి యద్విరచితం ఖలు సత్త్వసర్గాః ।
యన్మాయయా ముషితచేతస ఈశ దైత్య-
మర్త్యాదయః కిముత శశ్వదభద్రవృత్తాః ॥ 10

ఈశ - ఓ ఈశ్వరా!, యద్-విరచితమ్ - ఎవ్వాని రచనయగు జగత్తును, అహమ్ - నేను, న - తెలియజాలనో, పర-ఆయుః - రెండు పరార్ధములు ఆయుర్దాయము గల బ్రహ్మగారు, సత్త్వసర్గాః - సాత్త్వికసృష్టిలో భాగములైన, మరీచిముఖ్యాః - మరీచి మొదలగు, ఋషయః - మహర్షులు, న జానంతి ఖలు - తెలియకున్నారో గదా!, యత్-మాయయా - ఎవ్వాని మాయచే, ముషితచేతసః - అపహరించబడిన వివేకజ్ఞానము గలవారు, శశ్వత్ - అన్ని కాలములయందు, అభద్రవృత్తాః - మంగళము కాని రాజస తామస ప్రవృత్తి గల, దైత్యమర్త్య-ఆదయః - రాక్షసులు మానవులు మొదలగువారు, కిముత - తెలియజాలరని చెప్పవలయునా?

ఓ ఈశ్వరా! నేను గాని, రెండు పరార్ధముల ఆయుర్దాయము గల బ్రహ్మగారు గాని, సత్త్వగుణప్రధానమగు సృష్టిలో భాగమైన మరీచి మొదలగు మహర్షులు గాని నీ సృష్టియొక్క రహస్యమును తెలియకున్నారు. అట్టిచో, నీ మాయచే అపహరించబడిన వివేకజ్ఞానము గలవారై, సర్వకాలములలో అమంగళమైన రాజస తామస ప్రవృత్తులు గల రాక్షసులు, మానవులు మొదలగువారు తెలియజాలరని వేరుగా చెప్పవలయునా?

స త్వం సమీహితమదః స్థితిజన్మనాశం
భూతేహితం చ జగతో భవబంధమోక్షౌ ।
వాయుర్యథా విశతి ఖం చ చరాచరాఖ్యం
సర్వం తదాత్మకతయావగమోఽవరుంత్సే ॥ 11

అవగమః - జ్ఞానస్వరూపుడవగు, సః - అట్టి, త్వమ్ - నీవు, సమీహితమ్ - నీచే చేయబడిన, అదః - ఈ జగత్తును, జగతః - జగత్తుయొక్క, స్థితిజన్మనాశమ్ - సృష్టిస్థితిలయములను, భూత-ఈహితం చ - ప్రాణుల కర్మను, భవబంధమోక్షౌ - పుట్టుకచే బంధమును దానినుండి మోక్షమును, అవరుంత్సే - తెలియుచున్నావు, వాయుః - వాయువు, ఖం చ - ఆకాశమును, యథా - ఏ విధముగానైతే, విశతి - ప్రవేశించునో అదే విధముగా, చర-అచర-ఆఖ్యమ్ - కదిలేవి కదలనివి అనబడే, సర్వమ్ - సర్వమును, తదాత్మకతయా - వాటి ఆత్మరూపముగా, అవరుంత్సే - వ్యాపించుచున్నావు.

జ్ఞానస్వరూపుడవైన అట్టి నీవు నీచే రచించబడిన ఈ జగత్తును, దాని సృష్టిస్థితిలయములను, ప్రాణుల కర్మలను, వాటికి జననమరణరూపమగు బంధమును, దానినుండి విముక్తిని కూడ తెలియుదువు. వాయువు ఆకాశమును వ్యాపించినట్లుగా, నీవు చరాచరమగు జగత్తునంతనూ ఆత్మరూపముగా వ్యాపించి యున్నావు.

అవతారా మయా దృష్టా రమమాణస్య తే గుణైః ।
సోఽహం తద్ద్రష్టుమిచ్ఛామి యత్తే యోషిద్వపుర్ధృతమ్ ।।12

గుణైః - గుణములతో, రమమాణస్య - రమించుచున్న, తే - నీయొక్క, అవతారాః - అవతారములు, మయా - నాచే, దృష్టాః - చూడబడినవి, సః - అట్టి, అహమ్ - నేను, తత్ - దానిని, ద్రష్టుమ్ - చూచుటకు, ఇచ్ఛామి - కోరుచున్నాను, యత్ - ఏ, యోషిద్-వపుః - స్త్రీరూపము, తే - నీచే, ధృతమ్ - దాల్చబడినదో.

నీవు సత్త్వరజస్తమోగుణములను ఉపాధిగా చేసుకొని అవతరించి రమించెదవు. అట్టి నీ అవతారములను నేను చూచితిని. నీవు దాల్చిన స్త్రీరూపమును కూడ నేను చూడగోరుచున్నాను.

యేన సమ్మోహితా దైత్యాః పాయితాశ్చామృతం సురాః ।
తద్దిదృక్షవ ఆయాతాః పరం కౌతూహలం హి నః ।। 13

యేన - ఏ రూపముచే, దైత్యాః - రాక్షసులు, సమ్మోహితాః - బాగా మోహింప జేయబడినారో, చ - మరియు, సురాః - దేవతలు, **అమృతమ్ - అమృతమును, పాయితాః - త్రాగించబడినారో, తత్ - ఆ** రూపమును, దిదృక్షవః - చూడ గోరువారమై, ఆయాతాః - వచ్చినవార ము, హి - ఏలయనగా, నః - మాకు, పరమ్ - చాల, కౌతూహలమ్ - కుతూహలము.

నీవు స్త్రీరూపమును దాల్చి రాక్షసులను మోహింప జేసి, దేవత లకు అమృతమును త్రాగించితివి. ఆ రూపమును చూడగోరి మేము వచ్చి నాము. ఆ రూపమును చూడాలని మాకు చాల కుతూహలము గలదు.

శ్రీశుక ఉవాచ ।
ఏవమభ్యర్థితో విష్ణుర్భగవాన్ శూలపాణినా ।
ప్రహస్య భావగంభీరం గిరిశం ప్రత్యభాషత ॥ 14

ఏవమ్ - ఈ విధముగా, శూలపాణినా - శూలము చేతియందు గల శివునిచే, అభ్యర్థితః - ప్రార్థించబడిన, విష్ణుః భగవాన్ - విష్ణు భగవా నుడు, భావగంభీరమ్ - భావము గంభీరముగా ఉండునట్లుగా, ప్రహస్య - నవ్వి, గిరిశమ్ - కైలాసవాసిని గురించి, ప్రత్యభాషత - బదులు చెప్పెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా శూలధారియగు శివుడు ప్రార్థించగా, విష్ణు భగవానుడు గంభీరమగు (ఇతరులు తెలియజా లని) భావముతో నవ్వి, ఆ కైలాసవాసికి ఇట్లు బదులిచ్చెను.

శ్రీభగవానువాచ ।
కౌతూహలాయ దైత్యానాం యోషిద్వేషో మయా కృతః ।
పశ్యతా సురకార్యాణి గతే పీయూషభాజనే ॥ 15

సురకార్యాణి - దేవతల పనులను, పశ్యతా - చూచిపెట్టే, మయా - నాచే, పీయూషభాజనే - అమృత కలశము, గతే - దూరము కాగా, దైత్యానామ్ - రాక్షసులయొక్క, కౌతూహలాయ - మోహము కొరకు, మయా - నాచే, యోషిద్-వేషః - స్త్రీరూపము, కృతః - దాల్చబడినది.

శ్రీహరి భగవానుడిట్లు పలికెను --- దేవకార్యములను చక్కబెట్టే నేను అమృతకలశము చేయి జారిపోయినప్పుడు రాక్షసులకు మోహమును కలిగించుటకై స్త్రీరూపమును దాల్చితిని.

తత్తేఽహం దర్శయిష్యామి దిదృక్షోస్సురసత్తమ ।
కామినాం బహు మంతవ్యం సంకల్పప్రభవోదయమ్ ॥ 16

సురసత్తమ - ఓ దేవశ్రేష్ఠా!, కామినామ్ - కాముకులకు, బహు మంతవ్యమ్ - చాల ఆదరించదగినట్టియు, సంకల్పప్రభవ-ఉదయమ్ - సంకల్పమునుండి పుట్టే కామముయొక్క ఉదయమును కలిగించే, తత్ - ఆ రూపమును, దిదృక్షోః - చూడగోరే, తే - నీకు, అహమ్ - నేను, దర్శయిష్యామి - చూపించగలను.

ఓ దేవశ్రేష్ఠా! సంకల్పమునుండి కామము ఉదయించును. కామమును ఉద్దీపింప జేసే అట్టి ఆ రూపమును కాముకులు చాల సమ్మానించెదరు. దానిని చూడగోరే నీకు ఆ రూపమును నేను చూపించెదను.

శ్రీశుక ఉవాచ ।
ఇతి బ్రువాణో భగవాంస్తత్రైవాంతరధీయత ।
సర్వతశ్చారయంశ్చక్షుర్భవ ఆస్తే సహోమయా ॥ 17

ఇతి - ఈ విధముగా, బ్రువాణః - పలుకుచున్నవాడై, భగవాన్ - శ్రీహరి భగవానుడు, తత్ర ఏవ - అచ్చటనే, అంతరధీయత - అంతర్ధానము చెందెను, భవః - శివుడు, ఉమయా సహ - పార్వతితో గూడి, సర్వతః - అన్ని వైపులా, చక్షుః - చూపును, చారయన్ - ప్రసరింప జేయుచున్నవాడై, ఆస్తే - ఉన్నాడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా పలుకుతూనే శ్రీహరి భగవానుడు అచ్చటనే అంతర్ధానమాయెను. శివుడు పార్వతితో గూడి అన్ని వైపులా చూచుచుండెను.

తతో దదర్శోపవనే వరస్త్రియం విచిత్రపుష్పారుణపల్లవద్రుమే ।
విక్రీడతీం కందుకలీలయా లసద్దుకూలపర్యస్తనితంబమేఖలామ్ ॥

తతః - తరువాత, విచిత్రపుష్ప-అరుణపల్లవద్రుమే - రంగు రంగుల పువ్వులు ఎర్రని చిగుళ్లు గల చెట్లు గల, ఉపవనే - ఉద్యానవనమునందు, కందుకలీలయా - బంతియొక్క ఎగురుటచే, విక్రీడతీమ్ - క్రీడించుచున్నట్టియు, లసద్-దుకూలపర్యస్తనితంబమేఖలామ్ - ప్రకాశించే చీరచే కప్పబడిన కటియందు మేఖల (మొలనూలు) కలిగిన, వరస్త్రియమ్ - గొప్ప యువతిని, దదర్శ - చూచెను.

తరువాత శివుడు అచటి ఉద్యానవనమునందు ఒక గొప్ప యువతిని చూచెను. ఆ ఉద్యానములో చెట్లయందు రంగు రంగుల పువ్వులు, ఎర్రని చిగుళ్లు ఉండెను. ఆ యువతి విలాసగా బంతితో ఆడుచుండెను. ఆమె కటిభాగముపై ప్రకాశించే చీరను దాల్చి వడ్డాణమును పెట్టుకొనెను.

**ఆవర్తనోద్వర్తనకంపితస్తనప్రకృష్టహారోరుభరైః పదే పదే,**
**ప్రభజ్యమానామివ మధ్యతశ్చలత్పదప్రవాలం నయతీం తతస్తతః।**

ఆవర్తన-ఉద్వర్తనకంపితస్తనప్రకృష్టహార-ఉరుభరైః - వంగుట ఎగురుటలచే కంపించే స్తనముల మరియు గొప్ప హారముల పెను బరువులచే, పదే పదే - ప్రతి అడుగునందు, మధ్యతః - మధ్యయందు, ప్రభజ్యమానాం ఇవ - ముక్కలుగా చేయబడుచున్నదా యన్నట్లు ఉన్నట్టియు, చలత్-పదప్రవాలమ్ - కదిలే పాదము అనే చిగురును, తతః తతః - అటు నటు, నయతీమ్ - తీసుకువెళ్లుచున్న (యువతిని చూచెను).

ఆమె బంతిని వంగి తీసుకొని ఎగిరి పట్టుకొనేటప్పుడు కంపించే స్తనముల మరియు గొప్ప హారముల పెను భారముచే ఆమె నడుము ప్రతి అడుగునందు విరిగిపోవుచున్నదా యన్నట్లు ఉండెను. ఆమె చిగుళ్లవలె కోమలములైన పాదములతో ఇటునటు నడచుచుండెను.

దిక్షు భ్రమత్కందుకచాపలైర్భృశం
ప్రోద్విగ్నతారాయతలోలలోచనామ్ ।
స్వకర్ణవిభ్రాజితకుండలోల్లసత్-
కపోలనీలాలకమండితాననామ్ ॥ 20

దిక్షు - దిక్కులయందు, భ్రమత్-కందుకచాపలైః - తిరుగాడే బంతియొక్క చపలతలచే, భృశమ్ - మిక్కిలి, ప్ర-ఉద్విగ్నతార-ఆయతలోలలోచనామ్ - మిక్కిలి ఉద్విగ్నమైన కనుగ్రుడ్లుగల నిడివియగు చంచలమైన కన్నులు గలిగినట్టియు, స్వకర్ణవిభ్రాజితకుండల-ఉల్లసత్-కపోలనీల-అలకమండిత-ఆననామ్ - తన చెవులయందు ప్రకాశించుచున్న కుండలములచే మెరియుచున్న చెక్కిళ్లు నల్లని ముంగురులతో అలంకరించబడిన ముఖము గల (యువతిని చూచెను),

దిక్కులయందు బంతి ఎగురుచుండగా దానికేసే చూచుచుండుటచే ఆమె కనుగ్రుడ్లు మిక్కిలి ఉద్వేగమును పొందుచుండెను. చంచలమైన ఆమె కన్నులు విశాలముగ నుండెను. ఆమె చెవులయందలి కుండలముల కాంతులు బడి చెక్కిళ్లు మెరియుచుండెను. ఆమె ముఖమునకు నల్లని ముంగురులే అలంకారమాయెను.

శ్లథద్దుకూలం కబరీం చ విచ్యుతాం
సన్నహ్యతీం వామకరేణ వల్గునా ।
వినిఘ్నతీమన్యకరేణ కందుకం
విమోహయంతీం జగదాత్మమాయయా ॥ 21

శ్లథత్ - జారిపోవుచున్న, దుకూలమ్ - చీరను, విచ్యుతామ్ - విడిపోవుచున్న, కబరీం చ - జుట్టును కూడ, వల్గునా - అందమైన, వామకరేణ - ఎడమచేతితో, సన్నహ్యతీమ్ - కట్టుకొనుచున్నట్టియు, అన్యకరేణ - రెండవ చేతితో, కందుకమ్ - బంతిని, వినిఘ్నతీమ్ - కొట్టుచున్నట్టియు, ఆత్మమాయయా - తన చమత్కారముచే, జగత్ - జగత్తును, విమోహయంతీమ్ - అధికముగా మోహమును కలిగించుచున్న (యువతిని --).

ఆమె తన అందమైన ఎడమ చేతితో జారిపోవుచున్న కోకముడిని, విడిపోవుచున్న జుట్టు ముడిని మరల ముడి వేయుచుండెను. మరియొక చేతితో ఆమె బంతిని కొట్టుతూ, తన చమత్కారముచే జగత్తునకు అధికమగు వ్యామోహమును కలిగించుచుండెను.

తాం వీక్ష్య దేవ ఇతి కందుకలీలయేషద్-
వ్రీడాఽస్ఫుటస్మితవిసృష్టకటాక్షముష్టః ।
స్త్రీప్రేక్షణప్రతిసమీక్షణవిహ్వలాత్మా
నాత్మానమంతిక ఉమాం స్వగణాంశ్చ వేద ।। 22

తామ్ - ఆమెను, వీక్ష్య - చూచి, ఇతి - ఈ విధముగా, కందుకలీలయా - బంతి ఆటచే, ఈషద్-వ్రీడా-అస్ఫుటస్మితవిసృష్టకటాక్షముష్టః - కొంచెము సిగ్గుతో అస్పష్టమైన చిరునవ్వుతో కూడి విడిచిపెట్టబడిన కడగంటి చూపుచే మోసపోయినవాడు, స్త్రీప్రేక్షణప్రతిసమీక్షణవిహ్వల-ఆత్మా - స్త్రీని చూచుటచే ఆమె తిరిగి చూచుటచే కలవరపడిన మనస్సు గల, దేవః - శివుడు, ఆత్మానం అంతికే - తన సమీపమునందు ఉన్న, ఉమామ్ - పార్వతిని, స్వగణాన్ చ - తన గణములను కూడ, న వేద - తెలియలేదు.

ఆమెను చూచి శివుడు తనకు సమీపమునందు పార్వతి, తన గణములు ఉన్నారనే సంగతినే విస్మరించెను. ఈ విధముగా ఆ యువతి బంతి ఆట ఆడుతూ కొద్దిగా సిగ్గుపడి అస్పష్టమైన చిరునవ్వుతో శివునిపై ఒక కడగంటి చూపును విసరగా, ఆయన ఆ చూపునకు మోసపోయెను. ఆయన ఆమెను చూడగా తిరిగి ఆమె ఆయనకేసి చూచుటచే, ఆయన మనస్సు కలవరపడెను.

తస్యాః కరాగ్రాత్స తు కందుకో యదా
గతో విదూరం తమనువ్రజత్స్త్రియాః ।
వాసస్ససూత్రం లఘు మారుతోఽహరద్
భవస్య దేవస్య కిలానుపశ్యతః ।। 23

తస్యాః - ఆమెయొక్క, కర-అగ్రాత్ - చేతికొననుండి, సః - ఆ, కందుకః తు - బంతియైతే, యదా - ఎప్పుడైతే, విదూరమ్ - కొద్ది దూరము, గతః - వెళ్లినదో, తమ్ - దానిని, అనువ్రజత్-స్త్రియాః - వెంట వెళ్లుచున్న ఆ స్త్రీయొక్క, ససూత్రమ్ - మొలనూలుతో కూడిన, లఘు - సూక్ష్మ మైన, వాసః - చీరను, భవస్య దేవస్య - శివదేవుడు, అను - నిరం

తరముగా, పశ్యతః - చూచుచుండగా, మారుతః - గాలి, అహరత్ కిల - అపహరించెను గదా!

ఆమె చేతినుండి జారిన ఆ బంతి కొంత దూరము పోగా, ఆమె దానిని వెన్నంటి వెళ్ళుచుండెను. ఆమెను శివదేవుడు నిరంతరముగా చూచుచుండెను. ఇంతలో గాలికి ఆమె నాజూకైన చీర, మొలనూలుతో సహా ప్రక్కకు తొలగెను.

ఏవం తాం రుచిరాపాంగీం దర్శనీయాం మనోరమామ్ ।
దృష్ట్వా తస్యాం మనశ్చక్రే విషజ్జంత్యాం భవః కిల ॥ 24

ఏవమ్ - ఈ విధముగా, రుచిర-అపాంగీమ్ - అందమైన కడగంటి చూపులు కలిగినట్టియు, దర్శనీయామ్ - సుందరి యైనట్టియు, మనోర మామ్ - మనస్సును రంజింపజేసే, తామ్ - ఆమెను, దృష్ట్వా - చూచి, భవః - శివుడు, విషజ్జంత్యామ్ - వంకరగా తనను చూచుచున్న, తస్యామ్ - ఆమెయందు, మనః చక్రే కిల - మనసు పడెనట.

ఈ విధముగా అందమైన కడగంటి చూపులతో మనస్సును రంజింపజేసే ఆ సుందరిని శివుడు చూచెను. ఆమె కూడ ఆయన వైపు వక్రముగా చూచెను. అపుడు ఆయన ఆమెపై మనసు పడెనట.

తయాఽపహృతవిజ్ఞానస్తత్కృతస్మరవిహ్వలః ।
భవాన్యా అపి పశ్యంత్యా గతహ్రీస్తత్పదం యయౌ ॥ 25

తయా - ఆమెచే, అపహృతవిజ్ఞానః - అపహరించబడిన వివేకము గలవాడు, తత్-కృతస్మరవిహ్వలః - ఆమెచే కలిగించబడిన మన్మథునిచే స్వాధీనత తప్పినవాడు అగు శివుడు, భవాన్యాః - పార్వతీ దేవి, పశ్యంత్యాః అపి - చూచుచున్ననూ, గతహ్రీః - తొలగిన బిడియము గలవాడై, తత్-పదమ్ - ఆమె ఉన్న స్థానమును గురించి, యయౌ - వెళ్ళెను.

ఆమె శివుని వివేకమును హరించివేసెను. ఆమెను చూచుటచే శివునియందు కామోద్రేకము కలిగి ఆయన స్వాధీనతను, లజ్జను కూడ

కోల్పోయెను. పార్వతీ దేవి చూచుచుండగనే, ఆయన ఆమెను లెక్క చేయకుండా ఆ యువతి ఉన్న చోటకు వెళ్లెను.

సా తమాయాంతమాలోక్య వివస్త్రా వ్రీడితా భృశమ్ ।
నిలీయమానా వృక్షేషు హసంతీ నాన్వతిష్ఠత ॥ 26

వివస్త్రా - కొద్దిగా తొలగిన వస్త్రము గల, సా - ఆమె, ఆయాంతమ్ - వచ్చుచున్న, తమ్ - ఆ శివుని, ఆలోక్య - చూచి, భృశమ్ - మిక్కిలి, వ్రీడితా - సిగ్గు పడినదై, వృక్షేషు - చెట్లయందు, నిలీయమానా - దాగుకొనుచున్నదై, హసంతీ - నవ్వుచున్నదై, న అను-అతిష్ఠత - ఒక చోట నిలవలేదు.

కొద్దిగా తొలగిన వస్త్రము గల ఆ యువతి తన వద్దకు శివుడు వచ్చుచుండుటను చూచి చాల సిగ్గుపడి నవ్వుతూ చెట్లమధ్యలో దాగు కుంటూ ఒకచోట స్థిరముగా నిలబడలేదు.

తామన్వగచ్ఛద్భగవాన్ భవః ప్రముషితేంద్రియః ।
కామస్య చ వశం నీతః కరేణుమివ యూథపః ॥ 27

ప్రముషిత-ఇంద్రియః - అపహరించబడిన మనస్సు గలవాడు, కామస్య చ - మన్మథునకు, వశం నీతః - వశుడుగా చేయబడిన, భగవాన్ భవః - శివ భగవానుడు, తామ్ - ఆమెను, యూథపః - గజేంద్రుడు, కరేణుం ఇవ - ఆడు ఏనుగును వలె, అను - అనుసరించి, అగచ్ఛత్ - వెళ్లెను.

ఆమె శివ భగవానుని మనస్సును దోచివేయగా, ఆయన మన్మథునకు వశుడాయెను. గజేంద్రుడు ఆడు ఏనుగును వలె, ఆయన ఆమెను అనుసరించి వెళ్లెను.

సోఽనువ్రజ్యాతివేగేన గృహీత్వానిచ్ఛతీం స్త్రియమ్ ।
కేశబంధ ఉపానీయ బాహుభ్యాం పరిషస్వజే ॥ 28

సః - ఆయన, అతివేగేన - అధికమగు వేగముతో, అనువ్రజ్య - అనుసరించి వెళ్లి, అనిచ్ఛతీమ్ - ఇష్టపడని, స్త్రియమ్ - ఆ యువతిని, కేశబంధే - జుట్టుముడియందు, ఉపానీయ - దగ్గరకు తీసుకొని, బాహుభ్యామ్ - రెండు చేతులతో, పరిషస్వజే - కౌగిలించుకొనెను.

ఆయన అధికమగు వేగముతో ఆమెను వెంబడించెను. ఆమె ఇష్ట పడకున్ననూ, ఆయన ఆమె జుట్టుముడిని పట్టుకొని దగ్గరగా తీసుకొని రెండు చేతులతో కౌగిలించుకొనెను.

సోపగూఢా భగవతా కరిణా కరిణీ యథా ।
ఇతస్తతః ప్రసర్పంతీ విప్రకీర్ణశిరోరుహా ॥ 29

సా - ఆమె, భగవతా - శివ భగవానునిచే, కరిణా - గజేంద్రునిచే, కరిణీ యథా - ఆడు ఏనుగు వలె, ఉపగూఢా - కౌగిలించుకొన బడినది, ఇతః - ఇటు, తతః - అటు, ప్రసర్పంతీ - గుంజుకొనుచున్నదై, విప్రకీర్ణశిరోరుహా - చెల్లాచెదురైన జుట్టు గలది.

శివ భగవానుడు గజేంద్రుడు ఆడు ఏనుగును వలె ఆమెను కౌగిలించుకొనెను. అపుడామె ఇటునటు గుంజుకొనగా, ఆమె జుట్టు చెల్లాచెదరాయెను.

ఆత్మానం మోచయిత్వాఽంగ సురర్షభభుజాంతరాత్ ।
ప్రాద్రవత్సా పృథుశ్రోణీ మాయా దేవవినిర్మితా ॥ 30

అంగ - ఓయీ!, దేవవినిర్మితా - శ్రీహరిచే నిర్మించబడిన, మాయా - మాయయైన, సా - ఆ, పృథుశ్రోణీ - సుందరి, సుర-ఋషభ భుజ-అంతరాత్ - దేవశ్రేష్ఠుడగు శివుని భుజముల మధ్యనుండి, ఆత్మానమ్ - తనను, మోచయిత్వా - విడిపించుకొని, ప్రాద్రవత్ - వేగముగా పారిపోయెను.

ఓ మహారాజా! శ్రీహరిచే నిర్మించబడిన మాయయైన ఆ సుందరి దేవశ్రేష్ఠుడగు శివుని భుజముల మధ్యనుండి తనను విడిపించుకొని వేగముగా పారిపోయెను.

తస్యాసౌ పదవీం రుద్రో విష్ణోరద్భుతకర్మణః ।
ప్రత్యపద్యత కామేన వైరిణేవ వినిర్జితః ॥ 31

అసౌ - ఈ, రుద్రః - రుద్రుడు, వైరిణా - శత్రువగు, కామేన - మన్మథునిచే, వినిర్జితః ఇవ - జయించబడినవాడా యన్నట్లు, అద్భుతకర్మణః - ఆశ్చర్యమును గొలిపే లీలలు గల, తస్య - ఆ, విష్ణోః - విష్ణువు యొక్క, పదవీమ్ - మార్గమును, ప్రత్యపద్యత - వెనుక పరుగెత్తెను.

ఈ రుద్రుడు మోహినీరూపములోనున్న ఆ విష్ణువు వెళ్లిన మార్గములో వెనుక పరుగెత్తెను. విష్ణువుయొక్క లీలలు అచ్చెరువును గొల్పును. ఆ సమయములో రుద్రుని ఆయన శత్రువగు మన్మథుడు జయించినాడా యన్నట్లుండెను.

తస్యానుధావతో రేతశ్చస్కందామోఘరేతసః ।
శుష్మిణో యూథపస్యేవ వాసితామను ధావతః ॥ 32

అమోఘరేతసః - వ్యర్థము కాని బీజశక్తి గల, తస్య - ఆ రుద్రుడు, అనుధావతః - వెనుక పరుగెత్తుచుండగా, వాసితామ్ - ఆడు ఏనుగును, అను - వెంట, ధావతః - పరుగెత్తే, శుష్మిణః - మదించియున్న, యూథపస్య ఇవ - గజేంద్రునకు వలె, రేతః - బీజము, చస్కంద - స్కన్నమాయెను.

ఆడు ఏనుగు వెనుక మదించిన గజేంద్రుడు వలె ఆ రుద్రుడు మోహిని వెంట పరుగెత్తుచుండగా, అమోఘమగు ఆయన బీజము స్కన్నమాయెను.

యత్ర యత్రాపతన్మహ్యాం రేతస్తస్య మహాత్మనః ।
తాని రూప్యస్య హేమ్నశ్చ క్షేత్రాణ్యాసన్మహీపతే ॥ 33

మహీపతే - ఓ మహారాజా!, మహాత్మనః - మహాత్ముడగు, తస్య - ఆ రుద్రునియొక్క, రేతః - బీజశక్తి, మహ్యామ్ - భూమిపై, యత్ర యత్ర - ఎక్కడెక్కడైతే, అపతత్ - పడెనో, తాని - ఆ స్థానములు, రూప్యస్య -

వెండియొక్క; హేమ్నః చ - బంగారముయొక్క, క్షేత్రాణి - గనులు, ఆసన్ - కలిగినవి.

ఓ మహారాజా! మహాత్ముడగు ఆ రుద్రుని బీజము భూమిపై పడిన చోటల్లా వెండి బంగారముల గనులు తయారైనవి.

సరిత్సరస్సు శైలేషు వనేషూపవనేషు చ ।
యత్ర క్వ చాసన్నృషయస్తత్ర సంనిహితో హరః ॥ 34

సరిత్-సరస్సు - నదులు సరస్సులయందు, శైలేషు - పర్వతములయందు, వనేషు - అడవులయందు, ఉపవనేషు చ - ఉద్యానములయందు కూడ, యత్ర క్వ చ - ఎక్కడెక్కడైతే, ఋషయః - మహర్షులు, ఆసన్ - ఉండిరో, తత్ర - అచట, హరః - రుద్రుడు, సంనిహితః - సన్నిధిని ఇచ్చెను.

నదులు, సరస్సులు, పర్వతములు, అడవులు, ఉద్యానవనములు ఇత్యాదిగా ఎక్కడెక్కడైతే మహర్షులు ఉండిరో, రుద్రుడు ఆ స్థానముల న్నింటియందు తన సన్నిధిని అనుగ్రహించెను.

స్కన్నే రేతసి సోఽపశ్యదాత్మానం దేవమాయయా ।
జడీకృతం నృపశ్రేష్ఠ సంన్యవర్తత కశ్మలాత్ ॥ 35

నృపశ్రేష్ఠా - ఓ మహారాజా!, రేతసి - బీజశక్తి, స్కన్నే - స్కన్నము కాగా, సః - ఆ రుద్రుడు, దేవమాయయా - విష్ణుమాయచే, ఆత్మానమ్ - తనను, జడీకృతమ్ - జడుడుగా చేయబడినవానినిగా, అపశ్యత్ - చూచెను, కశ్మలాత్ - మోహమునుండి, సంన్యవర్తత - పూర్తిగా నివృత్తుడాయెను.

ఓ మహారాజా! బీజము స్కన్నము కాగానే రుద్రుడు తాను విష్ణుమాయచే జడుడనైతినని తెలుసుకొనెను. వెంటనే ఆయన ఆ వ్యామోహము నుండి నివృత్తుడాయెను.

అథావగతమాహాత్మ్య ఆత్మనో జగదాత్మనః ।
అపరిజ్ఞేయవీర్యస్య న మేనే తదు హాద్భుతమ్ ॥ 36

అథ - తరువాత, జగద్-ఆత్మనః - జగత్తునకు ఆత్మరూపుడైనట్టి యు, అపరిజ్ఞేయవీర్యస్య - తెలియ శక్యము కాని శక్తి కల, హరేః చ - శ్రీహరియొక్క కూడ, అవగతమాహాత్మ్యః - తెలియబడిన మహిమ గల రుద్రుడు, ఆత్మనః - తనయొక్క, తత్ - దానిని, అద్భుతమ్ - ఆశ్చర్యము నుగా, న మేనే హ - తలపోయలేదు.

తరువాత రుద్రుడు జగత్తునకు ఆత్మరూపుడైన శ్రీహరియొక్క మహిమను గుర్తించెను. శ్రీహరి శక్తి తెలియ శక్యము కానిది. అపుడాయన తాను జడుడగుట ఆశ్చర్యము కాదనియే భావించెను.

తమవిక్లబమవ్రీడమాలక్ష్య మధుసూదనః ।
ఉవాచ పరమప్రీతో బిభ్రత్స్వాం పౌరుషీం తనుమ్ ॥ 37

అవిక్లబమ్ - కలవరపాటు లేనట్టియు, అవ్రీడమ్ - బిడియము లేని, తమ్ - ఆ రుద్రుని, ఆలక్ష్య - చూచి, స్వామ్ - తనదైన, పౌరుషీమ్ - పురుషునకు చెందిన, తనుమ్ - రూపమును, బిభ్రత్ - ధరించిన, మధు సూదనః - శ్రీహరి, పరమప్రీతః - మిక్కిలి ప్రీతిని పొందినవాడై, ఉవాచ - పలికెను.

మధువు అనే రాక్షసుని (భోగాసక్తిని) సంహరించిన శ్రీహరి తన పురుషరూపమును దాల్చెను. ఆయనకు రుద్రుడు విషాదము గాని, బిడి యము గాని లేకుండా కనబడెను. ఆయన చాల ప్రీతిని జెంది ఇట్లు పలికె ను.

శ్రీభగవానువాచ ।
దిష్ట్యా త్వం విబుధశ్రేష్ఠ స్వాం నిష్ఠామాత్మనా స్థితః ।
యన్మే స్త్రీరూపయా స్వైరం మోహితోఽప్యంగ మాయయా ॥38

అంగ - ఓయీ!, విబుధశ్రేష్ఠ - ఓ దేవశ్రేష్ఠా!, త్వమ్ - నీవు, స్వైరమ్ - స్వేచ్ఛచే, స్త్రీరూపయా - స్త్రీరూపములోనున్న, మే -

నాయొక్క, మాయయా - మాయచే, మోహితః అపి - మోహితుడవైన నూ, ఆత్మనా - నీచే, స్వామ్ - నీదైన, నిష్ఠామ్ - స్వరూపమును, స్థితః - నిలిచినావు అనేది, యత్ - ఏది గలదో అది, దిష్ట్యా - మంగళము.

శ్రీహరి భగవానుడిట్లు పలికెను --- ఓ రుద్రా! నీవు దేవతలలో శ్రేష్ఠుడవు. నేను స్వేచ్ఛచే స్త్రీరూపములోనుండగా, నీవు నా మాయచే మోహితుడవైననూ, నీ అంతట నీవు నీ స్వరూపమునందు నిలిచియుం డుట చాల మంగళకరము.

కో ను మేఽతితరేన్మాయాం విషక్తస్త్వదృతే పుమాన్ ।
తాంస్తాన్విసృజతీం భావాన్ దుస్తరామకృతాత్మభిః ॥ 39

త్వద్-ఋతే - నిన్ను మినహాయిస్తే, విషక్తః - అధికముగా భోగ ములయందు తగుల్కొన్న, కః ను పుమాన్ - ఏ వ్యక్తి, తాన్ తాన్ - ఆయా, భావాన్ - విలాసలను, విసృజతీమ్ - విశేషముగా ప్రకటించునట్టి యు, అకృత-ఆత్మభిః - వశము చేసుకొనబడని చిత్తము గలవారిచే, దుస్త రామ్ - తరించ శక్యము కాని, మే - నాయొక్క, మాయామ్ - మాయను, **అతితరేత్** - అతిక్రమించును?

నా మాయ అనేకములగు విలాసలను, హావభావములను విశేష ముగా ప్రకటించును. దానిని చిత్తజయము లేనివారు తరించలేరు. అధిక ముగా భోగములయందు తగుల్కొన్న ఏ వ్యక్తి దానిని అధిగమించ గల్గును? కాని నీవు అధిగమించితివి.

సేయం గుణమయీ మాయా న త్వామభిభవిష్యతి ।
మయా సమేతా కాలేన కాలరూపేణ భాగశః ॥ 40

కాలేన - కాలముచే, కాలరూపేణ - కాలరూపుడనగు, మయా - నాచే, భాగశః - సత్త్వరజస్తమోగుణములు అనే అంశలుగా, సమేతా - ఉపాధిగా స్వీకరించబడిన, సా - ఆ, ఇయమ్ - ఈ, గుణమయీ - త్రిగు ణాత్మకమగు, మాయా - మాయ, త్వామ్ - నిన్ను, న అభిభవిష్యతి - మోహితుని చేయబోదు.

సృష్టిస్థితిలయములకు నిమిత్తమైన కాలమును బట్టి కాలరూపుడ నగు నేను సత్త్వరజస్తమోగుణములనే అంశలుగా మాయాశక్తిని ఉపాధిగా స్వీకరించెదను. ఆ ఈ మాయ నిన్ను మోహితుని చేయబోదు.

శ్రీశుక ఉవాచ ।
ఏవం భగవతా రాజన్ శ్రీవత్సాంకేన సత్కృతః ।
ఆమంత్ర్య తం పరిక్రమ్య సగణస్స్వాలయం యయౌ ।।41

రాజన్ - ఓ మహారాజా!, ఏవమ్ - ఈ విధముగా, శ్రీవత్సాంకేన - లక్ష్మీదేవి పుట్టుమచ్చయై వక్షఃస్థలమునందు గల, భగవతా - శ్రీహరి భగవానునిచే, సత్కృతః - సత్కరించబడిన రుద్రుడు, సగణః - గణములతో కూడినవాడై, తమ్ - ఆ శ్రీహరిని, ఆమంత్ర్య - సెలవు తీసుకొని, పరిక్రమ్య - ప్రదక్షిణము చేసి, స్వ-ఆలయమ్ - తన ధామమును గురించి, యయౌ - వెళ్లెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! లక్ష్మీదేవి వక్షః స్థలముపై పుట్టుమచ్చయై ఉండే శ్రీహరి భగవానుడు రుద్రుని సత్కరించెను. ఆయన తన గణములతో కూడి శ్రీహరికి ప్రదక్షిణము చేసి, ఆయన వద్ద సెలవు తీసుకొని తన ధామమునకు వెళ్లెను.

ఆత్మాంశభూతాం తాం మాయాం భవానీం భగవాన్ భవః ।
శంసతామృషిముఖ్యానాం ప్రీత్యాఽఽచష్టాథ భారత ।। 42

భారత - భరతవంశీయుడవగు ఓ రాజా!, అథ - తరువాత, ఋషిముఖ్యానామ్ - మహర్షులు, శంసతామ్ - స్తుతించుచుండగా, భగవాన్ భవః - శివ భగవానుడు, ఆత్మాంశభూతామ్ - తనకు అర్ధాంగియైన, భవానీమ్ - పార్వతీ దేవిని ఉద్దేశించి, ప్రీత్యా - ప్రేమతో, తామ్ - ఆ, మాయామ్ - మాయను గురించి, ఆచష్ట - వర్ణించి చెప్పెను.

భరతవంశీయుడవగు ఓ మహారాజా! తరువాత మహర్షులు స్తుతించుచుండగా, శివ భగవానుడు తన అర్ధాంగియగు పార్వతీదేవితో ఆ మాయను గురించి ప్రీతితో వర్ణించి చెప్పెను.

అపి వ్యపశ్యస్త్వమజస్య మాయాం
పరస్య పుంసః పరదేవతాయాః ।
అహం కలానామృషభో విముహ్యే
యయాఽవశోఽన్యే కిముతాస్వతంత్రాః ॥ 43

అజస్య - పుట్టుక లేనట్టియు, పరదేవతాయాః - సర్వాతిశాయి ప్రకాశస్వరూపుడైన, పరస్య పుంసః - పురుషోత్తమునియొక్క, మాయామ్ - మాయను, అపి వ్యపశ్యః - చూచితివా?, కలానామ్ - శ్రీహరి అంశల లో, ఋషభః - శ్రేష్ఠుడనగు, అహమ్ - నేను, అవశః - వశము తప్పినవా డనై, యయా - ఏ మాయచే, విముహ్యే - మోహమును పొందితినో, అస్వతంత్రాః - స్వతంత్రులు కాని, అన్యే - ఇతరులు, కిముత - చెప్పునదే మున్నది?

పుట్టుక లేనివాడు, సర్వాతిశాయి ప్రకాశ స్వరూపుడు అగు పురు షోత్తమునియొక్క మాయను నీవు చూచితివా? శ్రీహరి అంశలలో నేను శ్రేష్ఠుడను. అయిననూ, నేనే ఆ మాయచే మోహమును పొందగా, ఇంద్రి యములకు బానిసలై యుండే ఇతరుల గురించి చెప్పున దేమున్నది?

యం మామపృచ్ఛస్త్వముపేత్య యోగాత్
సమాసహస్రాంత ఉపారతం వై ।
స ఏష సాక్షాత్పురుషః పురాణో
న యత్ర కాలో విశతే న వేదః ॥ 44

సమాసహస్ర-అంతే - వేయి సంవత్సరముల ఆఖరున, యోగాత్ - ధ్యానమునుండి, ఉపారతమ్ - విరమించిన, మామ్ - నన్ను, త్వమ్ - నీవు, ఉపేత్య - దగ్గరకు వచ్చి, యమ్ - ఎవనిని గురించి, అపృచ్ఛః - ప్రశ్నించితివో, సః - ఆతడు, సాక్షాత్ - సాక్షాత్తుగా, ఏషః - ఈ శ్రీహరి, పురాణః - కాలాతీతుడగు, పురుషః - పూర్ణబ్రహ్మము, యత్ర - ఎవనియం దైతే, కాలః - కాలము, న విశతే - ప్రవేశించదో, వేదః - వేదము, న - ప్రవే శించదో.

వేయి సంవత్సరముల తరువాత నేను ధ్యానమును విరమించినప్పుడు నీవు నా దగ్గరకు వచ్చి, నీవు ధ్యానించేది ఎవరిని? అని ప్రశ్నించితివి. నేను ధ్యానించే కాలాతీతమైన ఆ పూర్ణ పరబ్రహ్మము సాక్షాత్తుగా ఈ శ్రీహరియే. శ్రీహరిని కాలము పరిచ్ఛేదము చేయలేదు. ఆయనను వేదములు వర్ణించలేవు.

శ్రీశుక ఉవాచ ।
ఇతి తేఽభిహితస్తాత విక్రమశ్శార్ఙ్గధన్వనః ।
సింధోర్నిర్మథనే యేన ధృతః పృష్ఠే మహాచలః ।। 45

తాత - వత్సా!, ఇతి - ఈ విధముగా, తే - నీ కొరకు, శార్ఙ్గధన్వనః - శార్ఙ్గము అనే ధనస్సు గల శ్రీహరియొక్క, విక్రమః - పరాక్రమము, అభిహితః - వర్ణించి చెప్పబడినది, యేన - ఎవనిచేనైతే, సింధోః - సముద్రముయొక్క, నిర్మథనే - మథనమునందు, మహా-అచలః - పెద్ద పర్వతము, పృష్ఠే - వీపుపై, ధృతః - ధరించబడినదో.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ వత్సా! ఈ విధముగా శార్ఙ్గము అనే ధనస్సు గల శ్రీహరియొక్క పరాక్రమమును నీకు వర్ణించి చెప్పితిని. ఆయన సముద్రమథనమునందు కూర్మరూపముతో పెద్ద పర్వతమును తన వీపుపై మోసెను.

ఏతన్ముహుః కీర్తయతోఽనుశృణ్వతో
న రిష్యతే జాతు సముద్యమః క్వచిత్ ।
యదుత్తమశ్లోకగుణానువర్ణనం
సమస్తసంసారపరిశ్రమాపహమ్ ।। 46

ఏతత్ - దీనిని, ముహుః - పలుమార్లు, కీర్తయతః - కీర్తించువానికి, అనుశృణ్వతః - చెప్పగా వినువానికి, సముద్యమః - చక్కని ఉద్యమము, జాతు - ఎప్పుడైననూ, క్వచిత్ - ఎక్కడైననూ, న రిష్యతే - విఫలము కాబోదు, యత్ - ఏలయనగా, ఉత్తమశ్లోకగుణ-అనువర్ణనమ్ - పవి

త్రకీర్తియగు శ్రీహరియొక్క గుణములను వర్ణించుట, సమస్తసంసారపరిశ్ర మ-అపహమ్ - సకలమైన సంసారముయొక్క శ్రమను పోగొట్టునది.

ఈ గాథను పలుమార్లు కీర్తించువాడు, ప్రవచనమును చెప్పగా వినువాడు ఎక్కడైననూ చేపట్టే మంచి ఉద్యమము ఏ కాలమునందైననూ నిష్ఫలము కాబోదు. ఎందుకంటే, పవిత్రకీర్తియగు శ్రీహరియొక్క గుణములను శాస్త్రము బోధించిన విధముగా వర్ణించినచో, సంసారములోని సకలములైన శ్రమలు దూరమగును.

అసదవిషయమంఘ్రిం భావగమ్యం ప్రపన్నాన్
అమృతమమరవర్యానాశయత్సింధుమథ్యమ్ ।
కపటయువతివేషో మోహయన్ యస్సురారీన్
తమహముపసృతానాం కామపూరం నతోఽస్మి ॥ 47

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే సముద్రమథనవృత్తాంతే మోహిన్యవతారవర్ణనం నామ ద్వాదశోఽధ్యాయః ॥

కపటయువతివేషః - కపటముగా యువతియొక్క వేషము గల, యః - ఎవడైతే, సుర-అరీన్ - దేవశత్రువులగు రాక్షసులను, మోహయన్ - మోహింప జేయువాడై, అసద్-అవిషయమ్ - దుష్టులకు తెలియనట్టియు, భావగమ్యమ్ - భక్తిచే పొందబడే, అంఘ్రిమ్ - పాదమును, ప్రపన్నాన్ - శరణు వేడిన, అమరవర్యాన్ - దేవశ్రేష్ఠులను, సింధుమథ్యమ్ - సముద్రమథనమునుండి పుట్టిన, అమృతమ్ - అమృతమును, ఆశయత్ - భుజింప జేసెనో, ఉపసృతానామ్ - దగ్గరకు చేరినవారికి (భక్తులకు), కామపూరమ్ - కోరికలను ఈడేర్చే, తమ్ - ఆ శ్రీహరిని, అహమ్ - నేను, నతః - నమస్కరించినవాడను, అస్మి - అగుచున్నాను.

శ్రీహరి కపటముగా యువతి వేషమును ధరించి దేవశత్రువులగు రాక్షసులను మోహింప జేసి, శ్రేష్ఠులగు దేవతలకు సముద్రమథనము వలన పుట్టిన అమృతమును భుజింప జేసెను. ఎందుకంటే, దేవతలు ఆయన పాదమును శరణు వేడిరి. దుష్టులకు ఆయన పాదముల మహిమ తెలియదు. కేవలము భక్తిచే మాత్రమే ఆయన శరణు లభించును. ఆయన

దగ్గరకు చేరిన భక్తులకు ఆయన కోరికలను ఈడేర్చును. అట్టి శ్రీహరికి నేను నమస్కరించుచున్నాను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
సముద్రమథన వృత్తాంతములో మోహినీ అవతారమును
వర్ణించే పన్నెండవ అధ్యాయము ముగిసినది (12) .

*****

# అథ త్రయోదశోऽధ్యాయః

## రాబోయే మన్వంతరముల వర్ణనము

శ్రీశుక ఉవాచ ।
మనుర్వివస్వతః పుత్రశ్శ్రాద్ధదేవ ఇతి శ్రుతః ।
సప్తమో వర్తమానో యస్తదపత్యాని మే శృణు ।। 1

శ్రాద్ధదేవః - శ్రాద్ధదేవుడు, ఇతి - అని, శ్రుతః - ప్రఖ్యాతి బడసిన, వివస్వతః - సూర్యదేవుని, పుత్రః - పుత్రుడు, సప్తమః - ఏడవ, వర్తమానః - ఇప్పుడు ఉన్న, మనుః - మనువు, యః - ఎవడు గలడో, తద్-అపత్యాని - ఆయన సంతానమును గురించి, మే - నా వలన, శృణు - వినుము.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- సూర్యదేవుని పుత్రుడు శ్రాద్ధదేవుడు అని ప్రసిద్ధి గాంచినవాడు ఇప్పుడు ఏడవ మనువుగా ఉన్నాడు. ఆయన సంతానమును గురించి నేను చెప్పెదను. వినుము.

ఇక్ష్వాకుర్నభగశ్చైవ ధృష్టశ్శర్యాతిరేవ చ ।
నరిష్యంతోऽథ నాభాగస్సప్తమో దిష్ట ఉచ్యతే ।। 2

కరూషశ్చ పృషధ్రశ్చ దశమో వసుమాన్ స్మృతః ।
మనోర్వైవస్వతస్యైతే దశ పుత్రాః పరంతప ।। 3

పరంతప - శత్రువులను తపింపజేసే ఓ మహారాజా!, ఇక్ష్వాకుః - ఇక్ష్వాకువు, నభగః చ ఏవ - నభగుడు, ధృష్టః - ధృష్టుడు, శర్యాతిః ఏవ చ - శర్యాతి, నరిష్యంతః - నరిష్యంతుడు, నాభాగః - నాభాగుడు, సప్తమః - ఏడవవాడు, దిష్టః - దిష్టుడు అని, ఉచ్యతే - చెప్పబడును, కరూషః చ

- కరూషుడు, పృషధ్రః చ - పృషధ్రుడు, దశమః - పదవవాడు, వసుమాన్ - వసుమంతుడు అని, స్మృతః - చెప్పబడినాడు, ఏతే - వీరు, వైవస్వ తస్య మనోః - వైవస్వత మనువుయొక్క, దశ - పదిమంది, పుత్రాః - పుత్రులు.

శత్రువులను తపింపజేసే ఓ మహారాజా! ఇక్ష్వాకువు, నభగుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, నాభాగుడు, దిష్టుడు, కరూషుడు, పృష ధ్రుడు, వసుమంతుడు అనే పదిమంది వైవస్వత మనువుయొక్క పుత్రులు అని మహాత్ములు చెప్పెదరు.

ఆదిత్యా వసవో రుద్రా విశ్వేదేవా మరుద్గణాః ।
అశ్వినావృభవో రాజన్నింద్రస్తేషాం పురందరః ॥ 4

రాజన్ - ఓ మహారాజా!, ఆదిత్యాః - ఆదిత్యులు, వసవః - వసువులు, రుద్రాః - రుద్రులు, విశ్వేదేవాః - విశ్వేదేవతలు, మరుద్-గణాః - మరుత్తుల గణములు, అశ్వినౌ - అశ్వినీ దేవతలు, ఋభవః - ఋభువులు, తేషామ్ - వారికి, పురందరః - పురందరుడు, ఇంద్రః - ఇంద్రుడు.

ఓ మహారాజా! ఆదిత్యులు, వసువులు, రుద్రులు, విశ్వేదేవతలు, మరుత్తుల గణములు, అశ్వినీ దేవతలు, ఋభువులు అనువారలు దేవగణములు. వారి ఇంద్రుడు పురందరుడు.

కశ్యపోఽత్రిర్వసిష్ఠశ్చ విశ్వామిత్రోఽథ గౌతమః ।
జమదగ్నిర్భరద్వాజ ఇతి సప్తర్షయస్స్మృతాః ॥ 5

కశ్యపః - కశ్యపుడు, అత్రిః - అత్రి, వసిష్ఠః చ - వసిష్ఠుడు, విశ్వామిత్రః - విశ్వామిత్రుడు, అథ - మరియు, గౌతమః - గౌతముడు, జమదగ్నిః - జమదగ్ని, భరద్వాజః - భరద్వాజుడు, ఇతి - అనువారలు, సప్త-ఋషయః - సప్తర్షులు అని, స్మృతాః - చెప్పబడినారు.

కశ్యపుడు, అత్రి, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని, భరద్వాజుడు అనువారలు సప్తర్షులు అని చెప్పెదరు.

అత్రాపి భగవజ్జన్మ కశ్యపాదదితేరభూత్ ।
ఆదిత్యానామవరజో విష్ణుర్వామనరూపధృక్ ॥ 6

అత్ర అపి - ఈ మన్వంతరమునందు కూడ, కశ్యపాత్ - కశ్యపుని వలన, అదితేః - అదితికి, భగవత్-జన్మ - భగవానుని జన్మ, అభూత్ - కలిగెను, విష్ణుః - విష్ణువు, వామనరూపధృక్ - వామన రూపమును ధరించినవాడై, ఆదిత్యానామ్ - ఆదిత్యులకు, అవరజః - తరువాత పుట్టినవాడు.

ఈ మన్వంతరమునందు కూడ విష్ణు భగవానుడు అవతరించెను. ఆయన కశ్యపునకు అదితియందు ఆదిత్యుల తమ్ముడగు వామనుడై జన్మించెను.

సంక్షేపతో మయోక్తాని సప్త మన్వంతరాణి తే ।
భవిష్యాణ్యథ వక్ష్యామి విష్ణోశ్శక్త్యాన్వితాని చ ॥ 7

మయా - నాచే, తే - నీ కొరకు, సప్త - ఏడు, మన్వంతరాణి - మన్వంతరములు, సంక్షేపతః - సంక్షేపముగా, ఉక్తాని - చెప్పబడినవి, అథ - తరువాత, విష్ణోః - విష్ణువుయొక్క, శక్త్యా - శక్తితో, అన్వితాని - కూడియున్న, భవిష్యాణి చ - రాబోయేవాటిని కూడ, వక్ష్యామి - చెప్పెదను.

నేను ఏడు మన్వంతరముల గురించి నీకు సంక్షేపముగా చెప్పితిని. తరువాత విష్ణువుయొక్క శక్తితో గూడి భవిష్యత్తులో రాబోయే మన్వంతరములను గురించి కూడ చెప్పగలను.

వివస్వతశ్చ ద్వే జాయే విశ్వకర్మసుతే ఉభే ।
సంజ్ఞా ఛాయా చ రాజేంద్ర యే ప్రాగభిహితే తవ ॥ 8

రాజేంద్ర - ఓ మహారాజా!, వివస్వతః - సూర్యభగవానునకు, సంజ్ఞా - సంజ్ఞ, ఛాయా చ - ఛాయ అనే, ద్వే - ఇద్దరు, జాయే - భార్యలు, ఉభే - ఇద్దరు, విశ్వకర్మసుతే - విశ్వకర్మయొక్క పుత్రికలు, యే - ఎవరైతే, తవ - నీకు, ప్రాక్ - ఇదివరలో, అభిహితే - చెప్పబడినారో.

ఓ మహారాజా! సూర్యభగవానునకు సంజ్ఞ, ఛాయ అనే ఇద్దరు భార్యలు గలరు. వారిద్దరు విశ్వకర్మయొక్క పుత్రికలే. వారిని గురించి నీకిది వరలో చెప్పియుంటిని.

తృతీయాం వడవామేకే తాసాం సంజ్ఞాసుతాస్త్రయః ।
యమో యమీ శ్రాద్ధదేవశ్ఛాయాయాశ్చ సుతాన్ శృణు ॥ 9

వడవామ్ - వడవ అనే, తృతీయామ్ - మూడవ భార్యను గురించి, ఏకే - కొందరు (చెప్పెదరు), తాసామ్ - వారిలో, సంజ్ఞాసుతాః - సంజ్ఞయొక్క పిల్లలు, త్రయః - ముగ్గురు, యమః - యముడు, యమీ - యమున, శ్రాద్ధదేవః చ - శ్రాద్ధదేవుడు, ఛాయాయాః - ఛాయయొక్క, సుతాన్ చ - పుత్రులను గురించి కూడ, శృణు - వినుము.

సూర్యునకు వడవ అనే మూడవ భార్య కూడ గలదని కొందరు చెప్పెదరు. ఆ భార్యలలో సంజ్ఞకు యముడు శ్రాద్ధదేవుడు అనే పుత్రులు, యమున అనే పుత్రిక కలిగిరి. ఛాయయొక్క పుత్రులను గురించి కూడ వినుము.

సావర్ణిస్తపతీ కన్యా భార్యా సంవరణస్య యా ।
శనైశ్చరస్తృతీయోఽభూదశ్వినౌ వడవాత్మజౌ ॥ 10

సావర్ణిః - సావర్ణి, తపతీ - తపతి, కన్యా - కుమార్తె, యా - ఎవతె, సంవరణస్య - సంవరణుని, భార్యా - భార్యయో, శనైశ్చరః - శనైశ్చరుడు, తృతీయః - మూడవ సంతానము, అభూత్ - ఆయెను, అశ్వినౌ - అశ్వినీ దేవతలు, వడవా-ఆత్మజౌ - వడవయొక్క కొడుకులు.

సావర్ణి ఛాయయొక్క పెద్ద కొడుకు. తపతి ఆమె కుమార్తె. శనైశ్చరుడు ఆమె మూడవ సంతానము. తపతి సంవరణుని భార్య ఆయెను. వడవ పుత్రులు అశ్వినీ దేవతలు.

అష్టమేఽంతర ఆయాతే సావర్ణిర్భవితా మనుః ।
నిర్మోకవిరజస్కాద్యాస్సావర్ణితనయా నృప ॥ 11

నృప.- ఓ మహారాజా!, అష్టమే - ఎనిమిదవ, అంతరే - మన్వం తరము, ఆయాతే - రాగానే, సావర్ణిః - సావర్ణి, మనుః - మనువు, భవితా - కాగలడు, నిర్మోకవిరజస్క-ఆద్యాః - నిర్మోకుడు విరజస్కుడు మొదలగు వారు, సావర్ణితనయాః - సావర్ణియొక్క పుత్రులు.

ఓ మహారాజా! ఎనిమిదవ మన్వంతరములో సావర్ణి మనువు కాగ లడు. నిర్మోకుడు, విరజస్కుడు, అర్వవీరుడు మొదలగువారు సావర్ణి యొక్క పుత్రులు కాగలరు.

**తత్ర దేవాస్సుతపసో విరజా అమృతప్రభాః ।**
**తేషాం విరోచనసుతో బలిరింద్రో భవిష్యతి ॥ 12**

తత్ర - ఆ మన్వంతరమునందు, సుతపసః - సుతపస్సులు, విరజాః - విరజులు, అమృతప్రభాః - అమృతప్రభలు, దేవాః - దేవతలు, తేషామ్ - వారికి, విరోచనసుతః - విరోచనుని పుత్రుడగు, బలిః - బలి, ఇంద్రః - ఇంద్రుడు, భవిష్యతి - కాగలడు.

ఆ మన్వంతరములో సుతపసులు, విరజులు, అమృతప్రభలు అనే గణములు దేవతలు కాగా, వారికి విరోచనుని పుత్రుడగు బలి ఇంద్రుడు కాగలడు.

**దత్త్వేమాం యాచమానాయ విష్ణవే యః పదత్రయమ్ ।**
**రాద్ధమింద్రపదం హిత్వా తతస్సిద్ధిమవాప్స్యతి ॥ 13**

యః - ఏ బలి, ఇమామ్ - ఈ భూమిని, పదత్రయమ్ - మూడు అడుగులను, యాచమానాయ - యాచించుచున్న, విష్ణవే - విష్ణువు కొరకు, దత్త్వా - ఇచ్చి, రాద్ధమ్ - పొందబడిన, ఇంద్రపదమ్ - ఇంద్రపదవిని, హిత్వా - విడిచిపెట్టి, తతః - తరువాత, సిద్ధిమ్ - మోక్షమును, అవాప్స్యతి - పొందగలడు.

మూడు అడుగులను యాచించే విష్ణువునకు ఆ బలి ఈ భూమిని దానము చేసి, తనకు లభించిన ఇంద్రపదవిని విడిచిపెట్టి, తరువాత ఆయన మోక్షమును పొందగలడు.

యోఽసౌ భగవతా బద్ధః ప్రీతేన సుతలే పునః ।
నివేశితోఽధికే స్వర్గాదధునాఽఽస్తే స్వరాడివ ॥ 14

ప్రీతేన - ప్రసన్నుడైన, భగవతా - భగవానునిచే, యః - ఏ, అసౌ - ఈ బలి, బద్ధః - బంధించబడినవాడై, పునః - మరల, స్వర్గాత్ - స్వర్గముకంటె, అధికే - గొప్పదియగు, సుతలే - సుతలమునందు, నివేశితః - ఉంచబడినాడు, అధునా - ఇప్పుడు, స్వరాట్ ఇవ - ఇంద్రుడు వలె, ఆస్తే - ఉన్నాడో.

ఒకప్పుడు బలిని శ్రీహరి భగవానుడు బంధించెను. కాని, ఆతనిపై ప్రసన్నుడైన భగవానుడు ఆతనిని స్వర్గముకంటె గొప్పదియగు సుతలమునందు ఉంచెను. ఆతడు ఇప్పటికీ అక్కడనే ఇంద్రుడు వలె ఉన్నాడు.

గాలవో దీప్తిమాన్ రామో ద్రోణపుత్రః కృపస్తథా ।
ఋష్యశృంగః పితాస్మాకం భగవాన్ బాదరాయణః ॥ 15

ఇమే సప్తర్షయస్తత్ర భవిష్యంతి స్వయోగతః ।
ఇదానీమాసతే రాజన్ స్వే స్వ ఆశ్రమమండలే ॥ 16

రాజన్ - ఓ మహారాజా!, గాలవః - గాలవుడు, దీప్తిమాన్ - దీప్తిమంతుడు, రామః - పరశురాముడు, ద్రోణపుత్రః - ద్రోణుని పుత్రుడగు అశ్వత్థామ, కృపః - కృపాచార్యుడు, తథా - మరియు, ఋష్యశృంగః - ఋష్యశృంగుడు, అస్మాకమ్ - మాయొక్క, పితా - తండ్రి, భగవాన్ - పూజనీయుడు అగు, బాదరాయణః - బాదరాయణ వ్యాసుడు, ఇమే - వీరు, తత్ర - ఆ మన్వంతరమునందు, సప్తర్షయః - సప్తర్షులు, భవిష్యంతి - కాగలరు, ఇదానీమ్ - ఇప్పుడు, స్వయోగతః - తమ యోగశక్తి వలన, స్వే స్వే - తమ తమ, ఆశ్రమమండలే - ఆశ్రమస్థానమునందు, ఆసతే - ఉన్నారు.

ఓ మహారాజా! ఆ మన్వంతరమునందు గాలవుడు, దీప్తిమంతుడు, పరశురాముడు, ద్రోణాచార్యుని పుత్రుడగు అశ్వత్థామ, కృపాచార్యుడు, ఋష్యశృంగుడు, మా తండ్రి పూజనీయుడు అగు బాదరాయణ

వ్యాసుడు అనువారలు సప్తర్షులు కాగలరు. వీరు ఇప్పుడు తమ యోగశక్తిచే తమ తమ ఆశ్రమస్థానములయందు ఉన్నారు.

దేవగుహ్యాత్సరస్వత్యాం సార్వభౌమ ఇతి ప్రభుః ।
స్థానం పురందరాద్ధృత్వా బలయే దాస్యతీశ్వరః ॥ 17

ప్రభుః - శ్రీహరి ప్రభుడు, దేవగుహ్యాత్ - దేవగుహ్యుని వలన, సరస్వత్యామ్ - సరస్వతియందు, సార్వభౌమః ఇతి - సార్వభౌముడని (అవతారము), ఈశ్వరః - ఆ ప్రభుడు, పురందరాత్ - పురందరునినుండి, స్థానమ్ - స్వర్గస్థానమును, హృత్వా - లాగుకొని, బలయే - బలి కొరకు, దాస్యతి - ఈయగలడు.

శ్రీహరి ప్రభుడు దేవగుహ్యుడు, సరస్వతి అనే దంపతులకు పుత్రుడై సార్వభౌముడు అనే పేరుతో ప్రసిద్ధి గాంచును. ఆ ప్రభుడు పురందరుడనే ఇంద్రుని వద్దనుండి స్వర్గస్థానమును లాగుకొని బలి చక్రవర్తికి ఈయగలడు.

నవమో దక్షసావర్ణిర్మనుర్వరుణసంభవః ।
భూతకేతుర్దీప్తికేతురిత్యాద్యాస్తత్సుతా నృప ॥ 18

నృప - ఓ మహారాజా!, వరుణసంభవః - వరుణుని పుత్రుడగు, దక్షసావర్ణిః - దక్షసావర్ణి, నవమః - తొమ్మిదవ, మనుః - మనువు, భూతకేతుః - భూతకేతువు, దీప్తికేతుః - దీప్తికేతువు, ఇతి-ఆద్యాః - ఈ మొదలైనవారు, తత్-సుతాః - ఆయన పుత్రులు.

ఓ మహారాజా! వరుణుని పుత్రుడగు దక్షసావర్ణి తొమ్మిదవ మనువు కాగలడు. భూతకేతువు, దీప్తికేతువు, పంచహోత్రుడు మొదలగువారు ఆయన పుత్రులు కాగలరు.

పారా మరీచిగర్భాద్యా దేవా ఇంద్రోఽద్భుతస్స్మృతః ।
ద్యుతిమత్ప్రముఖాస్తత్ర భవిష్యంత్యృషయస్తతః ॥ 19

తత్ర - ఆ మన్వంతరమునందు, పారాః - పారులు, మరీచిగర్భ-ఆద్యాః - మరీచిగర్భులు మొదలగువారు, దేవాః - దేవతలు, అద్భుతః - అద్భుతుడు, ఇంద్రః - ఇంద్రుడని, స్మృతః - చెప్పబడినాడు, తతః - ఆ మన్వంతరమునందు, ద్యుతిమత్-ప్రముఖాః - ద్యుతిమంతుడు మొదలగు వారు, ఋషయః - సప్తర్షులు. భవిష్యంతి - కాగలరు.

ఆ మన్వంతరమునందు పారులు, మరీచిగర్భులు, సుధర్ములు మొదలగువారు దేవతలు కాగా, అద్భుతుడు ఇంద్రుడు కాగలడు. ద్యుతి మంతుడు, మేధాతిథి మొదలగువారు సప్తర్షులు కాగలరు.

ఆయుష్మతోఽంబుధారాయామృషభో భగవత్కలా ।
భవితా యేన సంరాద్ధాం త్రిలోకీం భోక్ష్యతేఽద్భుతః ॥ 20

ఆయుష్మతః - ఆయుష్మంతునకు, అంబుధారాయామ్ - అంబు ధారయందు, భగవత్-కలా - భగవానుని అంశయగు, ఋషభః - ఋష భుడు, భవితా - కలుగగలడు, యేన - ఎవనిచే, సంరాద్ధామ్ - తన వశము చేసుకొనబడిన, త్రిలోకీమ్ - ముల్లోకములను, అద్భుతః - అద్భుతుడు, భోక్ష్యతే - అనుభవించ గలడో.

శ్రీహరి భగవానుడు ఆయుష్మంతునకు అంబుధారయందు ఋష భుడు అనే పేరుతో అవతరించగలడు. ఆయన ముల్లోకములను స్వాధీ నము చేసుకొని ఈయగా, అద్భుతుడు వాటిని భోగించగలడు.

దశమో బ్రహ్మసావర్ణిరుపశ్లోకసుతో మహాన్ ।
తత్సుతా భూరిషేణాద్యా హవిష్మత్ప్రముఖా ద్విజాః ॥21

ఉపశ్లోకసుతః - ఉపశ్లోకుని పుత్రుడు, మహాన్ - మహాత్ముడు అగు, బ్రహ్మసావర్ణిః - బ్రహ్మసావర్ణి, దశమః - పదవ మనువు, తత్-సుతాః - ఆయన పుత్రులు, భూరిషేణ-ఆద్యాః - భూరిషేణుడు మొదలగువారు, హవిష్మత్-ప్రముఖాః - హవిష్మంతుడు మొదలగువారు, ద్విజాః - సప్తర్షు లు.

ఉపశ్లోకుని పుత్రుడు, మహాత్ముడు అగు బ్రహ్మసావర్ణి పదవ మనువు కాగలడు. భూరిషేణుడు, సుక్షేత్రుడు మొదలగువారు ఆయన పుత్రులు కాగలరు. హవిష్మంతుడు మొదలగువారు సప్తర్షులు కాగలరు.

హవిష్మాన్ సుకృతిస్సత్యో జయో మూర్తిస్తదా ద్విజాః ।
సువాసనవిరుద్ధాద్యా దేవాశ్శంభుస్సురేశ్వరః ॥ 22

తదా - ఆ మన్వంతరమునందు, హవిష్మాన్ - హవిష్మంతుడు, సుకృతిః - సుకృతి, సత్యః - సత్యుడు, జయః - జయుడు, మూర్తిః - మూర్తి, ద్విజాః - సప్తర్షులు, సువాసనవిరుద్ధ-ఆద్యాః - సువాసనులు విరుద్ధులు మొదలగువారు, దేవాః - దేవతలు, శంభుః - శంభుడు, సుర-ఈశ్వరః - దేవేంద్రుడు.

హవిష్మంతుడు, సుకృతి, సత్యుడు, జయుడు, మూర్తి, అప్రతిముడు మొదలగువారు సప్తర్షులు కాగా, సువాసనులు, విరుద్ధులు, సుఖులు మొదలగువారు దేవతలు మరియు శంభుడు దేవేంద్రుడు కాగలరు.

విష్వక్సేనో విషూచ్యాం తు శంభోస్సఖ్యం కరిష్యతి ।
జాతస్స్వాంశేన భగవాన్ గృహే విశ్వసృజో విభుః ॥ 23

భగవాన్ - భగవానుడగు, విభుః - శ్రీహరి ప్రభుడు, విశ్వసృజః - విశ్వసృజ్ యొక్క, గృహే - ఇంటియందు, విషూచ్యాం తు - విషూచియందైతే, స్వ-అంశేన - తన అంశచే, విష్వక్సేనః - విష్వక్సేనుడై, జాతః - పుట్టినవాడు, శంభోః - శంభునియొక్క, సఖ్యమ్ - మైత్రిని, కరిష్యతి - చేయగలడు.

భగవానుడగు శ్రీహరి ప్రభుడు విశ్వసృజ్, విషూచి అనే దంపతులకు తన అంశచే విష్వక్సేనుడు అనే పేరుతో జన్మించి, శంభుడనే ఇంద్రునితో మైత్రిని నెరపగలడు.

మనుర్వై ధర్మసావర్ణిరేకాదశమ ఆత్మవాన్ ।
అనాగతాస్తత్సుతాశ్చ సత్యధర్మాదయో దశ ॥ 24

**ఆత్మవాన్** - జితేంద్రియుడగు, **ధర్మసావర్ణిః వై** - ధర్మసావర్ణియై **తే, ఏకాదశమః** - పదకొండవ, **మనుః** - మనువు, **తత్-సుతాః** - ఆయన పుత్రులు, **సత్యధర్మ-ఆదయః** - సత్యధర్ముడు మొదలగువారు, **దశ** - పది మంది, **అనాగతాః** - కలుగగలరు.

జితేంద్రియుడగు ధర్మసావర్ణి పదకొండవ మనువు కాగలడు. ఆయనకు సత్యధర్ముడు, క్షేమధన్వ మొదలగు పదిమంది పుత్రులు కలుగగలరు.

విహంగమాః కామగమా నిర్వాణరుచయస్సురాః ।
ఇంద్రశ్చ వైధృతస్తేషామృషయశ్చారుణాదయః ॥ 25

**విహంగమాః** - విహంగములు, **కామగమాః** - కామగములు, **నిర్వాణరుచయః** - నిర్వాణరుచులు, **సురాః** - దేవతలు, **తేషామ్** - వారికి, **ఇంద్రః చ** - ఇంద్రుడు, **వైధృతః** - వైధృతుడు, **ఋషయః చ** - సప్తర్షులు కూడ, **అరుణ-ఆదయః** - అరుణుడు మొదలగువారు.

ఆ మన్వంతరమునందు విహంగములు, కామగములు, నిర్వాణరుచులు అనే దేవగణములు ఉండెదరు. వారికి వైధృతుడు ఇంద్రుడు కాగలడు. అరుణుడు, హవిష్మంతుడు మొదలగువారు సప్తర్షులు కాగలరు.

ఆర్యకస్య సుతస్తత్ర ధర్మసేతురితి స్మృతః ।
వైధృతాయాం హరేరంశస్త్రిలోకీం ధారయిష్యతి ॥ 26

**తత్ర** - ఆ మన్వంతరమునందు, **ఆర్యకస్య** - ఆర్యకునకు, **వైధృతాయామ్** - వైధృతయందు, **హరేః** - శ్రీహరియొక్క, **అంశః** - అంశ, **ధర్మసేతుః** - ధర్మసేతువు, **ఇతి** - అని, **స్మృతః** - చెప్పబడువాడు, **త్రిలోకీమ్** - ముల్లోకములను, **ధారయిష్యతి** - పాలించగలడు.

ఆ మన్వంతరములో శ్రీహరి ఆర్యకునకు వైధృతయందు ధర్మసేతువు అనే పేరుతో అంశయై జన్మించి, ముల్లోకములను కాపాడగలడు.

భవితా రుద్రసావర్ణీ రాజన్ ద్వాదశమో మనుః ।
దేవవానుపదేవశ్చ దేవశ్రేష్ఠాదయస్సుతాః ।। 27

రాజన్ - ఓ మహారాజా!, రుద్రసావర్ణిః - రుద్రసావర్ణి, ద్వాదశమః - పన్నెండవ, మనుః - మనువు, భవితా - కాగలడు, దేవవాన్ - దేవవంతుడు, ఉపదేవః చ - ఉపదేవుడు, దేవశ్రేష్ఠ-ఆదయః - దేవశ్రేష్ఠుడు మొదలగువారు, సుతాః - ఆయన పుత్రులు.

ఓ మహారాజా! రుద్రసావర్ణి పన్నెండవ మనువు కాగలడు. ఆయనకు దేవవంతుడు, ఉపదేవుడు, దేవశ్రేష్ఠుడు, విదూరథుడు మొదలగువారు పుత్రులు కాగలరు.

ఋతధామా చ తత్రేంద్రో దేవాశ్చ హరితాదయః ।
ఋషయశ్చ తపోమూర్తిస్తపస్వ్యాగ్నీధ్రకాదయః ।। 28

తత్ర - ఆ మన్వంతరమునందు, ఋతధామా చ - ఋతధాముడు, ఇంద్రః - ఇంద్రుడు, దేవాః చ - దేవతలు, హరిత-ఆదయః - హరితులు మొదలగువారు, ఋషయః చ - సప్తర్షులు కూడ, తపోమూర్తిః - తపోమూర్తి, తపస్వీ - తపస్వి, ఆగ్నీధ్రక-ఆదయః - ఆగ్నీధ్రకుడు మొదలగువారు.

ఆ మన్వంతరమునందు ఋతధాముడు ఇంద్రుడు కాగా, హరితులు, సుధర్ములు మొదలగువారు దేవగణములు కాగలరు. తపోమూర్తి, తపస్వి, ఆగ్నీధ్రకుడు, ద్యుతి మొదలగువారు సప్తర్షులు కాగలరు.

స్వధామాఖ్యో హరేరంశస్సాధయిష్యతి తన్మనోః ।
అంతరం సత్యసహసస్సూనృతాయాస్సుతో విభుః ।। 29

సత్యసహసః - సత్యసహసుని వలన, సూనృతాయాః - సూనృతకు, హరేః - శ్రీహరియొక్క, అంశః - అంశయగు, స్వధామ-ఆఖ్యః - స్వధాముడు అనే పేరు గల, విభుః - ప్రభుడు, మనోః - మనువుయొక్క, తత్ - ఆ, అంతరమ్ - అంతరమును, సాధయిష్యతి - పాలించగలడు.

శ్రీహరి ప్రభుడు సత్యసహసునకు సూనృతయందు స్వధాముడు అనే అంశయై జన్మించి, ఆ మన్వంతరమును రక్షించగలడు.

మనుస్త్రయోదశో భావ్యో దేవసావర్ణిరాత్మవాన్ ।
చిత్రసేనవిచిత్రాద్యా దేవసావర్ణిదేహజాః ।। 30

ఆత్మవాన్ - జితేంద్రియుడగు, దేవసావర్ణిః - దేవసావర్ణి, త్రయోదశః - పదమూడవ, మనుః - మనువు, భావ్యః - కాబోవువాడు, చిత్రసేన విచిత్ర-ఆద్యాః - చిత్రసేనుడు విచిత్రుడు మొదలగువారు, దేవసావర్ణిదేహజాః - దేవసావర్ణియొక్క పుత్రులు.

జితేంద్రియుడగు దేవసావర్ణి పదమూడవ మనువు కాగలడు. ఆయనకు చిత్రసేనుడు, విచిత్రుడు, నయతి మొదలగు పుత్రులు కలుగగలరు.

దేవాస్సుకర్మసుత్రామసంజ్ఞా ఇంద్రో దివస్పతిః ।
నిర్మోకతత్త్వదర్శాద్యా భవిష్యంత్యృషయస్తదా ।। 31

తదా - ఆ మన్వంతరమునందు, సుకర్మసుత్రామసంజ్ఞాః - సుకర్ములు సుత్రాములు అనే పేరు గలవారు, దేవాః - దేవగణములు, ఇంద్రః - ఇంద్రుడు, దివస్పతిః - దివస్పతి, నిర్మోకతత్త్వదర్శ-ఆద్యాః - నిర్మోకుడు తత్త్వదర్శుదు మొదలగువారు, ఋషయః - సప్తర్షులు, భవిష్యంతి - కాగలరు.

ఆ మన్వంతరమునందు సుకర్ములు, సుత్రాములు అనువారు దేవగణములు కాగా, దివస్పతి ఇంద్రుడు కాగలడు. నిర్మోకుడు, తత్త్వదర్శుదు, ధృతిమంతుడు మొదలగువారు సప్తర్షులు కాగలరు.

దేవహోత్రస్య తనయ ఉపహర్తా దివస్పతేః ।
యోగేశ్వరో హరేరంశో బృహత్యాం సంభవిష్యతి ।। 32

హరేః - శ్రీహరియొక్క, అంశః - అంశ, దేవహోత్రస్య - దేవహోత్రునకు, బృహత్యామ్ - బృహతియందు, యోగేశ్వరః - యోగేశ్వరుడనే,

తనయః - పుత్రుడై, సంభవిష్యతి - జన్మించగలడు, దివస్పతేః - దివస్పతి కి, ఉపహర్తా - సంపాదించి పెట్టువాడు.

శ్రీహరి దేవహోత్రునకు బృహతియందు యోగేశ్వరుడు అనే పేరుతో అంశయై జన్మించి, దివస్పతి అనే ఇంద్రునకు ముల్లోకములను సంపాదించి పెట్టగలడు.

మనుర్వా ఇంద్రసావర్ణిశ్చతుర్దశమ ఏష్యతి ।
ఉరుగంభీరబుద్ధ్యాద్యా ఇంద్రసావర్ణివీర్యజాః ॥ 33

ఇంద్రసావర్ణిః - ఇంద్రసావర్ణి, చతుర్దశమః - పదునాల్గవ, మనుః వై - మనువుగా, ఏష్యతి - రాగలడు. ఉరుగంభీరబుద్ధి-ఆద్యాః - ఉరువు గంభీరబుద్ధి మొదలగువారు, ఇంద్రసావర్ణివీర్యజాః - ఇంద్రసావర్ణి పుత్రు లు.

ఇంద్రసావర్ణి పదునాల్గవ మనువు కాగలడు. ఆయనకు ఉరువు, గంభీరబుద్ధి, భరతుడు మొదలగు పుత్రులు కలుగగలరు.

పవిత్రాశ్చాక్షుషా దేవాశ్శుచిరింద్రో భవిష్యతి ।
అగ్నిర్బాహుశ్శుచిశ్శుద్ధో మాగధాద్యాస్తపస్వినః ॥ 34

పవిత్రాః - పవిత్రులు, చాక్షుషాః - చాక్షుషులు, దేవాః - దేవగణ ములు, శుచిః - శుచి, ఇంద్రః - ఇంద్రుడు, భవిష్యతి - కాగలడు, అగ్నిః - అగ్ని, బాహుః - బాహువు, శుచిః - శుచి, శుద్ధః - శుద్ధుడు, మాగధ-ఆద్యాః - మాగధుడు మొదలగువారు, తపస్వినః - సప్తర్షులు.

పవిత్రులు, చాక్షుషులు దేవగణములు కాగా, శుచి ఇంద్రుడు కాగ లడు. అగ్ని, బాహువు, శుచి, శుద్ధుడు, మాగధుడు, ఆగ్నీధ్రుడు మొదలగు వారు సప్తర్షులు కాగలరు.

సత్రాయణస్య తనయో బృహద్భానుస్తదా హరిః ।
వితానాయాం మహారాజ క్రియాతంతూన్ వితాయితా ॥ 35

మహారాజ - ఓ మహారాజా!, తదా - ఆ మన్వంతరమునందు, హరిః - శ్రీహరి, సత్రాయణస్య - సత్రాయణునకు, వితానాయామ్ - వితానయందు, బృహద్భానుః - బృహద్భానువు అనే, తనయః - పుత్రుడు, క్రియాతంతూన్ - కర్మప్రవాహములను, వితాయితా - విస్తరింప జేయగలడు.

ఓ మహారాజా! ఆ మన్వంతరమునందు శ్రీహరి సత్రాయణునకు వితానయందు బృహద్భానువు అనే పుత్రుడై జన్మించి, వేదోక్తకర్మల పరంపరను విస్తరింప జేయగలడు.

రాజంశ్చతుర్దశైతాని త్రికాలానుగతాని తే ।
ప్రోక్తాన్యేభిర్మితః కల్పో యుగసాహస్రపర్యయః ।। 36

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే భావి
మన్వంతర వర్ణనం నామ త్రయోదశోऽధ్యాయః ।।

రాజన్ - ఓ మహారాజా!, త్రికాల-అనుగతాని - భూతభవిష్యద్వర్తమానములనే మూడు కాలములయందు కొనసాగే, ఏతాని - ఈ, చతుర్దశ - పదునాల్గు మన్వంతరములు, తే - నీ కొరకు, ప్రోక్తాని - చెప్పబడినవి, యుగసాహస్రపర్యయః - వేయి మహాయుగములకు ఒకసారి చక్రము పూర్తయ్యే, కల్పః - కల్పము, ఏభిః - వీటిచే, మితః - పరిమితమైనది.

ఓ మహారాజా! నేను నీకు గడచినవి, నడచుచున్నది మరియు రాబోవునవి అగు పదునాల్గు మన్వంతరములను గురించి చెప్పితిని. వేయి మహాయుగములు ఒక కల్పము అగును. ఈ విధముగా కాలచక్రముయొక్క అవయవమైన కల్పములో పదునాల్గు మన్వంతరముల కాలము ఉండును.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో భావి మన్వంతరములను వర్ణించే పదమూడవ అధ్యాయము ముగిసినది (**13**) .

*****

# అథ చతుర్దశోఽధ్యాయః

## మనువుల పాలనను వర్ణించుట

రాజోవాచ ।
మన్వంతరేషు భగవన్ యథా మన్వాదయస్త్విమే ।
యస్మిన్ కర్మణి యే యేన నియుక్తాస్తద్వదస్వ మే ॥ 1

భగవన్ - ఓ పూజనీయా!, మన్వంతరేషు - మన్వంతరముల యందు, ఇమే - ఈ, మను-ఆదయః - మనువు మొదలగువారు, యే - ఎవరు, యథా - ఏ విధముగా, యస్మిన్ - ఏ, కర్మణి - కర్మయందు, యేన - ఎవనిచే, నియుక్తాః - నియోగించ బడుదురు?, తత్ - ఆ విషయమును, మే - నా కొరకు, వదస్వ - చెప్పుము.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- పూజనీయుడవగు ఓ మహర్షీ! మన్వంతరములయందు మనువు, మనుపుత్రులు మొదలగు ఏయే వ్యక్తులను ఎవరు ఏ విధముగా ఏయే కర్మలయందు నియోగించెదరు? ఆ విషయమును నాకు చెప్పుడు.

ఋషిరువాచ ।
మనవో మనుపుత్రాశ్చ మునయశ్చ మహీపతే ।
ఇంద్రాస్సురగణాశ్చైవ సర్వే పురుషశాసనాః ॥ 2

మహీపతే - ఓ మహారాజా!, మనవః - మనువులు, మనుపుత్రాః చ - మనువుల పుత్రులు కూడ, మునయః చ - సప్తర్షులు, ఇంద్రాః - ఇంద్రులు, సురగణాః చ - దేవగణములు, సర్వే ఏవ - అందరు కూడ, పురుషశాసనాః - పురుషోత్తముడే నియామకుడుగా గలవారు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! మనువు, మను పుత్రులు, సప్తర్షులు, దేవగణములు, ఇంద్రులు అందరు కూడ పురుషోత్త ముని అదుపాజ్ఞలలో మాత్రమే ఉండెదరు.

యజ్ఞాదయో యాః కథితాః పౌరుష్యస్తనవో నృప ।
మన్వాదయో జగద్యాత్రాం నయంత్యాభిః ప్రచోదితాః ।। 3

నృప - ఓ మహారాజా!, యజ్ఞ-ఆదయః - యజ్ఞుడు మొదలైన, పౌరుష్యః - పురుషోత్తమునియొక్క, యాః - ఏ, తనవః - అవతారములు, కథితాః - చెప్పబడినవో, ఆభిః - ఈ అవతారములచే, ప్రచోదితాః - ప్రేరి తులై, మను-ఆదయః - మనువు మొదలగువారు, జగద్-యాత్రామ్ - జగ త్తుయొక్క వ్యవస్థను, నయంతి - నడిపించెదరు.

ఓ మహారాజా! యజ్ఞుడు మొదలగు పురుషోత్తముని అవతారము లను నేను వర్ణించి చెప్పితిని. మనువు, మనుపుత్రులు మొదలగువారు ఈ అవతారములచే ప్రేరితులై జగత్తుయొక్క వ్యవస్థను నడిపించెదరు.

చతుర్యుగాంతే కాలేన గ్రస్తాన్ శ్రుతిగణాన్ యథా ।
తపసా ఋషయోఽపశ్యన్ యతో ధర్మస్సనాతనః ।। 4

చతుః-యుగాంతే - మహాయుగముయొక్క అంతమునందు, కాలేన - కాలముచే, గ్రస్తాన్ - కబళించబడిన, శ్రుతిగణాన్ - వేదముల సమూహములను, యథా - యథాతథముగా, ఋషయః - మహర్షులు, తపసా - తపస్సుచే, అపశ్యన్ - దర్శించిరి, యతః - వేటివలన, సనాతనః - కాలమునకు అతీతమగు, ధర్మః - ధర్మమో.

మహాయుగము అంతమైనప్పుడు కాలముచే కబళించబడిన వేద ముల సమూహములను యథాతథముగా మహర్షులు తపశ్శక్తిచే దర్శించి రి. సనాతమైన (కాలమునకు అతీతమైన) ధర్మమును నిలబెట్టేది ఆ వేద ములే.

తతో ధర్మం చతుష్పాదం మనవో హరిణోదితాః ।
యుక్తాస్సంచారయంత్యద్ధా స్వే స్వే కాలే మహీం నృప ।।5

నృప - ఓ మహారాజా!, తతః - తరువాత, మనవః - మనువులు, హరిణా - శ్రీహరిచే, ఉక్తాః - ఆదేశించబడినవారై, యుక్తాః - ఏకాగ్రమగు చిత్తము గలవారై, స్వే స్వే - తమ తమ, కాలే - మన్వంతరములయందు, అద్ధా - సాక్షాత్తుగా, చతుష్పాదమ్ - నాలుగు పాదములు గల, ధర్మమ్ - ధర్మమును, మహీమ్ - భూమిని, సంచారయంతి - సంచరింప జేసెదరు.

ఓ మహారాజా! మహర్షులు వేదములను దర్శించిన తరువాత, శ్రీహరి ఆదేశముచే మనువులు తమ తమ మన్వంతరములయందు సావధానచిత్తులై సాక్షాత్తుగా నాలుగు పాదములు గల ధర్మము భూమియందు సంచరించునట్లు (జనులు పాలించునట్లు) చేసెదరు.

పాలయంతి ప్రజాపాలా యావదంతం విభాగశః ।
యజ్ఞభాగభుజో దేవా యే చ తత్రాన్వితాశ్చ తైః ॥ 6

ప్రజాపాలాః - ప్రజలను పాలించే మనుపుత్రులు, విభాగశః - విభాగపూర్వకముగా, అంతం యావత్ - మన్వంతరము అంతమయ్యే వరకు, పాలయంతి - పాలించెదరు, దేవాః చ - దేవతలు, తత్ర - ఆ యజ్ఞకర్మయందు, యే - ఎవరైతే, అన్వితాః - సంబంధమును కలిగియుందురో, తైః చ - వారితో బాటుగా, యజ్ఞభాగభుజః - యజ్ఞములలో భాగములను అనుభవించువారు.

మనుపుత్రులు దేశమును యథాయోగ్యముగా విభజించి మన్వంతరకాలమంతా ప్రజలను ధర్మబద్ధముగా పాలించెదరు. యజ్ఞకర్మలయందు సంబంధమును కలిగియుండే ఋషులు, పితరులతో బాటుగా దేవతలు ఆయా మన్వంతరములలో యజ్ఞభాగములను అనుభవించెదరు.

ఇంద్రో భగవతా దత్తాం త్రైలోక్యశ్రియమూర్జితామ్ ।
భుంజానః పాతి లోకాంస్త్రీన్ కామం లోకే ప్రవర్షతి ॥ 7

ఇంద్రః - ఇంద్రుడు, భగవతా - శ్రీహరి భగవానునిచే, దత్తామ్ - ఈయబడినట్టియు, ఊర్జితామ్ - గొప్పదైన, త్రైలోక్యశ్రియమ్ - ముల్లోకముల సంపదను, భుంజానః - భోగించువాడై, త్రీన్ - మూడు, లోకాన్ -

లోకములను, పాతి - రక్షించును, లోకే - లోకమునందు, కామమ్ - యథేచ్ఛగా, ప్రవర్తతి - అధికముగా వర్తించును.

ఇంద్రుడు శ్రీహరి భగవానునిచే అనుగ్రహించబడిన గొప్పదైన ముల్లోకముల సంపదను అనుభవిస్తూ, మూడు లోకములను రక్షించును. ఇంద్రుడు లోకములో యథేచ్ఛగా బాగా వర్తించును.

జ్ఞానం చానుయుగం బ్రూతే హరిస్సిద్ధస్వరూపధృక్ ।
ఋషిరూపధరః కర్మ యోగం యోగేశరూపధృక్ ।। 8

హరిః - శ్రీహరి, అనుయుగమ్ - ప్రతియుగమునందు, సిద్ధస్వరూపధృక్ - సిద్ధుల స్వరూపమును దాల్చువాడై, జ్ఞానమ్ - జ్ఞానమును, ఋషిరూపధరః - మహర్షి రూపమును దాల్చువాడై, కర్మ - కర్మను, యోగ-ఈశరూపధృక్ - యోగేశ్వరుని రూపమును దాల్చువాడై, యోగమ్ - యోగమును, బ్రూతే - ఉపదేశించును.

శ్రీహరి ప్రతి యుగమునందు కపిలుడు మొదలగు సిద్ధుల రూపమును దాల్చి జ్ఞానమును, యాజ్ఞవల్క్యుడు మొదలగు మహర్షుల రూపముతో కర్మను, దత్తాత్రేయుడు మొదలగు యోగేశ్వరుల రూపముతో యోగమును ఉపదేశించును.

సర్గం ప్రజేశరూపేణ దస్యూన్ హన్యాత్ స్వరాడ్వపుః ।
కాలరూపేణ సర్వేషామభావాయ పృథగ్గుణః ।। 9

పృథగ్-గుణః - వేర్వేరు గుణములు గల శ్రీహరి, ప్రజా-ఈశరూపేణ - ప్రజాపతుల రూపముగా, సర్గమ్ - సృష్టిని, స్వరాడ్-వపుః - చక్రవర్తి రూపము గలవాడై, దస్యూన్ - చోరులను, హన్యాత్ - సంహరించును, కాలరూపేణ - కాలము రూపముగా, సర్వేషామ్ - సకలప్రాణులయొక్క, అభావాయ - అంతరించి పోవుట కొరకు.

శ్రీహరి సత్త్వరజస్తమోగుణములను వేర్వేరుగా స్వీకరించి మరీచి మొదలగు ప్రజాపతుల రూపములో సృష్టిని కొనసాగిస్తూ, చక్రవర్తుల రూప

ములో చోరులను సంహరిస్తూ, కాలము రూపములో సకలప్రాణులను సంహారము వైపునకు కొనిపోవును.

స్తూయమానో జనైరేభిర్మాయయా నామరూపయా ।
విమోహితాత్మభిర్నానాదర్శనైర్న చ దృశ్యతే ॥ 10

నామరూపయా - నామరూపాత్మకమగు, మాయయా - మాయచే, విమోహిత-ఆత్మభిః - వ్యామోహితమైన బుద్ధిగల, ఏభిః - ఈ, జనైః - జనులచే, నానాదర్శనైః - అనేకములగు శాస్త్రములచే, స్తూయమానః చ - స్తుతించబడుచున్ననూ, న దృశ్యతే - చూడబడుట లేదు.

జనులు నామరూపాత్మకమగు మాయచే వ్యామోహితులై యుందురు. వీరు అనేకములగు శాస్త్రముల ద్వారా భగవానుని మాత్రమే స్తుతించెదరు. కాని, వీరు భగవానుని తత్త్వమును దర్శించుట లేదు.

ఏతత్కల్పవికల్పస్య ప్రమాణం పరికీర్తితమ్ ।
యత్ర మన్వంతరాణ్యాహుశ్చతుర్దశ పురావిదః ॥ 11

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే
మను పరిపాలన వర్ణనం నామ చతుర్దశోఽధ్యాయః ॥

కల్పవికల్పస్య - కల్పమునందలి మన్వంతరముల విభాగము యొక్క, ప్రమాణమ్ - కొలమానము, ఏతత్ - ఈ విధముగా, పరికీర్తితమ్ - విస్తారముగా కీర్తించబడినది, యత్ర - దేనియందైతే, పురావిదః - పురాణ వేత్తలు, చతుర్దశ - పదునాలుగు, మన్వంతరాణి - మన్వంతరములను, ఆహుః - చెప్పినారో.

ఒక కల్పమునందు పదునాలుగు మన్వంతరములుండునని వ్యాసాది పురాణవేత్తలు చెప్పెదరు. ఈ విధముగా నేను కల్పములోని అవాంతరవిభాగములైన మన్వంతరములను విస్తారముగా చెప్పితిని.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో మనువుల పాలనను వర్ణించే పదునాల్గవ అధ్యాయము ముగిసినది (14).

# అథ పంచదశోఽధ్యాయః

## వామనావతారము - బలి స్వర్గముపై విజయమును పొందుట

రాజోవాచ ।

బలేః పదత్రయం భూమేః కస్మాద్ధరిరయాచత ।
భూత్వేశ్వరః కృపణవల్లబ్ధార్థోఽపి బబంధ తమ్ ॥ 1

హరిః - శ్రీహరి, ఈశ్వరః - సర్వేశ్వరుడు, భూత్వా - అయి ఉండి, బలేః - బలి చక్రవర్తినుండి, భూమేః - భూమియొక్క, పదత్రయమ్ - మూడు అడుగులను, కృపణవత్ - దీనుడు వలె, కస్మాత్ - ఎందువలన, అయాచత - యాచించెను? లబ్ధ-అర్థః అపి - పొందబడిన ప్రయోజనము గలవాడైననూ, కస్మాత్ - ఎందువలన, తమ్ - ఆ బలిని, బబంధ - బంధించెను?

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- శ్రీహరి సర్వేశ్వరుడై ఉండియు దీనుడు వలె బలి చక్రవర్తిని మూడడుగుల భూమిని యాచించుటకు కారణమేమి? ప్రయోజనము సిద్ధించిన తరువాత కూడ ఆయన బలిని బంధించుటకు కారణమేమి?

ఏతద్వేదితుమిచ్ఛామో మహత్కౌతూహలం హి నః ।
యజ్ఞేశ్వరస్య పూర్ణస్య బంధనం చాప్యనాగసః ॥ 2

ఏతత్ - దీనిని, వేదితుమ్ - తెలియుటకు, ఇచ్ఛామః - కోరుచున్నాము, హి - ఏలయనగా, నః - మాకు, కౌతూహలమ్ - ఉత్కంఠ, మహత్ - అధికము, యజ్ఞ-ఈశ్వరస్య - యజ్ఞములకు ప్రభువైనట్టియు,

పూర్ణస్య - పూర్ణుడగు శ్రీహరికి, అనాగసః అపి - నిరపరాధియే అయి ననూ బలియొక్క, బంధనం చ - బంధించుట?

మాకు ఈ విషయమును తెలియవలెననే ఉత్కంఠ అధికముగా గలదు. యజ్ఞమునకు ప్రభువు, పూర్ణుడు అగు శ్రీహరి యాచించుట, బలి నిరపరాధియే అయినా ఆయనను బంధించుట ఎట్లు సంభవమాయెను?

శ్రీశుక ఉవాచ ।

పరాజితశ్రీరసుభిశ్చ హాపితో హీంద్రేణ రాజన్ భృగుభిస్స జీవితః,
సర్వాత్మనా తానభజద్భృగూన్ బలిశ్శిష్యో మహాత్మాऽర్థనివేదనేన.

రాజన్ - ఓ మహారాజా!, పరాజితశ్రీః - పరాజయము పొందించ బడిన సంపద గలవాడు, ఇంద్రేణ - ఇంద్రునిచే, అసుభిః చ - ప్రాణము లచే కూడ, హాపితః - విడిచిపెట్టునట్లు చేయబడినవాడు, మహాత్మా - గొప్ప శీలము గలవాడు అగు, సః - ఆ, బలిః - బలి, భృగుభిః - భృగువం శీయులచే, జీవితః - బ్రతుకునట్లు చేయబడినవాడై, శిష్యః - శిష్యుడై, తాన్ - ఆ, భృగూన్ - భృగువంశీయులను, సర్వాత్మనా - అన్ని విధము లుగా, అర్థనివేదనేన - పదార్థములను సమర్పించుటచే, అభజత్ హి - సేవించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! ఇంద్రుడు బలిని ఓడించి అతని సంపదను హరించుటయే గాక, అతని ప్రాణములను కూడ తీసెను. అపుడు గొప్ప శీలము గల ఆ బలిని భృగువంశీయులు బ్రతి కించిరి. ఆయన వారికి శిష్యుడై పదార్థములను సమర్పిస్తూ అన్ని విధము లుగా వారిని సేవించెను.

తం బ్రాహ్మణా భృగవః ప్రీయమాణా
అయాజయన్ విశ్వజితా త్రిణాకమ్ ।
జిగీషమాణం విధినాऽభిషిచ్య
మహాభిషేకేణ మహానుభావాః ॥ 4

మహానుభావాః - గొప్ప ప్రభావము గల, భృగవః - భృగువంశీయులైన, బ్రాహ్మణాః - బ్రాహ్మణులు, ప్రీయమాణాః - ప్రీతిని చెందినవారై, త్రిణాకమ్ - స్వర్గమును, జిగీషమాణమ్ - జయించ గోరుచున్న, తమ్ - ఆ బలిని, విధినా - విధిచే, మహా-అభిషేకేన - గొప్ప అభిషేకముచే, అభిషిచ్య - అభిషేకించి, విశ్వజితా అయాజయన్ - విశ్వజిద్యాగమును చేయించిరి.

భృగు వంశీయులగు బ్రాహ్మణులు గొప్ప ప్రభావము గలవారు. వారు బలి యెడల చాల ప్రసన్నులైరి. స్వర్గమును జయించ గోరే బలిని వారు యథావిధిగా మహాభిషేకముతో అభిషేకించి, విశ్వజిద్యాగమును చేయించిరి.

తతో రథః కాంచనపట్టనద్ధో హయాశ్చ హర్యశ్వతురంగవర్ణాః ।
ధ్వజశ్చ సింహేన విరాజమానో హుతాశనాదాస హవిర్భిరిష్టాత్॥5

తతః - తరువాత, హవిర్భిః - హవిస్సులచే, ఇష్టాత్ - ఆరాధించబడిన, హుతాశనాత్ - అగ్నినుండి, కాంచనపట్టనద్ధః - బంగరు వస్త్రముచే కప్పబడిన, రథః - రథము, హర్యశ్వతురంగవర్ణాః - ఇంద్రుని గుఱ్ఱముల రంగు గల, హయాః చ - గుఱ్ఱములు, సింహేన - సింహముతో, విరాజమానః - ప్రకాశించుచున్న, ధ్వజః చ - ధ్వజము కూడ, ఆస - ఆవిర్భవించెను.

తరువాత హవిస్సులచే ఆరాధించబడిన అగ్నినుండి బంగర వస్త్రముచే కప్పబడిన రథము, ఇంద్రుని గుఱ్ఱములవలె పచ్చని గుఱ్ఱములు, సింహముతో ప్రకాశించే ధ్వజము కూడ ఆవిర్భవించెను.

ధనుశ్చ దివ్యం పురటోపనద్ధం తూణావరిక్తౌ కవచం చ దివ్యమ్,
పితామహస్తస్య దదౌ చ మాలామమ్లానపుష్పాం జలజం చ శుక్రః।

పురట-ఉపనద్ధమ్ - బంగారపు పై రేకు గల, దివ్యమ్ - దివ్యమైన, ధనుః చ - ధనుస్సు, అరిక్తౌ - అక్షయములైన, తూణౌ - అంబుల పొదులు, దివ్యమ్ - దివ్యమైన, కవచం చ - కవచము, తస్య - ఆ బలికి,

పితామహః - తాత (ప్రహ్లాదుడు), అమ్లానపుష్పామ్ - వాడని పుష్పములు గల, మాలామ్ - మాలను, శుక్రః చ - శుక్రాచార్యుడైతే, జలజం చ - శంఖ మును కూడ, దదౌ - ఇచ్చెను.

బంగరు రేకు తొడిగిన దివ్యమైన ధనుస్సు, అక్షయములైన తూణీ రములు, దివ్యమగు కవచము కూడ ప్రకటమయ్యెను. తాతగారు ప్రహ్లా దుడు ఆ బలికి వాడని పుష్పముల మాలను, శుక్రాచార్యుడు శంఖమును ఇచ్చిరి.

ఏవం స విప్రార్జితయోధనార్థస్తైః కల్పితస్వస్త్యయనోఽథ విప్రాన్ ।
ప్రదక్షిణీకృత్య కృతప్రణామః ప్రహ్లాదమామంత్ర్య నమశ్చకార ॥7

ఏవమ్ - ఈ విధముగా, విప్ర-ఆర్జితయోధన-అర్థః - బ్రాహ్మణు లచే సంపాదించబడిన యుద్ధపరికరములు గల, సః - ఆ బలి, తైః - వారి చే, కల్పితస్వస్త్యయనః - చేయబడిన మంగలవాచనము గలవాడై, అథ - తరువాత, విప్రాన్ - బ్రాహ్మణులను, ప్రదక్షిణీకృత్య - ప్రదక్షిణము చేసి, కృతప్రణామః - చేయబడిన ప్రణామము గలవాడై, ప్రహ్లాదమ్ - ప్రహ్లాదుని, ఆమంత్ర్య - సెలవు తీసుకొని, నమః - నమస్కారమును, చకార - చేసె ను.

ఈ విధముగా బలికి యుద్ధపరికరములను ఆ బ్రాహ్మణులు యజ్ఞము ద్వారా సంపాదించి పెట్టిరి. వారు స్వస్తివాచనములు పలుకగా అతడు వారికి ప్రదక్షిణ నమస్కారములను చేసి, ప్రహ్లాదునకు నమస్కరించి ఆయన వద్ద సెలవు తీసుకొనెను.

అథారుహ్య రథం దివ్యం భృగుదత్తం మహారథః ।
సుస్రగ్ధరోఽథ సంనహ్య ధన్వీ ఖడ్గీ ధృతేషుధిః ॥ 8

అథ - తరువాత, మహారథః - మహారథుడు, సుస్రగ్-ధరః - చక్కని మాలను దాల్చినవాడు, ధన్వీ - ధనుస్సు గలవాడు, ఖడ్గీ - ఖడ్గము గలవాడు అగు బలి, భృగుదత్తమ్ - భృగువంశీయులచే ఈయబ డిన, దివ్యమ్ - దివ్యమైన, రథమ్ - రథమును, ఆరుహ్య - ఎక్కి,

సంనహ్యా - కవచమును వేసుకొని, అథ - తరువాత, ధృత-ఇషుధిః - ధరించబడిన తూణీరములు గలవాడు.

మహారథుడగు బలి చక్కని మాలను, ధనుస్సును, కత్తిని, తూణీర ములను ధరించి, కవచమును వేసుకొని, భృగువంశీయులు సమకూర్చిన దివ్యమగు రథమునెక్కెను.

హేమాంగదలసద్బాహుస్స్ఫురన్మకరకుండలః ।
రరాజ రథమారూఢో ధిష్ణ్యస్థ ఇవ హవ్యవాట్ ॥ 9

హేమ-అంగదలసద్-బాహుః - బంగరు భుజపురులతో ప్రకా శించే చేతులు గలవాడు, స్ఫురత్-మకరకుండలః - మెరిసిపోయే మకర కుండలములు గలవాడు, రథమ్ - రథమును, ఆరూఢః - అధిష్ఠించిన బలి, ధిష్ణ్యస్థః - అగ్నికుండమునందున్న, హవ్యవాట్ ఇవ - అగ్ని వలె, రరాజ - ప్రకాశించెను.

ఆయన చేతులు బంగరు భుజపురులతో ప్రకాశించెను. మెరిసి పోయే మకరాకార కుండలములను ధరించిన ఆ బలి రథమునెక్కి, అగ్ని కుండమునందలి అగ్ని వలె ప్రకాశించెను.

తుల్యైశ్వర్యబలశ్రీభిస్స్వయూథైర్దైత్యయూథపైః ।
పిబద్భిరివ ఖం దృగ్భిర్దహద్భిః పరిధీనివ ॥ 10

వృతో వికర్షన్ మహతీమాసురీం ధ్వజినీం విభుః ।
యయావింద్రపురీం స్వృద్ధాం కంపయన్నివ రోదసీ ॥ 11

తుల్య-ఐశ్వర్యబలశ్రీభిః - సమానమైన ప్రభావము బలము సంప దలు కలిగినట్టియు, ఖమ్ - ఆకాశమును, దృగ్భిః - చూపులతో, పిబద్భిః ఇవ - త్రాగుచున్నారా యన్నట్లు ఉన్నట్టియు, పరిధీన్ - దిక్కులను, దహద్భిః ఇవ - తగులబెట్టుచున్నారా యన్నట్లు ఉన్న, దైత్యయూథపైః - రాక్షస సేనానాయకులతో, స్వయూథైః - తమ తమ సేనలతో, వృతః - చుట్టువారబడి యున్న, విభుః - బలి చక్రవర్తి, మహతీమ్ - పెద్ద, ఆసురీమ్ - రాక్షసులకు చెందిన, ధ్వజినీమ్ - సైన్యమును, వికర్షన్ - నడిపించుచు

న్నవాడై, రోదసీ - భూలోకమును స్వర్గలోకమును, కంపయన్ ఇవ - కంపింప జేయుచున్నవాడు వలె, సు-ఋద్ధామ్ - మిక్కిలి సమృద్ధమైన, ఇంద్రపురీమ్ - ఇంద్రుని నగరమును గురించి, యయౌ - వెళ్లెను.

బలి చక్రవర్తిని రాక్షస సేనానాయకులు తమ తమ సైన్యములతో కూడి చుట్టువారి యుండిరి. బలితో సమానమైన ప్రభావము, బలము, సంపదలు గల ఆ సేనానాయకులు చూపులతో ఆకాశమును త్రాగుచు న్నారా యన్నట్లు, దిక్కులను తగులబెట్టుచున్నారా యన్నట్లు ఉండిరి. బలి పెద్ద రాక్షససైన్యమును నడుపుతూ మిక్కిలి సమృద్ధమగు ఇంద్రనగరము (అమరావతి) ను చేరెను. ఆయన సైన్యమును నడుపుచుండగా భూలోక స్వర్గలోకములను కంపింప జేయుచున్నాడా యన్నట్లు ఉండెను.

రమ్యాముపవనోద్యానైశ్శ్రీమద్భిర్నందనాదిభిః ।
కూజద్విహంగమిథునైర్గాయన్మత్తమధువ్రతైః ।
ప్రవాలఫలపుష్పోరుభారశాఖామరద్రుమైః ॥ 12

శ్రీమద్భిః - శోభాయుతములైనట్టియు, కూజద్-విహంగమిథునైః - కూతలు కూసే పక్షుల జంటలు కలిగినట్టియు, గాయత్-మత్తమధువ్రతైః - గానము చేయుచున్న మదించిన తుమ్మెదలు కలిగినట్టియు, ప్రవాలఫల పుష్ప-ఉరుభారశాఖా-అమరద్రుమైః - చిగుళ్లు పళ్లు పుష్పముల పెను భారము గల కొమ్మలు గల దేవ (కల్ప) వృక్షములు గల, నందన-ఆదిభిః - నందనము మొదలైన, ఉపవన-ఉద్యానైః - ఉపవనములతో ఉద్యానము లతో, రమ్యామ్ - సుందరమైన (నగరమునకు వెళ్లెను).

ఆ నగరములోని నందనము మొదలైన ఉపవనములు (దగ్గరగా ఉండే పళ్ల తోటలు), ఉద్యానములు (దూరముగా ఉండే పూలదోటలు) కూతలు కూసే పక్షుల జంటలతో, ఝుంకారమును చేసే మదించిన తుమ్మె దలతో, కొమ్మల నిండా చిగుళ్లు పళ్లు పువ్వుల పెను భారము గల దేవ (క ల్ప) వృక్షములతో శోభాయుతములై యుండెను.

హంససారసచక్రాహ్వకారండవకులాకులాః ।
నలిన్యో యత్ర క్రీడంతి ప్రమదాస్సురసేవితాః ॥ 13

హంససారసచక్ర-ఆహ్వాకారండవకుల-ఆకులాః - హంసలు బెగ్గురు పక్షులు జక్కవ పక్షులు కారండవ పక్షుల సమూహములతో కోలా హలముగానున్న, నలిన్యః - తామర కొలనులు, యత్ర - వేటియందైతే, సురసేవితాః - దేవతలచే సమ్మానించబడే, ప్రమదాః - యువతులు, క్రీడంతి - క్రీడించెదరో.

హంసలు, బెగ్గురు పక్షులు, జక్కవ పక్షులు, కారండవ పక్షుల సమూహములతో అక్కడి తామర కొలనులు కోలాహలముగా నుండును. వాటియందు దేవతలచే సమ్మానించబడే దేవస్త్రీలు క్రీడించెదరు.

ఆకాశగంగయా దేవ్యా వృతాం పరిఖభూతయా ।
ప్రాకారేణాగ్నివర్ణేన సాట్టాలేనోన్నతేన చ ॥ 14

దేవ్యా - పూజించదగినట్టియు, పరిఖభూతయా - అగడ్తయైన, ఆకాశగంగయా - ఆకాశగంగతో, అగ్నివర్ణేన - అగ్ని వలె ప్రకాశించునట్టి యు, స-అట్టాలేన - బురుజులతో కూడియున్నట్టియు, ఉన్నతేన చ - ఎత్తై న, ప్రాకారేణ - ప్రాకారముతో, వృతామ్ - చుట్టువార బడియున్న (నగర మును చేరెను).

పూజనీయమైన ఆకాశగంగ అమరావతీ నగరము చుట్టూ అగడ్త ఆయెను. ఆ నగరము చుట్టూ అగ్ని వలె ప్రకాశించే ఎత్తైన ప్రాకారము గల దు. దానిపై బురుజులు గలవు.

రుక్మపట్టకపాటైశ్చ ద్వారైస్స్ఫటికగోపురైః ।
జుష్టాం విభక్తప్రపథాం విశ్వకర్మవినిర్మితామ్ ॥ 15

రుక్మపట్టకపాటైః - వెండి పట్టీలు గల తలుపులు గల, ద్వారైః - ద్వారములతో, స్ఫటికగోపురైః చ - స్ఫటికములు పొదిగిన పురద్వారముల తో కూడ, జుష్టామ్ - కూడినట్టియు, విభక్తప్రపథామ్ - విభాగము చేయబ డిన రాజమార్గములు కలిగినట్టియు, విశ్వకర్మవినిర్మితామ్ - విశ్వకర్మచే నిర్మించబడిన (నగరమును చేరెను).

ఆ నగరములోని ద్వారముల తలుపులకు పట్టీలు వెండివి. దాని పురద్వారములకు స్ఫటికములు పొదగబడినవి. విశ్వకర్మచే నిర్మించబడిన ఆ నగరమునందు రాజమార్గములు చక్కగా విభాగము చేయబడియున్నవి.

సభాచత్వరరథ్యాఢ్యాం విమానైర్న్యర్బుదైర్యుతామ్ ।
శృంగాటకైర్మణిమయైర్వజ్రవిద్రుమవేదిభిః ॥ 16

సభాచత్వరరథ్యా-ఆఢ్యామ్ - సభలు ముంగిళ్లు రథమార్గములతో సుసంపన్నమైనట్టియు, న్యర్బుదైః - పది కోట్ల, విమానైః - విమానములతో, మణిమయైః - మణులు పొదిగిన, శృంగాటకైః - కూడళ్లతో, వజ్రవిద్రుమవేదిభిః - వజ్రములు పగడములు పొదిగిన వేదికలతో, యుతామ్ - కూడియున్న (నగరమును చేరెను).

అమరావతీ నగరము సభలు, ముంగిళ్లు, రథమార్గములతో సుసంపన్నమై యుండెను. దానియందు పది కోట్ల విమానములు, మణులు పొదిగిన కూడళ్లు, వజ్రములు పగడములు పొదిగిన వేదికలు గలవు.

యత్ర నిత్యవయోరూపాశ్శ్యామా విరజవాససః ।
భ్రాజంతే రూపవన్నార్యో హ్యర్చిర్భిరివ వహ్నయః ॥ 17

యత్ర హి - ఏ నగరమునందైతే, నిత్యవయోరూపాః - నిత్యమైన యౌవనము సౌందర్యము గలవారు, శ్యామాః - సుందరులు, విరజవాససః - శుద్ధమగు వస్త్రములు గలవారు, రూపవత్-నార్యః - అలంకరించుకున్న యువతులు, అర్చిర్భిః - జ్వాలలతో, వహ్నయః ఇవ - అగ్నులు వలె, భ్రాజంతే - ప్రకాశించెదరో.

ఆ నగరమునందలి యువతులు నిత్యము ఉండే సౌందర్యము, యౌవనము గలవారు. శుద్ధమగు వస్త్రములను దాల్చే ఆ సుందరులు ఆభరణములను దాల్చి, జ్వాలలతో గూడిన అగ్నులు వలె ప్రకాశించెదరు.

సురస్త్రీకేశవిభ్రష్టనవసౌగంధికస్రజామ్ ।
యత్రామోదముపాదాయ మార్గ ఆవాతి మారుతః ॥ 18

యత్ర - ఏ నగరమునందైతే, సురస్త్రీకేశవిభ్రష్టనవసౌగంధికస్రజామ్ - దేవస్త్రీల కేశములనుండి జారిపడిన సౌగంధిక పుష్పముల మాలలయొక్క, ఆమోదమ్ - పరిమళమును, ఉపాదాయ - స్వీకరించి, మారుతః - వాయువు, మార్గే - మార్గమునందు, ఆవాతి - మెల్లగా వీచునో.

ఆ నగరమునందు దేవస్త్రీల కేశములనుండి జారిపడిన సౌగంధిక పుష్పముల మాలల పరిమళమును స్వీకరించి వాయువు మార్గమునందు మెల్లగా వీచుచుండును.

హేమజాలాక్షనిర్గచ్ఛద్ధూమేనాగురుగంధినా ।
పాండురేణ ప్రతిచ్ఛన్నమార్గే యాంతి సురప్రియాః ॥ 19

అగురుగంధినా - అగురు సుగంధము కలిగినట్టియు, పాండురేణ - తెల్లనైనట్టియు, హేమజాల-అక్షనిర్గచ్ఛద్-ధూమేన - బంగరు కిటికీల నుండి బయల్వెడలే పొగతో, ప్రతిచ్ఛన్నమార్గే - కప్పివేయబడిన మార్గమునందు, సురప్రియాః - అప్సరసలు, యాంతి - నడచెదరో.

సుగంధభరితమైన తెల్లని అగురు ధూపము బంగరు కిటికీలనుండి బయటకు వచ్చి మార్గమును కప్పివేయును. అట్టి మార్గమునందు అప్సరసలు నడచుచుందురు.

ముక్తావితానైర్మణిహేమకేతుభిర్నానాపతాకావలభీభిరావృతామ్ ।
శిఖండిపారావతభృంగనాదితాం వైమానికస్త్రీకలగీతమంగలామ్ ॥

ముక్తావితానైః - ముత్యముల చాందినీలతో, మణిహేమకేతుభిః - మణులు గల బంగరు టెక్కెములతో, నానాపతాకావలభీభిః - అనేకములైన చిన్నజెండాలు గల ఇళ్ల నడికొప్పులతో, ఆవృతామ్ - ఆవరించిబడి ఉన్నట్టియు, శిఖండిపారావతభృంగనాదితామ్ - నెమళ్లు పావురములు తుమ్మెదలతో ధ్వనించుచున్నట్టియు, వైమానికస్త్రీకలగీతమంగలామ్ - దేవస్త్రీల మధురగానములతో మంగళప్రదముగానున్న (నగరమును చేరెను).

ఆ నగరము అంతటా ముత్యముల చాందినీలు, మణులు గల బంగరు టెక్కెములు, అనేకములైన చిన్నజెండాలు పెట్టిన ఇళ్ల నడికొప్పులు ఉండెను. నెమళ్లు, పావురములు, తుమ్మెదలు ధ్వనిని చేయుచుండెను. దేవస్త్రీల మధురగానములతో ఆ నగరము మంగళప్రదముగా నుండెను.

మృదంగశంఖానకదుందుభిస్వనైః
సతాలవీణామురజర్ష్టివేణుభిః ।
నృత్యైస్సవాద్యైరుపదేవగీతకైః
మనోరమాం స్వప్రభయా జితప్రభామ్ ॥ 21

మృదంగశంఖ-ఆనకదుందుభిస్వనైః - డోళ్లు శంఖములు తప్పెట్లు దుందుభుల ధ్వనులతో, సతాలవీణామురజ-ఋష్టివేణుభిః - తాళములు వీణలు మద్దెళ్లు ఋష్టులు (వాద్యవిశేషములు) వేణువులతో కూడినట్టియు, సవాద్యైః - వాద్యములతో గూడిన, నృత్యైః - నాట్యములతో, ఉపదేవగీతకైః - గంధర్వుల గానములతో, మనోరమామ్ - మనస్సును దోచివేయునట్టియు, స్వప్రభయా - తన కాంతిచే, జితప్రభామ్ - జయించబడిన ప్రభాదేవి గల (నగరమును చేరెను).

ఆ నగరములో డోళ్లు, శంఖములు, తప్పెట్లు, దుందుభులు, తాళములు, వీణలు, మద్దెళ్లు, ఋష్టి అనే వాద్యములు, వేణువులు మొదలగు వాద్యములను వాయిస్తూ గంధర్వులు గానములను చేయుచుండగా, అప్సరసలు నాట్యములను చేయుచుండిరి. ఈ విధముగా మనోహరమైన ఆ నగరము తన కాంతిచే కాంతిదేవిని కూడ జయించినదా యన్నట్లు ఉండెను.

యాం న వ్రజంత్యధర్మిష్ఠాః ఖలా భూతద్రుహశ్శఠాః ।
మానినః కామినో లుబ్ధా ఏభిర్హీనా వ్రజంతి యత్ ॥ 22

అధర్మిష్ఠాః - ధర్మాత్ములు కానివారు, ఖలాః - దుష్టులు, భూతద్రుహః - ప్రాణులకు ద్రోహమును చేయువారు, శఠాః - రహస్యముగా అపకారమును చేయువారు, మానినః - గర్విష్ఠులు, కామినః - కాముకులు,

లుబ్ధాః - లోభులు, యామ్ - ఏ నగరమును, న వ్రజంతి - పొందరో, ఏభిః - ఈ దోషములచే, హీనాః - రహితమైనవారు, యత్ - దేనిని, వ్రజంతి - పొందెదరో.

ధర్మాత్ములు కానివారు, దుష్టులు, ప్రాణులకు ద్రోహమును చేయువారు, రహస్యముగా అపకారమును చేయువారు, గర్విష్ఠులు, కాముకులు, లోభులు ఆ నగరమును చేరలేరు. ఈ దోషములు లేనివారు మాత్రమే ఆ నగరమును పొందెదరు.

తాం దేవధానీం స వరూథినీపతిః
బహిస్సమంతాద్రురుధే పృతన్యయా ।
ఆచార్యదత్తం జలజం మహాస్వనం
దధ్మౌ ప్రయుంజన్ భయమింద్రయోషితామ్ ॥ 23

వరూథినీపతిః - సేనాపతియగు, సః - ఆ బలి, తామ్ - ఆ, దేవ ధానీమ్ - దేవతల రాజధానిని, బహిః - బయట, సమంతాత్ - అంతటా, పృతన్యయా - సైన్యముతో, రురుధే - ముట్టడించెను, ఇంద్రయోషితామ్ - ఇంద్రుని భార్యలకు, భయమ్ - భయమును, ప్రయుంజన్ - కలిగించు వాడై, ఆచార్యదత్తమ్ - ఆచార్యులచే ఈయబడిన, మహాస్వనమ్ - గొప్ప ధ్వని గల, జలజమ్ - శంఖమును, దధ్మౌ - పూరించెను.

సేనాపతియగు ఆ బలి దేవతల రాజధానియగు అమరావతిని బయట అంతటా సైన్యముతో ముట్టడించెను. ఆయన ఇంద్రుని భార్యలకు భయము కలిగే విధముగా, ఆచార్యులచే ఈయబడిన గొప్ప ధ్వనిని చేసే శంఖమును పూరించెను.

మఘవాంస్తమభిప్రేత్య బలేః పరమముద్యమమ్ ।
సర్వదేవగణోపేతో గురుమేతదువాచ హ ॥ 24

బలేః - బలి చక్రవర్తియొక్క, తమ్ - ఆ, పరమమ్ - గొప్ప, ఉద్య మమ్ - ఉద్యమమును, అభిప్రేత్య - తెలుసుకొని, మఘవాన్ - ఇంద్రుడు,

సర్వదేవగణ-ఉపేతః - అందరు దేవగణములతో కూడినవాడై, గురుమ్ - బృహస్పతిని ఉద్దేశించి, ఏతత్ - ఈ మాటను, ఉవాచ హ - పలికెనట.

బలియొక్క ఆ గొప్ప యుద్ధోద్యమమును గురించి తెలుసుకున్న ఇంద్రుడు దేవగణములందరితో గూడి బృహస్పతితో ఇట్లు పలికెను.

భగవన్నుద్యమో భూయాన్ బలేర్నః పూర్వవైరిణః ।
అవిషహ్యమిమం మన్యే కేనాసీత్తేజసోర్జితః ॥ 25

భగవన్ - పూజనీయా!, నః - మనయొక్క, పూర్వవైరిణః - పూర్వమునందలి శత్రువగు, బలేః - బలియొక్క, ఉద్యమః - యుద్ధప్రయత్నము, భూయాన్ - చాల పెద్దది, ఇమమ్ - వీనిని, అవిషహ్యమ్ - సహించ శక్యము కానివానినిగా, మన్యే - తలచెదను, కేన - ఏ, తేజసా - తేజస్సుచే, ఊర్జితః - శక్తి గలవాడు, ఆసీత్ - ఆయెను?

ఓ పూజనీయా! మనకు పూర్వమునందు శత్రువైన బలి చేయుచున్న యుద్ధప్రయత్నము చాల పెద్దది. మనము వీనిని ఎదుర్కొనలేమని నా అభిప్రాయము. ఈతడు ఏ శక్తిచే ఇంతటి శక్తి గలవాడైనాడు?

నైనం కశ్చిత్కుతో వాపి ప్రతివ్యోఢుమధీశ్వరః ।
పిబన్నివ ముఖేనేదం లిహన్నివ దిశో దశ ।
దహన్నివ దిశో దృగ్భిస్సంవర్తాగ్నిరివోత్థితః ॥ 26

కశ్చిత్ - ఎవడైననూ, కుతః వా అపి - ఏ ఉపాయము వలననైననూ, ఏనమ్ - వీనిని, ప్రతివ్యోఢుమ్ - నెట్టివేయుటకు, అధి-ఈశ్వరః - సమర్థుడు, న - కాడు, ముఖేన - నోటితో, ఇదమ్ - ఈ జగత్తును, పిబన్ ఇవ - త్రాగుచున్నాడా యన్నట్లు, దశ - పది, దిశః - దిక్కులను, లిహన్ ఇవ - ఆస్వాదించుచున్నవాడు వలె, దిశః - దిక్కులను, దృగ్భిః - చూపులతో, దహన్ ఇవ - దహించుచున్నాడా యన్నట్లు, సంవర్త-అగ్నిః ఇవ - ప్రళయకాలాగ్నివలె, ఉత్థితః - ఆవిర్భవించినాడు.

ఎవ్వడైననూ ఏ ఉపాయముచేనైననూ వీనిని నెట్టివేయుటకు సమర్థుడు కాడు. ఈతడు నోటితో జగత్తును త్రాగుచున్నాడా యన్నట్లు, దిక్కుల

నాస్వాదించుచున్నాడా యన్నట్లు, చూపులతో దిక్కులను దహించుచు న్నాడా యన్నట్లు ప్రళయకాలాగ్నివలె ఆవిర్భవించినాడు.

బ్రూహి కారణమేతస్య దుర్ధర్షత్వస్య మద్రిపోః ।
ఓజస్సహో బలం తేజో యత ఏతత్సముద్యమః ॥ 27

మద్-రిపోః - నా శత్రువగు, ఏతస్య - వీనియొక్క, దుర్ధర్షత్వస్య - జయించ శక్యము కాని స్థితికి, కారణమ్ - కారణమును, బ్రూహి - చెప్పుము, ఓజః - మనోబలము, సహః - ఇంద్రియబలము, బలమ్ - శరీరబలము, యతః - ఎక్కడనుండి?, యతః - వేటి వలన, ఏతత్ - ఈ, సముద్యమః - పెద్ద ఉద్యమమో.

నా శత్రువగు ఈతనిని జయించ శక్యము కాదు. ఈతని ఈ స్థితికి కారణమేమి? ఈతనిలో మనోబలము, ఇంద్రియబలము, శరీరబలము ఎక్కడనుండి వచ్చినవి? వాటి ఆధారముగనే ఈతడు ఇంత ఉద్యమమును చేయుచున్నాడు.

గురురువాచ ।
జానామి మఘవన్ శత్రోరున్నతేరస్య కారణమ్ ।
శిష్యాయోపభృతం తేజో భృగుభిర్బ్రహ్మవాదిభిః ॥ 28

మఘవన్ - ఓ ఇంద్రా!, శత్రోః - శత్రువుయొక్క, అస్య - ఈ, ఉన్నతేః - అభివృద్ధికి, కారణమ్ - కారణమును, జానామి - ఎరుగుదును, బ్రహ్మవాదిభిః - వేదవేత్తలగు, భృగుభిః - భృగువంశీయులచే, శిష్యాయ - శిష్యుడగు ఈతని కొరకు, తేజః - తేజస్సు, ఉపభృతమ్ - నింపబడినది.

ఓ ఇంద్రా! శత్రువుయొక్క ఈ అభివృద్ధికి కారణము నాకు తెలియును. వేదవేత్తలగు భృగువంశీయులు తమ శిష్యుడగు ఈ బలియందు తేజస్సును నింపినారు.

భవద్విధో భవాన్ వాపి వర్జయిత్వేశ్వరం హరిమ్ ।
నాస్య శక్తః పురః స్థాతుం కృతాంతస్య యథా జనాః ॥ 29

భవద్-విధః - నీవంటివాడు గాని, భవాన్ వా అపి - నీవే గాని, ఈశ్వరమ్ - సర్వేశ్వరుడగు, హరిమ్ - శ్రీహరిని, వర్జయిత్వా - విడిచిపెట్టి, అస్య - వీనికి, పురః - ఎదుట, స్థాతుమ్ - నిలబడుటకు, జనాః - జనులు, కృతాంతస్య యథా - మృత్యువు ఎదుట వలె, న శక్తః - సమర్థుడు కాడు.

జనులు మృత్యువు యెదుట నిలువలేరు. అదే విధముగా, నీవు గాని, నీవంటివాడు మరియొకడు గాని, సర్వేశ్వరుడగు శ్రీహరిని విడిచి పెట్టినచో, వీని యెదుట నిలబడలేరు.

తస్మాన్నిలయముత్సృజ్య యూయం సర్వే త్రివిష్టపమ్ ।
యాత కాలం ప్రతీక్షంతో యతశ్శత్రోర్విపర్యయః ।। 30

తస్మాత్ - అందువలన, యూయమ్ - మీరు, సర్వే - అందరు, కాలమ్ - కాలమును, ప్రతీక్షంతః - వేచి చూచువారై, త్రివిష్టపమ్ - స్వర్గమును, ఉత్సృజ్య - విడిచిపెట్టి, నిలయమ్ - కనబడకుండుటను, యాత - పొందుడు, యతః - దేనివలన, శత్రోః - శత్రువునకు, విపర్యయః - తల్లక్రిందులు అగుటయో.

కావున, మీరందరు స్వర్గమును విడిచి ఎచ్చటనో దాగియున్నవారై, కాలమును వేచి చూచుచుండుడు. కాలమే శత్రువు స్థితిని తల్లక్రిందులు చేయగలదు.

ఏష విప్రబలోదర్కస్సంప్రత్యూర్జితవిక్రమః ।
తేషామేవాపమానేన సానుబంధో వినంక్ష్యతి ।। 31

విప్రబల-ఉదర్కః - వేదవేత్తల బలముచే ఉత్తరోత్తరాభివృద్ధి గల, ఏషః - ఈతడు, సంప్రతి - ఇప్పుడు, ఊర్జితవిక్రమః - వృద్ధి చెందిన పరాక్రమము గలవాడు, తేషామ్ - వారియొక్క, అపమానేన ఏవ - అవమానము చేతనే, స-అనుబంధః - పరివారముతో కూడినవాడై, వినంక్ష్యతి - వినాశమును పొందగలడు.

వేదవేత్తల బలముచే ఉత్తరోత్తరాభివృద్ధి గల ఈతని పరాక్రమము ఇప్పుడు వృద్ధి చెందియున్నది. ఈతడు మరల ఆ వేదవేత్తలను అవమానము చేసినప్పుడు మాత్రమే సపరివారముగా వినాశమును పొందగలడు.

ఏవం సుమంత్రితార్థాస్తే గురుణార్థానుదర్శినా ।
హిత్వా త్రివిష్టపం జగ్ముర్గీర్వాణాః కామరూపిణః ॥ 32

ఏవమ్ - ఈ విధముగా, అర్థ-అనుదర్శినా - యథార్థమైన విచారమును చేసే, గురుణా - బృహస్పతిచే, సుమంత్రిత-అర్థాః - విచారపూర్వకముగా సలహా ఈయబడిన ప్రయోజనము గలవారై, తే - ఆ, గీర్వాణాః - దేవతలు, కామరూపిణః - తమకు నచ్చిన రూపములు గలవారై, త్రివిష్టపమ్ - స్వర్గమును, హిత్వా - విడిచిపెట్టి, జగ్ముః - వెళ్లిరి.

యథార్థమైన విచారమును చేసే బృహస్పతి ఈ విధముగా విచారపూర్వకముగా దేవతల ప్రయోజనమును గురించి సలహానిచ్చెను. అపుడు ఆ దేవతలు తమకు నచ్చిన రూపములను దాల్చి స్వర్గమును విడిచిపెట్టి వెళ్లిరి.

దేవేష్వథ నిలీనేషు బలిర్వైరోచనః పురీమ్ ।
దేవధానీమధిష్ఠాయ వశం నిన్యే జగత్త్రయమ్ ॥ 33

అథ - తరువాత, దేవేషు - దేవతలు, నిలీనేషు - దాగినవారు కాగా, వైరోచనః - విరోచన పుత్రుడగు, బలిః - బలి, దేవధానీమ్ - దేవతల రాజధానియగు, పురీమ్ - అమరావతీ నగరమును, అధిష్ఠాయ - అధిష్ఠించి, జగత్-త్రయమ్ - ముల్లోకములను, వశమ్ - వశముగా, నిన్యే - చేసుకొనెను.

దేవతలు దాగుకొనగా ఆ తరువాత విరోచన పుత్రుడగు బలి దేవతల రాజధానియగు అమరావతీ నగరమునకు అధీశ్వరుడై ముల్లోకములను తన వశము చేసుకొనెను.

తం విశ్వజయినం శిష్యం భృగవశ్శిష్యవత్సలాః ।
శతేన హయమేధానామనువ్రతమయాజయన్ ॥ 34

విశ్వజయినమ్ - జగత్తును జయించినట్టియు, శిష్యమ్ - శిష్యుడై నట్టియు, అనువ్రతమ్ - అనువర్తి అయిన, తమ్ - ఆ బలిని, శిష్యవత్సలాః - శిష్యునియందు ప్రేమ గల, భృగవః - భృగువంశీయులు, హయమేధానామ్ - అశ్వమేధముల, శతమ్ - వందను, అయాజయన్ - యజ్ఞములను చేయించిరి.

జగత్తును జయించి తమను అనుసరించే తమ శిష్యుడగు బలిపై భృగువంశీయులకు ప్రేమ మెండు. వారాయనచే వంద అశ్వమేధ యాగములను చేయించిరి.

తతస్తదనుభావేన భువనత్రయవిశ్రుతామ్ ।
కీర్తిం దిక్షు వితన్వానస్స రేజ ఉడురాడివ ।। 35

తతః - తరువాత, తద్-అనుభావేన - వాటి ప్రభావముచే, సః - ఆ బలి, భువనత్రయవిశ్రుతామ్ - ముల్లోకములలో అధికముగా వినబడిన, కీర్తిమ్ - కీర్తిని, దిక్షు - దిక్కులయందు, వితన్వానః - విస్తరింప జేయుచున్నవాడై, ఉడురాడ్ ఇవ - నక్షత్రాధిపతియగు చంద్రుడు వలె, రేజే - ప్రకాశించెను.

తరువాత ఆ యజ్ఞముల ప్రభావముచే ఆ బలి ముల్లోకములలో దిక్కులయందు తన కీర్తిని విస్తరింప జేసి, నక్షత్రాధిపతియగు చంద్రుడు వలె ప్రకాశించెను.

బుభుజే చ శ్రియం స్వృద్ధాం ద్విజదేవోపలంభితామ్ ।
కృతకృత్యమివాత్మానం మన్యమానో మహామనాః ।। 36

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే
బలేస్స్వర్గవిజయో నామ పంచదశోఽధ్యాయః ।।

మహామనాః - గొప్ప ఔదార్యము గల బలి, ఆత్మానమ్ - తనను, కృతకృత్యమ్ - కృతార్థునిగా, మన్యమానః - తలంచువాడై, ద్విజదేవ-ఉపలంభితామ్ - వేదవేత్తలు మరియు దేవతలచే పొందించబడిన, సు-ఋ

ద్ధామ్ - మిక్కిలి సమృద్ధమైన, శ్రియమ్ - సంపదను, బుభుజే చ - అనుభవించెను.

బలి గొప్ప ఔదార్యము గలవాడు. యజ్ఞములను చేసి తాను కృతార్థుడనైతినని ఆయన తలపోసెను. వేదవేత్తల అనుగ్రహముచే దేవతల సమృద్ధమైన సంపద లభించగా, ఆయన దానిని అనుభవించెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
బలి స్వర్గముపై విజయమును పొందుటను వర్ణించే
పదిహేనవ అధ్యాయము ముగిసినది (15) .

*****

# అథ షోడశోఽధ్యాయః

## వామనావతారము - కశ్యపుడు అదితికి పయోవ్రతమును ఉపదేశించుట

శ్రీశుక ఉవాచ ।
ఏవం పుత్రేషు నష్టేషు దేవమాతాఽదితిస్తదా ।
హృతే త్రివిష్టపే దైత్యైః పర్యతప్యదనాథవత్ ॥ 1

ఏవమ్ - ఈ విధముగా, పుత్రేషు - పుత్రులు, నష్టేషు - కనబడ కుండా పోగా, త్రివిష్టపే - స్వర్గము, దైత్యైః - రాక్షసులచే, హృతే - అపహ రించబడగా, తదా - అప్పుడు, దేవమాతా - దేవతల తల్లియగు, అదితిః - అదితి, అనాథవత్ - నాథుడు లేనిది వలె, పరి-అతప్యత్ - నిరంతరముగా దుఃఖమును పొందెను.

ఈ విధముగా రాక్షసులు స్వర్గమునాక్రమించగా తన పుత్రులైన దేవతలు కనబడకుండా పోయినప్పుడు, దేవతల తల్లియగు అదితి నాథుడు లేనిదివలె నిరంతరమగు దుఃఖమును పొందెను.

ఏకదా కశ్యపస్తస్యా ఆశ్రమం భగవానగాత్ ।
నిరుత్సవం నిరానందం సమాధేర్విరతశ్చిరాత్ ॥ 2

ఏకదా - ఒకనాడు, భగవాన్ - పూజనీయుడగు, కశ్యపః - కశ్యప ప్రజాపతి, చిరాత్ - చాలకాలమునకు, సమాధేః - సమాధినుండి, విరతః - విరమించినవాడై, నిరుత్సవమ్ - ఉత్సవములు లేనట్టియు, నిరానందమ్ - ఆనందము లేని, తస్యాః - ఆ అదితియొక్క, ఆశ్రమమ్ - ఆశ్రమమును గురించి, అగాత్ - వెళ్లెను.

ఆమె ఆశ్రమములో ఉత్సవము గాని, ఆనందము గాని లేకుండె ను. చిరకాలము తరువాత సమాధినుండి బయటకు వచ్చిన పూజనీయు డగు కశ్యప ప్రజాపతి ఆమె ఆశ్రమమునకు వెళ్లెను.

స పత్నీం దీనవదనాం కృతాసనపరిగ్రహః ।
సభాజితో యథాన్యాయమిదమాహ కురూద్వహ ॥ 3

కురు-ఉద్వహ - ఓ కురువంశ శ్రేష్ఠా!, యథాన్యాయమ్ - యథా యోగ్యముగా, సభాజితః - సత్కరించబడినవాడు, కృత-ఆసనపరిగ్రహః - చేయబడిన ఆసనముయొక్క స్వీకారము గల, సః - ఆ కశ్యపుడు, దీనవద నామ్ - దీనమైన ముఖము గల, పత్నీమ్ - భార్యయగు అదితినుద్దేశించి, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను.

కురువంశ శ్రేష్ఠుడవగు ఓ మహారాజా! అదితి ఆయనను యథా యోగ్యముగా సత్కరించెను. ఆయన ఆసనముపై కూర్చుండెను. దీనమైన ముఖముగల తన భార్యను ఉద్దేశించి ఆయన ఇట్లు పలికెను.

అప్యభద్రం న విప్రాణాం భద్రే లోకేఽధునాఽఽగతమ్ ।
న ధర్మస్య న లోకస్య మృత్యోశ్ఛందానువర్తినః ॥ 4

భద్రే - ఓ కల్యాణీ!, లోకే - లోకమునందు, అధునా - ఇప్పుడు, విప్రాణామ్ - వేదవేత్తలకు, అభద్రమ్ - దుఃఖము, అపి న ఆగతమ్ - రాలేదు గదా?, ధర్మస్య - ధర్మమునకు, న - రాలేదు గదా?, మృత్యోః - మృత్యువుయొక్క, ఛంద-అనువర్తినః - ఇచ్ఛను అనుసరించే, లోకస్య - మానవునకు, న - రాలేదు గదా?

ఓ కల్యాణీ! లోకమునందిప్పుడు వేదవేత్తలకు గాని, ధర్మమునకు గాని, మృత్యువుయొక్క ఇచ్ఛకు వశుడై యుండే మానవునకు గాని ఆపద రాలేదు గదా?

అపి వాఽకుశలం కించిద్గృహేషు గృహమేధిని ।
ధర్మస్యార్థస్య కామస్య యత్ర యోగో హ్యయోగినామ్ ॥ 5

గృహమేధిని - ఓ గృహస్వామినీ!, గృహేషు - ఇంటియందు, ధర్మస్య - ధర్మమునకు, అర్థస్య - సంపదకు, కామస్య - కామనకు, కించిత్ - ఏదేని, అకుశలమ్ - ఆపద, అపి వా - కలిగినదా యేమి?, యత్ర - ఏ గృహమునందైతే, అయోగినామ్ - సాధన లేనివారలకు కూడ, యోగః - సాధన సిద్ధించునో.

ఓ అదితీ! ఈ ఇంటికి స్వామినివి నీవే. ఇంటియందు ధర్మార్థకామములనే పురుషార్థములకు ఏదేని ఆపద కలిగినదా యేమి? సాధన లేనివానికి కూడ సాధనయొక్క ఫలమును అందజేసే పవిత్రస్థానము గృహము.

అపి వాఽతిథయోఽభ్యేత్య కుటుంబాసక్తయా త్వయా ।
గృహాదపూజితా యాతాః ప్రత్యుత్థానేన వా క్వచిత్ ॥ 6

క్వచిత్ వా - ఏనాడైననూ, అతిథయః - అతిథులు, అభ్యేత్య - ఇంటికి వచ్చి, కుటుంబ-ఆసక్తయా - ఇంటిపనులలో నిమగ్నమైయున్న, త్వయా - నీచే, ప్రత్యుత్థానేన - ఎదురేగుటచే, అపూజితాః - సత్కరించబడనివారై, గృహాత్ - ఇంటినుండి, యాతాః అపి వా - వెళ్లిపోయినారా యేమి?

ఏ నాడైననూ నీవు ఇంటి పనులలో నిమగ్నమై యుండగా అతిథులు వచ్చి, నీవు ఎదురేగి సత్కరించకుండగనే ఇంటినుండి వెళ్లిపోయినారా యేమి?

గృహేషు యేష్వతిథయో నార్చితాస్సలిలైరపి ।
యది నిర్యాంతి తే నూనం ఫేరురాజగృహోపమాః ॥ 7

యేషు - ఏ, గృహేషు - ఇంటియందు, అతిథయః - అతిథులు, సలిలైః అపి - త్రాగే నీటిచేనైననూ, న అర్చితాః - పూజించబడలేదో, తే - వారు, యది నిర్యాంతి - నిష్క్రమించినచో, తే - ఆ ఇల్లు, నూనమ్ - నిశ్చయముగా, ఫేరురాజగృహ-ఉపమాః - నక్కల రాజు ఇంటితో సమానము.

ఏ ఇంటికి అతిథులు వచ్చి సత్కరించబడకుండా నీరైనా త్రాగకుండా వెళ్ళిపోతారో, ఆ ఇల్లు నిశ్చయముగా నక్కల రాజు ఇంటిని పోలినది మాత్రమే.

**అప్యగ్నయస్తు వేలాయాం న హుతా హవిషా సతి ।**
**త్వయోద్విగ్నధియా భద్రే ప్రోషితే మయి కర్హిచిత్ ॥ 8**

సతి - ఓ పతివ్రతా!, భద్రే - ఓ కల్యాణీ!, కర్హిచిత్ - ఏదో ఒకనాడు, మయి - నేను, ప్రోషితే - ఎక్కడికో వెళ్లగా, ఉద్విగ్నధియా - కలవరము చెందిన మనస్సు గల, త్వయా - నీచే, వేలాయామ్ - సరియైన సమయమునందు, అగ్నయః తు - అగ్నులైతే, హవిషా - హవిస్సుతో, అపి న హుతాః - హోమము చేయబడలేదా యేమి?

ఓ కల్యాణీ! నీవు పతివ్రతవు. నేను ఎక్కడికో వెళ్లినప్పుడు నీవు మనస్సులో ఆదుర్దా ఉన్న కారణముగా సరియగు సమయములో అగ్నుల యందు ఆహుతులను సమర్పించుట విస్మరించినావా యేమి?

**యత్పూజయా కామదుఘాన్యాతి లోకాన్ గృహాన్వితః ।**
**బ్రాహ్మణోఽగ్నిశ్చ వై విష్ణోస్సర్వదేవాత్మనో ముఖమ్ ॥ 9**

గృహ-అన్వితః - గృహస్థుడు, యత్-పూజయా - ఏ అగ్ని బ్రాహ్మణుల పూజచే, కామదుఘాన్ - కోరికలనీడేర్చే, లోకాన్ - లోకములను, యాతి - పొందునో, బ్రాహ్మణః - బ్రాహ్మణుడు, అగ్నిః చ - అగ్ని కూడ, వై - నిశ్చయముగా, సర్వదేవ-ఆత్మనః - సకలదేవతాస్వరూపుడగు, విష్ణోః - విష్ణువుయొక్క, ముఖమ్ - నోరు.

గృహస్థుడు అగ్నిని, బ్రాహ్మణుని పూజించి కోరికలనీడేర్చే పుణ్యలోకములను పొందును. ఎందుకంటే, అగ్ని మరియు బ్రాహ్మణుడు నిశ్చయముగా సకలదేవతాస్వరూపుడగు శ్రీహరియొక్క ముఖమే. (అగ్నియందు చేసిన హోమము, బ్రాహ్మణునకు పెట్టిన భోజనము సాక్షాత్తుగా విష్ణువునకు సమర్పించినట్లే యగును).

అపి సర్వే కుశలినస్తవ పుత్రా మనస్విని ।
లక్షయేఽస్వస్థమాత్మానం భవత్యా లక్షణైరహమ్ ॥ 10

మనస్విని - ఓ అభిమానవతీ!, తవ - నీయొక్క, పుత్రాః - పుత్రులు, సర్వే - అందరు, అపి కుశలినః - క్షేమము గలవారేనా?, లక్షణైః - లక్షణములచే, భవత్యాః - నీయొక్క, ఆత్మానమ్ - మనస్సును, అస్వస్థమ్ - స్వస్థము కానిదానినిగా, అహమ్ - నేను, లక్షయే - చూచుచున్నాను.

ఓ అదితీ! నీకు అభిమానము మెండు. నీ పుత్రులందరు క్షేమమేనా? నీ ముఖకవళికలను బట్టి నీ మనస్సులో స్వస్థత లేదని నాకు తెలియుచునే యున్నది.

అదితిరువాచ ।
భద్రం ద్విజగవాం బ్రహ్మన్ ధర్మస్యాస్య జనస్య చ ।
త్రివర్గస్య పరం క్షేత్రం గృహమేధిన్ గృహా ఇమే ॥ 11

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, ద్విజగవామ్ - వేదవేత్తలకు గోవులకు, ధర్మస్య - ధర్మమునకు, అస్య - ఈ, జనస్య చ - జనమునకు కూడ, భద్రమ్ - మంగళము, గృహమేధిన్ - ఓ గృహస్థుడా!, ఇమే - ఈ, గృహాః - ఇల్లు, త్రివర్గస్య - ధర్మార్థకామములకు, పరమ్ - గొప్ప, క్షేత్రమ్ - నివాస స్థానము.

అదితి ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! వేదవేత్తలకు, గోవులకు, ధర్మమునకు, ఈ జనులకు కూడ మంగళమే. నీవు గొప్ప గృహస్థుడవు. నీ ఈ గృహము ధర్మార్థకామములకు నివాస స్థానము.

అగ్నయోఽతిథయో భృత్యా భిక్షవో యే చ లిప్సవః ।
సర్వం భగవతో బ్రహ్మన్ననుధ్యానాన్న రిష్యతి ॥ 12

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, అగ్నయః - అగ్నులు, అతిథయః - అతిథులు, భృత్యాః - సేవకులు, యే చ - ఎవరైతే, లిప్సవః - ఆకాంక్ష గలవారు గలరో వారు, భగవతః - పూజనీయుడవగు మీయొక్క, అనుధ్యా

నాత్ - నిరంతరమగు ధ్యానము వలన, సర్వమ్ - సర్వము, న రిష్యతి - లోటు లేకుండ నున్నది.

ఓ మహర్షీ! అగ్నులను, అతిథులను, భృత్యులను, ఆకాంక్ష గల ఇతరులను నేను సత్కరించితిని. నేను నిరంతరముగా పూజనీయుడవగు మిమ్ములనే ధ్యానించుటచే, నాకు సర్వము లోటు లేకుండ నున్నది.

కో ను మే భగవన్ కామో న సంపద్యేత మానసః ।
యస్యా భవాన్ ప్రజాధ్యక్ష ఏవం ధర్మాన్ ప్రభాషతే ॥ 13

భగవన్ - ఓ పూజనీయా!, మే - నాయొక్క, మానసః - మనస్సునందుండే, కః ను - ఏ, కామః - కోరిక, న సంపద్యేత - సంపన్నము కాకుండును?, యస్యాః - ఏ నాకు, ప్రజా-అధ్యక్షః - ప్రజాపతివగు, భవాన్ - నీవు, ఏవమ్ - ఈ విధముగా, ధర్మాన్ - ధర్మములను, ప్రభాషతే - బోధించుచున్నావో.

ఓ పూజనీయా! ప్రజాపతివగు నీవు నాకు ఈ విధముగా ధర్మములను బోధించుచుండగా, నా మనస్సులోనుండే ఏ కోరిక సంపన్నము కాకుండును?

తవైవ మారీచ మనశ్శరీరజాః
ప్రజా ఇమాస్సత్త్వరజస్తమోజుషః ।
సమో భవాంస్తాస్వసురాదిషు ప్రభో
తథాపి భక్తం భజతే మహేశ్వరః ॥ 14

మారీచ - ఓ మరీచిపుత్రా!, సత్త్వరజః-తమః-జుషః - సత్త్వరజస్తమోగుణములు గల, ఇమాః - ఈ, ప్రజాః - ప్రాణులు, తవ - నీయొక్క, మనః-శరీరజాః ఏవ - మనస్సు శరీరములనుండి పుట్టినవారు మాత్రమే, ప్రభో - ఓ ప్రభూ!, తాసు - ఆ, అసుర-ఆదిషు - రాక్షసులు మొుగలగువారియందు, భవాన్ - నీవు, సమః - సముడవు, తథాపి - అయినప్పటికి, మహేశ్వరః - మహేశ్వరుడు, భక్తమ్ - భక్తుని, భజతే - సేవించును.

ఓ మరీచిపుత్రా! సత్త్వరజస్తమోగుణములతో తాదాత్మ్యమును చెంది జీవించే ఈ ప్రాణులు నీ మనస్సునుండి, శరీరమునుండి పుట్టినవారు మాత్రమే. ఓ ప్రభూ! రాక్షసులు మొదలైన ఈ ప్రాణులయందు నీవు సమ మగు చిత్తము గలవాడవు. కాని, మహేశ్వరుడు కూడ భక్తుని సేవించును. (నీవు కూడ అట్లే చేయవలెను).

తస్మాదీశ భజంత్యా మే శ్రేయశ్చింతయ సువ్రత ।
హృతశ్రియో హృతస్థానాన్ సపత్నైః పాహి నః ప్రభో ।। 15

ఈశ - ఓ ఈశ్వరా!, సువ్రత - గొప్ప వ్రతనిష్ఠ గలవాడా!, ప్రభో - ఓ ప్రభూ!, భజంత్యాః - సేవించుచున్న, మే - నాయొక్క, శ్రేయః - హిత మును గురించి, చింతయ - ఆలోచించుము, సపత్నైః - శత్రువులచే, హృతశ్రియః - అపహరించబడిన సంపద కలిగినట్టియు, హృతస్థానాన్ - అపహరించబడిన స్థానములు గల, నః - మమ్ములను, పాహి - రక్షించు ము.

ఓ ఈశ్వరా! నీవు గొప్ప వ్రతనిష్ఠ గలవాడవు. ఓ ప్రభూ! నిన్ను సేవించే నాయొక్క హితమును గురించి నీవు ఆలోచించుము. శత్రువులు మా సంపదను, స్థానమును అపహరించినారు. అట్టి మమ్ములను రక్షించు ము.

పరైర్వివాసితా సాఽహం మగ్నా వ్యసనసాగరే ।
ఐశ్వర్యం శ్రీర్యశః స్థానం హృతాని ప్రబలైర్మమ ।। 16

ప్రబలైః - బలశాలురగు, పరైః - శత్రువులచే, మమ - నాయొక్క, ఐశ్వర్యమ్ - ఈశ్వరభావము, శ్రీః - సంపద, యశః - కీర్తి, స్థానమ్ - స్థాన ము, హృతాని - అపహరించ బడినవి, సా - అట్టి, అహమ్ - నేను, వివా సితా - స్థానమునుండి బహిష్కరించబడినదాననై, వ్యసనసాగరే - దుఃఖస ముద్రమునందు, మగ్నా - మునిగియున్నాను.

బలశాలురగు శత్రువులు నా ఈశ్వరభావము (అధికారము) ను, సంపదను, కీర్తిని అపహరించినారు. వారు మా నివాసస్థానమును ఆక్రమిం

చుకొని మమ్ములను బయటకు త్రోసివేసినారు. అట్టి నేను దుఃఖసముద్ర
ములో మునిగియున్నాను.

యథా తాని పునస్సాధో ప్రపద్యేరన్ మమాత్మజాః ।
తథా విధేహి కల్యాణం ధియా కల్యాణకృత్తమ ।। 17

సాధో - ఓ మహాత్మా!, కల్యాణకృత్తమ - కల్యాణమును చేయువా
రిలో అగ్రేసరా!, మమ - నాయొక్క, ఆత్మజాః - పుత్రులు, యథా - ఏ
విధముగానైతే, తాని - వాటిని, పునః - మరల, ప్రపద్యేరన్ - పొందెదరో,
తథా - ఆ విధముగా, ధియా - సంకల్పముతో, కల్యాణమ్ - మంగళము
ను, విధేహి - సంపాదించుము.

ఓ మహాత్మా! కల్యాణమును చేయువారిలో నీవు అగ్రేసరుడవు.
నా పుత్రులు తిరిగి వాటిని మరల పొందే విధముగా నీవు సంకల్పించి,
వారికి మంగళమును సంపాదించుము.

శ్రీశుక ఉవాచ ।
ఏవమభ్యర్థితోఽదిత్యా కస్తామాహ స్మయన్నివ ।
అహో మాయాబలం విష్ణోస్స్నేహబద్ధమిదం జగత్ ।। 18

అదిత్యా - అదితిచే, ఏవమ్ - ఈ విధముగా, అభ్యర్థితః - ప్రార్థిం
చబడిన, కః - ప్రజాపతి, స్మయన్ ఇవ - చిరునవ్వు నవ్వుచున్నవాడు వలె,
తామ్ - ఆమెను ఉద్దేశించి, ఆహ - పలికెను, అహో - ఆహా!, విష్ణోః -
విష్ణువుయొక్క, మాయాబలమ్ - మాయయొక్క బలము, ఇదమ్ - ఈ,
జగత్ - జగత్తు, స్నేహబద్ధమ్ - ఆసక్తిచే బంధించబడి యున్నది.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- అదితి ఈ విధముగా ప్రార్థించ
గా, కశ్యప ప్రజాపతి చిరునవ్వుతో ఆమెతో నిట్లనెను -- విష్ణు
మాయయొక్క బలము ఆశ్చర్యమును కలిగించును. ఈ జగత్తు ఆసక్తిచే
బంధించబడి యున్నది.

క్వ దేహో భౌతికోఽనాత్మా క్వ చాత్మా ప్రకృతేః పరః ।
కస్య కే పతిపుత్రాద్యా మోహ ఏవ హి కారణమ్ ।। 19

భౌతికః - పంచభూతములతో నిర్మించబడిన, అనాత్మా - ఆత్మ కాని, దేహః - దేహము, క్వ - ఎక్కడ?, ప్రకృతేః - ప్రకృతికంటె, పరః - అతీతమైన, ఆత్మా - ఆత్మ, క్వ - ఎక్కడ?, పతిపుత్ర-ఆద్యాః - భర్త పుత్రుడు మొదలగువారు, కస్య - ఎవనివారు?, కే - ఎవరు?, మోహః ఏవ - మోహము మాత్రమే, కారణం హి - కారణము గదా!

పంచభూతములతో నిర్మించబడిన అనాత్మయగు దేహము ఎక్కడ? ప్రకృతికంటె అతీతమైన ఆత్మ ఎక్కడ? భర్త, పుత్రుడు మొదలగు వారు ఎవరు? ఎవరి వారు? వ్యామోహమే ఈ సంసారమునకు కారణము.

ఉపతిష్ఠస్వ పురుషం భగవంతం జనార్దనమ్ ।
సర్వభూతగుహావాసం వాసుదేవం జగద్గురుమ్ ॥ 20

పురుషమ్ - పూర్ణుడైనట్టియు, జన-అర్దనమ్ - దుష్టులను శిక్షించునట్టియు, సర్వభూతగుహా-ఆవాసమ్ - సకలప్రాణుల హృదయము అనే గుహయందు నివసించునట్టియు, జగద్-గురుమ్ - జగత్తునకు గురువు అగు, భగవంతం వాసుదేవమ్ - వాసుదేవ భగవానుని, ఉపతిష్ఠస్వ - ఆరాధించుము.

పూర్ణుడు, దుష్టజనశిక్షకుడు అగు వాసుదేవుడు సకలప్రాణుల హృదయములో ఆత్మరూపముగా నివసించి యున్నాడు. జగత్తునకు తండ్రి యగు ఆ భగవానుని ఆరాధించుము.

స విధాస్యతి తే కామాన్ హరిర్దీనానుకంపనః ।
అమోఘా భగవద్భక్తిర్నేతరేతి మతిర్మమ ॥ 21

దీన-అనుకంపనః - దీనులపై దయ గల, సః - ఆ, హరిః - శ్రీహరి, తే - నీయొక్క, కామాన్ - కోరికలను, విధాస్యతి - తీర్చగలడు, భగవద్-భక్తిః - భగవంతునియందలి భక్తి, అమోఘా - మొక్కవోనిది, ఇతరా - మరో ఉపాయము, న - లేదు, ఇతి - అని, మమ - నాయొక్క, మతిః - అభిప్రాయము.

దీనులపై దయ గల ఆ శ్రీహరి నీ కోరికలను తీర్చగలడు. భగవద్భక్తి వ్యర్థము కాదు. మరో ఉపాయము లేదని నా అభిప్రాయము.

అదితిరువాచ ।
కేనాహం విధినా బ్రహ్మన్నుపస్థాస్యే జగత్పతిమ్ ।
యథా మే సత్యసంకల్పో విదధ్యాత్స మనోరథమ్ ॥ 22

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, అహమ్ - నేను, కేన - ఏ, విధినా - విధానముచే, జగత్-పతిమ్ - జగన్నాథుడగు శ్రీహరిని, ఉపస్థాస్యే - ఆరాధించగలను?, యథా - ఏ విధముగానైతే, సత్యసంకల్పః - సత్యమైన సంకల్పము గల, సః - ఆ శ్రీహరి, మే - నాయొక్క, మనోరథమ్ - కోరికను, విదధ్యాత్ - పూర్తి చేయునో.

అదితి ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! జగన్నాథుడు, సత్యసంకల్పుడు అగు శ్రీహరిని నేను ఏ విధానముతో ఆరాధించినచో, ఆయన నా మనోరథమునీడేర్చును?

ఆదిశ త్వం ద్విజశ్రేష్ఠ విధిం తదుపధావనమ్ ।
ఆశు తుష్యతి మే దేవస్సీదంత్యాస్సహ పుత్రకైః ॥ 23

ద్విజశ్రేష్ఠ - వేదవేత్తలలో శ్రేష్ఠుడైనవాడా!, తద్-ఉపధావనమ్ - ఆయన ఆరాధనను, విధిమ్ - విధానమును, త్వమ్ - నీవు, ఆదిశ - ఉపదేశించుము, పుత్రకైః సహ - పుత్రులతో గూడి, సీదంత్యాః - చాల దుఃఖించుచున్న, మే - నాకు, దేవః - శ్రీహరి దేవుడు, ఆశు - తొందరగా, తుష్యతి - ప్రసన్నుడగునో.

ఓ మహర్షీ! నీవు వేదవేత్తలలో అగ్రగణ్యుడవు. నేను నా పుత్రులతో గూడి చాల దుఃఖమును పొందియున్నాను. నాకు శ్రీహరి దేవుడు తొందరగా ప్రసన్నమయ్యే ఆరాధనను, ఆ విధానమును నీవు ఉపదేశించుము.

కశ్యప ఉవాచ ।
ఏతన్మే భగవాన్ పృష్టః ప్రజాకామస్య పద్మజః ।
యదాహ తే ప్రవక్ష్యామి వ్రతం కేశవతోషణమ్ ॥ 24

ప్రజాకామస్య - సంతానమును కోరే, మే - నాకు, పృష్టః - ప్రశ్నించబడిన, భగవాన్ - పూజనీయుడగు, పద్మజః - పద్మసంభవుడగు బ్రహ్మగారు, యత్ - దేనిని, ఆహ - చెప్పెనో, తే - నీ కొరకు, ఏతత్ - ఈ, కేశవతోషణమ్ - కేశవుని ప్రసన్నుని చేసే, వ్రతమ్ - వ్రతమును, ప్రవక్ష్యామి - చెప్పగలను.

కశ్యప ప్రజాపతి ఇట్లు పలికెను --- నేను సంతానమును కోరి పూజనీయుడు, పద్మసంభవుడు అగు బ్రహ్మగారిని ప్రశ్నించగా, ఆయన నాకు ఈ వ్రతమును చెప్పినాడు. దీని వలన కేశవుడు ప్రసన్నుడగును. దీనిని నీకు నేను ఉపదేశించ గలను.

ఫాల్గునస్యామలే పక్షే ద్వాదశాహం పయోవ్రతః ।
అర్చయేదరవిందాక్షం భక్త్యా పరమయాన్వితః ॥ 25

ఫాల్గునస్య - ఫాల్గున మాసముయొక్క, అమలే పక్షే - శుక్ల పక్షమునందు, ద్వాదశ-అహమ్ - పన్నెండు రోజుల వరకు, పయః-వ్రతః - పాలను మాత్రమే త్రాగుట అనే నియమము గలవాడై, అరవింద-అక్షమ్ - పద్మమువంటి కన్నులు గల శ్రీహరిని, పరమయా - గొప్ప, భక్త్యా - భక్తితో, అన్వితః - కూడినవాడై, అర్చయేత్ - పూజించవలెను.

ఫాల్గునమాసములో శుక్లపక్షమునందు పన్నెండు రోజులు కేవలము పాలను మాత్రమే త్రాగుతూ గొప్ప భక్తితో కూడినవాడై పద్మములవంటి కన్నులు గల శ్రీహరిని ఆరాధించవలెను.

సినీవాల్యాం మృదాఽఽలిప్య స్నాయాత్క్రోడవిదీర్ణయా ।
యది లభ్యేత వై స్రోతస్యేతం మంత్రముదీరయేత్ ॥ 26

సినీవాల్యామ్ - అమావాస్యనాడు, యది లభ్యేత - లభించే పక్షములో, క్రోడవిదీర్ణయా - వరాహముచే కలిచివేయబడిన, మృదా - మట్టితో, ఆలిప్య - లేపము చేసుకొని, వై - నిశ్చయముగా, స్రోతసి - నదియందు, స్నాయాత్ - స్నానమును చేయవలెను, ఏతమ్ - ఈ, మంత్రమ్ - మంత్రమును, ఉదీరయేత్ - ఉచ్చరించవలెను.

అమావాస్యనాడు లభించే పక్షములో వరాహము కలిచివేసిన మట్టితో లేపము చేసుకొని నదిలో స్నానమును చేయవలెను. ఈ మంత్ర మునుచ్చరించవలెను.

త్వం దేవ్యాదివరాహేణ రసాయాః స్థానమిచ్ఛతా ।
ఉద్ధృతాసి నమస్తుభ్యం పాప్మానం మే ప్రణాశయ ।। 27

దేవి - ఓ భూదేవీ!, స్థానమ్ - స్థానమును, ఇచ్ఛతా - కోరే, ఆది వరాహేణ - జగత్కారణుడగు వరాహ భగవానునిచే, త్వమ్ - నీవు, రసాయాః - రసాతలమునుండి, ఉద్ధృతా - పైకి తీసుకు రాబడినదానవు, అసి - అగుదువు, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము, మే - నాయొక్క, పాప్మానమ్ - పాపమును, ప్రణాశయ - పూర్తిగా నశింప జేయు ము.

ఓ భూదేవీ! జగత్కారణుడగు వరాహ భగవానుడు ప్రాణులకు స్థానమును కల్పించ గోరి, నిన్ను రసాతలమునుండి పైకి తీసుకు వచ్చినా డు. నీకు నమస్కారము. నా పాపమును పూర్తిగా నశింప జేయుము.

నిర్వర్తితాత్మనియమో దేవమర్చేత్సమాహితః ।
అర్చాయాం స్థండిలే సూర్యే జలే వహ్నౌ గురావపి ।। 28

నిర్వర్తిత-ఆత్మనియమః - నిర్వహించబడిన తన నిత్యనైమిత్తిక ములు గలవాడై, సమాహితః - ఏకాగ్రచిత్తుడై, దేవమ్ - శ్రీహరి దేవుని, అర్చాయామ్ - విగ్రహమునందు, స్థండిలే - దర్భాదులచే సంస్కరించబ డిన వేదియందు, సూర్యే - సూర్యునియందు, జలే - నీటియందు, వహ్నౌ - అగ్నియందు, గురౌ - గురువునందు కూడ, అర్చేత్ - పూజించవలెను.

సాధకుడు తన నిత్యనైమిత్తికములను నిర్వహించుకొని ఏకాగ్రచిత్త ముతో శ్రీహరి దేవుని విగ్రహము, దర్భలచే సంస్కరించబడిన వేది, సూర్యుడు, నీరు, అగ్ని మరియు గురువులయందు పూజించవలెను.

నమస్తుభ్యం భగవతే పురుషాయ మహీయసే ।
సర్వభూతనివాసాయ వాసుదేవాయ సాక్షిణే ।। 29

మహీయసే పురుషాయ - పురుషోత్తముడవైనట్టియు, సర్వభూత నివాసాయ - సర్వభూతములకు ఆశ్రయమైనట్టియు (సర్వభూతములలో నివసించునట్టియు), సాక్షిణే - సాక్షివైనట్టియు, వాసుదేవాయ భగవతే - వాసుదేవ భగవానుడవగు, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము.

ఓ వాసుదేవ భగవానుడా! సకలప్రాణులకు ఆశ్రయమైన నీవు సకలప్రాణులలో సాక్షిచైతన్యరూపముగా నున్నావు. ఓ పురుషోత్తమా! నీకు నమస్కారము (అని స్తుతించవలెను).

నమోఽవ్యక్తాయ సూక్ష్మాయ ప్రధానపురుషాయ చ ।
చతుర్వింశద్గుణజ్ఞాయ గుణసంఖ్యానహేతవే ॥ 30

అవ్యక్తాయ - ఇంద్రియగోచరుడు కానట్టియు, సూక్ష్మాయ - సూక్ష్మమగు చైతన్యమే స్వరూపముగా కలిగినట్టియు, ప్రధానపురుషాయ చ - ప్రకృతి చైతన్యము తానే అయినవాడు, చతుర్వింశద్-గుణజ్ఞాయ - ఇరవై నాలుగు తత్త్వములు తెలిసినట్టియు, గుణసంఖ్యానహేతవే - తత్త్వ పరిగణనమునకు కారణమైన శ్రీహరికి, నమః - నమస్కారము.

శ్రీహరి అత్యంతసూక్ష్మమగు చైతన్యమే స్వరూపముగా గలవాడు గాన, ఇంద్రియములకు గాని మనస్సునకు గాని గోచరము కాడు. ప్రకృతి, ప్రాణులు అనే రెండింటి రూపముగా ఆయనయే ప్రకటమైనాడు. శ్రీహరియే సాంఖ్యశాస్త్రాచార్యుడుగా అవతరించి, ఇరవై నాలుగు తత్త్వములను దర్శించి పరిగణించినాడు. అట్టి శ్రీహరికి నమస్కారము.

మూలప్రకృతి, మహత్తత్త్వము (సమష్టి బుద్ధిశక్తి), సమష్టి అహంకారము, అయిదు సూక్ష్మభూతములు, అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కర్మేంద్రియములు, మనస్సు, అయిదు స్థూలభూతములు అనునవి ఇరవై నాలుగు తత్త్వములు.

నమో ద్విశీర్ష్ణే త్రిపదే చతుశ్శృంగాయ తంతవే ।
సప్తహస్తాయ యజ్ఞాయ త్రయీవిద్యాత్మనే నమః ॥ 31

ద్విశీర్ష్ణే - రెండు తలలు కలిగినట్టియు, త్రిపదే - మూడు పాద ములు కలిగినట్టియు, చతుః-శృంగాయ - నాలుగు కొమ్ములు కలిగినట్టియు, తంతవే - ఫలములను విస్తరింప జేయునట్టియు, సప్తహస్తాయ - ఏడు చేతులు కలిగినట్టియు, త్రయీవిద్యా-ఆత్మనే - మూడు వేదముల జ్ఞానమే స్వరూపముగా గల, యజ్ఞాయ - యజ్ఞమే స్వరూపముగా గల శ్రీహరి కొరకు, నమః - నమస్కారము.

స్వర్గాది ఫలములను విస్తరింప జేసే యజ్ఞమే స్వరూపముగా గల శ్రీహరికి ప్రాయణీయము, ఉదయనీయము అనే రెండు కర్మలు రెండు తలలవంటివి; ప్రాతః, మధ్యాహ్న, సాయంసవనములు మూడు పాదములు వంటివి; ఋగ్-యజుః-సామ-అథర్వణవేదములే నాలుగు కొమ్ములు వంటివి; గాయత్రి, ఉష్ణిక్, పంక్తి, త్రిష్టుప్, అనుష్టుప్, బృహతి మొదలైన ఏడు ఛందస్సులు ఏడు చేతులు వంటివి; యజ్ఞమునకు మూలము ఋగ్-యజుః-సామవేదములు. అట్టి శ్రీహరికి నమస్కారము.

నమశ్శివాయ రుద్రాయ నమశ్శక్తిధరాయ చ ।
సర్వవిద్యాధిపతయే భూతానాం పతయే నమః ॥ 32

శివాయ - మంగళస్వరూపుడైనట్టియు, రుద్రాయ - ప్రళయమును చేయునట్టియు, శక్తిధరాయ చ - శక్తులను ధరించునట్టియు, సర్వవిద్యా-అధిపతయే - సకలవిద్యలకు మూలస్థానమైనట్టియు, భూతానామ్ - ప్రాణులకు, పతయే - రక్షకుడైన శ్రీహరి కొరకు, నమః నమః నమః - అనేక నమస్కారములు.

మంగళస్వరూపుడగు శ్రీహరియే ప్రళయములో సర్వమును నశింప జేయును. సకలశక్తులను ధరించే ఆయనయే సకలవిద్యలకు మూలస్థానము. ప్రాణులకు రక్షకుడగు అట్టి శ్రీహరికి అనేక నమస్కారములు.

నమో హిరణ్యగర్భాయ ప్రాణాయ జగదాత్మనే ।
యోగైశ్వర్యశరీరాయ నమస్తే యోగహేతవే ॥ 33

హిరణ్యగర్భాయ - తేజోమయుడవైనట్టియు (సమష్టి బుద్ధిశక్తి స్వరూపుడైనట్టియు), ప్రాణాయ - సమష్టి క్రియాశక్తి స్వరూపుడవైనట్టియు, జగద్-ఆత్మనే - జగద్రూపుడవైనట్టియు, యోగ-ఐశ్వర్యశరీరాయ - యోగము దాని సిద్ధులు శరీరముగా కలిగినట్టియు, యోగహేతవే - యోగమునకు కారణమైన, తే - నీ కొరకు, నమః నమః - అనేక నమస్కారములు.

జగత్తు రూపముగా వెలిసిన ఓ శ్రీహరీ! తేజోమయుడవగు నీవే సమష్టి బుద్ధిశక్తి-క్రియాశక్తుల రూపముగా నున్నావు. నీవు యోగప్రవర్తకుడవు మాత్రమే గాక, యోగము మరియు దాని సిద్ధులు నీ శరీరమే. నీకు అనేక నమస్కారములు.

నమస్త ఆదిదేవాయ సాక్షిభూతాయ తే నమః ।
నారాయణాయ ఋషయే నరాయ హరయే నమః ॥ 34

ఆదిదేవాయ - జగత్కారణుడవు ప్రకాశస్వరూపుడవు అయిన, తే - నీ కొరకు, నమః - నమస్కారము, సాక్షిభూతాయ - సాక్షిస్వరూపుడవైనట్టియు, నారాయణాయ - నారాయణుడవైనట్టియు, ఋషయే - మహర్షియగు, నరాయ - నరుని కొరకు, హరయే - పాపములను పోగొట్టే, తే - నీ కొరకు, నమః నమః - అనేక నమస్కారములు.

ఓ శ్రీహరీ! ప్రకాశ స్వరూపుడవగు నీవే జగత్కారణము. సకలప్రాణులలో సాక్షిరూపుడవై ఉండే నీవే నర-నారాయణ మహర్షుల రూపములో అవతరించితివి. పాపములను పోగొట్టే నీకు అనేక నమస్కారములు.

నమో మరకతశ్యామవపుషేఽధిగతశ్రియే ।
కేశవాయ నమస్తుభ్యం నమస్తే పీతవాససే ॥ 35

మరకతశ్యామవపుషే - మరకతమాణిక్యము వలె శ్యామల వర్ణము గల దేహము కలిగినట్టియు, అధిగతశ్రియే - పొందబడిన లక్ష్మీదేవి కలిగినట్టియు, కేశవాయ - కేశవుడవగు, తుభ్యమ్ - నీ కొరకు, నమః -

నమస్కారము, పీతవాససే - పీతాంబరుడవగు, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

ఓ కేశవా! మరకత మాణిక్యము వలె శ్యామలమైన దేహము గల నిన్ను లక్ష్మీదేవి చేరి సేవించుచున్నది. పీతాంబరుడవగు నీకు అనేక నమస్కారములు.

త్వం సర్వవరదః పుంసాం వరేణ్య వరదర్షభ ।
అతస్తే శ్రేయసే ధీరాః పాదరేణుముపాసతే ॥ 36

పుంసాం వరేణ్య - ఓ పురుషోత్తమా!, వరద-ఋషభ - వరముల నిచ్చువారిలో శ్రేష్ఠుడా!, త్వమ్ - నీవు, సర్వవరదః - సకలములైన వరములనిచ్చువాడవు, అతః - ఇందువలన, ధీరాః - వివేకులు, శ్రేయసే - మోక్షము కొరకు, తే - నీయొక్క, పాదరేణుమ్ - పాదధూళిని, ఉపాసతే - ఉపాసించెదరు.

ఓ పురుషోత్తమా! నీవు వరములనిచ్చువారిలో అగ్రేసరుడవు. సకలవరములనిచ్చువాడవు నీవే. కావుననే, వివేకులు మోక్షము కొరకై నీ పాద ధూళిని ఉపాసించెదరు.

అన్వవర్తంత యం దేవాశ్శ్రీశ్చ తత్పాదపద్మయోః ।
స్పృహయంత ఇవామోదం భగవాన్మే ప్రసీదతామ్ ॥ 37

తత్-పాదపద్మయోః - ఆయనయొక్క పద్మములవంటి పాదములయొక్క, ఆమోదమ్ - పరిమళమును, స్పృహయంతః ఇవ - కోరుచున్నవారు వలె, యమ్ - ఎవనిని, దేవాః - దేవతలు, శ్రీః చ - లక్ష్మీదేవి కూడ, అన్వవర్తంత - సేవించిరో, భగవాన్ - ఆ శ్రీహరి భగవానుడు, మే - నా కొరకు, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!

శ్రీహరియొక్క పాదపద్మముల పరిమళమునందు లోభము గలవారా యన్నట్లు దేవతలు, లక్ష్మీదేవి కూడ ఆయనను సేవించిరి. అట్టి శ్రీహరి భగవానుడు నా కొరకు ప్రసన్నుడగు గాక!

ఏతైర్మంత్రైర్హృషీకేశమావాహనపురస్కృతమ్ ।
అర్చయేచ్ఛ్రద్ధయా యుక్తః పాద్యోపస్పర్శనాదిభిః ।। 38

శ్రద్ధయా - శ్రద్ధతో, యుక్తః - కూడియున్న సాధకుడు, ఏతైః - ఈ, మంత్రైః - మంత్రములతో, హృషీకేశమ్ - ఇంద్రియాధిపతియగు శ్రీహరిని, ఆవాహనపురస్కృతమ్ - ఆవాహన పూర్వకముగా, పాద్య-ఉపస్పర్శన-ఆదిభిః - పాద్యము ఆచమనము మొదలగువాటితో, అర్చయేత్ - పూజించవలెను.

సాధకుడు శ్రద్ధతో కూడినవాడై ముందుగా ఇంద్రియాధిపతియగు శ్రీహరిని ఆహ్వానించి ఈ మంత్రములతో పాద్యము, ఆచమనము మొదలగు ఉపచారములను సమర్పించి పూజించవలెను.

అర్చిత్వా గంధమాల్యాద్యైః పయసా స్నపయేద్విభుమ్ ।
వస్త్రోపవీతాభరణపాద్యోపస్పర్శనైస్తతః ।
గంధధూపాదిభిశ్చార్చేద్ద్వాదశాక్షరవిద్యయా ।। 39

విభుమ్ - శ్రీహరి ప్రభుని, గంధమాల్య-ఆద్యైః - గంధము పుష్పమాలలు మొదలగువాటితో, అర్చిత్వా - పూజించి, పయసా - పాలతో (నీటితో), స్నపయేత్ - స్నానము చేయించవలెను, తతః - తరువాత, వస్త్ర-ఉపవీత-ఆభరణపాద్య-ఉపస్పర్శనైః - వస్త్రములు యజ్ఞోపవీతములు ఆభరణములు పాద్యము ఆచమనములచే, గంధధూప-ఆదిభిః చ - గంధము ధూపము మొదలగువాటితో కూడ, ద్వాదశ-అక్షరవిద్యయా - పన్నెండు అక్షరముల మంత్రముతో, అర్చేత్ - పూజించవలెను.

శ్రీహరి ప్రభుని సాధకుడు పాద్యము, ఆచమనము, పాలతో అభిషేకము, శుద్ధోదక స్నానము, వస్త్రములు, యజ్ఞోపవీతములు, ఆభరణములు, గంధము, పుష్పమాలలు, ధూపము, దీపము మొదలగు ఉపచారములతో పన్నెండు అక్షరముల మంత్రమును (ఓం నమో భగవతే వాసుదేవాయ) ఉచ్చరిస్తూ పూజించవలెను.

శృతం పయసి నైవేద్యం శాల్యన్నం విభవే సతి ।
ససర్పిస్సగుడం దత్త్వా జుహుయాన్మూలవిద్యయా ।। 40

విభవే - సంపద, సతి - ఉన్నచో, పయసి - పాలయందు, శృతమ్ - వేడిచేయబడిన, ససర్పిః - నేతితో కూడిన, సగుడమ్ - బెల్లముతో కూడిన, శాలి-అన్నమ్ - వరి అన్నమును, నైవేద్యమ్ - నైవేద్యమును, దత్త్వా - ఇచ్చి, మూలవిద్యయా - మూలమంత్రముతో, జుహుయాత్ - హోమము చేయవలెను.

సంపద ఉన్నచో నెయ్యి, బెల్లము వేసి వరి బియ్యముతో పాయసము వండి నైవేద్యము పెట్టి, పన్నెండు అక్షరముల మూలమంత్రముతో హోమము కూడ చేయవలెను.

నివేదితం తద్భక్తాయ దద్యాద్భుంజీత వా స్వయమ్ ।
దత్త్వాఽఽచమనమర్చిత్వా తాంబూలం చ నివేదయేత్ ।। 41

తత్ - ఆ, నివేదితమ్ - నైవేద్యమును, భక్తాయ - భక్తుని కొరకు, దద్యాత్ - ఈయవలెను, వా - లేక, స్వయమ్ - తానే, భుంజీత - తినవలెను, ఆచమనమ్ - ఆచమనమును, దత్త్వా - ఇచ్చి, అర్చిత్వా - పూజించి, తాంబూలం చ - తాంబూలమును కూడ, నివేదయేత్ - నివేదించవలెను.

ఆ నైవేద్యమును భక్తునకు ఈయవలెను. లేదా, తానే తినవలెను. నైవేద్యము తరువాత శ్రీహరికి ఆచమనమునిచ్చి పూజించి, తాంబూలమును కూడ నివేదించవలెను.

జపేదష్టోత్తరశతం స్తువీత స్తుతిభిః ప్రభుమ్ ।
కృత్వా ప్రదక్షిణం భూమౌ ప్రణమేద్దండవన్ముదా ।। 42

అష్ట-ఉత్తరశతమ్ - నూట యెనిమిది సార్లు, జపేత్ - జపించవలెను, ప్రభుమ్ - ప్రభువును, స్తుతిభిః - స్తోత్రములతో, స్తువీత - స్తుతించవలెను, ప్రదక్షిణమ్ - ప్రదక్షిణమును, కృత్వా - చేసి, ముదా - ఆనందముతో, భూమౌ - నేలపై, దండవత్ - కర్రవలె, ప్రణమేత్ - ప్రణమిల్లవలెను.

నూట యెనిమిది సార్లు మూలమంత్రమును జపించి, ప్రభుని స్తోత్రములతో స్తుతించవలెను. తరువాత ఆనందముతో ప్రదక్షిణము చేసి సాష్టాంగ నమస్కారమును చేయవలెను.

కృత్వా శిరసి తచ్ఛేషాం దేవముద్వాసయేత్తతః ।
ద్వ్యవరాన్ భోజయేద్విప్రాన్ పాయసేన యథోచితమ్ ॥43

తత్-శేషమ్ - ఆ శ్రీహరియొక్క నిర్మాల్యమును, శిరసి - తలపై, కృత్వా - ఉంచుకొని, తతః - తరువాత, దేవమ్ - శ్రీహరి దేవుని, ఉద్వాసయేత్ - ఉద్వాసన చెప్పవలెను, ద్వి-అవరాన్ - కనీసము ఇద్దరిని, విప్రాన్ - వేదవేత్తలను, యథా-ఉచితమ్ - తగిన పద్ధతిగా, పాయసేన - పాయసముతో, భోజయేత్ - భుజింప జేయవలెను.

ఆ శ్రీహరి నిర్మాల్యమును తలపై ఉంచుకొని, శ్రీహరి దేవునకు ఉద్వాసన చెప్పవలెను. కనీసము ఇద్దరు వేదవేత్తలకు తగిన విధముగా పాయసముతో భోజనము పెట్టవలెను.

భుంజీత తైరనుజ్ఞాతశ్శేషం సేష్టస్సభాజితైః ।
బ్రహ్మచార్యథ తద్రాత్ర్యాం శ్వోభూతే ప్రథమేఽహని ॥ 44

స్నాతశ్శుచిర్యథోక్తేన విధినా సుసమాహితః ।
పయసా స్నాపయిత్వార్చేద్యావద్వ్రతసమాపనమ్ ॥ 45

సభాజితైః - సత్కరించబడిన, తైః - వారిచే, అనుజ్ఞాతః - అనుమతి ఈయబడినవాడై, శేషమ్ - మిగిలిన ఆహారమును, స-ఇష్టః - బంధువులతో గూడినవాడై, భుంజీత - భుజించవలెను, అథ - తరువాత, తద్-రాత్ర్యామ్ - ఆ రాత్రియందు, బ్రహ్మచారీ - బ్రహ్మచారియై, శ్వః-భూతే - తెల్లవారగా, ప్రథమే అహని - పాడ్యమినాడు, స్నాతః - స్నానము చేసినవాడై, శుచిః - శుచియై, యథా-ఉక్తేన - శాస్త్రోక్తమైన, విధినా - విధితో, సుసమాహితః - మిక్కలి సావధానుడై, పయసా - పాలతో, స్నపయిత్వా - స్నానము చేయించి, అర్చేత్ - పూజించవలెను, వ్రతసమాపనం యావత్ - వ్రతము పూర్తి అయ్యేవరకు.

ఆ వేదవేత్తలను సత్కరించి వారి అనుమతితో మిగిలిన ఆహార మును బంధువులతో కలిసి భుజించవలెను. ఆ రాత్రి బ్రహ్మచర్యమును పాటించవలెను. తెల్లవారిన తరువాత మరునాడు (అనగా పాడ్యమినాడు) స్నానము చేసి శుచియై శాస్త్రోక్తవిధానముతో మిక్కిలి సావధానుడై శ్రీహ రికి పాలతో అభిషేకము చేసి పూజించవలెను. ఈ విధముగా వ్రతము పూర్తి అయ్యేవరకు పూజను చేయవలెను.

పయోభక్షో వ్రతమిదం చరేద్విష్ణ్వర్చనాదృతః ।
పూర్వవజ్జుహుయాదగ్నిం బ్రాహ్మణాంశ్చాపి భోజయేత్॥46

పయః-భక్షః - పాలను ఆహారముగా తీసుకొనువాడై, విష్ణు-అర్చ నా-ఆదృతః - విష్ణువును అర్చించుటయందు ఆదరము గలవాడై, ఇదమ్ - ఈ, వ్రతమ్ - వ్రతమును, చరేత్ - ఆచరించ వలెను, పూర్వవత్ - ఇది వరలో వలెనే, అగ్నిమ్ - అగ్నిని, జుహుయాత్ - హోమము చేయవలెను, బ్రాహ్మణాన్ చ అపి - బ్రాహ్మణులను కూడ, భోజయేత్ - భుజింప జేయ వలెను.

సాధకుడు పాలను ఆహారముగా తీసుకుంటూ విష్ణువును పూజిం చుటయందు ఆదరము గలవాడై ఈ వ్రతమునాచరించవలెను. ఇదివరలో చెప్పినట్లుగానే, అగ్నిలో హోమమును చేసి, బ్రాహ్మణులకు భోజనమును కూడ పెట్టవలెను.

ఏవం త్వహరహః కుర్యాద్ద్వాదశాహం పయోవ్రతః ।
హరేరారాధనం హోమమర్హణం ద్విజతర్పణమ్ ॥ 47

ఏవం తు - ఈ విధముగానైతే, ద్వాదశ-అహమ్ - పన్నెండు రోజులు, అహః-అహః - ప్రతి దినము, పయః-వ్రతః - పాలను త్రాగుటయే వ్రతముగా గలవాడై, హరేః - శ్రీహరియొక్క, ఆరాధనమ్ - ఆరాధనను, హోమమ్ - హోమమును, అర్హణమ్ - పూజను, ద్విజతర్పణమ్ - బ్రాహ్మ ణులకు తృప్తిని కలిగించుటను, కుర్యాత్ - చేయవలెను.

ఈ విధముగా పన్నెండు దినములు ప్రతి దినము పాలను మాత్రమే ఆహారముగా తీసుకుంటూ, శ్రీహరి ఆరాధన, హోమము, పూజ, బ్రాహ్మణ భోజనములను చేయవలెను.

ప్రతిపద్దినమారభ్య యావచ్ఛుక్లత్రయోదశీ ।
బ్రహ్మచర్యమధస్స్వప్నం స్నానం త్రిషవణం చరేత్ ।। 48

ప్రతిపద్-దినమ్ - పాడ్యమిని, అరభ్య - ఆరంభించి, శుక్లత్రయోదశీ యావత్ - శుక్ల త్రయోదశి వరకు, బ్రహ్మచర్యమ్ - బ్రహ్మచర్యమును, అధః-స్వప్నమ్ - క్రింద పరుండుటను, త్రిషవణమ్ - మూడు పూటలా, స్నానమ్ - స్నానమును, చరేత్ - చేయవలెను.

సాధకుడు ఫాల్గున శుక్ల పాడ్యమినాడు మొదలిడి శుక్ల త్రయోదశి వరకు బ్రహ్మచర్యము, క్రింద పరుండుట, మూడు పూటలా స్నానము అనే నియమములను పాటించవలెను.

వర్జయేదసదాలాపం భోగానుచ్చావచాంస్తథా ।
అహింస్రస్సర్వభూతానాం వాసుదేవపరాయణః ।। 49

అసద్-ఆలాపమ్ - అసద్ భాషణమును, తథా - మరియు, ఉచ్చావచాన్ - పెద్ద చిన్న, భోగాన్ - భోగములను, వర్జయేత్ - విడిచి పెట్టవలెను, సర్వభూతానామ్ - సకలప్రాణులకు, అహింస్రః - హింసను చేయనివాడు, వాసుదేవపరాయణః - వాసుదేవుని మాత్రమే నిరంతరముగా స్మరించువాడు.

అసద్-భాషణము (అసత్యమును పలుకుట, దుష్టులతోడి సంభాషణము, దుష్టములైన విషయములకు చెందిన సంభాషణము) ను, మరియు చిన్న పెద్ద భోగములను విడిచి పెట్టవలెను. ఏ ప్రాణికైననూ హింసను చేయరాదు. వాసుదేవుని మాత్రమే నిరంతరముగా స్మరించవలెను.

త్రయోదశ్యామథో విష్ణోస్స్నపనం పంచకైర్విభోః ।
కారయేచ్ఛాస్త్రదృష్టేన విధినా విధికోవిదైః ।। 50

అథో - తరువాత, త్రయోదశ్యామ్ - త్రయోదశి నాడు, విష్ణోః విభోః - విష్ణుప్రభునకు, పంచకైః - పంచామృతములతో, స్నపనమ్ - అభిషేకమును, శాస్త్రదృష్టేన - శాస్త్రోక్తమైన, విధినా - విధానముతో, విధికోవిదైః - శాస్త్రమునందు నిష్ణాతులైనవారిచే, కారయేత్ - చేయించవలెను.

తరువాత త్రయోదశి నాడు విష్ణు ప్రభునకు పంచామృత (పాలు, పెరుగు, నెయ్యి, తేనె, పానకము) ములతో శాస్త్రోక్తమైన విధానముతో శాస్త్రమునందు నిష్ణాతులైనవారిచే చేయించవలెను.

పూజాం చ మహతీం కుర్యాద్విత్తశాఠ్యవివర్జితః ।
చరుం నిరూప్య పయసి శిపివిష్టాయ విష్ణవే ॥ 51

శృతేన తేన పురుషం యజేత సుసమాహితః ।
నైవేద్యం చాతిగుణవద్దద్యాత్పురుషతుష్టిదమ్ ॥ 52

విత్తశాఠ్యవివర్జితః - డబ్బును వెనుక వేసుకోవాలనే దుర్బుద్ధిని విడనాడినవాడై, మహతీమ్ - పెద్ద, పూజాం చ - పూజను కూడ, కుర్యాత్ - చేయవలెను, శిపివిష్టాయ - అంతర్యామియగు, విష్ణవే - విష్ణువు కొరకు, పయసి - పాలయందు, చరుమ్ - అన్నమును, నిరూప్య - సంపాదించి, శృతేన - వండబడిన, తేన - దానితో, సుసమాహితః - మిక్కిలి ఏకాగ్రమగు చిత్తము గలవాడై, పురుషమ్ - పురుషోత్తముని, యజేత - పూజించవలెను, అతిగుణవత్ - అధికమగు గుణము కలిగినట్టియు, పురుషతుష్టిదమ్ - పురుషోత్తమునకు ప్రీతిని ఇచ్చే, నైవేద్యం చ - నైవేద్యమును కూడ, దద్యాత్ - ఈయవలెను.

సాధకుడు డబ్బు ఖర్చు తగ్గించాలనే దుర్బుద్ధిని విడనాడి పూజను పెద్ద యెత్తున చేయవలెను. అంతర్యామియగు విష్ణువు కొరకు పాయసమును వండి తయారు చేసి, మిక్కిలి ఏకాగ్రమగు చిత్తముతో దానితో పురుషోత్తముని పూజించ వలెను. అధికమగు గుణము గల నైవేద్యమును ఇచ్చి పురుషోత్తమునకు ప్రీతిని కలిగించవలెను.

ఆచార్యం జ్ఞానసంపన్నం వస్త్రాభరణధేనుభిః ।
తోషయేదృత్విజశ్చైవ తద్విద్ధ్యారాధనం హరేః ।। 53

జ్ఞానసంపన్నమ్ - జ్ఞానముతో సంపన్నుడైన, ఆచార్యమ్ - ఆచార్యుని, ఋత్విజః చ ఏవ - ఋత్విక్కులను కూడ, వస్త్ర-ఆభరణధేనుభిః - వస్త్రములు ఆభరణములు గోవులతో, తోషయేత్ - సంతోషపెట్టవలెను, తత్ - అది, హరేః - శ్రీహరియొక్క, ఆరాధనమ్ - ఆరాధనమని, విద్ధి - తెలుసుకొనుము.

ఆచార్యుడు జ్ఞానముతో సంపన్నుడై యుండవలెను. ఆచార్యునకు, ఋత్విక్కులకు వస్త్రములను, ఆభరణములను, గోవులను ఇచ్చి సంతోషపెట్టవలెను. అదియే శ్రీహరియొక్క ఆరాధనమని తెలుసుకొనుము.

భోజయేత్తాన్ గుణవతా సదన్నేన శుచిస్మితే ।
అన్యాంశ్చ బ్రాహ్మణాన్ శక్త్యా యే చ తత్ర సమాగతాః ।।54

శుచిస్మితే - స్వచ్ఛమగు చిరునగవుదానా!, తాన్ - వారిని, అన్యాన్ - ఇతరులగు, బ్రాహ్మణాన్ చ - బ్రాహ్మణులను కూడ, శక్త్యా - శక్తితో, గుణవతా - రుచ్యమైన, సద్-అన్నేన - శుద్ధమగు ఆహారముతో, భోజయేత్ - భుజింప జేయవలెను, యే చ - ఎవరైతే, తత్ర - అచటకు, సమాగతాః - వచ్చిరో.

ఓ అదితీ! నీ చిరునగవు చాల స్వచ్ఛముగా నున్నది సుమా! ఆచార్యునకు, ఋత్విక్కులకు, ఇతర బ్రాహ్మణులకు, అక్కడకు అప్పుడు వచ్చిన ఇతరులకు యథాశక్తిగా రుచ్యమైన శుద్ధమగు ఆహారమును సమర్పించవలెను.

దక్షిణాం గురవే దద్యాదృత్విగ్భ్యశ్చ యథార్హతః ।
అన్నాద్యేనాశ్వపాకాంశ్చ ప్రీణయేత్సముపాగతాన్ ।। 55

గురవే - ఆచార్యుని కొరకు, ఋత్విగ్భ్యః చ - ఋత్విక్కుల కొరకు కూడ, యథా-అర్హతః - వారి అర్హతలను అతిక్రమించకుండా, దక్షి

ణామ్ - దక్షిణను, దద్యాత్ - ఈయవలెను, సముపాగతాన్ - వచ్చినవారిని, ఆశ్వపాకాన్ చ - మిక్కిలి దురాచారులైనవారిని కూడ, అన్న-ఆద్యేన - రుచ్యమైన ఆహారముతో, ప్రీణయేత్ - ప్రీతిని కలిగించవలెను.

ఆచార్యునకు, ఋత్విక్కులకు వారి వారి అర్హతలకు తగ్గట్లుగా దక్షిణలనీయవలెను. వచ్చినవారు ఎంతటి దురాచారులైననూ (కసాయిలే అయిననూ), వారికి రుచ్యమైన ఆహారమునిచ్చి సంతోషపెట్టవలెను.

భుక్తవత్సు చ సర్వేషు దీనాంధకృపణేషు చ ।
విష్ణోస్తత్ప్రీణనం విద్వాన్ భుంజీత సహ బంధుభిః ।। 56

సర్వేషు - అందరు, దీన-అంధకృపణేషు చ - దీనులు గ్రుడ్డివారు అసమర్థులు కూడ, భుక్తవత్సు చ - భుజించినవారు కాగా, తత్ - అది, విష్ణోః - విష్ణువునకు, ప్రీణనమ్ - ప్రీతిని కలిగించునది అని, విద్వాన్ - తెలుసుకున్నవాడై, బంధుభిః సహ - బంధువులతో గూడి, భుంజీత - భుజించవలెను.

దీనులు, గ్రుడ్డివారు, అసమర్థులు (కుంటివారు మొదలైనవారు) అందరు భుజించిన తరువాత సాధకుడు బంధువులతో గూడి భుజించవలెను. ఈ విధముగా అతిథులను సత్కరించుటచే విష్ణువునకు ప్రీతి కలుగునని ఆ సాధకుడు గుర్తించవలెను.

నృత్యవాదిత్రగీతైశ్చ స్తుతిభిస్స్వస్తివాచకైః ।
కారయేత్తత్కథాభిశ్చ పూజాం భగవతోఽన్వహమ్ ।। 57

నృత్యవాదిత్రగీతైః - నాట్యములు వాద్యములు గానములతో, స్తుతిభిః - స్తోత్రములతో, స్వస్తివాచకైః చ - స్వస్తివాచనములతో కూడ, తత్-కథాభిః చ - ఆ శ్రీహరియొక్క గాథలతో, అను-అహమ్ - ప్రతిదినము, భగవతః - భగవానుని, పూజామ్ - పూజను, కారయేత్ - చేయించవలెను.

ప్రతిదినము నాట్యములు, వాద్యములు, గానములు, స్తోత్రములు, స్వస్తివాచనములు, శ్రీహరియొక్క గాథలు అనువాటితో శ్రీహరియొక్క ఆరాధనను చేయించవలెను.

ఏతత్పయోవ్రతం నామ పురుషారాధనం పరమ్ ।
పితామహేనాభిహితం మయా తే సముదాహృతమ్ ।। 58

ఏతత్ - ఈ, పయోవ్రతం నామ - పయోవ్రతము అని ప్రసిద్ధి చెందిన, పరమ్ - సర్వోత్తమమైన, పురుష-ఆరాధనమ్ - పురుషోత్తముని ఆరాధనము, పితామహేన - బ్రహ్మగారిచే, అభిహితమ్ - ఉపదేశించబడి నది, మయా - నాచే, తే - నీ కొరకు, సముదాహృతమ్ - విస్తారముగా చెప్పబడినది.

పయోవ్రతమని ప్రసిద్ధి చెందిన ఈ వ్రతము పురుషోత్తముని ఆరా ధించే సర్వోత్తమమైన పద్ధతి. దీనిని బ్రహ్మగారు ఉపదేశించిరి. దీనిని నీకు నేను విస్తారముగా చెప్పితిని.

త్వం చానేన మహాభాగే సమ్యక్ చీర్ణేన కేశవమ్ ।
ఆత్మనా శుద్ధభావేన నియతాత్మా భజావ్యయమ్ ।। 59

మహాభాగే - ఓ మహానుభావురాలా!, త్వం చ - నీవు కూడ, సమ్యక్ - చక్కగా, చీర్ణేన - అనుష్ఠించబడిన, అనేన - ఈ వ్రతము ద్వారా, శుద్ధభావేన - శుద్ధమగు భక్తిగల, ఆత్మనా - చిత్తముతో, నియత-ఆత్మా - వశము చేసుకొనబడిన మనస్సు గలదానవై, అవ్యయమ్ - వినాశ రహితుడగు, కేశవమ్ - శ్రీహరిని, భజ - ఆరాధించుము.

ఓ మహానుభావురాలా! నీవు కూడ ఈ వ్రతమును శుద్ధమగు భక్తి గల చిత్తముతో చక్కగా అనుష్ఠించుము. మనస్సును వశము చేసుకొని వినాశ రహితుడగు శ్రీహరిని ఆరాధించుము.

అయం వై సర్వయజ్ఞాఖ్యస్సర్వవ్రతమితి స్మృతమ్ ।
తపస్సారమిదం భద్రే దానం చేశ్వరతర్పణమ్ ।। 60

అయమ్ - ఈ వ్రతము, సర్వయజ్ఞ-ఆఖ్యః - సర్వయజ్ఞము అనే పేరు గలది, వై - నిశ్చయము, ఈశ్వరతర్పణమ్ - ఈశ్వరునకు ప్రీతిని కలిగించేది, సర్వవ్రతమ్ - సర్వవ్రతము, ఇతి - అని, స్మృతః - చెప్పబడి నది, భద్రే - ఓ కల్యాణీ!, ఇదమ్ - ఇది, తపః-సారమ్ - తపస్సుయొక్క సారము, దానం చ - దానము కూడ.

ఓ కల్యాణీ! సర్వయజ్ఞము, సర్వవ్రతము అని ప్రసిద్ధి బడసిన ఈ వ్రతము నిశ్చయముగా ఈశ్వరునకు ప్రీతికరము. ఇది తపస్సుల సారము. ఇదియే గొప్ప దానము.

త ఏవ నియమాస్సాక్షాత్త ఏవ చ యమోత్తమాః ।
తపో దానం వ్రతం యజ్ఞో యేన తుష్యత్యధోక్షజః ।। 61

తే ఏవ - అవియే, నియమాః - నియమములు, తే ఏవ చ - అవియే, యమ-ఉత్తమాః - యమములలో ఉత్తమమైనవి, తపః - తపస్సు, దానమ్ - దానము, వ్రతమ్ - వ్రతము, యజ్ఞః - యజ్ఞము, యేన - దేనిచే, సాక్షాత్ - సాక్షాత్తుగా, అధోక్షజః - ప్రమాణగోచరుడు కాని శ్రీహరి, తుష్యతి - ప్రసన్నుడగునో.

వేటిచే సాక్షాత్తుగా అధోక్షజుడు (ప్రమాణములకు గోచరము కాని శ్రీహరి) ప్రసన్నుడగునో, అవియే నియమములు, అవియే ఉత్తమమగు యమములు, అదియే తపస్సు, అదియే దానము, అదియే వ్రతము, అదియే యజ్ఞము.

తస్మాదేతద్వ్రతం భద్రే ప్రయతా శ్రద్ధయా చర ।
భగవాన్ పరితుష్టస్తే వరానాశు విధాస్యతి ।। 62

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే వామనావతారే
కశ్యపేన పయోవ్రతోపదేశవర్ణనం నామ షోడశోఽధ్యాయః ।।

భద్రే - ఓ కల్యాణీ!, తస్మాత్ - కావున, ఏతత్ - ఈ, వ్రతమ్ - వ్రతమును, ప్రయతా - నియమవతివై, శ్రద్ధయా - శ్రద్ధతో, చర - అనుష్ఠించుము, భగవాన్ - భగవానుడు, తే - నీ కొరకు, ఆశు - శీఘ్రముగా, పరి

తుష్టః - ప్రసన్నుడై, వరాన్ - వరములను, విధాస్యతి - సంపన్నము చేయగలడు.

ఓ కల్యాణీ! కావున నీవు నియమముతో శ్రద్ధగా ఈ వ్రతమును అనుష్ఠించుము. భగవానుడు నీపై ప్రసన్నుడై శీఘ్రముగా నీ మనోరథములను సంపన్నము చేయగలడు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
వామనావతారవృత్తాంతములో కశ్యపుడు అదితికి
పయోవ్రతమును ఉపదేశించుటను వర్ణించే
పదునారవ అధ్యాయము ముగిసినది (**16**).

*****

# అథ సప్తదశోऽధ్యాయః

## వామనావతారము - అదితికి శ్రీహరి దర్శనమిచ్చుట

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుక్తా సాऽదితీ రాజన్ స్వభర్త్రా కశ్యపేన వై ।
అన్వతిష్ఠద్వ్రతమిదం ద్వాదశాహమతంద్రితా ।। 1

రాజన్ - ఓ మహారాజా!, ఇతి - ఈ విధముగా, స్వభర్త్రా - తన భర్తయగు, కశ్యపేన - కశ్యపునిచే, ఉక్తా - ఉపదేశించబడిన, సా - ఆ, అదితిః - అదితి, వై - నిశ్చయముగా, అతంద్రితా - ఏమరుపాటు లేనిదై, ద్వాదశ-అహమ్ - పన్నెండు రోజులు, ఇదమ్ - ఈ, వ్రతమ్ - వ్రతమును, అను-అతిష్ఠత్ - అనుష్ఠించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! తన భర్తయగు కశ్యపుడీ విధముగా ఉపదేశించగా, ఆ అదితి సుతరాము ఏమరుపాటు లేనిదై పన్నెండు రోజులు ఈ వ్రతమును అనుష్ఠించెను.

చింతయంత్యేకయా బుద్ధ్యా మహాపురుషమీశ్వరమ్ ।
ప్రగృహ్యేంద్రియదుష్టాశ్వాన్మనసా బుద్ధిసారథిః ।। 2

బుద్ధిసారథిః - బుద్ధియే సారథిగా గల అదితి, ఇంద్రియదుష్ట-అశ్వాన్ - ఇంద్రియములనే పొగరుమోతు గుర్రములను, మనసా - మనస్సుతో, ప్రగృహ్య - కళ్లెముతో అదుపు చేసి, ఈశ్వరమ్ - సర్వేశ్వరుడగు, మహాపురుషమ్ - పురుషోత్తముని, ఏకయా - స్థిరమగు, బుద్ధ్యా - బుద్ధితో, చింతయంతీ - ధ్యానించుచున్నది.

దేహము అనే రథమునకు బుద్ధియే సారథి కాగా ఆ అదితి మనస్సు అనే కళ్లెముతో ఇంద్రియములనే పొగరుమోతు గుర్రములను

అదుపు చేసెను. ఆమె స్థిరమగు బుద్ధితో సర్వేశ్వరుడగు పురుషోత్తముని ధ్యానించుచుండెను.

మనశ్చైకాగ్రయా బుద్ధ్యా భగవత్యఖిలాత్మని ।
వాసుదేవే సమాధాయ చచార హి పయోవ్రతమ్ ॥ 3

ఏకాగ్రయా - ఏకాగ్రమగు, బుద్ధ్యా - బుద్ధితో, అఖిల-ఆత్మని - సర్వమునకు ఆత్మయగు, వాసుదేవే భగవతి - వాసుదేవ భగవానునియందు, మనః - మనస్సును, సమాధాయ - నిలిపి, పయోవ్రతమ్ - పయోవ్రతమును, చచార హి - అనుష్ఠించెను.

ఆమె ఏకాగ్రమగు బుద్ధితో సర్వమునకు ఆత్మరూపుడగు వాసుదేవ భగవానునియందు మనస్సును నిలిపి పయోవ్రతము ననుష్ఠించెను.

తస్యాః ప్రాదురభూత్తాత భగవానాదిపూరుషః ।
పీతవాసాశ్చతుర్బాహుశ్శంఖచక్రగదాధరః ॥ 4

తాత - వత్సా!, ఆదిపూరుషః - జగత్కారణుడు పూర్ణుడు, పీతవాసాః - పీతాంబరుడు, చతుర్బాహుః - నాలుగు చేతులు గలవాడు, శంఖచక్రగదాధరః - శంఖమును చక్రమును గదను ధరించువాడు అగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, తస్యాః - ఆమెకు, ప్రాదుః-అభూత్ - ప్రత్యక్షమయ్యెను.

ఓ వత్సా! జగత్కారణమగు పూర్ణ పరబ్రహ్మ నాలుగు చేతులు గల శ్రీహరియై ఆమెకు ప్రత్యక్షమయ్యెను. పీతాంబరుడగు ఆ శ్రీహరి శంఖమును, చక్రమును, గదను ధరించి యుండెను.

తం నేత్రగోచరం వీక్ష్య సహసోత్థాయ సాదరమ్ ।
ననామ భువి కాయేన దండవత్ప్రీతివిహ్వలా ॥ 5

నేత్రగోచరమ్ - కళ్లకు కనబడుచున్న, తమ్ - ఆ శ్రీహరిని, వీక్ష్య - చూచి, సహసా - వెంటనే, స-ఆదరమ్ - ఆదరపూర్వకముగా, ఉత్థాయ

- లేచి, ప్రీతివిహ్వలా - ప్రేమచే విహ్వలయై, కాయేన - దేహముతో, భువి - నేలపై, దండవత్ - కర్రవలె, ననామ - నమస్కరించెను.

తన కళ్లముందు ప్రత్యక్షమైన ఆ శ్రీహరిని చూచి అదితి వెంటనే ఆదరపూర్వకముగా లేచి నిలబడి, ప్రేమతో పరవశించి సాష్టాంగ నమస్కారమును చేసెను.

సోత్థాయ బద్ధాంజలిరీడితుం స్థితా నోత్సేహ ఆనందజలాకులేక్షణా,
బభూవ తూష్ణీం పులకాకులాకృతిస్తద్దర్శనాత్యుత్సవగాత్రవేపథుః।

సా - ఆమె, ఉత్థాయ - పైకి లేచి, బద్ధ-అంజలిః - కట్టబడిన దోసిలి గలదియై, స్థితా - నిలబడెను, ఆనందజల-ఆకుల-ఈక్షణా - ఆనందబాష్పములచే కలవరమైన కన్నులు గలది, పులక-ఆకుల-ఆకృతిః - గగుర్పాటుచే కలవరపడిన దేహము గలది, తద్-దర్శన-అతి-ఉత్సవగాత్రవేపథుః - ఆ శ్రీహరిని దర్శించుటచే కలిగిన సమధికమగు ఉత్సాహముచే దేహమునందు వణుకు గలది అగు అదితి, ఈడితుమ్ - స్తుతించుటకు, న ఉత్సేహే - సమర్థురాలు కాలేదు, తూష్ణీమ్ - మాటలాడకుండగా, బభూవ - ఉండెను.

ఆమె పైకి లేచి దోసిలి యొగ్గి నిలబడెను. ఆమె కన్నులలో ఆనందబాష్పములు నిండెను. దేహమంతయు గగుర్పాటుతో కలవరమయ్యెను. శ్రీహరి దర్శనము వలన కలిగిన సమధికమగు ఉత్సాహముచే ఆమె దేహము వణకుచుండెను. ఈ స్థితిలో ఆమె స్తుతించాలనుకున్నా స్తుతించే సామర్థ్యము లేక మిన్నకుండెను.

ప్రీత్యా శనైర్గద్గదయా గిరా హరిం
తుష్టావ సా దేవ్యదితిః కురూద్వహ ।
ఉద్వీక్షతీ సా పిబతీవ చక్షుషా
రమాపతిం యజ్ఞపతిం జగత్పతిమ్ ॥ 7

కురు-ఉద్వహ - ఓ కురువంశ శ్రేష్ఠా!, సా - ఆ, అదితిః దేవీ - అదితి దేవి, ప్రీత్యా - ప్రేమతో, శనైః - మెల్లగా, గద్గదయా - బొంగురుపో

యిన, గిరా - వాక్కుతో, హరిమ్ - శ్రీహరిని, తుష్టావ - స్తుతించెను, రమా పతిమ్ - లక్ష్మీపతి అయినట్టియు, యజ్ఞపతిమ్ - యజ్ఞేశ్వరుడైనట్టియు, జగత్-పతిమ్ - జగన్నాథుడైన శ్రీహరిని, ఉద్-వీక్షతీ - తల పైకెత్తి చూచు చున్న ఆమె, చక్షుషా - కంటితో, పిబతి ఇవ - పానము చేయుచున్నదా యన్నట్లుండెను.

ఓ కురువంశ శ్రేష్ఠా! ఆ అదితి దేవి ప్రేమతో బొంగురువోయిన వాక్కుతో మెల్లగా లక్ష్మీపతియగు శ్రీహరిని స్తుతించెను. ఆమె తలను పైకెత్తి జగన్నాథుడగు ఆ యజ్ఞేశ్వరుని కన్నులతో త్రాగుచున్నదా యన్నట్లు చూచుచుండెను.

అదితిరువాచ ।
యజ్ఞేశ యజ్ఞపురుషాచ్యుత తీర్థపాద
తీర్థశ్రవశ్శ్రవణమంగళనామధేయ ।
ఆపన్నలోకవృజినోపశమోదయాద్య
శం నః కృధీశ భగవన్నసి దీననాథః ।। 8

యజ్ఞ-ఈశ - ఓ యజ్ఞేశ్వరా!, యజ్ఞపురుష - ఓ యజ్ఞరూపము లోనుండే పురుషోత్తమా!, అచ్యుత - స్వరూపమునుండి జారిపోవుట లేని వాడా!, తీర్థపాద - పావనము చేసే పాదములు గలవాడా!, తీర్థశ్రవః - పావనము చేసే కీర్తి గలవాడా!, శ్రవణమంగళనామధేయ - వినుటచే మంగళము చేసే నామము గలవాడా!, ఆపన్నలోకవృజిన-ఉపశమ-ఉదయ - ఆపత్తులోనున్న భక్తజనుల దుఃఖమును చల్లార్చుట కొరకై అవత రించువాడా!, ఆద్య - సర్వజగత్కారణా!, ఈశ - ఓ ఈశ్వరా!, నః - మాకు, శమ్ - సుఖమును, కృధి - చేయుము, భగవన్ - ఓ భగవానుడా!, దీననాథః - దీనులకు రక్షకుడవు, అసి - అగుచున్నావు.

అదితి ఇట్లు పలికెను --- యజ్ఞము రూపములో ప్రకటమైన ఓ పురుషోత్తమా! యజ్ఞమునకు ఫలమునిచ్చువాడవు నీవే. నీకు స్వరూపము నుండి చ్యుతి లేదు. నీ పాదములు భక్తులను పావనము చేయును. పావనము చేసే గంగ నీ పాదములనుండి పుట్టినది. నీ కీర్తి గానము చేయువా

రిని పావనము చేయును. నీ నామమును వినుటచే మంగళము కలుగును. నీవు ఆపదలోనున్న భక్తుల దుఃఖమును చల్లార్చుటకై అవతరించెదవు. సర్వజగత్కారణుడవగు ఓ ఈశ్వరా! మాకు సుఖమును కలుగజేయుము. ఓ భగవానుడా! నీవు దీనులకు రక్షకుడవు.

సాక్షాత్తు శ్రీహరియే యజ్ఞము రూపముగా ప్రకటమగుచున్నాడని, యజ్ఞో వై విష్ణుః, మొదలగు శ్రుతులు వక్కాణించుచున్నవి.

విశ్వాయ విశ్వభవనస్థితిసంయమాయ
స్వైరం గృహీతపురుశక్తిగుణాయ భూమ్నే ।
స్వస్థాయ శశ్వదుపబృంహితపూర్ణబోధ-
వ్యాపాదితాత్మతమసే హరయే నమస్తే ॥ 9

విశ్వాయ - జగద్రూపుడవైనట్టియు, విశ్వభవనస్థితిసంయమాయ - జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు మూలమైనట్టియు, స్వైరమ్ - యథేచ్ఛగా, గృహీతపురుశక్తిగుణాయ - స్వీకరించబడిన గొప్ప మాయాశక్తియొక్క గుణములు కలిగినట్టియు, భూమ్నే - దేశకాలములకు అతీతుడవైనట్టియు, స్వస్థాయ - తన స్వరూపమునందుండునట్టియు, శశ్వద్-ఉపబృంహితపూర్ణబోధవ్యాపాదిత-ఆత్మతమసే - నిత్యము వర్ధిల్లజేయబడిన పూర్ణమైన జ్ఞానముచే నిరాకరించబడిన తనయందలి తమస్సు కలిగినట్టియు, హరయే - పాపహారివగు, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

ఓ శ్రీహరీ! నీవు నీ ఇచ్ఛచే గొప్ప మాయాశక్తియొక్క రజస్సత్త్వతమోగుణములను ఉపాధిగా స్వీకరించి క్రమముగా జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు కారణమై, నీవే జగద్రూపముగా వెలసినావు. దేశకాలములకు అతీతమైన నీవు శాశ్వతకాలము వర్ధిల్లే పూర్ణజ్ఞానస్వరూపమునందు నిలిచి తమస్సునకు అతీతుడవై యున్నావు. నీకు నమస్కారము.

పరమేశ్వరుడు జగత్తును సృష్టించి, రక్షించి, ఉపసంహరించుట మాత్రమే గాక, జగత్తు రూపముగా కూడ పరమేశ్వరుడే గలడు అనేది ఉపనిషత్తుల మౌలికమగు సిద్ధాంతము.

ఆయుః పరం వపురభీష్టమతుల్యలక్ష్మీః
ద్యోభూరసాస్సకలయోగగుణాస్త్రివర్గః ।
జ్ఞానం చ కేవలమనంత భవంతి తుష్టాత్
త్వత్తో నృణాం కిము సపత్న జయాదిరాశీః ॥ 10

అనంత - ఓ అనంతా!, తుష్టాత్ - ప్రసన్నుడవైన, త్వత్తః - నీ నుండి, నృణామ్ - మానవులకు, పరమ్ - బ్రహ్మగారి ఆయుర్దాయముతో సమానమైన, ఆయుః - ఆయుర్దాయము, అభీష్టమ్ - అభీష్టమైన, వపుః - దేహము, అతుల్యలక్ష్మీః - సాటిలేని సంపద, ద్యోభూరసాః - స్వర్గము భూలోకము రసాతలములు, సకలయోగగుణాః - సకలములైన యోగసిద్ధులు, త్రివర్గః - ధర్మార్థకామములు, కేవలమ్ - అపరోక్షమైన, జ్ఞానం చ - ఆత్మజ్ఞానము కూడ, భవంతి - కలుగుచున్నవి, సపత్నజయ-ఆదిః - శత్రువులపై విజయము మొదలైన, ఆశీః - కోరిక, కిము - చెప్పునదేమున్నది?

ఓ అనంతా! ప్రసన్నుడవైన నీ నుండి మానవులకు బ్రహ్మగారి ఆయుర్దాయము, అభీష్టమైన దేహము (బలము, రూపము), సాటిలేని సంపద, స్వర్గము, పృథివి, రసాతలము, ధర్మార్థకామములు, అపరోక్షమగు ఆత్మజ్ఞానము కూడ లభించును. శత్రువులపై విజయము మొదలైన కామనలు లభించునని వేరుగా చెప్పవలయునా?

శ్రీశుక ఉవాచ ।
అదిత్యైవం స్తుతో రాజన్ భగవాన్ పుష్కరేక్షణః ।
క్షేత్రజ్ఞస్సర్వభూతానామితి హోవాచ భారత ॥ 11

రాజన్ - ఓ మహారాజా!, భారత - భరత వంశీయుడా!, పుష్కర-ఈక్షణః - పద్మములవంటి కన్నులు గలవాడు, సర్వభూతానామ్ - సకల ప్రాణులలో, క్షేత్రజ్ఞః - దేహాదులకు సాక్షియై ఉండే, భగవాన్ - శ్రీహరి భగవానుడు, అదిత్యా - అదితిచే, ఏవమ్ - ఈ విధముగా, స్తుతః - స్తుతించబడినవాడై, ఇతి - ఈ విధముగా, ఉవాచ హ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- భరత వంశీయుడవగు ఓ మహారాజా! పద్మములవంటి కన్నులు గల శ్రీహరియే సకలప్రాణులలో దేహాదులకు సాక్షియగు ఆత్మరూపుడై యున్నాడు. అదితి ఈ తీరున స్తుతించగా, ఆ భగవానుడు ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
దేవమాతర్భవత్యా మే విజ్ఞాతం చిరకాంక్షితమ్ ।
యత్సపత్నైర్హృతశ్రీణాం చ్యావితానాం స్వధామతః ।। 12

దేవమాతః - దేవతల తల్లివగు ఓ అదితీ!, భవత్యాః - నీయొక్క, సపత్నైః - శత్రువులచే, హృతశ్రీణామ్ - అపహరించబడిన సంపదలు కలిగినట్టియు, స్వధామతః - తమ స్థానమునుండి, చ్యావితానామ్ - జారిపోవునట్లు చేయబడిన దేవతలయొక్క, చిరకాంక్షితమ్ - చిరకాలమునుండి కోరబడినది, యత్ - ఏది గలదో అది, మే - నాకు, విజ్ఞాతమ్ - తెలియబడినది.

శ్రీభగవానుడిట్లు పలికెను --- ఓ అదితీ! నీవు దేవమాతవు. దేవతల సంపదను శత్రువులు అపహరించి వారిని తమ స్థానమునుండి వెళ్లగొట్టినారు. అట్టి దేవతలకు, నీకు చిరకాలమునుండి ఉన్న ఆకాంక్ష నాకు తెలియును.

తాన్ వినిర్జిత్య సమరే దుర్మదానసురర్షభాన్ ।
ప్రతిలబ్ధజయశ్రీభిః పుత్రైరిచ్ఛస్యుపాసితుమ్ ।। 13

దుర్మదాన్ - మిక్కిలి గర్వించియున్న, తాన్ - ఆ, అసుర-ఋషభాన్ - రాక్షసశ్రేష్ఠులను, సమరే - యుద్ధమునందు, వినిర్జిత్య - జయించి, ప్రతిలబ్ధజయశ్రీభిః - తిరిగి పొందబడిన జయలక్ష్మిగల, పుత్రైః - పుత్రులతో గూడి, ఉపాసితుమ్ - ఉపాసించుటకు, ఇచ్ఛసి - కోరుచున్నావు.

మిక్కిలి గర్వించియున్న ఆ రాక్షసశ్రేష్ఠులను యుద్ధములో ఓడించి తిరిగి జయలక్ష్మిని పొందిన పుత్రులతో గూడి నీవు భగవానుని ఉపాసించ గోరుచున్నావు.

ఇంద్రజ్యేష్ఠైస్స్వతనయైర్హతానాం యుధి విద్విషామ్ ।
స్త్రియో రుదంతీరాసాద్య ద్రష్టుమిచ్ఛసి దుఃఖితాః ॥ 14

ఇంద్రజ్యేష్ఠైః - ఇంద్రుడు పెద్ద కొడుకైయున్న, స్వతనయైః - నీ పుత్రులచే, యుధి - యుద్ధమునందు, హతానామ్ - సంహరించబడిన, విద్విషామ్ - శత్రువులయొక్క, రుదంతీః - ఏడ్చుచున్న, దుఃఖితాః - దుఃఖితలైయున్న, స్త్రియః - భార్యలను, ఆసాద్య - నీ స్థానమును పొంది, ద్రష్టుమ్ - చూచుటకు, ఇచ్ఛసి - కోరుచున్నావు.

నీ పెద్ద కొడుకగు ఇంద్రుడు మరియు ఇతరపుత్రులు యుద్ధములో శత్రువులను సంహరించగా నీవు తిరిగి నీ స్థానమును పొంది, యుద్ధములో తమ భర్తలు మరణించగా దుఃఖముతో ఏడ్చుచున్న శత్రువుల భార్యలను నీవు చూడగోరుచున్నావు.

ఆత్మజాన్ సుసమృద్ధాంస్త్వం ప్రత్యాహృతయశశ్శ్రియః ।
నాకపృష్ఠమధిష్ఠాయ క్రీడతో ద్రష్టుమిచ్ఛసి ॥ 15

ప్రతి-ఆహృతయశః-శ్రియః - తిరిగి పొందబడిన కీర్తి సంపద కలిగి నట్టియు, సుసమృద్ధాన్ - మిక్కిలి సమృద్ధులైయున్నట్టియు, నాకపృష్ఠమ్ - స్వర్గమును, అధిష్ఠాయ - అధిష్ఠించి, క్రీడతః - విహరించే, ఆత్మజాన్ - పుత్రులను, త్వమ్ - నీవు, ద్రష్టుమ్ - చూచుటకు, ఇచ్ఛసి - కోరుచున్నావు.

నీ పుత్రులు కీర్తిని, సంపదను తిరిగి పొంది గొప్ప సమృద్ధి గల వారై స్వర్గాధికారమును చేజిక్కించుకొని విహరించుచుండగా, నీవు చూడ గోరుచున్నావు.

ప్రాయోఽధునా తేఽసురయూథనాథా
అపారణీయా ఇతి దేవి మే మతిః ।
యత్తేఽనుకూలేశ్వరవిప్రగుప్తా
న విక్రమస్తత్ర సుఖం దదాతి ॥ 16

దేవి - ఓ దేవీ!, తే - ఆ, అసురయూథనాథాః - రాక్షస సేనానాయకులు, అధునా - ఇప్పుడు, ప్రాయః - హఠాత్తుగా, అపారణీయాః - జయించ దగినవారు కాదు, ఇతి - అని, మే - నాయొక్క, మతిః - అభిప్రాయము, యత్ - ఏలయనగా, తే - వారు, అనుకూల-ఈశ్వరవిప్రగుప్తాః - అనుకూలురు సమర్థులు అగు వేదవేత్తలచే (అనుకూలుడైన ఈశ్వరునిచే మరియు వేదవేత్తలచే) రక్షించబడినవారు, తత్ర - వారియందు, విక్రమః - పరాక్రమము, సుఖమ్ - సుఖమును, న దదాతి - ఈయదు.

ఓ దేవీ! ఆ రాక్షస సేనానాయకులను ఇప్పటికిప్పుడు హఠాత్తుగా జయించుట సంభవము కాదని నా అభిప్రాయము. ఎందుకంటే, అనుకూలుడైన కాలరూపుడగు ఈశ్వరుడు మరియు వారికి అనుకూలురై సమర్థులైన వేదవేత్తలు వారిని రక్షించుచున్నారు. కావున, వారియందు పరాక్రమము చూపినచో, దాని వలన సుఖము కలుగబోదు.

అథాప్యుపాయో మమ దేవి చింత్యః
సంతోషితస్య వ్రతచర్యయా తే ।
మమార్చనం నార్హతి గంతుమన్యథా
శ్రద్ధానురూపం ఫలహేతుకత్వాత్ ॥ 17

దేవి - ఓ దేవీ!, అథాపి - అయినప్పటికీ, తే - నీయొక్క, వ్రతచర్యయా - వ్రతానుష్ఠానముచే, సంతోషితస్య - ప్రీతునిగా చేయబడిన, మమ - నాకు, ఉపాయః - ఉపాయము, చింత్యః - ఆలోచించ దగినది, మమ - నాయొక్క, అర్చనమ్ - పూజ, శ్రద్ధా-అనురూపమ్ - శ్రద్ధకు తగ్గట్లుగా, ఫలహేతుకత్వాత్ - ఫలమునకు కారణమగుచుండుట వలన, అన్యథా - ఫలమునీయకుండా, గంతుమ్ - పోవుటకు, న అర్హతి - తగదు.

ఓ దేవీ! అయినప్పటికీ, దీని విషయములో నేను ఏదేని ఉపాయమును ఆలోచించవలెను. ఎందుకంటే, నీ వ్రతానుష్ఠానముచే నేను మిక్కిలి ప్రసన్నుడనైతిని. నన్ను పూజించినచో, అది శ్రద్ధకు తగ్గట్లుగా ఫలమునిచ్చును. కావున, నా పూజ వ్యర్థము కారాదు.

త్వయార్చితశ్చాహమపత్యగుప్తయే
పయోవ్రతేనానుగుణం సమీడితః ।
స్వాంశేన పుత్రత్వముపేత్య తే సుతాన్
గోప్తాస్మి మారీచతపస్యధిష్ఠితః ॥ 18

అహమ్ - నేను, త్వయా - నీచే, అపత్యగుప్తయే - సంతానము యొక్క రక్షణ కొరకై, పయోవ్రతేన - పయోవ్రతముచే, అనుగుణమ్ - యథోచితముగా, అర్చితః - ఆరాధించబడినవాడను, సమీడితః - చక్కగా స్తుతించబడినవాడను, మారీచతపసి - మరీచుని పుత్రుడగు కశ్యపుని యొక్క తపస్సారమగు తేజస్సునందు, అధిష్ఠితః - అధిష్ఠించినవాడనై, స్వ-అంశేన - నా అంశచే, పుత్రత్వమ్ - పుత్రభావమును, ఉపేత్య - పొంది, తే - నీయొక్క, సుతాన్ - పుత్రులను, గోప్తాస్మి - రక్షించగలను.

నీవు నీ సంతానముయొక్క రక్షణ కొరకై యథోచితముగా పయోవ్రతము చేసి నన్ను ఆరాధించి, చక్కగా స్తుతించితివి. నేను మరీచపుత్రుడగు కశ్యపుని తపస్సారమగు తేజస్సునందు నా అంశచే అధిష్ఠించి నీకు పుత్రుడనై జన్మించి, నీ పుత్రులను రక్షించగలను.

ఉపధావ పతిం భద్రే ప్రజాపతిమకల్మషమ్ ।
మాం చ భావయతీ పత్యావేవంరూపమవస్థితమ్ ॥ 19

భద్రే - ఓ కల్యాణీ!, పత్యౌ - భర్తయందు, ఏవంరూపమ్ - ఇదే రూపము గలవాడనై, అవస్థితమ్ - నిలిచియున్న, మాం చ - నన్ను, భావయతీ - భావన చేయుదానవై, పతిమ్ - భర్తయైనట్టియు, అకల్మషమ్ - దోషరహితుడగు, ప్రజాపతిమ్ - కశ్యప ప్రజాపతిని, ఉపధావ - సేవించుము.

ఓ కల్యాణీ! నీవు నన్ను ఇదే రూపముతో నీ భర్తయందు నిలిచియున్నవానినిగా భావన చేస్తూ, నీ భర్తయగు కశ్యప ప్రజాపతిని సేవించుము. ఆయన తపస్సుచే పరిశుద్ధుడైనాడు.

నైతత్పరస్మా ఆఖ్యేయం పృష్టయాఽపి కథంచన ।
సర్వం సంపద్యతే దేవి దేవగుహ్యం సుసంవృతమ్ ॥ 20

దేవి - ఓ దేవీ!, కథంచన - ఏ విధముగనైననూ, పృష్టయా అపి - ప్రశ్నించబడినదానవే అయిననూ, ఏతత్ - ఇది, పరస్మై - ఇతరుని కొరకు, న ఆఖ్యేయమ్ - చెప్పబడరాదు, దేవగుహ్యమ్ - దేవరహస్యము, సుసంవృతమ్ - చక్కగా దాచిపెట్టబడినదై, సర్వమ్ - సర్వము, సంపద్యతే - సుసంపన్నము అగును.

ఓ దేవీ! ఎవరు ఏ విధముగా ప్రశ్నించినా నీవీ విషయమును ఇతరులకు చెప్పరాదు. ఇది దేవరహస్యము. దీనిని చక్కగా దాచిపెట్టినప్పుడు మాత్రమే సర్వము సంపన్నమగును.

శ్రీశుక ఉవాచ ।
ఏతావదుక్త్వా భగవాంస్తత్రైవాంతరధీయత ।
అదితిర్దుర్లభం లబ్ధ్వా హరేర్జన్మాత్మని ప్రభోః ।
ఉపాధావత్పతిం భక్త్యా పరయా కృతకృత్యవత్ ॥ 21

భగవాన్ - భగవానుడు, ఏతావత్ - ఇంత మాత్రమే, ఉక్త్వా - పలికి, తత్ర ఏవ - అక్కడనే (అప్పుడే), అంతరధీయత - అంతర్ధానమాయెను, అదితిః - అదితి, దుర్లభమ్ - పొంద శక్యము కాని, హరేః ప్రభోః - శ్రీహరి ప్రభునియొక్క, ఆత్మని - తనయందు, జన్మ - పుట్టుటను, లబ్ధ్వా - పొంది, కృతకృత్యవత్ - కృతార్థురాలు వలె, పతిమ్ - భర్తను, పరయా - అత్యధికమగు, భక్త్యా - భక్తితో, ఉపాధావత్ - సేవించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- భగవానుడు ఇంత మాత్రమే పలికి అప్పుడే అక్కడే అంతర్ధానమాయెను. శ్రీహరి ప్రభుని పుత్రునిగా పొందుట దుర్లభము. అదితి అట్టి వరమును పొంది తాను కృతార్థురాలనైతినని భావించెను. ఆమె అత్యధికమగు భక్తితో భర్తను సేవించెను.

స వై సమాధియోగేన కశ్యపస్తదబుధ్యత ।
ప్రవిష్టమాత్మని హరేరంశం హ్యవితథేక్షణః ॥ 22

అవితథ-ఈక్షణః - మొక్కవోని దర్శనము గల, సః - ఆ, కశ్యపః వై - కశ్యపుడైతే, తత్ - అప్పుడు, ఆత్మని - తనయందు, ప్రవిష్టమ్ - ప్రవేశించిన, హరేః - శ్రీహరియొక్క, అంశమ్ - అంశను, సమాధియోగేన - సమాధి అనే ఉపాయముచే, అబుధ్యత - తెలుసుకొనెను.

కశ్యప ప్రజాపతి మొక్కవోని దర్శనము గలవాడు. ఆయన సమాధి అనే ఉపాయముచే శ్రీహరి తనలో అంశయై ప్రవేశించినట్లుగా కనుగొనెను.

సోఽదిత్యాం వీర్యమాధత్త తపసా చిరసంభృతమ్ ।
సమాహితమనా రాజన్ దారుణ్యగ్నిం యథాఽనిలః ॥ 23

రాజన్ - ఓ మహారాజా!, సః - ఆ కశ్యపుడు, సమాహితమనాః - ఏకాగ్రమైన మనస్సు గలవాడై, తపసా - తపస్సుచే, చిరసంభృతమ్ - చిర కాలము సంపాదించబడిన, వీర్యమ్ - తేజస్సును, అదిత్యామ్ - అదితి యందు, దారుణి - కట్టెయందు, అనిలః - వాయువు, అగ్నిం యథా - అగ్నిని వలె, ఆధత్త - నిక్షేపించెను.

ఓ మహారాజా! ఆ కశ్యపుడు ఏకాగ్రమగు మనస్సు గలవాడై తపస్సుచే చిరకాలమునుండి సంపాదించబడిన తేజస్సును అదితియందు, వాయువు కట్టెయందు అగ్నిని వలె, ఆధానము చేసెను.

అదితేర్ధిష్ఠితం గర్భం భగవంతం సనాతనమ్ ।
హిరణ్యగర్భో విజ్ఞాయ సమీడే గుహ్యనామభిః ॥ 24

సనాతనమ్ - కాలాతీతుడగు, భగవంతమ్ - శ్రీహరి భగవానుని, అదితేః - అదితియొక్క, గర్భమ్ - గర్భమును, ధిష్ఠితమ్ - అధిష్ఠించినవానినిగా, విజ్ఞాయ - తెలుసుకొని, హిరణ్యగర్భః - బ్రహ్మగారు (తేజోమయుడు), గుహ్యనామభిః - రహస్యమగు పేర్లతో, సమీడే - చక్కగా స్తుతించెను.

కాలాతీతుడగు శ్రీహరి భగవానుడు అదితియొక్క గర్భమునధి ష్ఠించియున్నాడని తెలుసుకొని, తేజోమయుడగు బ్రహ్మగారు రహస్యనా మములతో ఆయనను చక్కగా స్తుతించెను.

బ్రహ్మోవాచ ।
జయోరుగాయ భగవన్నురుక్రమ నమోఽస్తు తే ।
నమో బ్రహ్మణ్యదేవాయ త్రిగుణాయ నమో నమః ॥ 25

ఉరుగాయ - అధికముగా కీర్తించబడువాడా!, జయ - నీకు జయము కలుగుగాక!, ఉరుక్రమ - గొప్ప పరాక్రమము గలవాడా!, తే - నీ కొరకు, నమః - నమస్కారము, అస్తు - అగుగాక!, బ్రహ్మణ్యదేవాయ - వేదవేత్తలను ఆరాధించునట్టియు, త్రిగుణాయ - సత్త్వరజస్తమోగుణములు ఉపాధిగా గల శ్రీహరి కొరకు, నమః నమః నమః - అనేక నమస్కారము లు.

బ్రహ్మగారు ఇట్లు పలికెను --- ఓ శ్రీహరీ! నిన్ను సకలలోక ములు కీర్తించును. నీ పరాక్రమము అనన్యము. వేదవేత్తలయందు నీకు ప్రీతి మెండు. సత్త్వరజస్తమోగుణములను ఉపాధిగా స్వీకరించే నీకు అనేక నమస్కారములు.

నమస్తే పృశ్నిగర్భాయ వేదగర్భాయ వేధసే ।
త్రినాభాయ త్రిపృష్ఠాయ శిపివిష్టాయ విష్ణవే ॥ 26

పృశ్నిగర్భాయ - పృశ్నియొక్క పుత్రుడవైనట్టియు, వేదగర్భాయ - వేదములను తనలో కలిగియున్నట్టియు, వేధసే - సృష్టికర్తవైనట్టియు, త్రినాభాయ - ముల్లోకములు నాభియందున్నట్టియు, త్రిపృష్ఠాయ - ముల్లోకములకు అతీతుడవైనట్టియు, శిపివిష్టాయ - ప్రాణులయందు అంత ర్యామివైనట్టియు, విష్ణవే - సర్వవ్యాపివగు, తే - నీ కొరకు, నమః - నమ స్కారము.

ఓ దేవా! పృశ్నియొక్క పుత్రుడవై జన్మించిన నీవు వేదములను నీయందే కలిగియున్నావు. వేదములు నిన్నే తమయందు (ప్రతిపాద్యము

గా) కలిగియున్నవి. ముల్లోకములు నాభియందు గల నీవు ముల్లోకములకు **అతీతుడవు.** ప్రాణులలో అంతర్యామివై నీవు సర్వమును (సత్తాస్ఫూర్తుల తో) వ్యాపించి యున్నావు. నీకు నమస్కారము.

త్వమాదిరంతో భువనస్య మధ్య-
మనంతశక్తిం పురుషం యమాహుః ।
కాలో భవానాక్షిపతీశ విశ్వం
స్రోతో యథాంతఃపతితం గభీరమ్ ।। 27

భువనస్య - జగత్తునకు, త్వమ్ - నీవు, ఆదిః - కారణము, అంతః - విలీనమయ్యేది, మధ్యమ్ - నిలుచుటకు అధిష్ఠానము, అనంతశక్తిమ్ - అనంతమగు శక్తిగల, యమ్ - ఏ నిన్ను, పురుషమ్ - పురుషునిగా (పూర్ణుడు), ఆహుః - చెప్పెదరో, ఈశ - ఓ ఈశ్వరా!, కాలః - కాలరూపుడవగు, భవాన్ - నీవు, గభీరమ్ - లోతైన, స్రోతః - ప్రవాహము, అంతఃపతితం యథా - లోపల పడినదానిని వలె, విశ్వమ్ - జగత్తును, ఆక్షిపతి - లాగుకొని పోవుచున్నావు.

ఓ ఈశ్వరా! జగత్తునకు ఆదిమధ్యాంతములు నీవే. అనంతశక్తి గల నిన్ను పురుషుడు (పూర్ణుడు, ప్రాణుల దేహములయందు ఆత్మరూపముగా నుండువాడు) అని మహాత్ములు చెప్పెదరు. లోతైన నదీప్రవాహము తనలో పడిన గడ్డి మొదలగువాటిని వలె, కాలరూపుడవగు నీవు జగత్తును (సంహారము వైపునకు) లాగుకొని పోవుచున్నావు.

త్వం వై ప్రజానాం స్థిరజంగమానాం ప్రజాపతీనామసి సంభవిష్ణుః,
దివౌకసాం దేవ దివశ్చ్యుతానాం పరాయణం నౌరివ మజ్జతోఽప్సు।

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే వామనావతారవృత్తాంతే
అదితేః వ్రతసిద్ధివర్ణనం నామ సప్తదశోఽధ్యాయః ।।

స్థిరజంగమానామ్ - కదిలే మరియు కదలని, ప్రజానామ్ - ప్రాణులకు, ప్రజాపతీనాం అపి - ప్రజాపతులకు కూడ, త్వం వై - నీవే, సంభవిష్ణుః - సృష్టించువాడవు, దేవ - ఓ దేవా!, దివః - స్వర్గమునుండి,

చ్యుతానామ్ - జారిపోయిన, దివౌకసామ్ - స్వర్గవాసులగు దేవతలకు, అప్సు - నీళ్లయందు, మజ్జతః - మునిగిపోవుచున్నవానికి, నౌః ఇవ - నావ వలె, పరాయణమ్ - సర్వోత్తమమైన ఆశ్రయము.

ఓ దేవా! కదిలే మరియు కదలని ప్రాణులను మరియు ప్రజాపతులను కూడ సృష్టించేది నీవే. స్వర్గవాసులు స్వర్గమునుండి జారిపోయినారు. నీళ్లలో మునిగిపోవుచున్నవానికి నావ వలె, దేవతలకు నీవే సర్వోత్తమమైన ఆశ్రయమగుచున్నావు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
వామనావతారవృత్తాంతములో అదితికి శ్రీహరి దర్శనమిచ్చుటను
వర్ణించే పదునేడవ అధ్యాయము ముగిసినది (17).

*****

# అథ అష్టాదశోऽధ్యాయః

## వామనావతారము - వామనుని ప్రాదుర్భావము

శ్రీశుక ఉవాచ ।
ఇత్థం విరించస్తుతకర్మవీర్యః ప్రాదుర్బభూవామృతభూరదిత్యామ్ ।
చతుర్భుజశ్శంఖగదాబ్జచక్రః పిశంగవాసా నలినాయతేక్షణః।। 1

ఇత్థమ్ - ఈ విధముగా, విరించస్తుతకర్మవీర్యః - బ్రహ్మగారిచే స్తుతించబడిన లీలలు పరాక్రమము గలవాడు, అమృతభూః - మోక్షప్రదాత అగు భగవానుడు, అదిత్యామ్ - అదితియందు, చతుర్భుజః - నాలుగు భుజములు గలవాడై, శంఖగదా-అబ్జచక్రః - శంఖము గద పద్మము చక్రములు గలవాడై, పిశంగవాసాః - పీతాంబరుడై, నలిన-ఆయత-ఈక్షణః - పద్మము వలె నిడివి కన్నులు గలవాడై, ప్రాదుర్బభూవ - ఆవిర్భవించెను,

ఈ విధముగా మోక్షప్రదాతయగు శ్రీహరియొక్క లీలలను, పరాక్రమమును బ్రహ్మగారు స్తుతించెను. అపుడు పద్మము వలె నిడివి కన్నులు గల ఆ శ్రీహరి పీతాంబరుడై నాలుగు భుజములలో శంఖము, గద, పద్మము, చక్రములను ధరించి అదితియందు ఆవిర్భవించెను.

శ్యామావదాతో ఝషరాజకుండల-
త్విషోల్లసచ్ఛ్రీవదనాంబుజః పుమాన్ ।
శ్రీవత్సవక్షా వలయాంగదోల్లసత్-
కిరీటకాంచీగుణచారునూపురః ।। 2

శ్యామ-అవదాతః - శ్యామల వర్ణము గలవాడు నిర్మలుడు, ఝషరాజకుండలత్విషా - మకరాకారపు కుండలముల కాంతిచే, ఉల్లసత్-శ్రీవద

న-అంబుజః - గొప్పగా ప్రకాశించే శోభ గల పద్మమువంటి ముఖము గల వాడు, శ్రీవత్సవక్షాః - శ్రీవత్సము వక్షఃస్థలముపై గలవాడు, వలయ-అంగద-ఉల్లసత్-కిరీటకాంచీగుణచారునూపురః - కంకణములు భుజపురులతో ప్రకాశించే కిరీటము మొలనూలు అందమైన అందెలు గల, పుమాన్ - పురుషుడు.

ఆ పురుషోత్తముడు స్వచ్ఛమైన శ్యామలవర్ణము కలిగియుండెను. పద్మమువంటి ఆయన ముఖముయొక్క శోభ మకరకుండలముల కాంతితో మరింత ఇనుమడించెను. ఆయన వక్షఃస్థలముపై శ్రీవత్సము ఉండెను. కంకణములు, భుజపురులు, కిరీటము, మొలనూలు, అందమైన అందెలు అనే ఆభరణములను ఆయన ధరించెను.

మధువ్రతవ్రాతవిఘుష్టయా స్వయా
విరాజితశ్శ్రీవనమాలయా హరిః ।
ప్రజాపతేర్వేశ్మతమస్స్వరోచిషా
వినాశయన్ కంఠనివిష్టకౌస్తుభః ॥ 3

మధువ్రతవ్రాతవిఘుష్టయా - తుమ్మెదల గుంపుచే ధ్వనింప జేయబడుచున్న, స్వయా - తనదైన, శ్రీవనమాలయా - శోభిల్లే అడవి పువ్వుల మాలతో, విరాజితః - ప్రకాశించువాడు, కంఠనివిష్టకౌస్తుభః - కంఠమునందు ధరించబడిన కౌస్తుభ మాణిక్యము గలవాడు అగు, హరిః - శ్రీహరి, స్వరోచిషా - తన కాంతిచే, ప్రజాపతేః - కశ్యప ప్రజాపతియొక్క, వేశ్మతమః - గృహమునందలి చీకటిని, వినాశయన్ - నశింప జేయుచున్న వాడు.

తుమ్మెదల గుంపుల ధ్వనితో ధ్వనించుచున్న అందమైన తన అడవి పువ్వుల మాలను, కౌస్తుభ మాణిక్యమును కంఠమునందు ధరించిన శ్రీహరి తన కాంతిచే కశ్యప ప్రజాపతియొక్క గృహమునందలి చీకటిని నశింప జేయుచుండెను.

దిశః ప్రసేదుస్సలిలాశయాస్తదా
ప్రజాః ప్రహృష్టా ఋతవో గుణాన్వితాః ।

ద్యౌరంతరిక్షం క్షితిరగ్నిజిహ్వా
గావో ద్విజాస్సంజహృషుర్నగాశ్చ ॥ 4

తదా - అప్పుడు, దిశః - దిక్కులు, సలిల-ఆశయాః - జలాశయములు, ప్రసేదుః - ప్రసన్నములైనవి, ప్రజాః - ప్రాణులు, ప్రహృష్టాః - అధికమగు హర్షమును పొందినవి, ఋతవః - ఋతువులు, గుణ-అన్వితాః - తమ గుణములతో కూడియున్నవి, ద్యౌః - స్వర్గము, అంతరిక్షమ్ - అంతరిక్షము, క్షితిః - భూమి, అగ్నిజిహ్వాః - దేవతలు, గావః - గోవులు, ద్విజాః - వేదవేత్తలు, నగాః చ - పర్వతములు కూడ, సంజహృషుః - చక్కగా హర్షమును పొందినవి.

ఆ సమయములో దిక్కులు, జలాశయములు ప్రసన్నముగా నుండెను. ప్రాణులు అధికమగు హర్షమును పొందినవి. ఋతువులు అన్నీ ఏకకాలములో తమ తమ గుణములను ప్రకటించినవి. స్వర్గము, అంతరిక్షము, భూమి, పర్వతములు (ఆయా అధిష్ఠాన దేవతలు), అగ్ని ద్వారా హవిస్సులను భుజించే దేవతలు, గోవులు, వేదవేత్తలు కూడ చక్కని ఆనందమును పొందినారు.

శ్రోణాయాం శ్రవణద్వాదశ్యాం ముహూర్తేఽభిజితి ప్రభుః ।
సర్వే నక్షత్రతారాద్యాశ్చక్రుస్తజ్జన్మ దక్షిణమ్ ॥ 5

శ్రోణాయామ్ - చంద్రుడు శ్రవణములో నుండగా, శ్రవణద్వాదశ్యామ్ - భాద్రపద శుక్ల ద్వాదశినాడు, అభిజితి ముహూర్తే - అభిజిత్ అనే ముహూర్తమునందు, ప్రభుః - శ్రీహరి ప్రభుడు, నక్షత్రతారా-ఆద్యాః - నక్షత్రములు గ్రహములు మొదలగునవి, తద్-జన్మ - ఆ భగవానుని పుట్టుకను, దక్షిణమ్ - మంగళప్రదముగా, చక్రుః - చేసినవి.

భాద్రపద శుక్ల ద్వాదశినాడు చంద్రుడు శ్రవణములో నుండగా అభిజిత్ (మధ్యాహ్నము) ముహూర్తమునందు శ్రీహరి ప్రభుడు జన్మించెను. నక్షత్రములు, గ్రహములు మొదలగునవి ఆ భగవానుని పుట్టుక మంగళప్రదమని సూచించినవి.

ద్వాదశ్యాం సవితా తిష్ఠన్మధ్యందినగతో నృప ।
విజయా నామ సా ప్రోక్తా యస్యాం జన్మ విదుర్హరేః ॥ 6

నృప - ఓ మహారాజా!, ద్వాదశ్యామ్ - ద్వాదశినాడు, సవితా - సూర్యుడు, మధ్యందినగతః - మధ్యాహ్నమును పొందినవాడై, తిష్ఠన్ - నిలిచి యున్నవాడు, సా - ఆ దినము, విజయా నామ - విజయ అనే ప్రసిద్ధి గలదిగా, ప్రోక్తా - చెప్పబడినది, యస్యామ్ - ఏ ద్వాదశినాడు, హరేః - శ్రీహరియొక్క, జన్మ - పుట్టుక అని, విదుః - తెలియుదురో.

ఓ మహారాజా! ద్వాదశినాడు మధ్యాహ్నము సూర్యుడు నడినెత్తిని నిలిచియుండగా శ్రీహరి జన్మించెనని మహాత్ములు తెలియుదురు. ఆ దినమునకు విజయ ద్వాదశి అనే పేరు ప్రసిద్ధి.

శంఖదుందుభయో నేదుర్మృదంగపణవానకాః ।
చిత్రవాదిత్రతూర్యాణాం నిర్ఘోషస్తుములోఽభవత్ ॥ 7

శంఖదుందుభయః - శంఖములు దుందుభులు, మృదంగపణవ-ఆనకాః - మద్దెళ్లు తప్పెట్లు భేరీలు, నేదుః - ధ్వనించినవి, చిత్రవాదిత్రతూర్యాణామ్ - వివిధములైన వాద్యములయొక్క తూర్యముల (సన్నాయి మొదలైనవి) యొక్క, తుములః - సంకులమైన, నిర్ఘోషః - ధ్వని, అభవత్ - కలిగెను.

శంఖములు, దుందుభులు, మద్దెళ్లు, తప్పెట్లు, భేరీలు మ్రోగినవి. వివిధవాద్యములు మరియు తూర్యములయొక్క సంకులమైన ధ్వని కలిగెను.

ప్రీతాశ్చాప్సరసోఽనృత్యన్ గంధర్వప్రవరా జగుః ।
తుష్టువుర్మునయో దేవా మనవః పితరోఽగ్నయః ॥ 8

ప్రీతాః - ప్రీతిని పొందిన, అప్సరసః చ - అప్సరసలు కూడ, అనృత్యన్ - నాట్యమును చేసిరి, గంధర్వప్రవరాః - గంధర్వశ్రేష్ఠులు, జగుః - పాడిరి, మునయః - మహర్షులు, దేవాః - దేవతలు, మనవః - మనువులు, పితరః - పితృదేవతలు, అగ్నయః - అగ్నులు, తుష్టువుః - స్తుతించిరి.

అప్సరసలు ప్రీతితో నాట్యమాడగా, హాహా హూహూ మొదలైన గంధర్వశ్రేష్ఠులు పాడిరి. మహర్షులు, దేవతలు, మనువులు, పితృదేవతలు, అగ్నులు స్తుతించిరి.

సిద్ధవిద్యాధరగణాస్సకింపురుషకిన్నరాః ।
చారణా యక్షరక్షాంసి సుపర్ణా భుజగోత్తమాః ॥ 9

గాయంతోఽతిప్రశంసంతో నృత్యంతో విబుధానుగాః ।
అదిత్యా ఆశ్రమపదం కుసుమైస్సమవాకిరన్ ॥ 10

విబుధ-అనుగాః - దేవతలకు అనుయాయులైన, సిద్ధవిద్యాధర గణాః - సిద్ధుల విద్యాధరుల గణములు, సకింపురుషకిన్నరాః - కింపురుషులతో కిన్నరులతో కూడినవారు, చారణాః - చారణులు, యక్షరక్షాంసి - యక్షులు రాక్షసులు, సుపర్ణాః - గరుడులు, భుజగ-ఉత్తమాః - నాగులలో శ్రేష్ఠులు, గాయంతః - పాడుచున్నవారై, అతిప్రశంసంతః - అధికముగా కొనియాడుచున్నవారై, నృత్యంతః - నాట్యము చేయుచున్నవారై, అదిత్యాః - అదితియొక్క, ఆశ్రమపదమ్ - ఆశ్రమస్థానమును, కుసుమైః - పువ్వులతో, సమవాకిరన్ - చక్కగా చల్లిరి.

దేవతల అనుచరులగు సిద్ధుల మరియు విద్యాధరుల గణములు, కింపురుషులు, కిన్నరులు, చారణులు, యక్షులు, రాక్షసులు, గరుడులు, శ్రేష్ఠులైన నాగులు పాడుతూ అధికముగా కొనియాడుతూ నాట్యము చేస్తూ, అదితియొక్క ఆశ్రమస్థానమును పుష్పములతో అంతటా వర్షించిరి.

దృష్ట్వాఽదితిస్తం నిజగర్భసంభవం
పరం పుమాంసం ముదమాప విస్మితా ।
గృహీతదేహం నిజయోగమాయయా
ప్రజాపతిశ్చాహ జయేతి విస్మితః ॥ 11

అదితిః - అదితి, నిజగర్భసంభవమ్ - తన గర్భమునుండి పుట్టినట్టియు, నిజయోగమాయయా - తన త్రిగుణాత్మకమగు మాయాశక్తిచే, గృహీతదేహమ్ - స్వీకరించబడిన దేహము కలిగిన, తమ్ - ఆ, పరం -

పుమాంసమ్ - పురుషోత్తముని, దృష్ట్వా - చూచి, విస్మితా - ఆశ్చర్య మును పొందినదై, ముదమ్ - ఆనందమును, ఆప - పొందెను, ప్రజాపతిః చ - కశ్యప ప్రజాపతి కూడ, విస్మితః - ఆశ్చర్యపడినవాడై, జయ - జయ మగు గాక!, ఇతి - అని, ఆహ - పలికెను.

పురుషోత్తముడు మూడు గుణముల ఘటనయగు తన మాయాశ క్తిచే దేహమును స్వీకరించెను. తన గర్భమునుండి పుట్టిన ఆయనను గాంచి అదితి ఆశ్చర్యమును, ఆనందమును పొందెను. కశ్యప ప్రజాపతి కూడ ఆశ్చర్యపడి, జయమగు గాక! అని పలికెను.

యత్తద్వపుర్భాతివిభూషణాయుధైరవ్యక్తచిద్వ్యక్తమధారయద్ధరిః।
బభూవ తేనైవ స వామనో వటుస్సంపశ్యతోర్దివ్యగతిర్యథా నటః ॥

అవ్యక్తచిత్ - ఇంద్రియగోచరము కాని చైతన్యమైన, హరిః - శ్రీహరి, భాతివిభూషణ-ఆయుధైః - దీప్తి ఆభరణములు ఆయుధములతో, వ్యక్తమ్ - ఇంద్రియగోచరమయ్యే, యత్ - ఏ, వపుః - దేహమును, అధా రయత్ - ధరించెనో, తేన ఏవ - ఆ దేహముతోనే, సః - ఆయన, సంప శ్యతోః ఏవ - వారిద్దరు చూచుచుండగనే, దివ్యగతిః - అద్భుతమగు నేర్పు గల, నటః యథా - నటుడు వలె, వామనః - పొట్టివాడైన, వటుః - బాలకుడుగా, బభూవ - ఆయెను.

ఇంద్రియగోచరము కాని చైతన్యమే స్వరూపముగా గల శ్రీహరి ఆభరణములతో మరియు ఆయుధములతో ప్రకాశిస్తూ ఇంద్రియగోచర మయ్యే రూపముతో ఎదుట ప్రకటమయ్యేను. అద్భుతమగు నేర్పు గల నటుడు వలె ఆయన అదే దేహముతో వారిద్దరు చూచుచుండగానే పొట్టి బాలకుడుగా మారిపోయెను.

తం వటుం వామనం దృష్ట్వా మోదమానా మహర్షయః ।
కర్మాణి కారయామాసుః పురస్కృత్య ప్రజాపతిమ్ ॥ 13

వామనమ్ - పొట్టిగానున్న, తమ్ - ఆ, వటుమ్ - బాలకుని, దృష్ట్వా - చూచి, మహర్షయః - మహర్షులు, మోదమానాః - ఆనందించు

చున్నవారై, ప్రజాపతిమ్ - ప్రజాపతియగు కశ్యపుని, పురస్కృత్య - ముందిడుకొని, కర్మాణి - జాతకర్మ మొదలగు కర్మలను, కారయామాసుః - చేయించిరి.

వామనుడుగు ఆ బాలకుని చూచి మహర్షులు చాల ఆనందించిరి. వారు కశ్యప ప్రజాపతిని ముందిడుకొని, ఆ బాలకునకు జాతకర్మ మొద లగు కర్మలను చేయించిరి.

తస్యోపనీయమానస్య సావిత్రీం సవితాఽబ్రవీత్ ।
బృహస్పతిర్బ్రహ్మసూత్రం మేఖలాం కశ్యపోఽదదాత్ ॥14

ఉపనీయమానస్య - ఉపనయనము చేయబడుచున్న, తస్య - ఆ వామనునకు, సవితా - సూర్యుడు, సావిత్రీమ్ - సవిత దేవతగా గల గాయత్రీ మంత్రమును, అబ్రవీత్ - ఉపదేశించెను, బృహస్పతిః - బృహ స్పతి, బ్రహ్మసూత్రమ్ - యజ్ఞోపవీతమును, కశ్యపః - కశ్యపుడు, మేఖ లామ్ - మొలత్రాడును, అదదాత్ - ఇచ్చెను.

ఆ వామనునకు ఉపనయనము జరిగెను. ఆ సమయములో సూర్యుడే స్వయముగా సవిత (సూర్యుడు, పరబ్రహ్మ) దేవతగా గల గాయత్రీ మంత్రమునుపదేశించెను. బృహస్పతి యజ్ఞోపవీతమును, కశ్య పుడు మొలత్రాడును ఇచ్చిరి.

దదౌ కృష్ణాజినం భూమిర్దండం సోమో వనస్పతిః ।
కౌపీనాచ్ఛాదనం మాతా ద్యౌశ్ఛత్రం జగతః పతేః ॥ 15

జగతః - జగత్తుయొక్క, పతేః - ప్రభువునకు, భూమిః - భూదేవి, కృష్ణాజినమ్ - కృష్ణమృగ చర్మమును, వనస్పతిః - ఓషధులకు ప్రభువగు, సోమః - చంద్రుడు, దండమ్ - కర్రను, మాతా - తల్లియగు అదితి, కౌపీన -ఆచ్ఛాదనమ్ - కౌపీనమును నడుమునకు కట్టే వస్త్రమును, ద్యౌః - స్వర్గ లోక దేవత, ఛత్రమ్ - గొడుగును, దదౌ - ఇచ్చెను.

వామనరూపధారియగు ఆ జగన్నాథునకు భూదేవి కృష్ణమృగ చర్మమును, ఓషధులకు ప్రభువగు చంద్రుడు కర్రను, తల్లియగు అదితి

కౌపీనమును మరియు నడుమునకు కట్టే వస్త్రమును, స్వర్గాధిదేవత గొడుగును ఇచ్చిరి.

కమండలుం వేదగర్భః కుశాన్ సప్తర్షయో దదుః ।
అక్షమాలాం మహారాజ సరస్వత్యవ్యయాత్మనః ।। 16

మహారాజ - ఓ మహారాజా!, వేదగర్భః - వేదములకు నిధియగు బ్రహ్మగారు, కమండలుమ్ - కమండలమును, సప్తర్షయః - సప్తర్షులు, కుశాన్ - దర్భలను, దదుః - ఇచ్చిరి, అవ్యయ-ఆత్మనః - వినాశము లేని స్వరూపముగల ఆ వామనునకు, సరస్వతీ - సరస్వతి, అక్షమాలామ్ - జపమాలను.

వినాశము లేని చైతన్యమే స్వరూపముగా గల శ్రీహరి వామనుడాయెను. ఆయనకు వేదనిధియగు బ్రహ్మగారు కమండలమును, సప్తర్షులు దర్భలను, సరస్వతి జపమాలను ఇచ్చిరి.

తస్మా ఇత్యుపనీతాయ యక్షరాట్ పాత్రికామదాత్ ।
భిక్షాం భగవతీ సాక్షాదుమాऽదాదంబికా సతీ ।। 17

ఇతి - ఈ విధముగా, ఉపనీతాయ - ఉపనయనము చేయబడిన, తస్మై - ఆ వామనుని కొరకు, యక్షరాట్ - యక్షప్రభువగు కుబేరుడు, పాత్రికామ్ - పాత్రను, అదాత్ - ఇచ్చెను, సాక్షాత్ - సాక్షాత్తుగా, అంబికా - జగన్మాత, సతీ - పతివ్రత అగు, ఉమా భగవతీ - ఉమా భగవతి, భిక్షామ్ - భిక్షను, అదాత్ - ఇచ్చెను.

ఈ విధముగా ఉపనయనము చేయబడిన వామనునకు యక్షప్రభువగు కుబేరుడు భిక్షాపాత్రను ఈయగా, సాక్షాత్తుగా పతివ్రత మరియు జగన్మాతయగు ఉమా భగవతి భిక్షనిచ్చెను.

స బ్రహ్మవర్చసేనైవం సభాం సంభావితో వటుః ।
బ్రహ్మర్షిగణసంజుష్టామత్యరోచత మారిషః ।। 18

ఏవమ్ - ఈ విధముగా, సంభావితః - సత్కరించబడినవాడు, మారిషః - శ్రేష్ఠుడు అగు, సః - ఆ, వటుః - వామనుడు, బ్రహ్మవర్చసేన - బ్రహ్మవర్చస్సుతో, బ్రహ్మ-ఋషిగణసంజుష్టామ్ - బ్రహ్మర్షుల గణముచే చక్కగా సేవించబడిన, సభామ్ - సభను, అతి-అరోచత - అతిక్రమించి ప్రకాశించెను.

ఈ విధముగా సత్కరించబడిన శ్రేష్ఠుడైన ఆ వామనుడు బ్రహ్మవర్చస్సుతో, బ్రహ్మర్షుల సమూహముచే చక్కగా సేవించబడిన ఆ సభను అతిక్రమించి ప్రకాశించెను.

సమిద్ధమాహితం వహ్నిం కృత్వా పరిసమూహనమ్ ।
పరిస్తీర్య సమభ్యర్చ్య సమిద్భిరజుహోద్ద్విజః ॥ 19

ద్విజః - ఆ బ్రహ్మచారి, ఆహితమ్ - స్థాపించబడినదై, సమిద్ధమ్ - ప్రజ్వరిల్ల జేయబడిన, వహ్నిమ్ - అగ్నిని, పరిసమూహనమ్ - చుట్టూ దర్భలతో తుడుచుటను, కృత్వా - చేసి, పరిస్తీర్య - దర్భలను పరచి, సమభ్యర్చ్య - చక్కగా పూజించి, సమిద్భిః - సమిధలతో, అజుహోత్ - హోమము చేసెను.

ఆ బ్రహ్మచారి అగ్నిని స్థాపించి, ప్రజ్వరిల్ల జేసి, చుట్టూ దర్భలతో తుడిచి, దర్భలను పరచి, చక్కగా పూజించి, సమిధలతో హోమము చేసెను.

శ్రుత్వాऽశ్వమేధైర్యజమానమూర్జితం
బలిం భృగూణాముపకల్పితైస్తతః ।
జగామ తత్రాఖిలసారసంభృతో
భారేణ గాం సన్నమయన్ పదే పదే ॥ 20

అఖిలసారసంభృతః - సకలజగత్తుయొక్క సారముతో పూర్ణుడైన ఆ వటువు, భృగూణామ్ - భృగువంశీయులచే, ఉపకల్పితైః - చేయించబడిన, అశ్వమేధైః - అశ్వమేధములచే, యజమానమ్ - యజ్ఞమును చేయుచున్నట్టియు, ఊర్జితమ్ - సమృద్ధుడైన, బలిమ్ - బలిని గురించి, శ్రుత్వా

- విని, తతః - అక్కడనుండి, పదే పదే - ప్రతి అడుగునందు, భారేణ - బరువుచే, గామ్ - భూమిని, సన్నమయన్ - బాగా క్రుంగునట్లు చేయుచున్నవాడై, తత్ర - అచటకు, జగామ - వెళ్లెను.

సంపదలతో సమృద్ధుడైయున్న బలి భృగువంశీయుల సాహాయ్యముతో అనేకములగు అశ్వమేధ యాగములను చేసెను. ఆయన మరల యాగమును చేయుచుండెను. సకలజగత్తుయొక్క సారము (సత్త) తో పూర్ణుడైన ఆ వామనుడు ఆ విషయమును విని తన స్థానమునుండి ఆ బలి యొక్క స్థానమునకు వెళ్లెను. ఆయన నడచుచుండగా ప్రతి అడుగునందు ఆ భారమునకు భూమి బాగా క్రుంగిపోవుచుండెను.

తం నర్మదాయాస్తట ఉత్తరే బలేః
య ఋత్విజస్తే భృగుకచ్ఛసంజ్ఞకే ।
ప్రవర్తయంతో భృగవః క్రతూత్తమం
వ్యచక్షతారాదుదితం యథా రవిమ్ ॥ 21

నర్మదాయాః - నర్మదానదియొక్క, ఉత్తరే తటే - ఉత్తరపు ఒడ్డునందు, భృగుకచ్ఛసంజ్ఞకే - భృగుకచ్ఛము అనే పేరు గల క్షేత్రమునందు, క్రతు-ఉత్తమమ్ - గొప్ప యజ్ఞమును, ప్రవర్తయంతః - నడిపించుచున్న, యే - ఏ, బలేః - బలియొక్క, ఋత్విజః - ఋత్విక్కులైన, భృగవః - భృగువంశీయులు గలరో, తే - వారు, తమ్ - ఆ వామనుని, ఆరాత్ - దగ్గరలో, ఉదితమ్ - ఉదయించిన, రవిం యథా - సూర్యుని వలె, వ్యచక్షత - చూచిరి.

నర్మదానదియొక్క ఉత్తరతీరములో భృగుకచ్ఛము అనే పేరు గల క్షేత్రమునందు భృగువంశీయులగు ఋత్విక్కులు బలిచే గొప్ప యజ్ఞము (అశ్వమేధము) ను చేయించుచుండిరి. వారు వామనుని, దగ్గరగా ఉదయించిన సూర్యుడా యన్నట్లు, చూచిరి.

త ఋత్విజో యజమానస్సదస్యా
హతత్విషో వామనతేజసా నృప ।

సూర్యః కిలాయాత్యుత వా విభావసుః
సనత్కుమారోఽథ దిదృక్షయా క్రతోః ॥ 22

నృప - ఓ మహారాజా!, తే - ఆ, ఋత్విజః - ఋత్విక్కులు, యజమానః - యజ్ఞమును చేయుచున్న బలి, సదస్యాః - సభాసదులు, వామనతేజసా - వామనుని తేజస్సుచే, హతత్విషః - వెలవెలబోయిన కాంతి గలవారు, సూర్యః - సూర్యుడు, క్రతోః - యజ్ఞమును, దిదృక్షయా - చూడాలనే కోరికతో, ఆయాతి కిల - వచ్చుచున్నాడా యేమి!, ఉత వా - లేదా, విభావసుః - అగ్నియా?, అథ - లేదా, సనత్కుమారః - సనత్కుమారుడా?

ఓ మహారాజా! ఆ ఋత్విక్కులు, యజ్ఞమును చేయుచున్న బలి మరియు సభాసదుల తేజస్సు వామనుని తేజస్సు ముందు వెలవెల బోయెను. ఈతడు యజ్ఞమును చూడగోరి వచ్చుచున్న సూర్యుడా యేమి? లేక అగ్నియా? లేక, సనత్కుమారుడా? అని వారు తలపోసిరి.

ఇత్థం సశిష్యేషు భృగుష్వనేకధా
వితర్క్యమాణో భగవాన్ స వామనః ।
ఛత్రం సదండం సజలం కమండలుం
వివేశ బిభ్రద్ధయమేధవాటమ్ ॥ 23

ఇత్థమ్ - ఈ విధముగా, సశిష్యేషు - శిష్యులతో గూడియున్న, భృగుషు - భృగువంశీయులయందు, అనేకధా - పలుపలు విధములుగా, వితర్క్యమాణః - ఊహలు చేయబడుచున్న, సః - ఆ, భగవాన్ వామనః - వామన భగవానుడు, సదండమ్ - దండముతో కూడిన, ఛత్రమ్ - గొడుగును, సజలమ్ - నీటితో కూడియున్న, కమండలుమ్ - కమండలమును, బిభ్రత్ - ధరించియున్నవాడై, హయమేధవాటమ్ - అశ్వమేధ యాగశాలను, వివేశ - ప్రవేశించెను.

ఈ విధముగా భృగువంశీయులు, వారి శిష్యులు వామన భగవానుని గురించి పలు పలు విధములుగా ఊహాగానములను చేయుచుండిరి.

ఇంతలో ఆయన దండమును, గొడుగును, నీటితో కూడిన కమండలమును పట్టుకొని అశ్వమేధ యాగశాలను ప్రవేశించెను.

మౌంజ్యా మేఖలయా వీతముపవీతాజినోత్తరమ్ ।
జటిలం వామనం విప్రం మాయామాణవకం హరిమ్ ॥ 24

ప్రవిష్టం వీక్ష్య భృగవస్సశిష్యాస్తే సహాగ్నిభిః ।
ప్రత్యగృహ్ణన్ సముత్థాయ సంక్షిప్తాస్తస్య తేజసా ॥ 25

మౌంజ్యా - ముంజగడ్డితో చేసిన, మేఖలయా - మొలత్రాడుతో, వీతమ్ - నడుము చుట్టూ కట్టబడినట్టియు, ఉపవీత-అజిన-ఉత్తరమ్ - ఉపవీతముగా ధరించబడిన చర్మమే ఉత్తరీయముగా కలిగినట్టియు, జటిలమ్ - జటాధారియైనట్టియు, విప్రమ్ - బ్రహ్మచారియైనట్టియు, మాయామాణవకమ్ - కపటబాలకుడైనట్టియు, వామనమ్ - వామనరూపమును దాల్చినట్టియు, ప్రవిష్టమ్ - ప్రవేశించిన, హరిమ్ - శ్రీహరిని, వీక్ష్య - చూచి, సశిష్యాః - శిష్యులతో గూడిన, తే - ఆ, భృగవః - భృగువంశీయులు, తస్య - ఆ వామనుని, తేజసా - తేజస్సుచే, సంక్షిప్తాః - పరాజితులై, అగ్నిభిః సహ - అగ్నులతో కూడి, సముత్థాయ - లేచి నిలబడి, ప్రత్యగృహ్ణన్ - స్వాగతము పలికిరి.

కపట బాలకుని రూపమును దాల్చిన శ్రీహరి ముంజగడ్డితో చేసిన మొలత్రాడును దాల్చెను. జటాధారియగు ఆ బ్రహ్మచారి చర్మమునే ఉత్తరీయముగా ఉపవీత పద్ధతి (యజ్ఞోపవీతము వలె) లో ధరించెను. యజ్ఞశాలలో ప్రవేశించిన ఆ వామనుని తేజస్సు ముందు భృగువంశీయులు వెలవెల బోయిరి. వారు ఆ వామనుని చూచి శిష్యులతో బాటు లేచి అగ్నులను పట్టుకొని ఆయనకు స్వాగతమును పలికిరి.

యజమానః ప్రముదితో దర్శనీయం మనోరమమ్ ।
రూపానురూపావయవం తస్మా ఆసనమాహరత్ ॥ 26

దర్శనీయమ్ - అందగాడైనట్టియు, మనోరమమ్ - మనస్సునకు ఆహ్లాదమును కలిగించునట్టియు, రూప-అనురూప-అవయవమ్ - రూప

మునకు తగ్గ అవయవములు కలిగిన వామనుని (చూచి), యజమానః - యజ్ఞమును చేయుచున్న బలి, ప్రముదితః - చాల ఆనందించినవాడు, తస్మై - ఆతని కొరకు, ఆసనమ్ - ఆసనమును, ఆహరత్ - సమర్పించె ను.

వామనుడు రూపమునకు తగ్గ అవయవములతో ఒప్పారే అంద గాడు. మనస్సునకు ఆహ్లాదమును కలిగించే వామనుని చూచి యజ్ఞమును చేయుచున్న బలి చాల ఆనందించి, ఆతనికి ఆసనమును సమర్పించెను.

స్వాగతేనాభినంద్యాథ పాదౌ భగవతో బలిః ।
అవనిజ్యార్చయామాస ముక్తసంగం మనోరమమ్ ॥ 27

అథ - తరువాత, బలిః - బలి, ముక్తసంగమ్ - విడిచిపెట్టబడిన ఆసక్తి కలిగినట్టియు, మనోరమమ్ - మనస్సునకు ఆహ్లాదమును కలిగించే వామనుని, స్వాగతేన - స్వాగతవచనముచే, అభినంద్య - అభినందించి, అథ - తరువాత, భగవతః - వామన భగవానుని, పాదౌ - పాదములను, అవనిజ్య - కడిగి, అర్చయామాస - పూజించెను.

సర్వసంగరహితుడగు వామనుడు మనస్సునకు ఆహ్లాదమును కలి గించుచుండెను. బలి ఆయనను స్వాగతము వచనముతో అభినందించి, తరువాత ఆయన పాదములు కడిగి పూజించెను.

తత్పాదశౌచం జనకల్మషాపహం
స ధర్మవిన్మూర్ధ్న్యదధాత్సుమంగలమ్ ।
యద్దేవదేవో గిరిశశ్చంద్రమౌలిః
దధార మూర్ధ్నా పరయా చ భక్త్యా ॥ 28

జనకల్మష-అపహమ్ - జనుల పాపములను పోగొట్టునట్టియు, సుమంగలమ్ - పరమకల్యాణకారియగు, తత్-పాదశౌచమ్ - ఆయన పాదములను కడిగిన నీటిని, ధర్మవిత్ - ధర్మవేత్తయగు, సః - ఆ బలి, మూర్ధ్ని - శిరస్సుపై, అదధాత్ - ధరించెను, యత్ - దేనిని, దేవదేవః - దేవదేవుడు, గిరిశః - కైలాసవాసి, చంద్రమౌలిః చ - చంద్రుడు శిరోభూష

ణముగా గలవాడు అగు శివుడు కూడా, పరయా - సర్వాతిశాయియగు, భక్త్యా - భక్తితో, మూర్ధ్నా - శిరస్సుతో, దధార - ధరించెనో.

వామనుని పాదములను కడిగిన నీరు జనుల పాపములను పోనాడునది. పరమకల్యాణకారియగు ఆ నీటిని ధర్మవేత్తయగు బలి తలపై చల్లుకొనెను. దేవదేవుడు, కైలాసవాసి, చంద్రవంక తలపై గలవాడు అగు శివుడు ఆ పాదముల నీటిని (గంగను) ఒకప్పుడు సర్వోత్తమమైన భక్తితో తలపై దాల్చెను.

బలిరువాచ ।
స్వాగతం తే నమస్తుభ్యం బ్రహ్మన్ కిం కరవామ తే ।
బ్రహ్మర్షీణాం తపస్సాక్షాన్మన్యే త్వాऽऽర్య వపుర్ధరమ్ ।। 29

బ్రహ్మన్ - ఓ బ్రహ్మచారీ!, తే - నీ కొరకు, సు-ఆగతమ్ - స్వాగతము, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము, తే - నీ కొరకు, కిమ్ - దేనిని, కరవామ - మేము చేయవలెను?, ఆర్య - ఓ పూజనీయా!, త్వా - నిన్ను, వపుః-ధరమ్ - దేహమును దాల్చిన, సాక్షాత్ - సాక్షాత్తుగా, బ్రహ్మర్షీణామ్ - బ్రహ్మర్షులయొక్క, తపః - తపస్సునుగా, మన్యే - తలచెదను.

బలి ఇట్లు పలికెను --- ఓ బ్రహ్మచారీ! నీకు స్వాగతము. నీకు నమస్కారము. నీకు నేను ఏమి చేయవలెను? ఓ పూజనీయా! సాక్షాత్తుగా బ్రహ్మర్షులయొక్క తపస్సు నీ రూపమును దాల్చి వచ్చినదని నేను తలచెదను.

అద్య నః పితరస్తృప్తా అద్య నః పావితం కులమ్ ।
అద్య స్విష్టః క్రతురయం యద్భవానాగతో గృహాన్ ।। 30

అద్య - ఈనాడు, నః - మాయొక్క, పితరః - పితృదేవతలు, తృప్తాః - తృప్తులైనారు, అద్య - ఈనాడు, నః - మాయొక్క, కులమ్ - కులము, పావితమ్ - పవిత్రము చేయబడినది, అద్య - ఈనాడు, అయమ్

- ఈ, క్రతుః - యజ్ఞము, సు-ఇష్టః - సుసంపన్నమైనది, యత్ - ఏలయ నగా, భవాన్ - నీవు, గృహాన్ - ఇంటిని గురించి, ఆగతః - వచ్చినాడవు.

ఈనాడు నీవు మా ఇంటికి వచ్చుటచే మా పితృదేవతలు సంతృప్తులైనారు; మా కులము పవిత్రమైనది; ఈనాడు ఈ యజ్ఞము నీ రాకచే సుసంపన్నమైనది.

అద్యాగ్నయో మే సుహుతా యథావిధి
ద్విజాత్మజ త్వచ్చరణావనేజనైః ।
హతాంహసో వార్భిరియం చ భూరహో
తథా పునీతా తనుభిః పదైస్తవ ॥ 31

ద్విజ-ఆత్మజ - ఓ బ్రాహ్మణ బాలకా!, అద్య - ఈనాడు, త్వత్-చరణ-అవనేజనైః - నీ పాదములను కడిగిన, వార్భిః - నీళ్లతో, హత-అంహసః - నశింప జేయబడిన పాపములు గల, మే - నాయొక్క, అగ్నయః - అగ్నులు, యథావిధి - విధిని అతిక్రమించకుండా, సుహుతాః - చక్కగా హోమము చేయబడినవి, అహో - ఆహా!, తథా - అదే విధముగా, ఇయమ్ - ఈ, భూః చ - భూమి కూడ, తవ - నీయొక్క, తనుభిః - చిన్న, పదైః - అడుగులచే, పునీతా - పవిత్రము చేయబడినది.

ఓ బ్రాహ్మణ బాలకా! ఈనాడు నీ పాదములను కడిగిన నీరు నా పాపములను నశింప జేసినది. నేను నా అగ్నులలో యథావిధిగా చక్కగా చేసిన హోమము సఫలమైనది. అహా! నీ చిన్న చిన్న అడుగులతో ఈ భూమి కూడ పావనమైనది.

యద్యద్వటో వాంఛసి తత్ప్రతీచ్ఛ మే
త్వామర్థినం విప్రసుతానుతర్కయే ।
గాం కాంచనం గుణవద్ధామ మృష్టం
తథాన్నపేయముత వా విప్రకన్యామ్ ।
గ్రామాన్ సమృద్ధాంస్తురగాన్ గజాన్ వా
రథాంస్తథార్హత్తమ సంప్రతీచ్ఛ ॥ 32

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే వామనావతారే
వామన ప్రాదుర్భావో నామ అష్టాదశోऽధ్యాయః ॥

వటో - ఓ బ్రహ్మచారీ!, విప్రసుత - బ్రాహ్మణ బాలకా!, త్వామ్ - నిన్ను, అర్థినమ్ - కోరిక గలవానినిగా, అనుతర్కయే - భావించుచున్నాను, యత్ యత్ - దేనిని దేనిని, వాంఛసి - కోరెదవో, తత్ - దానిని, మే - నానుండి, ప్రతీచ్ఛ - స్వీకరించుము, అర్హత్తమ - పరమ పూజనీయా!, గామ్ - గోవును, కాంచనమ్ - బంగారమును, గుణవత్ - మంచి లక్షణములు గల, ధామ - గృహమును, తథా - మరియు, మృష్టమ్ - రుచ్యమైన, అన్నపేయమ్ - అన్నమును పానీయమును, ఉత - లేదా, విప్రకన్యాం వా - బ్రాహ్మణ బాలికను గాని, సమృద్ధాన్ - సంపన్నములైన, గ్రామాన్ - గ్రామములను, తురగాన్ - గుఱ్ఱములను, గజాన్ వా - ఏనుగులను గాని, సంప్రతీచ్ఛ - చక్కగా స్వీకరించుము.

ఓ బ్రహ్మచారీ! నీవు దేనినో కోరదలచుకున్నావని నాకు తోచుచున్నది. ఓ బ్రాహ్మణ బాలకా! నీకు ఏ వస్తువుపై కోరిక ఉంటే దానిని నానుండి స్వీకరించుము. పరమ పూజనీయా! గోవులను గాని, బంగారమును గాని, అన్ని సౌకర్యములు గల ఇంటిని గాని, రుచ్యమైన అన్నపానములను గాని, సంపన్నములైన గ్రామములను గాని, గుఱ్ఱములను గాని, ఏనుగులను గాని, నీవేది కోరితే దానిని నావద్దనుండి హాయిగా స్వీకరించుము. నీవు కోరినచో నీకు ఒక బ్రాహ్మణ బాలికతో వివాహమునైననూ నేను ఏర్పాటు చేయగలను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
వామనావతారవృత్తాంతములో వామన ప్రాదుర్భావమును వర్ణించే
పదునెనిమిదవ అధ్యాయము ముగిసినది (18).

*****

# అథ ఏకోనవింశోऽధ్యాయః

## వామనావతారము - వామనుడు బలిని మూడు అడుగుల భూమిని కోరుట

శ్రీశుక ఉవాచ ।
ఇతి వైరోచనేర్వాక్యం ధర్మయుక్తం స సూనృతమ్ ।
నిశమ్య భగవాన్ ప్రీతః ప్రతినంద్యేదమబ్రవీత్ ॥ 1

ఇతి - ఈ విధమైన, వైరోచనేః - విరోచన పుత్రుడగు బలియొక్క, ధర్మయుక్తమ్ - ధర్మముతో కూడినట్టియు, సూనృతమ్ - ప్రియము సత్యము అగు, వాక్యమ్ - వాక్యమును, నిశమ్య - విని, సః - ఆ, భగవాన్ - వామన భగవానుడు, ప్రీతః - సంతోషించినవాడై, ప్రతినంద్య - అభినందించి, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- విరోచన పుత్రుడగు బలి ఈ విధముగా ధర్మబద్ధము, ప్రియము, సత్యము అగు వాక్కును పలికెను. ఆ మాటను విన్న వామన భగవానుడు సంతోషించి ఆయనను అభినందిస్తూ ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
వచస్తవైతజ్జనదేవ సూనృతం
కులోచితం ధర్మయుతం యశస్కరమ్ ।
యస్య ప్రమాణం భృగవస్సాంపరాయే
పితామహః కులవృద్ధః ప్రశాంతః ॥ 2

జనదేవ - ఓ మహారాజా!, తవ - నీయొక్క, ఏతత్ - ఈ, వచః - మాట, సూనృతమ్ - సత్యము ప్రియము, కుల-ఉచితమ్ - వంశమునకు తగినది, ధర్మయుతమ్ - ధర్మముతో కూడినది, యశస్కరమ్ - కీర్తిని కలిగించునది, యస్య - ఏ. నీకు, సాంపరాయే - పరలోకములో హితమును చేసే సాధనము విషయములో, భృగవః - భృగువంశీయులు, కులవృద్ధః - వంశములో పెద్దవాడు, ప్రశాంతః - ప్రసన్నుడు అగు, పితామహః - తాతగారు, ప్రమాణమ్ - ప్రమాణమో.

ఓ మహారాజా! నీవు పలికిన ఈ మాట సత్యము, ప్రియము, ధర్మబద్ధము. అది నీకు కీర్తిని కలిగించును. నీకు పరలోకసాధనము విషయములో భృగువంశీయులు మాత్రమే గాక, కులవృద్ధుడు మరియు ప్రసన్నుడు అగు తాతగారు (ప్రహ్లాదుడు) ప్రమాణము (అనగా, వారి యాదేశము నీకు శిరోధార్యము).

న హ్యేతస్మిన్ కులే కశ్చిన్నిస్సత్త్వః కృపణః పుమాన్ ।
ప్రత్యాఖ్యాతా ప్రతిశ్రుత్య యో వాऽదాతా ద్విజాతయే ॥ 3

ఏతస్మిన్ - ఈ, కులే - కులమునందు, నిస్సత్త్వః - ధైర్యము లేనివాడు, కృపణః - లోభి అగు, పుమాన్ - వ్యక్తి, కశ్చిత్ - ఎవడైననూ, న హి - లేడే లేడు, యః - ఎవడైతే, ప్రతిశ్రుత్య - మాటను ఇచ్చి, ప్రత్యాఖ్యాతా - తిరస్కరించువాడో, వా - లేదా, ద్విజాతయే - వేదవేత్త కొరకు, అదాతా - దానమును చేయనివాడో.

ఈ (మీ) కులమునందు మాటను ఇచ్చి తిరస్కరించే ధైర్యహీనుడైన వ్యక్తి గాని, వేదవేత్తకు దానమును చేయని లోభియగు వ్యక్తిగాని ఎవ్వరూ లేరే లేరు.

న సంతి తీర్థే యుధి చార్థినాऽర్థితాః
పరాఙ్ముఖా యే త్వమనస్వినో నృపాః ।
యుష్మత్కులే యద్యశసాऽమలేన
ప్రహ్లాద ఉద్భాతి యథోడుపః ఖే ॥ 4

తీర్థే - దానము చేసే కాలమునందు, యుధి చ - యుద్ధమునం దు కూడ, అర్థినా - యాచకునిచే (యుద్ధమును చేయ గోరువానిచే), అర్థితాః - కోరబడినవారై, యే - ఏ, నృపాః తు - రాజులైతే, పరాఙ్-ముఖాః - వెనుకకు తిరిగిన ముఖము గలవారో, అమనస్వినః - స్వాభిమా నము లేని అట్టివారు, యుష్మత్-కులే - మీ వంశమునందు, న సంతి - లేరు, యత్ - ఏ కులమునందైతే, అమలేన - స్వచ్ఛమైన, యశసా - కీర్తి చే, ప్రహ్లాదః - ప్రహ్లాదుడు, ఖే - ఆకాశమునందు, ఉడుపః యథా - చంద్రుడు వలె, ఉద్భాతి - ప్రకాశించుచున్నాడో

దానమును చేసే సమయములో యాచకుడు కోరగా ముఖమును వెనుకకు త్రిప్పుకున్న స్వాభిమానరహితులైన రాజులు గాని, యుద్ధము నకు కాలు దువ్వే శత్రువునకు వెన్ను చూపే అభిమానరహితులైన రాజులు గాని మీ వంశములో పుట్టలేదు. మీ వంశములో ప్రహ్లాదుడు, ఆకాశమునం దలి చంద్రుడు వలె, స్వచ్ఛమైన కీర్తితో ప్రకాశించుచున్నాడు.

యతో జాతో హిరణ్యాక్షశ్చరన్నేక ఇమాం మహీమ్ ।
ప్రతివీరం దిగ్విజయే నావిందత గదాయుధః ॥ 5

యతః - ఏ కులమునందు, జాతః - పుట్టిన, హిరణ్యాక్షః - హిర ణ్యాక్షుడు, గదా-ఆయుధః - గదయే ఆయుధముగా గలవాడై, దిగ్-వి జయే - దిగ్విజయమునందు, ఇమామ్ - ఈ, మహీమ్ - భూమిని, ఏకః - ఒంటరివాడై, చరన్ - సంచరించువాడై, ప్రతివీరమ్ - ప్రతిపక్షివి, న అవిం దత - పొందలేదో.

మీ వంశములో పుట్టిన హిరణ్యాక్షుడు దిగ్విజయము నిమిత్తముగా గదను చేతబట్టి ఈ భూమినంతనూ ఒంటరిగా సంచరించెను. ఆయన ముందు నిలబడి యుద్ధము చేయువాడు ఆయనకు తారసిల్లలేదు.

యం వినిర్జిత్య కృచ్ఛ్రేణ విష్ణుః క్ష్మోద్ధార ఆగతమ్ ।
ఆత్మానం జయినం మేనే తద్వీర్యం భూర్యనుస్మరన్ ॥ 6

క్ష్మా-ఉద్ధారే - భూమియొక్క ఉద్ధరణమునందు, ఆగతమ్ - వచ్చిన, యమ్ - ఎవనిని, కృచ్ఛ్రేణ - కష్టముతో, వినిర్జిత్య - జయించి, భూరి - అధికమగు, తద్-వీర్యమ్ - వాని పరాక్రమమును, అనుస్మరన్ - తరువాత స్మరించువాడై, విష్ణుః - విష్ణువు, ఆత్మానమ్ - తనను, జయినమ్ - విజేతనుగా, న మేనే - తలంచలేదో.

విష్ణువు భూమిని పైకి తీసుకువచ్చుచుండగా హిరణ్యాక్షుడు వచ్చి ఆయనపై దండెత్తెను. అపుడాయన కష్టము మీద అతనిని జయించెను. అయిననూ, అతడు చూపించిన అధికమగు పరాక్రమమును తరువాత గుర్తు చేసుకొని విష్ణువు తాను విజేతనని తలపోయలేదు.

నిశమ్య తద్వధం భ్రాతా హిరణ్యకశిపుః పురా ।
హంతుం భ్రాతృహణం క్రుద్ధో జగామ నిలయం హరేః ।। 7

తద్-వధమ్ - వాని వధను గురించి, నిశమ్య - విని, భ్రాతా - సోదరుడగు, హిరణ్యకశిపుః - హిరణ్యకశిపుడు, క్రుద్ధః - కోపించినవాడై, పురా - పూర్వము, భ్రాతృహణమ్ - సోదరుని చంపినవానిని, హంతుమ్ - చంపుటకు, హరేః - శ్రీహరియొక్క, నిలయమ్ - నివాసమును గురించి, యయౌ - వెళ్లెను.

హిరణ్యాక్షుని వధను గురించి విని, వాని సోదరుడుగు హిరణ్యకశిపుడు కోపించెను. అతడు తన సోదరుని చంపినవానిని చంపుటకై శ్రీహరి నివాసము (వైకుంఠము) నకు వెళ్లెను.

తమాయాంతం సమాలోక్య శూలపాణిం కృతాంతవత్ ।
చింతయామాస కాలజ్ఞో విష్ణుర్మాయావినాం వరః ।। 8

కాలజ్ఞః - కాలము తెలిసినవాడు, మాయావినామ్ - మాయావులలో, వరః - శ్రేష్ఠుడగు, విష్ణుః - విష్ణువు, శూలపాణిమ్ - శూలము చేతియందున్నట్టియు, కృతాంతవత్ - మృత్యువు వలె, ఆయాంతమ్ - వచ్చుచున్న, తమ్ - వానిని, సమాలోక్య - చూచి, చింతయామాస - ఆలోచించెను.

ఏ కాలమునందు ఏమి చేయవలెనో విష్ణువునకు బాగా తెలియును-ఆయన మాయావులలో అగ్రేసరుడు. శూలమును చేతబట్టి మృత్యువు వలె తన మీదకు వచ్చుచున్న ఆ హిరణ్యకశిపుని చూచి ఆయన ఇట్లు తలపోసెను.

యతో యతోఽహం తత్రాసౌ మృత్యుః ప్రాణభృతామివ ।
అతోఽహమస్య హృదయం ప్రవేక్ష్యామి పరాగ్దృశః ॥ 9

ప్రాణభృతామ్ - ప్రాణధారులకు, మృత్యుః ఇవ - మృత్యువు వలె, అసౌ - ఈతడు, అహమ్ - నేను, యత్ర యత్ర - ఎక్కడెక్కడో, తత్ర - అక్కడ, అతః - ఇందువలన, అహమ్ - నేను, పరాగ్-దృశః - బహిర్ముఖుడగు, అస్య - వీనియొక్క, హృదయమ్ - హృదయమును, ప్రవేక్ష్యామి - ప్రవేశించగలను.

ప్రాణధారులు ఎక్కడకు వెళితే అక్కడకు మృత్యువు వెంటాడును. అదే విధముగా నేను ఎక్కడకు వెళ్లినా, ఈతడు నన్ను వెంటాడును. కాని, ఈతడు బహిర్ముఖుడు గనుక, నేనీతని హృదయములో ప్రవేశించెదను. (అనగా, ఈతడు నన్ను కనుగొనలేడు).

ఏవం స నిశ్చిత్య రిపోశ్శరీరమాధావతో నిర్వివిశేఽసురేంద్ర ।
శ్వాసానిలాంతర్హితసూక్ష్మదేహస్తత్ప్రాణరంధ్రేణ వివిగ్నచేతాః ॥ 10

అసుర-ఇంద్ర - ఓ రాక్షసరాజా!, వివిగ్నచేతాః - భయముతో నిండిన మనస్సు గల, సః - ఆ శ్రీహరి, ఏవమ్ - ఈ విధముగా, నిశ్చిత్య - నిశ్చయించి, ఆధావతః - మీదకు పరుగెత్తుచున్న, రిపోః - శత్రువుయొక్క, శరీరమ్ - దేహమును, శ్వాస-అనిల-అంతర్హితసూక్ష్మదేహః - శ్వాసయొక్క గాలియందు దాచబడిన సూక్ష్మమగు దేహము గలవాడై, తత్-ప్రాణరంధ్రేణ - వాని శ్వాసయొక్క రంధ్రమగు ముక్కు గుండా, నిర్వివిశే - ప్రవేశించెను.

ఓ రాక్షసరాజా! భయముతో నిండిన మనస్సు గల ఆ శ్రీహరి ఈ విధముగా నిశ్చయించుకొనెను. ఆయన మీదకు పరుగెత్తుచున్న శత్రువు

యొక్క దేహములో ఉచ్ఛ్వాసనిశ్వాసలు జరిగే వాని ముక్కుగుండా సూక్ష్మరూపముగా లోపల ప్రవేశించి, శ్వాసవాయువుచే అంతర్హితుడై యుండెను.

స తన్నికేతం పరిమృశ్య శూన్య-
మపశ్యమానః కుపితో ననాద ।
క్ష్మాం ద్యాం దిశః ఖం వివరాన్ సముద్రాన్
విష్ణుం విచిన్వన్న దదర్శ వీరః ।। 11

వీరః - వీరుడగు, సః - ఆ హిరణ్యకశిపుడు, శూన్యమ్ - శూన్య ముగానున్న, తత్-నికేతమ్ - ఆ విష్ణువుయొక్క నివాసమును, పరిమృశ్య - అంతటా వెదికి, అపశ్యమానః - కానరానివాడై, కుపితః - కోపించినవాడై, ననాద - నాదమును చేసెను, క్ష్మామ్ - భూమిని, ద్యామ్ - స్వర్గమును, దిశః - దిక్కులను, ఖమ్ - అంతరిక్షమును, వివరాన్ - పాతాలాది లోకము లను, సముద్రాన్ - సముద్రములను, విష్ణుమ్ - విష్ణువును, విచిన్వన్ - అన్వేషించువాడై, న దదర్శ - కానరాలేదు.

వీరుడగు ఆ హిరణ్యకశిపుడు శూన్యముగానున్న ఆ విష్ణువు యొక్క నివాసమును అంతటా వెదికెను. అయిననూ, అతనికి విష్ణువు కాన రాలేదు. అతడు కోపముతో నాదమును చేసెను. అతడు భూలోకమును, స్వర్గలోకమును, అంతరిక్షమును, దిక్కులను, పాతాలాది లోకములను, సముద్రములను విష్ణువు కొరకు వెదికెను. అయిననూ, అతడు విష్ణువును కనుగొనలేక పోయెను.

అపశ్యన్నితి హోవాచ మయాఽన్విష్టమిదం జగత్ ।
భ్రాతృహా మే గతో నూనం యతో నావర్తతే పుమాన్ ।। 12

అపశ్యన్ - కానరాని ఆ హిరణ్యకశిపుడు, ఇతి - ఈ విధముగా, ఉవాచ హ - పలికెనట, మయా - నాచే, ఇదమ్ - ఈ, జగత్ - జగత్తు, అన్విష్టమ్ - వెదుకబడినది, మే - నాయొక్క, భ్రాతృహా - సోదరుని చంపి న, పుమాన్ - పురుషోత్తముడు, నూనమ్ - నిశ్చయముగా, గతః - పొంది నాడు, యతః - దేనినుండి, న ఆవర్తతే - వెనుకకు తిరిగి రాడో.

హిరణ్యకశిపునకు విష్ణువు కనబడలేదు. అపుడాతడు ఇట్లు పలికెను -- నేను ఈ జగత్తును వెదికితిని. నా సోదరుని చంపిన విష్ణువు నిశ్చయముగా వెనుకకు తిరిగి రాని స్థితిని, అనగా మృత్యువును, పొందినాడు.

వైరానుబంధ ఏతావానామృత్యోరిహ దేహినామ్ ।
అజ్ఞానప్రభవో మన్యురహంమానోపబృంహితః ।। 13

ఇహ - ఈ లోకమునందు, దేహినామ్ - దేహాభిమానులకు, వైర-అనుబంధః - వైరమును నిరంతరముగా కొనసాగించుట, ఏతావాన్ - ఇంతమాత్రమే, ఆమృత్యోః - మరణము వరకు, అజ్ఞానప్రభవః - అజ్ఞానమునుండి పుట్టునది, అహంమాన-ఉపబృంహితః - నేను అనే అభిమానముచే వర్ధిల్ల జేయబడునది.

ఈ లోకములో దేహాభిమానము గలవారలకు నిరంతరముగా కొనసాగే వైరము కూడ మరణము వరకు మాత్రమే ఉండును. కోపము అజ్ఞానమునుండి పుట్టి, దేహమునందు నేను అనే అభిమానముచే వర్ధిల్ల జేయబడును.

పితా ప్రహ్లాదపుత్రస్తే తద్విద్వాన్ ద్విజవత్సలః ।
స్వమాయుర్ద్విజలింగేభ్యో దేవేభ్యోఽదాత్స యాచితః ।। 14

ద్విజవత్సలః - బ్రాహ్మణులయందు ప్రీతి గలవాడు, ప్రహ్లాదపుత్రః - ప్రహ్లాదుని పుత్రుడు, తే - నీయొక్క, పితా - తండ్రి, తద్-విద్వాన్ - ఆ విషయము తెలిసినవాడు అగు, సః - ఆ విరోచనుడు, యాచితః - కోరబడినవాడై, ద్విజలింగేభ్యః - బ్రాహ్మణచిహ్నములు గల, దేవేభ్యః - దేవతల కొరకు, స్వమ్ - తనదైన, ఆయుః - ఆయుర్దాయమును, అదాత్ - ఇచ్చెను.

నీ తండ్రి, ప్రహ్లాదుని పుత్రుడు అగు విరోచనుడు బ్రాహ్మణులయందు ప్రీతి గలవాడు. దేవతలు బ్రాహ్మణుల వేషములో వచ్చి ఆయనను ఆయువును దానము చేయుమని యాచించిరి. వారు బ్రాహ్మణుల

వేషములోనున్న దేవతలని ఆయనకు తెలియును. అయిననూ, ఆయన వారికి తన ఆయుర్దాయమును దానముగా ఇచ్చెను.

భవానాచరితాన్ ధర్మానాస్థితో గృహమేధిభిః ।
బ్రాహ్మణైః పూర్వజైశ్శూరైరన్యైశ్చోద్దామకీర్తిభిః ॥ 15

గృహమేధిభిః - గృహస్థులైన, బ్రాహ్మణైః - బ్రాహ్మణులచే, పూర్వజైః - పూర్వీకులచే, ఉద్దామకీర్తిభిః - గొప్ప కీర్తి గల, అన్యైః - ఇతరులైన, శూరైః చ - శూరులచే కూడ, ఆచరితాన్ - ఆచరించబడిన, ధర్మాన్ - ధర్మములను, భవాన్ - నీవు, ఆస్థితః - అనుష్ఠించువాడవు.

గృహస్థులైన బ్రాహ్మణులు (శుక్రాచార్యులు మొదలగువారు), పూర్వీకులు (ప్రహ్లాదుడు మొదలగువారు), గొప్ప కీర్తి గల ఇతరశూరులు ఆచరించిన ధర్మములను నీవు ఆచరించితివి.

తస్మాత్త్వత్తో మహీమీషద్వృణేఽహం వరదర్షభాత్ ।
పదాని త్రీణి దైత్యేంద్ర సంమితాని పదా మమ ॥ 16

దైత్య-ఇంద్ర - ఓ రాక్షస రాజా!, తస్మాత్ - అందువలన, వరద-ఋషభాత్ - వరములనిచ్చువారిలో శ్రేష్ఠుడవగు, త్వత్తః - నీనుండి, అహమ్ - నేను, ఈషత్ - కొంచెము, మహీమ్ - భూమిని, మమ - నాయొక్క, పదా - కాలితో, సంమితాని - చక్కగా కొలువబడిన, త్రీణి - మూడు, పదాని - అడుగులను, వృణే - కోరుచున్నాను.

ఓ రాక్షసరాజా! నీవు వరములనిచ్చువారిలో శ్రేష్ఠుడవు. కావుననే, నేను నీనుండి కొద్దిగా భూమిని కోరుచున్నాను. నా కాలితో కొలువబడే మూడు అడుగుల భూమిని నాకు ఇమ్ము.

నాన్యత్తే కామయే రాజన్ వదాన్యాజ్జగదీశ్వరాత్ ।
నైనః ప్రాప్నోతి వై విద్వాన్ యావదర్థప్రతిగ్రహః ॥ 17

రాజన్ - ఓ రాజా!, వదాన్యాత్ - దాతవైనట్టియు, జగద్-ఈశ్వరాత్ - జగన్నాథుడవగు, తే - నీనుండి, అన్యత్ - ఇంకోదానిని, న

కామయే - నేను కోరను, యావద్-అర్థప్రతిగ్రహః - ఎంతవరకు ప్రయోజ నమో అంతవరకే స్వీకరించే, విద్వాన్ - వివేకి, ఏనః - పాపమును, న ప్రాప్నోతి - పొందడు.

ఓ రాజా! జగన్నాథుడవగు నీవు దాతవు. అయినను, నేను నీనుండి ఇంతకు మించి ఇంకొటి కోరను. ఎందుకంటే, ఎంతవరకు ప్రయో జనమో అంతవరకే ప్రతిగ్రహము చేసే వివేకి ప్రతిగ్రహ దోషమును పొంద డు.

బలిరువాచ ।
అహో బ్రాహ్మణదాయాద వాచస్తే వృద్ధసంమతాః ।
త్వం బాలో బాలిశమతిస్స్వార్థం ప్రత్యబుధో యథా ।। 18

బ్రాహ్మణదాయాద - ఓ బ్రాహ్మణపుత్రా!, అహో - అహా!, తే - నీయొక్క, వాచః - మాటలు, వృద్ధసంమతాః - పెద్దలకు ప్రశంసనీయము లు, బాలః - పిల్లవాడవగు, త్వమ్ - నీవు, బాలిశమతిః - అజ్ఞానుల బుద్ధి గలవాడవు, స్వ-అర్థం ప్రతి - తన ప్రయోజనమును గురించి, యథా - ఉన్నది ఉన్నట్లుగా, అబుధః - తెలియనివాడవు.

బలి ఇట్లు పలికెను --- ఓ బ్రాహ్మణ బాలకా! అహా! నీ మాటలు పెద్దలు ప్రశంసించ దగ్గవి. కాని, పిల్లవాడవగు నీ బుద్ధి అజ్ఞానుల బుద్ధియే. ఎందుకంటే, నీకు నీ ప్రయోజనము గురించి ఉన్నది ఉన్నట్లుగా తెలియదు.

మాం వచోభిస్సమారాధ్య లోకానామేకమీశ్వరమ్ ।
పదత్రయం వృణీతే యోఽబుద్ధిమాన్ ద్వీపదాశుషమ్ ।। 19

లోకానామ్ - లోకములకు, ఏకం ఈశ్వరమ్ - ఏకచ్ఛత్రాధిపతిని, ద్వీపదాశుషమ్ - ఖండమును ఇచ్చుటకు సమర్థుడను అగు, మామ్ - నన్ను, వచోభిః - మాటలతో, సమారాధ్య - ప్రసన్నుని చేసి, యః - ఎవరైతే, పదత్రయమ్ - మూడు అడుగులను, వృణీతే - కోరునో వాడు, అబుద్ధిమాన్ - తెలివితేటలు లేనివాడు.

నేను ముల్లోకములకు ఏకచ్ఛత్రాధిపతిని. ఒక ద్వీపము (ఖండము) ను ఇచ్చే శక్తి నాకు గలదు. నన్ను నీవు నీ మాటలతో ప్రసన్నుని చేసితివి. అట్టి నీవు నన్ను మూడు అడుగులను కోరుచున్నావు. నీకు తెలివితేటలు లేవు.

న పుమాన్ మాముపవ్రజ్య భూయో యాచితుమర్హతి ।
తస్మాద్వృత్తికరీం భూమిం వటో కామం ప్రతీచ్ఛ మే ॥ 20

పుమాన్ - వ్యక్తి, మామ్ - నన్ను, ఉపవ్రజ్య - యాచించి, భూయః - మరల, యాచితుమ్ - యాచించుటకు, న అర్హతి - తగదు, తస్మాత్ - అందువలన, వటో - ఓ బ్రహ్మచారీ!, వృత్తికరీమ్ - బ్రదుకుదెరువును కల్పించే, భూమిమ్ - భూమిని, కామమ్ - యథేచ్ఛగా, మే - నానుండి, ప్రతీచ్ఛ - స్వీకరించుము.

ఓ బ్రహ్మచారీ! ఒకసారి నన్ను యాచించిన వ్యక్తి ఇంకోసారి యాచన కొరకు వెళ్లుట తగదు. కావున, నీవు నానుండి బ్రదుకు దెరువునకు సరిపడే భూమిని యథేచ్ఛగా స్వీకరించుము.

శ్రీభగవానువాచ ।
యావంతో విషయాః ప్రేష్ఠాస్త్రిలోక్యామజితేంద్రియమ్ ।
న శక్నువంతి తే సర్వే ప్రతిపూరయితుం నృప ॥ 21

నృప - ఓ మహారాజా!, త్రిలోక్యామ్ - ముల్లోకములలో, యావంతః - ఎన్ని, ప్రేష్ఠాః - మిక్కిలి ప్రియమైన, విషయాః - భోగ్యవస్తువులు గలవో, తే - అవి, సర్వే - అన్నీ, అజిత-ఇంద్రియమ్ - జయించబడని ఇంద్రియముల గలవానిని, ప్రతిపూరయితుమ్ - కామనలను పూరించుటకు, న శక్నువంతి - సమర్థములు కావు.

శ్రీ వామన భగవానుడిట్లు పలికెను --- ఓ మహారాజా! ముల్లోకములలో ఎన్ని మిక్కిలి ప్రియమగు భోగ్యవస్తువులు గలవో, అవి అన్నీ కలిసి కూడ ఇంద్రియజయము లేనివానియొక్క కామనలను పరిపూర్తి చేయుటకు చాలవు.

త్రిభిః క్రమైరసంతుష్టో ద్వీపేనాపి న పూర్యతే ।
నవవర్షసమేతేన సప్తద్వీపవరేచ్ఛయా ॥ 22

త్రిభిః - మూడు, క్రమైః - అడుగులతో, అసంతుష్టః - సంతోష మును చెందనివాడు, సప్తద్వీపవర-ఇచ్ఛయా - ఏడు గొప్ప ద్వీపముల యందలి కోరిక నిమిత్తముగా, నవవర్షసమేతేన - తొమ్మిది దేశముల తో కూడియున్న, ద్వీపేన అపి - జంబూద్వీపముతోనైననూ, న పూర్యతే - సంతుష్టిని చెందడు.

మూడు అడుగులతో సంతోషమును చెందనివానికి తొమ్మిది దేశ ములతో కూడియున్న జంబూద్వీపము (ఆసియా ఖండము) నంతనూ ఇచ్చిననూ సంతుష్టిని చెందడు. ఎందుకంటే, అప్పటికి ఏడు గొప్ప ద్వీప ములను పొందాలనే కోరిక వానికి ఉదయించును.

సప్తద్వీపాధిపతయో నృపా వైన్యగయాదయః ।
అర్థైః కామైర్గతా నాంతం తృష్ణాయా ఇతి నశ్శ్రుతమ్ ॥ 23

సప్తద్వీప-అధిపతయః - ఏడు ద్వీపములకు అధిపతులైన, వైన్యగ య-ఆదయః - వేనపుత్రుడగు పృథువు గయుడు మొదలైన, నృపాః - చక్ర వర్తులు, అర్థైః - సంపదలతో, కామైః - భోగములతో, తృష్ణాయాః - భోగ ములయందలి పేరాసయొక్క, అంతమ్ - అంతమును, న గతాః - పొంద లేదు, ఇతి - అని, నః - మాకు, శ్రుతమ్ - వినవచ్చినది.

వేనపుత్రుడగు పృథువు, గయుడు, ప్రియవ్రతుడు మొదలగు చక్ర వర్తులు ఏడు ద్వీపములకు అధిపతులు. అయిననూ, వారు సంపదలపై మరియు భోగములపై ఉండే పేరాసయొక్క అంతమును చేరలేకపోయి రని మేము వినియున్నాము.

యదృచ్ఛయోపపన్నేన సంతుష్టో వర్తతే సుఖమ్ ।
నాసంతుష్టస్త్రిభిర్లోకైరజితాత్మోపసాదితైః ॥ 24

యదృచ్ఛయా - అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే), ఉపపన్నేన - లభించినదానితో, సంతుష్టః - సంతోషమును పొందినవాడు, సుఖమ్ -

సుఖముగా, వర్తతే - జీవించును, అజిత-ఆత్మా - జయించబడని మనస్సు (ఇంద్రియములు, దేహము) గలవాడు, త్రిభిః - మూడు, లోకైః - లోకములు, ఉపసాదితైః - పొందబడగా, అసంతుష్టః - సంతోషమును పొందనివాడు, న - సుఖముగా జీవించలేడు.

ఈశ్వరేచ్ఛచే అనుకోకుండా లభించినదానితో సంతోషించే వ్యక్తి సుఖముగా జీవించును. మనస్సు, ఇంద్రియములు, దేహములపై నియంత్రణ లేని వ్యక్తి ముల్లోకములు లభించినా సంతోషించడు. వానికి సుఖము ఉండదు.

పుంసోఽయం సంసృతేర్హేతురసంతోషోఽర్థకామయోః ।
యదృచ్ఛయోపపన్నేన సంతోషో ముక్తయే స్మృతః ॥ 25

అర్థకామయోః - అర్థకామములయందు, అసంతోషః - సంతోషము లేకుండుట అనే, అయమ్ - ఇది, పుంసః - మానవునకు, సంసృతేః - సంసారమునకు, హేతుః - కారణము, యదృచ్ఛయా - అనుకోకుండా, ఉపపన్నేన - లభించినదానితో, సంతోషః - సంతోషించుట, ముక్తయే - ముక్తి కొరకు, స్మృతః - చెప్పబడినది.

అర్థ (సంపదలు) కామము (భోగము) లయెడల సంతోషము లేకుండుట అనే ఈ లక్షణము వ్యక్తిని సంసారము (సుఖదుఃఖప్రవాహము, జననమరణప్రవాహము) లోనికి నెట్టివేయును. ఈశ్వరేచ్ఛచే అనుకోకుండా లభించినదానితో సంతోషించుట మోక్షమునకు దారి తీయునని మహాత్ములు చెప్పెదరు.

యదృచ్ఛాలాభతుష్టస్య తేజో విప్రస్య వర్ధతే ।
తత్ప్రశామ్యత్యసంతోషాదంభసేవాశుశుక్షణిః ॥ 26

యదృచ్ఛాలాభతుష్టస్య - అనుకోకుండా లభించినదానితో సంతోషించే, విప్రస్య - వేదవేత్తకు, తేజః - తేజస్సు, వర్ధతే - వర్ధిల్లును, అసంతోషాత్ - సంతోషము లేకుండుట వలన, తత్ - ఆ తేజస్సు, అంభసా - నీటితో, ఆశుశుక్షణిః ఇవ - అగ్ని వలె, ప్రశామ్యతి - చల్లారిపోవును.

ఈశ్వరేచ్ఛచే అనుకోకుండా లభించినదానితో సంతోషించే వేదవే త్తకు తేజస్సు వర్ధిల్లును. సంతోషము లేనిచో అదే తేజస్సు, నీళ్లు పోసిన అగ్నివలె, చల్లారిపోవును.

తస్మాత్త్రీణి పదాన్యేవ వృణే త్వద్వరదర్షభాత్ ।
ఏతావతైవ సిద్ధోఽహం విత్తం యావత్ప్రయోజనమ్ ॥ 27

తస్మాత్ - అందువలన, వరద-ఋషభాత్ - వరములనిచ్చువారిలో శ్రేష్ఠుడవైన, త్వత్ - నీనుండి, త్రీణి - మూడు, పదాని ఏవ - అడుగులను మాత్రమే, వృణే - కోరుచున్నాను, అహమ్ - నేను, ఏతావతా ఏవ - ఇంతమాత్రముచే, సిద్ధః - సంసిద్ధుడను, ప్రయోజనం యావత్ - అవసరమున్నంతవరకు, విత్తమ్ - ధనము.

అందువలన, నీవు వరములనిచ్చువారిలో శ్రేష్ఠుడవే అయినను, నీనుండి మూడు అడుగులను మాత్రమే నేను కోరుచున్నాను. అంతమాత్రము చేతనే నేను సంసిద్ధుడనగుదును. అవసరమున్నంత వరకు మాత్రమే ధనమును ప్రోగుచేయవలెను.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుక్తస్స హసన్నాహ వాంఛాతః ప్రతిగృహ్యతామ్ ।
వామనాయ మహీం దాతుం జగ్రాహ జలభాజనమ్ ॥ 28

ఇతి - ఈ విధముగా, ఉక్తః - పలుకబడిన, సః - ఆ బలి, హసన్ - నవ్వుచున్నవాడై, ఆహ - పలికెను, వాంఛాతః - కోరికను బట్టి, ప్రతిగృహ్యతామ్ - స్వీకరించబడుగాక!, వామనాయ - వామనుని కొరకు, మహీమ్ - భూమిని, దాతుమ్ - ఇచ్చుటకు, జలభాజనమ్ - నీటి పాత్రను, జగ్రాహ - తీసుకొనెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- వామనుడు ఇట్లు పలుకగా, బలి చక్రవర్తి నవ్వి, నీ కోరికకు తగ్గట్లుగనే స్వీకరించుము, అని పలికెను. అప్పుడాయన వామనునకు భూమిని దానము చేయుటకై నీటి పాత్రను చేతిలోనికి తీసుకొనెను.

విష్ణవే క్ష్మాం ప్రదాస్యంతముశనా అసురేశ్వరమ్ ।
జానంశ్చికీర్షితం విష్ణోశ్శిష్యం ప్రాహ విదాం వరః ॥ 29

విష్ణోః - విష్ణువుయొక్క, చికీర్షితమ్ - చేయగోరిన దానిని, జానన్ - తెలిసినవాడు, విదామ్ - జ్ఞానులలో, వరః - శ్రేష్ఠుడు అగు, ఉశనా - శుక్రాచార్యులు, విష్ణవే - విష్ణువు కొరకు, క్ష్మామ్ - భూమిని, ప్రదాస్యంతమ్ - ఈయబోవుచున్నట్టియు, శిష్యమ్ - శిష్యుడైన, అసుర-ఈశ్వరమ్ - రాక్షసరాజగు బలిని ఉద్దేశించి, ప్రాహ - పలికెను.

శుక్రాచార్యుడు జ్ఞానులలో శ్రేష్ఠుడు. వామనరూపములోనున్న విష్ణువు ఏమి చేయగోరెనో ఆయనకు ఎరుకయే. రాక్షస రాజగు బలిచక్రవర్తి విష్ణువునకు భూమిని ఈయబోవుచుండెను. అపుడు శుక్రుడు తన శిష్యుడైన బలితో ఇట్లనెను.

శుక్ర ఉవాచ ।
ఏష వైరోచనే సాక్షాద్భగవాన్ విష్ణురవ్యయః ।
కశ్యపాదదితేర్జాతో దేవానాం కార్యసాధకః ॥ 30

వైరోచనే - విరోచన పుత్రుడవగు ఓ బలీ!, ఏషః - ఈతడు, సాక్షాత్ - సాక్షాత్తుగా, అవ్యయః - వినాశము లేని, భగవాన్ విష్ణుః - విష్ణు భగవానుడు, కశ్యపాత్ - కశ్యపుని వలన, అదితేః - అదితికి, జాతః - పుట్టినవాడు, దేవానామ్ - దేవతలకు, కార్యసాధకః - పనిని చేసిపెట్టువాడు.

శుక్రాచార్యుడిట్లు పలికెను --- విరోచనపుత్రుడవగు ఓ బలీ! ఈ పొట్టివాడు సాక్షాత్తుగా వినాశరహితుడగు విష్ణుభగవానుడు. ఈతడు దేవతల కార్యమును సంపాదించుటకై కశ్యపునకు అదితియందు పుట్టినవాడు.

ప్రతిశ్రుతం త్వయైతస్మై యదనర్థమజానతా ।
న సాధు మన్యే దైత్యానాం మహానుపగతోఽనయః ॥ 31

అనర్థమ్ - ఆపదను, అజానతా - గుర్తించని, త్వయా - నీచే, ఏతస్మై - వీని కొరకు, యత్ - ఏది, ప్రతిశ్రుతమ్ - వాగ్దానము చేయబడినదో అది, దైత్యానామ్ - రాక్షసులకు, సాధు - మంచి అని, న మన్యే - నేను

తలచుట లేదు, మహాన్ - పెద్ద, అనయః - అన్యాయము, ఉపగతః - వచ్చి పడినది.

నీవు ఆపదను గుర్తించకుండా వీనికి మాటను ఇచ్చితివి. నీవు చేసిన పని రాక్షసులకు హితకరమగునని నేను తలచుట లేదు. రాక్షసులకు పెద్ద అన్యాయము (దుఃఖ హేతువు) వచ్చి పడినది.

ఏష తే స్థానమైశ్వర్యం శ్రియం తేజో యశశ్శ్రుతమ్ ।
దాస్యత్యాచ్ఛిద్య శక్రాయ మాయామాణవకో హరిః ।। 32

ఏషః - ఈతడు, మాయామాణవకః - కపట బ్రహ్మచారియగు, హరిః - శ్రీహరి, తే - నీయొక్క, స్థానమ్ - స్థానమును, ఐశ్వర్యమ్ - అధి కారమును, శ్రియమ్ - సంపదను, తేజః - తేజస్సును, శ్రుతమ్ - ప్రఖ్యాత మైన, యశః - కీర్తిని, ఆచ్ఛిద్య - లాగుకొని, శక్రాయ - ఇంద్రుని కొరకు, దాస్యతి - ఈయగలడు.

ఈతడు కపట బ్రహ్మచారి వేషములోనున్న శ్రీహరి. ఈతడు నీ స్థానమును, అధికారమును, సంపదను, తేజస్సును, ప్రఖ్యాతమైన కీర్తిని లాగుకొని ఇంద్రునకు కట్టిపెట్టగలడు.

త్రిభిః క్రమైరిమాంల్లోకాన్ విశ్వకాయః క్రమిష్యతి ।
సర్వస్వం విష్ణవే దత్త్వా మూఢ వర్తిష్యసే కథమ్ ।। 33

మూఢ - తెలివి తక్కువ వాడా!, విశ్వకాయః - జగత్తే దేహముగా గల ఈతడు, త్రిభిః - మూడు, క్రమైః - అడుగులతో, ఇమాన్ - ఈ, లోకాన్ - లోకములను, క్రమిష్యతి - దాటివేయగలడు, సర్వస్వమ్ - నీ సంపదనంతనూ, విష్ణవే - విష్ణువు కొరకు, దత్త్వా - ఇచ్చి, కథమ్ - ఏ విధ ముగా, వర్తిష్యసే - బ్రదుక గలవు?

ఓ తెలివి తక్కువ వాడా! ఈతడు జగత్తే దేహముగా గల శ్రీహరి. ఈతడు మూడు అడుగులలో జగత్తునంతను అతిక్రమించగలడు. నీకు ఉన్నది అంతా విష్ణువునకు ఇచ్చివేసినచో, నీవు ఎట్లు బ్రదికెదవు?

క్రమతో గాం పదైకేన ద్వితీయేన దివం విభోః ।
ఖం చ కాయేన మహతా తార్తీయస్య కుతో గతిః ।। 34

ఏకేన - ఒక, పదా - అడుగుతో, గామ్ - భూమిని, ద్వితీయేన - రెండవ అడుగుతో, దివమ్ - స్వర్గమును, మహతా - పెద్ద, కాయేన - దేహముతో, ఖం చ - అంతరిక్షమును కూడ, క్రమతః - అతిక్రమించే, విభోః - సర్వవ్యాపియగు శ్రీహరియొక్క, తార్తీయస్య - మూడవ అడుగుతో కొలవవలసినదానికి, గతిః - స్థానము, కుతః - ఎక్కడిది?

సర్వవ్యాపియగు ఈ శ్రీహరి ఒక అడుగుతో భూమిని, రెండవ అడుగుతో స్వర్గమును, తన పెద్ద దేహముతో అంతరిక్షమును అతిక్రమించి వేయును. అప్పుడు మూడవ అడుగుతో కొలిచి ఈయవలసిన దానిని ఎక్కడనుండి తెచ్చెదవు?

నిష్ఠాం తే నరకే మన్యే హ్యప్రదాతుః ప్రతిశ్రుతమ్ ।
ప్రతిశ్రుతస్య యోఽనీశః ప్రతిపాదయితుం భవాన్ ।। 35

ప్రతిశ్రుతమ్ - వాగ్దానము చేసినదానిని, అప్రదాతుః - ఈయని, తే - నీకు, నరకే - నరకమునందు, నిష్ఠామ్ - నివాసమును, మన్యే - తలచెదను, హి - ఏలయనగా, యః - ఏ, భవాన్ - నీవు, ప్రతిశ్రుతస్య - వాగ్దానము చేసినదానికి, ప్రతిపాదయితుమ్ - పూర్తి చేయుటకు, అనీశః - సమర్థుడవు కావో.

వాగ్దానము చేసిన దానిని ఇచ్చే సామర్థ్యము నీకు లేదు. కావున, నీవు ఇచ్చిన మాటను నిలుపుకోని కారణముగా నరకమును పొందెదవని నా అభిప్రాయము.

న తద్దానం ప్రశంసంతి యేన వృత్తిర్విపద్యతే ।
దానం యజ్ఞస్తపః కర్మ లోకే వృత్తిమతో యతః ।। 36

తత్ - దానిని, దానమ్ - దానముగా, న ప్రశంసంతి - కొనియాడరు, యేన - దేనిచే, వృత్తిః - బ్రదుకు దెరువు, విపద్యతే - విపత్తులో పడునో, యతః - ఎందువలననగా, లోకే - లోకమునందు, దానమ్ - దానము,

యజ్ఞః - యజ్ఞము, తపః - తపస్సు, వృత్తిమతః - బ్రదుకు దెరువు గలవానికే.

ఏ దానముచే దాతయొక్క బ్రదుకు దెరువు ఆపదలో పడునో, అట్టి దానమును మహాత్ములు మెచ్చుకోరు. ఎందుకంటే, బ్రదుకు దెరువు గలవానికి మాత్రమే దానము, యజ్ఞము, తపస్సులు సంభవమగును.

ధర్మాయ యశసేఽర్థాయ కామాయ స్వజనాయ చ ।
పంచధా విభజన్ విత్తమిహాముత్ర చ మోదతే ।। 37

ధర్మాయ - ధర్మము కొరకు, యశసే - కీర్తి కొరకు, అర్థాయ - ధనమును అభివృద్ధి చేయుట కొరకు, కామాయ - భోగము కొరకు, స్వజనాయ చ - తనవారి కొరకు కూడ, పంచధా - అయిదు విధములుగా, విత్తమ్ - సంపదను, విభజన్ - పంచి యిచ్చువాడు, ఇహ - ఈ లోకమునందు, అముత్ర చ - పరలోకమునందు కూడ, మోదతే - ఆనందించును.

సంపదలో కొంత ధర్మమునకు, కొంత కీర్తి ప్రతిష్ఠల కొరకు, కొంత భోగమునకు ఖర్చు పెట్టి, కొంత ధనము వర్ధిల్లుటకు పెట్టుబడి పెట్టి, కొంత తనవారికి ఈయవలెను. ఇట్లు సంపదను అయిదు విధములుగా విభాగము చేసి వినియోగించువాడు ఇహపరములలో సుఖమును పొందును.

అత్రాపి బహ్వృచైర్గీతం శృణు మేఽసురసత్తమ ।
సత్యమోమితి యత్ప్రోక్తం యన్నేత్యాహానృతం హి తత్ ।। 38

అసురసత్తమ - ఓ రాక్షసశ్రేష్ఠా!, అత్ర - ఈ విషయమునందు, బహ్వృచైః అపి - ఋగ్వేదముయొక్క మహర్షులచే కూడ, గీతమ్ - గానము చేయబడినదానిని, శృణు - వినుము, ఓమ్ - సరే, ఇతి - అని, యత్ - ఏది, ప్రోక్తమ్ - చెప్పబడినదో అది, సత్యమ్ - సత్యము, న - కాదు, ఇతి - అని, యత్ - దేనిని, ఆహ - పలికెనో, తత్ హి - అదియే, అనృతమ్ - అసత్యము.

ఓ రాక్షసశ్రేష్ఠా! ఈ (మాటను నిలబెట్టుకొనే) విషయములో ఋగ్వేదద్రష్టలగు మహర్షులు గానము చేసిన విషయమును వినుము.

ఇచ్చిన మాటకు సరే అని అంగీకారమును తెలిపినచో అది సత్యమగును. ఇచ్చిన మాటను కాదు అని నిరాకరించినచో అది అసత్యము అగును.

సత్యం పుష్పఫలం విద్యాదాత్మవృక్షస్య గీయతే ।
వృక్షేఽజీవతి తన్న స్యాదనృతం మూలమాత్మనః ।। 39

**ఆత్మవృక్షస్య** - దేహేంద్రియమనస్సంఘాతమనే చెట్టునకు, **సత్యమ్** - సత్యమును, **పుష్పఫలమ్** - పుష్పమునుగా ఫలమునుగా, **విద్యాత్** - తెలియవలెనని, **గీయతే** - గానము చేయబడుచున్నది, **వృక్షే** - చెట్టు, **అజీవతి** - జీవించి లేనిచో, **తత్** - అది, **న స్యాత్** - ఉండదు, **ఆత్మనః** - దేహమునకు, **మూలమ్** - నిలబెట్టునది, **అనృతమ్** - అసత్యము.

దేహేంద్రియమనస్సంఘాతమనే చెట్టునకు సత్యము (ఇచ్చిన మాటను నిలబెట్టుకొనుట) పుష్పము మరియు ఫలమువంటిదని తెలియవలెనని ఋగ్వేదము చెప్పుచున్నది. కాని, ఆ చెట్టే జీవించి లేనిచో, పువ్వు కాయ ఉండవు గదా! కావున, అసత్యము (ఇచ్చిన మాటను తప్పుట) చేసైననూ దేహేంద్రియమనస్సంఘాతమనే చెట్టును నిలబెట్టుకొనవలెను.

తద్యథా వృక్ష ఉన్మూలశ్శుష్యత్యుద్వర్తతేఽచిరాత్ ।
ఏవం నష్టానృతస్సద్య ఆత్మా శుష్యేన్న సంశయః ।। 40

**తత్** - ఆ విషయమునందు, **యథా** - ఏ విధముగానైతే, **ఉత్-మూలః** - పెరికివేయబడిన తల్లివేరు గల, **వృక్షః** - చెట్టు, **అచిరాత్** - తొందరగా, **శుష్యతి** - ఎండిపోవునో, **ఉద్-వర్తతే** - కూలిపోవునో, **ఏవమ్** - ఇదే విధముగా, **నష్ట-అనృతః** - నశించిన అనృతము గల, **ఆత్మా** - దేహేంద్రియమనస్సంఘాతము, **సద్యః** - వెంటనే, **శుష్యేత్** - ఎండిపోవును, **సంశయః** - సందేహము, **న** - లేదు.

ఈ విషయములో ఒక సంగతిని గమనించవలెను. చెట్టుయొక్క తల్లివేరును పెరికివేసినచో, ఆ చెట్టు తొందరలో ఎండిపోయి కూలిపోవును.

అదే విధముగా, ఇచ్చిన మాటను కాదనే అసత్యమును పట్టుకొనిచో, దేహేంద్రియమనస్సంఘాతమే నశించును. సందేహము లేదు.

ఓమితి సత్యం నేత్యనృతం తదేతత్పుష్పం ఫలం వాచో యత్సత్యం స హేశ్వరో యశస్వీ కల్యాణకీర్తిర్భవితా పుష్పం హి ఫలం వాచస్సత్యం వదత్యథైతన్మూలం వాచో యదనృతం తద్యథా వృక్ష ఆవిర్మూలశ్శుష్యతి స ఉద్వర్తత ఏవమేవానృతం వదన్నావిర్మూలమాత్మానం కరోతి స శుష్యతి స ఉద్వర్తతే తస్మాదనృతం న వదేద్దయేత త్వేతేన। అనే ఋగ్వేదవాక్యములకు పై శ్లోకములు వ్యాఖ్యానము.

పరాగ్రిక్తమపూర్ణం వా అక్షరం యత్తదోమితి ।
యత్కించిదోమితి బ్రూయాత్తేన రిచ్యేత వై పుమాన్ ।
భిక్షవే సర్వమోంకుర్వన్నాలం కామేన చాత్మనే ॥ 41

ఓమ్ - సరే, ఇతి - అనేది, యత్ - ఏ, అక్షరమ్ - అక్షరము గలదో, తత్ - అది, పరాక్ - సంపదను దూరము చేయునది, రిక్తమ్ - రిక్తము, అపూర్ణమ్ - సంపదను ఖాళీ చేయునది, వై - నిశ్చయము, ఓమ్ - ఇస్తాను, ఇతి - అని, యత్ కించిత్ - ఏ కొంచెమును, పుమాన్ - వ్యక్తి, బ్రూయాత్ - పలుకునో, తేన - దానిచే, వై - నిశ్చయముగా, రిచ్యేత - ధనహీనుడగును, భిక్షవే - యాచకుని కొరకు, సర్వమ్ - సర్వమును, ఓంకుర్వన్ - సరే ఇస్తాను అని చెప్పువాడు, ఆత్మనే - తన కొరకు, కామేన - భోగముచే, న చ అలమ్ - సమర్థుడు కాడు.

సరే ఇస్తాను, అనే మాటయే వ్యక్తియొక్క సంపదను దూరము చేసి, వానిని ధనహీనునిగా చేసి తీరును. కావున, ఇస్తాను సరే అనే కొంచెము పలుకును పలికిన వ్యక్తి నిశ్చయముగా దరిద్రుడగును. సర్వమును ఇస్తానని యాచకుని యెదుట పలికిన వ్యక్తి తన సుఖమును సంపాదించుకొనుటలో అసమర్థుడగును.

పరాగ్వా ఏతద్రిక్తమక్షరం యదేతదోమితి తద్యత్కించోమిత్యాహాత్రైవాస్మై తద్రిచ్యతే స యత్సర్వమోంకుర్యాదాత్మానం స కామేభ్యో నాలం స్యాత్। అనే మంత్రమునకు పై శ్లోకము వ్యాఖ్యానము. రిక్తమ్ అనే

మంత్రములోని పదమునకు అపూర్ణమ్ అనే శ్లోకములోని పదము వివరణ ము.

అథైతత్పూర్ణమభ్యాత్మం యచ్చ నేత్యనృతం వచః ।
సర్వం నేత్యనృతం బ్రూయాత్స దుష్కీర్తిశ్శ్వసన్మృతః ।।42

అథ - అందువలన, న - కాదు, ఇతి - అనే, అనృతమ్ - అసత్యమైన, వచః - మాట, యత్ - ఏది గలదో, ఏతత్ - ఇది, పూర్ణమ్ - పూర్ణము, అభ్యాత్మం చ - తన వైపునకు సంపదను తెచ్చేది కూడా, సర్వమ్ - సర్వమును, న - ఇవ్వను, ఇతి - అని, అనృతమ్ - అసత్యమును, బ్రూయాత్ - చెప్పును, సః - అతడు, దుష్కీర్తిః - చెడు పేరు గలవాడు, శ్వసన్ - గాలిని పీల్చువాడు, మృతః - మరణించినవాడు.

అందువలన, నేను ఇస్తానని అనలేదు అని అసత్యమును పలికే వ్యక్తి సంపదతో నిండుగా ఉండును. పైగా, అతని ఈ పలుకులు సంపదను అతని వైపునకు ఆకర్షించును. కాని, ఇట్లు అన్ని సందర్భములలో అన్ని వస్తువుల విషయములో అసత్యమును చెప్పు వ్యక్తి అపకీర్తిని పొందును. అట్టివాడు గాలిని పీల్చుచున్ననూ మరణించినవానితో సమానము (కావున, అట్లు చేయరాదు).

అథైతత్పూర్ణమభ్యాత్మం యన్నేతి స యత్సర్వం నేతి బ్రూయాత్పాపికాఽస్య కీర్తిర్జాయేత సైనం తత్రైవ హన్యాత్। అని ఋగ్వేదశ్రుతి.

స్త్రీషు నర్మవివాహే చ వృత్త్యర్థే ప్రాణసంకటే ।
గోబ్రాహ్మణార్థే హింసాయాం నానృతం స్యాజ్జుగుప్సితమ్ ।। 43

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే
వామనావతారే వామనాయ బలేః వరప్రదానం
నామ ఏకోనవింశోఽధ్యాయః ।।

స్త్రీషు - స్త్రీలయందు, నర్మవివాహే చ - పరిహాసమునందు వివాహమునందు కూడ, వృత్తి-అర్థే - బ్రదుకు దెరువుయొక్క ప్రయోజనమునందు, ప్రాణసంకటే - ప్రాణములకు సంకటము ఏర్పడినప్పుడు,

గోబ్రాహ్మణ-అర్థే - గోవుల మరియు బ్రాహ్మణుల హితమునందు, హింసాయామ్ - హింస వచ్చి పడినప్పుడు, అనృతమ్ - అసత్యము, జుగుప్సితమ్ - హేయమైనది, న స్యాత్ - కాదు.

యువతిని ప్రసన్నము చేసుకొనే సందర్భము, పరిహాసము, వివాహము జరిగేట్లు చేయుట, బ్రదుకు దెరువును నిలబెట్టుకొనుట, ప్రాణములకు సంకటము ఏర్పడిన పరిస్థితి, గోవులకు బ్రాహ్మణులకు హితమును చేసే సందర్భము, హింసను నివారించే సందర్భము -- ఈ సందర్భములలో అసత్యము నిందనీయము కాదు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
వామనావతారవృత్తాంతములో వామనుడు బలిని
మూడు అడుగుల భూమిని అడుగుటను వర్ణించే
పందొమ్మిదవ అధ్యాయము ముగిసినది (19).

*****

# అథ వింశోఽధ్యాయః

## వామనావతారము - వామనుడు త్రివిక్రముడై రెండు అడుగులలో జగత్తును ఆక్రమించుట

శ్రీశుక ఉవాచ ।
బలిరేవం గృహపతిః కులాచార్యేణ భాషితః ।
తూష్ణీం భూత్వా క్షణం రాజన్నువాచావహితో గురుమ్॥ 1

రాజన్ - ఓ పరీక్షిన్మహారాజా!, గృహపతిః - గృహయజమానియగు, బలిః - బలి, ఏవమ్ - ఈ విధముగా, కుల-ఆచార్యేణ - కులాచార్యుడగు శుక్రునిచే, భాషితః - బోధించబడినవాడై, క్షణమ్ - క్షణకాలము, తూష్ణీం భూత్వా - మిన్నకుండి, అవహితః - సావధానుడై, గురుమ్ - గురువునుద్దేశించి, ఉవాచ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! గృహయజమానియగు బలికి కులాచార్యుడగు శుక్రుడు ఈ విధముగా ఉపదేశించెను. అపుడా చక్రవర్తి క్షణకాలము మిన్నకుండి, తరువాత సావధానముగా వినయముతో గురువగు శుక్రాచార్యునుద్దేశించి ఇట్లు పలికెను.

బలిరువాచ ।
సత్యం భగవతా ప్రోక్తం ధర్మోఽయం గృహమేధినామ్ ।
అర్థం కామం యశో వృత్తిం యో న బాధేత కర్హిచిత్ ॥ 2

భగవతా - పూజనీయులగు మీచే, సత్యమ్ - సత్యము, ప్రోక్తమ్ - పలుకబడినది, అయమ్ - ఇది, గృహమేధినామ్ - గృహస్థులయొక్క, ధర్మః - ధర్మము, యః - ఏదైతే, అర్థమ్ - సంపదను, కామమ్ - భోగము

ను, యశః - కీర్తిని, వృత్తిమ్ - బ్రదుకు దెరువును, కర్హిచిత్ - ఏ కాలమునం దైననూ, న బాధేత - బాధించదో.

బలి ఇట్లు పలికెను --- పూజనీయులగు మీరు చెప్పినది సత్య మే. ఇదియే గృహస్థులకు ధర్మము. ఇట్టి ధర్మము వలననే సంపద, భోగ ములు, కీర్తి, బ్రదుకు దెరువు ఏ కాలమునందైననూ వినష్టము కావు.

స చాహం విత్తలోభేన ప్రత్యాచక్షే కథం ద్విజమ్ ।
ప్రతిశ్రుత్య దదామీతి ప్రాహ్లాదిః కితవో యథా ॥ 3

చ - కాని, ప్రాహ్లాదిః - ప్రహ్లాదుని మనుమడనగు, సః - అట్టి, అహమ్ - నేను, దదామి - ఇచ్చెదను, ఇతి - అని, ప్రతిశ్రుత్య - ప్రతిజ్ఞ చేసి, కితవః యథా - మోసగాడు వలె, విత్తలోభేన - ధనమునందలి లోభ ముచే, కథమ్ - ఏ విధముగా, ద్విజమ్ - బ్రాహ్మణుని, ప్రత్యాచక్షే - తిర స్కరించవలెను?

కాని, నేను ప్రహ్లాదుని మనుమడను. అట్టి నేను బ్రాహ్మణునకు ఇచ్చెదనని ప్రతిజ్ఞ చేసి, ధనమునందలి లోభముచే మోసగాడు వలె ఎట్లు నిరాకరించ గల్గుదును?

న హ్యసత్యాత్పరోఽధర్మ ఇతి హోవాచ భూరియమ్ ।
సర్వం సోఢుమలం మన్యే ఋతేఽలీకపరం నరమ్ ॥ 4

అసత్యాత్ - అసత్యముకంటె, పరః - పెద్ద, అధర్మః - అధర్మము, న హి - లేనే లేదు, అలీకపరమ్ - అసత్యమునందు నిష్ఠుడైన, నరం ఋతే - మనిషిని మినహాయించి, సర్వమ్ - సర్వమును, సోఢుమ్ - సహించుటకు, అలమ్ - సమర్థురాలనని, మన్యే - తలచెదను, ఇతి - అని, ఇయమ్ - ఈ, భూః - భూదేవి, ఉవాచ హ - చెప్పెనట.

అసత్యము కంటె పెద్ద అధర్మము లేదు; అసత్యమునందు నిష్ఠ గల వ్యక్తిని మినహాయించి, నేను సర్వమును మోయగల్గుదును -- అని ఈ భూదేవి చెప్పెనట.

నాహం బిభేమి నిరయాన్నాధన్యాదసుఖార్ణవాత్ ।
న స్థానచ్యవనాన్మృత్యోర్యథా విప్రప్రలంభనాత్ ॥ 5

అహమ్ - నేను, నిరయాత్ - నరకము వలన, న బిభేమి - భయపడను, అధన్యాత్ - దారిద్ర్యము వలన, అసుఖ-అర్ణవాత్ - దుఃఖ సముద్రము వలన, న - భయపడను, స్థానచ్యవనాత్ - రాజ్యాధికారము జారిపోవుట వలన, మృత్యోః - మరణము వలన, న - భయపడను, యథా - ఏ విధముగా, విప్రప్రలంభనాత్ - వేదవేత్తను మోసగించుట వలన (భయపడెదనో).

నేను వేదవేత్తను మోసగించుట వలన ఎంతగా భయపడెదనో, నరకము వలన గాని, దారిద్ర్యము వలన గాని, దుఃఖ సముద్రము వలన గాని, రాజ్యాధికారము జారిపోవుట వలన గాని, మరణము వలనైననూ అంతగా భయపడను.

యద్యద్ధాస్యతి లోకేఽస్మిన్ సంపరేతం ధనాదికమ్ ।
తస్య త్యాగే నిమిత్తం కిం విప్రస్తుష్యేన్న తేన చేత్ ॥ 6

అస్మిన్ - ఈ, లోకే - లోకమునందు, ధన-ఆదికమ్ - ధనము మొదలైనది, యత్ యత్ - ఏది ఏది గలదో అది, సంపరేతమ్ - మరణించిన వ్యక్తిని, హాస్యతి - విడిచి పెట్టగలదు, తేన - దానితో, విప్రః - వేదవేత్త, న తుష్యేత్ చేత్ - సంతోషించనిచో, తస్య - దానియొక్క, త్యాగే - త్యాగమునందు, నిమిత్తమ్ - ఫలము, కిమ్ - ఏమి గలదు?

ఈ లోకములో ధనము మొదలైన సర్వము మరణించిన వ్యక్తిని విడిచి పెట్టును. అట్టి ధనాదికముతో వేదవేత్త సంతోషించని పక్షములో, వాటిని త్యాగముచేసి ఫలమేమి గలదు? (కావున, అడిగినదానికంటె తక్కువ ఇచ్చుట వ్యర్థము అని అభిప్రాయము).

శ్రేయః కుర్వంతి భూతానాం సాధవో దుస్త్యజాసుభిః ।
దధ్యఙ్ శిబిప్రభృతయః కో వికల్పో ధరాదిషు ॥ 7

దధ్యఙ్శిబిప్రభృతయః - దధీచి శిబి మొదలైన, సాధవః - సత్పు రుషులు, దుస్త్యజ-అసుభిః - విడిచిపెట్ట శక్యము కాని ప్రాణములతో, భూతానామ్ - ప్రాణులకు, శ్రేయః - హితమును, కుర్వంతి - చేయుదురు, ధరా-ఆదిషు - భూమి మొదలగువాటి విషయమునందు, వికల్పః - విక ల్పము, కః - ఎట్టిది?

దధీచి, శిబి మొదలైన సత్పురుషులు విడిచి పెట్ట శక్యము కాని ప్రాణములనైననూ అర్పించి ప్రాణులకు హితమును చేగూర్చెదరు. అట్టి చో, భూమి మొదలగువాటి విషయములో ఇవ్వాలా? వద్దా? అనే వికల్ప ములకు తావేది?

యైరియం బుభుజే బ్రహ్మన్ దైత్యేంద్రైరనివర్తిభిః ।
తేషాం కాలోऽగ్రసీల్లోకాన్న యశోऽధిగతం భువి ॥ 8

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, అనివర్తిభిః - వెన్ను చూపని, యైః - ఏ, దైత్య-ఇంద్రైః - రాక్షసశ్రేష్ఠులచే, ఇయమ్ - ఈ భూమి, బుభుజే - భోగిం చబడినదో, తేషామ్ - వారియొక్క, లోకాన్ - భోగములను, కాలః - కాల ము, అగ్రసీత్ - మ్రింగివేసెను, భువి - లోకమునందు, అధిగతమ్ - పొందబడిన, యశః - కీర్తిని, న - మ్రింగలేదు.

ఓ మహర్షీ! యుద్ధములో వెన్ను చూపని రాక్షసశ్రేష్ఠులు ఈ భూమిలోని భోగములను అనుభవించినారు. వారి ఆ భోగములను కాలము మ్రింగివేసినది. కాని, వారి లోకములో పొందిన కీర్తిని కాలము మ్రింగలేదు.

సులభా యుధి విప్రర్షే హ్యనివృత్తాస్తనుత్యజః ।
న తథా తీర్థ ఆయాతే శ్రద్ధయా యే ధనత్యజః ॥ 9

విప్ర-ఋషే - ఓ బ్రహ్మర్షీ!, యుధి - యుద్ధమునందు, అని వృత్తాః - వెన్ను చూపనివారై, తనుత్యజః - దేహమును విడిచిపెట్టువారు, సులభాః - అనేకులు, హి - కాని, తీర్థే - దానకాలము, ఆయాతే - వచ్చిన ప్పుడు, శ్రద్ధయా - శ్రద్ధతో, యే - ఎవరైతే, ధనత్యజః - ధనమును విడిచి పెట్టువారో, తథా - ఆ విధముగా, న - కారు.

ఓ బ్రహ్మర్షీ! యుద్ధములో వెన్ను చూపకుండా ప్రాణములను విడిచిపెట్టువారు అనేకులు గలరు. కాని, దానము చేసే సమయము వచ్చినప్పుడు శ్రద్ధతో ధనమును విడిచిపెట్టువారు ఆ విధముగా అనేకులు లేరు (ఎవరో కొద్దిమంది మాత్రమే గలరు).

మనస్వినః కారుణికస్య శోభనం
యదర్థికామోపనయేన దుర్గతిః ।
కుతః పునర్బ్రహ్మవిదాం భవాదృశాం
తతో వటోరస్య దదామి వాంఛితమ్ ॥ 10

మనస్వినః - స్వాభిమానము కలిగినట్టియు, కారుణికస్య - కరుణామయుడగువానికి, శోభనమ్ - శుభము, యత్ - ఏదనగా, అర్థికామ-ఉపనయేన - యాచకుని కోరికలను పూర్తి చేయుటచే, దుర్గతిః - దుర్గతి, భవాదృశామ్ - మీవంటి, బ్రహ్మవిదాం పునః - బ్రహ్మవేత్తలకైతే, కుతః - చెప్పునదేమున్నది?, తతః - అందువలన, అస్య - ఈ, వటోః - బ్రహ్మచారియొక్క, వాంఛితమ్ - కోరికను, దదామి - ఇచ్చెదను.

స్వాభిమానము, కరుణ గల వ్యక్తికి యాచకుల కోరికలను తీర్చి దుర్గతిని పొందుట కూడ శోభగానే యుండును. అట్టిచో, మీవంటి బ్రహ్మవేత్తల కోరికను తీర్చి దరిద్రుడగుట శోభయేనని వేరుగా చెప్పవలయునా? కావున, నేను ఈ బ్రహ్మచారి కోరికను తీర్చెదను.

యజంతి యజ్ఞక్రతుభిర్యమాదృతా
భవంత ఆమ్నాయవిధానకోవిదాః ।
స ఏవ విష్ణుర్వరదోఽస్తు వా పరో
దాస్యామ్యముష్మై క్షితిమీప్సితాం మునే ॥ 11

మునే - ఓ మహర్షీ!, ఆమ్నాయవిధానకోవిదాః - వేదవిహితములైన కర్మలయందు పండితులైన, భవంతః - మీరు, యమ్ - ఎవ్వానిని, ఆదృతాః - ఆదరము గలవారై, యజ్ఞక్రతుభిః - యజ్ఞములచే క్రతువులచే, యజంతి - ఆరాధించుచున్నారో, సః - ఆ, వరదః - వరములనిచ్చే, విష్ణుః

ఏవ - విష్ణువే, అస్తు - అగుగాక!, పరః వా - మరియొకడు గాని, అముష్మై - వీని కొరకు, ఈప్సితామ్ - కోరబడిన, క్షితిమ్ - భూమిని, దాస్యామి - ఈయగలను.

ఓ మహర్షి! వేదోక్తములగు కర్మలలో పండితులైన మీరు సాదరముగా విష్ణువును యజ్ఞము (యూపము లేనిది) లచే మరియు క్రతువు (యూపము గలది) లచే ఆరాధించెదరు. ఈతడు అట్టి ఆ వరములనిచ్చే విష్ణువే యగుగాక! లేదా, మరియొకడు కావచ్చును. నేను ఈతడు కోరిన భూమిని ఇచ్చెదను.

యదప్యసావధర్మేణ మాం బధ్నీయాదనాగసమ్ ।
తథాప్యేనం న హింసిష్యే భీతం బ్రహ్మతనుం రిపుమ్ ॥12

అసౌ - ఈతడు, అనాగసమ్ - అపరాధము లేని, మామ్ - నన్ను, అధర్మేణ - అధర్మముచే, యదపి బధ్నీయాత్ - బంధించిననూ, తథాపి - అయినప్పటికీ, భీతమ్ - భయపడుచున్నట్టియు, బ్రహ్మతనుమ్ - బ్రాహ్మణవేషములోనున్న, ఏనమ్ - ఈ, రిపుమ్ - శత్రువును, న హింసిష్యే - హింసించను.

ఈతడు నిరపరాధినగు నన్ను అధర్మముగా విశ్వరూపమును చూపి బంధించవచ్చు గాక! బ్రాహ్మణవేషములోనుండి భయపడుచున్న ఈతడు వాస్తవములో శత్రువే అయిననూ, నేను వీనిని హింసించను.

ఏష వా ఉత్తమశ్లోకో న జిహాసతి యద్యశః ।
హత్వా మైనాం హరేద్యుద్ధే శయీత నిహతో మయా ॥ 13

ఏషః - ఈతడు, వై - నిశ్చయముగా, యత్ ఉత్తమశ్లోకః - ఉత్తమమగు కీర్తి గల విష్ణువు అయినచో, యశః - కీర్తిని, న జిహాసతి - విడువగోరడు, యుద్ధే - యుద్ధమునందు, మా - నన్ను, హత్వా - చంపి, ఏనామ్ - ఈ భూమిని, హరేత్ - తీసుకొను గాక!, మయా - నాచే, నిహతః - సంహరించబడినవాడై, శయీత - నేల కూలు గాక!

ఈతడు నిశ్చయముగా ఉత్తమమగు కీర్తి గల విష్ణువే అయినచో, తన కీర్తి వినష్టమగుట ఆతనికి అభీష్టము కాబోదు. ఈయన నన్ను యుద్ధములో సంహరించి భూమిని తీసుకొనుగాక! లేదా, ఈతడు విష్ణువు కానిచో, నాతో యుద్ధమును చేసినచో, నాచే సంహరించబడి నేల గూలును.

శ్రీశుక ఉవాచ ।
ఏవమశ్రద్ధితం శిష్యమనాదేశకరం గురుః ।
శశాప దైవప్రహితస్సత్యసంధం మనస్వినమ్ ॥ 14

ఏవమ్ - ఈ విధముగా, అశ్రద్ధితమ్ - శ్రద్ధను చూపనట్టియు, అనాదేశకరమ్ - ఆదేశమును పాటించనట్టియు, సత్యసంధమ్ - సత్యమునకు కట్టుబడినట్టియు, మనస్వినమ్ - స్వాభిమానము కలిగిన, శిష్యమ్ - శిష్యుడగు బలిని, దైవప్రహితః - దైవముచే ప్రేరితుడైన, గురుః - గురువగు శుక్రాచార్యుడు, శశాప - శపించెను.

ఈ విధముగా స్వాభిమానము గల బలి సత్యమునకు కట్టుబడి గురువుయొక్క వాక్యమునందు శ్రద్ధ లేనివాడై ఆయన ఆదేశమును పాటించలేదు. దైవముచే ప్రేరితుడైన శుక్రాచార్యుడు తన శిష్యుడగు బలిని శపించెను.

దృఢం పండితమాన్యజ్ఞః స్తబ్ధోఽస్యస్మదుపేక్షయా ।
మచ్ఛాసనాతిగో యస్త్వమచిరాద్భ్రశ్యసే శ్రియః ॥ 15

దృఢమ్ - గట్టిగా, పండితమానీ - తాను పండితుడనని తలపోయువాడవు, అజ్ఞః - అజ్ఞానివి, స్తబ్ధః - పొగరు గలవాడవు, అసి - అగుదువు, మత్-శాసన-అతిగః - నా ఆజ్ఞను ఉల్లంఘించినవాడవు, యః - ఏ, త్వమ్ - నీవు, అస్మద్-ఉపేక్షయా - మమ్ములను నిర్లక్ష్యము చేయుటచే, అచిరాత్ - తొందరలోనే, శ్రియః - సంపదనుండి, భ్రశ్యసే - జారిపోయెదవు.

నేనే పండితుడనని నీవు గట్టిగా తలపోయుచుందువు. కాని, నీవు అజ్ఞానివి. నీకు వినయము లేదు. కావుననే, నా ఆజ్ఞను ఉల్లంఘించితివి.

అట్టి నీవు మమ్ములను నిర్లక్ష్యము చేయుట వలన, శీఘ్రముగా సంపదను పోగొట్టుకొనెదవు.

ఏవం శప్తస్స్వగురుణా సత్యాన్న చలితో మహాన్ ।
వామనాయ దదావేనామర్చిత్వోదకపూర్వకమ్ ॥ 16

ఏవమ్ - ఈ విధముగా, స్వగురుణా - తన గురువుచే, శప్తః - శపించబడిన, మహాన్ - మహాత్ముడగు బలి, సత్యాత్ - సత్యమునుండి, న చలితః - విచలితుడు కాలేదు, అర్చిత్వా - పూజించి, ఉదకపూర్వకమ్ - ముందు నీటిని పోసి, వామనాయ - వామనుని కొరకు, ఏనామ్ - ఈ భూమిని, దదౌ - ఇచ్చెను.

ఈ విధముగా తన గురువు శపించిననూ మహాత్ముడగు బలి సత్యమునుండి వైదొలగలేదు. ఆయన వామనుని పూజించి, ఆయన చేతిలో నీటిని వదిలిపెట్టి ఈ భూమిని దానము చేసెను.

వింధ్యావలిస్తదాఽఽగత్య పత్నీ జాలకమాలినీ ।
ఆనిన్యే కలశం హైమమవనేజన్యపాం భృతమ్ ॥ 17

జాలకమాలినీ - మల్లె మొగ్గల మాల గల, పత్నీ - బలిభార్యయగు, వింధ్యావలిః - వింధ్యావలి, తదా - అప్పుడు, ఆగత్య - వచ్చి, అవనేజనీ-అపామ్ - కాళ్లు కడిగే నీళ్లకు, భృతమ్ - నిండియున్న, హైమమ్ - బంగరు, కలశమ్ - కలశమును, ఆనిన్యే - తీసుకువచ్చెను.

మల్లెమొగ్గల మాలను ధరించియున్న బలిపత్నియగు వింధ్యావలి అప్పుడు వచ్చి, కాళ్లు కడిగే నీళ్లతో నిండియున్న బంగరు కలశమును తీసుకువచ్చెను.

యజమానస్స్వయం తస్య శ్రీమత్పాదయుగం ముదా ।
అవనిజ్యావహన్మూర్ధ్ని తదపో విశ్వపావనీః ॥ 18

యజమానః - యజ్ఞమును చేయుచున్న బలి, స్వయమ్ - స్వయముగా, ముదా - ఆనందముతో, తస్య - ఆ వామనునియొక్క, శ్రీమత్-పా

దయుగమ్ - శోభాయుక్తమైన పాదముల జంటను, అవనిజ్య - కడిగి, విశ్వ పావనీః - జగత్తును పావనము చేసే, తద్-అపః - ఆ నీటిని, మూర్ధ్నా - శిరస్సుతో, అవహత్ - దాల్చెను.

యజ్ఞమును చేయుచున్న బలి స్వయముగా ఆనందముతో ఆ వామనునియొక్క శోభాయుక్తమైన పాదముల జంటను కడిగెను. జగత్తును పావనము చేసే ఆ జలములను ఆయన తలపై దాల్చెను.

తదాసురేంద్రం దివి దేవతాగణా
గంధర్వవిద్యాధరసిద్ధచారణాః ।
తత్కర్మ సర్వేఽపి గృణంత ఆర్జవం
ప్రసూనవర్షైర్వవృషుర్ముదాఽన్వితాః ॥ 19

తదా - అప్పుడు, దివి - స్వర్గమునందు, దేవతాగణాః - దేవతల గణములు, గంధర్వవిద్యాధరసిద్ధచారణాః - గంధర్వులు విద్యాధరులు సిద్ధులు చారణులు, సర్వే అపి - అందరు కూడ, తత్-కర్మ - ఆ బలి యొక్క కర్మను, ఆర్జవమ్ - సత్యసంధతను, గృణంతః - కొనియాడువారై, ముదా - ఆనందముతో, అన్వితాః - కూడియున్నవారై, అసుర-ఇంద్రమ్ - రాక్షసరాజగు బలిని, ప్రసూనవర్షైః - పుష్పముల వర్షములతో, వవృషుః - వర్షించిరి.

అప్పుడు స్వర్గమునందు దేవతల గణములు, గంధర్వులు, విద్యాధరులు, సిద్ధులు, చారణులు అందరు కూడ రాక్షసరాజగు బలియొక్క ఆ కర్మను, అతని సత్యసంధతను కొనియాడిరి. వారు ఆనందముతో నిండిన వారై అతనిని పూలవానలతో ముంచెత్తిరి.

నేదుర్ముహుర్దుందుభయస్సహస్రశో
గంధర్వకింపూరుషకిన్నరా జగుః ।
మనస్వినానేన కృతం సుదుష్కరం
విద్వానదాద్యద్రిపవే జగత్త్రయమ్ ॥ 20

దుందుభయః - దుందుభులు, సహస్రశః - వేలాదిగా, ముహుః - పలుమార్లు, నేదుః - మ్రోగినవి, గంధర్వకింపూరుషకిన్నరాః - గంధర్వులు కింపురుషులు కిన్నరులు, జగుః - పాడిరి, మనస్వినా - స్వాభిమానము గల, అనేన - ఈ బలిచే, సుదుష్కరమ్ - మిక్కిలి చేయ శక్యము కానిది, కృతమ్ - చేయబడినది, యత్ - ఏదనగా, విద్వాన్ - తెలిసినవాడు, రిపవే - శత్రువు కొరకు, జగత్-త్రయమ్ - ముల్లోకములను, అదాత్ - ఇచ్చెనో.

అపుడు దుందుభులు వేలాదిగా పలుమార్లు మ్రోగినవి. గంధర్వులు, కింపురుషులు, కిన్నరులు ఈ విధముగా పాడిరి -- స్వాభిమానము గల ఈ బలి మిక్కిలి చేయ శక్యము కాని పనిని చేసినాడు. అది ఏమంటే, కోరినవాడు శత్రువు అని తెలిసి కూడా ఆయన ముల్లోకములను దానము చేసినాడు.

తద్వామనం రూపమవర్ధతాద్భుతం
హరేరనంతస్య గుణత్రయాత్మకమ్ ।
భూః ఖం దిశో ద్యౌర్వివరాః పయోధయః
తిర్యఙ్నృదేవా ఋషయో యదాసత ॥ 21

అనంతస్య - అవినాశియగు, హరేః - శ్రీహరియొక్క, గుణత్రయ -ఆత్మకమ్ - మూడు గుణముల కార్యమగు జగత్తు తనయందు గల, తత్ - ఆ, వామనమ్ - పొట్టి, రూపమ్ - రూపము, అద్భుతమ్ - అద్భుతముగా, అవర్ధత - పెరిగెను, భూః - భూమి, ఖమ్ - ఆకాశము, దిశః - దిక్కులు, ద్యౌః - స్వర్గము, వివరాః - పాతాళము మొదలగు లోకములు, పయోధయః - సముద్రములు, తిర్యఙ్-నృదేవాః - పశుపక్ష్యాదులు మానవులు దేవతలు, ఋషయః - మహర్షులు, యత్ - దేనియందైతే, ఆసత - ఉండెనో.

అవినాశియగు శ్రీహరియందు సత్త్వరజస్తమోగుణముల కార్యమగు జగత్తు అంతర్భాగమై యున్నది. ఆ శ్రీహరియొక్క ఆ పొట్టి రూపము అద్భుతముగా పెరిగెను. భూమి, ఆకాశము, దిక్కులు, స్వర్గము,

పాతాళము మొదలగు లోకములు, సముద్రములు, పశుపక్ష్యాదులు, మానవులు, దేవతలు, మహర్షులు ఆ రూపములో అంతర్గతమైరి.

కాయే బలిస్తస్య మహావిభూతేః
సహర్త్విగాచార్యసదస్య ఏతత్ ।
దదర్శ విశ్వం త్రిగుణం గుణాత్మకే
భూతేంద్రియార్థాశయజీవయుక్తమ్ ॥ 22

సహ-ఋత్విగ్-ఆచార్యసదస్యః - ఋత్విక్కులు శుక్రాచార్యుడు సభాసదులతో గూడియున్న, బలిః - బలి, మహావిభూతేః - గొప్ప శక్తులు గల, తస్య - ఆ శ్రీహరియొక్క, గుణ-ఆత్మకే - గుణకార్యమగు జగత్తునకు ఆశ్రయమైన, కాయే - శరీరమునందు, త్రిగుణమ్ - మూడు గుణముల కార్యమైనట్టియు, భూత-ఇంద్రియ-అర్థ-ఆశయజీవయుక్తమ్ - పృథివి మొదలగు పంచభూతములు వాక్కు మొదలగు ఇంద్రియములు శబ్దము మొదలగు విషయములు అంతఃకరణము జీవులతో కూడియున్న, ఏతత్ - ఈ, విశ్వమ్ - జగత్తును, దదర్శ - చూచెను.

ఋత్విక్కులు, శుక్రాచార్యుడు, సభాసదులతో గూడియున్న బలి చక్రవర్తి అనంతశక్తిమంతుడగు శ్రీహరియొక్క ఆ దేహమును చూచెను. మూడు గుణముల కార్యమగు జగత్తునకు ఆశ్రయమగు ఆ శరీరమునందు ఆయన త్రిగుణాత్మకమగు ఈ జగత్తును చూచెను. పృథివి మొదలగు పంచమహాభూతములు, వాక్కు మొదలగు ఇంద్రియములు, శబ్దము మొదలగు విషయములు, అంతఃకరణము, జీవులతో కూడియున్న ఈ విశ్వము ఆయనకు ఆ శరీరమునందు దర్శనమిచ్చెను.

రసామచష్టాంఘ్రితలేఽథ పాదయోః
మహీం మహీధ్రాన్ పురుషస్య జంఘయోః ।
పతత్త్రిణో జానుని విశ్వమూర్తేః
ఊర్వోర్గణం మారుతమింద్రసేనః ॥ 23

ఇంద్రసేనః - ఇంద్రుని సేనవంటి సేన గల బలి, విశ్వమూర్తేః - జగత్తే రూపముగా గల, పురుషస్య - పురుషోత్తమునియొక్క, అంఘ్రితలే - అరికాలియందు, రసామ్ - రసాతలమును, అథ - మరియు, పాదయోః - రెండు కాళ్లయందు, మహీమ్ - భూమిని, జంఘయోః - రెండు పిక్కల యందు, మహీధ్రాన్ - పర్వతములను, జానుని - మోకాలియందు, పతత్రిణః - పక్షులను, ఊర్వోః - రెండు తొడలయందు, మారుతమ్ - మరుత్తులకు చెందిన, గణమ్ - సముదాయమును, అచష్ట - చూచెను.

శ్రీహరియే ఈ జగత్తునంతనూ వ్యాపించి యుండెను. ఇంద్రపదవిని ఆక్రమించి ఇంద్రుని సేనవంటి సేన గల బలి చక్రవర్తి ఆ విశ్వమూర్తి యొక్క అరికాలియందు రసాతలమును, రెండు కాళ్లయందు భూమిని, రెండు పిక్కలయందు పర్వతములను, రెండు మోకాళ్లయందు పక్షులను, రెండు తొడలయందు మరుద్గణములను చూచెను.

సంధ్యాం విభోర్వాససి గుహ్య ఐక్షత్
ప్రజాపతీన్ జఘనే ఆత్మముఖ్యాన్ ।
నాభ్యాం నభః కుక్షిషు సప్త సింధూ-
నురుక్రమస్యోరసి చర్క్షమాలామ్ ॥ 24

విభోః - సర్వవ్యాపియైనట్టియు, ఉరుక్రమస్య - పెద్ద అడుగులు గల శ్రీహరియొక్క, వాససి - వస్త్రమునందు, సంధ్యామ్ - సంధ్యను, గుహ్యే - గుహ్యమునందు, ఆత్మముఖ్యాన్ - తాను ప్రముఖముగా గల రాక్షసులను, జఘనే - కటి ప్రదేశమునందు, ప్రజాపతీన్ - ప్రజాపతులను, నాభ్యామ్ - నాభియందు, నభః - ఆకాశమును, కుక్షిషు - ఉదరముయొక్క వివిధభాగములయందు, సప్త - ఏడు, సింధూన్ - సముద్రములను, ఉరసి - వక్షఃస్థలమునందు, ఋక్షమాలాం చ - నక్షత్రముల పంక్తిని కూడ, ఐక్షత్ - చూచెను.

సర్వవ్యాపి, చాల పెద్ద అడుగులు గలవాడు అగు ఆ శ్రీహరి యొక్క వస్త్రమునందు సంధ్య, గుహ్యమునందు తాను ప్రముఖముగా గల రాక్షసులు, కటి ప్రదేశమునందు మరీచి మొదలగు ప్రజాపతులు, నాభి

యందు ఆకాశము, ఉదరముయొక్క వివిధభాగములయందు ఏడు సముద్రములు, వక్షఃస్థలమునందు నక్షత్రముల పంక్తి కూడ బలికి కానవచ్చెను.

హృద్యంగ ధర్మం స్తనయోర్మురారే
ఋతం చ సత్యం చ మనస్యథేందుమ్ ।
శ్రియం చ వక్షస్యరవిందహస్తాం
కంఠే చ సామాని సమస్తరేఫాన్ ॥ 25

అంగ - ఓయీ!, ముర-అరేః - ముర అనే రాక్షసుని సంహరించిన శ్రీహరియొక్క, హృది - హృదయమునందు, ధర్మమ్ - ధర్మమును, స్తనయోః - రెండు స్తనములయందు, ఋతం చ - సత్యవాక్కును, సత్యం చ - సమదర్శనమును, అథ - తరువాత, మనసి - మనస్సునందు, ఇందుమ్ - చంద్రుని, వక్షసి - వక్షఃస్థలమునందు, అరవిందహస్తామ్ - పద్మము చేతియందు గల, శ్రియం చ - లక్ష్మీదేవిని కూడ, కంఠే - కంఠమునందు, సామాని - సామలను, సమస్తరేఫాన్ చ - సకల శబ్దములను కూడ.

ఓ రాజా! ముర అనే రాక్షసుని సంహరించిన శ్రీహరియొక్క హృదయమునందు ధర్మము, రెండు స్తనములయందు సత్యవచనము మరియు సమదర్శనము (అంతటా ఈశ్వరుని దర్శించుట), మనస్సునందు చంద్రుడు, వక్షఃస్థలమునందు చేతియందు పద్మమును పట్టుకొని యున్న లక్ష్మీదేవి, కంఠమునందు సామలు మరియు సకలశబ్దములు కానవచ్చెను.

ఇంద్రప్రధానానమరాన్ భుజేషు
తత్కర్ణయోః కకుభో ద్యౌశ్చ మూర్ధ్ని ।
కేశేషు మేఘాన్ శ్వసనం నాసికాయా-
మక్ష్ణోశ్చ సూర్యం వదనే చ వహ్నిమ్ ॥ 26

భుజేషు - భుజములయందు, ఇంద్రప్రధానాన్ - ఇంద్రుడు ప్రముఖముగా గల, అమరాన్ - దేవతలను, తత్-కర్ణయోః - ఆ విశ్వరూపుని

రెండు చెవులయందు, కకుభః - దిక్కులను, మూర్ధ్ని - శిరస్సుపై, ద్యోః చ - స్వర్గమును కూడ, కేశేషు - కేశములయందు, మేఘాన్ - మేఘములను, నాసికాయామ్ - ముక్కునందు, శ్వసనమ్ - వాయువును, అక్ష్ణోః - రెండు కన్నులయందు, సూర్యం చ - సూర్యుని కూడ, వదనే - నోటియందు, వహ్నిం చ - అగ్నిని కూడ.

ఆ విశ్వరూపుని భుజములయందు ఇంద్రుడు ప్రముఖముగా గల దేవతలు, రెండు చెవులయందు దిక్కులు, తలపై స్వర్గలోకము, జుట్టునందు మేఘములు, ముక్కునందు వాయువు, రెండు కన్నులలో సూర్యుడు, నోటిలో అగ్ని కానవచ్చెను.

వాణ్యాం చ ఛందాంసి రసే జలేశం
భ్రువోర్నిషేధం చ విధిం చ పక్ష్మసు ।
అహశ్చ రాత్రిం చ పరస్య పుంసో
మన్యుం లలాటేఽధర ఏవ లోభమ్ ॥ 27

పరస్య పుంసః - పురుషోత్తమునియొక్క, వాణ్యాం చ - వాక్కునందు, ఛందాంసి - వేదములను, రసే - నాలుకయందు, జల-ఈశమ్ - జలాధిపతియగు వరుణుని, భ్రువోః - కనుబొమలయందు, నిషేధం చ - నిషేధమును, విధిం చ - విధిని కూడ, పక్ష్మసు - కనురెప్పలయందు, అహః చ - పగలును, రాత్రిం చ - రాత్రిని కూడ, లలాటే - నుదురునందు, మన్యుమ్ - కోపమును, అధరే - క్రింది పెదవియందు, లోభం ఏవ - లోభమును.

బలి పురుషోత్తముని వాక్కునందు వేదములను, నాలుకయందు జలాధిపతియగు వరుణుని, కనుబొమలయందు విధినిషేధముల శాస్త్రములను, కనురెప్పలయందు రాత్రింబగళ్లను, నుదురునందు కోపమును, క్రింది పెదవియందు లోభమును చూచెను.

స్పర్శే చ కామం నృప రేతసోఽంభః
పృష్ఠే త్వధర్మం క్రమణేషు యజ్ఞమ్ ।

ఛాయాసు మృత్యుం హసితే చ మాయాం
తనూరుహేష్వోషధిజాతయశ్చ ॥ 28

నృప - ఓ మహారాజా!, స్పర్శే - త్వగింద్రియమునందు, కామం చ - మన్మథుని, రేతసః - రేతస్సునందు, అంభః - నీటిని, పృష్ఠే తు - వీపునందైతే, అధర్మమ్ - అధర్మమును, క్రమణేషు - అడుగులను వేయుటయందు, యజ్ఞమ్ - యజ్ఞమును, ఛాయాసు - నీడలయందు, మృత్యుమ్ - మృత్యువును, హసితే - నవ్వునందు, మాయాం చ - మాయాశక్తిని, తనూరుహేషు - రోమములయందు, ఓషధిజాతయః చ - రకరకముల చెట్టుచేమలను.

ఓ మహారాజా! బలి ఆ విశ్వరూపునియొక్క త్వగింద్రియమునందు మన్మథుని, రేతస్సునందు నీటిని, వీపునందు అధర్మమును, అడుగులను వేయుటయందు యజ్ఞమును, కదలాడే నీడయందు మృత్యువును, నవ్వునందు మాయాశక్తిని, రోమములయందు పలురకముల చెట్టుచేమలను చూచెను.

నదీశ్చ నాడీషు శిలా నఖేషు బుద్ధావజం దేవగణానృషీంశ్చ ।
ప్రాణేషు గాత్రే స్థిరజంగమాని సర్వాణి భూతాని దదర్శ వీరః॥29

సర్వాత్మనీదం భువనం నిరీక్ష్య సర్వేऽసురాః కశ్మలమాపురంగ ।

వీరః - వీరుడగు బలి, నాడీషు - నాడులయందు, నదీః చ - నదులను, నఖేషు - గోళ్లయందు, శిలాః - రాళ్లను, బుద్ధౌ - బుద్ధియందు, అజమ్ - స్వయంభువుడగు బ్రహ్మగారిని, ప్రాణేషు - ఇంద్రియములయందు, దేవగణాన్ - దేవతల గణములను, ఋషీన్ చ - మహర్షులను కూడ, గాత్రే - దేహమునందు, స్థిరజంగమాని - కదలనివి మరియు కదిలేవి అగు, సర్వాణి - సకలములైన, భూతాని - ప్రాణులను, దదర్శ - చూచెను, అంగ - ఓయీ!, సర్వ-ఆత్మని - సర్వము తానే అయి ఉన్న శ్రీహరియందు, ఇదమ్ - ఈ, భువనమ్ - జగత్తును, నిరీక్ష్య - చూచి, అసురాః - రాక్షసులు, సర్వే - అందరు, కశ్మలమ్ - భయమును, ఆపుః - పొందిరి.

ఓ మహారాజా! వీరుడగు బలి విశ్వరూపుడగు శ్రీహరియొక్క నాడులయందు నదులను, గోళ్లయందు రాళ్లను, బుద్ధియందు స్వయంభు వుడగు బ్రహ్మగారిని, ఇంద్రియములయందు దేవతల గణములను మరియు మహర్షులను, దేహమునందు చరాచరములగు సకలప్రాణులను కూడ చూచెను. సర్వము తానే అయి ఉన్న ఆ శ్రీహరియందు ఈ జగత్తును చూచి రాక్షసులందరు భయమును పొందిరి.

సుదర్శనం చక్రమసహ్యతేజో
ధనుశ్చ శార్ఙ్గం స్తనయిత్నుఘోషమ్ ॥ 30

పర్జన్యఘోషో జలజః పాంచజన్యః కౌమోదకీ విష్ణుగదా తరస్వినీ,
విద్యాధరోఽసిశ్శతచంద్రయుక్తస్తూణోత్తమావక్షయసాయకౌ చ ॥ 31

సునందముఖ్యా ఉపతస్థురీశం పార్షదముఖ్యాస్సహలోకపాలాః ।

అసహ్యతేజః - సహించ శక్యము కాని తేజస్సు గల, సుదర్శనమ్ - సుదర్శనమనే, చక్రమ్ - చక్రము, స్తనయిత్నుఘోషమ్ - పిడుగుయొక్క శబ్దము వంటి శబ్దము గల, శార్ఙ్గమ్ - శార్ఙ్గమనే, ధనుః చ - ధనుస్సు కూడ, పర్జన్యఘోషః - మేఘముయొక్క గర్జనవంటి శబ్దము గల, పాంచజన్యః - పాంచజన్యమనే, జలజః - శంఖము, తరస్వినీ - వేగము గల, కౌమోదకీ - కౌమోదకి అనే, విష్ణుగదా - విష్ణువుయొక్క గద, శతచంద్రయుక్తః - వంద బుడిపెల డాలుతో గూడియున్న, విద్యాధరః - విద్యాధరము అనే, అసిః - కత్తి, అక్షయసాయకౌ - తరిగిపోని బాణములు గల, తూణ-ఉత్తమౌ చ - ఉత్తమమైన అంబుల పొదులు కూడ, సహలోకపాలాః - లోకపాలకులతో గూడియున్న, సునందముఖ్యాః - సునందుడు మొదలుగాగల, పార్షదముఖ్యాః - ప్రముఖులైన అనుచరులు, ఈశమ్ - జగన్నాథుడగు శ్రీహరిని, ఉపతస్థుః - ఉపస్థితులైరి.

సహించ శక్యము కాని తేజస్సు గల సుదర్శన చక్రము, పిడుగు వంటి ధ్వనిని చేసే శార్ఙ్గధనుస్సు, మేఘగర్జనవంటి ధ్వనిని చేసే పాంచజన్యమనే శంఖము, వేగము గల కౌమోదకి అనే విష్ణువుయొక్క గద, వంద బుడిపెల డాలుతో కూడియున్న విద్యాధరము (నందకము) అనే కత్తి, తరి

గిపోని బాణములు గల ఉత్తమమైన అంబుల పొదులు, లోకపాలకులు, సునందుడు నందుడు మొదలగు ప్రముఖులైన విష్ణుపార్షదులు కూడ తమ తమ స్థానములలో ఆ సర్వేశ్వరుని సేవకొరకు సిద్ధముగా నుండిరి.

స్ఫురత్కిరీటాంగదమీనకుండలశ్రీవత్సరత్నోత్తమమేఖలాంబరైః॥
మధువ్రతస్రగ్వనమాలయా వృతో రరాజ రాజన్ భగవానురుక్రమః।
క్షితిం పదైకేన బలేర్విచక్రమే నభశ్శరీరేణ దిశశ్చ బాహుభిః ॥33

రాజన్ - ఓ మహారాజా!, స్ఫురత్-కిరీట-అంగదమీనకుండలశ్రీవత్సరత్న-ఉత్తమమేఖల-అంబరైః - మెరిసిపోయే కిరీటము భుజపురులు చేప ఆకారములోనున్న కుండలములు శ్రీవత్సమనే పుట్టుమచ్చ ఉత్తమమైన కౌస్తుభమాణిక్యము మొలనూలు మరియు వస్త్రములచే, మధువ్రతస్రగ్-వనమాలయా - తుమ్మెదల పంక్తి గల వనమాలతో, వృతః - కూడియున్న, ఉరుక్రమః - పెద్ద అడుగులు (గొప్ప పరాక్రమము) గల, భగవాన్ - శ్రీహరి భగవానుడు, రరాజ - ప్రకాశించెను, బలేః - బలి చక్రవర్తియొక్క, క్షితిమ్ - పృథివిని, ఏకేన - ఒక, పదా - కాలితో, శరీరేణ - శరీరముతో, నభః - ఆకాశమును, బాహుభిః - బాహువులతో, దిశః చ - దిక్కులను కూడ, విచక్రమే - ఆక్రమించెను.

ఓ మహారాజా! శ్రీహరి ధరించిన కిరీటము, భుజపురులు, చేప ఆకారములో ఉండే కుండలములు, శ్రీవత్సమనే పుట్టుమచ్చ, ఉత్తమమైన కౌస్తుభమాణిక్యము, మొలనూలు మరియు వస్త్రము మెరిసిపోవుచుండెను. ఆయన ధరించిన వనమాల చుట్టూ తుమ్మెదల వరుస ప్రకాశించెను. పెద్ద అడుగులు గలవాడు, గొప్ప పరాక్రమశాలి అగు శ్రీహరి ఒక కాలితో బలి చక్రవర్తి అధీనములోనున్న భూలోకమును, శరీరముతో ఆకాశమును, బాహువులతో దిక్కులను కూడ ఆక్రమించెను.

పదం ద్వితీయం క్రమతస్త్రివిష్టపం
న వై తృతీయాయ తదీయమణ్వపి ।

ఉరుక్రమస్యాంఘ్రిరుపర్యుపర్యథో
మహర్జనాభ్యాం తపసః పరం గతః ॥ 34

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే వామనావతారే
త్రివిక్రమావిర్భావవర్ణనం నామ వింశోఽధ్యాయః ॥

ద్వితీయమ్ - రెండవ, పదమ్ - అడుగును, క్రమతః - వేయుచున్న శ్రీహరికి, త్రివిష్టపమ్ - స్వర్గము, తృతీయాయ - మూడవ అడుగు కొరకు, తదీయమ్ - బలికి చెందినది, అణు అపి - లేశమైననూ, న వై - లేనే లేదు, ఉరుక్రమస్య - పెద్ద అడుగులు గల శ్రీహరియొక్క, అంఘ్రిః - పాదము, ఉపరి ఉపరి - పైపైకి, మహః-జనాభ్యామ్ - మహర్లోక జనలోకములకంటె, అథో - మరియు, తపసః - తపోలోకముకంటె, పరమ్ - పైన ఉన్న సత్యలోకమును, గతః - చేరుకొనెను.

శ్రీహరి రెండవ అడుగును వేయగా, స్వర్గము ఆయనకు స్వాధీనమయ్యెను. మూడవ అడుగు వేయుటకు బలికి చెందినది లేశమైననూ మిగలలేదు. శ్రీహరి వేసిన ఆ పెద్ద అడుగు మహర్లోక-జనలోక-తపోలోకములను దాటి సత్యలోకమును చేరుకొనెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
వామనావతారవృత్తాంతములో వామనుడు త్రివిక్రముడై
రెండు అడుగులలో జగత్తును ఆక్రమించుటను వర్ణించే
ఇరవదియవ అధ్యాయము ముగిసినది (20).

*****

# అథ ఏకవింశోऽధ్యాయః

## వామనావతారము - బలి చక్రవర్తి బంధితుడగుట

శ్రీశుక ఉవాచ ।
సత్యం సమీక్ష్యాబ్జభవో నఖేందుభిః
హతస్వధామద్యుతిరావృతోऽభ్యగాత్ ।
మరీచిమిశ్రా ఋషయో బృహద్వ్రతాః
సనందనాద్యా నరదేవ యోగినః ॥ 1

నరదేవ - ఓ పరీక్షిన్మహారాజా!, నఖ-ఇందుభిః - చంద్రవంకవంటి గోళ్లచే, సత్యమ్ - సత్యలోకమును, సమీక్ష్య - పరిశీలనగా చూచి, హతస్వధామద్యుతిః - నిరస్తమైన తన ధామముయొక్క కాంతి గల, అబ్జభవః - పద్మసంభవుడగు బ్రహ్మగారు, ఆవృతః - కప్పివేయబడినవాడై, అభ్యగాత్ - ఎదురేగెను, మరీచిమిశ్రాః - మరీచి మొదలగు, ఋషయః - మహర్షులు, బృహద్-వ్రతాః - నైష్ఠిక బ్రహ్మచారులగు నారదుడు మొదలగువారు, సనందన-ఆద్యాః - సనందనుడు మొదలగు, యోగినః - యోగులు.

ఓ పరీక్షిన్మహారాజా! త్రివిక్రముని పాదములయొక్క చంద్రవంకలవంటి గోళ్ల కాంతిలో సత్యలోకము, స్వయంభువుడగు బ్రహ్మగారు వెలవెల బోయిరి. బ్రహ్మగారు ఆ కాంతిలో మునిగిపోయి, ఆ పాదమునకు ఎదురేగెను. మరీచి మొదలగు మహర్షులు, నారదుడు మొదలగు నైష్ఠిక బ్రహ్మచారులు, సనందనుడు మొదలగు యోగులు కూడ ఎదురేగిరి.

వేదోపవేదా నియమాన్వితా యమాః
తర్కేతిహాసాంగపురాణసంహితాః ।
యే చాపరే యోగసమీరదీపిత-

జ్ఞానాగ్నినా రంధితకర్మకల్మషాః ।
వవందిరే యత్స్మరణానుభావతః
స్వాయంభువం ధామ గతా అకర్మకమ్ ।। 2

వేద-ఉపవేదాః - వేదములు ఉపవేదములు, యమ-అన్వితాః - యమములతో కూడిన, నియమాః - నియమములు, తర్క-ఇతిహాస-అంగ పురాణసంహితాః - న్యాయశాస్త్రము ఇతిహాసములు వేదాంగములు పురాణములు సంహితలు, యే చ - ఎవరైతే, అపరే - ఇతరులు, యోగసమీర దీపితజ్ఞాన-అగ్నినా - యోగమనే వాయువుచే ప్రజ్వరిల్ల జేయబడిన జ్ఞానము అనే అగ్నిచే, రంధితకర్మకల్మషాః - దహించబడిన కర్మలు అనే కల్మషము గలవారు, వవందిరే - నమస్కరించిరి, యత్-స్మరణ-అనుభావతః - ఏ శ్రీహరి పాదముయొక్క స్మరణముయొక్క ప్రభావము వలన, అకర్మకమ్ - కామ్యకర్మలచే పొంద శక్యము కాని, స్వాయంభువమ్ - స్వయంభువుడగు బ్రహ్మగారి, ధామ - సత్యలోకమును, గతాః - పొందిరో.

వేదములు (ఋగ్వేదము మొదలైనవి), ఉపవేదములు (ఆయుర్వేదము మొదలైనవి), యమములు (అహింస మొదలగునవి), నియమములు (శౌచము మొదలైనవి), న్యాయశాస్త్రము, ఇతిహాసములు (రామాయణ భారతములు), వేదాంగములు (వ్యాకరణము మొదలైనవి), పురాణములు (భాగవతము మొదలైనవి), సంహితలు (గర్గసంహిత మొదలైనవి) సత్యలోకములో మూర్తులను దాల్చి నివసించును. ఇంతేగాక, యోగము అనే వాయువుచే ప్రజ్వరిల్ల జేయబడిన జ్ఞానము (ఉపాసన) అనే అగ్నిచే దహించబడిన కర్మల కాలుష్యము గల యోగులు కూడ అక్కడ ఉండెదరు. వీరందరు ఆ భగవానుని పాదమునకు నమస్కరించిరి. స్వయంభువుడగు బ్రహ్మగారి ధామము (సత్యలోకము) కామ్యకర్మలచే పొంద శక్యము కానిది. దానిని ఈ యోగులు శ్రీహరి పాదమును స్మరించి, ఆ మహిమచే పొందినారు.

అథాంఘ్రయే ప్రోన్నమితాయ విష్ణోః
ఉపాహరత్పద్మభవోఽర్హణోదకమ్ ।

సమర్చ్య భక్త్యాऽభ్యగృణాచ్ఛుచిశ్రవా
యన్నాభిపంకేరుహసంభవస్స్వయమ్ ॥ 3

అథ - తరువాత, శుచిశ్రవాః - స్వచ్ఛమగు కీర్తి గల, పద్మభవః - పద్మసంభవుడగు బ్రహ్మగారు, ప్ర-ఉన్నమితాయ - బాగా పైకి ఎదిగియున్న, విష్ణోః - విష్ణువుయొక్క, అంఘ్రయే - పాదము కొరకు, అర్హణ-ఉదకమ్ - పూజాజలము (అర్ఘ్యము) ను, ఉపాహరత్ - సమర్పించెను, భక్త్యా - భక్తితో, సమర్చ్య - చక్కగా పూజించి, అభ్యగృణాత్ - స్తుతించెను, స్వయమ్ - తాను, యత్-నాభిపంకేరుహసంభవః - ఏ శ్రీహరియొక్క నాభియందలి పద్మమునుండి పుట్టినవాడో.

తరువాత, శ్రీహరియొక్క నాభియందలి పద్మమునుండి పుట్టిన బ్రహ్మగారు బాగా పైకి ఎదిగియున్న విష్ణువుయొక్క పాదమునకు స్వయముగా అర్ఘ్యమును సమర్పించెను. ఆయన ఆ పాదమును భక్తితో పూజించి స్తుతించెను.

ధాతుః కమండలుజలం తదురుక్రమస్య
పాదావనేజనపవిత్రతయా నరేంద్ర ।
స్వర్ధున్యభూన్నభసి సా పతతీ నిమార్ష్టి
లోకత్రయం భగవతో విశదేవ కీర్తిః ॥ 4

నర-ఇంద్ర - ఓ మహారాజా!, తత్ - ఆ, ధాతుః - బ్రహ్మగారి, కమండలుజలమ్ - కమండలమునందలి నీరు, ఉరుక్రమస్య - పెద్ద అడుగులు వేసిన శ్రీహరియొక్క, పాద-అవనేజనపవిత్రతయా - పాదములను కడుగుటచే కలిగిన పవిత్రతచే, స్వః-ధునీ - స్వర్గమునందలి గంగ, అభూత్ - ఆయెను, సా - ఆ గంగ, నభసి - ఆకాశమునందు, పతతీ - పడుచున్నదై, భగవతః - శ్రీహరి భగవానునియొక్క, విశదా - స్వచ్ఛమైన, కీర్తిః ఇవ - కీర్తి వలె, లోకత్రయమ్ - ముల్లోకములను, నిమార్ష్టి - పవిత్రము చేయుచున్నది.

ఓ మహారాజా! ఆ బ్రహ్మగారి కమండలమునందలి నీరు పెద్ద అడుగులు వేసిన శ్రీహరియొక్క పాదములను కడుగుటచే పవిత్రమై స్వర్గ

మునందు గంగయై ప్రవహించెను. అదియే అంతరిక్షమునందు పడి, శ్రీహరి భగవానునియొక్క స్వచ్ఛమైన కీర్తి వలె, ముల్లోకములను పవిత్రము చేయుచున్నది.

బ్రహ్మాదయో లోకనాథాస్స్వనాథాయ సమాదృతాః ।
సానుగా బలిమాజహ్రుస్సంక్షిప్తాత్మవిభూతయే ।। 5

బ్రహ్మ-ఆదయః - బ్రహ్మగారు మొదలైన, లోకనాథాః - లోకపాలకులు, స-అనుగాః - అనుచరులతో కూడినవారై, సమాదృతాః - చక్కని ఆదరము గలవారై, సంక్షిప్త-ఆత్మవిభూతయే - ఉపసంహరించబడిన తన మహిమ గల, స్వనాథాయ - తమ నాథుని కొరకు, బలిమ్ - పూజను, ఆజహ్రుః - చేసిరి.

శ్రీహరి తన మహిమను ఉపసంహరించి వామనరూపములో నుండెను. అప్పుడు బ్రహ్మగారు, లోకపాలకులు తమ అనుచరులతో గూడి తమ నాథుడగు శ్రీహరిని చక్కని ఆదరముతో పూజించిరి.

తోయైస్సమర్హణైస్స్రగ్భిర్దివ్యగంధానులేపనైః ।
ధూపైర్దీపైస్సురభిభిర్లాజాక్షతఫలాంకురైః ।। 6

సమర్హణైః - ఉపచారములుగా సమర్పించబడిన, సురభిభిః - పరిమళభరితములైన, తోయైః - జలములతో, స్రగ్భిః - పుష్పమాలలతో, దివ్యగంధ-అనులేపనైః - దివ్యమగు సుగంధద్రవ్యములను అలముటలచే, ధూపైః - ధూపములతో, దీపైః - దీపములతో, లాజ-అక్షతఫల-అంకురైః - పేలాలు అక్షతలు పళ్లు మరియు దూర్వ (గడ్డి పరక) లతో (పూజించిరి).

వారు వామనుని అర్ఘ్య-పాద్య-స్నాన-ఆచమనీయములనే ఉపచారములను పరిమళభరితములైన నీటితో సమర్పించిరి. వారు సుగంధద్రవ్యములను ఆయనకు అలమి ధూపదీపములతో పూజించిరి. వారాయనను పేలాలు, అక్షతలు, దూర్వాంకురములతో పూజించి పళ్లను నైవేద్యమిడిరి.

స్తవనైర్జయశబ్దైశ్చ తద్వీర్యమహిమాంకితైః ।
నృత్యవాదిత్రగీతైశ్చ శంఖదుందుభినిస్స్వనైః ।। 7

తద్-వీర్యమహిమా-అంకితైః - ఆయనయొక్క పరాక్రమము యొక్క మహిమచే అంకితమైన, స్తవనైః - స్తోత్రములతో, జయశబ్దైః చ - జయజయధ్వానములతో, నృత్యవాదిత్రగీతైః చ - నాట్యములు వాద్య ములు గానములతో, శంఖదుందుభినిస్స్వనైః - శంఖములు దుందుభుల ధ్వనులతో (ఆరాధించిరి).

వారు జయజయధ్వానములను చేస్తూ ఆయన పరాక్రమము యొక్క మహిమను ఉటంకించే స్తోత్రములతో ఆయనను స్తుతించిరి. నాట్య ములు, వాద్యములు, గానములతో ఆయనను ఆరాధించిరి. వారు ఆయన పూజలో భాగముగా శంఖములను, దుందుభులను మ్రోగించిరి.

జాంబవానృక్షరాజస్తు భేరీశబ్దైర్మనోజవః ।
విజయం దిక్షు సర్వాసు మహోత్సవమఘోషయత్ ॥ 8

మనః-జవః - మనస్సుయొక్క వేగమువంటి వేగము గల, ఋక్ష రాజః - ఎలుగుబంట్లకు రాజైన, జాంబవాన్ తు - జాంబవంతుడైతే, సర్వాసు - అన్ని, దిక్షు - దిక్కులయందు, భేరీశబ్దైః - భేరీధ్వనులతో, మహా-ఉత్సవమ్ - గొప్ప ఉత్సవము కలుగునట్లుగా, విజయమ్ - విజయ మును, అఘోషయత్ - చాటెను.

ఎలుగుబంట్లకు రాజగు జాంబవంతుడు మనోవేగముతో దిక్కుల న్నింటియందు తిరిగి భేరీశబ్దముతో పెద్ద ఉత్సవము కలుగునట్లుగా శ్రీహరి యొక్క విజయమును చాటెను.

మహీం సర్వాం హృతాం దృష్ట్వా త్రిపదవ్యాజయాచ్ఞయా ।
ఊచుస్స్వభర్తురసురా దీక్షితస్యాత్యమర్షితాః ॥ 9

దీక్షితస్య - యజ్ఞదీక్షయందున్న, స్వభర్తుః - తమ రాజుయొక్క, సర్వామ్ - సమస్తమైన, మహీమ్ - భూమిని, త్రిపదవ్యాజయాచ్ఞయా - మూడు అడుగులను కపటముగా యాచించుటచే, హృతామ్ - అపహరిం చబడినదానినిగా, దృష్ట్వా - చూచి, అసురాః - రాక్షసులు, అతి-అమర్షితాః - అధికమగు కోపమును పొందినవారై, ఊచుః - పలికిరి.

తమ రాజు యజ్ఞదీక్షలోనుండగా మూడు అడుగుల భూమిని యాచించి మోసముతో భూమినంతనూ లాగివేసుకొనుటను గాంచిన రాక్షసులు చాల కోపమును పొంది ఇట్లు పలికిరి.

న వా అయం బ్రహ్మబంధుర్విష్ణుర్మాయావినాం వరః ।
ద్విజరూపప్రతిచ్ఛన్నో దేవకార్యం చికీర్షతి ॥ 10

అయమ్ - ఈతడు, బ్రహ్మబంధుః - బ్రాహ్మణ బాలకుడు, న - కాడు, వై - నిశ్చయము, మాయావినామ్ - మోసగాళ్లలో, వరః - అగ్రేసరుడగు, విష్ణుః - విష్ణువు, ద్విజరూపప్రతిచ్ఛన్నః - బ్రాహ్మణవేషములో దాగియున్నవాడు, దేవకార్యమ్ - దేవతలకు పనిని, చికీర్షతి - చేసిపెట్ట గోరుచున్నాడు.

ఈ వామనుడు బ్రాహ్మణ బాలకుడు కాడు. ఈతడు మోసగాళ్లలో అగ్రేసరుడగు విష్ణువు. ఇది నిశ్చయము. విష్ణువే దేవతలకు కార్యమును చక్కబెట్ట గోరి, ఈ విధముగా కపట బ్రాహ్మణవేషముతో వచ్చినాడు.

అనేన యాచమానేన శత్రుణా వటురూపిణా ।
సర్వస్వం నో హృతం భర్తుర్న్యస్తదండస్య బర్హిషి ॥ 11

వటురూపిణా - బ్రహ్మచారి వేషములోనున్నవాడై, యాచమానేన - యాచించుచున్న, శత్రుణా - శత్రువైన, అనేన - వీనిచే, న్యస్తదండస్య - విడిచిపెట్టబడిన దండము గల, నః - మనయొక్క, భర్తుః - ప్రభువుయొక్క, సర్వస్వమ్ - సర్వసంపద, బర్హిషి - యజ్ఞమునందు, హృతమ్ - అపహరించబడినది.

బ్రహ్మచారివేషములోనున్న ఈతడు మన శత్రువు. మన ప్రభువు ఇతరులను దండించే అధికారమును పరిత్యజించి యజ్ఞములో నుండగా ఈతడు వచ్చి యాచించి ఆయన సకలసంపదలను లాగివేసినాడు.

సత్యవ్రతస్య సతతం దీక్షితస్య విశేషతః ।
నానృతం భాషితుం శక్యం బ్రహ్మణ్యస్య దయావతః ॥ 12

సతతమ్ - అన్ని కాలములయందు, సత్యవ్రతస్య - సత్యము నందు నిష్ఠ కలిగినట్టియు, విశేషతః - ప్రత్యేకించి, దీక్షితస్య - యజ్ఞదీక్ష యందున్నట్టియు, బ్రహ్మణ్యస్య - బ్రాహ్మణులయందు భక్తి కలిగినట్టియు, దయావతః - దయామయుడగు బలికి, అనృతమ్ - అసత్యమును, భాషితుమ్ - పలుకుటకు, న శక్యమ్ - శక్యము కాదు.

బలి సర్వకాలములలో సత్యమునందు నిష్ఠ గలవాడు. ఆయన బ్రాహ్మణులయందు భక్తిగల దయామయుడు. ఆయన విశేషించి యజ్ఞ దీక్షలో నుండగా, అసత్యమును పలుకుట సంభవము కాదు.

తస్మాదస్య వధో ధర్మో భర్తుశ్శుశ్రూషణం చ నః ।
ఇత్యాయుధాని జగృహుర్బలేరనుచరాసురాః ॥ 13

తస్మాత్ - అందువలన, అస్య - వీనియొక్క, వధః - వధ, ధర్మః - ధర్మము, నః - మన, భర్తుః - ప్రభువునకు, శుశ్రూషణం చ - సేవ కూడా, ఇతి - అని, బలేః - బలియొక్క, అనుచర-అసురాః - అనుచరులైన రాక్షసులు, ఆయుధాని - ఆయుధములను, జగృహుః - తీసుకొనిరి.

అందువలన, వీనిని వధించుటయే ధర్మము; పైగా, అది మన ప్రభువునకు సేవ చేసినట్లు అగును -- అని పలుకుతూ, బలియొక్క అనుచరులగు రాక్షసులు ఆయుధములను చేబట్టిరి.

తే సర్వే వామనం హంతుం శూలపట్టిశపాణయః ।
అనిచ్ఛతో బలే రాజన్ ప్రాద్రవన్ జాతమన్యవః ॥ 14

రాజన్ - ఓ మహారాజా!, బలేః - బలి, అనిచ్ఛతః - ఇష్టపడకున్నను, జాతమన్యవః - కలిగిన కోపము గల, తే - వారు, సర్వే - అందరు, శూలపట్టిశపాణయః - శూలములు అడ్డకత్తులు చేతులయందు గలవారై, వామనమ్ - వామనుని, హంతుమ్ - చంపుటకు, ప్రాద్రవన్ - పరుగు తీసిరి.

ఓ రాజా! బలి వ్యతిరేకించిననూ వారందరు కోపముతో శూలములను, అడ్డకత్తులను పట్టుకొని వామనుని చంపుటకై ముందునకురికిరి.

తానభిద్రవతో దృష్ట్వా దితిజానీకపాన్ నృప ।
ప్రహస్యానుచరా విష్ణోః ప్రత్యషేధన్నుదాయుధాః ।। 15

నృప - ఓ మహారాజా!, అభిద్రవతః - ముందునకు ఉరుకుచున్న, తాన్ - ఆ, దితిజ-అనీకపాన్ - రాక్షస సేనానాయకులను, దృష్ట్వా - చూచి, ప్రహస్య - గట్టిగా నవ్వి, విష్ణోః - విష్ణువుయొక్క, అనుచరాః - అనుచరులు, ఉద్-ఆయుధాః - పైకెత్తబడిన ఆయుధములు గలవారై, ప్రత్యషేధన్ - అడ్డు తగిలిరి.

ఓ మహారాజా! ముందునకు ఉరుకుచున్న ఆ రాక్షస సేనానాయ కులను చూచి విష్ణువుయొక్క అనుచరులు గట్టిగా నవ్వి, ఆయుధములను పైకెత్తి వారిని అడ్డుకొనిరి.

నందస్సునందోఽథ జయో విజయః ప్రబలో బలః ।
కుముదః కుముదాక్షశ్చ విష్వక్సేనః పతత్త్రిరాట్ ।। 16

జయంతః శ్రుతదేవశ్చ పుష్పదంతోఽథ సాత్వతః ।
సర్వే నాగాయుతప్రాణాశ్చమూం తే జఘ్నురాసురీమ్ ।। 17

నందః - నందుడు, సునందః - సునందుడు, అథ - మరియు, జయః - జయుడు, విజయః - విజయుడు, ప్రబలః - ప్రబలుడు, బలః - బలుడు, కుముదః - కుముదుడు, కుముదాక్షః చ - కుముదాక్షుడు కూడ, విష్వక్సేనః - విష్వక్సేనుడు, పతత్త్రిరాట్ - పక్షిరాజగు గరుత్మంతుడు, జయంతః - జయంతుడు, శ్రుతదేవః చ - శ్రుతదేవుడు, పుష్పదంతః - పుష్పదంతుడు, అథ - మరియు, సాత్వతః - సాత్వతుడు, సర్వే - అంద రు, నాగ-అయుతప్రాణాః - పదివేల ఏనుగుల బలము గలవారు, తే - వారు, ఆసురీమ్ - రాక్షసులకు చెందిన, చమూమ్ - సైన్యమును, జఘ్నుః - దునుమాడిరి.

నందుడు, సునందుడు, జయుడు, విజయుడు, బలుడు, ప్రబలు డు, కుముదుడు, కుముదాక్షుడు, విష్వక్సేనుడు, పక్షిరాజగు గరుత్మంతు డు, జయంతుడు, శ్రుతదేవుడు, పుష్పదంతుడు మరియు సాత్వతుడు

అనే వీరందరు పదివేల ఏనుగుల బలము గలవారే. వారు ఆ రాక్షసుల సైన్యమును దునుమాడిరి.

హన్యమానాన్ స్వకాన్ దృష్ట్వా పురుషానుచరైర్బలిః ।
వారయామాస సంరబ్ధాన్ కావ్యశాపమనుస్మరన్ ॥ 18

బలిః - బలి, కావ్యశాపమ్ - శుక్రాచార్యుని శాపమును, అనుస్మరన్ - గుర్తు చేసుకున్నవాడై, పురుష-అనుచరైః - పురుషోత్తముని అనుచరులచే, హన్యమానాన్ - సంహరించబడుచున్న, స్వకాన్ - తనవారిని, సంరబ్ధాన్ - కోపించి యున్నవారిని, దృష్ట్వా - చూచి, వారయామాస - వారించెను.

బలికి శుక్రాచార్యుని శాపము గుర్తుకు వచ్చెను. కోపించియున్న తన వారిని పురుషోత్తముని అనుచరులు చంపుచుండుటను చూచి, ఆయన తన వారిని వారించెను.

హే విప్రచిత్తే హే రాహో హే నేమే శ్రూయతాం వచః ।
మా యుధ్యత నివర్తధ్వం న నః కాలోఽయమర్థకృత్ ॥ 19

హే విప్రచిత్తే - ఓ విప్రచిత్తీ!, హే రాహో - ఓ రాహూ!, హే నేమే - ఓ నేమీ!, వచః - మాట, శ్రూయతామ్ - వినబడు గాక!, మా యుధ్యత - యుద్ధమును చేయకుడు, నివర్తధ్వమ్ - వెనుదిరుగుడు, అయమ్ - ఈ, కాలః - కాలము, నః - మనకు, అర్థకృత్ - ప్రయోజనకారి, న - కాదు.

ఓ విప్రచిత్తీ! ఓ రాహూ! ఓ నేమీ! నా మాటను వినుడు. యుద్ధమును మాని వెనుదిరుగుడు. ఈ కాలము మనకు అనుకూలము కాదు.

యః ప్రభుస్సర్వభూతానాం సుఖదుఃఖోపపత్తయే ।
తం నాతివర్తితుం దైత్యాః పౌరుషైరీశ్వరః పుమాన్ ॥ 20

దైత్యాః - ఓ రాక్షసులారా!, యః - ఏ కాలము, సర్వభూతానామ్ - సకలప్రాణులయొక్క, సుఖదుఃఖ-ఉపపత్తయే - సుఖదుఃఖములనిచ్చుట కొరకై, ప్రభుః - సమర్థమో, తమ్ - అట్టి కాలమును, పౌరుషైః - పురుషకా

రములచే, అతివర్తితుమ్ - అతిక్రమించుటకు, పుమాన్ - మానవుడు, ఈశ్వరః - సమర్థుడు, న - కాడు.

ఓ రాక్షసులారా! సకలప్రాణులకు సుఖదుఃఖములనిచ్చేది కాలమే. మానవుడు పురుషకారములచే దానిని అతిక్రమించుటకు సమర్థుడు కాడు.

యో నో భవాయ ప్రాగాసీదభవాయ దివౌకసామ్ ।
స ఏవ భగవానద్య వర్తతే తద్విపర్యయమ్ ॥ 21

యః - ఏ కాలము, ప్రాక్ - పూర్వము, నః - మనయొక్క, భవాయ - కల్యాణము కొరకు, దివౌకసామ్ - స్వర్గవాసులయొక్క, అభవాయ - దుఃఖము కొరకు, ఆసీత్ - ఆయెనో, భగవాన్ - సర్వసమర్థమైన, సః ఏవ - ఆ కాలమే, అద్య - ఈనాడు, తద్-విపర్యయమ్ - దానికి విరుద్ధముగా, వర్తతే - ఉన్నది.

కాలము సర్వసమర్థమైనది. అది ఇదివరలో మనకు కల్యాణమును, స్వర్గవాసులకు దుఃఖమును ఇచ్చినది. అదే కాలము ఈ నాడు దానికి విరుద్ధముగా మనకు దుఃఖమును, దేవతలకు అభివృద్ధిని ఇచ్చుచున్నది.

బలేన సచివైర్బుద్ధ్యా దుర్గైర్మంత్రౌషధాదిభిః ।
సామాదిభిరుపాయైశ్చ కాలం నాత్యేతి వై జనః ॥ 22

జనః - మానవుడు, బలేన - సైన్యముతో, సచివైః - మంత్రులతో, బుద్ధ్యా - తెలివితేటలతో, దుర్గైః - దుర్గములతో, మంత్ర-ఔషధ-ఆదిభిః - మంత్రములు ఔషధములు మొదలగువాటితో, సామ-ఆదిభిః - సామము మొదలైన, ఉపాయైః చ - ఉపాయములతో కూడ, కాలమ్ - కాలమును, వై - నిశ్చయముగా, న అతి-ఏతి - అతిక్రమించ లేదు.

సైన్యము, మంత్రులు, తెలివితేటలు, దుర్గములు, మంత్రములు ఔషధములు యంత్రములు మొదలైనవి, మరియు సామదానభేదదండోపాయములు అనువాటితో మానవుడు కాలమును అతిక్రమించలేడు. ఇది నిశ్చయము.

భవద్భిర్నిర్జితా హ్యేతే బహుశోఽనుచరా హరేః ।
దైవేనర్ద్ధైస్త ఏవాద్య యుధి జిత్వా నదంతి నః ।। 23

దైవేన - కాలముచే, ఋద్ధైః - సమృద్ధులైయున్న, భవద్భిః - మీచే, ఏతే - ఈ, హరేః - శ్రీహరియొక్క, అనుచరాః - అనుచరులు, బహుశః - పలుమార్లు, నిర్జితాః హి - జయించబడినారు గదా!, తే ఏవ - వారే, అద్య - ఈనాడు, నః - మనలను, యుధి - యుద్ధమునందు, జిత్వా - జయించి, నదంతి - సింహనాదమును చేయుచున్నారు.

కాలము కలిసివచ్చి సంపదలు ఉన్నప్పుడు మీరే ఈ శ్రీహరి అనుచరులను పలుమార్లు జయించిరి గదా! కాని, ఈ నాడు కాలము కలిసి రాక, వారు మనలను జయించి సింహనాదమును చేయుచున్నారు.

ఏతాన్ వయం విజేష్యామో యది దైవం ప్రసీదతి ।
తస్మాత్కాలం ప్రతీక్షధ్వం యో నోఽర్థత్వాయ కల్పతే ।। 24

దైవమ్ - దైవము, యది ప్రసీదతి - అనుకూల మైనచో, వయమ్ - మనము, ఏతాన్ - వీరిని, విజేష్యామః - జయించగలము, తస్మాత్ - అందువలన, కాలమ్ - కాలమును, ప్రతీక్షధ్వమ్ - వేచిచూడుడు, యః - ఏ కాలము, నః - మనకు, అర్థత్వాయ - కార్యసిద్ధి కొరకు, కల్పతే - అనుకూలమగునో.

దైవము అనుకూలమైనచో మనము వీరిని జయించగలము. కావున, మనకు కార్యసిద్ధికి అనుకూలమయ్యే కాలము కొరకు వేచియుండుడు.

శ్రీశుక ఉవాచ ।
పత్యుర్నిగదితం శ్రుత్వా దైత్యదానవయూథపాః ।
రసాం నివివిశూ రాజన్ విష్ణుపార్షదతాడితాః ।। 25

రాజన్ - ఓ మహారాజా!, పత్యుః - ప్రభువుయొక్క, నిగదితమ్ - మాటను, శ్రుత్వా - విని, విష్ణుపార్షదతాడితాః - విష్ణువుయొక్క అనుచరులచే కొట్టబడిన, దైత్యదానవయూథపాః - దితి దనువంశములకు చెందిన సేనానాయకులు, రసామ్ - రసాతలమును, నివివిశుః - ప్రవేశించిరి.

ఓ మహారాజా! దితి దనువంశములకు చెందిన రాక్షస సేనానాయకులు తమ నాయకుడగు బలియొక్క మాటను స్వీకరించిరి. విష్ణువు యొక్క అనుచరులచే నిర్జించబడిన ఆ సేనానాయకులు రసాతలమును ప్రవేశించిరి.

అథ తార్క్ష్యసుతో జ్ఞాత్వా విరాట్ ప్రభుచికీర్షితమ్ ।
బబంధ వారుణైః పాశైర్బలిం సౌత్యేఽహని క్రతౌ ॥ 26

అథ - తరువాత, తార్క్ష్యసుతః - కశ్యపుని పుత్రుడు, విరాట్ - పక్షిరాజు అగు గరుత్మంతుడు, ప్రభుచికీర్షితమ్ - శ్రీహరి ప్రభుడు చేయగోరినదానిని, జ్ఞాత్వా - తెలుసుకొని, క్రతౌ - యజ్ఞమునందు, సౌత్యే అహని - సుత్యాహస్సునాడు, బలిమ్ - బలిని, వారుణైః - వరుణునకు చెందిన, పాశైః - పాశములతో, బబంధ - బంధించెను.

తరువాత కశ్యపుని పుత్రుడు, పక్షిరాజు అగు గరుత్మంతుడు శ్రీహరి ప్రభువి అభిప్రాయమును తెలుసుకొని, ఆ బలిని అదే యజ్ఞములో సుత్యాహస్సు (సోమరసమును దంచే రోజు) నందు వరుణపాశములతో బంధించెను.

హాహాకారో మహానాసీద్రోదస్యోస్సర్వతోదిశమ్ ।
గృహ్యమాణేఽసురపతౌ విష్ణునా ప్రభవిష్ణునా ॥ 27

ప్రభవిష్ణునా - సర్వసమర్థుడగు, విష్ణునా - శ్రీహరిచే, అసురపతౌ - రాక్షసరాజగు బలి, గృహ్యమాణే - బంధించబడుచుండగా, రోదస్యోః - భూలోక స్వర్గలోకములయందు, సర్వతః-దిశమ్ - అన్ని దిక్కులయందు, మహాన్ - పెద్ద, హాహాకారః - హాహాకారము, ఆసీత్ - కలిగెను.

సర్వసమర్థుడగు శ్రీహరి రాక్షసరాజగు బలిని బంధించుచుండగా, భూలోక స్వర్గలోకములయందు అన్ని దిక్కులలో హాహాకారములు బయలు దేరెను.

తం బద్ధం వారుణైః పాశైర్భగవానాహ వామనః ।
నష్టశ్రియం స్థిరప్రజ్ఞముదారయశసం నృప ॥ 28

వారుణైః - వరుణునకు చెందిన (నాగ), పాశైః - పాశములచే, బద్ధమ్ - బంధింపబడినట్టియు, నష్టశ్రియమ్ - తొలగిపోయిన శోభ కలిగిన ట్టియు, స్థిరప్రజ్ఞమ్ - స్థిరమైన వివేకజ్ఞానము కలిగినట్టియు, ఉదారయశసమ్ - గొప్ప కీర్తి గల, తమ్ - ఆ బలిని, వామనః భగవాన్ - వామన భగవానుడు, ఆహ - పలికెను.

స్థిరమైన వివేకజ్ఞానము, గొప్ప కీర్తి గల బలి నాగపాశములచే బంధించబడి శోభను కోల్పోయి ఉండెను. అపుడు వామన భగవానుడు ఆయనతో ఇట్లు పలికెను.

పదాని త్రీణి దత్తాని భూమేర్మహ్యం త్వయాఽసుర ।
ద్వాభ్యాం క్రాంతా మహీ సర్వా తృతీయముపకల్పయ ॥29

అసుర - ఓ రాక్షసా!, మహ్యమ్ - నా కొరకు, భూమేః - భూమి యొక్క, త్రీణి - మూడు, పదాని - అడుగులు, దత్తాని - ఈయబడినవి, ద్వాభ్యామ్ - రెండింటితో, మహీ - భూమి, సర్వా - అంతా, క్రాంతా - ఆక్రమించబడినది, తృతీయమ్ - మూడవ అడుగును, ఉపకల్పయ - ఇమ్ము.

ఓ రాక్షసా! నాకు నీవు మూడు అడుగుల భూమిని వాగ్దానము చేసితివి. నేను రెండు అడుగులతో భూమినంతనూ ఆక్రమించితిని. నాకు మూడవ అడుగు భూమిని ఇమ్ము.

యావత్తపత్యసౌ గోభిర్యావదిందుస్సహోడుభిః ।
యావద్వర్షతి పర్జన్యస్తావతీ భూరియం తవ ॥ 30

యావత్ - ఎంతవరకైతే, అసౌ - ఈ సూర్యుడు, గోభిః - కిరణములతో, తపతి - తపించునో, యావత్ - ఎంతవరకైతే, ఉడుభిః సహ - నక్షత్రములతో సహా, ఇందుః - చంద్రుడు, యావత్ - ఎంతవరకైతే, పర్జన్యః - మేఘము, వర్షతి - వర్షించునో, తావతీ - అంతటి, ఇయమ్ - ఈ, భూః - భూమి, తవ - నీది.

ఈ సూర్యుడు తన కిరణములతో ఎంతవరకైతే తపింపజేయునో, ఎంతవరకైతే చంద్రుడు నక్షత్రములు ప్రకాశింప జేయునో, ఎంతవరకైతే మేఘము వర్షించునో, అంతటి భూమి (సకల భూమండలము) నీ అధీన ములో నుండెడిది.

పదైకేన మయా క్రాంతో భూర్లోకః ఖం దిశస్తనోః ।
స్వర్లోకస్తు ద్వితీయేన పశ్యతస్తే స్వమాత్మనా ॥ 31

మయా - నాచే, ఏకేన - ఒక, పదా - అడుగుతో, భూః లోకః - భూలోకము, క్రాంతః - ఆక్రమించబడినది, తనోః - శరీరముచే, ఖమ్ - ఆకాశము, దిశః - దిక్కులు, ద్వితీయేన - రెండవ అడుగుతో, స్వః-లోకః తు - స్వర్గలోకము కూడ, తే - నీవు, పశ్యతః - చూచుచుండగా, ఆత్మనా - వ్యాపకుడనైన నాచే, స్వమ్ - సంపద.

వ్యాపకుడనగు నేను ఒక అడుగుతో భూలోకమును, శరీరముతో ఆకాశమును దిక్కులను, రెండవ అడుగుతో స్వర్గలోకమును ఆక్రమించితి ని. నీవు చూచుచుండగనే నీ సంపద నాది అయినది.

ప్రతిశ్రుతమదాతుస్తే నిరయే వాస ఇష్యతే ।
విశ త్వం నిరయం తస్మాద్గురుణా చానుమోదితః ॥ 32

ప్రతిశ్రుతమ్ - వాగ్దానము చేసినదానిని, అదాతుః - ఈయని, తే - నీకు, నిరయే - నరకమునందు, వాసః - నివాసము, ఇష్యతే - అంగీక రించబడుచున్నది, తస్మాత్ - అందువలన, గురుణా చ - గురువగు శుక్రా చార్యునిచే గూడ, అనుమోదితః - అనుమోదించబడిన, త్వమ్ - నీవు, నిరయమ్ - నరకమును, విశ - ప్రవేశించుము.

వాగ్దానము చేసినదానిని దానము చేయని నీకు నరకమునందు నివాసము శాస్త్రముచే అంగీకరించబడినది. నీ గురువగు శుక్రాచార్యుడు కూడ అదే విషయమును అనుమోదించినాడు. కావున, నీవు నరకమును ప్రవేశించుము.

వృథా మనోరథస్తస్య దూరే స్వర్గః పతత్యధః ।
ప్రతిశ్రుతస్యాదానేన యోఽర్థినం విప్రలంభతే ॥ 33

తస్య - వానియొక్క, మనోరథః - మనోరథము, వృథా - వ్యర్థము, స్వర్గః - స్వర్గము, దూరే - దూరమే, అధః - క్రింద, పతతి - పడుచున్నాడు, యః - ఎవడైతే, ప్రతిశ్రుత్య - వాగ్దానము చేసి, అదానేన - ఈయకపోవుటచే, అర్థినమ్ - యాచకుని, విప్రలంభతే - మోసగించునో.

ఎవడైతే యాచకునకు మాట ఇచ్చి దానము చేయకుండా మోసగించునో, అట్టివానియొక్క స్వర్గసుఖములను పొందాలనే మనోరథము వ్యర్థము. అట్టివానికి స్వర్గము చాల దూరము. వాడు నరకములో పడును.

విప్రలబ్ధో దదామీతి త్వయాహం చాఢ్యమానినా ।
తద్వ్యలీకఫలం భుంక్ష్వ నిరయం కతిచిత్సమాః ॥ 34

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే
వామనావతారే బలినిగ్రహో నామ ఏకవింశోఽధ్యాయః ॥

ఆఢ్యమానినా - సంపన్నుడనని గర్వించే, త్వయా - నీచే, అహం చ - నేను కూడ, దదామి - ఇచ్చెదను, ఇతి - అని, విప్రలబ్ధః - మోసగించబడితిని, తద్-వ్యలీకఫలమ్ - ఆ మోసమునకు ఫలమైన, నిరయమ్ - నరకమును, కతిచిత్ - కొన్ని, సమాః - సంవత్సరములను, భుంక్ష్వ - అనుభవించుము.

నేనే సంపన్నుడననే గర్వము నీకు గలదు. నీవు ఇచ్చెదనని మాట ఇచ్చి నన్ను కూడ మోసగించినావు. ఆ మోసమునకు ఫలము నరకము. కావున, నీవు కొన్ని సంవత్సరములు నరకమునసుభవించుము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
వామనావతారవృత్తాంతములో బలి బంధించబడుటను వర్ణించే
ఇరువది ఒకటవ అధ్యాయము ముగిసినది (21).

*****

# అథ ద్వావింశోఽధ్యాయః

## వామనావతారము - బలిపై శ్రీహరి ప్రసన్నుడగుట

శ్రీశుక ఉవాచ ।
ఏవం విప్రకృతో రాజన్ బలిర్భగవతాఽసురః ।
భిద్యమానోఽప్యభిన్నాత్మా ప్రత్యాహావిక్లవం వచః ॥ 1

రాజన్ - ఓ పరీక్షిన్మహారాజా!, అసురః - రాక్షసుడగు, బలిః - బలి, భగవతా - భగవానునిచే, ఏవమ్ - ఈ విధముగా, విప్రకృతః - తిరస్కారము చేయబడినవాడు, భిద్యమానః అపి - చలింప జేయబడువాడైననూ, అభిన్న-ఆత్మా - చలించని బుద్ధి గలవాడు, అవిక్లవమ్ - దీనము కాని, వచః - మాటను, ప్రతి-ఆహ - బదులు పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! బలి అనే ఆ రాక్షసుని భగవానుడీ విధముగా తిరస్కారము చేసెను. బలి మనస్సును సత్యమునుండి శుక్రాచార్యుడు చలింప జేసిననూ, ఆయన చలించలేదు. అట్టి బలి ఇట్లు బదులు చెప్పెను.

బలిరువాచ ।
యద్యుత్తమశ్లోక భవాన్ మమేరితం
వచో వ్యలీకం సురవర్య మన్యతే ।
కరోమ్యృతం తన్న భవేత్ప్రలంభనం
పదం తృతీయం కురు శీర్ష్ణి మే నిజమ్ ॥ 2

ఉత్తమశ్లోక - పవిత్రమగు కీర్తి గలవాడా!, సురవర్య - దేవశ్రేష్ఠా!, భవాన్ - తమరు, మమ - నాయొక్క, ఈరితమ్ - పలుకబడిన, వచః - మాటను, వ్యలీకమ్ - అసత్యమునుగా, యది మన్యతే - భావించుచున్న

చో, తత్ - ఆ మాటను, ఋతమ్ - సత్యమునుగా, కరోమి - చేసెదను, ప్రలంభనమ్ - మోసపు మాట, న భవేత్ - కారాదు, నిజమ్ - నీదైన, తృతీయమ్ - మూడవ, పదమ్ - అడుగును, మే - నాయొక్క, శీర్‌ష్ణి - తలపై, కురు - ఉంచుము.

పవిత్రమగు కీర్తి గల ఓ దేవశ్రేష్ఠా! నేను పలికిన మాటను నీవు అసత్యమని తలచుచున్నావా? అట్లైనచో, నేనా మాటను సత్యము చేసెదను. అది మోసపు పలుకు కారాదు. నీ మూడవ అడుగును నా తలపై నుంచుము.

బిభేమి నాహం నిరయాత్పదచ్యుతో
న పాశబంధాద్వ్యసనాద్దురత్యయాత్ ।
నైవార్థకృచ్ఛ్రాద్భవతో వినిగ్రహా-
దసాధువాదాద్భృశముద్విజే యథా ॥ 3

అహమ్ - నేను, నిరయాత్ - నరకము వలన, పదచ్యుతః - రాజ్యమునుండి జారిపోవుట వలన, న బిభేమి - భయపడను, పాశబంధాత్ - పాశముల బంధము వలన, దురత్యయాత్ - అతిక్రమించ శక్యము కాని, వ్యసనాత్ - ఆపద వలన, న - భయపడను, అర్థకృచ్ఛ్రాత్ - డబ్బు ఇబ్బంది (దారిద్ర్యము) వలన, భవతః - నీయొక్క, వినిగ్రహాత్ - దండము వలన, న ఏవ - సుతరాము భయపడను, యథా - ఏ విధముగా నైతే, అసాధువాదాత్ - అపకీర్తి వలన, భృశమ్ - అధికముగా, ఉద్విజే - భయపడెదనో.

నేను అపకీర్తి వలన ఎంత అధికముగా భయపడెదనో, ఆ విధముగా నరకము వలన గాని, రాజ్యాధికారమునుండి జారిపోవుట వలన గాని, పాశముల బంధము వలన గాని, అతిక్రమించ శక్యము కాని ఆపద వలన గాని, దారిద్ర్యము వలన గాని, నీవు వేసే శిక్ష వలన గాని సుతరాము భయపడను.

పుంసాం శ్లాఘ్యతమం మన్యే దండమర్హత్తమార్పితమ్ ।
యం న మాతా పితా భ్రాతా సుహృదశ్చాదిశంతి హి ॥ 4

అర్హత్తమ-అర్పితమ్ - మిక్కిలి యోగ్యుడగు వ్యక్తిచే వేయబడిన, దండమ్ - శిక్ష, పుంసామ్ - మానవులకు, శ్లాఘ్యతమమ్ - మిక్కిలి కొని యాడదగినదని, మన్యే - తలచుచున్నాను, హి - ఏలయనగా, యమ్ - ఏ శిక్షనైతే, మాతా - తల్లి, పితా - తండ్రి, భ్రాతా - సోదరుడు, సుహృదః చ - మిత్రులు కూడ, న ఆదిశంతి - వేయరో.

మిక్కిలి యోగ్యుడవగు నీవు వేసే శిక్ష మానవులకు మిక్కిలి కొని యాడదగినదని నా అభిప్రాయము. ఎందుకంటే, అటువంటి శిక్షను తల్లి, తండ్రి, సోదరుడు, మిత్రులు కూడ వేయలేరు.

త్వం నూనమసురాణాం నః పారోక్ష్యః పరమో గురుః ।
యో నోఽనేకమదాంధానాం విభ్రంశం చక్షురాదిశత్ ।। 5

త్వమ్ - నీవు, నూనమ్ - నిశ్చయముగా, అసురాణామ్ - రాక్షసులమగు, నః - మాకు, పారోక్ష్యః - తెలియబడకుండా ఉండే, పరమః - గొప్ప, గురుః - గురుడవు, యః - ఏ నీవు, అనేకమద-అంధానామ్ - అనేకములైన గర్వములచే గ్రుడ్డివారమగు, నః - మాకు, విభ్రంశమ్ - జారిపోవుటను, చక్షుః - కనువిప్పుగా, ఆదిశత్ - ఇచ్చితివో.

రాక్షసులమగు మాకు నీవు తెలియబడకుండా హితమును చేసే గొప్ప గురుడవు. పలువిధములైన గర్వములతో గ్రుడ్డివారమై యున్న మమ్ములను నీవు రాజ్యభ్రష్టులను చేసి కనువిప్పును కలిగించితివి.

యస్మిన్ వైరానుబంధేన రూఢేన విబుధేతరాః ।
బహవో లేభిరే సిద్ధిం యాము హైకాంతయోగినః ।। 6

బహవః - అనేకులు, విబుధ-ఇతరాః - రాక్షసులు, యస్మిన్ - ఏ నీయందు, రూఢేన - దృఢమైన, వైర-అనుబంధేన - వైరముయొక్క నిరంతర స్మరణచే, సిద్ధిమ్ - మోక్షమును, లేభిరే - పొందిరో, ఉ - ఆహా!, యామ్ - ఏ సిద్ధినైతే, ఏకాంతయోగినః హ - అనన్యమగు భక్తియోగనిష్ఠ గలవారు పొందిరో.

ఆశ్చర్యము! చాలమంది రాక్షసులు నీయందు దృఢమైన వైర మును బూని ఆ కారణముగా నిన్నే నిరంతరముగా స్మరించి, అనన్యమగు భక్తియోగనిష్ఠ గలవారు పొందే సిద్ధి (మోక్షము) ని పొందిరి.

తేనాహం నిగృహీతోఽస్మి భవతా భూరికర్మణా ।
బద్ధశ్చ వారుణైః పాశైర్నాతివ్రీడే న చ వ్యథే ॥ 7

తేన - అట్టి, భూరికర్మణా - అనేకములగు లీలలు గల, భవతా - నీచే, అహమ్ - నేను, నిగృహీతః - బంధించబడినవాడను, అస్మి - అగు చున్నాను, వారుణైః - వరుణునకు చెందిన, పాశైః - పాశములచే, బద్ధః చ - బంధించబడినవాడనే అయిననూ, న అతివ్రీడే - పెద్ద సిగ్గు పడను, న చ వ్యథే - దుఃఖమును కూడ పొందను.

నీ లీలలు అనేకములు. అట్టి నీవు నన్ను వరుణపాశములతో బంధించితివి. అయిననూ, నేను అధికముగా సిగ్గు పడుట లేదు; పీడను కూడ పొందుట లేదు.

పితామహో మే భవదీయసంమతః ప్రహ్లాద ఆవిష్కృతసాధువాదః।
భవద్విపక్షేణ విచిత్రవైశసం సంప్రాపితస్త్వత్పరమస్స్వపిత్రా ॥ 8

మే - నాయొక్క, పితామహః - తాత, ఆవిష్కృతసాధువాదః - ఆవిష్కరించబడిన మంచి కీర్తి గలవాడు అగు, ప్రహ్లాదః - ప్రహ్లాదుడు, భవ దీయసంమతః - నీ భక్తులలో సమ్మానించబడువాడు, త్వత్-పరమః - నీవే పరమలక్ష్యముగా గలవాడు, భవద్-విపక్షేణ - నీ శత్రువగు, స్వపిత్రా - తన తండ్రిచే, విచిత్రవైశసమ్ - పలురకముల దుఃఖమును, సంప్రాపితః - పొందించబడినవాడు.

మా తాత ప్రహ్లాదుడు లోకప్రసిద్ధమైన సత్కీర్తి గలవాడు. నీవే పర మలక్ష్యముగా గల ఆయన నీ భక్తులలో ఉత్తముడు. నీ శత్రువు, తనకు తండ్రియగు హిరణ్యకశిపుడు ఆయనను చిత్రహింసలు పెట్టెను.

కిమాత్మనాఽనేన జహాతి యోఽంతతః
కిం రిక్థహారైస్స్వజనాఖ్యదస్యుభిః ।

కిం జాయయా సంసృతిహేతుభూతయా
మర్త్యస్య గేహైః కిమిహాయుషో వ్యయః ॥ 9

మర్త్యస్య - మరణించువానికి, ఇహ - ఈ లోకమునందు, అనేన - ఈ, ఆత్మనా - దేహముతో, కిమ్ - పని యేమి?, యః - ఏదైతే, అంతతః - అంతమునందు, జహాతి - విడిచి పెట్టునో, రిక్థహారైః - ఆస్తిని అనుభవించే, స్వజన-ఆఖ్యదస్యుభిః - తనవారు అనే దోపిడీగాండ్రతో, కిమ్ - పని యేమి?, సంసృతిహేతుభూతయా - సంసారమునకు కారణమైయున్న, జాయయా - భార్యతో, కిమ్ - పని యేమి?, గేహైః - ఇంటితో, కిమ్ - పని యేమి?, ఆయుషః - ఆయుర్దాయముయొక్క, వ్యయః - ఖర్చు అగుట.

మరణించే స్వభావము గల మానవునకు ఈ లోకములో దేహముతో పని యేమి? అది అంతములో ఎల్లాగైనా విడిచిపెట్టేదే. నావారు అనబడే వారు ఆస్తిని అనుభవించేదోపిడీగాండ్రు. వారితో మాత్రము ప్రయోజనమేమున్నది? సంసారము కొనసాగుటకు కారణమయ్యే భార్యతో ప్రయోజనమేమి గలదు? ఇంటితో ప్రయోజనమేమి? ఇవి కేవలము ఆయుర్దాయము ఖర్చు అగుటకు మాత్రమే పనికి వచ్చును.

ఇత్థం స నిశ్చిత్య పితామహో మహా-
నగాధబోధో భవతః పాదపద్మమ్ ।
ధ్రువం ప్రపేదే హ్యకుతోభయం జనాద్
భీతస్స్వపక్షక్షపణస్య సత్తమః ॥ 10

మహాన్ - మహాత్ముడు, అగాధబోధః - లోతైన జ్ఞానము గలవాడు, సత్తమః - గొప్ప సత్పురుషుడు అగు, సః - ఆ, పితామహః - తాతగారు, ఇత్థమ్ - ఈ విధముగా, నిశ్చిత్య - నిశ్చయించుకొని, జనాత్ - జనుని వలన, భీతః - భయపడినవాడై, స్వపక్షక్షపణస్య - తన పక్షమువారైన రాక్షసులను మట్టుబెట్టే, భవతః - నీయొక్క, ధ్రువమ్ - నిత్యమైనట్టియు, అకుతః-భయమ్ - దేనివలనైననూ భయము లేని, పాదపద్మమ్ - పద్మమువంటి పాదమును, ప్రపేదే హి - శరణు పొందెను గదా!

మా తాత ప్రహ్లాదుడు లోతైన జ్ఞానము గల మహాత్ముడు. దుష్టజనుల సంగము వలన భయపడే ఆ గొప్ప సత్పురుషుడు ఈ విధముగా నిశ్చయించుకొని, నీవు తన పక్షమువారైన రాక్షసులను మట్టుబెట్టిననూ, నీ పద్మమువంటి పాదమునే శరణు వేడెను. ఎందుకంటే, నీ పాదము నిత్యము, సకలభయములనుండి రక్షణ నిచ్చును.

అథాహమప్యాత్మరిపోస్తవాంతికం
దైవేన నీతః ప్రసభం త్యాజితశ్రీః ।
ఇదం కృతాంతాంతికవర్తి జీవితం
యయాఽధ్రువం స్తబ్ధమతిర్న బుధ్యతే ॥ 11

అథ - కావున, అహం అపి - నేను కూడ, దైవేన - దైవముచే, ఆత్మరిపోః - నాకు శత్రువైన, తవ - నీయొక్క, అంతికమ్ - సమీపమును, నీతః - తీసుకురాబడినవాడను, ప్రసభమ్ - బలాత్కారముగా, త్యాజితశ్రీః - విడిచిపెట్టునట్లు చేయబడిన సంపద గలవాడను, యయా - ఏ సంపద చే, స్తబ్ధమతిః - జడముగా చేయబడిన బుద్ధిగల వ్యక్తి, కృతాంత-అంతికవర్తి - మృత్యువు అధీనములోనున్న, ఇదమ్ - ఈ, జీవితమ్ - జీవితము, అధ్రువమ్ - అనిత్యమని, న బుధ్యతే - తెలియడో.

దైవము నన్ను కూడ నాకు శత్రువైన నీ దగ్గరకు లాగుకువచ్చినది. నీవు బలాత్కారముగా నా సంపదను ఊడలాగినావు. అది మంచిదే. ఎందుకంటే, సంపద వ్యక్తియొక్క బుద్ధిని జడముగా చేయును. అట్టి జడబుద్ధి మృత్యువునకు వశమై యుండే ఈ జీవితము అనిత్యమనే సత్యమును గుర్తించడు.

శ్రీశుక ఉవాచ ।
తస్యేత్థం భాషమాణస్య ప్రహ్లాదో భగవత్ప్రియః ।
ఆజగామ కురుశ్రేష్ఠ రాకాపతిరివోత్థితః ॥ 12

కురుశ్రేష్ఠ - కురువంశీయులలో శ్రేష్ఠమైనవాడా!, తస్య - ఆ బలి, ఇత్థమ్ - ఈ విధముగా, భాషమాణస్య - మాటలాడుచుండగా, భగవ

త్-ప్రియః - భగవానునకు ప్రీతిపాత్రుడు, ఉత్థితః - ఉదయించిన, రాకా పతిః ఇవ - పూర్ణచంద్రుడు వలె నున్నవాడు అగు, ప్రహ్లాదః - ప్రహ్లాదుడు, ఆజగామ - వచ్చెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- కురువంశీయులలో శ్రేష్ఠుడ వగు ఓ మహారాజా!, ఆ బలి ఇట్లు మాటలాడుచుండగనే, చంద్రుడు ఉద యించినట్లుగా, ప్రహ్లాదుడు విచ్చేసెను. ఆయన ఉదయించిన పూర్ణచంద్రుడు వలె నుండెను.

తమింద్రసేనస్స్వపితామహం శ్రియా
విరాజమానం నలినాయతేక్షణమ్ ।
ప్రాంశుం పిశంగాంబరమంజనత్విషం
ప్రలంబబాహుం సుభగం సమైక్షత ॥ 13

ఇంద్రసేనః - ఇంద్రునియొక్క సేనవంటి సేన గల బలి, శ్రియా - శోభతో, విరాజమానమ్ - ప్రకాశించుచున్నట్టియు, నలిన-ఆయత-ఈక్ష ణమ్ - పద్మమువంటి నిడివి కన్నులు కలిగినట్టియు, ప్రాంశుమ్ - పొడవైన ట్టియు, పిశంగ-అంబరమ్ - పచ్చని వస్త్రము కలిగినట్టియు, అంజనత్వి షమ్ - కాటుక వలె ప్రకాశించునట్టియు, ప్రలంబబాహుమ్ - బాగా పొడ వైన చేతులు కలిగినట్టియు, సుభగమ్ - సుందరుడైన, తమ్ - ఆ, స్వపితా మహమ్ - తన తాతగారిని, సమైక్షత - చూచెను.

ఇంద్రునియొక్క సేనవంటి సేన గల బలి తన తాతగారైన ఆ ప్రహ్లాదుని చూచెను. ఆయన పద్మమువంటి నిడివి కన్నులతో శోభిల్లి ప్రకా శించెను. పొడవైన ఆ ప్రహ్లాదుడు పచ్చని వస్త్రములను ధరించెను. కాటుక వలె ప్రకాశించే ఆయన బాగా పొడవైన చేతులతో సుందరముగా నుండెను.

తస్మై బలిర్వారుణపాశయంత్రితస్సమర్హణం నోపజహార పూర్వవత్
ననామ మూర్ధ్నాఽశ్రువిలోలలోచనస్సవ్రీడనీచీనముఖో బభూవ హ

వారుణపాశయంత్రితః - నాగపాశములచే కట్టివేయబడిన, బలిః - బలి, పూర్వవత్ - ఇదివరలో వలె, తస్మై - ఆ ప్రహ్లాదుని కొరకు, సమర్హ

ణమ్ - అర్ఘ్యము మొదలగు పూజను, న ఉపజహార - చేయలేదు, మూర్ధ్నా - శిరస్సుతో, ననామ - నమస్కరించెను, అశ్రువిలోలలోచనః - కన్నీటితో చంచలమైన కన్నులు గలవాడు, సవ్రీడనీచీనముఖః - సిగ్గుతో కూడి దించుకున్న తల గలవాడు, బభూవ హ - అయెను.

నాగపాశములచే కట్టివేయబడి యుండుటచే బలి పూర్వమునందు వలె ప్రహ్లాదునకు అర్ఘ్యము మొదలగు పూజను చేయలేదు; కేవలము తల వంచి నమస్కరించెను. ఆయన కళ్లు నీటితో నిండి చంచలముగా నుండెను. ఆయన సిగ్గుతో తల దించుకొని యుండెను.

స తత్ర హాసీనముదీక్ష్య సత్పతిం
సునందనందాద్యనుగైరుపాసితమ్ ।
ఉపేత్య భూమౌ శిరసా మహామనా
ననామ మూర్ధ్నా పులకాశ్రువిక్లబః ॥ 15

మహామనాః - గొప్ప జ్ఞానియగు, సః - ఆ ప్రహ్లాదుడు, తత్ర - అచట, ఆసీనమ్ - కూర్చున్నట్టియు, సత్-పతిమ్ - సత్పురుషులను పాలించునట్టియు, సునందనంద-ఆది-అనుగైః - సునందుడు నందుడు మొదలగు అనుచరులచే, ఉపాసితమ్ - ఉపాసించబడిన వామనుని, ఉదీక్ష్య - చూచి, శిరసా - శిరస్సుతో (నమస్కరిస్తూ), ఉపేత్య - సమీపించి, పులక-అశ్రువిక్లబః - గగుర్పాటుతో కన్నీటితో కలవరపడినవాడై, భూమౌ - నేలపై, మూర్ధ్నా - శిరస్సుతో, ననామ - నమస్కరించెను.

గొప్ప జ్ఞానియగు ఆ ప్రహ్లాదుడు అక్కడ కూర్చునియున్న వామన భగవానుని చూచెను. సత్పురుషులకు రక్షకుడగు ఆయనను సునందుడు, నందుడు, గరుత్మంతుడు మొదలగు అనుచరులు సేవించుచుండిరి. ఆపుడా ప్రహ్లాదుడు గగుర్పాటుతో, కన్నీటితో కలవరపడుతూ తలవంచి దగ్గరకు వెళ్లి నేలపై సాష్టాంగ నమస్కారమును చేసెను.

ప్రహ్లాద ఉవాచ ।
త్వయైవ దత్తం పదమైంద్రమూర్జితం

హృతం తదేవాద్య తథైవ శోభనమ్ ।
మన్యే మహానస్య కృతో హ్యనుగ్రహో
విభ్రంశితో యచ్ఛ్రియ ఆత్మమోహనాత్ ॥ 16

ఊర్జితమ్ - సమృద్ధమైన, ఐంద్రమ్ - ఇంద్రునకు చెందిన, పదమ్ - పదవి, త్వయా ఏవ - నీచేతనే, దత్తమ్ - ఈయబడినది, తత్ ఏవ - అదియే, అద్య - ఈనాడు, హృతమ్ - లాగుకొనబడినది, తథా ఏవ - ఆ విధముగనే, శోభనమ్ - మంగళకరము, హి - ఏలయనగా, అస్య - వీనికి, మహాన్ - గొప్ప, అనుగ్రహః - అనుగ్రహము, కృతః - చేయబడినది అని, మన్యే - తలచెదను, యత్ - ఏలయనగా, ఆత్మమోహనాత్ - బుద్ధిని మోహపెట్టే, శ్రియః - సంపదనుండి, విభ్రంశితః - జారిపోవునట్లు చేయబడినాడో.

ప్రహ్లాదుడు ఇట్లు పలికెను --- సమృద్ధమైన ఇంద్రపదవిని బలికి నీవే ఇచ్చి నీవే లాగుకొంటివి. ఇది కూడ చాల బాగున్నది. ఎందుకంటే, బుద్ధికి మోహమును కలిగించే సంపదను ఊడకొట్టి నీవు వీనిపై గొప్ప అనుగ్రహమునే చూపితివి.

యయా హి విద్వానపి ముహ్యతే యతః
తత్కో విచష్టే గతిమాత్మనో యథా ।
తస్మై నమస్తే జగదీశ్వరాయ వై
నారాయణాయాఖిలలోకసాక్షిణే ॥ 17

హి - ఎందుకంటే, యయా - ఏ సంపదచే, విద్వాన్ - నము కలవాడు, యతః అపి - ఇంద్రియనిగ్రహము కలవాడు కూడ, ముహ్యతే - మోహమును పొందునో, తత్ - అది ఉండగా, కః - ఎవడు, ఆత్మనః - ఆత్మయొక్క, గతిమ్ - తత్త్వమును, యథా - యథాతథముగా, విచష్టే - దర్శించును?, జగద్-ఈశ్వరాయ - జగన్నాథుడైనట్టియు, అఖిలలోకసాక్షిణే - సకలప్రాణులలో సాక్షి రూపముగానున్న, తస్మై - అట్టి, నారాయణాయ - నారాయణుడవగు, తే - నీ కొరకు, నమః వై - పలుమార్లు నమస్కారము.

ఓ నారాయణా! వివేకజ్ఞానము, ఇంద్రియనిగ్రహము కలవానికి కూడ సంపద మోహమును కలిగించును. అట్టిచో, సంపద గలవాడు ఎవ్వాడు ఆత్మతత్త్వమును యథాతథముగా దర్శించగల్గును? (దర్శించలేడు). జగన్నాథుడవగు నీవే సకలప్రాణులలో సాక్షిరూపముగా నున్నావు. నీకు పలుమార్లు నమస్కరించుచున్నాను.

శ్రీశుక ఉవాచ ।
తస్యానుశృణ్వతో రాజన్ ప్రహ్లాదస్య కృతాంజలేః ।
హిరణ్యగర్భో భగవానువాచ మధుసూదనమ్ ।। 18

రాజన్ - ఓ మహారాజా!, కృతాంజలేః - అంజలి ఘటించియున్న, తస్య - ఆ, ప్రహ్లాదస్య - ప్రహ్లాదుడు, అనుశృణ్వతః - వినుచుండగా, భగవాన్ - పూజనీయుడగు, హిరణ్యగర్భః - బ్రహ్మగారు, మధుసూదనమ్ - శ్రీహరిని ఉద్దేశించి, ఉవాచ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! ఆ ప్రహ్లాదుడు అంజలి ఘటించి వినుచుండగా, బ్రహ్మగారు (జగత్తునంతనూ శక్తి రూపముగా వ్యాపించియున్నవాడు) మధుసూదన (మధు అనే రాక్షసుని సంహరించిన) భగవానుని ఉద్దేశించి ఏదో చెప్ప గోరెను.

బద్ధం వీక్ష్య పతిం సాధ్వీ తత్పత్నీ భయవిహ్వలా ।
ప్రాంజలిః ప్రణతోపేంద్రం బభాషేఽవాఙ్ముఖీ నృప ।। 19

నృప - ఓ మహారాజా!, బద్ధమ్ - బంధించబడిన, పతిమ్ - భర్తయగు బలిని, వీక్ష్య - చూచి, సాధ్వీ - పతివ్రతయగు, తత్-పత్నీ - ఆయన భార్య, భయవిహ్వలా - భయమువలన కంగారు పడుచున్నదై, ప్రాంజలిః - చేతులు జోడించినదై, ఉపేంద్రమ్ - వామనుని, ప్రణతా - నమస్కరించినదై, అవాఙ్-ముఖీ - దించబడిన ముఖము గలదియై, బభాషే - పలికెను.

ఓ మహారాజా! తన భర్తయగు బలి బంధించబడి యుండుటను గాంచిన ఆయన భార్య భయముతో కంగారు పడెను. ఆ పతివ్రత ఇంద్రుని

సోదరుడగు వామనునకు చేతులను జోడించి తలవంచి నమస్కరించి, ఇట్లు పలికెను.

వింధ్యావలిరువాచ ।
క్రీడార్థమాత్మన ఇదం త్రిజగత్కృతం తే
స్వామ్యం తు తత్ర కుధియోఽపర ఈశ కుర్యుః ।
కర్తుః ప్రభోస్తవ కిమస్యత ఆవహంతి
త్యక్తహ్రియస్త్వదవరోపితకర్తృవాదాః ॥ 20

ఆత్మనః - నీయొక్క, క్రీడా-అర్థమ్ - లీల కొరకై, తే - నీచే, ఇదమ్ - ఈ, త్రిజగత్ - ముల్లోకములు, కృతమ్ - సృష్టించబడినది, ఈశ - ఓ ఈశ్వరా!, తత్ర - ఆ ముల్లోకములపై, అపరే - ఇతరులు, కుధియః - దుష్టబుద్ధులు, త్యక్తహ్రియః - విడిచిపెట్టబడిన సిగ్గు కలవారు, త్వద్-అవరోపితకర్తృవాదాః - నీచే ఆరోపించబడిన మేము కర్తలమనే పలుకులు గలవారు, స్వామ్యం తు - మాది అనే బుద్ధినైతే, కుర్యుః - చేయుదురు, కర్తుః - సృష్టించునట్టియు, ప్రభోః - పాలించునట్టియు, అస్యతః - ఉపసంహరించే, తవ - నీకు, కిమ్ - ఏమి, ఆవహంతి - సమర్పించెదరు?

ఓ ఈశ్వరా! నీవే నీ లీల కొరకై ఈ ముల్లోకములను సృష్టించితివి. కాని, కొందరు దుర్బుద్ధులు ఈ జగత్తునకు తామే ప్రభువులమని తలపోయుచుందురు. వారు సిగ్గు విడిచి తామే కర్తలమని ఆరోపించుకొని పలుకుచుందురు. వారియందు ఆ అజ్ఞానమును కలిగించినది కూడ నీ మాయాశక్తియే. ఈ జగత్తును సృష్టించి, పాలించి, ఉపసంహరించేది నీవై యుండగా, ఆ దుర్బుద్ధులు నీకు సమర్పించేది ఏది గలదు? (ఏమీ లేదు).

బ్రహ్మోవాచ ।
భూతభావన భూతేశ దేవదేవ జగన్మయ ।
ముంచైనం హృతసర్వస్వం నాయమర్హతి నిగ్రహమ్ ॥ 21

భూతభావన - ప్రాణులను సృష్టించువాడా!, భూత-ఈశ - ప్రాణులను పాలించువాడా!, దేవదేవ - ఓ దేవదేవా!, జగన్మయ - జగద్రూప

ముగా ప్రకటమైనవాడా!, హృతసర్వస్వమ్ - లాగుకొనబడిన సకలసంప దలు గల, ఏనమ్ - వీనిని, ముంచ - విడిచిపెట్టుము, అయమ్ - ఈతడు, నిగ్రహమ్ - బంధమును, న అర్హతి - తగడు.

బ్రహ్మగారు ఇట్లు పలికెను --- ఓ దేవదేవా! నీవే ప్రాణులను సృష్టించి పాలించెదవు. ఈ జగద్రూపముగా నీవే ప్రకటమైనావు. ఈ బలి యొక్క సంపదలన్నీ లాగుకొనబడినవి గనుక, వీనిని బంధమునుండి విడి పించుము. ఈతడు బంధించదగినవాడు కాదు.

కృత్స్నా తేఽనేన దత్తా భూర్లోకాః కర్మార్జితాశ్చ యే ।
నివేదితం చ సర్వస్వమాత్మాఽవిక్లబయా ధియా ॥ 22

అనేన - వీనిచే, కృత్స్నా - సమస్తమైన, భూః - భూలోకము, కర్మ-ఆర్జితాః - కర్మచే సంపాదించబడిన, యే - ఏ, లోకాః చ - లోక ములు గలవో అవి కూడ, తే - నీ కొరకు, దత్తాః - ఈయబడినవి, అవిక్ల బయా - దైన్యము లేని, ధియా - బుద్ధితో, సర్వస్వమ్ - సర్వస్వము, ఆత్మా చ - దేహము కూడ, నివేదితమ్ - సమర్పించబడినది.

ఈ బలి సమస్తమగు భూలోకమును, తాను పుణ్యకర్మలచే సంపా దించిన పుణ్యలోకములను, సర్వస్వమును కూడ నీకు సమర్పించినాడు. అయిననూ, ఈతని బుద్ధియందు దైన్యము లేదు.

యత్పాదయోరశఠధీస్సలిలం ప్రదాయ
దూర్వాంకురైరపి విధాయ సతీం సపర్యామ్ ।
అప్యుత్తమాం గతిమసౌ భజతే త్రిలోకీం
దాశ్వానవిక్లవమనాః కథమార్తిమృచ్ఛేత్ ॥ 23

అశఠధీః - కపటము లేని బుద్ధి గలవాడు, యత్-పాదయోః - ఏ నీ రెండు పాదములకు, సలిలమ్ - నీటిని, ప్రదాయ - సమర్పించి, దూర్వా-అంకురైః - పచ్చగడ్డి పరకలతో, సతీమ్ - యోగ్యమైన, సపర్యాం అపి - పూజను కూడ, విధాయ - చేసి, ఉత్తమామ్ - ఉత్తమమగు, గతిమ్ - లోకమును, భజతే - పొందుచున్నాడో, అసౌ అపి - ఈ బలి కూడ, అవి

క్లవమనాః - దైన్యము లేని మనస్సు గలవాడై, త్రిలోకీమ్ - ముల్లోకముల ను, దాశ్వాన్ - సమర్పించినవాడు, కథమ్ - ఏ విధముగా, ఆర్తిమ్ - ఆప దను, ఋచ్ఛేత్ - పొందును?

ఎవ్వరైననూ నిష్కపటముగా నీ రెండు పాదములకు అర్ఘ్యము నిచ్చి పచ్చగడ్డి పరకలతో చక్కని పూజను చేసినచో, అట్టివాడు ఉత్తమ మగు లోకములను పొందును. ఈ బలి దైన్యము లేని మనస్సుతో ముల్లోక ములను కూడ నీకు సమర్పించినాడు. అట్టి ఈతడు ఆపదను పొందుటకు ఎట్లు తగును?

శ్రీభగవానువాచ ।
బ్రహ్మన్ యమనుగృహ్ణామి తద్విశో విధునోమ్యహమ్ ।
యన్మదః పురుషః స్తబ్ధో లోకం మాం చావమన్యతే ॥ 24

బ్రహ్మన్ - ఓ బ్రహ్మగారూ!, అహమ్ - నేను, యమ్ - ఎవనినై తే, అనుగృహ్ణామి - అనుగ్రహించెదనో, తద్-విశః - వాని సంపదలను, విధునోమి - ఊడగొట్టెదను, యత్-మదః - వేటి గర్వము గల, పురుషః - వ్యక్తి, స్తబ్ధః - వినయము లేనివాడై, లోకమ్ - లోకమును, మాం చ - నన్ను కూడ, అవమన్యతే - అవమానించునో.

ఓ బ్రహ్మా! నేను ఎవనినైతే అనుగ్రహిస్తానో, వాని సంపదలను లాగుకొనెదను. ఎందుకంటే, సంపదలచే గర్వించి వినయమును కోల్పో యిన వ్యక్తి లోకమును, నన్ను కూడ అవమానించును.

యదా కదాచిజ్జీవాత్మా సంసరన్నిజకర్మభిః ।
నానాయోనిష్వనీశోఽయం పౌరుషీం గతిమావ్రజేత్ ॥ 25

అనీశః - అస్వతంత్రుడగు, అయమ్ - ఈ, జీవ-ఆత్మా - జీవుడు, నిజకర్మభిః - తన కర్మలచే, నానాయోనిషు - అనేకములగు జన్మలయం దు, సంసరన్ - పరిభ్రమించుచున్నవాడై, యదా కదాచిత్ - ఏదో ఒకనా డు, పౌరుషీమ్ - మనుష్యునకు సంబంధించిన, గతిమ్ - జన్మను, ఆవ్ర జేత్ - పొందును.

అస్వతంత్రుడగు ఈ జీవుడు తన కర్మల ఫలమునకు తగ్గట్లుగా అనేకయోనులలో జన్మించి పరిభ్రమిస్తూ, ఏదో ఒకప్పుడు మనుష్యజన్మను పొందును.

జన్మకర్మవయోరూపవిద్యైశ్వర్యధనాదిభిః ।
యద్యస్య న భవేత్ స్తంభస్తత్రాయం మదనుగ్రహః ॥ 26

తత్ర - ఆ మనుష్యజన్మయందు, అస్య - వీనికి, జన్మకర్మవయః-రూపవిద్యా-ఐశ్వర్యధన-ఆదిభిః - వంశము చేసిన పనులు వయస్సు రూపము చదువు అధికారము సంపద మొదలగువాటిచే, స్తంభః - గర్వము, యది న భవేత్ - కలుగనిచో, అయమ్ - ఈ గర్వము లేకుండుట, మద్-అనుగ్రహః - నా అనుగ్రహము.

ఆ మనుష్యజన్మలో ఈ జీవునకు వంశము, చేసిన గొప్ప పనులు, వయస్సు, రూపము, చదువు, అధికారము, సంపద, అనుచరులు మొదలగువాటి కారణముగా గర్వము లేకున్నచో, ఆ స్వభావము నా అనుగ్రహము మాత్రమే.

మానస్తంభనిమిత్తానాం జన్మాదీనాం సమంతతః ।
సర్వశ్రేయఃప్రతీపానాం హంత ముహ్యేన్న మత్పరః ॥ 27

మానస్తంభనిమిత్తానామ్ - గర్వము అవినయములకు కారణమైనట్టియు, సమంతతః - అన్ని విధములుగా, సర్వశ్రేయఃప్రతీపానామ్ - సకల కల్యాణములకు వినాశకములైన, జన్మ-ఆదీనామ్ - వంశము మొదలగువాటికి, హంత - నిశ్చయముగా, మత్-పరః - నా భక్తుడు, న ముహ్యేత్ - మోహమును పొందడు.

వంశము, ధనము మొదలగువాటి కారణముగా గర్వించి అవినయముగా ఉండే వ్యక్తికి సకలకల్యాణములు సర్వవిధములుగా దూరమగును. నా భక్తుడు నిశ్చయముగా అట్టి వ్యామోహమును పొందడు.

ఏష దానవదైత్యానామగ్రణీః కీర్తివర్ధనః ।
అజైషీదజయాం మాయాం సీదన్నపి న ముహ్యతి ॥ 28

ఏషః - ఈ బలి, దానవదైత్యానామ్ - దను దితివంశీయులగు రాక్షసులలో, అగ్రణీః - అగ్రేసరుడు, కీర్తివర్ధనః - కీర్తిని వర్ధిల్ల జేయువాడు, అజయామ్ - జయించ శక్యము కాని, మాయామ్ - మాయను, అజైషీత్ - జయించెను, సీదన్ అపి - ఆపదను పొందినవాడే అయిననూ, న ముహ్యతి - మోహమును పొందదు.

ఈ బలి దను దితివంశీయులగు రాక్షసులలో అగ్రేసరుడై కీర్తిని వర్ధిల్ల జేసినాడు. ఈతడు జయించ శక్యము కాని మాయను జయించినాడు. కావుననే, ఆపదను పొందిననూ వ్యామోహితుడు కాలేదు.

క్షీణరిక్థశ్చ్యుతః స్థానాత్ క్షిప్తో బద్ధశ్చ శత్రుభిః ।
జ్ఞాతిభిశ్చ పరిత్యక్తో యాతనామనుయాపితః ॥ 29

క్షీణరిక్థః - నశించిన సంపద గలవాడు, స్థానాత్ - పదవినుండి, చ్యుతః - జారిపోయినవాడు, క్షిప్తః - తిరస్కరించబడినవాడు, శత్రుభిః - శత్రువులచే, బద్ధః చ - బంధించబడినవాడు కూడా, జ్ఞాతిభిః - బంధువుల చే, పరిత్యక్తః చ - విడిచిపెట్టబడినవాడు, యాతనామ్ - తీవ్రమగు పీడను, అనుయాపితః - పొందించ బడినవాడు.

బలి సంపదను, అధికారమును కూడ పోగొట్టుకొని మనచే తిరస్కరించబడినాడు. శత్రువులగు మన చేతిలో బందీయై ఉన్న ఈతనిని జ్ఞాతులు విడిచిపెట్టిరి. ఈ విధముగా ఈతడు తీవ్రమగు పీడకు గురి చేయ బడినాడు.

గురుణా భర్త్సితశ్శప్తో జహౌ సత్యం న సువ్రతః ।
ఛలైరుక్తో మయా ధర్మో నాయం త్యజతి సత్యవాక్ ॥ 30

గురుణా - గురువుచే, భర్త్సితః - భయపెట్టబడినవాడు, శప్తః - శపించబడినవాడు, సువ్రతః - మంచి వ్రతనిష్ఠ గలవాడు, సత్యమ్ - సత్యమును, న జహౌ - విడిచిపెట్టలేదు, మయా - నాచే, ఛలైః - కపటవచనములచే, ధర్మః - ధర్మము, ఉక్తః - చెప్పబడినది, సత్యవాక్ - సత్యమును పలికే, అయమ్ - ఈతడు, న త్యజతి - విడిచిపెట్టుట లేదు.

ఈతని గురువగు శుక్రాచార్యుడు ఈతనిని బెదిరించి శపించిననూ, గొప్ప వ్రతనిష్ఠ గల ఈతడు సత్యమును విడిచిపెట్ట లేదు. నేను కూడ కప టవచనములతో అధర్మమును ధర్మముగా చెప్పితిని. అయిననూ, సత్యని ష్ఠుడగు ఈతడు తన ధర్మమును విడిచి పెట్టలేదు.

ఏష మే ప్రాపితః స్థానం దుష్ప్రాపమమరైరపి ।
సావర్ణేరంతరస్యాయం భవితేంద్రో మదాశ్రయః ।। 31

అమరైః అపి - దేవతలచే కూడ, దుష్ప్రాపమ్ - పొంద శక్యము కాని, స్థానమ్ - స్థానమును, ఏషః - ఈతడు, మే - నాచే, ప్రాపితః - పొందించబడినాడు, మద్-ఆశ్రయః - నేనే శరణుగా గల, అయమ్ - ఈత డు, సావర్ణేః అంతరస్య - సావర్ణి మన్వంతరమునకు, ఇంద్రః - ఇంద్రుడు, భవితా - కాగలడు.

నేనీతనికి దేవతలకు కూడ పొంద శక్యము కాని స్థానమునిచ్చుచు న్నాను. నేనే శరణుగా గల ఈతడు సావర్ణి మన్వంతరములో ఇంద్రుడు కాగలడు.

తావత్సుతలమధ్యాస్తాం విశ్వకర్మవినిర్మితమ్ ।
యన్నాధయో వ్యాధయశ్చ క్లమస్తంద్రా పరాభవః ।
నోపసర్గా నివసతాం సంభవంతి మమేక్షయా ।। 32

తావత్ - అంతవరకు, విశ్వకర్మవినిర్మితమ్ - విశ్వకర్మచే నిర్మిం చబడిన, సుతలమ్ - సుతలలోకమును, అధ్యాస్తామ్ - అధిష్ఠించు గాక!, యత్ - ఎక్కడనైతే, నివసతామ్ - నివసించువారలకు, మమ - నాయొ క్క, ఈక్షయా - చూపుచే, ఆధయః - మనోవ్యాధులు, వ్యాధయః చ - శారీరక వ్యాధులు కూడ, క్లమః - అలసట, తంద్రా - సోమరితనము, పరా భవః - పరాజయము, న సంభవంతి - కలుగవో, ఉపసర్గాః - ఉపద్రవము లు, న - కలుగవో.

అంతవరకు ఈతడు విశ్వకర్మచే నిర్మించబడిన సుతలలోకము నకు అధిపతియై ఉండుగాక! అచట నివసించు వారలకు నా దయాదృష్టి

కారణముగా శారీరక వ్యాధులు, మనోవ్యాధులు, అలసట, సోమరిదనము, పరాభవము, ఉపద్రవములు కలుగవు.

ఇంద్రసేన మహారాజ యాహి భో భద్రమస్తు తే ।
సుతలం స్వర్గిభిః ప్రార్థ్యం జ్ఞాతిభిః పరివారితః ।। 33

భోః ఇంద్రసేన మహారాజ - ఓ ఇంద్రసేన (బలి) మహారాజా!, స్వర్గిభిః - స్వర్గవాసులచే, ప్రార్థ్యమ్ - కోరదగిన, సుతలమ్ - సుతలమును గురించి, జ్ఞాతిభిః - బంధువులచే, పరివారితః - చుట్టువారబడినవాడవై, యాహి - వెళ్లుము, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళము, అస్తు - అగుగాక!

బలి చక్రవర్తీ! సుతలము స్వర్గవాసులకు కూడ కోరదగినది. నీవు నీ జ్ఞాతులు చుట్టువారి రాగా, అచటకు వెళ్లుము. నీకు మంగళమగు గాక!

న త్వామభిభవిష్యంతి లోకేశాః కిముతాపరే ।
త్వచ్ఛాసనాతిగాన్ దైత్యాంశ్చక్రం మే సూదయిష్యతి ।। 34

లోక-ఈశాః - లోకపాలకులు, త్వామ్ - నిన్ను, న అభిభవిష్యంతి - పరాభవము చేయలేరు, అపరే - ఇతరులు, కిముత - చేయలేరని చెప్పవలయునా?, త్వత్-శాసన-అతిగాన్ - నీ శాసనమును ఉల్లంఘించే, దైత్యాన్ - రాక్షసులను, మే - నాయొక్క, చక్రమ్ - చక్రము, సూదయిష్యతి - సంహరించ గలదు.

లోకపాలకులు కూడ నిన్ను అచట పరాభవించ లేరు. ఇతరులు పరాభవించలేరని వేరుగా చెప్పవలయునా? నీ శాసనమును ఉల్లంఘించే రాక్షసులను నా చక్రము సంహరించ గలదు.

రక్షిష్యే సర్వతోఽహం త్వాం సానుగం సపరిచ్ఛదమ్ ।
సదా సన్నిహితం వీర తత్ర మాం ద్రక్ష్యతే భవాన్ ।। 35

స-అనుగమ్ - అనుచరులతో కూడినట్టియు, సపరిచ్ఛదమ్ - పరికరములతో కూడిన, త్వామ్ - నిన్ను, అహమ్ - నేను, సర్వతః - అన్ని

విధములుగా, రక్షిష్యే - రక్షించగలను, వీర - ఓ వీరుడా!, భవాన్ - నీవు, సదా - అన్ని కాలములలో, తత్ర - అచట, సన్నిహితమ్ - సన్నిహితుడవగు, మామ్ - నన్ను, ద్రక్ష్యతే - చూడగలవు.

ఓ వీరుడా! నిన్ను, నీ అనుచరులను, నీ పరికరములను నేను అన్ని విధములుగా రక్షించెదను. అన్ని కాలములలో నీకు సుతలములో ఉపస్థితుడనైయున్న నేను కనబడెదను.

తత్ర దానవదైత్యానాం సంగాత్తే భావ అసురః ।
దృష్ట్వా మదనుభావం వై సద్యః కుంఠో వినంక్ష్యతి ॥ 36

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే వామనావతారే
బలివామనసంవాదో నామ ద్వావింశోఽధ్యాయః ॥

దానవదైత్యానామ్ - దను దితివంశీయులగు రాక్షసులయొక్క, సంగాత్ - సంగము వలవి, తే - నీయొక్క, అసురః - అసురులకు చెందిన, భావః - ప్రవృత్తి, తత్ర - అచట, మద్-అనుభావమ్ - నా మహిమను, దృష్ట్వా - చూచి, వై - నిశ్చయముగా, సద్యః - వెంటనే, కుంఠః - మందగించినదై, వినంక్ష్యతి - నశించ గలదు.

దను దితివంశీయులగు రాక్షసులతోడి సంగము వలన నీయందు కలిగిన అసుర (భోగ) ప్రవృత్తి అచట నా మహిమను చూచిన పిదప మందగించి నశించగలదు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
వామనావతారవృత్తాంతములో బలిపై శ్రీహరి ప్రసన్నుడగుటను వర్ణించే
ఇరువది రెండవ అధ్యాయము ముగిసినది (22).

*****

# అథ త్రయోవింశోऽధ్యాయః

## వామనావతారము - బలి సుతలమునధిష్ఠించుట

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుక్తవంతం పురుషం పురాతనం
 మహానుభావోऽఖిలసాధుసంమతః ।
బద్ధాంజలిర్బాష్పకలాకులేక్షణో
 భక్త్యుద్గలో గద్గదయా గిరాऽబ్రవీత్ ॥ 1

ఇతి - ఈ విధముగా, ఉక్తవంతమ్ - పలికిన, పురాతనం పురుషమ్ - ఆదిపురుషుడగు శ్రీహరిని ఉద్దేశించి, మహా-అనుభావః - గొప్ప ప్రభావము గలవాడు, అఖిలసాధుసంమతః - సకల సత్పురుషులలో శ్రేష్ఠుడు, బద్ధ-అంజలిః - కట్టబడిన దోసిలి గలవాడు, బాష్పకలా-ఆకుల-ఈక్షణః - కన్నీటి బిందువులచే ఆకులమైన కన్నులు గలవాడు, భక్తి-ఉద్గలః - భక్తిచే బొంగురువోయిన కంఠము గలవాడు అగు బలి, గద్గదయా - గద్గదమైన, గిరా - వాక్కుతో, అబ్రవీత్ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఆదిపురుషుడగు శ్రీహరి ఈ విధముగా పలుకగా, సత్పురుషులందరిలో శ్రేష్ఠుడగు ఆ బలియొక్క కంఠము భక్తిచే గద్గదమై మాట బొంగురువోయెను. అతని కన్నులు కన్నీటిచే ఆకులమయ్యెను. మహానుభావుడగు ఆ బలి చేతులను జోడించి ఇట్లు పలికెను.

బలిరువాచ ।
అహో ప్రణామాయ కృతస్సముద్యమః
 ప్రపన్నభక్తార్థవిధౌ సమాహితః ।

యల్లోకపాలైస్త్వదనుగ్రహోఽమరై-
రలబ్ధపూర్వోఽపసదేఽసురేఽర్పితః ॥ 2

అహో - ఆహా!, ప్రణామాయ - నమస్కారము కొరకు, కృతః - చేయబడిన, సముద్యమః - చక్కని ప్రయత్నము, ప్రపన్నభక్త-అర్థవిధౌ - శరణు పొందిన భక్తుల పురుషార్థమును సంపాదించుటయందు, సమాహితః - సావధానమై యున్నది, యత్ - ఏలయనగా (దేనిచే), లోకపాలైః - లోకపాలకులగు, అమరైః - దేవతలచే, అలబ్ధపూర్వః - ఇదివరలో పొందబడని, అనుగ్రహః - అనుగ్రహము, అపసదే - అధముడగు, అసురే - రాక్షసునియందు, అర్పితః - చేయబడినదో.

బలి ఇట్లు పలికెను --- ఆశ్చర్యము! నీకు నమస్కరించుటకు చేసిన ప్రయత్నము శరణు వేడిన భక్తులకు సమ్మతమైన పురుషార్థము (మోక్షము) ను సంపాదించుటకు సావధానమై (సమర్థమై) యున్నది. ఏల యనగా, లోకపాలకులగు దేవతలు కూడ ఇదివరలో పొందని అనుగ్రహమును నీవు అధముడగు రాక్షసుని (నా) పై చూపితివి.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుక్త్వా హరిమానమ్య బ్రహ్మాణం సభవం తతః ।
వివేశ సుతలం ప్రీతో బలిర్ముక్తస్సహాసురైః ॥ 3

ముక్తః - విడిచిపెట్టబడిన, బలిః - బలి, ఇతి - ఈ విధముగా, ఉక్త్వా - పలికి, అసురైః సహ - రాక్షసులతో గూడి, హరిమ్ - శ్రీహరిని, సభవమ్ - రుద్రునితో కూడియున్న, బ్రహ్మాణమ్ - బ్రహ్మగారిని, ఆనమ్య - ప్రణమిల్లి, ప్రీతః - సంతోషించినవాడై, తతః - అక్కడనుండి, సుతలమ్ - సుతలమును, వివేశ - ప్రవేశించెను.

అపుడు బలి నాగపాశబంధమునుండి విముక్తుడాయెను. ఆయన రాక్షసులతో గూడి శ్రీహరికి, బ్రహ్మగారికి, రుద్రునకు నమస్కరించి. సంతోషముతో అక్కడనుండి సుతలమును ప్రవేశించెను.

ఏవమింద్రాయ భగవాన్ ప్రత్యానీయ త్రివిష్టపమ్ ।
పూరయిత్వాదితేః కామమశాసత్సకలం జగత్ ॥ 4

ఏవమ్ - ఈ విధముగా, భగవాన్ - వామన భగవానుడు, ఇంద్రాయ - ఇంద్రుని కొరకు, త్రివిష్టపమ్ - స్వర్గమును, ప్రతి-ఆనీయ - సమర్పించి, అదితేః - అదితియొక్క, కామమ్ - కోరికను, పూరయిత్వా - పూర్తి చేసి, సకలమ్ - సమస్తమైన, జగత్ - జగత్తును, అశాసత్ - పాలించెను.

ఈ విధముగా వామన భగవానుడు ఇంద్రునకు స్వర్గమును సమర్పించి, అదితియొక్క కోరికను పూర్తి చేసి, ఉపేంద్రుడై సకలజగత్తును పాలించెను.

లబ్ధప్రసాదం నిర్ముక్తం పౌత్రం వంశధరం బలిమ్ ।
నిశామ్య భక్తిప్రవణః ప్రహ్లాద ఇదమబ్రవీత్ ॥ 5

లబ్ధప్రసాదమ్ - పొందబడిన అనుగ్రహము కలిగినట్టియు, నిర్ముక్తమ్ - విడుదల చేయబడినట్టియు, వంశధరమ్ - వంశమును నిలబెట్టునట్టియు, పౌత్రమ్ - మనుమడైన, బలిమ్ - బలిని, నిశామ్య - చూచి, భక్తిప్రవణః - భక్తితో వినమ్రుడైన, ప్రహ్లాదః - ప్రహ్లాదుడు, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

శ్రీహరి అనుగ్రహమును పొంది బలి నాగపాశములనుండి విముక్తుడాయెను. వంశమును నిలబెట్టే తన మనుమడైన బలిని చూచి భక్తితో వినమ్రుడైన ప్రహ్లాదుడు ఇట్లు పలికెను.

ప్రహ్లాద ఉవాచ ।
నేమం విరించో లభతే ప్రసాదం న శ్రీర్న శర్వః కిముతాపరే తే.
యన్నోఽసురాణామసి దుర్గపాలో విశ్వాభివంద్యైరపి వందితాంఘ్రిః.

ఇమమ్ - ఈ, ప్రసాదమ్ - అనుగ్రహమును, విరించః - బ్రహ్మగారు, న లభతే - పొందుట లేదు, శ్రీః - లక్ష్మీదేవి, న - పొందుట లేదు, శర్వః - రుద్రుడు, న - పొందుట లేదు, అపరే - ఇతరులగు, తే - వారు,

కిముత - పొందుట లేదని వేరుగా చెప్పవలయునా?, యత్ - ఏదనగా, విశ్వ-అభివంద్యైః అపి - జగత్తునకు నమస్కరించ దగినవారిచే కూడ, వందిత-అంఘ్రిః - నమస్కరించబడిన పాదములు గల నీవు, అసురాణామ్ - రాక్షసులమగు, నః - మాకు, దుర్గపాలః - ద్వారపాలకుడవు, అసి - అగుచున్నావో.

సకలజగత్తుచే నమస్కరించబడే బ్రహ్మాదులచే కూడ నమస్కరించబడే పాదములు గల నీవు రాక్షసులమగు మాకు ద్వారపాలకుడవు అగుచున్నావు. ఇట్టి అనుగ్రహమును బ్రహ్మగారు గాని, లక్ష్మీదేవి గాని, రుద్రుడు గాని పొంది యుండలేదు. ఇతరులగు ఇంద్రాదులు పొందలేదని వేరుగా చెప్పవలయునా?

యత్పాదపద్మమకరందనిషేవణేన
బ్రహ్మాదయశ్శరణదాశ్నువతే విభూతీః ।
కస్మాద్వయం కుసృతయః ఖలయోనయస్తే
దాక్షిణ్యదృష్టిపదవీం భవతః ప్రణీతాః ।। 7

శరణద - శరణునిచ్చువాడా!, యత్-పాదపద్మమకరందనిషేవణేన - ఎవ్వాని పద్మములవంటి పాదముల మకరందమును సేవించుటచే, బ్రహ్మ-ఆదయః - బ్రహ్మగారు మొదలైనవారు, విభూతీః - మహిమలను, అశ్నువతే - పొందుచున్నారో, కుసృతయః - చెడు ప్రవర్తన కలిగినవారము, ఖలయోనయః - దుష్టమగు పుట్టుక గలవారము, తే - అట్టి, వయమ్ - మేము, భవతః - నీయొక్క, దాక్షిణ్యదృష్టిపదవీమ్ - దయాదృష్టికి గోచరమగుటను, కస్మాత్ - ఎందువలన, ప్రణీతాః - పొందించబడితిమి?

ఓ శరణాగతవత్సలా! బ్రహ్మగారు మొదలైనవారు నీ పద్మముల వంటి పాదముల మకరందమును సేవించి మహిమలను పొందుచున్నారు. మేము పుట్టుక చేతనే దుష్టులము, చెడు ప్రవర్తన గలవారము. అట్టి మేము అట్టి నీయొక్క దయాదృష్టికి గోచరులమైనాము. ఇది ఎట్లు సంభవమైనది?

చిత్రం తవేహితమహోఽమితయోగమాయా-
లీలావిసృష్టభువనస్య విశారదస్య ।

సర్వాత్మనస్సమదృశో విషమస్స్వభావో
భక్తప్రియో యదసి కల్పతరుస్వభావః ।। 8

అమితయోగమాయాలీలావిసృష్టభువనస్య - ఊహకు అందని యోగమాయయొక్క లీలచే రచించబడిన భువనములు కలిగినట్టియు, విశారదస్య - నిపుణుడైనట్టియు, సర్వ-ఆత్మనః - సర్వముయొక్క యథార్థస్వరూపమైనట్టియు, సమదృశః - సర్వమును సమముగా దర్శించే, తవ - నీయొక్క, ఈహితమ్ - చేష్ట, చిత్రమ్ - విచిత్రమైనది, విషమః - తేడాలను చూపే, స్వభావః - స్వభావము, అహో - ఆశ్చర్యము!, భక్త ప్రియః - భక్తులయందు ప్రీతి గలవాడవు, యత్ - ఏలయనగా, కల్పతరు స్వభావః - కల్పవృక్షముయొక్క స్వభావమువంటి స్వభావము కలవాడవు, అసి - అగుచున్నావు.

నీవు ఊహకు అందని నీ యోగమాయయొక్క లీలచే భువనములను రచించిన నిపుణుడవు. సర్వముయొక్క యథార్థతత్త్వము నీవే. కావున, నీవు సర్వమును సమముగా దర్శించెదవు. అయిననూ, నీ చేష్ట (దుష్ట శిక్షణము, శిష్టరక్షణము ఇత్యాది) విచిత్రమైనది. భక్తులయందు, అభక్తుల యందు నీ స్వభావము భిన్నముగా నుండుట కూడ ఆశ్చర్యమే! అయితే, నీవు కల్పవృక్షమువంటి వాడవు. తనను సమీపించినవారిని మాత్రమే అనుగ్రహించే కల్పవృక్షము వలె నీవు నీ యెడల భక్తిని చేయువారిని అనుగ్రహించెదవు.

శ్రీభగవానువాచ ।
వత్స ప్రహ్లాద భద్రం తే ప్రయాహి సుతలాలయమ్ ।
మోదమానస్స్వపౌత్రేణ జ్ఞాతీనాం సుఖమావహ ।। 9

వత్స - కుమారా!, ప్రహ్లాద - ఓ ప్రహ్లాదా!, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!, సుతల-ఆలయమ్ - సుతలమునందలి నివాసమును గురించి, ప్రయాహి - బయలు దేరుము, స్వపౌత్రేణ - నీ మనుమనితో గూడి, మోదమానః - ఆనందించుచున్నవాడవై, జ్ఞాతీనామ్ - బంధువులకు, సుఖమ్ - సుఖమును, ఆవహ - కలిగించుము.

శ్రీభగవానుడిట్లు పలికెను --- ఓ వత్సా! ప్రహ్లాదా! నీకు మంగళ మగు గాక! సుతలమునందలి నివాసమునకు బయలు దేరుము. నీవచట నీ మనుమనితో కలిసి ఆనందిస్తూ, బంధువులకు సుఖమును కలిగించుము.

నిత్యం ద్రష్టాసి మాం తత్ర గదాపాణిమవస్థితమ్ ।
మద్దర్శనమహాహ్లాదధ్వస్తకర్మనిబంధనః ।। 10

గదాపాణిమ్ - గద చేతియందు గలవాడనై, అవస్థితమ్ - జాగ రూకుడనై నిలిచియున్న, మామ్ - నన్ను, నిత్యమ్ - నిత్యము, తత్ర - అచట, ద్రష్టాసి - చూడగలవు, మద్-దర్శనమహా-ఆహ్లాదధ్వస్తకర్మనిబం ధనః - నన్ను దర్శించుటచే కలిగిన గొప్ప ఆనందముచే నశింప జేయబ డిన కర్మలకు హేతువగు అజ్ఞానము గలవాడవు.

అచట గదను చేతితో పట్టుకొని సావధానముగా నిలిచియున్న నన్ను నీవు ప్రతిదినము చూడగలవు. నన్ను చూచుటచే మహానందము (ఆ త్మానందము) ను పొందే నీకు కర్మలకు కారణమగు అజ్ఞానము నశించిపో వును.

శ్రీశుక ఉవాచ ।
ఆజ్ఞాం భగవతో రాజన్ ప్రహ్లాదో బలినా సహ ।
బాఢమిత్యమలప్రజ్ఞో మూర్ధ్న్యాధాయ కృతాంజలిః ।। 11

పరిక్రమ్యాదిపురుషం సర్వాసురచమూపతిః ।
ప్రణతస్తదనుజ్ఞాతః ప్రవివేశ మహాబిలమ్ ।। 12

రాజన్ - ఓ మహారాజా!, అమలప్రజ్ఞః - స్వచ్ఛమగు జ్ఞానము గలవాడు, సర్వ-అసురచమూపతిః - సకల రాక్షససేనలకు ప్రభువు అగు, ప్రహ్లాదః - ప్రహ్లాదుడు, కృత-అంజలిః - కట్టబడిన దోసిలి గలవాడై, బలినా సహ - బలితో గూడి, భగవతః - శ్రీహరి భగవానునియొక్క, ఆజ్ఞామ్ - ఆదేశమును, బాఢమ్ - సరే, ఇతి - అని, మూర్ధ్ని - శిరస్సునందు, ఆధాయ - స్వీకరించి, ఆదిపురుషమ్ - జగత్కారణమగు ఆ పురుషోత్తము ని, పరిక్రమ్య - ప్రదక్షిణము చేసి, ప్రణతః - నమస్కరించినవాడై, తద్-అ

నుజ్ఞాతః - ఆయనచే అనుమతి ఈయబడినవాడై, మహాబిలమ్ - సుతల మును, ప్రవివేశ - ప్రవేశించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! సకల రాక్షససే నలకు ప్రభువగు ప్రహ్లాదుడు స్వచ్ఛమగు ఆత్మజ్ఞానము గలవాడు. ఆయన సరే అని శ్రీహరి భగవానుని ఆదేశమును బలితో సహా తలవంచి స్వీకరిం చి, జగత్కారణుడగు ఆ పురుషోత్తమునకు ప్రదక్షిణము చేసి నమస్కరించె ను. అపుడు ఆయనయొక్క అనుమతిని పొంది ప్రహ్లాదుడు బలితో గూడి సుతలమును ప్రవేశించెను.

అథాహోశనసం రాజన్ హరిర్నారాయణోఽంతికే ।
ఆసీనమృత్విజాం మధ్యే సదసి బ్రహ్మవాదినామ్ ।। 13

రాజన్ - ఓ మహారాజా!, అథ - తరువాత, హరిః - పాపములను పోగొట్టే, నారాయణః - నారాయణుడు, బ్రహ్మవాదినామ్ - బ్రహ్మవేత్తల, సదసి - సభయందు, ఋత్విజామ్ - ఋత్విక్కుల, మధ్యే - మధ్యయం దు, అంతికే - సమీపమునందు, ఆసీనమ్ - కూర్చునియున్న, ఉశనసమ్ - శుక్రాచార్యుని ఉద్దేశించి, ఆహ - పలికెను.

ఓ మహారాజా! శుక్రాచార్యుడు ఆ బ్రహ్మవేత్తల సభలో ఋత్వి క్కుల మధ్యలో వామనునకు సమీపమునందే కూర్చుని యుండెను. అపుడు పాపములను పోగొట్టే ఆ నారాయణుడు ఆయనతో ఇట్లు పలికెను.

బ్రహ్మన్ సంతను శిష్యస్య కర్మ చ్ఛిద్రం వితన్వతః ।
యత్తత్కర్మసు వైషమ్యం బ్రహ్మదృష్టం సమం భవేత్ ।। 14

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, కర్మ - యజ్ఞమును, వితన్వతః - విస్తార ముగా చేయుచున్న, శిష్యస్య - నీ శిష్యుడగు బలియొక్క, ఛిద్రమ్ - కర్మ లోపమును, సంతను - పూరించుము, కర్మసు - కర్మలయందు, యత్ - ఏ, వైషమ్యమ్ - లోపము ఉండునో, తత్ - అది, బ్రహ్మదృష్టమ్ - బ్రహ్మ వేత్తచే చూడబడినదై, సమమ్ - పూర్ణము, భవేత్ - అగును.

ఓ మహర్షీ! నీ శిష్యుడు యజ్ఞమును విస్తారముగా చేయుచుండ గా, దానియందు కర్మలోపము కలిగినది. దానిని నీవు పూర్తి చేయుము. కర్మలయందు కలిగే వైషమ్యము (లోపము) బ్రహ్మవేత్తల చూపుచేతనే సమము (పూర్ణము) అగును.

శుక్ర ఉవాచ ।
కుతస్తత్కర్మవైషమ్యం యస్య కర్మేశ్వరో భవాన్ ।
యజ్ఞేశో యజ్ఞపురుషస్సర్వభావేన పూజితః ।। 15

తత్-కర్మవైషమ్యమ్ - ఆ బలికి కర్మలో తేడా (లోపము), కుతః - ఎక్కడిది?, యస్య - ఏ బలికి, కర్మ-ఈశ్వరః - కర్మలను ప్రవర్తిల్ల జేయు వాడవు, యజ్ఞ-ఈశః - యజ్ఞమునకు ప్రభుడవు, యజ్ఞపురుషః - యజ్ఞమే రూపముగా గలవాడవు అగు, భవాన్ - నీవు, సర్వభావేన - సర్వస్వమును అర్పించుటచే, పూజితః - పూజించబడితివో.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- యజ్ఞపురుషుడవగు నీవే కర్మ లను ప్రవర్తిల్ల జేసే యజ్ఞేశ్వరుడవు. బలి నిన్ను సర్వస్వమును అర్పించి పూజించినాడు. అట్టి బలియొక్క కర్మలో తేడా (లోపము) కు అవకాశమె క్కడిది?

మంత్రతస్తంత్రతశ్ఛిద్రం దేశకాలార్హవస్తుతః ।
సర్వం కరోతి నిశ్ఛిద్రం నామసంకీర్తనం తవ ।। 16

మంత్రతః - మంత్రమును బట్టి, తంత్రతః - అనుష్ఠాన క్రమమును బట్టి, దేశకాల-అర్హవస్తుతః - దేశము కాలము దానమునకు పాత్ర మరియు ద్రవ్యములను బట్టి, ఛిద్రమ్ - లోపమును, సర్వమ్ - సర్వమును, తవ - నీయొక్క, నామసంకీర్తనమ్ - నామముయొక్క చక్కని కీర్తనము, నిశ్ఛిద్రమ్ - పూర్ణమునుగా, కరోతి - చేయును.

యజ్ఞములో మంత్రము, అనుష్ఠాన క్రమము, దేశము, కాలము, దానమునకు పాత్ర మరియు ద్రవ్యములను బట్టి వచ్చిన లోపములన్నియు, నీ నామమును చక్కగా కీర్తించినచో, తొలగిపోయి కర్మ పూర్ణమగును.

తథాపి వదతో భూమన్ కరిష్యామ్యనుశాసనమ్ ।
ఏతచ్ఛ్రేయః పరః పుంసాం యత్తవాజ్ఞానుపాలనమ్ ॥ 17

భూమన్ - ఓ పరమేశ్వరా!, తథాపి - అయినప్పటికీ, వదతః - చెప్పుచున్న నీయొక్క, అనుశాసనమ్ - ఆదేశమును, కరిష్యామి - చేయ గలను, తవ - నీయొక్క, ఆజ్ఞా-అనుపాలనమ్ - ఆదేశమును పాటించుట, యత్ - అనేది ఏది గలదో, ఏతత్ - ఇది, పుంసామ్ - మానవులకు, పరః - సర్వోత్కృష్టమైన, శ్రేయః - శ్రేయస్సు.

ఓ పరమేశ్వరా! అయినను, నేను నీవు చెప్పిన ఆజ్ఞను పాలించె దను. మానవులకు నీ ఆజ్ఞను పాలించుటయే సర్వోత్తమమైన శ్రేయస్సు (మోక్షము).

శ్రీశుక ఉవాచ ।
అభినంద్య హరేరాజ్ఞాముశనా భగవానితి ।
యజ్ఞచ్ఛిద్రం సమాధత్త బలేర్విప్రర్షిభిస్సహ ॥ 18

భగవాన్ - పూజనీయుడగు, ఉశనా - శుక్రాచార్యుడు, ఇతి - ఈ విధముగా, హరేః - శ్రీహరియొక్క, ఆజ్ఞామ్ - ఆదేశమును, అభినంద్య - అంగీకరించి, విప్ర-ఋషిభిః సహ - ఋత్విక్కులతో మహర్షులతో కూడి, బలేః - బలియొక్క, యజ్ఞచ్ఛిద్రమ్ - యజ్ఞములోని లోపమును, సమాధత్త - పూర్ణము చేసెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- పూజనీయుడగు శుక్రాచా ర్యుడు ఈ విధముగా శ్రీహరియొక్క ఆదేశమును అంగీకరించి, ఋత్వి క్కులతో మరియు మహర్షులతో గూడి బలియొక్క యజ్ఞములోని లోప మును సరిదిద్ది యజ్ఞమును పూర్ణము చేసెను.

ఏవం బలేర్మహీం రాజన్ భిక్షిత్వా వామనో హరిః ।
దదౌ భ్రాత్రే మహేంద్రాయ త్రిదివం యత్పరైర్హృతమ్ ॥19

రాజన్ - ఓ మహారాజా!, హరిః - శ్రీహరి, వామనః - వామనుడై, ఏవమ్ - ఈ విధముగా, బలేః - బలినుండి, మహీమ్ - భూమిని, భిక్షిత్వా

- యాచించి, భ్రాత్రే - సోదరుడగు, మహేంద్రాయ - మహేంద్రుని కొరకు, త్రిదివమ్ - స్వర్గమును, దదౌ - ఇచ్చెను, యత్ - ఏదైతే, పరైః - శత్రువులచే, హృతమ్ - లాగుకొనబడినదో.

ఓ మహారాజా! శ్రీహరి వామనుడై ఈ విధముగా బలినుండి భూమిని (తద్వారా మూడు లోకములను) యాచించి తన సోదరుడగు మహేంద్రునకు, పూర్వము శత్రువులచే లాగుకొనబడిన స్వర్గమును అప్పజెప్పెను.

ప్రజాపతిపతిర్బ్రహ్మా దేవర్షిపితృభూమిపైః ।
దక్షభృగ్వంగిరోముఖ్యైః కుమారేణ భవేన చ ॥ 20

కశ్యపస్యాదితేః ప్రీత్యై సర్వభూతభవాయ చ ।
లోకానాం లోకపాలానామకరోద్వామనం పతిమ్ ॥ 21

ప్రజాపతిపతిః - ప్రజాపతులకు తండ్రియగు బ్రహ్మగారు, దేవర్షిపితృభూమిపైః - దేవర్షులు పితృదేవతలు మరియు మనువులతో, దక్షభృగు-అంగిరోముఖ్యైః - దక్షుడు భృగుడు అంగిరసుడు మొదలగువారితో, కుమారేణ - సనత్కుమారునితో, భవేన చ - రుద్రునితో కూడ కూడి, కశ్యపస్య - కశ్యపునకు, అదితేః - అదితికి, ప్రీత్యై - ప్రీతిని కలిగించుటకై, సర్వభూతభవాయ చ - సకలప్రాణుల కల్యాణము కొరకు కూడ, వామనమ్ - వామనుని, లోకానామ్ - లోకములకు, లోకపాలానామ్ - లోకపాలకులకు, పతిమ్ - ప్రభువునుగా, అకరోత్ - చేసెను.

ప్రజాపతులకు తండ్రియగు బ్రహ్మగారు కశ్యపునకు అదితికి ప్రీతిని కలిగించి సకలప్రాణులకు కల్యాణమును చేయుటకై వామనుని లోకములకు, లోకపాలకులకు ప్రభువును చేసెను. దేవర్షులు, పితృదేవతలు, మనువులు, దక్షుడు భృగువు అంగిరసుడు మొదలగువారు, సనత్కుమారుడు, రుద్రుడు కూడ ఆ బ్రహ్మగారికి ఈ కార్యములో తోడుగా నుండిరి.

వేదానాం సర్వదేవానాం ధర్మస్య యశసశ్శ్రియః ।
మంగలానాం వ్రతానాం చ కల్పం స్వర్గాపవర్గయోః ॥ 22

ఉపేంద్రం కల్పయాంచక్రే పతిం సర్వవిభూతయే ।
తదా సర్వాణి భూతాని భృశం ముముదిరే నృప ॥ 23

వేదానామ్ - వేదములకు, సర్వదేవానామ్ - సకలదేవతలకు, ధర్మస్య - ధర్మమునకు, యశసః - కీర్తికి, శ్రియః - సంపదకు, మంగలానామ్ - మంగళకార్యములకు, వ్రతానాం చ - వ్రతములకు కూడ, స్వర్గ-అపవర్గయోః - స్వర్గమోక్షములకు, కల్పమ్ - సమర్థుడగు, ఉపేంద్రమ్ - ఇంద్రుని సోదరుడగు వామనుని, సర్వవిభూతయే - అందరి అభివృద్ధి కొరకై, పతిమ్ - ప్రభువునుగా, కల్పయాంచక్రే - ఏర్పాటు చేసెను, నృప - ఓ మహారాజా!, తదా - అప్పుడు, సర్వాణి - సకలములైన, భూతాని - ప్రాణులు, భృశమ్ - మిక్కిలి, ముముదిరే - ఆనందించినవి.

బ్రహ్మగారు సకలప్రాణుల అభివృద్ధి కొరకై సమర్థుడగు వామనుని ఉపేంద్రుని చేసి -- వేదములు, సకలదేవతలు, ధర్మము, కీర్తి, సంపద, మంగళకార్యములు, వ్రతములు, స్వర్గము, మోక్షము -- అనువాటికి ప్రభువునుగా వ్యవస్థ చేసెను. ఓ మహారాజా! అప్పుడు సకలప్రాణులు మిక్కిలి ఆనందించినవి.

తతస్త్వింద్రః పురస్కృత్య దేవయానేన వామనమ్ ।
లోకపాలైర్దివం నిన్యే బ్రహ్మణా చానుమోదితః ॥ 24

తతః - తరువాత, బ్రహ్మణా చ - బ్రహ్మగారిచే, అనుమోదితః - అనుమతి నీయబడిన, ఇంద్రః తు - ఇంద్రుడైతే, లోకపాలైః - లోకపాలకులతో గూడి, వామనమ్ - వామనుని, పురస్కృత్య - ముందిడుకొని, దేవయానేన - దేవతల విమానముచే, దివమ్ - స్వర్గమును గురించి, నిన్యే - తీసుకు వెళ్లెను.

తరువాత ఇంద్రుడు లోకపాలకులతో గూడి బ్రహ్మగారి అనుమతితో వామనుని దేవవిమానములో ముందు కూర్చుండబెట్టి దేవయానమార్గముచే స్వర్గమునకు తీసుకువెళ్లెను.

ప్రాప్య త్రిభువనం చేంద్ర ఉపేంద్రభుజపాలితః ।
శ్రియా పరమయా జుష్టో ముముదే గతసాధ్వసః ।। 25

ఉపేంద్రభుజపాలితః - ఉపేంద్రుని భుజములచే పాలించబడిన, ఇంద్రః చ - ఇంద్రుడు, త్రిభువనమ్ - ముల్లోకములను, ప్రాప్య - పొంది, పరమయా - సర్వోత్కృష్టమైన, శ్రియా - సంపదతో, జుష్టః - కూడియున్నవాడై, గతసాధ్వసః - తొలగిన భయము గలవాడై, ముముదే - ఆనందించెను.

ఉపేంద్రుని భుజములచే రక్షించబడిన ఇంద్రుడు ముల్లోకముల అధికారమును పొందెను. భయము తొలగిపోవుటచే ఆయన సర్వోత్కృష్టమైన సంపదతో గూడి ఆనందించెను.

బ్రహ్మా శర్వః కుమారశ్చ భృగ్వాద్యా మునయో నృప ।
పితరస్సర్వభూతాని సిద్ధా వైమానికాశ్చ యే ।। 26

సుమహత్కర్మ తద్విష్ణోర్గాయంతః పరమాద్భుతమ్ ।
ధిష్ణ్యాని స్వాని తే జగ్మురదితిం చ శశంసిరే ।। 27

నృప - ఓ మహారాజా!, బ్రహ్మా - బ్రహ్మగారు, శర్వః - రుద్రుడు, కుమారః చ - సనత్కుమారుడు, భృగు-ఆద్యాః - భృగువు మొదలైన, మునయః - మహర్షులు, పితరః - పితృదేవతలు, సర్వభూతాని - సకల ప్రాణులు, సిద్ధాః - సిద్ధులు, యే - ఏ, వైమానికాః చ - విమానములనెక్కియున్నవారు ఎవరు గలరో వారు, విష్ణోః - విష్ణువుయొక్క, తత్ - ఆ, సుమహత్ - చాల గొప్పదైనట్టియు, పరమ-అద్భుతమ్ - గొప్ప ఆశ్చర్యమును కలిగించే, కర్మ - లీలను, గాయంతః - కీర్తించుచున్నవారై, స్వాని - తమ, ధిష్ణ్యాని - స్థానములను గురించి, జగ్ముః - వెళ్లిరి, తే - వారు, అదితిం చ - అదితిని కూడ, శశంసిరే - కొనియాడిరి.

ఓ మహారాజా! బ్రహ్మగారు, రుద్రుడు, సనత్కుమారుడు, భృగువు మొదలగు మహర్షులు, పితృదేవతలు, సకలప్రాణులు, సిద్ధులు, విమానములయందున్న గంధర్వులు మొదలగువారు విష్ణువుయొక్క ఆ

చాల గొప్ప లీలను చూచి గొప్ప ఆశ్చర్యమును పొందిరి. వారా లీలను గానము చేస్తూ, తమ తమ స్థానములకు వెళ్లిరి. వారు అదితిని కూడ కొని యాడిరి.

సర్వమేతన్మయాఽఽఖ్యాతం భవతః కులనందన ।
ఉరుక్రమస్య చరితం శ్రోతౄణామఘమోచనమ్ ।। 28

కులనందన - వంశమును ఆనందింప జేయువాడా!, మయా - నాచే, భవతః - నీకు, ఏతత్ - ఈ, సర్వమ్ - సర్వము, ఆఖ్యాతమ్ - చెప్పబడినది, ఉరుక్రమస్య - గొప్ప పరాక్రమము గల శ్రీహరియొక్క, చరితమ్ - వృత్తాంతము, శ్రోతౄణామ్ - వినువారలకు, అఘమోచనమ్ - పాపమునుండి విముక్తిని కలిగించునది.

ఓ మహారాజా! నీవు నీ వంశీయులను ఆనందింప జేసితివి. నేను నీకు ఈ వృత్తాంతమునంతనూ చెప్పితిని. గొప్ప పరాక్రమము గల శ్రీహరి యొక్క వృత్తాంతమును విన్నవారి పాపములు దూరమగును.

పారం మహిమ్న ఉరు విక్రమతో గృణానో
యః పార్థివాని విమమే స రజాంసి మర్త్యః ।
కిం జాయమాన ఉత జాత ఉపైతి మర్త్య
ఇత్యాహ మంత్రదృగృషిః పురుషస్య యస్య ।। 29

ఉరు - అధికముగా, విక్రమతః - పరాక్రమించే విష్ణువుయొక్క, మహిమ్నః - మహిమయొక్క, పారమ్ - హద్దును, యః - ఏ, మర్త్యః - మానవుడు, గృణానః - కీర్తించువాడో, సః - ఆతడు, పార్థివాని - భూమికి చెందిన, రజాంసి - ధూళి కణములను, విమమే - లెక్కించినాడు, జాయమానః - పుట్టుచున్నవాడు గాని, జాతః ఉత - పుట్టినవాడు గాని, మర్త్యః - మానవుడు, యస్య - ఏ, పురుషస్య - పూర్ణుడగు భగవానునియొక్క, మహిమ్నః పారమ్ - మహిమయొక్క హద్దును, కిం ఉపైతి - చేరుకొనునా యేమి?, (అనగా చేరుకొనడు), ఇతి - అని, మంత్రదృక్ - మంత్రద్రష్టయగు, ఋషిః - మహర్షి, ఆహ - పలికెను.

అధికముగా పరాక్రమించే (బ్రహ్మాండమును కొలిచే పెద్ద అడుగులు వేసిన) శ్రీహరియొక్క మహిమను హద్దువరకు (నిశ్శేషముగా) కీర్తించిన మానవుడు భూమియందలి ధూళి రేణువులను లెక్కించినవాడే యగును (అనగా, అది సంభవము కాదు). పూర్ణుడగు భగవానుని మహిమయొక్క హద్దును చూచిన మానవుడు పుట్టలేదు, ఇప్పుడు జీవించి లేడు, భవిష్యత్తులో పుట్టబోడు అని మంత్రద్రష్టయగు వసిష్ఠ మహర్షి ప్రవచించెను.

విష్ణోర్ను కం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాంసి యో అస్కభాయదుత్తరం సధస్థం విచక్రమాణస్త్రేధోరుగాయః। అనియు, న తే విష్ణో జాయమానో న జాతో దేవ మహిమ్నః పరమం తమాప। అనియు మంత్రములు గలవు.

యఇదం దేవదేవస్య హరేరద్భుతకర్మణః ।
అవతారానుచరితం శృణ్వన్ యాతి పరాం గతిమ్ ॥ 30

దేవదేవస్య - దేవదేవుడైనట్టియు, అద్భుతకర్మణః - ఆశ్చర్యమును కలిగించే లీలలు గల, హరేః - శ్రీహరియొక్క, ఇదమ్ - ఈ, అవతార-అనుచరితమ్ - అవతార వృత్తాంతమును, యః - ఎవడైతే, శృణ్వన్ - వినువాడో ఆతడు, పరామ్ - సర్వోత్తమమైన, గతిమ్ - గతిని, యాతి - పొందును.

దేవదేవుడగు శ్రీహరి చేసే లీలలు ఆశ్చర్యమును గొల్పును. ఆయనయొక్క ఈ వామనావతార వృత్తాంతమును వినువాడు పరమ గతి (మోక్షము) ని పొందును.

క్రియమాణే కర్మణీదం దైవే పిత్ర్యేఽథ మానుషే ।
యత్ర యత్రానుకీర్త్యేత తత్తేషాం సుకృతం విదుః ॥ 31

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే వామనావతారే
బలేస్సుతలగమనం నామ త్రయోవింశోఽధ్యాయః ॥

దైవే - దేవతలకు సంబంధించినది, పిత్ర్యే - పితృదేవతలకు సంబంధించినది, అథ - లేదా, మానుషే - మానవులకు చెందిన, కర్మణి - కర్మ, క్రియమాణే - చేయబడుచుండగా, ఇదమ్ - ఈ వృత్తాంతము, యత్ర యత్ర - ఎక్కడెక్కడనైతే, అనుకీర్త్యేత - కీర్తించబడునో, తేషామ్ - వారియొక్క, తత్ - ఆ కర్మ, సుకృతమ్ - బాగా చేయబడినది అని, విదుః - తెలియుచున్నారు.

దేవకార్యమగు యజ్ఞాదులయందు గాని, పితృదేవతల శ్రాద్ధము నందు గాని, మానవులకు చెందిన వివాహము మొదలగు కర్మలయందు గాని ఈ వృత్తాంతమును కీర్తించినచో, ఆ కర్మ సుసంపన్నమగునని మహాత్ములు చెప్పెదరు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
వామనావతారవృత్తాంతములో బలి సుతలమునధిష్ఠించుటను వర్ణించే
ఇరువది మూడవ అధ్యాయము ముగిసినది (23).

*****

# అథ చతుర్వింశోऽధ్యాయః

## మత్స్యావతార వృత్తాంతము

రాజోవాచ ।
భగవన్ శ్రోతుమిచ్ఛామి హరేరద్భుతకర్మణః ।
అవతారకథామాద్యాం మాయామత్స్యవిడంబనమ్ ॥ 1

భగవన్ - ఓ పూజనీయా!, అద్భుతకర్మణః - అద్భుతమైన లీలలు గల, హరేః - శ్రీహరియొక్క, ఆద్యామ్ - మొట్టమొదటి, అవతారకథామ్ - అవతారముయొక్క గాథను, మాయామత్స్యవిడంబనమ్ - యోగమాయచే మత్స్యరూపమును అనుకరించుటను, శ్రోతుమ్ - వినుటకు, ఇచ్ఛామి - కోరుచున్నాను.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ పూజనీయా! శ్రీహరి అద్భుతమగు లీలలు గలవాడు. ఆయన యోగమాయచే దాల్చిన మొట్ట మొదటి అవతారము మత్స్యరూపమును అనుకరించినది. ఆ గాథను నేను వినగోరుచున్నాను.

యదర్థమదధాద్రూపం మాత్స్యం లోకజుగుప్సితమ్ ।
తమఃప్రకృతి దుర్మర్షం కర్మగ్రస్త ఇవేశ్వరః ॥ 2

ఈశ్వరః - సర్వేశ్వరుడగు శ్రీహరి, లోకజుగుప్సితమ్ - జనులచే ఏవగించుకొనబడేది, తమఃప్రకృతి - తమోగుణప్రధానమైన స్వభావము గలది, దుర్మర్షమ్ - సహించ శక్యము కానిది అగు, మాత్స్యమ్ - చేపకు చెందిన, రూపమ్ - రూపమును, కర్మగ్రస్తః ఇవ - కర్మలకు వశుడైయుండే జీవుడు వలె, యద్-అర్థమ్ - ఎందుకొరకు, అదధాత్ - దాల్చెను?

తమోగుణప్రధానమగు స్వభావము గల చేపయొక్క రూపమును జనులు ఏవగించు కొనెదరు. సహించ శక్యము కాని అట్టి రూపమును స్వతంత్రుడగు శ్రీహరి కర్మపరతంత్రుడగు జీవుడు వలె ఎందుకొరకు దాల్చెను?

ఏతన్నో భగవన్ సర్వం యథావద్వక్తుమర్హసి ।
ఉత్తమశ్లోకచరితం సర్వలోకసుఖావహమ్ ॥ 3

భగవన్ - ఓ పూజనీయా!, సర్వలోకసుఖ-ఆవహమ్ - సకలమానవులకు సుఖమును కలిగించే, ఏతత్ - ఈ, ఉత్తమశ్లోకచరితమ్ - పవిత్రకీర్తియగు శ్రీహరి చరితమును, సర్వమ్ - సర్వమును, నః - మా కొరకు, యథావద్ - ఉన్నది ఉన్నట్లుగా, వక్తుమ్ - చెప్పుటకు, అర్హసి - తగుదువు.

ఓ పూజనీయా! పవిత్రకీర్తియగు శ్రీహరియొక్క చరితము సకల మానవులకు సుఖమును కలిగించును. ఈ వృత్తాంతమునంతనూ నీవు మాకు ఉన్నది ఉన్నట్లుగా చెప్ప దగుదువు.

సూత ఉవాచ ।
ఇత్యుక్తో విష్ణురాతేన భగవాన్ బాదరాయణిః ।
ఉవాచ చరితం విష్ణోర్మత్స్యరూపేణ యత్కృతమ్ ॥ 4

ఇతి - అని, విష్ణురాతేన - పరీక్షిత్తుచే, ఉక్తః - పలుకబడిన, భగవాన్ - పూజనీయుడగు, బాదరాయణిః - వ్యాసుని పుత్రుడగు శుకుడు, విష్ణోః - విష్ణువుయొక్క, చరితమ్ - వృత్తాంతమును, ఉవాచ - చెప్పెను, మత్స్యరూపేణ - మత్స్యరూపముచే, యత్ - ఏది, కృతమ్ - చేయబడినదో.

సూతుడిట్లు పలికెను --- పరీక్షిన్మహారాజు ఇట్లు పలుకగా వ్యాస పుత్రుడగు శుకమహర్షి, విష్ణువు మత్స్యావతారమునెత్తి చేసిన లీలల వృత్తాంతమును చెప్పెను.

శ్రీశుక ఉవాచ ।
గోవిప్రసురసాధూనాం ఛందసామపి చేశ్వరః ।
రక్షామిచ్ఛంస్తనూర్ధత్తే ధర్మస్యార్థస్య చైవ హి ॥ 5

ఈశ్వరః అపి - స్వతంత్రుడే అయిననూ, గోవిప్రసురసాధూనామ్ - గోవులు వేదవేత్తలు దేవతలు సత్పురుషులయొక్క, ఛందసాం చ - వేదములయొక్క, ధర్మస్య - ధర్మముయొక్క, అర్థస్య చ ఏవ హి - అర్థముయొక్క, రక్షామ్ - రక్షణను, ఇచ్ఛన్ - కోరువాడై, తనూః - దేహములను, ధత్తే - దాల్చును.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శ్రీహరి స్వతంత్రుడే. కాని గోవులు, వేదవేత్తలు, దేవతలు, సత్పురుషులు, వేదములు, ధర్మము మరియు సత్పురుషుల సంపదలను కూడ రక్షించగోరి ఆయన దేహములను దాల్చును.

ఉచ్చావచేషు భూతేషు చరన్ వాయురివేశ్వరః ।
నోచ్చావచత్వం భజతే నిర్గుణత్వాద్ధియో గుణైః ॥ 6

ఉచ్చావచేషు - గొప్ప చిన్న, భూతేషు - ప్రాణులయందు, చరన్ - సంచరించే, వాయుః ఇవ - వాయువు వలె, ఈశ్వరః - ఈశ్వరుడు, నిర్గుణత్వాత్ - నిర్గుణుడగుట వలన, ధియః - అంతఃకరణముయొక్క, గుణైః - గుణములచే, ఉచ్చావచత్వమ్ - గొప్పదనమును గాని అల్పత్వమును గాని, న భజతే - పొందదు.

గొప్ప, చిన్న ప్రాణులలో సంచరించే వాయువు వాటి గొప్పదనమును గాని, అల్పత్వమును గాని తాను పొందదు. అదే విధముగా, పరమేశ్వరుడు నిర్గుణుడు. కావున, సకలప్రాణులలో ఆత్మరూపముగా నున్ననూ, ఈశ్వరునకు అంతఃకరణముయొక్క గుణములను బట్టి గొప్పదనము గాని, అల్పత్వము గాని సంక్రమించదు.

ఆసీదతీతకల్పాంతే బ్రాహ్మో నైమిత్తికో లయః ।
సముద్రోపప్లుతాస్తత్ర లోకా భూరాదయో నృప ॥ 7

నృప - ఓ మహారాజా!, అతీతకల్ప-అంతే - గడచిన కల్పము యొక్క ఆఖరునందు, నైమిత్తికః - బ్రహ్మగారి నిద్ర నిమిత్తముగా కలిగే, బ్రాహ్మః - బ్రాహ్మము అనబడే, లయః - ప్రళయము, ఆసీత్ - కలిగెను, తత్ర - దానియందు, భూః-ఆదయః - భూలోకము మొదలుగా గల, లోకాః - లోకములు, సముద్ర-ఉపప్లుతాః - సముద్రమునందు మునిగిపోయినవి.

ఓ మహారాజా! గడచిన కల్పముయొక్క ఆఖరునందు బ్రహ్మ గారు నిద్రించుట అనే నిమిత్తమును బట్టి బ్రాహ్మము అనే ప్రళయము ఏర్పడెను. అప్పుడు భూలోకము మొదలైన లోకములు సముద్రములో మునిగి పోయినవి.

కాలేనాగతనిద్రస్య ధాతుశ్శిశయిషోర్బలీ ।
ముఖతో నిస్సృతాన్ వేదాన్ హయగ్రీవోఽంతికేఽహరత్ ॥ 8

కాలేన - కాలముచే, ఆగతనిద్రస్య - వచ్చిన నిద్ర కలిగినట్టియు, శిశయిషోః - నిద్రించ గోరిన, ధాతుః - బ్రహ్మగారియొక్క, ముఖతః - నోటి నుండి, నిస్సృతాన్ - బయల్వెడలిన, వేదాన్ - వేదములను, అంతికే - సమీపమునందు, బలీ - బలశాలియగు, హయగ్రీవః - హయగ్రీవాసురుడు, అహరత్ - అపహరించెను.

కాలము సంప్రాప్తమైనప్పుడు బ్రహ్మగారికి నిద్ర వచ్చి, ఆయన నిద్రించ గోరెను. అపుడు ఆయన నోటినుండి బయల్వెడలిన వేదములను ఆయనకు సమీపములోనున్న బలశాలియగు హయగ్రీవాసురుడు అపహరించెను.

జ్ఞాత్వా తద్దానవేంద్రస్య హయగ్రీవస్య చేష్టితమ్ ।
దధార శఫరీరూపం భగవాన్ హరిరీశ్వరః ॥ 9

దానవేంద్రస్య - రాక్షసశ్రేష్ఠుడగు, హయగ్రీవస్య - హయగ్రీవుని యొక్క, తత్ - ఆ, చేష్టితమ్ - పనిని, జ్ఞాత్వా - తెలుసుకొని, ఈశ్వరః - సర్వేశ్వరుడగు, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, శఫరీరూపమ్ - చేప రూపమును, దధార - ధరించెను.

రాక్షసశ్రేష్ఠుడగు హయగ్రీవుడు చేసిన ఆ పనిని తెలుసుకొని, సర్వేశ్వరుడగు శ్రీహరి భగవానుడు చేప రూపమును దాల్చెను.

తత్ర రాజఋషిః కశ్చిన్నామ్నా సత్యవ్రతో మహాన్ ।
నారాయణపరోఽతప్యత్తపస్స సలిలాశనః ।। 10

తత్ర - ఆ కల్పమునందు, నామ్నా - పేరుచే, సత్యవ్రతః - సత్యవ్రతుడు, మహాన్ - గొప్పవాడు అగు, కశ్చిత్ - ఒకానొక, రాజఋషిః - రాజర్షి, నారాయణపరః - నారాయణ భక్తుడు, సః - అతడు, సలిల-అశనః - నీరు మాత్రమే ఆహారముగా గలవాడై, తపః - తపస్సును, అతప్యత్ - చేసెను.

ఆ కల్పములో సత్యవ్రతుడనే పేరు గల గొప్ప రాజర్షి ఉండెను. నారాయణ భక్తుడగు ఆయన నీటిని మాత్రమే ఆహారముగా తీసుకొని తపస్సును చేసెను.

యోఽసావస్మిన్ మహాకల్పే తనయస్స వివస్వతః ।
శ్రాద్ధదేవ ఇతి ఖ్యాతో మనుత్వే హరిణాఽర్పితః ।। 11

యః - ఏ, సః - అతడు, అస్మిన్ - ఈ, మహాకల్పే - గొప్ప కల్పమునందు, అసౌ - ఈ, వివస్వతః - సూర్యుని, తనయః - పుత్రుడు, శ్రాద్ధదేవః - శ్రాద్ధదేవుడు, ఇతి - అని, ఖ్యాతః - ప్రసిద్ధి గాంచినవాడు, హరిణా - శ్రీహరిచే, మనుత్వే - మనువు అనే స్థానమునందు, అర్పితః - స్థాపించబడినవాడు.

ఆ సత్యవ్రతుడే ఈ గొప్ప కల్పమునందు శ్రాద్ధదేవుడని ప్రసిద్ధి గాంచిన ఈ సూర్యపుత్రుడు. ఈయననే శ్రీహరి మనువు అనే స్థానమునందు స్థాపించినాడు.

ఏకదా కృతమాలాయాం కుర్వతో జలతర్పణమ్ ।
తస్యాంజల్యుదకే కాచిచ్ఛఫర్యేకాభ్యపద్యత ।। 12

ఏకదా - ఒకనాడు, కృతమాలాయామ్ - కృతమాలా నదియందు, జలతర్పణమ్ - నీటితో తర్పణమును, కుర్వతః - చేయుచున్న, తస్య - వానియొక్క, అంజలి-ఉదకే - దోసిలియందలి నీటియందు, కాచిత్ - ఏదో రకానికి చెందిన, ఏకా - ఒక, శఫరీ - చేప, అభ్యపద్యత - వచ్చి పడెను.

ఒకనాడు ఆయన కృతమాలానదిలో నీటితో తర్పణములను చేయుచుండగా, ఆయన దోసిలిలోని నీటిలో ఏదో ఒక చేప వచ్చి చేరెను.

సత్యవ్రతోఽంజలిగతాం సహ తోయేన భారత ।
ఉత్ససర్జ నదీతోయే శఫరీం ద్రవిడేశ్వరః ॥ 13

భారత - భరతవంశీయుడవగు ఓ రాజా!, ద్రవిడ-ఈశ్వరః - ద్రవిడదేశ ప్రభువగు, సత్యవ్రతః - సత్యవ్రతుడు, అంజలిగతామ్ - దోసిలియందున్న, శఫరీమ్ - చేపను, తోయేన సహ - నీటితో బాటుగా, నదీతోయే - నదియొక్క నీటియందు, ఉత్ససర్జ - విడిచిపెట్టెను.

భరతవంశీయుడవగు ఓ రాజా! ద్రవిడదేశ ప్రభువగు సత్యవ్రతుడు దోసిలియందున్న చేపను నీటితో బాటుగా నదియొక్క నీటిలో విడిచి పెట్టెను.

తమాహ సాఽతికరుణం మహాకారుణికం నృపమ్ ।
యాదోభ్యో జ్ఞాతిఘాతేభ్యో దీనాం మాం దీనవత్సల ।
కథం విసృజసే రాజన్ భీతామస్మిన్ సరిజ్జలే ॥ 14

మహాకారుణికమ్ - గొప్ప కరుణామయుడగు, తమ్ - ఆ, నృపమ్ - రాజును ఉద్దేశించి, సా - ఆ చేప, అతికరుణమ్ - మిక్కిలి కరుణముగా, ఆహ - పలికెను, దీనవత్సల - దీనులయందు ప్రేమ గలవాడా!, రాజన్ - ఓ రాజా!, దీనామ్ - దీనురాలనైనట్టియు, జ్ఞాతిఘాతేభ్యః - తమ జాతికి చెందిన ప్రాణులను చంపే, యాదోభ్యః - జలజంతువుల వలన, భీతామ్ - భయపడియున్న, మామ్ - నన్ను, అస్మిన్ - ఈ, సరిత్-జలే - నదీజలమునందు, కథమ్ - ఏ విధముగా, విసృజసే - విడిచి పెట్టెదవు?

గొప్ప కరుణామయుడగు ఆ రాజును ఉద్దేశించి ఆ చేప మిక్కిలి కరుణముగా ఇట్లు పలికెను -- ఓ రాజా! నీవు దీనులయందు ప్రేమ గలవా డవు. దీనురాలనగు నేను తమ జాతికే చెందిన ప్రాణులను చంపే జలజం తువుల వలన భయపడియున్నాను. నన్ను ఈ నదీజలములయందు ఎట్లు విడిచి పెట్టెదవు?

తమాత్మనోఽనుగ్రహార్థం ప్రీత్యా మత్స్యవపుర్ధరమ్ ।
అజానన్ రక్షణార్థాయ శఫర్యాస్స మనో దధే ॥ 15

ఆత్మనః - తనయొక్క, అనుగ్రహ-అర్థమ్ - అనుగ్రహించుట కొరకు, మత్స్యవపుః-ధరమ్ - చేప రూపమును ధరించిన, తమ్ - ఆ విష్ణువును, అజానన్ - తెలియని, సః - ఆ రాజు, శఫర్యాః - చేపయొక్క, రక్షణ-అర్థాయ - రక్షించుట అనే ప్రయోజనము కొరకు, ప్రీత్యా - ప్రేమతో, మనః - మనస్సును, దధే - నిశ్చయించెను.

తనను అనుగ్రహించుటకై విష్ణువు చేప రూపమును ధరించి వచ్చినాడని ఆ మహారాజునకు తెలియదు. ఆయన ప్రేమతో ఆ చేపను రక్షించుటకే మనస్సులో నిశ్చయించెను.

తస్యా దీనతరం వాక్యమాశ్రుత్య స మహీపతిః ।
కలశాప్సు నిధాయైనాం దయాలుర్నిన్య ఆశ్రమమ్ ॥ 16

తస్యాః - ఆ చేపయొక్క, దీనతరమ్ - మిక్కిలి దీనమగు, వాక్యమ్ - మాటను, ఆశ్రుత్య - జాగ్రత్తగా విని, దయాలుః - దయామయుడగు, సః - ఆ, మహీపతిః - రాజు, ఏనామ్ - ఈ చేపను, కలశ-అప్సు - కలశమునందలి నీళ్లయందు, నిధాయ - ఉంచి, ఆశ్రమమ్ - ఆశ్రమమును గురించి, నిన్యే - తీసుకు వెళ్లెను.

ఆ చేపయొక్క అతిదీనమగు మాటను విని దయామయుడగు ఆ రాజు దానిని కలశములోని నీటిలో వేసి ఆశ్రమమునకు తీసుకు వెళ్లెను.

సా తు తత్రైకరాత్రేణ వర్ధమానా కమండలౌ ।
అలబ్ధ్వాఽఽత్మావకాశం వా ఇదమాహ మహీపతిమ్ ॥ 17

సా తు - ఆ చేపయైతే, తత్ర - ఆ, కమండలౌ - కమండలమునం దు, ఏకరాత్రేణ - ఒక్క రాత్రిచే, వర్ధమానా - పెరుగుచున్నదై, అత్మావకా శమ్ - తనకు అవకాశమును, అలబ్ధ్వా వై - సుతరాము పొందక, మహీప తిమ్ - రాజును ఉద్దేశించి, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను.

ఆ చేప ఒకే ఒక రాత్రిలో ఆ కమండలమునందు తనకు దానిలో చోటు చాలని విధముగా పెరిగెను. అపుడది ఆ రాజుతో నిట్లనెను.

నాహం కమండలావస్మిన్ కృచ్ఛ్రం వస్తుమిహోత్సహే ।
కల్పయౌకస్సువిపులం యత్రాహం నివసే సుఖమ్ ।। 18

అహమ్ - నేను, ఇహ - ఇచట, అస్మిన్ - ఈ, కమండలౌ - కమండలమునందు, కృచ్ఛ్రమ్ - కష్టముగా, వస్తుమ్ - నివసించుటకు, న ఉత్సహే - సమర్థురాలను కాదు, సువిపులమ్ - మిక్కిలి విశాలమైన, ఓకః - నివాసమును, కల్పయ - ఏర్పాటు చేయుము, యత్ర - ఎక్కడనైతే, అహమ్ - నేను, సుఖమ్ - సుఖముగా, నివసే - నివసించెదనో.

ఇచట ఈ కమండలములో ఇరుకులో కష్టపడుతూ నివసించుట నావలన కాదు. కావున, నాకు మిక్కిలి విశాలమగు నివాసమును ఏర్పాటు చేయుము. అచట నేను సుఖముగా నివసించెదను.

స ఏనాం తత ఆదాయ న్యధాదౌదంచనోదకే ।
తత్ర క్షిప్తా ముహూర్తేన హస్తత్రయమవర్ధత ।। 19

సః - ఆ రాజు, ఏనామ్ - ఈ చేపను, తతః - అచటనుండి, ఆదాయ - తీసుకొని, ఔదంచన-ఉదకే - నూతి నీటియందు, న్యధాత్ - వేసెను, తత్ర - అచట, క్షిప్తా - వేయబడిన ఆ చేప, ముహూర్తేన - గంట లో, హస్తత్రయమ్ - మూడు మూరలను, అవర్ధత - పెరిగెను.

ఆ రాజు ఆ చేపను అచటనుండి తీసుకువెళ్లి నూతి నీటిలో వేసె ను. నూతిలో వేయబడిన ఆ చేప గంటలో మూడు మూరలు పెరిగెను.

న మ ఏతదలం రాజన్ సుఖం వస్తుముదంచనమ్ ।
పృథు దేహి పదం మహ్యాం యత్త్వాహం శరణం గతా ।।20

రాజన్ - ఓ మహారాజా!, సుఖమ్ - సుఖముగా, వస్తుమ్ - నివసించుటకు, ఏతత్ - ఈ, ఉదంచనమ్ - నుయ్యి, మే - నాకు, న అలమ్ - చాలదు, మహ్యామ్ - నా కొరకు, పృథు - పెద్ద, పదమ్ - స్థానమును, దేహి - ఇమ్ము, యత్ - ఏలయనగా, అహమ్ - నేను, త్వా - నిన్ను, శరణమ్ - శరణమును, గతా - పొందితినో.

ఓ మహారాజా! నాకీ నుయ్యి సుఖముగా నివసించుటకు చాలుట లేదు. నేను నిన్ను శరణు వేడినాను. కావున, నాకు విశాలమగు స్థానమును ఏర్పాటు చేయుము.

తత ఆదాయ సా రాజ్ఞా క్షిప్తా రాజన్ సరోవరే ।
తదావృత్యాత్మనా సోఽయం మహామీనోఽన్వవర్ధత ।। 21

రాజన్ - ఓ మహారాజా!, సా - ఆ చేప, రాజ్ఞా - రాజుచే, తతః - అక్కడనుండి, ఆదాయ - తీసుకొని, సరోవరే - సరస్సునందు, క్షిప్తా - వేయబడెను, సః - ఆ, అయమ్ - ఈ, మహామీనః - గొప్ప చేప, ఆత్మనా - దేహముతో, తత్ - ఆ సరస్సును, ఆవృత్య - ఆవరించి, అను-అవర్ధత - నిరంతరముగా పెరిగెను.

ఓ మహారాజా! ఆ రాజు ఆ చేపను ఆ నూతినుండి తీసి సరస్సునందు వేసెను. ఆ ఈ గొప్ప చేప నిరంతరముగా పెరిగి ఆ సరస్సును ఆవరించెను.

నైతన్మే స్వస్తయే రాజన్నుదకం సలిలౌకసః ।
నిధేహి రక్షాయోగేన హ్రదే మామవిదాసిని ।। 22

రాజన్ - ఓ రాజా!, సలిల-ఓకసః - నీరే నివాసముగా గల, మే - నాకు, ఏతత్ - ఈ, ఉదకమ్ - సరస్సు నీరు, స్వస్తయే - సుఖము కొరకు, న - కాదు, రక్షాయోగేన - రక్షించే ఉపాయముచే, అవిదాసిని - క్షీణిం

చుట లేని, హ్రదే - మహాసరస్సునందు, మామ్ - నన్ను, నిధేహి - ఉంచుము.

ఓ రాజా! నాకు నీరే నివాసము. ఈ సరస్సులోని నీరు నా సుఖవిహారమునకు సరిపడుట లేదు. నన్ను రక్షించే ఉపాయమును చేయుము. నీరు ఎన్నటికీ క్షీణించని అగాధమగు సరస్సులో నన్ను ఉంచుము.

ఇత్యుక్తస్సోఽనయన్మత్స్యం తత్ర తత్రావిదాసిని ।
జలాశయే సంమితం తం సముద్రే ప్రాక్షిపజ్ఝషమ్ ॥ 23

ఇతి - ఈ విధముగా, ఉక్తః - పలుకబడిన, సః - ఆ రాజు, మత్స్యమ్ - చేపను, తత్ర తత్ర - ఆయా, అవిదాసిని - క్షీణించని జలము గల సరస్సునందు, అనయత్ - తీసుకు వెళ్లెను, సంమితమ్ - దానితో సమానమైన, తమ్ - ఆ, ఝషమ్ - చేపను, సముద్రే - సముద్రమునందు, ప్రాక్షిపత్ - వేసెను.

ఆ చేప ఇట్లు పలుకగా, ఆ రాజు ఆ చేపను క్షీణించని నీరు గల సరస్సులలో, ఒకదాని కంటె మరియొకటి పెద్దదిగా ఉండే సరస్సులలో వేసెను. ఆ చేప ఆ సరస్సుతో సమానముగా పెరుగుచుండెను. అపుడాయన ఆ చేపను సముద్రములో వేసెను.

క్షిప్యమాణస్తమాహేదమిహ మాం మకరాదయః ।
అదంత్యతిబలా వీర మాం నేహోత్స్రష్టుమర్హసి ॥ 24

క్షిప్యమాణః - వేయబడుచున్న చేప, తమ్ - ఆ రాజును, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను, ఇహ - దీనియందు, అతిబలాః - అధికమగు బలము గల, మకర-ఆదయః - మొసళ్లు మొదలగునవి, మామ్ - నన్ను, అదంతి - భక్షించును, వీర - ఓ వీరా!, మామ్ - నన్ను, ఇహ - దీనియందు, ఉత్స్రష్టుమ్ - విడిచిపెట్టుటకు, న అర్హసి - తగవు.

ఆయన ఆ చేపను సముద్రములో వేయుచుండగా అది ఇట్లనెను -- ఓ వీరా! దీనిలో చాల బలము గల మొసళ్లు, తిమింగలములు మొదల

గునవి గలవు. అవి నన్ను తినివేయును. కావున, నన్ను దీనియందు విడిచి పెట్టుట నీవంటి వీరునకు తగదు.

ఏవం విమోహితస్తేన వదతా వల్గుభారతీమ్ ।
తమాహ కో భవానస్మాన్ మత్స్యరూపేణ మోహయన్ ॥25

వల్గుభారతీమ్ - మధురమైన మాటను, వదతా - పలుకుచున్న, తేన - ఆ చేపచే, ఏవమ్ - ఈ విధముగా, విమోహితః - మోహింప జేయ బడిన రాజు, తమ్ - ఆ చేపను ఉద్దేశించి, ఆహ - పలికెను, మత్స్యరూపేణ - చేప రూపముతో, అస్మాన్ - మమ్ములను, మోహయన్ - మోహ మును కలిగించుచున్న, భవాన్ - నీవు, కః - ఎవరు?

ఈ విధముగా మధురమైన మాటలను పలికి మోహపెట్టుచున్న ఆ చేపతో రాజు ఇట్లనెను -- చేప రూపముతో మమ్ములను మోహపెట్టు చున్న నీవు ఎవరివి?

నైవంవీర్యో జలచరో దృష్టోఽస్మాభిశ్శ్రుతోఽపి చ ।
యో భవాన్ యోజనశతమహ్నాభివ్యానశే సరః ॥ 26

ఏవంవీర్యః - ఇట్టి పరాక్రమము గల, జలచరః - నీటిలో నివసించే ప్రాణి, అస్మాభిః - మాచే, దృష్టః - చూడబడినది, అపి చ - మరియు, శ్రుతః - వినబడినది, న - కాదు, యః - ఏ, భవాన్ - నీవు, అహ్నా - దిన ముచే, యోజనశతమ్ - వంద యోజనములను, సరః - సరస్సును, అభి వ్యానశే - నిండా విస్తరించితివో.

నీ వంటి పరాక్రమము గల నీటి జంతువును మేము ఇదివరలో చూడనూలేదు, విననూలేదు. నీవు ఒకే రోజులో పెరిగి వంద యోజన ముల విస్తారము గల సరస్సును నిండా వ్యాపించితివి.

నూనం త్వం భగవాన్ సాక్షాద్ధరిర్నారాయణోఽవ్యయః ।
అనుగ్రహాయ భూతానాం ధత్సే రూపం జలౌకసామ్ ॥ 27

త్వమ్ - నీవు, నూనమ్ - నిశ్చయముగా, సాక్షాత్ - సాక్షాత్తుగా, అవ్యయః - అవినాశియగు, భగవాన్ నారాయణః - నారాయణ భగవానుడవు, భూతానామ్ - ప్రాణులయొక్క, అనుగ్రహాయ - అనుగ్రహము కొరకు, జల-ఓకసామ్ - నీటిలో నివసించే ప్రాణులయొక్క, రూపమ్ - రూపమును, ధత్సే - ధరించుచున్నావు.

నీవు సాక్షాత్తుగా అవినాశియగు నారాయణ భగవానుడవు. ఇది నిశ్చయము. నీవు ప్రాణులననుగ్రహించుట కొరకై చేపల రూపమును దాల్చినావు.

నమస్తే పురుషశ్రేష్ఠ స్థిత్యుత్పత్త్యప్యయేశ్వర ।
భక్తానాం నః ప్రపన్నానాం ముఖ్యో హ్యాత్మగతిర్విభో ॥ 28

పురుషశ్రేష్ఠ - ఓ పురుషోత్తమా!, స్థితి-ఉత్పత్తి-అప్యయ-ఈశ్వర - స్థితి సృష్టి ప్రళయములకు ప్రభువా!, తే - నీ కొరకు, నమః - నమస్కారము, విభో - ఓ ప్రభూ!, భక్తానామ్ - భక్తులైనట్టియు, ప్రపన్నానామ్ - శరణు వేడిన, నః - మాకు, ముఖ్యః - ప్రధానమైన (సత్యమైన), ఆత్మగతిః హి - ఆత్మ మరియు ఆశ్రయము గదా!

ఓ పురుషోత్తమా! జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు ప్రభుడవు నీవే. నీకు నమస్కారము. ఓ ప్రభూ! నీ భక్తులమగు మేము నిన్ను శరణు వేడుచున్నాము. మాకు సత్యమైన ఆత్మ, ముఖ్యమైన ఆశ్రయము నీవే.

సర్వే లీలావతారాస్తే భూతానాం భూతిహేతవః ।
జ్ఞాతుమిచ్ఛామ్యదో రూపం యదర్థం భవతా ధృతమ్ ॥ 29

తే - నీయొక్క, లీలా-అవతారాః - లీలకొరకైన అవతారములు, సర్వే - అన్నీ, భూతానామ్ - ప్రాణులయొక్క, భూతిహేతవః - అభ్యుదయము కొరకు కారణములు, అదః - ఈ, రూపమ్ - రూపము, భవతా - నీచే, యద్-అర్థమ్ - దేని కొరకై, ధృతమ్ - ధరించబడినదో, జ్ఞాతుమ్ - తెలియుటకు, ఇచ్ఛామి - కోరుచున్నాను.

నీవు అవతారములనెత్తి చేసే లీలలన్నీ ప్రాణుల అభ్యుదయము కొరకు హేతువులగుచున్నవి. నీవీ రూపమును దేనికొరకై ధరించితివో, నేను తెలియ గోరుచున్నాను.

న తేఽరవిందాక్ష పదోపసర్పణం
మృషా భవేత్సర్వసుహృత్ప్రియాత్మనః ।
యథేతరేషాం పృథగాత్మనాం సతా-
మదీదృశో యద్వపురద్భుతం హి నః ॥ 30

అరవింద-అక్ష - పద్మమువంటి కన్నులు గలవాడా!, సర్వసుహృత్-ప్రియ-ఆత్మనః - సకలప్రాణులకు హితకారి మరియు ప్రియమగు ఆత్మస్వరూపుడవు అగు, తే - నీయొక్క, పద-ఉపసర్పణమ్ - పాదములను శరణు వేడుట, మృషా - వ్యర్థము, న భవేత్ - కాదు, యథా - ఏ విధముగానైతే, పృథగ్-ఆత్మనాం సతామ్ - అనాత్మలగు దేహాదులయందు ఆత్మాభిమానము కలిగియుండే, త్వద్-ఇతరేషామ్ - నీకంటె ఇతరులయొక్క (శరణు వేడుటయో), యత్ - ఏలయనగా, నః - మాకు, అద్భుతమ్ - ఆశ్చర్యమును గొలిపే, వపుః - దేహమును, అదీదృశః హి - చూపితివి గదా!

పద్మమువంటి కన్నులు గల ఓ శ్రీహరీ! దేహము మొదలగు అనాత్మపదార్థములయందు ఆత్మభావము గల రాజాదులను నీకంటె భిన్నమైన వారిని ఆశ్రయించుట వ్యర్థము. నీ పాదపద్మములను శరణు వేడుట ఆ విధముగా వ్యర్థము కాదు. ఎందుకంటే, నీవు సకలప్రాణులకు హితకారివి; సకలప్రాణులకు ప్రియమైన ఆత్మవు నీవే. కావుననే, నీవు ఆశ్చర్యమును గొలిపే ఈ రూపమును మాకు చూపితివి.

శ్రీశుక ఉవాచ ।
ఇతి బ్రువాణం నృపతిం జగత్పతిః
సత్యవ్రతం మత్స్యవపుర్యుగక్షయే ।
విహర్తుకామః ప్రలయార్ణవేఽబ్రవీత్
చికీర్షురేకాంతజనప్రియః ప్రియమ్ ॥ 31

యుగక్షయే - యుగాంతమునందు, ప్రలయ-అర్ణవే - ప్రళయ సముద్రమునందు, విహర్తుకామః - విహరించే కోరిక గలవాడై, మత్స్య వపుః - చేప రూపమును దాల్చినవాడు, ఏకాంతజనప్రియః - పరమభక్తులకు ప్రియమైనవాడు (భక్తులు ప్రియులైనవాడు) అగు, జగత్-పతిః - జగన్నాథుడు, ప్రియమ్ - ప్రియమును, చికీర్షుః - చేయగోరువాడై, ఇతి - ఈ విధముగా, బ్రువాణమ్ - పలుకుచున్న, సత్యవ్రతం నృపతిమ్ - సత్యవ్రత మహారాజును ఉద్దేశించి, అబ్రవీత్ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- జగన్నాథుడగు శ్రీహరి పరమ (నిష్కామ) భక్తులకు ప్రియమైనవాడు, వారియందు ప్రీతి గలవాడు. ఆయన యుగాంతములో ప్రళయ సముద్రమునందు విహరించగోరి చేప రూపును దాల్చెను. ఈ విధముగా పలుకుచున్న సత్యవ్రత మహారాజునుద్దేశించి, ఆయనకు ప్రియమును చేయగోరి ఆ భగవానుడిట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
సప్తమేఽద్యతనాదూర్ధ్వమహన్యేతదరిందమ ।
నిమంక్ష్యత్యప్యయాంభోధౌ త్రైలోక్యం భూర్భువాదికమ్ ॥ 32

అరిందమ - శత్రువులను అణగద్రొక్కినవాడా!, అద్యతనాత్ - ఈనాటినుండి, ఊర్ధ్వమ్ - రాబోయే, సప్తమే - ఏడవ, అహని - దినమునందు, భూః-భువ-ఆదికమ్ - భూః భువః మొదలైన, ఏతత్ - ఈ, త్రైలోక్యమ్ - ముల్లోకముల సమూహము, అప్యయ-అంభోధౌ - ప్రళయ సముద్రమునందు, నిమంక్ష్యతి - మునిగి పోగలదు.

శ్రీమత్స్య భగవానుడిట్లు పలికెను --- (అంతః) శత్రువులను అణగద్రొక్కిన ఓ మహారాజా! ఈనాటినుండి రాబోయే ఏడవ రోజున భూః-భువః-సువః అనే మూడు లోకములు ప్రళయ సముద్రమునందు మునిగిపోగలవు.

త్రిలోక్యాం లీయమానాయాం సంవర్తాంభసి వై తదా ।
ఉపస్థాస్యతి నౌః కాచిద్విశాలా త్వాం మయేరితా ॥ 33

తదా - అప్పుడు, త్రిలోక్యామ్ - ముల్లోకములు, సంవర్త-అంభసి - ప్రళయ జలములయందు, వై - నిశ్చయముగా, లీయమానాయామ్ - మునిగిపోగా, కాచిత్ - ఒకానొక, విశాలా - విశాలమైన, నౌః - నౌక, మయా - నాచే, ఈరితా - పంపబడినదై, త్వామ్ - నిన్ను, ఉపస్థాస్యతి - సమీపించ గలదు.

అప్పుడు ముల్లోకములు నిశ్చయముగా ఆ ప్రళయ జలముల యందు మునిగిపోగా, నాచే పంపబడిన ఒకానొక విశాలమైన నౌక నీ వద్దకు రాగలదు.

త్వం తావదోషధీస్సర్వా బీజాన్యుచ్చావచాని చ ।
సప్తర్షిభిః పరివృతస్సర్వసత్త్వోపబృంహితః ।। 34

ఆరుహ్య బృహతీం నావం విచరిష్యస్యవిక్లవః ।
ఏకార్ణవే నిరాలోకే ఋషీణామేవ వర్చసా ।। 35

త్వం తావత్ - నీవైతే, సర్వాః - సకలములైన, ఓషధీః - మొక్కలను, ఉచ్చావచాని - చిన్న పెద్ద, బీజాని చ - విత్తనములను కూడ, సప్త-ఋషిభిః - సప్తర్షులచే, పరివృతః - చుట్టువారబడినవాడవు, సర్వసత్త్వ-ఉపబృంహితః - సకలప్రాణులచే వర్ధిల్ల జేయబడినవాడవు, బృహతీమ్ - పెద్ద, నావమ్ - నౌకను, ఆరుహ్య - ఎక్కి, అవిక్లవః - దైన్యము లేనివాడవై, నిరాలోకే - వెలుతురు లేని, ఏక-అర్ణవే - అంతా వ్యాపించియున్న సముద్రమునందు, ఋషీణామ్ - మహర్షులయొక్క, వర్చసా ఏవ - తేజస్సుచేతనే, విచరిష్యసి - సంచరించ గలవు.

అపుడు నీవైతే సకలములైన మొక్కలను మరియు చిన్న పెద్ద విత్తనములను సంగ్రహించుము. సప్తర్షులు నీకు తోడు కాగలరు. సకలప్రాణులు నీ గొప్పదనమును వర్ధిల్ల జేయగలవు. నీవా పెద్ద నౌకను ఎక్కుము. అంతా వ్యాపించియున్న ఆ ప్రళయ సముద్రములో కాంతి ఉండదు. అయిననూ, నీవు మహర్షుల తేజస్సు చేతనే దైన్యము లేకుండా సంచరించ గలవు.

దోధూయమానాం తాం నావం సమీరేణ బలీయసా ।
ఉపస్థితస్య మే శృంగే నిబధ్నీహి మహాహినా ॥ 36

బలీయసా - మిక్కిలి బలమైన, సమీరేణ - వాయువుచే, దోధూయమానామ్ - అల్లల్లాడునట్లు చేయబడుచున్న, తామ్ - ఆ, నావమ్ - నౌకను, ఉపస్థితస్య - సమీపమునకు వచ్చియున్న, మే - నాయొక్క, శృంగే - కొమ్మునందు, మహా-అహినా - పెద్ద పాముతో, నిబధ్నీహి - గట్టిగా కట్టుము.

మిక్కిలి బలమైన గాలిలో ఆ నావ అల్లల్లాడిపోవును. నేను అప్పుడు అచటకు వచ్చెదను. నీవా నావను మహాసర్పమగు వాసుకితో నా కొమ్మునకు గట్టిగా కట్టివేయుము.

అహం త్వామృషిభిస్సాకం సహనావముదన్వతి ।
వికర్షన్ విచరిష్యామి యావద్బ్రాహ్మీ నిశా ప్రభో ॥ 37

ప్రభో - ఓ మహారాజా!, ఉదన్వతి - సముద్రమునందు, సహనావమ్ - నౌకతో కూడియున్న, త్వామ్ - నిన్ను, ఋషిభిః సాకమ్ - మహర్షులతో బాటుగా, వికర్షన్ - లాగుచున్నవాడనై, విచరిష్యామి - సంచరించగలను, యావత్ - ఎంతవరకైతే, బ్రాహ్మీ - బ్రహ్మగారికి చెందిన, నిశా - రాత్రియో.

ఓ మహారాజా! నీవు, మహర్షులు ఆ నౌకలో కలిసియుండగా, బ్రహ్మగారి రాత్రి (ప్రళయము) సాగినంత కాలము నేనా నావను సముద్రములో లాగుతూ విహరించెదను.

మదీయం మహిమానం చ పరం బ్రహ్మేతి శబ్దితమ్ ।
వేత్స్యస్యనుగృహీతం మే సంప్రశ్నైర్వివృతం హృది ॥ 38

పరం బ్రహ్మ - పరబ్రహ్మ, ఇతి - అని, శబ్దితమ్ - చెప్పబడినట్టియు, సంప్రశ్నైః - చక్కని ప్రశ్నలచే, వివృతమ్ - వివరించబడినట్టియు, మే - నాచే, అనుగృహీతమ్ - అనుగ్రహించబడినట్టియు, మదీ

యమ్ - నాదైన, మహిమానం చ - స్వరూపమును కూడ, హృది - హృద యమునందు, వేత్స్యసి - తెలియగలవు.

నీవు చక్కని ప్రశ్నలను వేయుచుండగా, పరబ్రహ్మ అని మహర్షు లచే ప్రతిపాదించబడే నా స్వరూపమును నేను వివరించి చెప్పగలను. నా అనుగ్రహముచే నీవా పరబ్రహ్మను హృదయమునందు సాక్షాత్కరించు కొనగలవు.

ఇత్థమాదిశ్య రాజానం హరిరంతరధీయత ।
సోఽన్వవైక్షత తం కాలం యం హృషీకేశ ఆదిశత్ ।। 39

హరిః - శ్రీహరి, రాజానమ్ - సత్యవ్రత మహారాజును, ఇత్థమ్ - ఈ విధముగా, ఆదిశ్య - ఆదేశించి, అంతరధీయత - అంతర్ధానము చెందె ను, సః - ఆతడు, తమ్ - ఆ, కాలమ్ - కాలమును, అను-అవైక్షత - నిరం తరముగా ప్రతీక్షించెను, యమ్ - దేనినైతే, హృషీకేశః - శ్రీహరి, ఆదిశత్ - ఆదేశించెనో.

శ్రీహరి సత్యవ్రత మహారాజును ఈ విధముగా ఆదేశించి అంతర్ధా నము చెందెను. ఇంద్రియాధిపతియగు శ్రీహరి ఆదేశించిన ఆ సమయము కొరకై ఆ రాజు నిరంతరముగా ప్రతీక్షించుచుండెను.

ఆస్తీర్య దర్భాన్ ప్రాక్కూలాన్ రాజర్షిః ప్రాగుదఙ్ముఖః ।
నిషసాద హరేః పాదౌ చింతయన్ మత్స్యరూపిణః ।। 40

దర్భాన్ - దర్భలను, ప్రాక్-కూలాన్ - తూర్పువైపు కొనలు గల వానినిగా, ఆస్తీర్య - పరచి, రాజర్షిః - రాజర్షియగు సత్యవ్రతుడు, ప్రాగ్-ఉ దఙ్-ముఖః - ఈశాన్యమునకు అభిముఖుడై, మత్స్యరూపిణః - మత్స్య రూపుడగు, హరేః - శ్రీహరియొక్క, పాదౌ - పాదములను, చింతయన్ - ధ్యానించుచున్నవాడై, నిషసాద - కూర్చుండెను.

రాజర్షియగు ఆ సత్యవ్రతుడు తూర్పు వైపు కొనలు ఉండునట్లుగా దర్భలను పరచి, ఈశాన్యమునకభిముఖముగా కూర్చుండి, మత్స్యరూపు డగు శ్రీహరియొక్క పాదములను ధ్యానించెను.

తతస్సముద్ర ఉద్వేలస్సర్వతః ప్లావయన్ మహీమ్ ।
వర్ధమానో మహామేఘైర్వర్షద్భిస్సమదృశ్యత ॥ 41

తతః - తరువాత, వర్షద్భిః - వర్షించుచున్న, మహామేఘైః - పెద్ద మేఘములచే, వర్ధమానః - పెరుగుచున్నది, ఉద్-వేలః - చెలియలి కట్టను దాటినది అగు, సముద్రః - సముద్రము, మహీమ్ - భూమిని, సర్వతః - అంతటా, ప్లావయన్ - ముంచెత్తుచున్నదై, సమదృశ్యత - కానవచ్చెను.

తరువాత పెద్ద మేఘములు వర్షించుచుండగా వర్ధిల్లి చెలియలి కట్టను దాటి సముద్రము భూమినంతనూ ముంచెత్తుచుండుటను ఆ మహా రాజు చూచెను.

ధ్యాయన్ భగవదాదేశం దదృశే నావమాగతమ్ ।
తామారురోహ విప్రేంద్రైరాదాయౌషధివీరుధః ॥ 42

భగవద్-ఆదేశమ్ - భగవానుని ఆదేశమును గురించి, ధ్యాయన్ - ఆలోచించుచున్న రాజు, ఆగతమ్ - వచ్చిన, నావమ్ - నౌకను, దదృశే - చూచెను, ఓషధివీరుధః - మొక్కలను చెట్లను, ఆదాయ - తీసుకొని, విప్ర-ఇంద్రైః - మహర్షులతో గూడి, తామ్ - ఆ నౌకను, ఆరురోహ - ఎక్కెను.

ఆ రాజు భగవానుని ఆదేశమును గురించి తలపోస్తూండగానే అచటకు వచ్చిన నౌక కనబడెను. ఆతడు ఓషధుల (పంటధాన్యముల) మరియు వృక్షముల బీజములను తీసుకొని, మహర్షులతో గూడి ఆ నౌకపై ఎక్కెను.

తమూచుర్మునయః ప్రీతా రాజన్ ధ్యాయస్వ కేశవమ్ ।
స వై నస్సంకటాదస్మాదవితా శం విధాస్యతి ॥ 43

ప్రీతాః - సంతోషమును పొందిన, మునయః - మహర్షులు, తమ్ - ఆ రాజును ఉద్దేశించి, ఊచుః - పలికిరి, రాజన్ - ఓ రాజా!, కేశవమ్ - శ్రీహరిని, ధ్యాయస్వ - ధ్యానించుము, సః - ఆయన, వై - నిశ్చయముగా, నః - మనలను, అస్మాత్ - ఈ, సంకటాత్ - కష్టమునుండి, అవితా - రక్షించగలడు, శమ్ - సుఖమును, విధాస్యతి - కలిగించ గలడు.

సంతోషించిన ఆ మహర్షులు ఇట్లు పలికిరి -- ఓ రాజా! నీవు శ్రీహరిని ధ్యానించుము. ఆయన నిశ్చయముగా మనలనీ కష్టమునుండి రక్షించి, సుఖమును కలిగించగలడు.

సోఽనుధ్యాతస్తతో రాజ్ఞా ప్రాదురాసీన్మహార్ణవే ।
ఏకశృంగధరో మత్స్యో హైమో నియుతయోజనః ॥ 44

రాజ్ఞా - రాజుచే, అనుధ్యాతః - ధ్యానించబడిన, సః - ఆ శ్రీహరి, తతః - తరువాత, మహార్ణవే - మహాసముద్రమునందు, ఏకశృంగధరః - ఒక కొమ్మును ధరించినది, హైమః - బంగరుది, నియుతయోజనః - లక్ష యోజనముల నిడివిగల, మత్స్యః - చేపయై, ప్రాదురాసీత్ - ఆవిర్భవించె ను.

తరువాత ఆ మహారాజు ధ్యానించగా, శ్రీహరి లక్షయోజనముల నిడివి గల బంగరు చేపయై ఆ మహాసముద్రములో ఆవిర్భవించెను. ఆ చేపకు ఒక కొమ్ము ఉండెను.

నిబధ్య నావం తచ్ఛృంగే యథోక్తో హరిణా పురా ।
వరత్రేణాహినా తుష్టస్తుష్టావ మధుసూదనమ్ ॥ 45

పురా - పూర్వము, యథా - ఏ విధముగానైతే, హరిణా - శ్రీహరి చే, ఉక్తః - చెప్పబడినాడో ఆ విధముగా, నావమ్ - నౌకను, తత్-శృంగే - ఆ చేపయొక్క కొమ్మునందు, వరత్రేణ - మోకు అయిన, అహినా - పాముతో, నిబధ్య - గట్టిగా కట్టి, తుష్టః - సంతోషించినవాడై, మధుసూద నమ్ - శ్రీహరిని, తుష్టావ - స్తుతించెను.

పూర్వము శ్రీహరి చెప్పిన విధముగా ఆ రాజు వాసుకినాగును మోకుగా చేసి ఆ నావను చేప కొమ్మునకు గట్టిగా కట్టెను. అపుడాయన సంతోషించి, మధువు అనే రాక్షసుని చంపిన శ్రీహరిని ఇట్లు స్తుతించెను.

రాజోవాచ ।
అనాద్యవిద్యోపహతాత్మసంవిదః
తన్మూలసంసారపరిశ్రమాతురాః ।

యదృచ్ఛయేహోపసృతా యమాప్నుయుః
విముక్తిదో నః పరమో గురుర్భవాన్ ॥ 46

**అనాది-అవిద్యా-ఉపహత-ఆత్మసంవిదః** - అనాదియగు అజ్ఞానముచే నశింప జేయబడిన ఆత్మతత్త్వముయొక్క జ్ఞానము గలవారు, **తత్-మూలసంసారపరిశ్రమ-ఆతురాః** - ఆ అజ్ఞానము మూలముగా గల సంసారమునందలి అధికమగు శ్రమలచే కలవరపడువారు, **యదృచ్ఛయా** - అనుకోకుండా, **ఇహ** - ఈ లోకమునందు, **యమ్** - ఎవనిని, **ఉపసృతాః** - ఆశ్రయించినవారై, **అప్నుయుః** - పొందెదరో, **పరమః గురుః** - గురువులకు గురవగు, **భవాన్** - నీవు, **నః** - మాకు, **విముక్తిదః** - మోక్షమునిచ్చువాడవు.

సత్యవ్రత మహారాజు ఇట్లు పలికెను --- జనులు ఈ లోకములో అనాదియగు అజ్ఞానముచే కప్పివేయబడిన ఆత్మతత్త్వవివేకము గలవారై, ఆ అజ్ఞానముచే కలిగించబడిన సంసారములో నిరంతరముగా పరిశ్రమిస్తూ వ్యాకులురై యుండెదరు. వారు అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) నిన్ను శరణు వేడి నిన్నే (ఆత్మరూపముగా) పొందెదరు. నీవు గురువులకు గురుడవు. నీవు మాకు మోక్షమునిమ్ము.

జనోఽబుధోఽయం నిజకర్మబంధనః
సుఖేచ్ఛయా కర్మ సమీహతేఽసుఖమ్ ।
యత్సేవయా తాం విధునోత్యసన్మతిం
గ్రంథిం స భింద్యాద్ధృదయం స నో గురుః ॥ 47

**నిజకర్మబంధనః** - తన కర్మలచే బంధించబడియున్న, **అయమ్** - ఈ, **అబుధః** - అవివేకియగు, **జనః** - మానవుడు, **సుఖ-ఇచ్ఛయా** - సుఖమునందలి కోరికచే, **కర్మ** - కర్మను, **అసుఖమ్** - దుఃఖము కలుగునట్లుగా, **సమీహతే** - చేయుచున్నాడు, **యత్-సేవయా** - ఎవని సేవచే, **తామ్** - అట్టి, **అసత్-మతిమ్** - అవివేకబుద్ధిని, **విధునోతి** - వదిలించుకొనునో, **సః** - అట్టి శ్రీహరి, **నః** - మాకు, **గురుః** - గురువు, **హృదయమ్** - బుద్ధి అనే, **గ్రంథిమ్** - ముడిని, **భింద్యాత్** - విడదీయుగాక!

అవివేకియగు ఈ మానవుడు తాను చేసిన కర్మలచే తానే బద్ధుడగును. మానవుడు సుఖమును కోరి కర్మలను చేసి దుఃఖమును మూటగట్టును. వాని ఈ అజ్ఞానము శ్రీహరిని సేవించుటచే తొలగిపోవును. అట్టి శ్రీహరి మాకు గురువు. ఆయన మా హృదయమునందలి అజ్ఞానగ్రంథిని పోనాడు గాక!

యత్సేవయాఽగ్నేరివ రుద్రరోదనం
పుమాన్ విజహ్యాన్మలమాత్మనస్తమః ।
భజేత వర్ణం నిజమేష సోఽవ్యయో
భూయాత్స ఈశః పరమో గురోర్గురుః ॥ 48

పుమాన్ - మానవుడు, యత్-సేవయా - ఎవని సేవచే, ఆత్మనః - తనయొక్క, మలమ్ - మాలిన్యమగు, తమః - తమోగుణమును, రుద్ర రోదనమ్ - రుద్రుని రోదనమగు వెండి, అగ్నేః ఇవ - అగ్నియొక్క వలె, విజహ్యాత్ - విడిచిపెట్టునో, నిజమ్ - తనదైన, వర్ణమ్ - స్వరూపమును, భజేత - పొందునో, సః - అట్టి, ఏషః - ఈ, అవ్యయః - అవినాశియగు, ఈశః - ఈశ్వరుడు, గురోః - గురువునకు, పరమః - పూజ్యుడు, సః - ఆ శ్రీహరి, గురుః - గురువు, భూయాత్ - అగుగాక!

రుద్రుని రోదనమునుండి పుట్టిన వెండి అగ్నియొక్క సంపర్కము వలన తనలోని మాలిన్యమును పోగొట్టుకొని తనదైన రంగును పొందును. అదే విధముగా మానవుడు శ్రీహరిని సేవించి తనలోని అజ్ఞానమనే మాలిన్యమును పోగొట్టుకొని జ్ఞానముచే తన స్వరూపమును పొందును. అవినాశియగు అట్టి ఈశ్వరుడు గురువులకు కూడ పూజనీయుడు. అట్టి శ్రీహరి మాకు గురువు అగుగాక!

న యత్ప్రసాదాయుతభాగలేశ-
మన్యే చ దేవా గురవో జనాస్స్వయమ్ ।
కర్తుం సమేతాః ప్రభవంతి పుంసః
తమీశ్వరం త్వాం శరణం ప్రపద్యే ॥ 49

పుంసః - మానవునకు, దేవాః - దేవతలు, గురవః - గురువులు, అన్యే - ఇతరులైన, జనాః చ - జనులు కూడ, సమేతాః - కలిసినవారై, స్వయమ్ - తమంత తాముగా, యత్-ప్రసాద-అయుతభాగలేశమ్ - ఎవని అనుగ్రహములో పదివేలవ వంతులోని లేశమునైననూ, కర్తుమ్ - చేయుటకు, న ప్రభవంతి - సమర్థులు కారో, ఈశ్వరమ్ - ఈశ్వరుడవగు, తమ్ - అట్టి, త్వామ్ - నిన్ను, శరణమ్ - శరణమునుగా, ప్రపద్యే - పొందుచున్నాను.

దేవతలు, గురువులు, ఇతర జనులు కూడ కలిసియైననూ తమంత తాముగా నీ అనుగ్రహములో పదివేలవ వంతులోని లేశము నైననూ మానవునకు చేయజాలరు. అట్టి సర్వేశ్వరుడవగు నిన్ను నేను శరణు పొందుచున్నాను.

అచక్షురంధస్య యథాగ్రణీః కృతః
తథా జనస్యావిదుషోఽబుధో గురుః ।
త్వమర్కదృక్సర్వదృశాం సమీక్షణో
వృతో గురుర్నస్స్వగతిం బుభుత్సతామ్ ॥ 50

యథా - ఏ విధముగానైతే, అచక్షుః - గ్రుడ్డివాడు, అగ్రణీః - అగ్రేసరుడు, కృతః - చేయబడినాడో, తథా - అదే విధముగా, అవిదుషః - అవివేకియగు, జనస్య - జనునకు, అబుధః - అజ్ఞాని, గురుః - గురువు, అర్కదృక్ - సూర్యుడు కన్నుగా గల, త్వమ్ - నీవు, సర్వదృశామ్ - సకలములైన ఇంద్రియములకు, సమీక్షణః - ప్రకాశకుడవు, స్వగతిమ్ - ఆత్మతత్త్వమును, బుభుత్సతామ్ - తెలియగోరే, నః - మాకు, గురుః - గురువుగా, వృతః - ఎన్నుకొనబడిన వాడవు.

అవివేకి అజ్ఞానియగు వ్యక్తిని గురువుగా చేసుకున్నచో, గ్రుడ్డివాడు మరియొక గ్రుడ్డివానిని మార్గదర్శకునిగా చేసుకున్నట్లుండును. నీకు సూర్యుడు కన్ను. సకలములైన ఇంద్రియములను ప్రకాశింపజేసే చైతన్యము నీవే. కావుననే, ఆత్మతత్త్వమును తెలియగోరే మేము సర్వజ్ఞుడవగు అట్టి నిన్ను గురువుగా ఎన్నుకున్నాము.

జనో జనస్యాదిశతేఽసతీం మతిం
యయా ప్రపద్యేత దురత్యయం తమః ।
త్వం త్వవ్యయం జ్ఞానమమోఘమంజసా
ప్రపద్యతే యేన జనో నిజం పదమ్ ।। 51

జనః - మానవుడు, జనస్య - మానవునకు, అసతీమ్ - అయోగ్య మగు, మతిమ్ - బుద్ధిని, ఆదిశతే - ఉపదేశించును, యయా - దేనిచేనైతే, దురత్యయమ్ - దాట శక్యము కాని, తమః - చీకటిని, ప్రపద్యేత - పొందునో, త్వం తు - నీవైతే, అవ్యయమ్ - వినాశము లేనట్టియు, అమోఘమ్ - వ్యర్థము కాని, జ్ఞానమ్ - జ్ఞానమును, యేన - దేనిచేనైతే, జనః - మానవుడు, అంజసా - తేలికగా, నిజమ్ - తనదైన, పదమ్ - స్వరూపమును, ప్రపద్యతే - పొందుచున్నాడో.

అజ్ఞానియగు జనుడు అజ్ఞానియగు జనునకు అర్థకామములకు చెందిన అయోగ్యమగు బుద్ధిని ఉపదేశించగా, వాడు దాని కారణముగా చీకటివంటి దాట శక్యము కాని సంసారము (నరకము) ను పొందుచున్నాడు. కాని, నీవు వినాశము లేని మరియు వ్యర్థము కాని ఆత్మజ్ఞానమునుపదేశించెదవు. దాని వలన మానవుడు తేలికగా తన స్వరూపమును తెలుసుకొని తద్వారా మోక్షమును పొందును.

త్వం సర్వలోకస్య సుహృత్ప్రియేశ్వరో
హ్యాత్మా గురుర్ జ్ఞానమభీష్టసిద్ధిః ।
తథాపి లోకో న భవంతమంధధీః
జానాతి సంతం హృది బద్ధకామః ।। 52

సర్వలోకస్య - సర్వమానవులకు, త్వమ్ - నీవు, సుహృత్ - హితకారివి, ప్రియ-ఈశ్వరః - ప్రియమైన ఈశ్వరుడవు, ఆత్మా - ఆత్మవు, గురుః - గురుడవు, జ్ఞానమ్ - జ్ఞానరూపుడవు, అభీష్టసిద్ధిః - అభీష్టము యొక్క సిద్ధి రూపముగా గలవాడవు, తథాపి - అయినప్పటికీ, బద్ధకామః - దృఢమైన కామనలు గలవాడు, అంధధీః - వివేకము లేని బుద్ధి గలవాడు

అగు, లోకః - మానవుడు, హృది - హృదయమునందు, సంతమ్ - ఉండే, భవంతమ్ - నిన్ను, న జానాతి - తెలియకున్నాడు.

సర్వమానవులకు నీవు హితకారివి, ప్రియమగు ఆత్మరూపుడవు, ఈశ్వరుడవు మరియు గురుడవు. మానవుడు పొందే జ్ఞానము, మరియు అభీష్టసిద్ధి కూడ నీ రూపములే. అయినప్పటికీ, మానవుడు కామనల యందు గట్టిగా తగుల్కొన్నవాడై బుద్ధియందు వివేకమును కోల్పోయి, తన హృదయమునందే ఉన్న నిన్ను తెలియలేకున్నాడు.

తం త్వామహం దేవవరం వరేణ్యం
ప్రపద్య ఈశం ప్రతిబోధనాయ ।
ఛింధ్యర్థదీపైర్భగవన్ వచోభిః
గ్రంథీన్ హృదయ్యాన్ వివృణు స్వమోకః ।। 53

దేవవరమ్ - దేవనాయకుడవైనట్టియు, వరేణ్యమ్ - ప్రార్థించ దగినట్టియు, ఈశమ్ - ఈశ్వరుడవగు, తమ్ - అట్టి, త్వామ్ - నిన్ను, ప్రతిబోధనాయ - తత్త్వోపదేశము కొరకు, ప్రపద్యే - శరణు పొందుచున్నాను, భగవన్ - ఓ భగవానుడా!, అర్థదీపైః - తత్త్వమును ప్రకాశింప జేసే, వచోభిః - వాక్కులతో, హృదయ్యాన్ - హృదయమునందుండే, గ్రంథీన్ - ముడులను, ఛింధి - ఛేదించుము, స్వమ్ - నీదైన, ఓకః - స్వరూపమును, వివృణు - ప్రకాశింప జేయుము.

ఓ భగవానుడా! దేవనాయకుడవగు నీవు మాత్రమే ప్రార్థించదగిన ఈశ్వరుడవు. అట్టి నిన్ను నేను తత్త్వమునుపదేశించుమని శరణు వేడుచున్నాను. నీవు తత్త్వమును ప్రకాశింప జేసే వచనములను ఉపదేశించి, నా హృదయమునందున్న కామనలు అనే ముడులను ఛేదించుము. ఆపైన నీ స్వరూపమును ప్రకాశింప జేయుము.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుక్తవంతం నృపతిం భగవానాదిపూరుషః ।
మత్స్యరూపీ మహాంభోధౌ విహరంస్తత్త్వమబ్రవీత్ ।। 54

ఇతి - అని, ఉక్తవంతమ్ - పలికిన, నృపతిమ్ - సత్యవ్రత మహా రాజును ఉద్దేశించి, ఆదిపూరుషః - జగత్కారణుడు పూర్ణుడు, మత్స్య రూపీ - చేప రూపము గలవాడు అగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, మహా-అంభోధౌ - మహా సముద్రమునందు, విహరన్ - విహరించుచున్న వాడై, తత్త్వమ్ - ఆత్మస్వరూపమును, అబ్రవీత్ - చెప్పెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- సత్యవ్రత మహారాజు ఇట్లు పలుకగా, శ్రీహరి భగవానుడు మహాసముద్రమునందు విహరిస్తూ ఆయ నకు ఆత్మస్వరూపమును ఉపదేశించెను. జగత్కారణుడు, పూర్ణుడు అగు ఆ భగవానుడు చేప రూపమును దాల్చి యుండెను గదా!

పురాణసంహితాం దివ్యాం సాంఖ్యయోగక్రియావతీమ్ ।
సత్యవ్రతస్య రాజర్షేరాత్మగుహ్యామశేషతః ॥ 55

దివ్యామ్ - దివ్యమైనట్టియు, సాంఖ్యయోగక్రియావతీమ్ - ఆత్మ జ్ఞానము భక్తియోగము కర్మలు గల, పురాణసంహితామ్ - మత్స్యపురాణ మనే సంహితను, ఆత్మగుహ్యామ్ - తన స్వరూపమును, రాజర్షేః - రాజర్షి యగు, సత్యవ్రతస్య - సత్యవ్రతునకు, అశేషతః - నిశ్శేషముగా.

ఆయన తనచే ప్రణీతమైన మత్స్యపురాణమనే సంహిత (అనేక విషయముల సంకలనము) ను, తన స్వరూపముయొక్క రహస్యమును కూడ సత్యవ్రత మహారాజునకు నిశ్శేషముగా బోధించెను. ఆ పురాణసం హితయందు ఆత్మజ్ఞానము, భక్తియోగము, కర్మలు కూడ ప్రతిపాదించబడి యున్నవి.

అశ్రౌషీదృషిభిస్సాకమాత్మతత్త్వమసంశయమ్ ।
నావ్యాసీనో భగవతా ప్రోక్తం బ్రహ్మ సనాతనమ్ ॥ 56

ఋషిభిః సాకమ్ - మహర్షులతో బాటుగా, నావి - నౌకయందు, ఆసీనః - కూర్చున్నవాడై, భగవతా - మత్స్యభగవానునిచే, ప్రోక్తమ్ - ప్రవ చించబడిన, సనాతనమ్ - కాలమునకు అతీతమైన, బ్రహ్మ - పరబ్రహ్మను

గురించి, ఆత్మతత్త్వమ్ - ఆత్మ స్వరూపమును గురించి, అసంశయమ్ - సందేహములు లేని విధముగా, అశ్రౌషీత్ - శ్రవణము చేసెను.

మహర్షులతో గూడి నౌకయందు కూర్చున్న ఆ రాజు మత్స్య భగవానునిచే ప్రవచించబడిన కాలాతీతమగు పరబ్రహ్మను గురించి, ఆత్మ స్వరూపమును గురించి శ్రవణము చేసి, సందేహములను తీర్చుకొనెను.

**అతీతప్రలయాపాయ ఉత్థితాయ స వేధసే ।**
**హత్వాఽసురం హయగ్రీవం వేదాన్ ప్రత్యాహరద్ధరిః ।। 57**

సః - ఆ, హరిః - శ్రీహరి, హయగ్రీవం అసురమ్ - హయగ్రీవాసురుని, హత్వా - సంహరించి, వేదాన్ - వేదములను, అతీతప్రలయ-అపాయే - పూర్వమునందలి ప్రళయము పూర్తి కాగానే, ఉత్థితాయ - నిద్ర లేచిన, వేధసే - బ్రహ్మగారి కొరకు, ప్రత్యాజహార - సమర్పించెను.

మత్స్యరూపుడగు ఆ శ్రీహరి హయగ్రీవాసురుని సంహరించి వేదములను తీసుకువచ్చెను. పూర్వమునందలి ప్రళయము పూర్తి కాగానే నిద్ర లేచిన బ్రహ్మగారికి ఆయన ఆ వేదములను సమర్పించెను.

స తు సత్యవ్రతో రాజా జ్ఞానవిజ్ఞానసంయుతః ।
విష్ణోః ప్రసాదాత్కల్పేఽస్మిన్నాసీద్వైవస్వతో మనుః ।। 58

జ్ఞానవిజ్ఞానసంయుతః - జ్ఞానవిజ్ఞానములతో కూడియున్న, సః - ఆ, సత్యవ్రతః రాజా తు - సత్యవ్రత మహారాజైతే, విష్ణోః - విష్ణువుయొక్క, ప్రసాదాత్ - అనుగ్రహము వలన, అస్మిన్ - ఈ, కల్పే - కల్పమునందు, వైవస్వతః - వివస్వానుని పుత్రుడగు, మనుః - మనువు, ఆసీత్ - ఆయెను.

ఆ సత్యవ్రత మహారాజు ఆత్మస్వరూపమును పరోక్షముగా తెలియుటయే గాక, స్వానుభవముగా సాక్షాత్కరించుకొనెను. ఆయన విష్ణువు యొక్క అనుగ్రహము వలన ఈ కల్పమునందు సూర్యుని పుత్రుడగు (వైవస్వత) మనువు ఆయెను.

**సత్యవ్రతస్య రాజర్షేర్మాయామత్స్యస్య శార్‌ఙ్గిణః ।**
**సంవాదం మహదాఖ్యానం శ్రుత్వా ముచ్యేత కిల్బిషాత్ ॥59**

రాజర్షేః - రాజర్షియగు, సత్యవ్రతస్య - సత్యవ్రతునియొక్క, మాయామత్స్యస్య - మాయాశక్తిచే చేప రూపును దాల్చిన, శార్‌ఙ్గిణః - శార్‌ఙ్గము అనే ధనుస్సు గల శ్రీహరియొక్క, సంవాదమ్ - సంవాదరూపమైన, మహత్ - గొప్ప, అఖ్యానమ్ - వృత్తాంతమును, శ్రుత్వా - విని, కిల్బిషాత్ - పాపమునుండి, ముచ్యేత - విముక్తుడగును.

మాయాశక్తిచే చేప రూపును దాల్చిన శార్‌ఙ్గధారియగు శ్రీహరి రాజర్షియగు సత్యవ్రతునకు చేసిన ఉపదేశము (వారిద్దరి సంభాషణము) యొక్క ఈ గొప్ప వృత్తాంతమును విన్న వ్యక్తి పాపమునుండి విముక్తుడగును.

**అవతారో హరేర్యోఽయం కీర్తయేదన్వహం నరః ।**
**సంకల్పాస్తస్య సిధ్యంతి స యాతి పరమాం గతిమ్ ॥ 60**

హరేః - శ్రీహరియొక్క, యః - ఏ, అయమ్ - ఈ, అవతారః - అవతారము గలదో దానిని, నరః - మానవుడు, అను-అహమ్ - ప్రతిదినము, కీర్తయేత్ - కీర్తించవలెను, తస్య - వాని, సంకల్పాః - సంకల్పములు, సిధ్యంతి - సిద్ధించును, సః - అతడు, పరమామ్ - సర్వోత్తమమగు, గతిమ్ - ఫలము (మోక్షము) ను, యాతి - పొందును.

శ్రీహరియొక్క ఈ మత్స్యావతారమును మానవుడు ప్రతి దినము కీర్తించినచో, అట్టివాని సంకల్పములు సిద్ధించుటయే గాక, అతడు సర్వోత్తమమగు ఫలమైన మోక్షమును కూడ పొందును.

**ప్రలయపయసి ధాతుస్సుప్తశక్తేర్ముఖేభ్యః**
**శ్రుతిగణమపనీతం ప్రత్యుపాదత్త హత్వా ।**
**దితిజమకథయద్యో బ్రహ్మ సత్యవ్రతానాం**
**తమహమఖిలహేతుం జిహ్మమీనం నతోఽస్మి ॥ 61**

## ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే మత్స్యావతార వర్ణనం నామ చతుర్వింశోఽధ్యాయః ॥

## ॥ ఇతి అష్టమః స్కంధః సమాప్తః ॥

ప్రలయపయసి - ప్రళయకాలమునందలి నీటియందు, సుప్తశక్తేః - నిద్రించిన శక్తులు గల, ధాతుః - బ్రహ్మగారి, ముఖేభ్యః - ముఖముల నుండి, అపనీతమ్ - బయల్వెడలిన, శ్రుతిగణమ్ - వేదముల సముదాయ మును, యః - ఎవడైతే, దితిజమ్ - రాక్షసుని, హత్వా - సంహరించి, ప్రతి -ఉపాదత్త - తీసుకువచ్చి సమర్పించెనో, సత్యవ్రతానామ్ - సత్యవ్రతునకు మహర్షులకు, బ్రహ్మ - పరబ్రహ్మను, అకథయత్ - ఉపదేశించెనో, అఖిల హేతుమ్ - సర్వజగత్కారణమైనట్టియు, జిహ్మమీనమ్ - మాయచే (లీల కై) చేపయైన, తమ్ - ఆ శ్రీహరిని, అహమ్ - నేను, నతః - నమస్కరించి నవాడను, అస్మి - అగుచున్నాను.

బ్రహ్మగారు తన సృష్టిశక్తిని ఉపసంహరించి ప్రళయకాలమునం దలి నీటిలో నిద్రించుచుండగా, ఆయన ముఖమునుండి బయల్వెడలిన వేదములను రాక్షసుడు (హయగ్రీవుడు) అపహరించెను. అపుడు శ్రీహరి ఆ రాక్షసుని సంహరించి వేదములను తీసుకువచ్చి బ్రహ్మగారికి అప్పజె ప్పెను. సకలజగత్కారణుడగు ఆ శ్రీహరి మాయచే లీల కొరకై చేప రూపు దాల్చి, సత్యవ్రతునకు మహర్షులకు పరబ్రహ్మస్వరూపమును బోధించెను. అట్టి శ్రీహరికి నేను నమస్కరించుచున్నాను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి అష్టమ స్కంధములో
మత్స్యావతారమును వర్ణించే ఇరువది నాల్గవ
అధ్యాయము ముగిసినది (**24**).

## అష్టమ స్కంధము ముగిసినది.

॥ హరిః ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ॥

*****

**T.T.D. Religious Publications Series No.735**

**Price : Rs.**



భారతీయ వాఙ్మయం అంతా ఒక యెత్తు; శ్రీమద్భాగవతం ఒక్కటి ఒక యెత్తు. ఈ ప్రఖ్యాతికి ముఖ్యకారణం - భగవంతుణ్ణి గూర్చి తెలిపే గ్రంథాల్లో భాగవత పురాణం అగ్రగణ్యమై అలరారుతూ వుండటం.

"వేద" మనే కల్పతరువున ఫలించి, శుక యోగీంద్రుని వాక్కులనెడి అమృత రసంతో సమ్మిళితమయి, పుడమికి అవతరించిన పరిపక్వ మధుర ఫలం భాగవతం!

ఇంతటి విశిష్టతగల భాగవత మహాపురాణాన్ని 'తత్త్వప్రకాశిక' - అనే తెలుగు టీకతో ప్రచురించటం తెలుగువారందరికీ మిగుల సంతోషదాయకమైన విషయం. తి తి దేవస్థానంవారి ఈ ప్రచురణ సంస్కృతమూలంలోని పరమార్థాన్ని తెలిసికోవటానికి, అలాగే, పోతన మహాకవి రచనను ఇతోఽధికంగా అవగాహన చేసి కోవటానికి - ఉభయ తారకంగా ఆంధ్రావళికి ఉపయోగపడుతుంది

సార్థకనామధేయమైన ఈ టీకను రచించినవారు పూజ్యశ్రీ తత్త్వవిదానంద సరస్వతీ స్వామివారు బ్రహ్మ విద్యాకుటీర (సికిందరాబాదు) నిలయులు. సంస్కృతాంధ్రాంగ్లాది బహుభాషావేత్తలు వేద, వేదాంతాది ప్రాచీన విద్యల్లోను, రసాయన శాస్త్రాది ఆధునికవైజ్ఞానిక శాస్త్రాల్లోను నిష్ణాతులు

పరిశోధన, బోధన, బహుగ్రంథ రచన, సామాజికాది సమస్యల సదవగాహన - ఇత్యాది రంగాల్లో విశేషానుభవం గడించిన పరిణత ప్రజ్ఞావంతులు శ్రీస్వామివారు. ఆర్ష విద్యాపారంగతులైన వీరు ఉత్తమవక్తగా అనేక జాతీయ, అంతర్జాతీయ వేదికలపై ప్రశస్తిగాంచారు.

విశేషించి, ఉపనిషత్తుల్లో నిక్షిప్తమై ఉన్న ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని ప్రబోధించే ఉదారాశయంతో సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించిన యతివరేణ్యులు వీరు! బ్రహ్మవిద్యానిధులయిన వీరు భాగవతానికి సరళ సుందరశైలిలో ఈ టీక రచించటం బంగారుకు తావి అబ్బినట్లయింది!

**Published by** Sri K.V. RAMANACHARY, I A S , **Executive Officer, Tirumala Tirupati Devasthanams and Printed at T.T.D. Press, Tirupati.**